ఆంధ్రపత్రిక

ఇరువదిమూడవ

# సంవత్సరాది సంచిక

ఆంగీరస సంవత్సరము

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

చల్లా శేషగిరిరావు

ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయబడిన

సాహిత్య చారిత్రిక సాంఘికాదివిషయక

వ్యాసములును, చిత్రములును గలవు.

ఆంధ్రపత్రికా ముద్రాలయమున ముద్రితము

**6-7, తంబుశెట్టి వీథి, జార్జిటౌను, మద్రాసు**

**1932-వ సంవత్సరము, ఏప్రిలునెల 7-వ తేది**

౧౯౩౨—౩౩

ANDHRA PATRIKA

# విషయానుక్రమణిక

పద్యవ్యాసములు

# చిత్రానుక్రమణిక

గారు; పి. సాంబమూర్తిగారు. బి. టి. కృష్ణగారు, ప్రొఫెసర్ పురుషోత్తంగారు, చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, రమణలాల్ బి. షాగారు, డి. యస్. రెడ్డిగారు. పు. ౧౪౪ త.

13. యస్. యస్. రాజపుటానా స్టీమరు, జే. మార్లేగారు, కింగ్ స్లేహాలు, బొ.; అఖిలభారతస్వదేశీప్రదర్శనము, దేశసేవికల కోలాటము, అ. భా. స్వ. ప్ర.— మదరాసు. మదరాసు సంగీతకళాశాలా ప్రారంభోత్సవము, దక్షిణభారత సంగీత పరిషత్తు. పు. ౧౫౨ త.

14. భావన, తంబూర్ వాలా. పు. ౧౬౦ త.

15. వైశ్యసేవాసదన చిత్రములు 3; జస్టిస్. సర్ వేపా ,రామేశంపంతులుగారికి న్యాయవాదులవిందు, మద్రాసు స్మాల్ కాజ్ కోర్టు, నూతన మద్రాసు న్యాయవాది సంఘము. పు. ౧౭౬ త.

16. డా. ముత్తుగారి యారోగ్యాశ్రమము - తాంబ్రము, ఆంధ్ర సారస్వత సమితి, నైజాం కాలేజి- హైదరాబాదు, ప్రొఫెసర్ యశ్వంతసింహగారు, కనకాద్రిరావుగారు, పోలదాసు రామారావుగారు, పి. ఆర్. స్వామినాథ అయ్యరుగారు, దొరస్వామిగారు, పాలుచర్ గారు. పు. ౧౮౪ త.

17. ప్రపంచములో అన్నిటికన్న గొప్పదగు విద్యుజ్జలయానము, ఆర్. శేషశాయిగారి విమానము, పెద్ద జర్మను ఆకాశయానము, గొప్ప బ్రిటిషు ఆకాశయానము, విద్యుద్ఘటికాయంత్రము, హృదయస్పందన శబ్దగ్రాహియంత్రము, రేడియోతలగడ, ఉదర — ఛాయాగ్రాహక యంత్రము, శబ్దమును తేజముగా మార్చు యంత్రము. పు. ౧౯౨ త.

18. క్రికెట్టు ఆటకాండ్రు: జె. జి. నావలెగారు, మార్షలుగారు, పాలయ్యగారు, బి. ఇ. కపాడియాగారు, యస్. ఆర్. గోడాంబెగారు, దలీపసింగుగారు; వింబిల్డన్ టెన్నిసుకోర్టు; ఇలీనరు ఫర్త్ కన్య, ఆంధ్రజింఖానా టెన్నిస్ ఆటకాండ్రు, ఆర్. మైకీ, జిరోసతోగార్లు, సిడ్నీవుడ్డు, టెన్నిస్ ఆటలో. పు. ౨౦౦ త.

19. అఖిల భారత ఒలింపిక్ వ్యాయామక్రీడల యందు పోటీచేసినవారు, అఖిలభారత ముష్టియుద్ధప్రదర్శనములు ౨, ఈతగుమ్మటములు, జలద్విచక్రికలు; టి. బి. బాలగోపాలంగారు, యఫ్. యస్. షీల్డుగారు, మిస్. బెట్టినటు హాలుగారు, కుమారీ హేమలతా శ్రీనివాసరావుగారు, కుమారీ లీలారావుగారు. పు. ౨౦౮ త.

20. బ్రిటిషు మంత్రిమండలి, ఇండియా కేప్టౌను కాన్ఫరెన్సు; సప్తసామ్రాజ్య సమావేశము, అంతర్జాతిసమితి తుది సమావేశము. పు ౨౧౬ త.

21. చైనాజపాను యుద్ధచిత్రములు. పు. ౨౨౪ త.

22, "పు. ౨౪౦ త."

23. పు. ౨౪౮ త.

24. విశ్రాంతిదినములలో కూలిజ్ అధ్యక్షుని కాలక్షేపము; బైబ్రిటిష్ ప్రచారము; స్వాతంత్ర్యదినోత్సవ సందర్భమున వాషింగ్టన్‌లో బాణసంచాలకాల్పు; లండనులో నిరుద్యోగులు పోలీసుస్టేషనుపై దండెత్తుట; కీ. శే. నిడుదవోలు సుందరం పంతులుగారు, కీ. శే. కారంశెట్టి సుబ్బయ్యశ్రేష్ఠిగారు, కీ. శే. కళ్లేపల్లి శివరామయ్యగారు, కీ. శే. నాదావఝ్ఝుల నాగభూషణముగారు. పు. ౧౭౨ త.

25. ఇండియా రెండవ రౌండుటేబిలు మహాసభ చిత్రములు ౨; రెండవ రౌండుటేబిలు మహాసభ ప్రతినిధులు కొందరు. పు. ౨౮౦ త.

26. న్యాపతి రామారావుగారు, షామహమ్మదు సులేమానుగారు, టి. యస్. రామస్వామి అయ్యరుగారు, మూడవ రేడియాలజీ అంతర్జాతీయ మహాసభ, బర్మా కాన్ఫరెన్సు, లండను; అఖిలభారత శాసన సభాధ్యక్ష మహాసభ, అఖిలభారతమహిళా మహాసభ. పు. ౨౮౮ త.

27. జనరల్ స్మట్సుగారు, లండనున నిరుద్యోగులు పోలీసు రాణాపై దండెత్తుట; లండను ఇండియా కార్యాలయమున భారతీయ చిత్రకారుల భిత్తిచిత్రరచన. పు ౩౦౪ త.

28. కొచ్చి ఓడరేవు మహాసభ, సూర్యనమస్కారములు; ప్రొఫెట్ జన్మదినోత్సవము, ఉత్తరాది మఠస్వామి సత్యధ్యాన తీర్థులవారు. పు. ౩౧౨ త.

# చిత్రములవివరణము

### అనంతలక్ష్మీనారాయణరావుగారు, సిద్ధవరము

వీరు అనంతపురముజిల్లా గుత్తినగరమున సుప్రసిద్ధన్యాయవాదులై వెలసిన సిద్ధవరం భుజంగరావుగారి పౌత్రులు వయసు ఇరువదిమూడు వత్సరములు వీరు ౧౯౩౧-వ సంవత్సరమున చెన్నపురివిశ్వవిద్యాలయము న్యాయవాదపరీక్ష (బి యల్) యందు చెన్నరాజధాని ప్రథమస్థానమున విజయమును గాంచిరి ఏతత్ఫలముగా వీరు రేకాల లక్ష్మీనరసారెడ్డిగారి బంగారుపదకము, సర్ విలియమ్ ఏలింగ్ స్మారక బహుమానగ్రంథసంచయమును పారితోషికముగ బడసిరి హిందూ న్యాయశాస్త్రమున నుత్తములుగ తేరినందున సర్ వి భాష్యం అయ్యంగారి బంగారుపదకమును బడసిరి మఱియును సర్ ముత్తుస్వామిఅయ్యరు స్మారకవిద్యార్థివేతనమును పొంది ప్రకృతము యం.యల్ పరీక్షకు జదువుచున్నారు ఈయువకుని అఖండవిజయము దత్తమండలములవారితోపాటాంధ్రుల కెల్లరకును అభినందనార్హము

### అప్పలరాయడుగారు, చిట్రా, కీ. శే.

వీరు విశాఖపట్టణమండలమువారు, పురగిరిక్షత్రియులలో పేరుగన్నవారు, శ్రీమంతులు; పరోపకారపరాయణులు వీరు ౧౯౩౧ సం అక్టోబరు ౨౫-వ తేదినాడు కీర్తిశేషులయినారు వీరిది గొప్పకుటుంబము వీరి కుమారులలో పెద్దవారు ఆంగ్లవైద్యవిద్యను బడసి చెన్నపురసార్వజనికవైద్యాలయమున వైద్యులుగా నున్నారు. ఇంకొకరు సుప్రసిద్ధచిత్రకారులు వీరి నామధేయము వి ఆర్ చిత్ర వీరు చెన్నపురికళాశాలయం దుపాధ్యాయులుగా నున్నారు వీరి చిత్రములు పెక్కు భారతి మొదలయిన పత్రికలందు ప్రకటితము లగుచుండును

### అప్పారావుగారు, వడ్లమాని

వీరు విజయనగరనివాసులు; యువకవులలోవారు, ఈసంచికయందలి 'నారాయణమూర్తికి' అను పద్యవ్యాసమును రచియించినారు వీరి వ్యాసములు భారతిమొదలగు పత్రికలయందు ప్రకటితమగుచుండును

### అభయమ్మాళ్ గారు, యు.

మైసూరుమహారాణీ స్త్రీకళాశాలయందు ఆంత్రశాస్త్రోపాధ్యాయ Ph D డిగ్రీను లండనున బడసినది

### ఆంధ్రసారస్వతసమితి, నైజాంకాలేజీ, హైదరాబాదు

దీనికి శ్రీ ప్రొఫెసర్ విద్వాన్ సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు అధ్యక్షుడు, శ్రీ ప్రతివాది భయంకరం రంగాచార్యులుగారు ఉపాధ్యక్షుడు; శ్రీ కేసపాటి రామదీక్షితులుగారు కార్యదర్శి కాలేజీ ఆంధ్రవిద్యార్థుల భాషాభివృద్ధి కుపకరించు కార్యములను ఈ సమితి కావించుచుండును

### కనకాచలంగారు, ఇవటూరి, కీ. శే.

గంజాముమండలమునందలి పర్లాకిమిడినగరమునగల హైస్కూలున ప్రధానోపాధ్యాయులుగా నుండిరి చరిత్రపరిశోధనమున ఖ్యాతి పడసినవారు

### కనకాద్రిరావుగారు

ముష్టియుద్ధమున ప్రవీణులు

### కన్నయ్యగారు, సి., కీ. శే.

లక్షలకొలది వ్యయపెట్టి నాటకమండలిని నెలకొలిపి, దశావతారము, ఆండాళుకల్యాణము, భగవద్గీత మున్నగు నాటకములను ప్రదర్శించి, స్వరాష్ట్ర, పరరాష్ట్రముల ప్రజలకు నేత్రానందమును గలిగించుచు ప్రఖ్యాతిని గాంచిరి వీరు ఆంధ్రులు

### కాశీపతిగారు, పోకూరి (కవిసింహ)

వీరిది గుంటూరుమండలమునందలి పల్నాడుతాలూకా బోదిలవీడుగ్రామము; విశ్వబ్రాహ్మణకులము, గద్వాల్ సంస్థానాస్థానకవీశ్వరులు వీరు నిరోష్ఠ్యనిర్వచన శుద్ధాంధ్రహరిశ్చంద్రోపాఖ్యానము, సారంగధరీయ మనుత్ర్యర్థికావ్యము మొదలయినగ్రంథములను పెక్కింటిని రచియించినారు వీరిని పెక్కుసంస్థానములు సువర్ణపదకముల నొసంగి బహూకరించినవి గద్వాల్ సంస్థానాధీశ్వరులు వీరికి 'కవిసింహ' బిరుదము నొసగిరి

### కృష్ణనుగారు, బి. టి., కెప్టను

వీరు మదరాసువైద్యకళాశాలలో శారీరకశాస్త్రోపాధ్యాయులుగా నున్నారు శారీరకమున స్వయముగా పరిశోధన కావించినారు తత్ఫలముగా వీరు M Sc పట్టమును పొందినారు

### కృష్ణప్పగారు, బిడారం, కీ. శే.

సుప్రసిద్ధ గాయకశిరోమణి మైసూరు సంస్థానాస్థానసంగీతవిద్వాంసులు

### కృష్ణమాచార్యులుగారు, వంగీపురం (విద్వాన్)

చిత్తూరుజిల్లాయందలి నారాయణవనము వీరి స్వగ్రామము ఆంధ్రమున పాండిత్యము, కవితాశక్తి గల వీరికి నాట్యకళాప్రవేశ

మును గలదు వీరు 'ఆంజనేయపాత్ర' ధారణమున చాలినవారను టకు వీరికి గల 'ప్రసన్నమారుతి' బిరుదము తార్కాణము

### కృష్ణరావుగారు, యు., డాక్టరు

వీరు శ్రీ డాక్టరు యు. రామారావుగారి కుమారులు. యువకులు. చెన్నపురి పురపాలకసంఘసభ్యులుగా ఎన్నుకొనబడిరి.

### గోపాలకృష్ణయ్యగారు, పి. లెఫ్టనెంటు

B A, F R. E S (London).

విశ్వవిద్యాలయము సైనికదళమున ఉద్యోగమున నున్నవారు ఇండియన్ టెరిటోరియల్ సైన్యమునందు కింగ్సుకమిషన్ గౌరవమును పొందిన ప్రథమాంధ్రులు

### గోవిందస్వామిపిల్లెగారు, కీ. శే.

వీరు ద్రావిడదేశమువారు. వాయులీన (Violin) వాద్యమున నద్వితీయులు

### చెంగారెడ్డిగారు, బండి బి. ఏ.

వీరిది నెల్లూరు ప్రకృతము చిత్తూరులో ప్రాసిక్యూటింగ్ ఇన్‌స్పెక్టరుగ నున్నారు వీరు షేక్స్పియరు మహాకవినాటకముల యందలి పాత్రములను చాతుర్యముతో ప్రదర్శింపగలవారు వీరి గాత్రము అద్భుతముగ మారుచుండును ఇటీవల వీరియద్భుతప్రదర్శనములు చెన్నపురిలోను రాజమండ్రిలోను జరిగినవి వీరు తమ ప్రజ్ఞావిశేషములను వెల్లడించుటకు ఇంగ్లండునకు వెళ్లిరాచియున్నారు

### దొరస్వామిగారు

ప్రపంచఖ్యాతిగల గాయకుడు

### ధర్మారావుగారు, కొల్లూరు, బి.ఏ.

వీరు విజయనగరమువారు అభినవాంధ్రకవులలో చేరినవారు. వీరి రచనము సరసముగను, హృదయంగమముగను ఉండును. వీరి వ్యాసములు భారతియందు తరుచు ప్రకటితము లగుచుండును

### నరసింహరాజుగారు, సి. వి. యస్.

చెన్నపురి శాసనసభకు అధ్యక్షులుగ నుండిన వీరు ఇపుడు ఇంపెరియల్ బ్యాంకునకు గవర్నరుగా నున్నారు

### నాగభూషణముగారు,నాథావఝ్ఝుల, బి ఏ.,యల్.టి.,కీ. శే.

వీరు బందరులో పెద్దశ్రోత్రియకుటుంబమునకు జెందిన బ్రాహ్మణులు. క్లార్కు దొర నోబిల్ కాలేజి ప్రిన్సిపాలుగ నున్నపుడు ౧౯౨౫ సం. లో వీరు క్రైస్తవమతము స్వీకరించి డిప్యూటీకలెక్టరు చేలెంద్ర వెంకటాచలముపంతులుగారి ద్వితీయపుత్రికను వివాహమైరి. బర్మాలో పెద్ద కలపకంపెనీలో మేనేజరుగా చాలకాలము పనిచేసి నాలుగువందల రూపాయలవరకు వేతనము తీసుకొనిరి చివర రోజులలో స్వదేశమునకు వచ్చి కృష్ణాజిల్లా గన్నవరము బోర్డుహైస్కూలులో హిస్టరీఅసిస్టెంటుగ నుండి ౧౯౩౦ సం ఏప్రిలు ౨౩-వ తేదిని స్వర్గస్థులైరి.

### పాలుచరుగారు

జర్మను చిత్రకారులు, నటకులును ప్రకృత మిండియాలో సంచరించుచున్నారు

### పురుషోత్తంగారు, ప్రొఫెసరు

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారొసగిన సానగల్ పండితవేతనమును బడసి, పాశ్చాత్యదేశములకు బోయి మనస్తత్వశాస్త్రమున ప్రత్యేకము కృషిచేసినవారు.

### బ్రిటిషుమంత్రిమండలి

౧ రామ్సేమేక్డనాల్డు—ప్రధానమంత్రి
౨. స్నోడను ప్రభువు—ముద్రాధికారి. (లార్డు ప్రివీసీల్)
౩. సర్ హెర్బర్టు సామ్యూల్సు—స్వదేశమంత్రి.
౪. బాల్డ్విను గారు—కౌన్సిలుఅధ్యక్షుడు.
౫ సర్ ఫిలిప్ కన్లిఫ్ లిస్టరు—కాలనీలమంత్రి.
౬. సాంకీప్రభువు—లార్డు చాన్సలరు.
౭. సామ్యూల్ హోరు—ఇండియామంత్రి.
౮. నెవిలి చేంబర్లేను—కోశాగారమంత్రి.
౯. జే. హెచ్. తామస్—అధినివేశనములమంత్రి.

### ముత్తుదంపతులు, సి. డా.

డాక్టరు ముత్తుగారు క్షయరోగచికిత్సయందు మిక్కిలి నిపుణులు. తాంబ్రము అను గ్రామమున క్షయరోగచికిత్సాలయమును నెలకొలిపినారు

### యశ్వంతసింహగారు, ప్రొఫెసరు

వీరు గుంటూరుమండలమున గుంటూరుతాలూకాకు జేరిన కాజ గ్రామమువారు. వీరి అసలుపేరు తల్లావఝ్ఝుల శ్రీరామమూర్తిగారు. వీరు బరోడాయందు వ్యాయామశాస్త్రము నభ్యసించి ప్రవీణులైరి తొలుత కొంతకాలము ప్రభుత్వ-అశ్వికదళమున సైనికుడుగ నుండిరి. తరువాత స్వదేశమునకు మరలివచ్చి గుంటూరు, బెజవాడనగరముల హనుమన్ వ్యాయామకళాశాలలను స్థాపించిరి వానియందు పెక్కురు

యువతియువకులు శరీరవ్యాయామము నభ్యసించిరి. ప్రథమద్వితీయ ఆంధ్రవ్యాయామమహాసభలను వీరు సమహార్చినారు. ఇపుడాంధ్రవ్యాయామ మహాసభ స్థాయిసంఘమునకు వీరు కార్యదర్శిగ నున్నారు.

## రంగాచార్యులుగారు, ప్రతివాది భయంకరం, కీ. శే.

వీరు గుంటూరుమండలమువారు ఆంధ్రాంగ్లములయందు మంచి ప్రవేశము గలవారు ఉపజ్ఞగలవారు భారతి మొదలగు పత్రికలయందు వీరివ్యాసములు ప్రకటితములు. చిన్నవయస్సుననే మృత్యుదేవతకటాక్షము వీరిపై ప్రసరించినది.

## రమణలాల్, బి. షాగారు,

B Com., G. D. A, A. S. A. A. (London)

వీరు బొంబాయిరాష్ట్రమునందలి బ్రోచిమండలమునకు చెందినవారు గుజరాతివారు క్రొత్తగా నెలకొన్న చెన్నపురవాణిజ్యకళాశాలా ప్రతిష్ఠాపకులలో నొక్కరు, తత్కళాశాలాధ్యక్షులలో నొక్కరును

## రామరావుగారు, న్యాపతి. న్యాయవాది, హైకోర్టు, చెన్నపురి

వీరు ఆంధ్రన్యాయశాస్త్రసంఘమునకు కార్యదర్శులు-మైలాపూరు హిందూ పర్మనెంటుఫండు, శిమిటెడునకు పెక్కేండ్లు డైరక్టరుగను, న్యాయవాదిగను, కొంతకాలము అధ్యక్షులు గాను ఉండిరి చెన్నపురము యునైటెడు ఇండియా లైఫ్ అష్యూరెన్సు కంపెనీకిని డైరెక్టరుగ నుండిరి. మఱియు ప్రజోపయోగకరములగు పెక్కు ఇతరసంస్థలయొక్క నిర్వహణమున వీరికి సంబంధము కలదు.

## రామరావుగారు, పోలదాసు

గుంటూరులో నొకవిద్యార్థి దసరా పోటీకు స్త్రీలలో రెండు వత్సరములు వరుసగా గెలుపొంది వెండిగదను బహుమతిగా పొందినవారు

## రామానుజాచార్యులుగారు, పండిత, సుదర్శనం

వీరిది కాకినాడతాలూకా కొంగోడుగ్రామము. భూతప్రేత పిశాచములను పారదోలుటయందు పేరుగన్నవారు. ఆంజనేయోపాసకులు.

## శ్రీయుత టి. వి. రెడ్డిగారు, కంట్రాక్టరు, రాజమండ్రి.

వీరు ఆంధ్రదేశమునందు గౌరవనీయమైన రెడ్డికులమునకు చేరినవారు. స్వయంకృషిచేతను, శక్తిసామర్థ్యముచే గొప్పస్థితికి వచ్చినట్టివారు. ఆంధ్రభాషాభిమానులు. శాంతస్వభావముగలవారు. ఉదారవంతులు, మంచిదాత

## రేడియో తలగడ

రేడియోయంత్ర మిం దమర్చబడియుండును. రోగుల ఉపయోగార్థము ఇది తయారుచేయబడెను గీనిని తలక్రింద నుంచుకొని పరున్నరోగికి ప్రక్కమంచముపై పరున్నరోగికేని వినబడుదునంత మెల్లగా, ఇంపుగా పాట వినబడును

## వరాహ నరసింహాచార్యులుగారు, వింజమూరి

వీరిది కాకినాడ సంగీతశాస్త్రమున మంచి పరిశోధనమును చేసినవారు ఇందు కీసంచికయందు గల వ్యాసమే నిదర్శనము. అఖిల భారతగాయకమహాసభవారు వీరి పరిశోధనమును మెచ్చి ప్రథమబహుమతి సువర్ణపదకము నొసగిరి చెన్నపురసంగీతపరిషత్తు సలహాసంఘమున వీ రొకసభ్యులు. సంగీతశాస్త్రమునుగురించిన వీరి వ్యాసములనేకము భారతియందును, సంగీతపరిషత్పత్రికయందును వెనుకటి ఉగాదిసంచికలయందును, ప్రకటితములైనవి. 'శ్రుతులు-స్వరావళి' అనుగ్రంథమును ప్రకటించిరి 'తాళలక్షణము' అనుగ్రంథము నొకదానిని రచియించి యున్నారట

## విద్యుద్ఘటికాయంత్రము

చెన్నపురరాజధానీకళాశాలలో భౌతికశాస్త్రాచార్యులు డాక్టరు పరమేశ్వరను (యం. ఏ) గారు దీనిని నిర్మించిరి ఉద్యోగమును వీడనున్న కళాశాలాధ్యక్షులు ఫైసనుగారి గౌరవార్థము దీనికి 'ఫైసనుగడియారం' మని పేరుపెట్టబడెను. కళాశాలోపరిభాగమున నిది అమర్చబడినది. దీనిముఖితల మారడుగులు.

## వెం. శ్రేష్ఠి, ఊ.

బాపట్లతాలూకాలోని వేటపాలెమున సారస్వతనికేతనమును స్థాపించి తదధ్యక్షులుగా నున్నవారు. వీరు వైశ్యులు, భూస్వాములు, గ్రంథాలయోద్యమమున అభిమానము గలవారు. సారస్వతనికేతనమునకు 'సుబ్రాయమహల్' అనుపేరి భవనము నొసగిరి. మూలనిధికిరు ౩,౧౧౬ ఇచ్చినారు మఱియు గ్రంథములు, రెండువేలు రూపాయలు విలువగలవానిని, గ్రంథాలయమున కొసగిరి. పఠనాలయము నొకదానిని స్థాపించిరి. వీని పోషణమునకయి అధికముగ ధనము వ్యయించి చాలా పాటుపడుచున్నారు వేటపాలెము యూనియన్ బోర్డుప్రెసిడెంటుగ నున్నారు. ఆప్రాంతముల సంఘ, భాషాసేవ యందు ప్రఖ్యాతిగన్నవారు వీ రాంధ్రలోకమునకు చిరపరిచితులు

## వెంకటసుబ్బారావునాయడుగారు, కోకా

వీరి జననము ౧౮౭౬ సం ఏప్రిల్ ౨౮-వ తేది. వీరు చిరకాలమునుండి పిఠాపురము సంస్థానమున పెక్కుద్యోగములను చేసి

మీ యింటియందు
నేలను
రాతితో పరచుటకు

# రావల్సు
# సీమెంటు రాళ్లనే
# ఉపయోగింపుడు



అందరి కనుకూలముగ
నుండులాగున
అనేకతరహాలు గలవు.

ఈదిగువ విలాసమునకు వ్రాయుడు:—

## రావల్ & కో.,

సిమెంటు రాళ్లను
తయారుచేయువారు

8, సెకెండులైనుబీచ్, మద్రాసు.

## మూలవ్యాధి

రక్తము స్రవించుట, దీర్ఘవ్యాధిగానున్నను, నవీనమైనను, ఎట్టి స్థితిలో నున్నను లేక భరింపరానిదైనను, ఏ రకమైనను, మా ఔషధము నొక్కసారి వాడినంతనే కుదురగలదు. శస్త్రచికిత్సయొక్క అవసరము లేకయే, యెంత తెగిన రక్తము స్రవించుట, మంట, పోటు మున్నగునవి వెంటనే ఆగిపోవును. 3 రోజులలో గుణమునకు పూచీగలదు కుదరని యెడల సొమ్ము వాపసు చేయబడును. వెల రు. 2.

## చెవుడు

మా "బధిరుద్ధరణ తైలము" చెవి వ్యాధులకన్నిటికిని అద్భుతమైన గుణము నిచ్చును ఈ ఔషధమువలన పెక్కువేలమంది చెవిటివారికి చెవుడు పోయినది మా తెల్పినటుల ఈ ఔషధము గుణ మీయని వారికి సొమ్ము వాపసు చేయబడును. వెల రు. 2.

ఉత్తరములు ఇంగ్లీషున వ్రాయవలెను

**Sakti Sudha Karyalaya,**
Kumbharwada 4th Lane, BOMBAY, No 4

## మోడరన్ పెయిన్ బామ్




అన్నివిధములగు నొప్పులకు అమోఘమైనది. ఇదిరాసిన మరుక్షణమే గుణము కలిగి సుఖాసనగా నుండగలదు. తలనొప్పులు, పార్శ్వపునొప్పులు, నరములనొప్పులు, కీళ్లనొప్పులు మొదలగు బాధల నన్నిటిని పైనరాచిన గ్రాముమునే వాడదగును

సీసా రు 0 5-0
డజన్ సీసాలు రు. 3-0-0

## తామరతైలము




ఇది అనేకమందులుచేర్చి బహు శ్రేష్ఠముగా తయారు చేయబడినది బజారులోదొరుకుమందులవంటిదికాదు అన్నివిధముల చర్మరోగములను పోగొట్టును తామర, తీట, గజ్జి, రామబాణము ఎట్టి విధములగు తామరలైనను 3-4 రాత్రులలో నిర్మూలము చేయును డబ్బీ 1-కి రు 0-5-0
వి. పి. చార్జి ప్రత్యేకము. డజను డబ్బీలు రు 3-6-0

పి. సి. ఏ. అండు కో
ఆయుర్వేదసమాజం. పెరిదేపి, నెల్లూరు జిల్లా

## "కఠిన ప్రశ్న"

శ్రీమతి కె. లక్ష్మిగారు

(సాధ్వీసమితి)

అచ్ సంధిగల ఏకపదము గలదు. సంధి విడదీసినచో మొదటిపదము మూడక్షరములు గలదియు, రెండవది నాల్గుఅక్షరములు గలదియు నగును.

౧. మొదటిపదము జలపర్యాయనామ మగును

౨. రెండవపదము తరుచుగా స్త్రీజన ముపయోగించు మాంగళ్యవస్తు విశేషమునకు చెందును.

౩. మొదటిపదములోని ౧. వ అక్షరము రెండవపదములోని ౨. వ అక్షరము కలిసిన మేక యను అర్థము నిచ్చుపదమగును.

౪. మొదటిపదములోని ౨. ౩. అక్షరములు రెండవపదములోని ౪. వ అక్షరమును కూర్చిన మరణమునకు అర్థమిచ్చును.

౫. రెండవపదములోని ౨. ౩. ౪. అక్షరముల కలిసినచో అయ్యాద ప్రజలకు చెందును.

౬. రెండవపదములోని ౩. వ అక్షరము సప్తమీవిభక్తి ప్రత్యయమగును.

౭. రెండవపదములోని ౧. వ అక్షరము మొదటిపదములోని ౩. వ అక్షరమును చేర్చిన సమస్తము అని అర్థమిచ్చును.

౮. రెండవపదములోని ౩. వ అక్షరము, మొదటిపదములోని ౩. వ అక్షరము, తిరిగి రెండవపదములోని అంత్యఅక్షరముల సమకూర్చినచో గ్రంథసాగరముయొక్క పర్యాయపదములలో నొకటి యగును

౯. రెండవపదములోని ౪. వ అక్షరము ప్రథమావిభక్తి ప్రత్యయమగును.

౧౦. మొదటిపదమునకు, రెండవపదమునకు సంధిచేసినచో జగత్ప్రఖ్యాతిగాంచిన [illegible] నామ మగును.

ఇట్టి సంధియుతపదమేది ?

పాఠకులు ప్రత్యుత్తరమును ప్రకటింతురుగాక.

౧౯౧౯ సంవత్సరమున దివానుపదము నధిష్ఠించి యిప్పుడు నాపదము నసే యున్నారు వీరి కృషిచేత సంస్థానమున ఆదాయము చాల పెరిగెను. వీరు సంఘసంస్కర్తలు.

## వైశ్యసేవాసదనము—రాజమహేంద్రవరము

ఆంధ్రయువతిసంస్కృతకళాశాల.

౧ ఉపాధ్యాయులు—విద్యార్థినులు.

౨. సంగీతము—తరగతి.

ఈచిత్రమున మధ్యనున్నవారు శ్రీమతి నాళము రామలక్ష్మమ్మ గారు. ఈమె పదేండ్లనుండి సేవాసదనమునందలి బాలికలకు ఉచితముగ వీణ నేర్పుచున్నది

## శంకరశాస్త్రిగారు, భిషగ్వర, వేటూరి, ఎ. ఎం. ఎ. సి.

వీరు, అరువదిసంవత్సరములు ఆయుర్వేదమునందు అనుభవమును సంపాదించి, ఘనవైద్యులని పేరు పొంది, కీర్తిశేషులైన వేటూరి సుందరశాస్త్రిగారి పుత్రులు ప్రసిద్ధిపొందిన ఆయుర్వేదకళాశాలా స్నాతకులు. ఏతత్ కళాశాలా పక్షమున నడుపబడుచుండిన శ్రీధన్వంతరిపత్రికకు చిరకాలము సంపాదకులుగా నుండిరి. ప్రస్తుతము శ్రీశ్రీ ముక్త్యాలరాజాగారిచే స్థాపింపబడిన ఆర్షరసాయనశాలకు నిర్వాహకులుగాను, ప్రధాన చికిత్సకులుగాను ఉండి, ఏతత్ సంస్థా ప్రఖ్యాతికి కారకులగుచున్నారు. ఆంధ్రవైద్యమండలి పక్షమున ప్రకటింపబడు ఆంధ్రవైద్య సమ్మేళనపత్రికకు సంపాదకులుగా నున్నారు. ఆర్షరసాయనశాలనుండి తయారయి వచ్చెడు ఆయుర్వేదౌషధములన్నియు శాస్త్రీయమై, నిర్దుష్టమై ఆంధ్రదేశమునం దెల్లెడల విరివిగా వాడబడుచున్నవి. రాజపోషణమున నడుపబడుచున్న దేశీయవైద్యసంస్థ ఆంధ్రదేశమున ఇది ఒక్కటియే

## శబ్దమును తేజస్సుగా మార్చుయంత్రము

న్యూయార్కునివాసి జాక్ బెల్లామి షేలరు అనునాతడు ఈ యంత్రమును నిర్మించినాడు షేలరుమిత్రులు మూడువేలఅడుగుల దూరమున సముద్రముపైనున్న ఓడలోనివారితో మాటాడగలిగిరి. ఇందు శబ్దము తేజస్సుగా మారి మెఱుపువలె గమ్యస్థానమును జేరును.

## శివరామయ్యగారు, కల్లేపల్లి, కీ. శే.

వీరు ౨౨-౬-౧౮౫౮ నాడు జన్మించిరి. వీరిది బ్రహ్మపురము (Berhampore) వీరు కరణకమ్మశాఖవారు. సంస్కృతాంధ్రాంగ్లములయందు పాండిత్యము గలవారు ఆంధ్రమున పెక్కుగ్రంథములను రచియించినారు అవి యించుమించుగా నన్నియు నముద్రితములు. వీరు స్త్రీవిద్యాభిమానులు. తమ సతీమణిచేత స్త్రీసంఘాభ్యుదయమునకయి 'ఆంధ్రలక్ష్మి' అను పత్రికను నడపించినారు. పెక్కురు బాలికలకు విద్యను జెప్పించినారు. ప్రభుత్వోద్యోగమున చిరకాలముండి ఉపకారవేతనమును బడసి, పదపడి ఒకటిరెండు విద్యాలయములయందు ఆంధ్రపండితులుగా నుండిరి. పరోపకారపరాయణులు. ౧-౯-౧౯౩౧ నాడు వీరు యశశ్శరీరు లయిరి.

## శ్రీనివాసయ్యంగారు, పి. టి., కీ. శే.

వీరు సుప్రసిద్ధులు. వీరు చివరనాళ్లలో అణ్ణామలైవిశ్వవిద్యాలయమున చరిత్రాచార్యులుగా నుండిరి. సునిశితమేధాపురస్కృతములగు వీరి చరిత్రపరిశోధనములు ప్రపంచవిఖ్యాతము లయినవి. చరిత్రకు అమూల్యసంపదను సమకూర్చినవి.

## సప్తసామ్రాజ్యసమావేశము

ఇది ముఖ్యమయిన అంతర్జాతీయసమితి. జర్మనీ అప్పుసొప్పులను చక్కపరచుటకును, యూరపుఖండమున ఆర్థికస్థితికి స్థైర్యము కలిగించుటకును సమావేశమయినది. ఏడుసామ్రాజ్యముల ప్రతినిధులు ఇందు గలరు.

## సుందరముపంతులుగారు, నిడుదవోలు, కీ. శే.

జననము ౫-౫-౧౮౬౪. నిర్యాణము ౭-౧౨-౧౯౩౧.

సుప్రసిద్ధాంధ్రభాషాపండితులును, గవులును నాంధ్రగ్రంథాలయోద్యమపితామహులును నగు పండిత నిడుదవోలు సుందరముపంతులవారు ప్రాచీనాంధ్రవిద్వల్లోకమునకు జిరపరిచితులు. వీరు క్రీ. శ. ౧౮౮౪ సంవత్సరమునుండియు గ్రంథసంపాదనకు బ్రారంభించి ప్రథమాంధ్రపుస్తకభాండారమును స్థాపించినారు. ఒకప్పుడు వీరి గ్రంథాలయమున పదునైదువందల తాళదళసంపుటములును, నైదాఱువేల ముద్రితాముద్రితగ్రంథములు నుండెను. విజయనగరవాస్తవ్యులగు వీరు ముప్పదేండ్లకు పైగ స్థానికసంఘోద్యోగియై యున్నను సనాతనాధునాతనాంధ్రభాషావాఙ్మయము నంతయుఁ బరిశోధించిన విద్వాంసులు. తొల్లి యాంధ్రదేశమునఁ బ్రఖ్యాతిగన్న యాంధ్రభాషాసంజీవని, అముద్రితగ్రంథచింతామణి, చింతామణి, మంజువాణి, సరస్వతి లోనగు ప్రసిద్ధపత్రికలయందు బ్రకటింపబడిన ప్రాచీనకవికృతగ్రంథములు వీ రొసంగినవియే. శ్రీమదానందముద్రాశాలవారు తొలుత పండితజనమనోహరముగ ముద్రించిన భారత, భాస్కర రామాయణాదిగ్రంథముల మాతృకలు వీ రొసంగినవియే. ప్రాచ్యలిఖితపుస్తకభాండారమునకు నూటయిరువదినాలుగు గ్రంథములను వీ రొసంగినారు.అందు విష్ణుపురాణము, తారకబ్రహ్మరాజీయము మొద

లగు ప్రాచీనాంధ్రప్రబంధములును, తాళాధ్యాయము మున్నగు నపూర్వశాస్త్రీయగ్రంథములును గలవు. ఇప్పటికిని వీరి గ్రంథభాండారమున ప్రథమముద్రణపు ప్రతులు, అపూర్వగ్రంథము లెన్నియో గలవు; ప్రాచీనాంధ్రవార్తాపత్రికలుగూడ గలవు. సింహాచలవిహారశతకము, హరహరశంభోశివశతకము, శివశతకము, గజాననసహస్రము, సర్వేశ్వరసహస్రము, విశ్వనాథప్రభూసహస్రము, ఆంధ్రశివపంచస్తవము, ఆంధ్రశివానందలహరి, శివభక్తవిజయము, శివకవికంఠాభరణము మొదలగు గ్రంథముల ననేకముల రచించినవారు వీనిలో సత్యవ్రతిశతక మొకటిమాత్రము ముద్రితము.

## సుబ్బయ్యశ్రేష్ఠిగారు, కారంశెట్టి, కీ. శే.

వీరు గుంటూరునివాసులు వైశ్యులు. గుంటూరుపురమున కన్యకాపరమేశ్వరీ ధర్మసత్రమును స్థాపించి, దానికి పాలకులయి యుండిరి

## సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, చావలి

B.A., (Hons) A S A. A. (London)

వీరు గుంటూరుమండలమువారు. ఆంధ్రులు బాలగంగాధర తిలకు, గోఖలే, మోతిలాలు, దాసు మున్నగు భారతీయప్రముఖుల చిత్రములను తయారుచేసిన శ్రీ చావలి నాగేశ్వరరావుగారికి సోదరులు' క్రొత్తగా చెన్నపురమున వాణిజ్యకళాశాలను స్థాపించినవారిలో నొక్కరు. ఆకళాశాల ప్రధానాచార్యులలో (Principal) నొక్కరును.

## సూరన్నగారు, అల్లంసెట్టి

విశాఖపట్టణముజిల్లాలో పొందూరుగ్రామమున పట్టుశాలీకులమువారు వీరు భాషాభిమానులు వీరి వయసు అరువదియేండ్లు సన్ననిబట్టలనేతను అభివృద్ధికి దెచ్చినవారు. వీరివలననే పొందూరు నేతపరిశ్రమ విశాఖపట్టణము, గంజాముజిల్లాలయందే కాక ఆంధ్రదేశమందంతటను ప్రఖ్యాతి గాంచినది కాకినాడ, కాన్పూరు, చెన్నపురి మహాసభలలో వీరి వస్త్రనిర్మాణప్రదర్శనము దేశీయులు కాంచియున్నారు

## స్వామినాథఅయ్యరుగారు, పి. ఆర్. (గాయకశిరోమణి)

దక్షిణభారతసంగీతమహాసభాధ్యక్షులు (౧౯౩౧)

## హిందీప్రేమీమండలి, రాజమహేంద్రవరము

ప్రాథమికశాఖ, ఫిబ్రవరి, ౧౯౩౨ హిందీప్రచారక్ శ్రీయుత సాగి సత్యనారాయణగారు, విశారద, రెండవవరుసలో మూడవవారు

## హిందూ నాట్యసమాజము (ఛత్రపురము)

గంజాముమండలమున నిపుడు నిలిచియున్న నాటకసభ ఇది. ఇందు తొలివరుసలో నడుమ నున్నవారు శ్రీ శ్రీనివాసమొదలియారుగారు ఈసభకు అధ్యక్షులు వారి కెడమవైపున నున్న శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావుగారు కార్యదర్శి

## హృదయస్పందశబ్దగ్రాహకయంత్రము

బెర్లినునగరమున డా॥ ట్రెండెలెన్బర్గు, డా॥ సెట్గార్లు ఈయంత్రమును నిర్మించిరి. హృదయస్పందమున శబ్దమును శబ్దగ్రాహక యంత్రముద్వారా పలువురు వినవగును వివిధవ్యాధులలోని వివిధ హృదయగతులను లెస్సగా తెలియవచ్చును ఈచిత్రమున రోగిని పరీక్షించుచున్నారు.

# ప్రకటనల వివరణము

"మాంత్రిక చక్రవర్తి" (పు. 48)
అంజర్ ఎమ్. ఇ. ప్రొఫెసర్ (ఇ అక్కల్టిస్ట్, బెజవాడ)

దివ్యదృష్టివలన భవిష్యత్ఫలితముల నెఱుంగుట, భూతప్రేత పిశాచబ్రహ్మరాక్షస, శాకినీఢాకిన్యాది దుష్టగ్రహ బాధలను, మహా మంత్ర యంత్రములచే బోగొట్టుగురను ప్రసిద్ధి

### అజీర్ణ పాశుపత డిపో,
రాజమహేంద్రవరము(పు 57)

డాక్టర్ మద్దూరి నాగభూషణరావు గారిచే ౧౮౭౩ సంవత్సరమున స్థాపింపబడినది తిరువాన్కూరు సంస్థాన వైద్యులగు మద్దూరి లక్ష్మీనారాయణగారి మనుమలు ౧౦ సంవత్సరములనుండి దేశమంతటను యీ ఔషధమును విరివిగ వ్యాపింపచేసియున్నారు, అనేక యోగ్యతాపత్రములను బడసియున్నారు. వీరు నాడీ శాస్త్ర మందు నేర్పరులు.

### అడికప్పచెట్టి ఏ. వి. ఆర్. ఏ.
౫౨, బందరువీధి, మదరాసు (పు. 49)

జార్జి డ్రెల్లిస్ "సింహము" 'సుందరి', "మాలెబైన్ గ్లిసరైన్ సబ్బులకు," "ఇల్యూషన్"యుడికిలోన్, "మెంతా" టూత్ పేస్టు, మరియితర విలువైన సువాసనసబ్బులు, సుగంధద్రవ్యములకు సోల్ ఏజంట్లుగ యున్నారు. హెడ్డాఫీసు. కొలంబో, బ్రాంచి ఆఫీసులు, మద్రాసు, బొంబాయి, మధుర

### అమెరికన్ షాప్
(సులేమాన్ హాజీఅబ్దుల్లా) బెజవాడ (పు 59)

వీరు ఫోర్డుమోటార్లకు కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలకు ఏజంట్లుగయున్నారు. వీరు బైసికీళ్లు, వాటి భాగములు, ఫోటోగ్రాఫ్‌వస్తువులు, గడియారములు, అత్తర్లు, మందులు వగైరా సరకుల నమ్మువారలు.

### ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,
మస్‌జీదు మార్కెట్టు, బొంబాయి (పు 31, 33)

ఈకంపెని ౩౦ సంవత్సరములకు పూర్వమే స్థాపింపబడినది. హిందూదేశమందుండు సువాసన తలనూనెలను, అత్తర్లను సప్లయిచేయు కంపెనీలలో నిది పురాతనమైనది. వీరి సుప్రసిద్ధ "కామినియా" తలనూనె "ఓటో దిల్ బహార్" హిందూదేశమందె గాక యితరచోట్లగూడ ప్రఖ్యాతి చెందియున్నవి.

### ఆంధ్రపబ్లిషింగ్ హౌస్
తెనాలి (పు. 46)

ఇది సుమారు కొన్ని సం॥ క్రితము తెనాలిలో శ్రీయుత చివుకుల ఆదినారాయణగారిచే స్థాపింపబడినది వీరు రెండువిధములైన డైరీలను, పాకెట్ పంచాంగమును ప్రచురించిరి వకీళ్లకు, గుమాస్తాలకుపయోగపడునటుల పెద్దసైజులోను, జేబుకు యిమిడియుండుటకు చిన్నసైజులో నొకటియు ప్రచురించిరి వీటియందు మిగత డైరీలయందుండు విషయములన్నియు గలవు ఈసంస్థ దినదినాభివృద్ధి గాంచుచున్నది

### ఆయుర్వేదాశ్రమము
౧౫౧, గోవిందప్పనాయునివీధి, జి టి మద్రాసు (పు 8)

౧౮౯౮-వ సంవత్సరములో కీ శే శ్రీ వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు, లక్షరూప్యముల మూలధనముతో దీనిని స్థాపించియుండిరి. ప్రస్తుతకాలమున, మూలబడియున్న ఆయుర్వేద వైద్యశాస్త్రము, మనప్రాంతమున యీనాటికింత ఉచ్ఛస్థితియందుండుటకు వీరే ముఖ్యకారకులు వీరి ఔషధముల మాహాత్మ్యము జగద్విదితమే ఇట్టి ముఖ్య ఔషధములలో నొకటగు "జీవామృతము" పాశ్చాత్యదేశములలో సహా వాడబడియుండుటచేతనే, శ్రీపంచమ జార్జి సార్వభౌములు "వైద్యరత్న" యని బిరుద మొసంగినటుల తెలియుచున్నది భారతదేశమందు జరిగిన అనేకవస్తు ప్రదర్శనములందు వీరి ఔషధములుగూడ ప్రదర్శించబడి పతకములను అనేక యోగ్యతాపత్రములను గూడ సంపాదించిరి ప్రస్తుతము కీ. శే. గోపాలాచార్యులుగారి సోదరులగు డాక్టరు దేశికాచార్యులగారిచే చక్కగ నిర్వహింపబడుచున్నది

### ఆరోగ్యనిలయము
గవర్నరుపేట, బెజవాడ (పు. 66)

ఈఫార్మసీ డాక్టర్ క్రొత్తపల్లి యానాదయ్యగారిచే స్థాపించబడినది. దీనియందు సర్వవ్యాధులకువలయు ఔషధములు దొరకును రోగులు దూరమునుండి యుత్తరములు వ్రాసినయెడల ఈవైద్యులు ఎల్లప్పుడు తగిన సలహా నొసంగుటకు సిద్ధముగ నున్నారు.

### ఆస్ బెస్టాస్ సిమెంటు, ఇండియా, లిమిటెడ్
౧౮, సెకండులైన్ బీచ్, మదరాసు (పు 61)

వీరు ఆస్‌బెస్టాస్ సిమెంటుతో గృహనిర్మాణమునకు వలయు సామానుల తయారుచేయుటయందు ప్రసిద్ధికెక్కినవారు. వర్షపునీటి

గొట్టములు, ఇంటికి కప్పుపెంకులు, నీటి పెద్దగొట్టములు, భూమిలో నుంచుగొట్టములు, అలంకరించబడిన రేకులును, వంపులుగలిగినట్టి రేకులును, సాదారేకులును తయారుచేయుదురు

## ఇండియన్ నేషనల్ స్టోర్సు

౧౭, జాయ్‌మిత్తర్‌వీధి, పోస్టు హాట్కోలా, కలకత్తా (పు. 20)

వీరు, బహుమతులతో గడియారముల నమ్ముచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి, గురుస్వామిశెట్టి కంపెనీ

చైనాబజారురోడ్డు, మద్రాసు(పు. 2)

ఈకంపెనీ సుమారు ౩౦ సం॥రముల క్రిందట అతిస్వల్ప పెట్టుబడితో ప్రారంభించబడినది. ప్రస్తుతము దక్షిణఇండియాలో నగలతయారుచేయు గొప్ప కంపెనీలలో నొకటియై విరాజిల్లుచున్నది. దక్షిణయిండియాలో, గృహోపకరణములగు వెండిసామాను లన్నియు యంత్రసాహాయ్యముచే తయారుచేయుటకు వీరే ప్రథములు వీరిసంస్థ సుమారు ౨౫౦ కుటుంబములకురక్షణయొసగునంతటి గొప్పసంస్థగ మారియున్నది పలురకములైనసువర్ణాభరణములుతయారుచేసి,సాధ్యమైనంత తక్కువ ధరకు సరఫరాచేయుచున్నారు. అంగుళీయములు, సువర్ణ కంకణములు, టూర్నమెంటు కప్పులు వగైరాలకు ప్రత్యేకముగ ముద్రించినక్యాటులాగు విదేశీక్యాటలాగుల కేవిషయములోను తీసిపోనంతటి సుందరముగ నుండును ప్రస్తుతము దీనికి శ్రీ యుతులు ఉమ్మిడి పాండురంగశ్రేష్ఠి, ఉమ్మిడి పార్థసారథి శ్రేష్ఠిగార్లు అధిపతులుగ నుండి కడుసమర్థతో వ్యాపారమును జరుపుచున్నారు వ్యాపారమునకు వలయులక్షణము లన్నియు వీరి యం గుండటచేతనే వ్యాపారము దినదినాభివృద్ధి గాంచుచున్నది

## ఏలూరు అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజము

ఏలూరు (పు 66)

ఈసమాజము సుమారు ౨౦ సం॥ క్రిందట స్థాపించబడినది దీని భవనమును, స్థలమును ప్రభుత్వమువారు ధర్మమొసగిరి ప్రతిదినము బీదలందరికి అన్నదానము చేయుచు,సంవత్సరమున కొకతూరి డిసెంబరు ౧౫ తేదీ సుమారు ౧౫౦౦ మందికి వస్త్రదానము జరుపుచున్నది. వేసవికాలమందు నాలుగు మంచినీళ్ల చలివేంద్రలు పెట్టించి బీదల దాహమును బాపుచున్నారు ఇంతియగాక బీదవిద్యార్థులకు జీతము లిచ్చుచున్నారు ఉచితహోమియో వైద్యశాలగూడ కలదు ఇట్టి ధర్మకార్యముల కన్నింటికి రా॥ బ॥ మోతే గంగరాజుగారు, కె సీతారామయ్యగారు వగైరాలు కడు శ్రద్ధవహించి వీటిని శాశ్వతముగ జరుప సంకల్పించియున్నారు గనుక ధర్మాత్ములగు వారందరును, తోచినరీతిగ సహాయ మొనర్చి సమాజాభివృద్ధికి తోడ్పడెదరుగాక.

## ఏలూరు గోసంరక్షణసమితి ఏలూరు (పు. 40)

సుమారు ౧౫ సంవత్సరముల్రకితము స్థాపింపబడినది మాంస విక్రయశాలలకు కొనిపోబడు అనేకపశువులను గాపాడి దీనియందు పోషింపబడుచున్నవి. దీనినుండి పాలు, ప్రజలకు క్రయమునకు సప్లయి చేయబడుచుండును దీనినిగూడ నిర్విఘ్నముగ సాగించుటకు రా బ మోతే గంగరాజుగారు, ఎమ్ వి. చినరాజు, పి గోపాలస్వామిగార్లు ముఖ్యులు ప్రతి సంవత్సరము వీటికగు జమా, ఖర్చులెక్కలను అచ్చొత్తించి సభ్యులకు పంచిపెట్టుచుందురు జీవహింసయే పరమావధిగా తలంచువారందరిపై యిట్టి సంస్థల పోషించవలసిన బాధ్యతగలదు గాన యిట్టి పుణ్యకార్యము లొనర్చెదరుగాక

## కశేరియా డాక్టర్. ఎమ్. జె. అండ్ సన్సు.,

కబీర్ ఫార్మసీ, "కశేరియా భవన్" ౧౫౯, కెల్కావీధి, బొంబాయి ౪ (పు. 22)

వీరు సుప్రసిద్ధ ఔషధముల తయారుచేయువారలు. వాటిలో ముఖ్యమైనవి బలహీనతలకు "ట్రోజన్" మూలవ్యాధులకు "ఛాలెంజి" కంటివ్యాధులకు "న్యూరిలెన్" అను ఔషధములు

## కణ్ణన్‌చెట్టి ఏ. అండ్ కో

౨౯౬, చైనాబజారు రోడు, మదరాసు(పు. 56)

వీరు పుస్తకముల ప్రచురణకర్తలును, అమ్మకపువారలైయున్నారు. సంస్కృత, తెనుగు గ్రంథము లెక్కువగ అమ్ముచున్నారు

## కృష్ణస్వామిఅయ్యర్ ఎస్. బి. అండ్ కో., మధుర (పు.48)

వీరు మధురయందలి మీనాక్షి, మహాలక్ష్మి, హార్వేమిల్లులలో తయారు గాబడిన నూలుతో చేతిమగ్గములపై చీరెలను తయారుచేయుచుందురు వీరి చీరెలు పలువిధములైన రంగులలోను, అనేక మాదిర్లగను తయారుచేయుచుండుటచే ప్రజలందరి మనస్సులకు నచ్చినవైయున్నవి

## కృష్ణా అండ్ కో.

౨౪౩-౨౪౪, చైనాబజారు,మద్రాసు(పు 40)

వీరు పలువిధములైన, స్వదేశజవుళి వ్యాపారస్థులు వీరుకృష్ణా ౧ రకంట్వెల్లుకు ఏజంట్లుగయున్నారు వీరివద్ద పలురకములైన సర్జీలు, ట్వేడులు, ఫ్లానులు వగైరాలు దొరకును

## కేరళసోప్ ఇన్‌స్టిట్యూట్, కళ్లికోట(మలబారు) (పు 46)

ఈ సబ్బుఫ్యాక్టరీని, మద్రాసు ప్రభుత్వమువారు రాజధానియందు పారిశ్రామికాభివృద్ధిచేయు నుద్దేశ్యముతో స్థాపించిరి. దీనిని స్థాపించుటలోగల ముఖ్యోద్దేశ్యము దీనివలన ధనము సంపాదించవలె

ననిగాక, విద్యార్థులకు యీ పరిశ్రమను నేర్పుటయే పరమావధిగా భావించుచున్నారు ఎట్లయినను, సైన్సుశాస్త్ర పరిశోధకులగు మిష్టర్. మెనన్‌వారిచేతను జాగ్రత్తగ నడుపబడుచుండుటచే క్రమేణ వ్యాపార రీత్యాగూడ అభివృద్ధిగాంచుచున్నది దీనియందు తయారుచేయబడు సబ్బులు హిందూదేశములో తయారుగాబడు శ్రేష్ఠమైన సబ్బులలో నొకటై యున్నవి

## కోదండరామపిళ్లెగారు పి.

44, ఎస్‌ప్లెనేడ్, మద్రాసు (పు 55)

మద్రాసు రాజధానియందు ప్రప్రథమమున ఫర్నిచరు సామానుల వ్యాపారమును ౧౮౫౮ సం॥ న వీరితండ్రి శ్రీ॥ శ్రీ॥ పి. ఎస్ పొన్నుస్వామిపిళ్లెగారిచే ప్రారంభించబడినది తదుపరి వీరి హయాములో అత్యంత యభివృద్ధిచేయబడుటమాత్రమేగాక యీవృత్తి అనేకులకు నేర్పి ప్రవీణులగునటుల చేసియుండిరి మరియు వీటికి గావలసిన యిత్తడి మరలు, బీగములు వగైరాలు భారతదేశమందు తయారుచేయబడువాటినే వీరు పట్టుదలతో ఉపయోగించుచున్నారు. వీరు శాంతస్వభావులు, ఉదారవంతులు, చాల దానధర్మములు చేయువారు

## క్షీరసముద్రం ఆయుర్వేదఫార్మసీ, గుమ్మలూరు

(పాలకొల్లు) (పు 54)

ఇది 20 సంల క్రితము శ్రీపాదక్షిణామూర్తిశాస్త్రిగారిచే స్థాపించబడినది పశ్చిమగోదావరిజిల్లాలోని అనేక ఆయుర్వేదౌషధములతయారుచేయు గొప్పవైద్యాలయమై యున్నది మంచి నాణ్యమైన ఔషధములు చౌకవెలలో దొరుకు సంస్థయైనటుల తెలియవచ్చుచున్నది

## గన్‌బ్రదర్సు (టోపాల్‌వర్క్సు)

౫-ఏ హీవెట్‌రోడ్డు, లక్నో (పు 15)

పైసంస్థ ౧౯౧౭ సంవత్సరమున స్థాపించబడినది వీరు పలువిధములైన కంపోజిషన్ కార్కులు, పెట్టెలు, సీసాలు మొదలైనవన్నియు తయారుచేయుచున్నారు ఈవిధములైన పరిశ్రమలయందు పనిచేయు కొలదివాటిలో నిది యొకటియై యున్నది

## గనేష్ అండ్ కో., (తంబుచెట్టివీధి, మద్రాసు.) (పు 11)

వీరు ప్రథమములో అనేక జాతీయగ్రంథముల ప్రచురించుటచేతనే యింతటి ఖ్యాతిగాంచ గలిగిరి నేటికినిగూడ అదేకీర్తిని కలిగియున్నారు.

వీరు మరొకవ్యాపారమందుగూడ మార్కెటునందు ప్రాముఖ్యస్థానము నాక్రమించియున్నారు ప్రజలందరికిని రుచించునట్టి పలువిధములైన కాఫీగింజలను తెప్పించి నమ్ముటచే వీరుపేరు ప్రతియింటను చెప్పుకొనుచున్నారు వీరు యింటింటికివెళ్లి కాఫీ గింజలనుక్రయమునకు యొసంగుచుండు పద్ధతి చాల యనుకూలముగనున్నది బయటవూళ్లకు ౭ పౌనుల కాఫీగింజల చిన్నబస్తాలలో తగు జాగ్రత్తతోను, వెంటనే పంపుచుండు పద్ధతి చాల అనుకూలమై ఉత్తరహిందూస్థానమందుండు దాక్షిణాత్యులకుగూడ చాల సౌకర్యము నిచ్చుచున్నది

## గ్రేట్ నేషనల్ స్టోర్సు,

పోస్టుబాక్సు నెం ౧౨౨౧౫, కలకత్తా. (పు 52)

వీరు గడియారములను బహుమతులతో సహా విక్రయించుచుందురు

## జండు ఫార్మస్యూటికల్ వర్క్సు

౭౮, చైనాబజారు రోడ్డు, మదరాసు (పు ౩౯)

ఈసంస్థ ౧౯౧౦ సంవత్సరమున బొంబాయిలో జండు భట్ గారి మనుమలగు శ్రీయుత, జగన్నాథ్ ఎస్ వైద్యగారిచే స్వంతముగ స్థాపించబడెను. తదుపరి ౧౯౨౦ సం॥ న లిమిటెడ్ కంపెనీగా మార్చబడినది

ఆయుర్వేద ఔషధములన్నియు నవీనపద్ధతులపై, సంపూర్తమైన యంత్రములతో నిండియున్న పై సంస్థయందు తయారుచేయబడి ఇండియా, బర్మా, సిలోన్, ఆఫ్రికా, మెడగాస్కర్, పర్షియన్ గల్ఫు మరి యితరదేశములందును అమ్మబడుచున్నవి కలకత్తా, మద్రాసు, పూనా పట్టణములందుజరిగిన ఆయుర్వేదౌషధ ప్రదర్శనములందు బంగారు పతకముల సంపాదించి యుండిరి

వీరి మద్రాసు ఏజంట్లు మెసర్సు దామోదర్ అండ్ కో, ౭౮, చైనాబజారురోడ్డు, మద్రాసు

## జనార్దనమునాయుడు పి. ఆర్.

ఒంగోలు (గుంటూరుజిల్లా) (పు 55)

ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలనేర్పు పుస్తకములు, దీనికి తగిన తదితరపరికరములు వీరియొద్ద దొరుకును వీటినిగూర్చి కొలది పుస్తకములగూడ ప్రచురించియున్నారు. వైద్యవిద్యయందుగూడ కొలది ప్రవేశముండుటచే కొన్ని ఔషధముల తయారుచేసి విక్రయించుచుందురు.

## జోషి అండ్ కో., సరస్వతి ఆశ్రమము జి. డి.

నెం ౧౪౩౦. పీపల్ మహాదేవ్, డిల్లీ. (పు 5, 6)

వీరు అనేకపనుల కుపయోగించు శ్రేష్టమైన రక్షలను తయారుచేయువారై యున్నారు.

### జ్యూపిటర్ జనరల్ ఇన్‌ష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

బొంబాయి (పు. 67)

ఇది బొంబాయియందు ౧౯౧౯ సంవత్సరమున వర్తకులు, బ్యాంకర్లు, మిల్లుయజమానులగు సేట్ లాల్‌జీ నారన్‌జీ జె. పి. గారు డైరెక్టర్లబోర్డున కధ్యక్షుడుగనుండి, రు ౧,౫౦,౦౦,౦౦౦ మూలధనముతో స్థాపింపబడిన హైందవ ఇన్‌స్యూరెన్సుకంపెనీయై యున్నది.

దీనియందు అగ్ని, ఓడవ్యాపారము, మోటారు, మఱి యితర ప్రమాదములన్నింటికిని భీమాచేయుటవ కకాశముగలిగియున్నది. కొలది సంవత్సరములనుండి మానవజీవితములు గూడ భీమాచేయబడుచున్నవి. దీని ఏజన్సీలు ఇండియా, బర్మా, సిలోన్, ఇంగ్లండు, అమెరికాదేశములందు గలవు. లైఫ్ డిపార్టుమెంటునందు ౧౯౩౧ సం||లో పూర్తి జీవితపాలసీలపై రు ౧౫/ లాభమున్నూ, ఎండోమెంటు పాలసీలపై రు౧౨/-ల లాభములు పంచబడినవి మెసర్సు నారాయణదాస్ గిరిధరిదాస్, నెం ౧౦ మెక్లీన్‌వీధి మద్రాసువారు, ఏజంట్లుగనుండి చక్కని పనిచేయుచున్నారు

### డక్కన్ ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

మునగాలహౌస్, బెజవాడ. (పు. 18)

ఇది కేవలము ఆంధ్రసంస్థయై బెజవాడవాడయంగ మునగాల రాజాగారగు నాయని వెంకటరంగారావు బహదూరువారి అధ్యక్షత క్రింద స్థాపింపబడినది దీనికి ప్రత్యేక స్త్రీల సలహాసంఘ మొకటి గలదు. ఈసంఘమునకు డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, మిసెస్ రుక్మిణీలక్ష్మీపతి, మిసెస్ అమ్ముస్వామినాథన్ గార్లు సభ్యులుగనున్నారు మామూలు ఇన్‌ష్యూరెన్సు పద్ధతు లిందు గలవు. స్త్రీ పురుషు లిరువురికి ఉపయోగపడునటులను, రు ౨౫౧/- లనుండి ప్రారంభమగు స్వల్పపాలసీలును, వైద్యసహాయమునకు గృహనిర్మాణములకు పాలసీదార్లకు ధనము అడ్వాన్సుగా యొసంగుటయు, ఉత్తరము లన్నియు తెలుగులోనే వ్రాయవీలగు సౌకర్యములే యీ కంపెనీయందలి సుగుణములై యున్నవి.

మిస్టర్ సీలంశెట్టి గోవర్ధనరావు మేనేజింగు డైరెక్టరుగనున్నారు. వీరి మద్రాసుఆఫీసు. ౩౭, ఎర్రబాలుచెట్టివీధి, జార్జిటౌనందుగలదు

### డాక్టర్. స్ట్రాంగ్‌మన్స్ ఫార్మకల్ కంపెనీ

౩౦౩, జుమ్మామసీదు, బొంబాయి. (పు. 53)

వీరు డాక్టర్ స్ట్రాంగ్‌మన్‌గారి "ఫాస్‌ఫటోజీన్" అను బలవర్ధకౌషధమును తయారుచేసియున్నారు. ఈఔషధము దుర్బలులకును, వీర్యశక్తి తగ్గినవారలకు మిక్కిలి యుపయోగమైనది. తగ్గిపోయిన బలమును, వీర్యశక్తిని, ఆరోగ్యముల మరల నొసంగగలిగియున్నది.

### డోంగ్రే, కే. టి. అండ్ కో., బొంబాయి (పు. 28)

బాలుర కత్యంతోపయుక్తమైనట్టి సుప్రసిద్ధ "డోంగ్రో గారి బాలామృతము" ను కనిపెట్టినవారలు వీరే. వీరి హెడ్డాఫీసు బొంబాయి మద్రాసు ఏజంట్లు. దామోదర్ అండ్ కో, చైనాబజారు.

### దామోదర్ అండ్ కంపెనీ.,

చైనాబజారు మదరాసు. (పు. 54)

వీరు ప్రఖ్యాతిగాంచిన ఆయుర్వేదఔషధముల కన్నింటికిని ప్రతినిధులుగ పనిచేయుచున్నారు. వీరు అమ్ము ఔషధములలో ముఖ్యమైనవి. డాక్టర్ వామన్ గోపాలగారి "అయోడైసిడ్ సరస రిపెల్లాక్టర్" యున్నూ; డాక్టర్ గౌతమరావు కేశవరావుగారి "ఫాస్‌ఫరస్" మాత్రలునూ అయియున్నవి. ఇవిగాక సుప్రసిద్ధ జండూగారి ఔషధములకుగూడ వీరే ప్రతినిధులై యున్నారు.

### దివాన్ రామనాధ్ అండ్ కో.,

రావల్‌పిండి, (పంజాబు) (పు. 28)

సుందరమైన చిత్రములు, ప్యారిస్ బొమ్మలు, మంచి క్యాలెండర్ల వ్యాపారస్థులు.

### దవే కెమికల్ వర్క్సు.,

బొంబాయి, ౨. (పు. 52)

వీరు, స్త్రీల గర్భకోశ వ్యాధు లన్నింటిని బోగొట్ట గలిగిన "సుందరిసతి" అను బలవర్ధకౌషధము నొకదానిని కనిపెట్టియున్నారు వీరియొక్క బ్రాంచి ఆఫీసు మద్రాసునందు నెం.౧౦౮ రు. నైనియప్పనాయకన్ వీధియందు గలదు.

### నాగేంద్రనాధ్ సేన్ కవిరాజ్ అండ్ కో, లిమిటెడ్.,

కలకత్తా. (పు 56)

వీరు సుప్రసిద్ధ "కేశరంజన్" తలనూనెల తయారుచేయువారు. హిందూదేశమందు ఆయుర్వేద ఔషధములను శాస్త్రీయముగ అనాదిగ తయారుచేయువారలలో నొకరై యున్నారు.

### నెప్ట్యూన్ ఇన్‌ష్యూరెన్సుకంపెనీ, లిమిటెడ్.,

౭౮, అపోలోవీధి, ఫోర్టు, బొంబాయి (పు. 22)

వీరు జీవితముల భీమాచేయువ్యాపారమును నవీనపద్ధతులపై జరుపుచున్నారు వీరి ప్రతినిధులులేనిచోట్ల పనిచేయుటకు చురుకైన ఏజంట్లు కావలసియున్నారు.

### నేషనల్ ఇన్‌ష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

౭, కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా. (పు 64)

ఇది ౧౯౦౬ సం॥ న స్థాపింపబడినది హిందూదేశమందుంగు గొప్ప భీమాకంపెనీలలో నొకటియై యున్నది. ఇది కేవలము భారతీయ సంస్థయై, హైందవులచేతనే నడుపబడుచున్నది. అన్ని విధములైన భీమాస్కీము లిందుగలవు వీరి ప్రీమియములు తక్కువగ యుండి, ఎక్కువ లాభముల పంచిపెట్టుచున్నారు వీరి మద్రాసు బ్రాంచి మిక్కిలి సమర్థులైనట్టి టి. అనంతాచారి బి యే గారిచే చక్కగ నిర్వహింపబడుచున్నది. మద్రాసు బ్రాంచిఆఫీసు ౧౧౩, ఆర్మీనియన్ వీథి, జార్జిటౌనందు గలదు.

### న్యూఇండియా ఎష్యూరెన్సు కంపెనీ., లిమిటెడ్.,

౮/౨, ఫస్టులైన్‌బీచ్, మదరాసు. (పు 69)

ఈకంపెనీ ౧౯౧౯ సంవత్సరమున జమ్‌షెడ్ పురములోని సుప్రసిద్ధ "తాతాహౌస్" వారిచే స్థాపింపబడి ప్రస్తుతము ప్రపంచమంతటను వ్యాపించిన పెద్దసంస్థయైయున్నది ఫైర్, లైఫ్, మెరైన్, బర్‌గ్లరీ, మోటారుప్రమాదము మరి యితర సర్వవిధములైన కష్టముల నుండి రక్షించుకొనుటకు దీనిభీమా ప్రజలకు చాల ఉపయోగకరముగ నున్నది. ధనము రాకపోకలందు నిర్భయముగ నుండుటకును,పనివారల కష్టకాలమున ధనమొసగు ఏర్పాట్లుగూడ గలవు. దీనిపాలసీలను ప్రపంచమందుండు అన్నిబ్యాంకులు అంగీకరించియున్నవి దీని మొత్తం సొమ్ము సుమారు ఒకటిన్నరకోటివరకు గలదు నేటివరకు చెల్లించిన క్లయిములమొత్తం ఐదుకోట్లరూప్యములు. ప్రపంచమంతటను దీని శాఖలు గలవు. మద్రాసుబ్రాంచిని, మేనేజరగు కె. కె. శ్రీనివాసన్ గారు కడుసమర్థతో నడుపుచున్నారు.

### పి. సి. ఏ. అండ్ కంపెనీ ఆయుర్వేదసమాజము

పెరిదేపి, (నెల్లూరుజిల్లా)(పు 8, 12, 14, 19, 20 26)

ఈసంస్థ ౨౫ సంవత్సరముల క్రితము నెల్లూరు మండలములోని పెరిదేపిగ్రామమున ఆయుర్వేదవిద్వాన్, భిషగ్రత్న పి. సి అయ్యావారప్పయ్య పంతులుగారిచే స్థాపింపబడినది. వీరి ఔషధరాజము లన్నియు ఆంధ్రదేశ మంతట నుపయోగింపబడుచున్నవి.

### ప్రెసిడెన్సీ లైఫ్ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

యార్కు బిల్డింగులు, హారన్‌బీరోడ్డు, ఫోర్టు, బొంబాయి (పు. 64)

ఈ కంపెనీ నవీన ఇన్‌ష్యూరెన్సు పద్ధతు లన్నియు గలిగి యున్నది. స్థాపితమై కొలదికాల మైనను ఎక్కువపని జరుపుచున్నారు. ఈకంపెనీ మేనేజిమెంటు చాల మితవ్యయముతో గూడి యున్నది.

### బర్మాషెల్ ఆయిల్‌స్టోరేజి అండ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్

ఫస్టులైనుబీచ్, మదరాసు (పు 60)

హిందూదేశమంతటకును మోటారుకార్లకు, లారీలకు శ్రేష్ఠమైన పెట్రోలును, లాంతర్లకు స్టవ్‌లకు కిరసనాయిల్ ను. అన్ని పనుల కుపయోగించు లూబ్రికేటింగ్ నూనెలను, ఇంజనులకు వలయు నూనెలును, మైనము, మైనపువత్తులును,రోడ్లకుపయోగించు ఆస్‌ఫాల్టు వస్తువులును అంటువ్యాధుల ప్రజ్వలింపచేయుపురుగుల నశింపచేయుటకు షెల్ టాక్సన్ను, ఇండ్లలో నుపయోగించు నూనెలు, మోటారుకార్ల, పాలిష్‌లు, క్లీనర్లను పంపువార్లయియున్నారు. దీనిశాఖలు లెక్క చేయుటకు నలవికాదు. వీరి వస్తువులలో చాలభాగము బర్మాలో వేలకొలది హైందవ పనివారలచే తయారు చేయబడుచున్నవి

### బాంబే లైఫ్ ఎస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్.,

బాంబేలైఫ్ బిల్డింగ్స్, ఫోర్టు, బొంబాయి. (పు. 59)

ఈకంపెనీ బొంబాయిలో ౧౯౦౮ సం॥మున సర్ లల్లూబాయ్ శ్యామల్‌దాస్ కే. టి. సి. ఐ. ఇ, జె పి గారి యధ్యక్షత క్రింద స్థాపింపబడినది. స్త్రీల ఇన్‌స్యూరెన్సు, న్యూచివల్ ఇన్‌స్యూరెన్సు, తక్కువ ప్రీమియములు, ధారాళమైన పాలసీపద్ధతులు, మిగత నవీన ఇన్‌స్యూరెన్సు స్కీములన్నియు గలిగియుండుటయే దీనియందలి విశేషము. మెసర్సు కోచికార్ బ్రదర్సు., మౌంటురోడ్డు, మద్రాసు వారు యిచ్చట బ్రాంచి కార్యదర్శులుగయుండి మంచిపని చూపుచున్నారు

### బీహార్ కెమికల్ వర్క్సు.,

"గౌరంగభవన్" భాగల్‌పూర్ (పు. 28)

వీరు, శరీరమునకు బలము నిచ్చుటలో ప్రసిద్ధికెక్కిన "నర్వినస్" అను బలవర్ధకౌషధమును తయారుచేయుచున్నారు. ఈ ఔషధము దేశమంతటను విరివిగ విక్రయింపబడుచున్నది

### బ్యాంక్ అఫ్ హిందూస్థాన్ లిమిటెడ్.,

ఆర్మీనియన్ వీధి, మదరాసు. (పు. ౩౫)

బ్యాంకి వ్యవహారములలో మిక్కిలి నేర్పరులును, చురుకుగ పనిచేయు శ్రీయుత విద్యాసాగర్ పాండ్యాగారిచే ౧౯౨౯ సంవత్సరమున యీ బ్యాంకి స్థాపింపబడినది దీని మేనేజింగ్ డైరెక్టరుగ వీరే ప్రస్తుతము పనులు జరుపుచున్నారు ఇది కేవలము హైందవ బ్యాంకయై, సమర్థులగు డైరెక్టర్ల బోర్డు కలిగియున్నది. మద్రాసు నందుండు ఇండియన్ బ్యాంక్ గూడ ప్రస్తుతమిట్టి ఔన్నత్యదశ యందుండుటకు వీరే కారకులై, కడునేర్పుగ పనుల నిర్వహించియుండుటచేతనే ఇది దినదినాభివృద్ధిగాంచుచున్న దనియంగీకరించకతప్పదు.

వీరి బ్రాంచీలు కోయంబుత్తూరు, బెజవాడ, కల్లికోట, కుంభకోణం, మధుర, తిరుపూరులందు గలవు

## భారత్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

౬౨/౬౮ రెటాన్ బజారు, మద్రాసు (పు 15)

ఇది హిందూదేశమందుండు లైఫ్ ఇన్స్యూరెన్సు కంపెనీలలోనికి పూరాతనమైనది ౧౮౯౬ సంవత్సరమున లాలా హరికిషన్ లాల్ బి యే (క్యాన్టబ్) బారిష్టరుగారి అధ్యక్షతక్రింద స్థాపింపబడినది. స్త్రీలు భీమా చేయుట, తక్కువ ప్రీమియములు, ఎక్కువలాభములు, సులువైన నిబంధనలుగల పాలసీలు, యితరులకు ధర్మార్థము వినియోగించు పాలసీలపై నూటికి ౩౩ తగ్గింపు మొదలైన సౌకర్యములు గలిగియుండుటయే దీనియందలి విశేషము. మద్రాసు బ్రాంచి మేనేజరు, పి కుప్పుస్వామి అయ్యర్‌గారు ఆంధ్రదేశమునకు డి. శాంతయ్యగారు సామర్లకోటలోను, ప్రభల వెంకట్రామయ్యగారు బెజవాడలోను ఆర్గనైజంగ్ ఇన్స్పెక్టర్లగ పని చేయుచున్నారు

## భారత్ టైల్సుకంపెనీ.,

౮/౫ సెకండులైన్ బీచ్, మద్రాసు.(పు 16)

తొమ్మిది సంవత్సరములక్రితము భారత్‌ఫ్లోరింగ్ టైల్సు కంపెనీ, ౨౦, అపోలోవీధి, ఫోర్టు బొంబాయినందు, సిమెంటుతో అందమైన పలురకముల పెంకులను తయారుచేయుచుండెడివారు. బారత్ పెంకులు వాడుచున్న కొలదిని యొకవిధమైన ప్రకాశమువచ్చుచుండుటయే దీనియందలి శ్రేష్ఠమైనగుణము ఈపెంకులతో బొంబాయిప్రభుత్వభవనము, కాటన్ స్టాక్ అండ్ ఎక్స్చేంజిభవనము, టాజ్‌మహల్ హోటలు, గైక్‌వార్ మహారాజావారి భవనమును, బి బి. అండ్ సి. ఐ రైల్వేవారి సెంట్రల్ స్టేషను అంతయును కప్పబడినటుల తెలియుచున్నది.

కొలదికాలముక్రిందటనే మద్రాసులో బ్రాంచి నొకదానిని తెరచి యున్నారు.

## భారత్ యూనియన్ ట్రేడింగ్ కంపెనీ.,

పోస్టుబాక్సు నెం ౨౩౯౮. కలకత్తా (పు. 62)

ఈకంపెనీవారు పలువిధములైన గాలి తుపాకుల నమ్ముచుందురు

## మద్రాసు పెన్సిల్ ఫ్యాక్టరీ

పోస్టుబాక్సు నెం ౧౬, మద్రాసు. (పు. 47)

ఇది ప్రభుత్వమువారిచే స్థాపించబడి, కొంతకాలమైన పిదప సుప్రసిద్ధ మెసర్సు పెరుమాళ్లచెట్టి అండ్ సన్సువారి కొప్పగించబడినది. వీరి చేతిక్రిందికి తీసుకొని నప్పటినుండియు చాల యభివృద్ధి గాంచుచున్నది. దీనియందు దినము ౧ కి ౨౦,౦౦౦ పెన్సిల్లు తయారుచేయబడుచుండి, హిందుదేశమందుండు యిట్టి ఫ్యాక్టరీలలో మిన్నయైయున్నది. వీరి ట్రేడ్‌మార్కు యగు "స్టార్" హిందూదేశమంతటను ప్రఖ్యాతిగాంచినది ఈపెన్సిల్లు ఏవిషయములోగూడను విదేశీ పెన్సిల్లకు తీసిపోజాలవు

## మద్దూరి బ్రదర్సు.,

రాజమహేంద్రవరం (పు. 44)

వీరు యింజనీర్లుగనుండి పలువిధమైన మెషినరీ సామానులలో వ్యాపారము చేయుచున్నారు వీరి యంత్రములు పలుస్థలములలో పని చేయుచున్నవి. నీటిపంపులు, వడ్లమరలు వగైరాలకు వలయు విడి సామానులుగూడ నమ్ముచున్నారు

## మధు పెర్‌ఫ్యూమరీవర్క్సు

౨, భోయిర్‌వాడ, బొంబాయి (పు 64)

వీరు పలువిధములైన సుగంధద్రవ్యముల తయారుచేయుచున్నారు. "మధు కాన్‌క్రీట్ బ్రిలియన్‌టైన్" వీరి వస్తువులలోనికి మిగుల శ్రేష్ఠమైనది.

## మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు

బ్రాడ్వే, మదరాసు (పు 14)

ఈ ఆయుర్వేదవైద్యాలయము, గవర్నమెంటు స్కూలు ఆఫ్ ఇండియన్ మెడిసన్‌లో ఆయుర్వేదశాస్త్ర బోధకులుగా యున్న పండిత్ మాధవమెనన్‌గారిచే స్థాపింపబడి, వీరిచేతనే చాలబాగుగ నిర్వహింపబడుచున్నది వీరు, సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులగు కీ॥ శే॥ పండిత డి. గోపాలాచార్యులవారియొద్దనే వైద్యశాస్త్రము నభ్యసించియుండిరి. దీనియందు శ్రేష్ఠమైన ఆయుర్వేద ఔషధములు విక్రయించబడుచున్నవి

## మానవాదర్శగ్రంథమండలి

అంగలూరు (కృష్ణాజిల్లా) (పు. 48, 48 ఎ)

ఈమానవాదర్శగ్రంథమండలి ౧౯౨౩ వ సంవత్సరమున బాధనాజ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారిచే కృష్ణాజిల్లా అంగలూరు గ్రామమందు స్థాపింపబడి వారిసంపాదకత్వముక్రింద నడుపబడుచున్నది. ఇందు ఆధ్యాత్మిక, ధార్మిక, నైతిక, సాంఘికగ్రంథములు, మహాపురుషులపుణ్యచారిత్రములు వెలువడుచుండును. ఇంగ్లీషు, హిందీ, బంగాలీ, గుజరాతీభాషలనుండి ఉత్తమ అనువాదగ్రంథములు కూడ ప్రకటింపబడును ఈమండలినుండి ఉత్తమగ్రంథములు వెలువడుచుండు ననుటకు బుద్ధపురాణము, మానవజీవితము (3 సంపుటములు) లే నిదర్శనములు ఈగ్రంథద్వయముయొక్క ప్రాశస్త్య ప్రయోజనముల జగద్విఖ్యాత మేధాసంపన్నులగు ప్రొఫెసర్ సర్ యస్. రాధాకృష్ణన్, ఎం ఏ. ఆంధ్ర యూనివర్సిటీ వైసుఛాన్సలర్

గారియొక్కయు, కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ. క్ర్యాంటబ్ ఎక్సుఆంధ్రయూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ గారియొక్కయు అభిప్రాయములే చాటుచున్నవి. ఏతద్గ్రంథద్వయము మద్రాసు టెక్స్టుబుక్ కమిటీవారిచే లైబ్రరీగ్రంథములుగ అప్రూవుచేయబడినవి. ఈమండలి నుండి వెలువడిన నిష్కామయోగము (గాంధీభగవద్గీత), ఆత్మవిజయములుకూడ అప్రూవుకాబడినవి.

## మిన్‌సారరసమ్ కంపెనీ, లిమిటెడ్

సేలం (ద ఇండియా) (పు. 19)

దీనిని మద్రాసులో "తమిళనాడు" అను తమిళదైనిక పత్రికా ప్రొప్రయిటరుగారగు డాక్టర్ వరదరాజులునాయుడుగారిచే స్థాపింపబడినది. మిన్‌సారరసమును తయారుచేయుటకు సంపూర్ణాధికారము వీరికిమాత్రమే గలదు. సర్వవిధములైన బాధల నివారించగలదనుప్రతీతి ఇది చెన్నరాజధానియందంతటను అమ్మబడుచున్నది. ఇటీవలనే దీనిని లిమిటెడ్ కంపెనీగా మార్చి యున్నారు.

## మెరిడియన్ ఇన్‌స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్,

౨౮, చెర్చిగేట్ వీథి, ఫోర్టు, బొంబాయి (పు. 54)

ఇది యొక ప్రావిడెంటు ఇన్‌స్యూరెన్సు కంపెనీయై, పాలసీ హోల్డర్లకు తాము చెల్లించిన సొమ్మునకు ఒకటిన్నరరెట్లు అధికముగ నొసంగబడువాటిలో ఒకటియై యున్నది. వీరికి ఏజెంట్లు కావలసియున్నారు.

## మైసూరు గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ., బెంగుళూరు.

(పు. 21)

గొప్పరాజకీయ వేత్తలగు సర్ ఎమ్. విశ్వేశ్వరయ్య, కె. టి., డి. ఎస్-సి గారు దివానుగ నుండిన కాలమందు మైసూరుప్రభుత్వము వారు స్థాపించిన పారిశ్రామికాలయములలో నిదియొకటియై నేటివరకు అవిచ్ఛిన్నముగ కొనసాగుచున్నది. పాశ్చాత్యదేశములలో సబ్బు పరిశ్రమయందు మిక్కిలి పరిశ్రమ యొనర్చిన మిస్టర్, ఎస్. జి. శాస్త్రి ఏమ్. ఎస్. సి., ఎఫ్. సి. ఎస్. వారి తనిఖీక్రింద నడుపబడుచుండుటచే, ఈఫ్యాక్టరీ ప్రస్తుతము హిందూదేశమందుండు శ్రేష్ఠమైన సబ్బు పరిశ్రమాలయములలో నొకటియై దినదినాభివృద్ధి గాంచుచున్నది.

మైసూరు, ప్రపంచములో ఎక్కువ చందనతైలమును తయారు చేయునదై యున్నది. ఎక్కువభాగము స్వచ్ఛమైన బ్రిటిష్ ఫార్మకోపియా స్టాండర్డు చందనాది తైలము చేరియుండు మైసూరు చందన సబ్బు తయారుచేయుటయే వీరియాధిక్యమునకుకారణము. విదేశపుసబ్బులతో దీనిని సరిపోల్చి చూచిన, ఏవిషయములోను తీసిపోదు.

## మోతీలాల్ అండ్ కో.,

౧౭, జాయిమిత్తర్ వీథి, కలకత్తా. (పు. 40)

వీరు గడియారములు, పిల్లల ఆటవస్తువులు, "ఓటోమోతియా" మొదలగువాటిలో వ్యాపారము చేయుచున్నారు.

## యూనిక్ ఎష్యూరెన్సుకంపెనీ., లిమిటెడ్.,

౩౬, ఎర్రబాలుచెట్టివీధి, మదరాసు. (పు. 34)

ఈకంపెనీ ౧౯౧౨ సంవత్సరమున కలకత్తాలో శ్రీ శ్రీ దేశబంధుచిత్తరంజన్‌దాసుగారిచే స్థాపింపబడినది. దీనియొక్క ధనవిషయమైగాని లేక సరిగా పనిచేయుచున్న విషయమైగాని ౧౯౨౭ తో అంత్యమగు సంవత్సర లెక్కల తనిఖీచేసిన ఈ. బి. నాథన్‌గారి అభిప్రాయమువలన కంపెనీకి చాల లాభమువచ్చినటులనున్నూ, లైఫ్, ఎండోమెంటు పాలసీలపై రు ౫౦ లు లాభముల పంచిపెట్టబడినట్లును తెలియుచున్నది.

దీనియందలి ప్రత్యేకసౌకర్యము లేవన (౧) పాలసీలకు ఎక్కువ చార్జీలు లేకపోవుటయు, (ఏ) చిరకాలమందు అసమర్థతల కొసంగబడులాభములు, (బి) వార్ధక్యపులాభములు (౨) నూతనముగ తగ్గించబడిన తక్కువప్రేమియములు, (౩) గడువుతీరిన పాలసీలను వెనుకటివాయిదాసొమ్ము చెల్లించకయే మరల అమలునందుంచుట (౪) రు ౧౦౦౦ పాలసీ ౧కి రు. ౫౦ ల లాభములు పంచుట, (౫) పాలసీదారుడు చనిపోయినటుల తెలిపిన వెంటనే వారి హక్కుదారులకు సగముసొమ్ము వెంటనే చెల్లించబడుటయే.

## యునైటెడ్ ఇండియా లైఫ్ ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్,

శంభుదాస్ వీథి, మద్రాసు (పు. 39)

ఈ భీమాసంఘము సర్వశః భారతీయసంస్థ, పెట్టుబడి భారతీయులది, అధికారము భారతీయులది, సంచాలనము భారతీయులది.

రు ౫,౦౦౦ కు కూడ చాల తక్కువయగు సంసారపక్షపు పెట్టుబడితో బయలుదేరిన ఈ స్వదేశీసంస్థ ఇప్పుడు దక్షిణభారతమున ప్రధాన భీమాకార్యాలయములలో నొకటిగా నిలువగలస్థితికివచ్చినది. ఈ సంఘము తాలూకు మొత్తము భీమాలు రెండుకోట్ల రూపాయలవఱకున్నవట; లాభము ౪౪ లక్షల పైమాట.

దీని యీపాతిక సంవత్సరముల సచ్చరిత్రము గమనించినచో, బ్రహ్మాండమయినదని కాకపోయినను, ఎడతెగనిదై నిక్కమైన అభివృద్ధి కానవచ్చును; ఇట్టి అభివృద్ధి మఱి సంచాలకులయు, అధికారులయు హృదయపూర్వకమగు సహాయోగమువలనను, తత్పరతతోడి నిర్వహణమువలనను సాధ్యము కాగలైనని వేఱుగ చెప్పవలయునా?

అన్నటైల్ల పని జరుపు చాకచక్యము మున్నది కనుకనే, ఎన్నడు నెఱుగని డబ్బు నిక్కచ్చి దాపరించిన నిరుటి సంవత్సరము సహా కంపెనీవారు అంతటి గొప్ప వ్యాపారమును సాగింపగల్గిరి.

యునైటెడ్ ఇండియా ఆఫీసువారు తమ సంస్థకు ప్రత్యేక లక్షణములుగా చెప్పుకొనువానిలో, పాలిసీదారుల క్షేమము లోటు

రాకుండ కాపాడు నేర్పాటు ఒకటి; ఈపద్ధతి కంపెనీవారే కల్పించిరి మద్రాసు ప్రభుత్వపు అఫీషియలు ట్రస్టీగారు దీని పాలసీదారుల నిధికి, ట్రస్టీగా నియమితులైనారు ఇంకొకటి పాలిసీదారులకు సంచాలకవర్గమున ప్రాతినిధ్యాధికార మిచ్చిరి ఈ ప్రాతినిధ్యపు హక్కు ఈకంపెనీవారియెడల విశేషవిషయమట

ప్రసిద్ధమైన బీమాప్రణాళిక లన్నియు ననుసరించుటయే కాక, వీరీ నడుమ అనేకములగు క్రొత్తపద్ధతులుకూడ ప్రవేశపెట్టిరి

ఈ కంపెనీవారి అభివృద్ధి దక్షిణభారతమున స్వదేశీవ్యాపారమునకభివృద్ధియన్న మాట

## యునైటెడ్ వాచ్ కంపెనీ.,

పోస్టుబాక్సు నెం ౧౨౧౮, కలకత్తా. (పు. 22)

వీరు గడియారములను బహుమతులతో సహా విక్రయించుచుందురు.

## రసాయన ఛాయశాల

తూర్పువీథి, మధుర. (పు 7)

౧౯౧౭ సంవత్సరములో మెసర్సు. చారి అండ్ రామ్‌కు చెందిన వి ఎస్. కె. ముత్తురామయ్యార్, ఏ. ఆర్. రంగాచారిగార్లు, వి. ఎస్. ముత్తుకృష్ణమాచారిగారిని భాగస్థులుగ కలుపుకొని ఈకంపెనీని స్థాపించియుండిరి వీరు వివిధములైన రంగు అద్దకములు గట్టిచాయగలిగియుండునటుల తయారుచేయుదురు ప్రత్తి, నూలుబట్టలపై చిక్కనిరంగులను ముద్రించగలరు రాజధానియంతటను వీరి బట్టలు ఎక్కువవాడుకలో యున్నవి

## రాయి అండు కంపెనీ.,

ప్రిన్‌సెస్‌రోడ్డు, బొంబాయి (పు. 46)

వీరు హోమియోపతి మందులును తదితరఔషధములను విక్రయించుచుందురు. వైద్యసంబంధమగు పుస్తకములను ప్రచురించి అమ్ముచుందురు. వీరు ప్రఖ్యాతిగాంచిన బలవర్ధకౌషధమగు "ఫాస్ఫో-అరా"ను తయారు చేయువారలు

## రామమోహన్ అండ్ కో.,

లింగిచెట్టివీధి, మద్రాసు (పు 1)

శ్రీయుత గురురావు దీనికి అధిపతులు. సంపూర్ణ యాత్రలకు ప్రత్యేకరైళ్లు నడుపుటకు మొట్టమొదట ప్రారంభించినట్టివారు వీరే. వీరిదివరలో కొన్ని పర్యాయములు హిందూదేశమంతటను తిరిగివచ్చియున్నారు. వీరి యాత్రా స్పెషలుబండియందు ప్రయాణముచేసినవారు దీనిని వేనోళ్ల శ్లాఘించియున్నారు. మొత్తముమీద వీరికే యేర్పాటులందు యెక్కువ అనుభవము గలదు.

## రామానుజంచెట్టి, ఎన్. వి. అండ్ కో.,

౧౨, బ్రాడ్వే, మద్రాసు. (పు ౮౮)

మందుగుండు సామగ్రియందు వ్యాపారము చేయు కంపెనీలలో నొకటియై ప్రజలయాదరణబడసి యున్నది. వీరు ఎల్లప్పుడును మందుసామానులును, వేట కుపయోగించు వస్తువులను ఎక్కువగ స్టాకు కలిగియుందురు.

## రిలయన్సు ఎష్యూరెన్సుకంపెనీ, లిమిటెడ్.,

బెంగుళూరుసిటీ (పు 28)

ఈకంపెనీ, అజ్మీరులోని జనరల్ ఎష్యూరెన్సుకంపెనీ బెంగుళూరుశాఖకు కొంతకాలము మేనేజరుగ పనిచేసిన శ్రీయుత తిరుపతిగారి ప్రయత్నమువలన ౧౦ సంవత్సరముల పూర్వమే స్థాపింపబడినది. దీనియందునవీన భీమాపద్ధతులన్నియు గలవు అందులో నమ్మకమైనదియు, పాలసీదారుకు ఎక్కువ లాభకారియగు "రిలయన్సు మ్యూచివల్ బెనిఫిట్ స్కీము"ను వీరేర్పాటుచేసియున్నారు కొలది సంవత్సరములలోనే వీరు మంచిపనిని చేసియున్నారు వీరి మద్రాసు ఏజంట్లు మెసర్సు నీలకంఠన్ అండ్ కంపెనీ

## రేవల్ అండ్ కో.,

౮, సెకండులైన్‌బీచ్, మద్రాసు. (పు 12)

వీరు గొప్ప పారిశుధ్య యింజనీర్లును, శ్రేష్ఠమైన చలవరాళ్ల వ్యాపరస్థులునైయున్నారు రేవల్సు సిమెంటు పెంకులు ప్రత్యేకముగ చెప్పదగియున్నవి. మద్రాసునందుండు భాగ్యవంతుల గృహములకును, బొంబాయియందుండు వీరి హెడ్డాఫీసునకు వలయు పారిశుధ్యపు గొట్టములు వగయిరాలన్నియు వీరే ఏర్పాటు చేసియున్నారు మద్రాసు వీరి ముఖ్యబ్రాంచి

## విక్సన్ అండు కో., బ్రాడ్వే, మద్రాసు (పు 4)

దీని అధిపతులు శ్రీయుత సి. డి శేషాచలం మొదలియారగారు, లారెన్సు అండు మేయో లిమిటెడ్‌నందు, ఇ. బోర్నిన్ కంపెనీయందు చాలకాలమువర కుండి, చూచి అనుభవముగడించి, ౧౯౨౦ సం॥రమున స్వంతవ్యాపారమును యీపేరున ప్రారంభించిరి. నేత్రపరీక్షయందేమి, తగిన సులోచనముల నిచ్చుటయందేమి మిక్కిలి ప్రవీణులు.మరియు వీరి ధరలు చాలన్యాయమైనవి.

## లిమాయి బ్రదర్సు, లిమిటెడ్.,

౧-౧౮౩, బ్రాడ్వే, మదరాసు. (పు. 7)

ఇది, హిందూదేశమంతటను బ్రాంచీలు గలిగి, బొంబాయియందు హెడ్డాఫీసుయుండి, ప్రఖ్యాతిగాంచిన మైయర్సు పంపుల వ్యాపారమును చేయు సంస్థయై యున్నది. మద్రాసులో గత ౭ సం॥

లక్రితము బ్రాంచీని తెరచినప్పటినుండియు ప్రజాదరణ బడసి పని చేయుచున్నది వీరి ముఖ్యవ్యాపారము మైయర్సుచేతి, పవరు, స్ప్రేపంపులు, నీటికొళ్లాయిలు, సిలెండర్లు, స్టౌవర్ అయిల్ ఇంజన్లు, విండ్ మిల్లులు, సెంట్రిఫ్యూగల్ పంపులు వగైరాలై యున్నవి.

## రామస్వామిశాస్త్రులు, వావిళ్ల అండ్ సన్సు.,

ఎస్ప్లనేడ్, మదరాసు (పు. 17)

ఈకంపెనీ సుమారు ముప్పదిసంవత్సరములకు పూర్వమే కీ శే॥ వావిళ్ల రామస్వామిశాస్త్రులగారిచే స్థాపింపబడినది వీరు అనేక సుప్రసిద్ధ ఆంధ్ర, సంస్కృతగ్రంథముల ప్రచురించియున్నారు ఇది ప్రస్తుతము స్థాపకుల కొమారులగు వావిళ్ల. వెంకటేశ్వరశాస్త్రిగారిచే బహు చక్కగ నిర్వహింపబడుచున్నది వీరియొక్క సంపాదకత్వముక్రింద "త్రిలింగ" యను నొక తెలుగు వారపత్రికయు; "ఫెడరేటెడ్ ఇండియా" అను ఆంగ్లవారపత్రికయు ప్రచురించబడుచున్నవి వీరు ప్రథమములో తెలుగు గ్రంథముల ప్రచురణ నారంభించినవారలలో ముఖ్యులైయున్నారు

## వెంకటరమణయ్యగారు, డాక్టర్, జమ్మి

నెం. ౮ రు సాలైవీధి, మైలాపూరు, మద్రాసు (పు 70)

వీరు, మహావిఖ్యాతవైద్యులగు కీ॥ శే॥ వడ్లమాని సూర్యనారాయణశాస్త్రిగారు, మధ్వశ్రీ కాసూరి అణ్ణయాచార్యులవారి శిష్యులై వైద్యశాస్త్రము నభ్యసించియున్నారు అందున బాలరోగప్రకరణము నభిమానముగ గ్రహించి, అందు విశేషకృషిని, పరిశోధన సల్పిరి. నేటి కది ఫలించి దేశమందుండు వేలకొలది శిశువులను మృత్యువువాతబడనీయకుండ గాపాడుచున్నది.

భయంకరమగు లీవర్, స్ప్లీన్వ్యాధుల నిర్మూలించగలిగిన దివ్యౌషధము వేరొకటిలేదని అనేకమంది గొప్ప ఆంగ్ల, ఆయుర్వేద, యూనానీవైద్యశాస్త్రవేత్తలు తెలిపియున్నారు. వీరి స్వస్థానము విజయనగరము ప్రస్తుతము కొందరు దాక్షిణాత్యప్రముఖులాహ్వానించియుండుటచే మద్రాసుకువచ్చి నివాసమేర్పరచుకొని యిచ్చట నుండియే చికిత్సలను జరుపుచున్నారు వీరి చికిత్సయందలి గొప్ప సుగుణమేమనగా దూరముననుండువారలు సహితము ఉత్తరము వ్రాసినంతనే ఔషధమును, దానిని వాడవలసిన పద్ధతులతోసహా వ్రాసి వెంటనే పంపుచుందురు ఈరీతిగ వీరనేకులకు యిట్టి వ్యాధుల కుదుర్చుచున్నారు

ఇటీవల కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలోను, నిజాం రాష్ట్రములోను యీఔషధము నమ్ముటకుగాను బెజవాడ గవర్నరుపేట కాపురస్తులు భొగలకి సూర్యనారాయణగారిని వీరిప్రతినిధిగా నియమించియున్నారు.

## వెంకటేశ్వర ఆయుర్వేదనిలయం లిమిటెడ్.,

చింతలూరు, ఆలమూరుపోస్టు (పు. 23)

ఈ సంస్థ "వైద్యరాజ" ద్విభాష్యం వెంకటేశ్వర్లు, బుచ్చియ్యగార్లచే స్థాపింపబడినది. దీనియందు సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధములన్నియు శాస్త్రీయముగ తయారుచేయబడుచున్నవి వీరు "పుత్రవతీ హితోపదేశము" అను గ్రంథమును ప్రచురించియున్నారు.

## వెంకట్రామ్ అండ్ కో.,

ఏలూరు (పు. 10)

వీరు పాఠశాలలకు వలయు పుస్తకములకు ప్రచురణకర్తలై తదితరగ్రంథములనుగూడ అమ్ముచుందురు వీరి బ్రాంచీలు బెజవాడ తెనాలులయందు గలవు

## శక్తిసుధ కార్యాలయము

కుంభర్వాడా ౪ వ గల్లీ, బొంబాయి ౪ (పు 12)

ఈ వైద్యాలయమువారు మూలవ్యాధులు, చెముడు మున్నగు వాటికి ప్రత్యేక ఔషధముల తయారుచేయుదురు

## శ్రీపట్టాభిరామ వైద్యశాల.,

రాయవరము (తూర్పుగోదావరి) (పు. 66)

ఈవైద్యాలయము చాలకాలము క్రితము స్థాపించబడినది ఆంధ్రదేశమునందు సుప్రసిద్ధ ఆయుర్వేదఔషధముల తయారుచేసి అమ్మువారలలో వీరొకరై యున్నారు

## సి. సి. మహాజన్ అండ్ కో,

౨౪౧, జుమ్మామసజీద్, బొంబాయి (పు 36, 37)

వీరు పలువిధములైన సుగంధద్రవ్యముల నమ్ముచున్నారు అందు ముఖ్యముగ బాద్షాహి, డెపిలేటరీపౌడరు, ఓటోపుష్పాశయ, కామలత తిలనూనెల విక్రయించుచున్నారు ఇవిగాక యింకనెన్నియో వస్తువులుగూడ దొరకును.

## సోషియల్ ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

౧౩, ఎల్ఫిన్స్టన్ సర్కిల్, ఫోర్టు, బొంబాయి (పు. 36)

ఈ కంపెనీ ౧౯౨౯ సంవత్సరములో స్థాపింపబడినది. దీనియందలి ముఖ్య సుగుణము లేవనగా తక్కువ ప్రీమియములు, వైద్యపరీక్షలేకుండుటయే. మధ్యతరగతి ప్రజలకు చాల ఉపయోగకరముగ నున్నది.

## సౌత్ ఇండియా కెమికల్సు.,

నెం ౩, లజ్ చెర్చి రోడ్డు, మైలాపూరు, మద్రాసు. (పు. 15)

౧౯౧౯ సంవత్సరమునుండి వీరు పలువిధములైన ఆంగ్లేయ ఔషధముల నమ్మకటయందును, చికిత్సచేయుటయందును మిక్కిలి నేర్పరులై యున్నారు వీరు స్వంతముగ ప్రఖ్యాతిగాంచిన "కేశ వర్ధనీ" అను వెండ్రుకలూడి పోకుండుటకు మిక్కిలి ఉపయోగపడు ఔషధమును తయారు చేసియున్నారు.

## స్టాండర్డు బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్,

హెడ్డాఫీసు—౨౬౦, చైనాబజారురోడ్డు, మద్రాసు (పు. 43 b)

ఇది కేవలము హైందవసంస్థయై యున్నది. ఈబ్యాంకు కరెంటు, సేవింగ్సుబ్యాంకు, ఫిక్సెడ్ డిపాజిట్లను, మిక్కిలి అనుకూల మైనపద్ధతుల పైతీసికొనును. అన్నివిధములైన జనరల్ బ్యాంకింగ్ వ్యవహారములు జరుపును. బంగారువస్తువులు, ధాన్యము మొదలగు సరుకులపై సరసమైనవడ్డీలకు అప్పులివ్వబడును ఆక్షన్‌చీటిపద్ధతులు గలవు విజయనగరములో దీనిబ్రాంచి నొకదానిని స్థాపించియున్నారు

## స్టార్ ఆఫ్ ఇండియా ఇండస్ట్రియల్ అండ్ జనరల్ ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

౨౩, సెకండు లైన్ బీచ్, మద్రాసు (పు. 29)

ఇది పూర్తి హైందవసంస్థయై యున్నది కంపెనీ స్థాపితమై రెండు సంవత్సరములే యైనను, వివిధరకములైన ఇన్స్యూరెన్సు స్కీములు గలిగి బహు చక్కగా పనుల నిర్వహించుచున్నది. దీనియందలి డైరెక్టర్లు మంచి నేర్పరులును, అనుభవశాలురునై యున్నారు వీరు లక్షరూప్యములవరకు యిదివరకే క్లెయిముల సొమ్ము చెల్లించియున్నారు

## సీతారాఘవ వైద్యశాల, మైసూరు (పు. 30)

ఈ వైద్యశాల శ్రీయుత పాళ్యం వెంకటాచల పండితులగారిచే చిన్నసంస్థగ ప్రారంభించబడినది. ఇప్పుడిట్టి ఔన్నత్యస్థితికి వచ్చుటకు గారణము పండితులవారి చాకచక్యమే. "లోకామయహర కస్తూరి మాత్రలు" బాలుర కత్యంతోపయుక్తముగ నున్నవి. ఇవి మైసూరు నందేగాక దేశమంతట విరివిగ నమ్మబడుచున్నవి. శ్రీయుత వెంకటాచలపండితులు చాల అనుభవశాలులగు వైద్యులై యున్నారు.

## హాట్చిన్సు అండు కంపెనీ

బ్రాడ్వే, మద్రాసు. (పు 16)

ఈ కంపెనీ ౧౯౦౦ సం॥ రమునందు వేపేరిలో కీ॥ శే॥ ఎమ్. నాదమునినాయుడిగారిచే స్థాపించబడినది. ఖాతాదారుల కోరిక ననుసరించి బ్రాడ్వేలోకూడ నొక బ్రాంచిని ౫ సంవత్సరములకుపూర్వము స్థాపించియున్నారు నూతన రికార్డులు, గ్రామోఫోనుకు సంబంధించిన పరికరములు విరివిగా ఎల్లప్పుడును నిల్వచేయుదురు ప్రస్తుతము శ్రీయుత ఎమ్ అచ్యుతనాయుడుగారు కడుసమర్థతతో వ్యాపారము చేయుచున్నారు వీరు, కలకత్తాలోని "హిస్‌మాష్టర్సువాయిస్" గ్రామఫోన్‌కంపెనీ, లిమిటెడ్ తరపున ఏజంట్లుగ పనిచేయుచు, ఎల్లప్పుడును దక్షిణ, ఉత్తరహిందూదేశగాత్రముల రికార్డులను విరివిగ స్టాకు ఉంచుచున్నారు

## హిందూయువజనసంఘము, ఏలూరు. (పు. 66)

ఈ సంఘము ౨౫ సం॥ల కింద్రట స్థాపింపబడి, ౧౯౧౫ సం॥లో రిజిష్టరు చేయబడినది రా॥ బ॥ మోతే గంగరాజుగారు ఏబదివేల రూప్యముల విలువగలిగిన దివ్యభవనమును కట్టించి, ధర్మ మొసగిరి దీనికి ఆంగ్ల, ఆంధ్రదైనిక, వార, పక్ష, మాస, పత్రికలు షుమారు ౬౦ వచ్చుచున్నవి పదివేల పఠనీయగ్రంథములు గలవు. ప్రభుత్వము వారు సాలునకు రు ౪౦౦/- లు యిచ్చుచుండెడివారు. మునిసిపాలిటీవారు సాలునకు రు ౨౫౦/- యిచ్చి సహాయము చేయుచున్నారు. ప్రజల అందరికి మిక్కిలి అందుబాటులోనుండుటకు బజారులో బ్రాంచి నొకదానిని ఏర్పాటు చేసియున్నారు. దీని సభ్యత్వ రుసుము మాసమునకు ౦-౨-౦, ౦-౪-౦ లని రెండు తరగతులు గలవు. ధర్మకర్త సంఘమునకుసభాధ్యక్షులుగ మోతే గంగరాజుగారును, గౌరవ కార్యదర్శిగ మద్దుల వెంకటచినరాజుగారును, సంఘమునకు అధ్యక్షులుగ ది॥ బ॥ మోచర్ల రామచంద్రరావుగారును, ఉపాధ్యక్షులుగ మోతే నారాయణరావుగార్లును పనిచేయుచున్నారు. పై ట్రస్టీ లందరు కలసి యీసంస్థకు ఒకలక్షరూపాయలు మూలధనము సమకూర్చి శాశ్వతనిధిగ ఉంచ సంకల్పించియున్నారు గనుక ఆంధ్రదేశమందుండు ఉదార స్వభావు లందరును, తమకు తోచిన రీతిగ సహాయముచేసి, సంస్థను చిరస్థాయిగ యొనర్చెదరుగాక

## హబీబుల్లాసాహెబ్

పోస్టు బాక్సు నెం. ౪౩౧, బొంబాయి. (పు. 42)

వీరు బొంబాయిపట్టణనివాసులు. ప్రజలకు దుష్టగ్రహబాధల తొలగించుటకు "నవరోజ్" అను రక్ష నొకదానిని కనిపెట్టియుండిరి. దీని మూలమున వీరు చాలపెద్దవ్యాపారమును చేయుచున్నారు. చాల యోగ్యతాపత్రముల సంపాదంచిరి

## హిందూస్థాన్ కో ఆపరేటివ్ ఇన్స్యూరెన్సు సొసైటీ, లిమిటెడ్.,

౧౦౭, ఆర్మీనియన్ వీధి, మద్రాసు (పు. 27)

౧౯౦౭ సంవత్సరమున కలకత్తాలో స్థాపింపబడిన హైందవ కంపెనీయై యున్నది. ప్రస్తుతము దీని అధ్యక్షులు కుమార కార్‌టిక్

# భారత ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్, లాహోరు.

## స్థాపితము 1896 సం॥

అధ్యక్షులు—లాలా హరికిషన్‌లాల్, బి. ఏ., (కాన్‌టబ్) బారెట్లా

## ప్రత్యేక సౌకర్యములు.

స్త్రీల భీమా, తక్కువ ప్రేమియములు, ఎక్కువ లాభములు తేలికయైన పాలసీషరతులు, ధర్మభీమాలకు నూటికి 7½ తగ్గింపు మొదలగునవి.

ఈ గొప్ప భారత భీమాకంపెనీయొక్క వ్యవహార పరిమాణము, మితవ్యయము, అమోఘమైన కార్యనిర్వాహకత్వము, గవర్నమెంటువారి లెఖ్ఖల ఋజువులవల్లనే తేలుచున్నది గత లాభముల పంపకములో యావజ్జీవ భీమాపద్ధతికి 1000 కి సం॥నకు రు **25**/-చొ॥న జీవిత భీమాపద్ధతికి 1000 కి సం॥నకు రు **21**/-లు చొ॥ యివ్వబడెను.

అన్ని చోట్లను ఏజంట్లు కావలెను.

వివరములకు:—

ఆర్గనైజింగ్ ఇన్‌స్పెక్టర్లు,
డి. శాంతయ్య, సామర్లకోట,
ప్రభల వెంకట్రామయ్య, బెజవాడ.

P. KUPPUSWAMY IYER,
The Branch Manager
BHARAT INSURANCE Co, Ltd,
62/64 Rattan Bazzar.
MADRAS.

---

## నారీమణులకు ఒక సూచన

క్షూరవ్యాధులచే లేక కష్టప్రసవములచే లేక వేరువేరు కారణములచే రాలిపోవునట్టి తలవెంట్రుకలకు చికిత్స కేవల సుగంధతైలముల నుపయోగించుటవలన కానేరదు. అయితే ఔషధములచేతనే అట్టి చికిత్స చేయదగినది



**కేశవర్ధినీ**—ఇది సుగంధ తైలములలో గణించబడక మందుల గణనలలో గణింపబడును దీని నుపయోగించుటవల్ల రాలిపోయిన వెంట్రుకల స్థానమందు క్రొత్తగా వెంట్రుకలు పుట్టును. ఇది తలలోని చుండును పోగొట్టి బట్టతనమును ధ్వంసముచేసి ఉష్ణముచే పల్చబడుటను మాన్పి వెంట్రుకల మొదళ్లను దృఢపఱచి నిగనిగలాడు వెంట్రుకలను దట్టముగా కలుగజేయును.

నెలకు సరిపడు సీసా 1కి అ. 12, ప్యాకింగ్ తపాలుఖర్చు వేఱు.

సౌత్ ఇండియా కెమికల్సు,
లజ్, మైలాపూరు, మద్రాసు.

---

స్థాపితము 1917

## గణ్ బ్రదర్సు,

## తోపాల్ వర్క్సు, లక్నో.

**Gann Brothers, Topall Works, Lucknow.**

ఈదిగువ వస్తువులను భారతదేశమున సరఫరా చేయగలవారు వీరొక్కరే.

ఫౌంటెన్ పేనా శిరాబుడ్లకు కాంపోజిషన్ కార్కులు, బూట్ క్రీం బుడ్లు, మందులు, తలనూనెలు వగైరాలకు మేలురకము సీసాలు, అంజనములు, చూర్ణములు, పౌమేడ్లు, రంగుగుండలు, సింధూరము, నశ్యము మున్నగువాటికి కాంపోజిషన్ పెట్టెలు బుడ్లు కార్కులు వగైరాలు గలవు.

బ్రాంచీలు: కలకత్తా & బొంబాయి.

Branches:—Calcutta & Bombay.

చెరన్ మల్లిక్‌గారున్నూ, జనరల్ మేనేజరు మిస్టర్ నళిన్‌రంజన్ సర్కారు వీరు ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ చేంబర్సుకు ఉపాధ్యక్షులై యున్నారు హిందూదేశమందు చక్కగ నిర్వహింపబడుచున్న గొప్ప కంపెనీలలో నొకటియై హైందవ ఇన్సూరెన్సు వ్యాపారమం దగ్రస్థానము వహించియున్నది దీనియందు నవీన భీమా పద్ధతులన్నియు గలవు దీని ప్రీమియములు చాల తక్కువగ యుండి ఎక్కువలాభముల పంచగలిగియున్నది ఇటీవలనే మద్రాసులో మంచి వ్యాపారస్థలమందు నూతన భవనమును నిర్మించియున్నారు. మద్రాసు బ్రాంచి మేనేజరుగారగు పి రంగస్వామి అయ్యంగారు చాల నిపుణతతో పనిని నిర్వహించుచున్నారు దీని యొక్క బ్రాంచీలు, ఏజన్సీలు, ఇండియా యంతటను, బర్మా, సిలోన్, ఈరక్, బ్రిటిష్ ఆఫ్రికాలయందునుగూడ గలవు

## హెబెట్‌భాయ్ అబ్ దెఆలీ,

సెం. 15 రు, మిర్జావీధి, బొంబాయి 3 (పు 25)

వీరు "సింహము డెంటల్ క్రీమ్ "సింహము" టూత్ పౌడరు నకును ఏంజట్లుగనున్నారు మద్రాసులో వీరిసరుకుల స్టాకుయుంచు వారలు:—మెసర్సు ష్యామ్ అండ్ కో, ౮, బందరువీధి, జె. ఎమ్ షేత్, ౨౬౦ చైనాబజారు, ఏ బి. పరేఖ్, ౨౬౮, చైనాబజారు రోడ్డు

## ఆంధ్ర ఆయుర్వేద వైద్యశాల.,

౧౪౯, బ్రాడ్వే బ్రాంచి, మదరాసు. (పు. 54)

దీని ఏజంటుగారగు డాక్టర్ కోట జయరామనాయుడు గారు సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యులు. "డాక్టర్ కోట ) మందుల పెట్టె" చాల ప్రఖ్యాతి గాంచినది దీనియందు సామాన్యముగ వచ్చుచుండు వ్యాధు లన్నింటికిని ఉపయోగపడు ఔషధములు చాలకలవు. దూరప్రదేశముల నుండువారు సహితము రోగిలక్షణములను ఉత్తరము ద్వారా తెలిపిన వీరు సదరు వ్యాధికి తగిన ఔషధమును, అనుపానములు, పథ్యము వగయిరాలు వివరముగ వ్రాసి పంపుచుందురు. ఇట్లు చేసి వ్యాధులలోచాలభాగము నివారణచేయుచున్నారు. వీరిఔషధపు పెట్టెలను విక్రయించుటకు ఏజెంట్లు కావలెను

## ఆర్ష రసాయనశాల

ముక్త్యాల (కృష్ణాజిల్లా) (పు 32)

౧౯౨౫ సంవత్సరమున స్థాపింపబడినది. ఉదారగుణసంపన్నులును, విద్యారసికులును, ముక్త్యాల సంస్థానాదీశ్వరులును అగు శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్ర మౌళీశ్వరప్రసాద బహద్దరుగారు దీనిసంస్థాపకులు. శాస్త్రీయములును గుణకరములును అగు గొప్ప ఆయుర్వేదౌషధములు, ఆంధ్రదేశమునకు అందజేయుటకై ఈసంస్థను నెలకొల్పి, ఇతరత్ర లభించనటువంటిన్ని, సామాన్యులు చేయజాలనటువంటిన్ని, నమ్మకమైన ఔషధములను తయారుచేయించి ఆయుర్వేదమునకుగల ప్రఖ్యాతిని సార్థకముచేయుచున్నారు దీనితోపాటు ముక్త్యాల నగరమున ఉచిత వైద్యశాలనుగూడ నెలకొల్పి, తత్పరిసర ప్రదేశవాసులకుగూడ ఉచితవైద్యసహాయమును జేయుచున్నారు ఈరెండు సంస్థలకును సుప్రసిద్ధ భిషగ్వరులగు ఆయుర్వేదభూషణవేటూరి శంకరశాస్త్రిగారు ప్రధానులుగానుండి, వీని ప్రఖ్యాతికి కారకులగుచున్నారు. వంశపారంపర్యముగా వచ్చుచున్న వైద్యానుభవముతోగూడిన, దివ్యౌషధములచే ఈసంస్థ ఆంధ్రదేశమున అచిరకాలముననే ప్రఖ్యాతిని వహించినది.

## ఆనందబోధిని ఆఫీసు

మద్రాసు. (పు. 50)

ఈకార్యాలయస్థాపకులు సి. మునుస్వామిమొదలియారు గారు. వీరికి ద్రావిడ, ఆంధ్రభాషలందు ఎక్కువ అభిమానము గలదు. ఈ భాషలలో వీ రనేకనవలలను వ్రాసి ముద్రించియున్నారు. మరియు ద్రవిడ మాస, వారపత్రికలును, ఆంధ్ర మాసపత్రికను గూడ ప్రచురించుచున్నారు

## లక్ష్మీరత్తన్స లిమిటెడ్.,

తంబుశెట్టివీథి, మదరాసు, (పు. 45)

రాజధానియంతటికిని మొదటి భారతీయ సానిటరీ ఇంజనీయర్లు చలువరాళ్లతో నేలపరచుటయందు పేరుపొందినవారు.

## జాన్ డికిన్సన్ అండు కంపెనీ లిమిటెడ్

9, మెక్లీన్ స్ట్రీట్, మదరాసు (పు. 68)

అన్నివిధములయిన కాగితములు, అచ్చుసామానులు, ముద్రాయంత్రములను వీరు విక్రయించుచుందురు. వీరి హెడ్డాఫీసు మదరాసులోను, బొంబాయిలోను వీరికి బ్రాంచి ఆఫీసులు కలవు.

## సుందరగోపాలరావు, బొల్లాప్రగడ, డా.

రాజమండ్రి (పు 51)

ప్రకృతి చికిత్సనుగురించి యొక పుస్తకమును ప్రకటించిరి.

## ది ఇండస్ట్రియల్ అండు ప్రూడెన్షియల్ అష్యూరన్సు కంపెనీ లిమిటెడ్., బొంబాయి. (పు. 67)

లల్లూభాయి సామల్‌దాసుగారి యధ్యక్షతక్రింద ఈకంపెనీ ప్రారంభమైనది చతుర్భుజదాసు నారాయణదాసుగారు ఈకంపెనీకి మద్రాసులో ఏజంటు.

## సొరాబ్జీ షాపూర్జీ

ఏషియాటిక్ బిల్డింగ్సు, నికల్ రోడ్డు బలర్డు ఎస్టేటు, బొంబాయి (పు.51)

గొప్ప ఇంజనీయర్లు; మిషనుసామానుల వ్యాపారులు.

తా. క.—అవకాశము లేనందువలన నీ కడపటి కొన్ని సంస్థల నకారాదిగ నేరుపరచనందులకు విచారించుచున్నాము.

---



బందీ ప్రతాపరుద్రమహారాజు

మా దశ నీ వెఱుంగక పొలమారెఁ, దిస్సికవయ్య నీరిచే;- మాదిశఁ గావు, నీవలన మానదు; నీ పోరగాను; మన్మనో
నేదవి, ప్రాణదాత, విట వేఱులు నీకును నాకు నయ్యెఁ; సుం- దేది పయోనిధిఁ బురి చేఁగుము; వెండియుఁ గాంతువో మమున్?

చిత్రకారుడు:—శ్రీయుత సుసర్ల వెంకటరామయ్యగారు, పెనపూడి. (ప్రతాపరుద్రీయము, అం. ౩.)

# వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

తంతివిలాసము:— "వావిళ్ల" మదరాస్ } **292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.** { బ్రాంచీలు— బెజవాడ, రాజమండ్రి, విశాఖపట్నము.

## 60 సం॥ల దృగ్గణిత పంచాంగము.

మదరాసుగవర్నమెంటు నక్షత్రకార్యాలయ ప్రథమ సహాయజ్యోతిషసిద్ధాంతి శ్రీమాన్ కె రాఘవాచార్యులు, వీరి కుమారులు శ్రీ కె దొరసామిఅయ్యంగార్లచే గుణింపబడిన ప్రభవ మొదలు కడచినక్షయ సంవత్సరములవరకుఁ గల యఱువది సంవత్సరముల పంచాంగములను ఒక్కటే సంపుటముగా ముద్రించి గ్రంథరూపమున చక్కగ బ్రచురించినాము గడచిన సంవత్సరములందలి తిథివారాదినక్షత్రములును అవశ్యకములగు నితరవిషయములను సులభముగ దెలిసికొనవచ్చును

కాలికోబైండు ప్రతి 1 కి రూ **8-0-0.**

## క్రిమినల్ ప్రొసీజర్ కోడ్

1898 వ సం॥ పు నెం 5 రు ఆక్టు.

క్రిమినలుచర్యతో సంబంధించిన చట్టమును యేకీభవింప జేసి సవరించినదానికి పుట్టినశాసనము ఇప్పటివఱకు జరిగిన సవరణలతో నోట్సును, అన్నిహైకోర్టులలో తీర్మానింపబడ్డ కేసుల వివరములును ముద్రించినారము

ప్రతి 1-కి రూ **5-0-0.**

## ఇండియన్ పీనల్ కోడ్

అను ఇండియాదేశపు శిక్షాస్మృతి 1860 వ సం॥పు 45 వ ఆక్టు

ఇది పూర్తిగ సవరింపబడి మదరాస్, బొంబాయి, కలకత్తా, అలహాబాద్, వీక్లిరిపోర్ట్సు మొదలగు లారిపోర్టులును, వియర్సు (Weirs) క్రిమినల్ రూలింగులును, వివరణములును, నోట్సు (Notes) మొదలగు వివరమైన అర్థములును, ఆయా సెక్షన్లక్రింద చేర్చి ఇండెక్సులతో మంచి అచ్చయి యున్నది ఉద్యోగస్థుల కాక ఇతరులకును సదరు శిక్షాస్మృతి సంబంధమైన నేరములను తెలిసికొనుటకు చాల యుపయోగము

రూ. [illegible]-0.

## గ్రామమునసబు మణియగార్ల స్పెషల్ టెస్టు పరీక్షా ప్రశ్నోత్తరములు 2 భాగములు.

ధర రూ **1-8-0.**

## గ్రామోద్యోగస్థుల మాన్యుయల్

అనగా మునసబు, మణియగారు, కరణముల మాన్యుయల్ నూతన ముద్రితము క్రొత్తి హార్పు రూ **2.**

ఈబుక్కులు టెక్స్టుబుక్ కమిటీవారిచే అంగీకరింపఁబడినవి

## వావిళ్ల వాచకపుస్తకములు.

గ్రంథకర్త శ్రీజయంతి గంగన్నగారు, బి ఏ, యల్. టి, హెడ్మాస్టరు, శ్రీవీరేశలింగము హైస్కూలు, రాజమండ్రి

| | | | |
|---|---|---|---|
| 1 | మొదటి వాచకము | 0 | 3 |
| 2 | ,, పెద్దసైజు | 0 | 6 |
| 3 | రెండవవాచకము | 0 | 3 |
| 4 | మూడవవాచకము | 0 | 4 |
| 5 | నాల్గవవాచకము | 0 | 5 |
| 6 | ఐదవవాచకము | 0 | 6 |
| 7 | ఆఱవవాచకము | 0 | 6 |
| 8 | ఏడవవాచకము | 0 | 7 |
| 9 | ఎనిమిదవవాచకము | 0 | 7 |

## వావిళ్ల గణితములు.

గ్రంథకర్త శ్రీకంఠం కృష్ణరావుగారు, బి ఏ, యల్. టి బోర్డు హైస్కూలు, కందుకూరు – నెల్లూరు.

| | | | |
|---|---|---|---|
| 1 | శిశుగణితము, I భాగము, ౧-వ తరగతి | 0 | 5 |
| 2 | ,, II భాగము, ౨-వ తరగతి | 0 | 5 |
| 3 | ,, III భాగము, 3-వ తరగతి | 0 | 5 |
| 4 | సులభగణితము I భాగము, ౪-వ తరగతి | 0 | 8 |
| 5 | ,, II భాగము, ౫-వ తరగతి | 0 | 10 |

## నెపోలియన్ బొనపార్టి జీవితము.

గ్రంథకర్త శ్రీ కెసవరాజు నరసింగరావు పంతులుగారు.

ఆబ్బట్ మాతృకకు సరియైన భాషాంతరీకరణము మాతృకలోనిభావ గాంభీర్యపటుత్వ సరాళత్వాది సుగుణములు పరిపూర్ణముగ నేటతెలుగున అతిరసవంతముగ మృదుమధురశైలిని భాషాంతరీకరింపఁబడెను

ప్రథమ భాగము—300 పేజీలు
ద్వితీయభాగము—364 పేజీలు } వెల రూ **2-0-0.**

## భక్తిరస శతకసంపుటములు.

| | | | |
|---|---|---|---|
| ప్రథమసంపుటము | వెల రూ. | 2 | 0 |
| ద్వితీయసంపుటము | రూ | 2 | 0 |
| తృతీయసంపుటము | రూ | 2 | 0 |

## నీతిశతకసంపుటము. ప్రతి 1 కి రూ. 2-0-0.

| | | |
|---|---|---|
| ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము | 1 | 8 |
| ఆంధ్రకవిత్వ చరిత్రము బసవరాజు అప్పారావు విరచితము | 1 | 8 |

**త్రిలిఙ్గ** { రాజకీయ, మత, సాంఘిక, ఆర్థిక, పారిశ్రామిక, విషయములుగల వారపత్రిక చందా సం॥మునకు రూ. **2-8-0.**

శ్రీ శివాభ్యాం నమః

# ఆంగీరసనామ సంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో. శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్;
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం, నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.







ఈ పంచాంగము

శ్రీ వేదవేదాంగపారంగతులైన బ్ర॥ శ్రీ॥ నాగేశ్వరశాస్త్రిలవారి ద్వితీయపుత్రుడున్ను
కౌవ్వూరు కా॥ శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ విద్వాన్
పిడపర్తి సుబ్రహ్మణ్య సిద్ధాంతిగారి శిష్యుడున్ను అయిన

## కుప్పా విశ్వపతి శాస్త్రిగారిచే గుణియింపబడియె.


ఆంధ్రపత్రికా ముద్రాశాలయందు ముద్రితమైనది.


## స్వస్తిశ్రీ ఆంగీరస సంవత్సర ఫలితాంశము

ఈసంవత్సరమున చైత్రమాసమున నుష్ణాధిక్యము గలిగినను, కృష్ణపక్షమున ఖండవృష్టి గలిగి, వైశాఖమాసమున నెండలు మెండై పశ్చిమవాతారంభ మగును. జ్యేష్ఠశుక్లతృతీయయందే మృగశిరాప్రవేశ మైనను, సామాన్యముగ వర్షించును. ఆషాఢశ్రావణ మాసములయందు మధ్యవృష్టిన్ని, భాద్రపద, ఆశ్వయుజ, కార్తికమాసములయందు సస్యానుకూలవృష్టిన్ని గల్గును. అవయోగములు మెండగుటచే ఈసంవత్సరమున వర్షములు సామాన్యముగ నుండును. రాజు, మంత్రియు గూడ బుధుడే యగుటచే లోకమున చోరాగ్నిశస్త్రబాధలు మెండగును. ఇతరయోగముల బట్టి యుద్ధభయము గల్గును. గోధుమలు, వడ్లు; నువ్వులు, మినుములు, మొదలగు వల్లధాన్యములు; ఉలవలు బాగుగ ఫలించును. పచ్చభూములయందున్ను, నల్లభూములయందున్ను, పంటలు బాగుగ పండును. ధాన్యములకున్ను, కందులు మొదలగు అపరదినుసులకున్ను, నువ్వులు, నూనె, చెఱకు మొదలగు రసద్రవ్యములకున్ను ధర లధిక మగును. కర్పూరము, అగరు, మొదలగు సుగంధద్రవ్యములకున్ను, బంగారము, ముత్యములు, వస్త్రములు మొదలగు వాటికి గూడ ధరలు పెరుగును. పశుపాలకుడు బలరాము డగుటవలన, పశువృద్ధి యున్ననూ, స్థానసంరక్షకుడు పోతరా జగుటవలన పశుపీడయున్ను గలుగును. జ్యేష్ఠ బ ౬ ప్ర॥ ఆషాఢ శు ౧ ప॥ పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యమున్ను, శ్రావణ శు ౧౧ ప్ర॥ భాద్రపద శు ౧౧ ప్ర॥ పశ్చాదస్తమిత గురుమౌఢ్యమున్ను, ఫాల్గున బ ౧ ప్ర॥ ఆవత్సరాంతము ప్రాగస్తమిత శుక్రమౌఢ్యమున్ను, ఆషాఢ శు ౫ శనివారము గోదావరీ పుష్కరప్రవేశమున్ను, భాద్రపద శు ౧౫ చంద్రగ్రహణమున్ను గలిగి, సుమారు తొమ్మిది వీసముల పంటయున్ను, మూడుతూములవర్షమున్ను గలుగును.

స్వస్తి సర్వేషాం సమస్తసన్మంగళాని భవన్తు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## ఇష్టదేవతా ప్రార్థన:

శ్లో॥ వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే । యం నత్వా కృతకృత్యాస్స్యు స్తం నమామి గజాననం॥ అచింత్యా వ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే । సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః॥ బ్రహ్మాణ మీశాన హరీ సురేశ్వరం గ్రహాన్న వాప్యర్క-ముఖా న్మహాత్మనః । ఋషీ న్దినర్క్షాధిపతీ న్దివౌకసః పుణ్యాన్ప్రపద్యే శరణం ప్రతిక్షణమ్॥

## దైవజ్ఞ వంశావళిః

శ్లో॥ యస్మా మవర్ణాంచితకర్ణరంధ్రా । ఆంధ్రాభవంత్యుత్పలకీకృతాంగాః । యద్వంశజాస్సర్వదిగంతితాంత । భ్రాజద్యశశ్శాలిన ఏవ లోకే॥౧॥ అద్యాపిజీవేదితితూహ్యమానో । యస్మూలభూతః పురుషశ్చకాస్తి । కౌండిన్యగోత్రప్రథితోహి సోయం వర్వర్తి కుప్పాహ్వయ వంశమాలిః॥ ౨॥ తద్వంశజాతో నరసింహసూరిః । జ్యోతిర్విదామగ్రసరోఽనధాసీ । షడ్దర్శనీ సాగరపారదృశ్వా । రరాజ సద్రాజశిరోంచితాంఘ్రిః॥౩॥ సదాన్నదానేన హి సార్థయన్తీ । స్వీయాన్న పూర్ణాహ్వయమన్వహం సా । సమస్తకళ్యాణగుణాంబురాశి । ర్జాయాతదీయా పతిదేవతాభూత్ ॥౪॥ సా భర్తృపాదాంబుజసక్తచిత్తా । జనుస్సహప్రార్జిత పుణ్యపుంజాన్ । లోకోత్తర ప్రజ్ఞ మనస్తకీర్తిః । ప్రాసూత పుత్ర ద్వితయం చిరాయ॥౫॥ తత్రద్వయో జ్యేష్ఠసుతోఽతిధీరః। స్సిద్ధాంత విద్యాసుగురుర్గురూణామ్। వేదార్థవక్తృప్రథమోహిసైష।విద్వన్నుతో వేంకటకృష్ణసూరిః॥ ౬॥ తస్యానుజో భూన్మదనస్స్వరూపే । వాచస్పతి ర్వాచివిధిశ్చ వేదే । న్యాయేఽక్షపాదోఽహిపతిశ్చశాబ్దే । బభూవ నాగేశ్వరశాస్త్రినామా॥౭॥ కస్కోఽత్రభోస్సాంగ మధీతవేద । హ్యస్యగ్యతుల్యతామేత్వితి హూతిమాత్రే । భయాకుతే పండితరాట్సమాజే । యఃకాలటో పీరమలంచకార॥౮॥ తస్య ద్వితీయాభవ దద్వితీయా । సైషాన్న పూర్ణాహ్వయమాదధానా । స్మృత్వా తదీయాన్ భర్తృభక్తిం। గంగాపి భీతేశజటాసు లీనా॥౯॥ తస్యాసాతే వినయానుతా జ్యోతిష జ్యోతిషాత్తా । పుత్రౌ తౌ ద్వ్యాసుగుణనిచయౌ తత్రచైకోహిధీమాన్ । సుబ్రహ్మణ్యో లసదుడుకళో విశ్వపత్యాఖ్యయాన్య । స్తత్రాన్యోఽయం విరచయతి పంచాంగ మాకర్ణ్యతాం తత్॥ ౧౦॥

## సంవత్సరాది దివసకృత్యము

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్,
వస్త్రై రాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః.
విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్యచ,
సంవత్సరఫలం సమ్య క్ఛ్రుత్వా విప్రాన్ సమర్చయేత్.

## అబ్దత్రయ నిరూపణము

ఈ యాంధ్రదేశమున లోకవ్యవహారముకొఱకు, చాంద్రమానాబ్దము గ్రహించునది శేషాచలమునకు దక్షిణదేశమున సౌరమానాబ్దము గ్రహించునది. వింధ్యమున కుత్తర దేశమున బార్హస్పత్యమానాబ్దము గ్రహించునది. అంతటను, సురూదయాబ్దమును గ్రహించునది. చాంద్రమానము ననుసరించి ఈ సంవత్సరమునకు ఆంగీరస సంవత్సరమని పేరు. సౌరమానము ననుసరించి యీసంవత్సరమున చైత్ర శుక్ల ౬ పర్యంతము ప్రజోత్పత్తినామసంవత్సర మనియు, అటుపైని, సంవత్సరాంతము వఱకును ఆంగీరసనామసంవత్సర మనియు బార్హస్పత్యమానము ననుసరించి ఈ సంవత్సరమున జ్యేష్ఠ శు ౬ పర్యంతము స్వభానునామ సంవత్సర మనియు, అనంతరము సంవత్సరాంతము తారణనామసంవత్సర మనియు పేరు. సమస్తకల్యాణభాజనమై, సకలశ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కామ్య కర్మానుష్ఠాన క్రియాతంత్రజ్ఞానవ్యవహారహేతుభూతమైన

శ్రీ ఆంగీరససంవత్సరమునాటికి

| | |
|---|---|
| సృష్ట్యాదిగత సౌరాబ్దములు | ౧౯౫,౫౮,౮౫,౦౩౩ |
| కల్యాదిగతాబ్దములు | ౫౦౩౩ |
| శాలివాహనశకాబ్దములు | ౧౮౫౪ |
| ప్రభవాదిగతాబ్దములు | ౫ |
| హూణశకాబ్దములు | ౧౯౩౨-౩౩ |
| ఫసలీ | ౧౩౪౧-౪౨ |
| హిజిరీ | ౧౩౪౨ |

అగుచున్నవి.

ఈ ఆంగీరస సంవత్సరము నాటికి సౌరసిద్ధాంతము ననుసరించి సృష్టికర్తయగు బ్రహ్మయొక్క. పరమాయువ్యమున సగము గతించెను. రెండవసగములో మొదటిసంవత్సరమున మొదటిమాసమున మొదటిపక్షమున మొదటిదినమున పగలు ౧౩ గడియల ౪౨ విఘటికలు గడచినవి.

## సంవత్సరముల ఫలములు

### చాంద్రమానాబ్ద ఫలము

శ్లో. అతిథి స్వజనై స్సార్ధ మన్నం బో భుజ్యతే మధు,
పేపీయతే కామినీభి రంగిరోబ్దే నిరంతరమ్.

### గ్రంథాంతరమందు

అన్నం బో భుజ్యతే శశ్వత్ స్వజనాతిథిభిస్సహ,
అంగిరోబ్దేఽఖిలా లోకా భూపాస్స్యుః కలహోత్సుకాః.

అనగా ఈ సంవత్సరమున జనులు స్వజనులతోను అతిథిజనులతోను భోజనపానీయములు పుష్కలముగా కలిగియుందురు. రాజులు యుద్ధాసక్తు లగుదురు.

### సౌరమానాబ్ద ఫలము

శ్లో. క్లేశైః క్వచిన్న పేక్ష్యన్తే స్వజనానా మనామయైః,
ఏవం వై మోదతే లోకాః ప్రజాపతిశరద్యుతః

జనులు ఆరోగ్యముగలవారై తమస్వీయుల కించుకైన కష్టముల నపేక్షింపక సంతోషముగా నుందురు. ఈ ఫలము ఈ సంవత్సరమున చైత్ర శుక్ల షష్ఠిపర్యంతము జరుగును. అనంతరము సంవత్సరాంతము వఱకు, పైన చెప్పినచాంద్రమానఫలమే నడచును.

### బార్హస్పత్యమానాబ్ద ఫలము

శ్లో. నందంతీహ జనాస్సర్వే భూమి ర్భూరిఫలాన్వితా,
సుభానువత్సరే భూమి ర్భీమభూపాలవిగ్రహః.

భూమి మంచిపంటతో కూడియుండును. గొప్పప్రభువులు యుద్ధాసక్తు లగుదురు. ఈఫలము ఈ సంవత్సరము జ్యేష్ఠ శుక్ల ఒ వఱకు నడచును. అనంతరము వత్సరాంతము వఱకును తారణనామ సంవత్సరమునకు ఫలము.

శ్లో. ప్రతర స్త్వ్యడుపోపాయై స్సరితో ఒర్థాయ సన్తతమ్,
తారణాబ్దే స్వతులితా అర్థవన్తో హి జన్తవః.

జనులు ద్రవ్యాసక్తులై ఓడవర్తకమునందు నిమగ్నులగుదురు.

### గురూదయాబ్ద ఫలము

శ్లో ఫాల్గునాబ్దే చోరభీతిః స్త్రీణాం సౌభాగ్యదా భృశమ్,
క్వచి ద్వృష్టిః క్వచి త్సస్యం క్వచి దీతిః క్వచి త్సుఖమ్.

ఫాల్గునాబ్దమున చోరభయము గల్గును. స్త్రీలు సౌభాగ్యవంతులగుదురు. స్వల్పమైన వర్షమున్నూ, సస్యమున్నూ, ఈతిబాధలున్నూ గల్గును.

### రాజు మొదలైన పరిపాలకవర్గము, తత్ఫలము

#### రాజు-బుధుడు

శ్లో. బుధస్య రాజ్ఞో ధనధాన్యసంకులం
మహీతలం వృష్టి రనుత్తమాచ,
జనా వివాహోత్సవయజ్ఞకాంక్షిణ
స్సుభిక్ష మస్మిన్ బహువాతవృష్టిః.

రాజు బుధుడగుటవలన మంచివర్షము గలిగి భూమి ధనధాన్యములతో తులతూగుచుండును. జనులు, వివాహోత్సవ యజ్ఞాదిసత్కార్యాసక్తులై యుందురు వాయుసహితమైన వృష్టి గలిగి సుభిక్షముగ నుండును. ఈఫలము పాంచాల, సౌరాష్ట్ర, విదర్భ దేశములయందు అధికముగ ప్రవర్తించును.

#### మంత్రి-బుధుడు

శ్లో. బుధే ప్రధానే కమలేక్షుదుగ్ధ
గోధూమసమ్పత్ప్రచురా చ వృష్టిః,
కీలాలధాన్యాని పచేళిమాని
నరేశ్వరాణా మపి కోశవృద్ధిః.

బుధుడు మంత్రి యగుటచేత కమలములు, చెఱకు, పాడి, గోధుమలు, మెట్టధాన్యములు, పల్లపుధాన్యములు సమృద్ధిగ నుండును. మంచివర్షము కురియును. రాజులకు ధనాభివృద్ధి యగును. ఈఫలము పౌండ్ర, కళింగదేశములయందు వర్తించును.

#### రాజు, మంత్రి ఒక్కడే యగుటచే కలుగుఫలము

శ్లో. స్వయం రాజా స్వయం మంత్రీ యస్మిన్నబ్దే యదా భవేత్,
చోరాగ్నిశస్త్రబాధాభిః పీడ్యంతే భూభుజాదయః.

రాజు, మంత్రి ఒక్కడే యైన సంవత్సరమున ప్రభువులున్నూ ప్రజలున్నూ చోరాగ్నిశస్త్రములచే పీడింపబడుదురు.

#### సేనాధిపతి-కుజుడు

శ్లో. అతజ్వ పీడా భువి సస్యనాశో
లోకా స్సమస్తా జ్వలితా భవన్తి,
అత్యన్తయుద్ధం ధరణీశ్వరాణాం
కుజే న సేనాధిపతౌ ధరిత్ర్యామ్.

#### గ్రంథాంతరమందు

శ్లో. వనేఒగ్నిబాధా గ్రామేచ దుఃఖితా శ్చాఖిలా జనాః,
అత్యన్తయుద్ధం భూపానాం భౌమే సేనాధిపే సతి.

కుజుడు సేనాధిపతి యగుటవలన సస్యనాశమున్నూ రోగాగ్నిబాధలున్నూ హెండగును. రాజులకు యుద్ధము వచ్చును. ఈఫలము సర్వదేశములందును వర్తించును

#### సస్యాధిపతి-శని

శ్లో. తిలమాషకుళుత్థాదికృష్ణధాన్యాని యానిచ,
కృష్ణభూమిస్తు ఫలితా మందే సస్యాధిపే సతి.

#### గ్రంథాంతరమందు

శ్లో. మధ్యమసస్యం క్షితితల మినతనయే సస్యపేచ రాజభయమ్,
కోద్రవకుళుత్థచణకై ర్మాషైర్ముద్గైశ్చ విపులతరమ్.

నువ్వులు, మినుములు మొదలగు నల్లధాన్యములున్నూ, సెనగలు, కొఱ్ఱలు, ఉలవలు మొదలగు అపరధాన్యములున్నూ నల్లభూములయందు బాగుగ ఫలించును. మొత్తముమీద పంట మధ్యమముగ నుండును. రాజులవలన ప్రజలకు భయము గలుగును. ఈఫలము ఘూర్జర యవనదేశములయం దెక్కువగ వర్తించును

### ధాన్యాధిపతి-గురుడు

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం సర్వసస్య సమృద్ధయః,
భవన్తి గావ స్సుదుఘా గురౌ ధాన్యాధిపే సతి.

గురుడు ధాన్యాధిపతి యగుటవలన సర్వదేశములయందు సువృష్టిన్నీ సస్యసమృద్ధిన్నీ గలుగును. పశువులు క్షీరప్రదములై యుండును.

### అర్ఘాధిపతి-కుజుడు

శ్లో. భౌమే చార్ఘపతౌ స్వల్పవృష్టి ర్వాయుసమన్వితా,
క్వచిద్వృష్టిః క్వచి ద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్క్వచిత్.

కుజుడు ధరల కధిపతి యగుటవలన వాయుసహితమైన స్వల్పవృష్టి గలుగును. ప్రజారోగ్యమున్నూ పంటయు సామాన్యముగ నుండును. ఇయ్యది అన్ని దేశములకును వర్తించును.

### మేఘాధిపతి-కుజుడు

శ్లో. అతివాయు రనర్ఘంచ స్వల్పవర్షం తథా భువి,
రక్తసస్యాని జాయంతే భౌమే మేఘాధిపే సతి.

కుజుడు మేఘాధిపతి యగుటవలన అతివాయువుతోగూడిన స్వల్పవర్షమున్నూ ధరలు తగ్గుటయున్నూ, ఎఱ్ఱధాన్యముయొక్క అభివృద్ధిన్నీ గలుగును. ఈఫలము ఆంధ్రదేశమునకు ఎక్కువగ వర్తించును.

### రసాధిపతి-చంద్రుడు

శ్లో. తిలతైల గుడక్షౌద్రం పయశ్చ దధిశర్కరాః,
అర్ఘవృద్ధిః ప్రజాయన్తే చంద్రే యది రసాధిపే.

చంద్రుడు రసాధిపతి యగుటవలన నువ్వులు, నూనె, బెల్లము, తేనె, పాలు, పెరుగు, పంచదార మొదలగువాట్లకు ధరలు పెరుగును. ఈఫలము కొంకణమాగధదేశములయం దెక్కువగ వర్తించును.

### నీరసాధిపతి-శుక్రుడు

శ్లో. కర్పూరాగరుగంధానాం హేమమౌక్తికవాససామ్,
వృద్ధయోఽర్ఘేణ జాయన్తే శుక్రే నీరసనాయకే.

నీరసాధిపతి శుక్రు డగుటచేత కర్పూరము, అగరు మొదలగు సుగంధద్రవ్యములకును, బంగారము, ముత్యములు, వస్త్రములు మొదలగువానికిన్నీ ధర లధిక మగును. ఈఫలము మాళవదేశమునం దెక్కువగ వర్తించును.

### పురోహితుడు-శుక్రుడు

శ్లో. సర్వసస్య సమృద్ధిస్స్యా న్నీతియుక్తా నరాధిపాః,
నిత్యోత్సవరతా విప్రా శ్శుక్రే యది పురోహితే.

పురోహితుడు శుక్రు డగుటవలన అన్నిసస్యములును సమృద్ధిగ నుండును. రాజులు నీతియుక్తులై యుందురు. బ్రాహ్మణులు నిత్యోత్సవవ్రతు లగుదురు.

### పరీక్షకుడు-శుక్రుడు

శ్లో. వర్ధంతే శాకధాన్యాని ఫలితా వృక్షజాతయః,
బహుక్షీరప్రదా గావో భార్గవే తు పరీక్షకే.

పరీక్షకుడు శుక్రు డగుటవలన వడ్లు మొదలగు ముల్లుగల ధాన్యములును వృక్షజాతులును బాగుగ ఫలించును. పశువులు క్షీరప్రదములై యుండును.

### గణకుడు-శని

శ్లో. మందే తు గణకే లోకే గణకా మందబుద్ధయః,
తిలమాషకులుత్థాని ఫలితాని భవన్తిచ.

గణకుడు శని యగుటచే జ్యోతిష్కులు బుద్ధిమాంద్యము గలవారగుదురు. నువ్వులు, మినుములు, ఉలవలు బాగుగ ఫలించును.

### గ్రామపాలకుడు-కుజుడు

శ్లో. గ్రామాణాం పాలకే భౌమే గ్రామాస్స్యు ర్వహ్నిపీడితాః,
క్షుచ్ఛస్త్రవృష్టిజనితా పీడా స్యాత్ప్రచురా భువి.

గ్రామపాలకుడు అంగారకు డగుటచే గ్రామములకు అగ్నిభయము గలుగును. జనులు ఆకలిచేతను వర్షముచేతను శస్త్రభయముచేతను పీడింపబడుదురు.

### దైవజ్ఞుడు-చంద్రుడు

శ్లో. జలధాన్యసమృద్ధిశ్చ ఫలితా వృక్షజాతయః,
నానాధాన్యసమృద్ధిస్స్యా ద్దైవజ్ఞే నిశినాయకే.

దైవజ్ఞుడు చంద్రు డగుటవలన వృక్షజాతులున్నూ, సమస్తమైన ధాన్యములున్నూ బాగుగ ఫలించును.

### పశుపాలకుడు-బలరాముడు

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం సర్వసస్య సమృద్ధయః,
మధ్యదేశే మహావర్షం రామే తు పశునాయకే.

బలరాముడు పశునాయకు డగుటవలన సర్వదేశములయందు మంచివర్షమున్నూ, ఎల్లపంటలయొక్క అభివృద్ధిన్నీ గలుగును. మధ్యదేశమునందు మంచివర్షము గలుగును.

### స్థానసంరక్షకుడు-పోతరాజు

శ్లో. పోతరాజః పశూన్ హంతి.

పోతరాజు పశువులను జంపును.

ఈ పురోహితాదిఫలములు అన్నిదేశములయందును నడచును.

## మేఘము - వర్షము

ఈ ఆంగీరససంవత్సరమున తమోనామక మేఘము మేరువునకు పశ్చిమదిక్కున పుట్టుచున్నది.

శ్లో. మహావర్షం మహాఘోరం గర్జితం మేఘమండలమ్,
ఏకార్ణవం తమోమేఘ స్సాగరాంతం ప్రవర్షతి

ఈ సంవత్సరము తమోనామక మేఘము గలుగుటచే సముద్ర పర్యంతము మేఘమండల మంతయు ఘోరమగు ఉరుములతో నిండి నదై మహావర్షములు కురియును.

## వర్షము - మూడుతూములు

### ఆఢక ప్రమాణము

శ్లో. షష్టియోజనవిస్తీర్ణం శతయోజన మున్నతమ్,
ఆఢకస్య ప్రమాణన్తు దేవమానేన గణ్యతే.

శ్లో. అష్టభాగాస్సముద్రేషు పర్వతేషుచ పంచచ,
ధరణ్యాంసప్తథా ప్రోక్తా స్త్వేవం వర్షతి చ త్రిధా.

ఎనిమిదిపాళ్లు సముద్రమందును, పర్వతములయం దైదుపాళ్లును, భూమియం దారుళ్నొక్కపాళ్లును వర్షించును.

### వర్షధాన్యాదుల వృద్ధిక్షయములు

వర్షం ౧౨; ధాన్యం ౧౨; శీతం ౧౬; తృణం ౬; ఉష్ణం ౧౩; మారుతం ౯; ప్రజావృద్ధి ౨; తన్నాశః ౧౭; రాజవిద్వరం ౧౭; ఉగ్రం ౧౧; పుణ్యం ౧౧; పాపం ౧౧; వ్యాధయః ౩; తచ్ఛాంతిః ౧౯; ఆచారం ౯; అనాచారం ౧౧; మరణాని ౧౩; జన్మాని ౧౯; దేశోపప్లవం ౬; దేశస్వాస్థ్యం ౧౬; చోరభయం ౩; తన్నాశః ౩; అగ్నిభయం ౩; తచ్ఛాంతిః ౬; మృగోపద్రవం ౯; మృగక్షయం ౩; కీటకభయం ౩; తన్నాశః ౧౧; మూషకవృద్ధిః ౧౬: తన్నాశః ౧౨; సర్పోత్పత్తిః ౧౯; తన్నాశః ౧౬; కామం ౯; లోభం ౧౩; మోహం ౧౩; మదం ౯; మాత్సర్యం ౧౯; సుఖం ౧౩; దుఃఖం ౯, భోగం ౧౧; విడంబం ౧౧, మనోవ్యథ ౯; ద్వేషం ౨; ప్రతిష్ఠ ౧౬, అప్రతిష్ఠ ౧౧, ద్యూతం ౩; మత్తత ౧౧; నరోత్పత్తిః ౧౯; స్త్రీజన్మోత్పత్తిః ౯; ధాతువాదం ౧౨; భయం ౩; శౌర్యం ౬; దుష్టనిగ్రహం ౧౧; శిష్టానాంపాలనం ౧౫; సత్యం ౧౯; అసత్యం ౨; విశ్వాసం ౬; అవిశ్వాసం ౯; దయ ౧౧; నిర్దయ ౧౩; న్యాయం ౧౨; అన్యాయం ౧౬; జ్ఞానం ౧; అజ్ఞానం ౧౧; కాపట్యం ౨; నిష్కాపట్యం ౯; ధర్మం ౧౬; అధర్మం ౧౬; గోమాయువృద్ధిః ౬; తన్నాశః ౪; కీటవృద్ధి ౪; నాశః ౧; శలభవృద్ధి ౧; నాశః ౬; మశకవృద్ధి ౬; నాశః ౧౦, మత్కుణవృద్ధి ౯; నాశః ౧; వృశ్చికోత్పత్తిః ౬, నాశః ౬; వ్యాఘ్రవృద్ధి ౪; నాశః ౪; పశ్వవృద్ధిః ౬; నాశః ౮; శుకవృద్ధి ౮; నాశః ౬; పికవృద్ధి ౧౬; నాశః ౬; కుక్కుటవృద్ధి ౧౬; నాశః ౧౬; పతత్రివృద్ధి ౩; నాశః ౨; ధేనువృద్ధి ౧; నాశః ౫; మహిషవృద్ధి ౧; నాశః ౩; మృగవృద్ధి ౩; నాశః ౬; ఛాగవృద్ధి ౩; నాశః ౬; అశ్వవృద్ధి ౬; నాశః ౨; గజవృద్ధి ౬; నాశః ౧; ఉష్ట్రవృ ౧; నాశః ౨; విప్రవృద్ధి ౧; నాశః ౪; క్షత్రియవృ ౬; నాశః ౫; శూద్రవృద్ధి ౧; నాశః ౩; మ్లేచ్ఛవృద్ధి ౪ నాశః ౪; సంకరవృద్ధిః ౩, నాశః ౧; వజ్రవృద్ధి ౩; వైడూర్యవృద్ధి ౨; గోమేధికవృద్ధి ౬; పుష్యరాగవృద్ధి ౩; విద్రుమవృద్ధి ౪; మరకతవృద్ధి ౨; మాణిక్యవృద్ధి ౨; నీలవృద్ధి ౨; ప్రవాళవృద్ధి ౨; సువర్ణవృద్ధి ౪; రజతవృద్ధి ౧౦; తామ్రవృద్ధి ౬; కాంస్యవృద్ధి ౮; లోహవృద్ధి ౬; అయోవృద్ధి ౧౭; త్రపువృద్ధి ౧౦; సీసవృద్ధి ౬; రసవృద్ధి ౬; వ్రీహివృద్ధి ౧౬; శాలివృద్ధి ౧౬; కులుత్థవృద్ధి ౪; తిలవృద్ధి ౧౦; మాషవృద్ధి ౮; ముద్గవృద్ధి ౮; సర్షపవృద్ధి ౧౬; చణకవృద్ధి ౬; ఆఢకవృద్ధి ౧౦; గోధూమవృద్ధి ౬; కోద్రవవృద్ధి ౧౦; ప్రియంగువృద్ధి ౧౦; యావనాళవృద్ధి ౪; శ్యామాకవృద్ధి ౬; రాజమాషవృద్ధి ౧౦; నీవారవృద్ధి ౪; శింబిధాన్యవృద్ధి ౧౦; అతివృష్టి ౧౫; అనావృష్టి ౧౨, స్వచక్రభయం ౬; పరచక్రభయం ౫; విద్యుత్ ౬; శిలాపాతం ౪; గర్జితం ౬; అండజాః ౧౩; స్వేదజాః ౯; ఉద్భిజ్జాః ౧౫; జరాయుజాః ౮; తృష్ణ ౨; నిద్ర ౨; ఆలస్యం ౧౭; ఉద్యోగం ౧౨; కాంతం ౬; క్రోధం ౬; డంబం ౫; మిత్రభేదం ౨; రసనివృత్తిః ౧౧; ఫలనివృత్తిః ౧౭; ఉత్సాహం ౬; ఇతర జీవరాశయః ౧౩.

## మేషసంక్రాంతి ఫలము

ఈసంవత్సరము చైత్ర శుక్ల ౬ భౌమవారమున ఆర్ద్రానక్షత్రమున ఉదయాది ౫౫ గడియలకు రవి మేషమునందు ప్రవేశించినందులకు ఫలము. మంగళవారము గనుక ధరలు తగ్గును. రాత్రియందు దగుటచేత సువృష్టి ప్రజారోగ్యము గలుగును. ఈఫలము ద్రవిడ, గౌడదేశములయం దధికముగ వర్తించును.

## ఆర్ద్రాప్రవేశ ఫలము

ఈ సంవత్సరమున జ్యేష్ఠకృష్ణ ౩ మంగళవారమున శ్రవణ నక్షత్ర వైధృతియోగభద్రవాకరణములందు ఉదయాది ౧౮, ౨౦ గడియలకు సూర్యుడార్ద్రయందు ప్రవేశించును.

| | |
|---|---|
| తిథిఫలము: | తదియయందు సుభిక్షము. |
| వారఫలము: | మంగళవారము గనుక వృష్టినాశనము. |
| నక్షత్రఫలము | శ్రవణనక్షత్రమున సస్యవృద్ధి. |
| యోగఫలము: | వైధృతియందు వృష్టినాశము. |
| కరణఫలము. | భద్రవాకరణమునందు వృష్టినాశనము. |
| కాలఫలము: | పగటియందు దగుటచే సస్యనాశనము. |
| | మధ్యాహ్నకాలమందు అల్పవృష్టి. |

భరణ్యాదిషణ్మండలఫలము. వృష్టినాశనము.

జ్యేష్ఠ శుక్ల ప్రతిపద్యుక్తభానువారఫలము వృష్టినాశనము.

ఆషాఢశుక్ల పంచమీయుక్తశుక్రవారఫలము. శుభము.

ఆషాఢశుక్ల నవమీయుక్తస్వాతీనక్షత్రఫలము మంచిగాలి వీచును.

ఆషాఢకృష్ణదశమీయుక్తరోహిణీఫలము సస్యవృద్ధి

ఈనాలుగుఫలములున్నూ చాంద్రమానమునందు ప్రశస్తము

## మకరసంక్రాంతి ఫలము

ఈసంవత్సరమున పుష్య బహుళ ౩ శుక్రవారమున తత్కాల ఆశ్లేషానక్షత్ర ప్రీతినామయోగ, గరజికరణములందు సూర్యోదయాది ఘ. ౩౧ వి. ౪౮ లకు సూర్యుడు మకరమున ప్రవేశించును.

## సంక్రాంతిపురుష లక్షణము

శ్లో. ద్విముఖం కృష్ణవర్ణంచ సురూపంచ త్రినేత్రకమ్,
సప్తబాహుం ద్విపాదంచ త్రిశీర్షం గజవాహనమ్,
సప్తాయుధధరం పూజ్యం రూపం సంక్రమణం స్మృతమ్,
అష్టవక్త్రో విశాలాక్షో లంబభ్రూర్దీర్ఘ నాసికః,
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశం స్మృతమ్,
ఏవంరూపం సువిజ్ఞేయం సంక్రాంతేః పురుషస్య తు.



ఈ సంక్రాంతి పురుషుడు మిశ్రనామధేయుడగుటచే పశువుల కరిష్టము. శంఖోదక స్నానము ఆరోగ్యము. నీల వస్త్ర ధారణము మహాభయము. లాక్షాగంధము యుద్ధము. జపాపుష్పధారణము యశోహాని గోమేధికాభరణము పశు నాశనము సీసపాత్రభక్షణము ఆరోగ్యము. పయఃపానము పశునాశనము. బదరీఫలభక్షణము శుభము. గజవాహనము రాజారిష్టము. కోదండాయుధము యుద్ధము. కాంచనచ్ఛత్రము సువర్ణనాశనము అస్త్రధారణము రోగభయము. ఆగ్నేయదిగ్యానం తద్దేశారిష్టము. విస్మయచేష్టా ప్రజావ్యాధి. నివిష్టావస్థ సస్యవృద్ధి

పక్షఫలము :—

శ్లో. కృష్ణపక్షే యదా పుష్యే మకరస్థే దివాకరే,
సువృష్టిః క్షేమ మారోగ్యం సుభిక్షం సస్యసంపదః

తిథిఫలము సుభిక్షము, వారఫలము అర్ఘవృద్ధి, నక్షత్రఫలము మ్లేచ్ఛసౌఖ్యము, లగ్నఫలము సువృష్టి, ముహూర్తఫలము రోగభయము, సంక్రాంతిపురుషుడు ధరించిన ద్రవ్యములు వృద్ధిప్రదములు కావు గనుక జనులు వానిని విసర్జించవలెను. సంక్రాంతిపురుషోత్పత్తికాలమున స్నానదానాదికము చేయవలెను.

## కుజచారము

శ్లో. దశమైకాదశే ఋక్షే ద్వాదశే వా ప్రతీపగే,
వక్ర మశ్రుముఖం తస్మిన్ సస్యవృష్టివినాశనమ్.

గ్రంథాంతరే

శ్లో. సింహే యదా ధనుషి మీనయుగే యువత్యాం
వక్రం కరోతి రవిజోఽథ ధరాసుతో వా,
పృథ్వీ తదా భవతి భూపతివిగ్రహైశ్చ
ఘోరా తురంగకృతధూళికృతాంధకారా

శ్లో. మహీసుతార్క పుత్రేజ్య వక్రిణ స్స్యాద్యదైవభే,
తదా రాజ్ఞాం భయం నృణాం వృష్టినాశో భవేద్ధ్రువమ్.

పై వచనమును బట్టి కుజచారమువలన లోకమున ప్రజలకున్నూ, ప్రభువులకున్నూ యుద్ధభయమున్నూ సస్యము వృష్టి నశించుటయున్నూ కలుగును.

## బుధచారము

| | |
|---|---|
| చైత్ర బ ౧ తూర్పున | ఉదయించును. |
| వైశా బ ౬ తూర్పున | అస్తమించును. |
| జ్యేష్ఠ బ ౧౦ పడమర | ఉదయించును. |
| ఆషాఢ బ ౧౪ పడమర | అస్తమించును |
| శ్రావణ బ ౧ తూర్పున | ఉదయించును. |
| భాద్రపద బ ౫ తూర్పున | అస్తమించును. |
| ఆశ్వయుజ బ ౭ పడమర | ఉదయించును. |
| కార్తిక బ ౧౦ పడమర | అస్తమించును. |
| మార్గశిర బ ౧౩ తూర్పున | ఉదయించును. |
| పుష్య శు ౧౫ తూర్పున | అస్తమించును |
| మాఘ బ ౩ పడమర | ఉదయించును |
| ఫాల్గున బ ౮ పడమర | అస్తమించును |

ఫలము :—

శ్లో. వైశాఖే శ్రావణే పౌషే ఽప్యాషాఢేఽభ్యుదితే బుధే,
జనానాం పాపఫలద ఇతరేషు శుభప్రదః.

వైశాఖ, శ్రావణ, పుష్య, ఆషాఢములయందు బుధు డుదయించిన, జనులకు పాపఫలప్రదు డగును. ఇతరమాసములయందు శుభుడు.

## గురుచార ఫలము

శ్లో. బృహస్పతౌ కర్కటరాశిసంస్థే
గావశ్చ మేఘాశ్చ పయోధరాస్స్యుః,
సస్యాభివృద్ధిశ్చ భవే ద్ధరిత్ర్యాం
సదా ద్విజాశ్చాధ్వరతత్పరాస్స్యుః.

గురుడు కర్కటగతుడై యుండగా ఆవులున్నూ, మేఘములున్నూ పయోవృద్ధి గలిగి యుండును భూమియందు సస్యము లభివృద్ధి గాంచును. ఈఫలము సంవత్సరాది మొదలు ఆషాఢ శు ౪ వఱకు నడచును.

తరువాత,

శ్లో. సింహరాశిగ తే జీవే నిస్స్వ భూసురసజ్జనాః,
అతివృష్టిర్వ్యాళభయం నృపా యుద్ధే లయం యయుః.

బృహస్పతి సింహమం దుండగా, అతివృష్టి, సర్పభయము, యుద్ధము గొటసించును. ఈఫలము ఆషాఢ శు ౫ మొదలు, పుష్య శు ౩ వఱకు నడచును.

శ్లో జీవే కన్యాగ తే పుష్టా వృష్టి స్స్వస్థాః క్షితీశ్వరాః,
మహోత్సుకాః క్షితిసురా స్స్వస్థాస్స్యు ర్నిఖిలా జనాః.

కన్యయందు గురు డుండగా ప్రభువులున్నూ ప్రజలున్నూ ఉత్సాహవంతులై సుఖముగ నుందురు. ఈఫలము పుష్య శు ౩ మొదలు బ ౮ వఱకు, అనంతరము సంవత్సరాంతమువఱకు గురుడు సింహరాశియందే యుండుటచే ఆఫలము వెనుక నే చెప్పబడియున్నది.

## గురువునకు రాశిత్రయసంచారఫలము

శ్లో. ఏకస్మిన్ వత్సరే జీవే రాశిత్రయ ముపాగతే,
తథా వసుంధరా కీర్ణా కుణపై స్సప్తకోటిభిః

ఒకసంవత్సరమునందు బృహస్పతి మూడురాసులలో సంచరించినయెడల ఈభూమి యేడుకోట్లశవములతో నిండును.

## శుక్రచారము

శ్లో. యామ్యాష్టకేఽంబుదద్వారం తత్రాస్తంగమితే సితే,
భూరివృష్టియుతా ధాత్రీ సస్యవృద్ధిః ప్రజాయతే.

శుక్రుడు ఆర్ద్రానక్షత్రమునందే ఉదయాస్తమయముల నొందుటచేత సువృష్టిన్నీ, సస్యవృద్ధిన్నీ కలుగును.

శ్లో. వాసవాశ్విభపర్యంతం కాంచనద్వార మీరితమ్,
తత్రాస్తమాగతే శుక్రే సస్యవృద్ధిః ప్రజాయతే.

శతతారానక్షత్రమునందు శుక్రాస్తమయ మగుటచే సస్యవృద్ధి యగును.

## శనిచారము

శ్లో. వైశ్వే చరన్నర్కపుత్రశ్చరన్ దశార్ణాన్ నిహంతి యవనాంశ్చ,
ఉజ్జయినీశబరాన్ పార్యాత్రికాన్ కుంతిభోజాంశ్చ.

ఈఫలము సంవత్సరాది మొదలు మార్గశిర బ ౧౩ వఱకు నడచును.

శ్లో శ్రవణే రాజాధికృత్యా విప్రాగ్ర్యభిషక్పురోహితకళింగాన్,

తరువాత సంవత్సరాంతము శ్రవణనక్షత్రమునందు శనియుండుటచే నీపైఫలము గిలుగును.

శని రెండునక్షత్రములయందు నడచుటకు ఫలము—

శ్లో. ద్విభగశ్చ మధ్యఫలదః.—ఫలము మధ్యమము.

మకరమందు శని యుండుటచే గలుగు ఫలము—

శ్లో వక్రస్థితే భానుసుతే ధరిత్ర్యాం స్యాదన్నవృద్ధిర్మహతీచవృష్టిః,
దశార్ణదేశా యవనాశ్చ నష్టాః పురోహితా విప్రభిషఙ్నృపాలాః.

ఈఫలము సంవత్సరాంతమువఱకు.

శ్లో కన్యానృయుగ్మో ఘటచాపసంస్థ
స్స్వక్షేత్ర సంస్థశ్చ శుభప్రదస్స్యాత్,
వంగాంగ కాశ్మీర కళింగ గౌడ
సౌరాష్ట్రదేశే ష్వశుభప్రదస్స్యాత్.

## శని వక్ర ఫలము

శ్లో. మందే వక్రగతే రాజ్ఞో యవనస్య వినాశనమ్.

## గురు శుక్రుల మౌఢ్యనిర్ణయము

ఈసంవత్సరమున జ్యేష్ఠ బ ౬ మొదలు ఆషాఢ శుక్ల ౧ వఱకు పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యము. ఫాల్గున బ ౧ మొదలు సంవత్సరాంతము ప్రాగస్తమిత శుక్రమౌఢ్యము శ్రావణ శు ౧౧ మొదలు భాద్రపద శుక్ల ౧౧ పర్యంతము పశ్చాదస్తమిత గురుమౌఢ్యమున్నూ గలదు

## పుష్కర నిర్ణయము

ఈసంవత్సరము ఆషాఢ శుక్ల ౫ శుక్రవారమున సర్వమనులకున్నూ గోదావరీపుష్కరప్రవేశము.

## గ్రహణ నిర్ణయము



ఈసంవత్సరమున భాద్రపద శుక్ల ౧౫ బుధవారమున తత్కాల పూర్వభాద్రానక్షత్రమున కుంభరాశియందు రాహుగ్రస్త చంద్రగ్రహణము, కృష్ణవర్ణము. ఆగ్నేయ స్పర్శము. వాయవ్యమోక్షము సుమారు ౧౫ వీసముల గ్రాసము. సూర్యాస్తమయాది

| | ఘ. | వి. | | ఘం. | ని. |
|---|---|---|---|---|---|
| స్పర్శకాలము | ౧౬ | ౩౩ | రాత్రి | ౧౨ | ౪౨ |
| మధ్యకాలము | ౨౦ | ౪౯ | | ౨ | ౨౪ |
| మోక్షకాలము | ౨౫ | ౩ | | ౪ | ౬ |
| ఆద్యంతపుణ్యకాలము | ౯ | ౩౦ | | ౩ | ౨౪ |

## గ్రహణమాసఫలము

శ్లో. కళింగవంగాన్ మగధాన్ సురాష్ట్రాన్ మ్లేచ్ఛా స్ససౌవీరా
న్ధ్రికకాశ్మీరాంశ్చ, స్త్రీణాంచ గర్భానసుఖాన్నిహన్తి సువృ
ష్టిక్ళద్భాద్రపదే౽భ్యుపేతః.

ఈ గ్రహణము పచ్చిననక్షత్రము, రాశిన్నీ, ఎవరికి జన్మనక్షత్రము, జన్మరాశి యగునో వారు విధ్యుక్తశాంతి జరుపవలెను.

అర్ధరాత్రానంతరమున గ్రహణము సంభవించినందున ప్రత్యాబ్దికాదుల కెట్టియభ్యంతరము లేదు. రాత్రి భోజనమును చేయకూడదు.

## కందాయఫలము

| అశ్వి | భ | కృ | రో | మృ | ఆర్ద్రి | పున | పుష్య | ఆశ్రే | మఖ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౫ | ౧ | ౩ | ౬ | ౧ | ౪ | ౮ | ౨ | ౫ | ౦ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ |

| పూఫ | ఉఫ | హ | చి | స్వా | వి | అనూ | జ్యే | మూ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౩ | ౬ | ౧ | ౪ | ౮ | ౨ | ౫ | ౦ | ౩ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ |

| పూషా | ఉషా | శ్ర | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౧ | ౪ | ౮ | ౨ | ౫ | ౧ | ౩ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ |

శ్లో. ఆదిశూన్యే మహావ్యాధి ర్మధ్యశూన్యే మనోవ్యథా,
అంత్యశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్.

శ్లో. విషమే వ్యర్థలాభ స్స్యాత్సమేతు సమతా భవేత్,
శూన్యే శూన్యత్వ మాప్నోతి కందాయఫల మీదృశమ్.

## ఆదాయవ్యయములు

| | ఆ. | వ్య. | | ఆ. | వ్య. |
|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ౫ | ౫ | ధనుర్మీనయోః | ౯ | ౧౧ |
| వృషభతులయోః | ౧౪ | ౧౧ | మకరకుంభయోః | ౧౧ | ౫ |
| మిథునకన్యయోః | ౨ | ౧౧ | | | |
| కటకస్య | ౧౧ | ౯ | సర్వాదాయః | | ౬౫ |
| సింహస్య | ౧౪ | ౨ | సర్వవ్యయః | | ౫౩ |

## రాజపూజ్యావమానములు

| | రా. | అ. | | రా. | అ. |
|---|---|---|---|---|---|
| మేష | ౩ | ౧ | తుల | ౮ | ౮ |
| వృష | ౬ | ౧ | వృశ్చిక | ౩ | ౩ |
| మిథున | ౨ | ౪ | ధను | ౬ | ౩ |
| కటక | ౫ | ౪ | మకర | ౨ | ౬ |
| సింహ | ౧ | ౮ | కుంభ | ౫ | ౬ |
| కన్య | ౪ | ౮ | మీన | ౧ | ౨ |

## సంవత్సర ఫలము

| | |
|---|---|
| అశ్వి, పుష్య, స్వాతి, అభిజిన్నక్షత్రాణాం | మనస్తాపః |
| భర, ఆశ్రే, విశా, శ్రవణానాం | రాజపూజ్యతా |
| కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠానాం | యుద్ధమ్ |
| రోహిణి, పూ. ఫ, జ్యేష్ఠ, శతతారాణాం | భూషణమ్ |
| మృగ, ఉ. ఫ, మూల, పూర్వభాద్రాణాం | రోగః |
| ఆర్ద్రా, హస్త, పూషా ఉత్తరాభాద్రాణా | మాయువ్యమ్ |
| పున, చిత్ర, ఉషా. రేవతీనాం | అర్థలాభః |

వర్ష యోగములు; తద్భంగములు :

## చైత్రమాసము

ఈమాసమున, రవ్యాదిగ్రహములు దహననాడియం దుండుటచేత క్రమముగా ఉష్ణాధిక్యము గలిగినను ఈ బ ౧౨ లకు అంగారకచలనాదియోగములవలన అచ్చటచ్చట వాయుసహితమైన వర్షము పడును.

## వైశాఖమాసము

ఈమాసమున గురుశనులు తప్ప తక్కినగ్రహము లన్నియు వాతాతివాతనాడులయం దుండుటచేత ఉష్ణాధిక్యము కలిగి పశ్చిమ వాతారంభ మగును. కాని పురశ్చక్రాదిదోషములవలన అచ్చటచ్చట స్వల్పవృష్టి గలుగును.

## జ్యేష్ఠమాసము-మృగశిర కార్తె

ఈ శుక్ల ౩ మొదలు బ ౩౦ వఱకున్నూ, ఈ కార్తెయందు సూర్యుడు స్త్రీపుంనక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించినను, మయూరవాహనారూఢు డగుటవలనను, పురశ్చక్రయోగము, అంగారకచలనము మొదలగు సుయోగములవలనను వాయుసహితమైన ఖండవృష్టి గలుగును.

## ఆర్ద్రికార్తె

ఈ బ ౩ మొదలు ఆషాఢ శు ౨ వరకునూ యీకార్తెయందు రవి స్త్రీపుంనక్షత్రయుక్తుడై నిర్జలరాశిని పొందినను, నరవాహనా



రూఢు డగుటచేతను బుధ శుక్ర సమాగమ శుక్రాస్తాది యోగములవల్లనూ గ్రహము లన్నియు సౌమ్యజలామృతనాడులయందు సంచరించుటచేతనున్నూ మధ్యమముగ వర్షించును.

### పునర్వసుకార్తె

ఆషాఢ శు ౨ మొదలు బ ౨ వరకు ఈకార్తెయందు రవియొక్క ప్రవేశము శ్రీ శ్రీ నక్షత్రములలో జంబుకవాహనారూఢుడై పాదజలరాశియం దుండుటచేతనూ రవ్యాదిగ్రహములు సౌమ్యజలామృతనాడులయందు సంచరించుటచేతనూ శుక్రోదయాదిసుయోగములవల్లను అప్పటప్పట వర్షించును.

### పుష్యమికార్తె

ఆషాఢ బ ౨ మొదలు బ ౩౦ వరకు ఈకార్తెయందు రవి శ్రీ పుంనక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతనున్నూ మూషకవాహనారూఢుడై బుధశుక్రులమధ్య రవి సంచరించుటచేతనున్నూ కడు స్వల్పవృష్టి కలుగును.

### ఆశ్లేషకార్తె

ఆషాఢ బ ౩౦ మొదలు శ్రావణ శు ౧౫ వరకు ఈకార్తెయందు రవి శ్రీ శ్రీ నక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతనున్నూ, ఇకరావయోగములవలననున్నూ అశ్వవాహనారూఢుడయినను గుర్వస్తమయాది సుయోగములవల్ల పర్వతములయందు మంచివర్షమున్నూ మధ్యదేశమున సామాన్యవృష్టిన్ని కలుగును.

### మఘకార్తె

శ్రావణ శు ౫ మొదలు బ ౧౮ వరకు ఈకార్తెయందు రవి శ్రీ పుంనక్షత్రయుక్తుడై నిర్జలరాశియుక్తుడైననూ, రవ్యాదిగ్రహములు జలామృతనాడులయందు సంచరించుటచేతనున్నూ రవి మయూరవాహనారూఢు డగుటచేతనున్నూ సామాన్యముగ వర్షించును.

### పుబ్బకార్తె

శ్రావణ బ ౧౮ మొదలు భాద్రపద శు ౧౩ వరకు ఈకార్తెయందు రవి శ్రీ శ్రీ నక్షత్రయుక్తుడై పాదజలరాశియందు ఐరావతవాహనారూఢుడై వర్తించుటచేతనున్నూ, గ్రహము లన్నియు మేఘామృతజలనాడులయందు సంచరించుటచేతనున్నూ సస్యానుకూల మైనసువృష్టి గల్గును.

### ఉత్తరకార్తె

భాద్రపద శు ౧౩ మొదలు బ ౧౧ వరకు ఈకార్తెయందు రవి నిర్జలరాశియందు ప్రవేశించినను, శ్రీ పుంనక్షత్రయుక్తుడై మండూకవాహనారూఢు డగుటచేతను గ్రహము లన్నియు సౌమ్యామృతనాడులయందు సంచరించుటచేత నల్లనిసస్యముల కనుకూలమైన సామాన్యవృష్టి గలుగును.

### హస్తకార్తె

భాద్రపద బ ౧౧ మొదలు ఆశ్వయుజ శు ౧౧ వరకు శ్రీ శ్రీ అర్ధజలరాశియుక్తుడై మూషకవాహనారూఢుడై వర్తించుటచేతనున్నూ గ్రహములు జలామృతనాడులయందు సంచరించుటచేతనున్నూ సామాన్యవృష్టి గలుగును.

### చిత్రకార్తె

ఆశ్వయుజ శు ౧౧ మొదలు బ ౯ వరకు ఈకార్తెయందు రవి శ్రీ పుంనక్షత్రయుక్తుడై పాదజలరాశియందు అశ్వవాహనారూఢుడై సంచరించుటచేత సామాన్యమైన సస్యానుకూలవృష్టిం గలుగును

### స్వాతికార్తె

ఆశ్వయుజ బ ౯ మొదలు కార్తిక శు ౯ వరకు శ్రీ శ్రీ నక్షత్రమందు నిర్జలరాశియుక్తుడై మేషవాహనారూఢుడై ప్రవేశించినను అంగారకచలనాదియోగములవలన సస్యానుకూలవృష్టి గలుగును.

### విశాఖకార్తె

కార్తిక శు ౯ మొదలు బ ౬ వరకును విశాఖకార్తెయందు స్వల్పవృష్టి అనంతరము దక్షిణదేశమున వృష్టి.

వ రా:—గ్రంథాంతరమున బహు అపయోగములు గలిగినచో సువృష్టి గలుగు నని చెప్పబడియున్నది.

---

## వర్ష విషయ కార్తెప్రవేశ వాహనఫలాదుల తెలిపెడు చక్రము

| మాసములు | తిథులు | వారము | కార్తె నక్షత్రములు | కార్తె ప్రవేశ ఘడియలు | స్త్రీ, పుం, నపుంసక నక్షత్రములు | పూర్ణ, అర్ధ పాద నిర్జల రాసులు | వాహనములు | ఫలములు | ఫార్సీ నెలలు | తేదీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చైత్ర | శు ౬ | మంగ | అశ్విని | ౫౫-౧ | స్త్రీ. పుం. | అర్ధ | మూషక | అనా | ఖుర్దాద్ | ౭ |
| ,, | బ ౬ | ,, | భరణి | ౩౬-౩ | పుం. పుం. | పాద | జంబుక | అనా | ,, | ౨౨ |
| వైశాఖ | శు ౫ | ,, | కృత్తిక | ౨౩-౪౪ | స్త్రీ. పుం. | నిర్జల | మయూర | పూర్ణ | తీర్ | ౫ |
| ,, | బ ౫ | ,, | రోహిణీ | ౧౮-౩౩ | పుం. పుం | ,, | గజ | పర్వత వృ. | ,, | ౧౯ |
| జ్యేష్ఠ | శు ౩ | ,, | మృగశిర | ౧౬-౧౭ | స్త్రీ. పుం | ,, | మయూర | పూర్ణ | అమర్దాద్ | ౪ |
| ,, | బ ౩ | ,, | ఆర్ద్ర | ౧౭-౫౦ | ,, | ,, | నర | మధ్యమ | ,, | ౧౬ |
| ఆషాఢ | శు ౨ | ,, | పునర్వసు | ౨౨-౫౮ | స్త్రీ స్త్రీ | పాద | జంబుక | అనా | ,, | ౩౦ |
| ,, | బ ౨ | ,, | పుష్యమి | ౨౬-౨ | స్త్రీ. పుం. | నిర్జల | మూషక | అల్ప | షహరేర్ | ౧౩ |
| ,, | బ ౩౦ | ,, | ఆశ్రేష | ౨౮-౮ | స్త్రీ స్త్రీ | ,, | అశ్వ | పర్వత వృ. | ,, | ౨౮ |
| శ్రావణ | శు ౧౫ | ,, | మఖ | ౨౩-౫౨ | ,, | ,, | మయూర | పూర్ణ | మెహర్ | ౧౦ |
| ,, | బ ౧౪ | ,, | పూ. ఫ. | ౧౪-౫౨ | ,, | పాద | నర | మధ్యమ | ,, | ౨౪ |
| భాద్రపద | శు ౧౩ | సోమ | ఉ. ఫ. | ౫౯-౧౯ | స్త్రీ. పుం. | నిర్జల | మండూక | పూర్ణ | ఆబాన్ | ౮ |
| ,, | బ ౧౧ | ,, | హస్త | ౩౮-౧ | స్త్రీ. స్త్రీ. | అర్ధ | మూషక | అల్ప | ,, | ౨౧ |
| ఆశ్వయుజ | శు ౧౧ | ,, | చిత్త | ౮-౩౭ | స్త్రీ. పుం. | పాద | అశ్వ | పర్వత | ఆజార్ | ౫ |
| ,, | బ ౯ | ఆది | స్వాతి | ౩౧-౨౭ | స్త్రీ. స్త్రీ. | నిర్జల | మేష | అనా | ,, | ౧౭ |
| కార్తిక | శు ౭ | శని | విశాఖ | ౪౯-౩ | పుం. నపుం. | ,, | నర | మధ్య | దయ | ౧ |
| ,, | బ ౬ | ,, | అనూ | ౧-౧ | స్త్రీ. నపుం. | పాద | అశ్వ | పర్వత | ,, | ౧౫ |
| మార్గశిర | శు ౫ | శుక్ర | జ్యేష్ఠ | ౭-౩౧ | పుం. నపుం. | పూర్ణ | మయూర | పూర్ణ | ,, | ౨౭ |
| ,, | బ ౨ | గురు | మూల | ౧౨-౩౯ | స్త్రీ. పుం. | అర్ధ | మహిష | ,, | బహమన్ | ౧౨ |
| పుష్య | శు ౧ | బుధ | పూ. షా. | ౧౪-౪౧ | పుం. పుం. | పూర్ణ | అశ్వ | పర్వత | ,, | ౨౫ |
| ,, | శు ౧౪ | మంగ | ఉ. షా. | ౧౬-౧౫ | స్త్రీ పుం. | నిర్జల | మేష | అనా | ఇస్పందియార్ | ౭ |
| ,, | బ ౧౨ | సోమ | శ్రవణ | ౧౯-౭ | పుం. పుం. | అర్ధ | మహిష | పూర్ణ | ,, | ౨౧ |
| మాఘ | శు ౧౦ | ఆది | ధనిష్ఠ | ౨౪-౪౯ | పుం. పుం. | పూర్ణ | అశ్వ | పర్వత | ఫర్వర్డీ | ౪ |
| ,, | బ ౭ | శని | శతభిషం | ౩౪-౨౬ | పుం. నపుం. | పూర్ణ | మేష | అనా | ,, | ౧౮ |
| ఫాల్గున | శు ౮ | శుక్ర | పూ. భా. | ౪౯-౩ | పుం. పుం. | నిర్జల | మహిష | పూర్ణ | ,, | ౩౦ |
| ,, | బ ౬ | ,, | ఉ భా. | ౯-౩౨ | పుం. నపుం. | అర్ధ | అశ్వ | పర్వత | అర్దీ బేహస్తు | ౧౩ |

## మాసఫలములు

### చైత్రమాసము

నువ్వులు, నూనె, చెఱకు, ఫలములు మొదలగువాట్లకున్నూ, గడ్డి, కలప, నార, పశువులకున్నూ ధరలు పెరుగును. ధాన్యాదులకు కొంచెము హెచ్చగును.

### వైశాఖమాసము

రాజులు కోపవంతులై యుందురు. లోకమున కలహములు గలుగును. ధాన్యముధర సామాన్యముగ నుండును. కలప, పగడములు, రత్నములు మొదలగువాట్లకున్నూ పశువులకున్నూ ధరలు పెరుగును. బంగారమునకు వెల సమముగ నుండును. వస్త్రములకు ధర పెరుగును.

### జ్యేష్ఠమాసము

ప్రత్తి, ధాన్యాదులు, వస్త్రములు, చందనము, కుంకుమ మొదలగువాట్లకు ధరలు హెచ్చును.

మరా: బృహస్పతి కర్కాటకమున చైత్రవైశాఖ జ్యేష్ఠమాసములలో నుండును గాన, రాజులకున్నూ ప్రజకున్నూ ధరలు పెరుగును.

### ఆషాఢమాసము

బృహస్పతి సింహమునందు ప్రవేశించినతర్వాత లోకమున వర్షములు బాగుగ పరియును. పంటలు బాగుగ పండును ధాన్యాదుల కప్పుడప్పుడు ధరలు పెరుగును. ధరలనిలుకడ లేదు. ప్రజలకు సుఖము తక్కువ.

### శ్రావణమాసము

బెల్లము, పంచదార, నూనె మొదలగు రసద్రవ్యములకున్నూ, రక్తవస్తువులకున్నూ ధరలు పెరుగును. ధాన్యాదులకు ధరలు సామాన్యముగ నుండును.

### భాద్రపదమాసము

కొబ్బరికాయలు, వంజిష్ఠ, చెఱకు, బెల్లము, నూనె మొదలగు సమస్తధాన్యములకున్నూ, గేదెలకు, మత్స్యములకు, కలపకుగూడ ధరలు పెరుగును.

### ఆశ్వయుజమాసము

ధాన్యములు, బంగారము, ఏనుగులు, పశువులు మొదలగువాట్లకు ధరలు పెరుగును. వర్షములు కురియును. లోకమున కలహములు పెరుగును.

### కార్తికమాసము

బంగారము, వెండి, రాగి మొదలగు లోహములకున్నూ, రక్తద్రవ్యములకున్నూ ఉన్నివస్తువులకున్నూ నారకున్నూ ధర పెరుగును. ధాన్యాదులకు ధరలు నిలిచియుండును. కాని వడ్లకు ధర పెరుగును. సస్యారిష్టము గలుగును.

### మార్గశిరమాసము

దూది వస్త్రములు, ఉన్ని, నార వైరాలు, నువ్వులు, నూనె, మొదలగు రసవస్తువులకున్నూ, ధాన్యాదులకు ధరలు పెరుగును. కలపకు ధర పెరుగును.

### పుష్యమాసము

నువ్వులు, నూనె, గోధుమలు మొదలగు అపరదినుసులకున్నూ ధరలు పెరుగును. క్రూరమృగములు నశించును. రాజులకు వైరము గలుగును.

### మాఘమాసము

ఉప్పు, నూనె, వైరాలకు ధర తగ్గును; ధాన్యాదులకు కలప, రాగి, బంగారము, రత్నములకు ధరలు పెరుగును.

### ఫాల్గునమాసము

ధాన్యాదులకు బాగుగ ధరలు పెరుగును.

### సుముహూర్తముల పట్టీ

చైత్ర శుక్ల ౧౦ శనివారము పగలు పఘాయుక్త మిథునము వివాహాదులకు శుభము.

చైత్ర బ ౧ గురువారము పగలు స్వాతీయుక్త మిథునము వివాహాదులకు శుభము.

చైత్ర బ ౪ ఆదివారము రాత్రి మూలాయుక్త వృశ్చికము వివాహాదులకు శుభము.

చైత్ర బ ౭ బుధవారము పగలు ఉత్తరాషాఢానక్షత్రయుక్తవృషభము వివాహాదులకు శుభము. (పక్షిదరహితము)

వైశాఖ శు ౭ గురువారము పగలు పుష్యమీయుక్తమిథునము ఉపనయనాదులకు శుభము అష్టమాధిపతి అష్టమమున నే యుండుట చేతను, గురుదృష్టివల్లను శుభము.

వైశాఖ శు ౧౦ ఆదివారము రాత్రి ఉత్తరాయుక్తమిథునము శుభజామిత్రవశముచే వివాహాదులకు శుభము.

జ్యేష్ఠ శు ౮ ఆదివారము రాత్రి ఉత్తరాయుక్తధనుస్సు వివాహ, గర్భాధానాదులకు శుభము. (రాజపంచకము)

జ్యేష్ఠ శు ౯ సోమవారము రాత్రి చిత్తాయుక్తధనుస్సు వివాహ, గర్భాధానాదులకు శుభము.

మాఘ శు ౨ శుక్రవారము పగలు ధనిష్ఠాయుక్తమీనము వివాహోపనయనాదులకు శుభము.

మాఘ శు ౭ బుధవారము పగలు అశ్వినీయుక్తమీనము వివాహోపనయనాదులకు శుభము.

మాఘ శు ౧౦ ఆదివారము పగలు రోహిణీయుక్తమీనము వివాహోపనయనాదులకు శుభము.

మాఘ శు ౧౫ శుక్రవారము రాత్రి మఘాయుక్తధనుస్సు వివాహాదులకు శుభము.

మాఘ బ ౫ బుధవారము పగలు చిత్రాయుక్తమేషము ఉపనయనాదులకు శుభము. రాత్రి స్వాతీయుక్తధనుస్సు వివాహాదులకు శుభము.

ఫాల్గున శు ౯ ఆదివారము పగలు మృగశిరాయుక్తమేషము వివాహాదులకు శుభము.

## ఉపాకర్మ నిర్ణయము

ఈసంవత్సరమున శ్రావణశుక్లపూర్ణిమయు శ్రవణనక్షత్రమున్ను మాఘ్యదూషితము లైనందున భాద్రపద శుక్ల ౧౫ బుధవారమున ఆపస్తంబులకున్ను త్రయోదశీసోమవారమున ధనిష్ఠానక్షత్రముతో గూడిన శ్రవణమందు ఆశ్వలాయనులకున్ను, శ్రావ. శుక్ల ౫ ఆదివారము రోజున వాజసనేయులకున్ను నవీనోపాకర్మ జరుపదగి యున్నది.

"శ్లో. మలమాసే నిపతితే సూతకే మృతకేఽథవా,
గ్రహణే సంక్రమే వాపి మాఘ్యేఽపి గురుశుక్రయోః.
ప్రోష్ఠపద్యాం మహాపాధ్యా ముపాకరణ మిష్యతే,
ప్రోష్ఠపద్యా ముపాకుర్యా చ్ఛ్రావణ్యాం దూషితేయది."

అని యుండుటచేత భాద్రపదమాసమున ఆపస్తంబాశ్వలాయనులకు నిర్ణయించడ మైనది. అదు ఆశ్వలాయనులకు,

"శ్లో. శ్రవణర్క్షేచ యత్కర్మ ఉత్తరాషాఢ సంయుతే,
సంవత్సరకృతాధ్యాయ స్తత్ క్షణాదేవ నశ్యతి.
ధనిష్ఠాసంయుతా కుర్యాత్ శ్రావణం కర్మ యద్భవేత్,
తత్కర్మ సఫలం కుర్యా దుపాకరణసంయుతమ్."

అని యుండుటచేత భాద్రపద శు ౧౩ సోమవారమున నిర్ణయించబడినది. అలాగుననే,

"శ్లో. ప్రకుర్యాచ్ఛ్రావణం కర్మ నోత్తరాఫల్గునీయుతే,
త్వాష్ట్రర్క్షసహితే కుర్యా ద్ధస్తర్క్షే సామపాఠకః."

అని యుండుటచేత శ్రావణ శు ౫ ఆదివారమున సామవేదులకున్ను,

"శ్లో. సంక్రాంతిర్గ్రహణం వాపి పౌర్ణమాస్యాం యదా భవేత్,
ఉపాకృతిస్తు పంచమ్యాం కార్యా వాజసనేయిభిః."

అని యుండుటచేత ఆశ్రావణ శు ౫ ఆదివారమునాడే వాజసనేయులకున్ను నిర్ణయించడ మైనది. భాద్రపద శు ౧౫ నాడు గ్రహణము అర్ధరాత్రాత్పరమందు సంభవించుటచే, ఆపస్తంబులు నవీనోపాకర్మ చేసికొనుట కెట్టిదోషమున్ను లేదు. అందుకు ప్రమాణము,

"శ్లో. అర్ధరాత్రా దధస్తాచ్చే త్సంక్రాంతి ర్గ్రహణం యది,
ఉపాకర్మ న కుర్వీత పరతశ్చే న్న దోషకృత్."


AMRUTANJAN
SOVEREIGN-REMED
MRUTAN

## శంకుస్థాపనాది ముహూర్తములకు శుభమైన తిథి వార నక్షత్రాదులు.

| ముహూర్తముల పేరు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషవిధులు |
|---|---|---|---|---|---|
| శంకుస్థాపనము | ౩-౫-౭-౧౧-౧౩ | బు-గు-శు | రో-మృ-హ-రే-అనూ-ఉ ఫ-పుష్య-శ్ర-పున-ధ-శ-అశ్వి-స్వా | వృ-కర్కా-కుం-మీ | చతుర్థశుద్ధి |
| గృహప్రవేశము | ౨-౩-౬-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ ఫ-స్వాతి-అనూ-శ్ర-ధ-శత | వృష-సింహ-వృశ్చి కుం-మీ-క-ధ-మి. | అష్టమ, ద్వాదశశుద్ధి |
| నిషేకము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉ ఫ-హ-స్వా-అనూ-మూల-ఉ షా-శ్ర-శత-ఉ భా | వృ-మి-కర్కా-సిం తు-ధను-కుం-మీన | లగ్నశుద్ధి |
| గర్భాధానము | ౨-౩-౬-౭-౧౦ | సో-బు-గు-శు | రో-ఉ ఫ-హ-స్వాతి-అనూ-ఉ షా-శ్రవ-శత-ఉ భా-ధని-మృగ | వృ-మి-క-సిం-తు-ధను-కుంభ | లగ్నశుద్ధి-సప్తమమందు పాపగ్రహములు లేకుండుట-పర్వవర్జము |
| పుంసవనము | ౨-౩-౫-౭-౧౦ ౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృగ-పున-పుష్య-ఉ ఫ-హ-చి-స్వా-అనూ-మూల-ఉ షా-శ్రవ-ధ-శత-ఉ భా-రే | మే-ధ-మి-మీ | నవమశుద్ధి-మూడవ మాసము |
| సీమంతము | ౨-౩-౫-౭-౧౦ ౧౩-౧౫ | ఆ-మం-గు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ ఫ-హ-చి-స్వా-అను-మూ-ఉ షా-శ్ర-ధ-శ-ఉ భా-రే | మే-ధ-మీ | ౪-౬-౮-మాసములు-నవమ శుద్ధి |
| జాతకర్మ | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | సో-బు-గు-శు | రో-ఉ భా-ఉ షా-స్వా-పున-శ్ర-ధని-శత-అశ్వి-హస్త-పుష్య-అనూ | వృష-తు-మి-క-ధ-మీన-కటక | అష్టమశుద్ధి |
| నామకరణము | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉ ఫ-ఉ షా-ఉ భా-స్వా-పున-శ్ర-ధ-శ-హస్త-పుష్య-అనూ | వృ-తు-మి-కన్యా-ధను-మీన-కటక | అష్టమశుద్ధి |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-ఉ ఫ-ఉ షా-ఉ భా-పున-హ-చి-స్వాతి-వి-అనూ | వృ-మి-కర్కా-కన్య-తు-ధను-మీ | ౧-౩-౫ మాసములు శుభము-అష్టమ శుద్ధి |
| అన్నప్రాశనము | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ ఫ-ఉ షా-ఉ భా-హ-చి-స్వా-అనూ-శ్ర-ధ-శత-రే | వృ-మి-కర్కా-క-తు-ధను-మీ | పురుషులకు-౬-౮-౧౦ మాసములు, స్త్రీలకు ౫-౭-౯-మాసములు, శుభము. దశమశుద్ధి,లగ్నమందు పాపగ్రహములు లేకుండుట |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పుష్య-హ-చి-స్వాతి-అనూ-శ్ర-ధ-శ-రే-ఆర్ద్ర-ఉ ఫ-ఉ షా-ఉ భా | వృ-మి-కర్కా-క-తు-ధ-మ | ౬-౮ మాసములయందు శుభము-అష్టమశుద్ధి |
| కేశఖండనము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-స్వా-శ్ర-ధ-శ-రేవతి | వృ-మి-కర్కా-క తు-ధ-మీ | ఉత్తరాయణం-పూర్వాహ్ణము |
| అక్షరస్వీకారము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-హ-చిత్త-అనూ-శ్ర-ధ-రేవతి | మే-కర్కా-తు-వ | ఉత్తరాయణం, ౫-వ సం॥ అష్టమశుద్ధి, సూర్యుడు చరస్థిరరాసులయం దుండగా |
| విద్యారంభము | ౨-౩-౫-౭-౧౦ ౧౨-౧౩ | ఆ-సో-బు-గు-శు | అశ్వి-మృ-ఆర్ద్ర-పున-పుష్య-ఆశ్లే-పూ ఫ-పూ షా-పూ భా-హ-చి-స్వా-అనూ మూల | మే-కర్కా-తు-వ | అనధ్యయనములను విడిచి పెట్టవలెను. శాస్త్రవిద్యాభ్యాసమునకు-ఆది-మంగళవారములు-శుభము |
| ఉపనయనము | ౨-౩-౫-౭-౧౦ | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ ఫ-ఉ షా-ఉ భా-హ-చి-స్వా శ్రవ-ధ-శత | పాపగ్రహములు కేంద్రమందు లేకుండ నుండు లగ్నము | అష్టమశుద్ధి-లగ్నమందు పాపగ్రహములు లేకుండుట-పూర్వాహ్ణము |

| | | | |
|---|---|---|---|
| 30 | ౧౪ | ౨౫ | శు॥ ప్ర॥ఆ౩౦-౧౦స్వా౬-౨౮ఆయు౩౨-౫౨కి౩-౭ది౧౯-౨౯త్యా౩-౪౩అహః౨౮-౪౪స్వా౩రవిః౧౦-౪౮ యాగ కాలఃకార్తికస్నానారంభఃగోక్రీడనంరక్తాంభు౨-౧౮చ౨౯ [ద్రోదయఃఉత్తరశృంగోన్నతిః భు౨-౨౯చ౩౦ |
| 31 | ౧౫ | ౨౬ | ద్వి॥సో౨౪-౮విశా౨-౧౭అనూ౫౫-౪౮సౌ౨౫-౦కౌ౨౪-౮ది౧-౩౫త్యా౩-౪౩ద్వితీయాతిథిః యమద్వితీయా చం |
| 1 | ౧౬ | ౨౭ | తృ॥మం౧౮-౧౪జ్యే౫౪-౬శో౧౭-౧౩గ౧౮-౧౪ది౧౧-౧౦తిథిద్వయంత్రిలోచనగౌరీవ్రతంజమాదీలవల్ భు౨-౩౯చ౧ |
| 2 | ౧౭ | ౨౮ | చ॥బు౧౨-౩౯మూ౫౦-౩౪అ౯-౪౨భ౧౨-౩౯రా౧౮-౧౦అహః౨౮-౩౮స్వా౪రవిః౩౦-౧౮పంచమీతిథిః సాగర మనవాళమహామునితిర్ భు౨-౫౦చ౨ |
| 3 | ౧౮ | ౨౯ | ప॥గు౭-౩౨పూషా౭-౩౮సు౨-౩౨ధృ౫౩-౭బా౭-౩౨ది౧౩-౨౨భు౩-౯చ౩ |
| 4 | ౧౯ | ౩౦ | ష॥శు౩-౬వీప్యం౫౬-౯ఉషా౪౫-౩౧శూ౪౯-౫౦తై౩-౬ది౬-౫౫త్యా౩-౫౨రా౨౬-౪౯సంక్రాం భు౩-౧౧చ౪ |
| 5 | ౨౦ | ౧ | స॥శ౫౬-౪౧శ్ర౪౪-౨౧గ౪౪-౪౦భ౨౭-౫౮రా౨౫-౫౨అహః౨౮-౩౦విశా౧౮రణేపుంపుంనక్షత్రేనిర్జలరాశౌరవిః ౪౯-౩గోష్టాష్టమీ అనధ్యాయఃపొయిఘయాళ్వార్ తిరుకువేళు౩-౨౧చ౫ [శవే భు౩-౩౨చ౬ |
| 6 | ౨౧ | ౨ | న॥ఆ౫౫-౧౭ధ౪౪-౧౭వృ౪౦-౨౪బా౨౫-౫౯త్యాజ్యాభావఃకృతయుగాదిఃవిష్ణుత్రిరాత్రివ్రతంపూధత్తాళ్వార్ తిరు |
| 7 | ౨౨ | ౩ | ద॥సో౫౫-౭శత౪౫-౨౫ధృ౩౭-౬తై౨౫-౨౪ది౨-౩౭శేయాళ్వార్ తిరుభు౩-౪౨చ౭ [వేదనిధితీర్థ భు౩-౫౩చ౮ |
| 8 | ౨౩ | ౪ | ఏ॥మం౫౬-౧౫పూభా౪౭-౪౭వ్యా౩౪-౪౬వ౨౫-౪౧ది౨-౩తులసీపద్మవ్రతం పర్వేషా మేకాదశీ భీష్మపంచకవ్రతం |
| 9 | ౨౪ | ౫ | ద్వా॥బు౫౮-౩౯ఉభా౫౧-౨౩హ౩౩-౨౫బ౨౭-౨౭ది౩-౧౩త్యా౪-౧౪అహః౨౯-౨౨విశా౨రవిః౭-౩౦ స్వా యంభువమన్వాదిః క్షీరాబ్ధి ౧౨ భు౪-౩౯ |
| 10 | ౨౫ | ౬ | త్ర॥గు౬౦-౦రే౫౬-౭వ౩౩-౦కౌ౩౦-౩౬ది౨౩-౪౫త్యా౪-౧౯భు౪-౧౪చ౧౦ |
| 11 | ౨౬ | ౭ | త్ర॥శు౨-౩౩అశ్వ౬౦-౦సి౩౩-౨౨తై౨-౩౩రా౨౨-౪౩వైకుంఠ౧౪అనధ్యయనశభు౪-౨౪చ౧౧ [భు౪-౩౫చ౧౨ |
| 12 | ౨౭ | ౮ | చ॥శ౭-౩అశ్వ౨-౦వ్య౩౪-౨౧వ౭-౩ది౨౮-౩౦అహః౨౮-౧౮విశా౩రవిః౨౫-౩౮మహాకార్తికి జ్వాలాతోరణం |
| 13 | ౨౮ | ౯ | పూ ○ ఆ౨౨-౧౨భ౮-౧౮వరీ౩౫-౩౯బ౧౨-౧౨రా౧౩-౧౯ప్రతిపత్తిథిఃదక్షసావర్ణికమన్వాదిఃఅన్వాభు౪-౪౬చ౧౩ |
| 14 | ౨౯ | ౧౦ | కృ॥ప్ర॥సో౧౭-౩౬కృ౧౪-౪౯ప౩౭-౨౯౧౭-౩౬రా౩౦-౫౦త్యా౪-౨౫ తూన్యతిథిః వేయాగఃభు౪-౫౬చ౧౪ |
| 15 | ౧ | ౧౧ | ద్వి॥మం౨౨-౪౪రో౨౧-౯శి౩౮-౯ గ ౨౨-౪౪ శేషః ౩-౨౭ రా౮-౧౯ అహః ౨౮-౧౨విశా౪వృశ్చికేరవిః౪౩-౩౧ద్వితీయాతిథిః పాదపద్మపుణ్య కాలః భు౫-౭చ౧౫ |
| 16 | ౨ | ౧౨ | తృ॥బు౨౭-౧౬మృ౨౬-౫౫సి౩౮-౪౪భ౨౭-౯౬రా౨౧-౩౦భు౦-౩చ౧౬ |
| 17 | ౩ | ౧౩ | చ॥గు౩౦-౫౪ఆర్ద్రా౩౧-౪౯సా౩౮-౩౪బా౩౦-౫౪ త్యాజ్యాభావః విద్యానిధితీర్థానాంపుణ్యదినం భు౦-౧౪చ౧౭ |
| 18 | ౪ | ౧౪ | ప॥శు౩౩-౩౪పున౩౫-౩౫శు౨౭-౩౧కౌ౨౯దిర్-౩౫రా౨౮-౨౪భు౦-౨౫చ౧౮ |
| 19 | ౫ | ౧౫ | ష॥శ౩౪-౧౧పుష్య౩౮-౧౧శుక్ల౭౫-౨౮గ౩-౪౪శేషః౦-౩౮అహః౨౮-౪అనూ౧చరణే స్త్రీనపుంసకనక్షత్రే పాద జలరాశౌరవిః౧-౧భు౦-౩౬చ౧౯ |
| 20 | ౬ | ౧౬ | స॥ఆ౩౪-౩౧ఆశ్లే౩౯-౩౧బ్ర౩౨-౨౬భ౪-౨౧ది౧౦-౫౪త్యా౪-౫ప్రళయకల్పఃరశభు౦-౪౭చ౨౦ [చ౨౧ |
| 21 | ౭ | ౧౭ | అ॥సో౩౩-౧౦మ౩౯-౩౭ఐ౨౮-౨౩బా౩-౫౦ది౯-౩౪త్యా౪-౦రా౩౧-౧౮త్యా౩-౫౫ అనధ్యాయః భుం-౫౮ |
| 22 | ౮ | ౧౮ | న॥మం౩౦-౩౯పూఫ౩౮-౩౪వై౨౩-౨౭తై౧-౫౪శేషః౩-౧౧రా౨౮-౨త్యా౩-౫౨అహః౨౭-౫౮ అనూ ౨ రవిః |
| 23 | ౯ | ౧౯ | ద॥బు౨౭-౭ఉఫ౩౬-౩౨వి౧౭-౪౧భ౨౭-౭రా౨౮-౩౮త్యా౩-౪౯భు౧-౨౧చ౨౩ [౧౮-౪ కేక్రాం భు౧-౯చ౨౨ |
| 24 | ౧౦ | ౨౦ | ఏ॥గు౨౨-౪౫హ౩౩-౪౧ప్రీ౧౧-౧౫బా౨౨-౪౫శేషః౦-౨౧రా౨౪-౩౮త్యా౩-౪౬అహః౨౭-౫౬ ధనురయన గోరవిః౬-౫౪పర్వేషాం౧౧భు౧-౩౨చ౨౪ |
| 25 | ౧౧ | ౨౧ | ద్వా॥శు౧౭-౪౧చి౩౦-౧౫ఆయు౪-౧౫సౌ౫౨-౪౨తై౧౭-౪౧రా౧౫-౨౬త్యా౩-౪౪ అహః౨౭-౫౬ అనూ ౩ రవిః౩౫-౧౫తిథిద్వయం భు౧-౪౩చ౨౫ |
| 26 | ౧౨ | ౨౨ | త్ర॥శ౧౨-౧౦స్వా౨౬-౨౧శో౪౯-౬వ౧౨-౧౦రా౧౧-౨౯చతుర్దశీతిథిమాసశివరాత్రిపద్మనాభతీర్థభు౧-౫౪చ౨౬ |
| 27 | ౧౩ | ౨౩ | చ॥ఆ౬-౨౦విశా౨౨-౧౨అతి౪౧-౧౭-౨౦రా౩-౩౮వాజసనేయినామమావాస్య అన్వాధానం భు౨-౫చ౨౭ |
| 28 | ౧౪ | ౨౪ | అమా ● సో౦-౨౨వ్యం౫౪-౯అనూ౧౮-౦సు౩౩-౨౦నా౦-౨౨రా౩-౧౧త్యా౩-౪౪అహః౨౭-౫౨అనూ౪ రవిః౫౧-౫౮యాగకాలః పిండపితృయజ్ఞఃరక్తాంభు౨-౧౬చ౨౮ |

1932 నవంబరు నెల

తులా నెల ౩౦ మాసదినం

వృశ్చిక నెల

| | | | |
|---|---|---|---|
| | | | |
| రా | బ౨ మః వృశ్చికే రవిః బ౮ సో॥ | | |
| కే | తులాయాం శుక్రః | | కు గు శ |
| | బు | ర | కు |

| | | | | |
|---|---|---|---|---|
| కుజచారః | ౫గు॥అనూ౩బు౬-౪౫ | ౩౦సో॥జ్యే౧వక్రిబు.౪ | ౧౩గు॥హ౩కు౧౬-౧౩ | ౧౩శ॥స్వా౧కు౫౪-౨౫ |
| కు౬కు॥మఘ౨కు౩౩-౫౪ | ౮శ॥అనూ౪బు౪౧-౪౪ | గురుచారః | ౧౫ఆ॥హ౪కు౧-౬ | శనిచారః |
| ౧౩కు॥మఘ౩కు౪-౪౪ | ౧౧మం॥జ్యే౧బు౪౭-౫౦ | బ౭ఆ॥ఉఫ౧గురు౪౨-౩౯ | బ౨మం॥చిత్రా౧కు౭-౫౧ | బ౬శ॥ఉషా౪బు౫౮-౭ |
| బ౪గ॥మ౪కు౩౧-౪౯ | ౧౪శ॥జ్యే౨బు౩౧-౦ | శుక్రచారః | ౫కు॥చిత్రా౨కు౩౪-౨౩ | రాహుకేతుచారా |
| ౧౧గు॥పూఫ౧కు౩౬-౧౪ | బ౭ఆ॥బువక్రం౪౮-౮ | కు౩మం॥ఉఫ౪కు౭-౪౮ | ౮సో॥చిత్రా౩తులా | బ౭ఆ॥శత౪రా॥పూఫ౨ |
| బుధచారః | ౧౦బు॥పశ్చాదస్తంబుధః | ౬కు॥హ౧కు౩౭-౧౬ | యాం కు౧౭-౩౬ | కేతుః౧-౩౮ |
| కు౨సో॥అనూ౨బు౩౫-౩౮ | ౫౯-౭౮ | ౧౦సో॥హ౨కు౨౫-౨౭ | ౧౧గు॥చిత్రా౪కు౪-౫౧ | |

ప్రతిగృహమందును, ప్రతిగ్రామాధికారివద్ద నుండదగిన రెండు ఔషధరత్నములు




# అమృతకల్పము

[illegible] ద్రావకము, [illegible] పనిచేయును. దీనిని లోపలికి పుచ్చుకొనవచ్చును. పైన రాయవచ్చును. [illegible], పైత్యము [illegible] చే కలుగు అన్ని వ్యాధులకు రామబాణమువంటిది. తలనొప్పులు, పార్శ్వపునొప్పులు, పక్షవాయువులు, జలుబు, శైత్యము, జ్వరములు, పైత్యవాయువులు, వాంతులు, భేదులు, కలరా, గ్రహణి, [illegible], బుడుగుపాలులు, [illegible] లలు, కడుపునొప్పులు, కడుపుబ్బరములు, పండ్లనొప్పులు, చెవిపోటు, అంటువ్యాధులు, అజీర్ణములు, విష రోగములు, సన్నిపాతములు, చిన్నబిడ్డలగుణములు, నలిపురుగులు, బెణుకులు, గాయములు, [illegible], స్త్రీల యితర [illegible] రోగములు, [illegible]లు, విషజంతువుల కాటు, మొదలగువానిని ఖండించును. ప్రతివారు ఒకసీసా వద్ద నుంచుకొనిన తాత్కాలిక వ్యాధులబాధనుండి సులభముగా తప్పించుకొనవచ్చును.

1/2 ఔన్సు పెద్దసీసా 1-కి రు. 1—4—0.
1/4 ఔన్సు చిన్నసీసా రు. 0—12—0.

# సంజీవనకల్పము

ఇది కొన్ని భస్మములచే తయారుచేయబడినది

ఉష్ణాధిక్యము ఉష్ణముచే కలుగువ్యాధులన్నిటికిని అమోఘముగా పనిచేయును. జ్వరములు, జ్వరమాంద్యములు, దాహము, తాపము, కొన్ని విధములగు పన్నులు, అత్తి, కీళ్లనొప్పులు, నడుమునొప్పులు, కీళ్లవాపు, అన్ని మేహములు, మూత్రకృచ్ఛ్రములు, మూత్రపు మంట, శరీరవేడిమి, రక్తవాంతి, రక్తభేదులు, గుండెలలోనొప్పి మంట, శగరోగము, [illegible], మొదలగు అనేకవిధము లగు వ్యాధులకిది అమృతతుల్యము, ప్రతిగృహమందుండతగినది. 5 తు॥ పొడిగల సీసా రు, 1-4-0. 2 తు॥ పొడిగల సీసా రు. 0-10-0. పోస్టుఖర్చులు అన్నిటికి ప్రత్యేకము.

ఇంకా మావద్ద అనేకరకముల ఔషధములు గలవు. కొన్ని ఔషధములు, ఈసంచికలోనే యితరచోట్ల చూడగలరు.

## మా అడ్రసు:—పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేదసమాజం-పెరిదేపి, నెల్లూరుజిల్లా.

మా ఔషధములు ఈక్రింది బ్రాంచిఆఫీసులలో గూడా విక్రయించబడును:—

బెజవాడ:—గవర్నరుపేట-బ్రాంచిలో, నెల్లూరు:—ట్రంకురోడ్డు-బ్రాంచిలో, పాలకొల్లు:—కాసానిస్వామి అండు సన్సులో, గుంటూరు:—డి. వి. సుబ్బారావు షాపు, కాకినాడ:—జి. యస్. మూర్తి బ్రదర్సు-జగన్నాధపురం, మద్రాసు:—161 బ్రాడ్వేలో.

## గొప్ప క్లియరెన్సు విక్రయము



గడియారము, పాదరక్షలు కలసి 996 బహుమతులు రు 3/-కే.

మా ఓట్టోమోహినీ ఎస్సెన్సును 7 సీసాలు కొనువారికి ఈ దిగువబహుమతులు ఈయబడును:—1 న్యూఫ్యాన్సీ గోల్డుగిల్టు టైంకీపరు రిస్టువాచ్, 1 గ్యారండ్, 1 ఫ్యాన్సీ పుల్ డర్ నెక్టు, అందమైన చేతి రుమాలు, 1 గోల్డుగిల్టు సులోచనములజోడు, 1 ఎల్క్ట్రిరాతి ఉంగరము, 1 విచిత్రమైన అద్దము, 1 దువ్వెన, 1 సెట్టు చేతిగుండీలు, 1 ఫౌంటెన్ కలము, 1 బ్రేసరు,



1 క్లిప్, 1 పెన్సలు, 1 కలము, 1 ఎరేజరు, 1 బుడ్డి పరిమళము గల తాంబూలవిహారి (తాంబూలముతో ఉపయోగించునది) 145 మనోమోహిని టిప్, 1 రాయి అమర్చబడిన ముక్కర, 12 షాకీలు 244 నీటిబొమ్మలు, 288 బ్లూబ్లాక్ సిరాబిళ్లలు, 1 పైనము సంచి, 1 అత్తరు సుబ్బు, 1 జత పార్సిమాక్రి, 6 హేయర్ పెన్నులు, 6 సేఫ్టీపిన్నులు, 1 జత చెవికమ్మలు, 171 సూదులు, 1 పట్టె దారము, 1 చాకు, 1 జత [illegible], 1 తుపాకి, 100 [illegible], 1 జత మిలిటరీ జీన్ పాదరక్షలు (కాలికొలత పంపవలెను.) ఈ 996 బహుమతులు సహా వెల రు. 3.

ప్యాకింగ్ అండు పోస్టేజి 10 అణాలు.

**THE INDIAN NATIONAL STORE (SP).** 17, Joy Mitter Street, P. O. Hatkhola, CALCUTTA.

# స్వరాజ్యము

అనుభవైకమైన రాజనీతిశాస్త్రముయొక్క యుద్దేశ్యము స్వదేశీపరిశ్రమలను నిర్మించి వృద్ధిపరచుటయే. అట్టిపరిశ్రమలే యున్నప్పుడు, "స్వదేశీయుత్పత్తుల"ను మాత్రమే కొనుట ప్రతి యొకదేశీయుని విధి యైయున్నది. మన విద్యావంతుల యందు అట్టిసంకల్పము లోపముకాలేదు. "దేశభక్తి" యనుపదము ప్రతిభారతీయుని పెదవులచివరను గలదు. కాని అన్నివిషయములందువలెనే, యిందునుకూడ నోటి పొడిమాటలవలని ప్రయోజనములేదు. ఆచరణలో పెట్టవలెను. ఇంత యెందులకు? ఒక్క ఉదాహరణము చూడుడు. సబ్బులదిగుమతులమీాద భారతదేశమునుండి విదేశములకు ప్రతిసంవత్సరము రు. 1,66,68,406 పోవుచున్నది. భారతదేశముననే యీపరిశ్రమ నభివృద్ధిపరచినయెడల, మనసొమ్మంతయు మనదేశముననే యుండునుగదా. బెంగుళూరులో యుండు గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ ప్రపంచమునకెల్ల గొప్పవగు సబ్బుల కొన్నింటిని తయారుచేయుచున్నది. ఒకబిళ్ల మైసూరుచందనసబ్బును వాడి పరీక్షింపుడు. మైసూరు శ్రేష్ఠమైన చందనపు ద్రమానులకు ప్రసిద్ధి. మైసూరుచందనసబ్బునందు బ్రిటిష్ ఫార్మకోపియా రకపు చందననూనె గ్యారంటీగా కలిసియున్నది. ఇట్టిగ్యారంటీ ప్రపంచములో నెవ్వరును యివ్వరు. మైసూరు చందనసబ్బుయొక్క పరిమళము యింపై, అసమానమై, అద్భుతమై యుండును.

## మైసూరుచందనసబ్బు నుపయోగింపుడు.

ప్రతిచోటను దొరకును.

# మైసూరుగవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ,

బెంగుళూరు.



సర్, యస్ రాధాకృష్ణన్‌గారు
ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు



యునైటెడ్ ఇండియా భీమాకంపెని రజతోత్సవ సమావేశము

# ప్రస్తావన

## నూతనసంవత్సరఫలము

"అన్నం భో భుజ్యతే శశ్వత్ స్వజనా తిథిభిస్సహ,
అంగిరోబ్దేఽఖిలా లోకా భూపాః స్స్యుః కలహోత్సుకాః"

"అనగా ఈసంవత్సరమున జనులు స్వజనులతోను, అతిథిజనులతోను భోజనపానీయములు పుష్కలముగా కలిగియుందురు రాజులు యుద్ధాసక్తులగుదురు"

## చీనా-జపానుపోరాటము

ఎవరును నూహింపనిరీతిని చీనా-జపాను పోరాటము ప్రజోత్పత్తిసంవత్సరమునందు ప్రారంభ మయ్యెను. ప్రపంచమున కిది మిగుల ఆశ్చర్యము గలిగించియుండుట వింతగాదు. ఏలన, యుద్ధబహిష్కారమును ప్రతిపాదించిన కెల్లాగు ఒడంబడికపై చీనా-జపానుప్రతినిధు లిరువురును సంతకముల జేసిరి. ఆ కారణముచే, ఉభయ దేశములవారు నొండొరులపై యుద్ధమును సలుపకుండుట కనీస-ధర్మమై యుండెను. ఇంతియగాక ఉభయ దేశములవారును, నానా రాష్ట్రసంఘమునందు సభ్యులుగ నుండిరి. సభ్యులలో వివాదములు వచ్చినవో, నానారాష్ట్రసంఘమువారి ఒడంబడిక ననుసరించి, మధ్యస్థపరిష్కారము మూలమున వీనిని పరిష్కరించుకొనవలసినబాధ్యత వారిపై గలదు. యుద్ధములను బహిష్కరించుటకు సాధనముగ ఆయుధ విసర్జనము గుర్తింపబడినది ఏయే ఆయుధముల నెంత వరకు తగ్గించుకొనుటయో, రద్దుజేసికొనుటయో వీలగు నను విషయమును విచారించుటకు, నానారాష్ట్రసంఘమువారు ౧౯౩౨-వ సంవత్సరప్రారంభమున జినీవాలో ఆయుధవిసర్జనసమావేశమును సమకూర్ప నిశ్చయించిరి. ఈవిషయమును విచారించుటకు పూర్వము, నానారాష్ట్ర సంఘమునం గలిసభ్యు లయినను పోరాటములను విడనాడి యుద్ధములకు దిగకుండుట కనీసధర్మమై యుండెను. ఆయుధవిసర్జనసమావేశవిజయమునకు అనుకూలవాతావరణము గలిగించుట కిట్టిపరిస్థితు లవసర మగుచున్నవి. దురదృష్టవశమున ఇట్టి సందిగ్ధసమయమునందే చీనా-జపానుపోరాటము దావానలమువలె వ్యాపించి, జినీవా సమావేశమును నిష్ఫలము గావించెను. మొదట మంచూరియాలో జపాను విజృంభించెను. ఏదేశమున కయినను విజృంభణ గావింపనెంచువో, కారణము దొరకక పోదు. మంచూరియాలోని జపానుప్రజలకు బందిపోటుదొంగల బాధ యధికముగ నున్నది గాన, దీనిపై దండెత్తుట తమధర్మ మని జపానువారు వాదించిరి. ఇట్టి వైఖరి నానారాష్ట్రసంఘము ఏర్పడక పూర్వము మామూలయినను, బలము గలవారిదే రాజ్య మను సూక్తి ఆచరణలోకొనసాగుచున్నను, బలప్రయోగమును వివాద పరిష్కారమున కాధారభూతముగ గావింపగూడదనియు, బలప్రయోగముద్వారా సంపాదింపబడిన ప్రదేశములను గుర్తింప వీలు లేదనియు, నానా రాష్ట్రసంఘపు ఒడంబడిక స్పష్టముగ తెలిపినపుడుగూడ, జపాను ప్రాతఇంపీరియల్ వైఖరి ననుసరించియుండుట మిగుల శోచనీయము. తనకు గలిగినయుపద్రవమును జపాను నానారాష్ట్రసంఘమునకు ముందుగ దెలిపి, చీనాను మందలింపవలయునని కోరినవో, ప్రపంచసానుభూతి జపాను పడయుటకు వీలయ్యెడిది. కాని యీమార్గము నవలంబింపక, నానారాష్ట్రసంఘమునకు తెలుపకుండనే జపాను, మంచూరియాలో ముఖ్యప్రదేశముల నన్నిటి వరుసగ నాక్రమింపజొచ్చెను. చీనా ప్రభుత్వము బలహీనతచేనేమి, ఒడంబడికలకు కట్టుపడి యుండవలయునను నూహచేనేమి, ప్రపంచసానుభూతిని కోల్పోవగూడదను సదుద్దేశ్యముచే నేమి, జపాను విజృంభణమును కొలదిగ నయినను నిరోధింపక, మంచూరి

యాను విడువజొచ్చెను. ఇట్టి నిగ్రహమును, త్యాగమును నాగరికప్రపంచము గుర్తించి, చీనాపక్షము వహించి, జపానువిజృంభణము నరికట్టి యుండ వలసినది. కాని చీనాపట్ల క్రియాశూన్యమగు సానుభూతిని దెలుపుటదప్ప పాశ్చాత్యప్రపంచ మితరవిధముల దోడ్పడకపోయెను. జపాను మంచూరియా నాక్రమించుచున్నప్పుడు, పాశ్చాత్యజాతుల విచారణసంఘము వెడలి, పరిస్థితులను గ్రహించి, నానారాష్ట్రసంఘమునకు దెలుపుచుండ వలయు నని నిర్ణయింపబడెను. కాని మంచూరియా ఆక్రమణము పూర్తి యగువరకు విచారణసంఘము ఆ ప్రాంతములకు వెడలదయ్యెను. దీనినిబట్టి బలముగలవారి యిష్టమిక ముందునుగూడ కొనసాగుననియు, యుద్ధబహిష్కారము, ఆయుధవిసర్జనము అనుపదములు కేవలము వాగ్డంభనము దప్ప వేరు గావనియు, కరతలామలక మయ్యెను. మంచూరియాలో నిప్పటికిని జపాను మరల విజృంభించి, నూతనముగ ముఖ్యమగు ప్రదేశముల నాక్రమించుచున్నదని, వార్తలు దెలుపుచున్నవి. మంచూరియాలో నింకను ఏమయిన మిగిలియున్న యెడల, ఆప్రదేశమునంతను జపానుత్వరలోనాక్రమించునని నమ్మవచ్చును. జపానుకు మంచూరియాలో గలిగిన ప్రోత్సాహము, షాంగాయిలోగూడ విజృంభించునటుల జేసెను. మంచూరియాలోవలె గాక, షాంగాయిపరిస్థితులు క్లిష్టముగ నుండెను. ఏలన, ఈప్రదేశమునందు వివిధజాతుల వారికిని హక్కులు గలవు. ఇది అంతర్జాతీయప్రదేశముగ చిరకాలముక్రిందనుండియు నెంచబడుచున్నది. అందుచే జపానువిజృంభణమునకు వివిధజాతులవారినుండియు గొంత నిరోధముగలిగెను. దీనికి తోడుగ, చీనా యీమారు ఊరకుండక, జపాను విజృంభణమును శక్తికొలంది నిరోధింపజొచ్చెను. ఈ కారణమున జపాను తలచినంత వేగముగ ముందుకు పోజాలకపోయెను. తుదకు చీనా జపాను పోరాట మాగిపోయెననియు, నీపోరాటము ముగియులోపల, చీనాజపానులకు మధ్య సంధి కుదురుననియు, నూహింపబడెను. జపానునుండి వెలువడువార్తలు, సంధివిషయమై ఆశను పుట్టించెను కాని చీనావార్తలుమాత్రము ఎప్పటివలె నిరుత్సాహము జూపుచు, జపాను తనసైన్యములను దగ్గించు తలంపు లేదనియు, ఒడంబడిక త్వరలో గుదురుట అసంభవమనియు తెలుపజొచ్చెను. దీనికితోడుగ మంచూరియాలో మరల పోరాటము ప్రారంభమయ్యె ననువార్త జపానువైఖరిపట్ల ఆశను పురికొల్పకున్నది. ఇంతవరకు సంవత్సర ఫలము సిద్ధించునో చీనాజపానుపోరాట మికముందుగూడ సాగవచ్చును. కాని ఇంతటితో నది యాగునా ? లేక ఇతరదేశములనుగూడ దీనివలలోనికి గొనివచ్చునా యనుప్రశ్న గలదు. భావిపరిణామ మెట్లుండునో చెప్ప వీలులేదు గాని, చీనాజపానులతో ఈపోరాట మాగదని మాత్రము యూహింప నవకాశము గలదు. ప్రస్తుతస్థితి ఒక్కసంగతినిమాత్రము నాగరికప్రపంచమునకు వెల్లడిజేసినది. ఇంతవరకు వాడుకయందున్న ప్రపంచశాంతి, యుద్ధబహిష్కారము, ఆయుధవిసర్జన మనుపదములు, వాగాడంబరముగ పరిణమించుచున్నవిగాని, వీనికి నిజమగు పునాదులు లేవనియు, బ్రిటీషు లేబరుపక్షనాయకులగు జార్జి లాన్సుబరీగారు తెలిపినటుల, ఇంతకుపూర్వము ఇంపీరియల్ జాతులవలంబించిన మార్గమునే, యిప్పుడు, జపానుగూడ అవలంబించుచున్నదనియు పరిస్ఫుటమగుచున్నది. నిజమగు పునాదులు కేవలము రాజకీయము గావు, కేవలమంత్రాంగముపై నాధారపడునవియు గావు. హృదయపరివర్తనము నివి నాధారము జేసికొనవలయును. అట్టిపరివర్తనము నాగరికప్రపంచములో నేజాతివారియందయినను కనిపించుచున్నదా ? తాను ఆయుధములను విసర్జించి, త్యాగమార్గమును చేపట్టి, ఇతరజాతులకు మార్గము జూపుటకేజాతియయినను ముందునకు వచ్చుచున్నదా ? త్యాగము త్యాగమును పురికొల్పును. పోటీపోటీని పురికొల్పును. ఆయుధవిసర్జనసమావేశ కార్యక్రమమును జూచిన, వివిధజాతులవారును, ఇంకను ఆయుధములపోటీపైని దృష్టి నిలిపి, స్వరక్షణావశ్యకత ప్రథమ మని చాటుచున్నారే కాని, ఎవరును

ముందగమార్గదర్శకులగుటకుపూనుకొనలేదనికన్పట్టును. పెద్దజాతులే యిందుకు బూనన పుడు, చిన్న జాతు లెటులు పూనుకొనగలవు? ఎవరు తమ యాయుధములను ముందుగ తగ్గింపవలయును, ఎంతవరకు తగ్గింపవలయును అనువిషయమై ఒడంబడిక కుదురు ననునాశ గన్పింపదు. ప్రతి దేశము వారును తమయిబ్బందులను ముందుకు బెట్టుచున్నారు గాని, ప్రపంచకళ్యాణమును ముఖ్యముగ సూచించుట లేదు. తదర్థమై తమలాభములను విసర్జించుట కేదేశము వారును ముందుకు వచ్చుట లేదు. అందుచే ఆయుధవిసర్జన సమావేశము విజయముగాంచి, ప్రపంచశాంతి సురక్షితముగ నుండవలయు ననిన, ధర్మమును అహింసను ఆధారపరచికొని, యోచించినగాని, ఈసమస్య పరిష్కారము గాంచజాలము. అట్టి ఆధారము లింతవరకు ఏర్పడలేదు. ఇంతకుపూర్వము యుద్ధబహిష్కారము గూర్చియు, ప్రపంచశాంతిగూర్చియు, ఏవయిన ఆశ లేర్పడియున్న యెడల, చీనా-జపాను పోరాటముతో నీయాశ లడుగంటుచున్నవి దీనిని నివారింపజాలకపోయినందువలన, నానారాష్ట్ర సంఘపు నిస్సహాయత బయల్పడుటయు గాక, ఇంతవర కేర్పడిన ఆధారములు నిరుపయోగము లని కూడ ఋజువయ్యెను. ఈ కారణముచే, కొందరు పాశ్చాత్యప్రముఖులు, అన్ని జాతులవారును యుద్ధమునకు సంసిద్ధు లయినగాని, యుద్ధము లంతరింప వనియు, అన్యుల సద్భావముపై నికమీద నాధారపడుటకు వీలు లేదనియు, ఆయుధవిసర్జనము నిరుపయోగ మనియు, మున్నగు వ్యాఖ్యానములు గావించుట సంభవించుచున్నది. ఆంగీరస సంవత్సరమునందు యుద్ధభయము సూచింపబడినను, పరమేశ్వరుని యనుగ్రహమువలన, ఈ విపత్తు తొలగి శాంతి చేకూరి, ప్రేమ వర్ధిల్లుగాక యని కోరెదము.

**గడచినసంవత్సరము ఆర్థికదుస్థితి**

ప్రజోత్పత్తిసంవత్సరఫల మీరీతి వెలువబడెను:

"సువర్ణం సర్వధాన్యాని సులభాని యయుర్నరాః,
దర్పితాస్సర్వసంపద్భిః క్షేమారోగ్యే ప్రజాపతౌ."

దీని ననుసరించి ప్రజోత్పత్తి సర్వశుభముల నిచ్చు నని యూహింపబడెను. కాని దురదృష్టవశమున నీయూహ ఫలింప దయ్యెను. ప్రజోత్పత్తిసంవత్సరమునందు కని విని ఎరుగని ఆర్థికదుస్థితి సంభవించెను. ప్రపంచదుష్పరిస్థితులు కొంతవర కీదేశమునకు గూడ దాపురించెను. మరికొన్ని పరిపాలనావిధానమువలన చేకూరె నని చెప్పక తీరదు. అన్ని దేశము వారును, ప్రపంచపరిస్థితుల నెదుర్కొనుటకు వలయుప్రతిక్రియల నవలంబించియుండిరి. ఇంగ్లండు బంగారుప్రమాణమును మానివైచెను. మరికొన్ని దేశములుగూడ దీనిని మానివైచెను. తమపరిశ్రమలను రక్షించుకొనుటకు స్వతంత్రదేశములు మార్గముల నరసెను. కాని, హిందూదేశ మేమి చేసెను? ఇండియామంత్రి సర్ సామ్యూయల్ హోరుగారు కోరినవిధమున యీదేశమున రూపాయికిని, నవరనుకును శాశ్వతసంబంధము గుదుర్పబడెను. ఇందువలన హైందవవాణిజ్యము మరింత క్షీణించియుండుట వింతగాదు. ఇంతకుపూర్వము రూపాయిని షిల్లింగు ఆరుపెన్నీలతో జతచేర్చుటవలన, మితిలేనినష్టముసంభవించియుండెను. ఆర్థికదుస్థితి ఏర్పడియున్న సమయమునందయినను, రూపాయిమారకమును సహజపరిస్థితుల ననుసరించి నిర్ణయించుట యవసరముగాదా? అందులకు ఇండియామంత్రిగా రంగీకరింపరైరి. హిందూదేశ మెంతనష్టపడిననుసరియే, రూపాయిని నవరనుపై నాధారపరచునటుల నిర్ణయించిరి. కాని, నవరనువిలువ నిలుకడగలిగియున్నదా? ఎన్నియో కృత్రిమప్రయత్నముల గావించినను, నవరను విలువ మారుచువచ్చెను. కాని నవరను ఎంతమార్పు చెందినను, రూపాయిగూడ దానితో అనుగుణముగ నడువవలెను. దీనికి ఇండియామంత్రిగారు చెప్పనకారణ మేమి? హిందూదేశము ఇతరదేశములకు ఋణపడియున్నది గాన, ఆయా దేశపు పరపతి క్షీణింపకుండుటకు, నవరనుతో సంబంధము గలిగించుకొనుట యవసర మయ్యె ననియే. ఇట్టి కృత్రిమపు ఏర్పాటువలన గలుగునష్టమును భర్తీ చేయుటకు, హిందూదేశమునుండి బంగారము ఎగుమతి యగుటకు ప్రోత్సాహ మొసగబడెను. వేలోకరాబడి

లేక, బీదలు తమయొద్ద నున్న నగలను విక్రయించి, విదేశములకు బంగారమును రవాణా చేయసాగిరి. కొంత కాలముక్రిందటినుండియు హిందూదేశమునకు ఎంచదగిన విదేశవాణిజ్య మేమియు లేకున్నను, స్టీమరులు హిందూదేశమునుండి బంగారమును గొంపోయి అన్యదేశములకు రవాణా చేయసాగినవి. ఇట్టిపద్ధతి దేశమునకు మిగుల హానికరమని, ఆర్థికవేత్తలు దెలుపుచున్నను, ఇది మిగుల లాభకర మయ్యెనని, హైందవపాలకులు ప్రకటింపసాగిరి. బంగారపు రవాణావలన అన్యదేశములు కొల్లలాభము గలిగెను. ఇంగ్లండు తనఋణములను బంగారముమూలమున ఇతరదేశములకు తీర్పగలిగెనని, వార్తలు వెలువడెను. ఈరీతిని హిందూదేశము తనకు మాలిన ధర్మము జేసెనని చరిత్రకారులు లిఖింపగలరు. ఢిల్లీలో కొంత కాలముక్రిందట గూడిన హైందవవాణిజ్యసంఘసభవారు బంగారపురవాణాను అరికట్టవలసిన యవసరమును దెలుపుచు, ప్రభుత్వమువా రయినను తమక్షేమము నాలోచించి, ఈదేశమున గల బంగారమును మార్కెటు ధరకు కొని నిలువ యుంచవలెనని తీర్మానించిరి. కొలది కాలములో హిందూదేశమున రిజర్వుబ్యాంకును స్థాపించు నుద్దేశ్యము గలదు. దీనియందు నిర్ణీతమగు బంగారము నిలువయున్న గాని, దీనిని ప్రారంభింప వీలుండదు. ఒక్కమాఱుగ బంగారంతయు లభింపవలయు ననిన లభింపబోదు. అందుచే నిప్పటినుండియు బంగారమును ప్రభుత్వమువారు కొని నిలువ యుంచువో, రిజర్వుబ్యాంకుకు వారు అనుకూలమగు పునాదులను వైచెదరు. ఇట్టి దృష్టితోజూచినను, బంగారపు ఎగుమతిని నిరోధించుట ప్రభుత్వమువారి ధర్మమగుచున్నది. కాని, స్వపరిపాలనము లేనికతన, హిందూదేశము తన కనువగు ఆర్థికరక్షణమార్గముల నవలంబింపజాలక, వైటుహాలునుండి వెలువడెడి హుకుములను శిరసా వహింపవలసివచ్చుచున్నది. ప్రభుత్వమువారు తమ వ్యయమును తగ్గించుకొనుచెడల, దేశమునకు కొంత ఉపశాంతి గలుగును కాని, ఆవిషయమై తగినకృషిజరుగకున్నది. పాశ్చాత్యదేశము లింతవఱకు సంపదతో తులదూగుచుండెడివి. వీరి వాణిజ్యము పెక్కుమడుంగులు వృద్ధిగాంచెను. అందుచే ప్రపంచపరిస్థితులవలన తాత్కాలికముగ కొంతనష్టము గలిగినను, దీనిబాధనుండి తెప్పఱిల్లుటకు, ఆదేశములకు అవకాశము మెండుగ గలదు. యూరపుయను దేశములు తమలోతా మెంతటివైషమ్యము జూపెనను, సాముదాయికరక్షణవిషయమున మాత్రము ఏకీభావముతో మెలగుచున్నవి. జర్మనీని ఉద్ధరించుటకు వివిధదేశములవారును సలుపుచున్న కృషి యిందుకు నిదర్శనము. ఇంతియకాక డాన్యూబ్ నదీప్రాంతదేశముల ఆర్థికస్థితిని చక్కబఱచుటకు, నాల్గుజాతుల సమావేశము లండనులో నిపుడు గూడి, విచారించుచున్నది. ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ లీ సమావేశమున దం పాల్గొనుచున్నవి. జార్జిసార్వభౌము డీ సమావేశముగూర్చి ప్రత్యేకశ్రద్ధవహించుచున్నారు. బ్రిటీషు ప్రధానమంత్రి మాక్డనాల్డుగా రిందుకుగాను యూవచ్ఛక్తిని వినియోగింప నిశ్చయించిరి. యూరపులో నేదేశము మునుగబడియున్నను, ఆదేశమును పునరుద్ధరించినగాని, ఇతరదేశములు అభివృద్ధి గాంచజాలవను నమ్మకము, పాశ్చాత్యులలో వ్యాపించియున్నది. కీ. శే. బ్రయండుగారు, ఆర్థికముగ యూరపు నంతయు నేకముజేసి, యూరపు సంయుక్తరాష్ట్రముల నేర్పఱుపవలయు నని, తీవ్రముగ నాలోచించిరి. తమమతమును వ్యాపింపజేయుటకు వీరు దీక్షతో కృషి సలిపిరి. తమ సంకల్పము నెఱవేఱకముందే, సుప్రసిద్ధు లగు ఫ్రెంచిమంత్రి విగతజీవులయినను, డాన్యూబు దేశముల పునరుద్ధారణగూర్చి లండనులో జరుగుచున్న సమావేశమునకు బ్రయండుగారి ప్రచారమే ప్రోత్సాహక మయ్యెనని యెంచవచ్చును. ఈకారణముచే, యూరపుయను దేశములవారు, ఒకరికష్టమును తమకష్టమని భావించి, వారి రక్షణకు బూనుకొనుట పరిపాటియయినది. ఇవి యన్నియు స్వతంత్రదేశము లగుటచే, తమ కనుకూలించు ప్రతిక్రియల నవలంబించి, ఆర్థికదుస్థితినుండి బయల్పడ గలుగుచున్నవి. కాని హిందూదేశమున కట్టి అదృష్టము లేకున్నది. హిందూదేశపు దుర్గతిని తొలగించుకొనుటకు ఈదేశమునకు స్వతంత్రపు

**హాక్కు** లేకున్నది. హిందూదేశము చిరకాలమునుండియు ఆర్థికదుస్థితిచేతను, దారిద్ర్యబాధచేతను పీడింపబడుటచే ప్రపంచపరిస్థితుల ఆఘాతముగూడ కలిగినపుడు దీనినుండి కోలుకొనుట యసంభవ మగుచున్నది. దీనికి తోడుగ, హిందూదేశము అనుకూలప్రతిక్రియల నవలంబించుటకు, పాలకులు సముచితరీతిని తోడ్పడుటలేదు. మితిమిక్కిలి రూపాయికి హెచ్చుమారకము నిర్ణయించుటచే, హిందూదేశము తలయెత్తెడి అవకాశము దొలగుచున్నది. బంగారము స్వేచ్ఛగ నెగుమతిచేయబడి, హిందూదేశమునకు మిగిలియున్న స్వల్పసంపదగూడ విదేశములపాలగుచున్నది. యూరపియనుదేశమునకు దేనికయినను కష్టము లభించినపుడు ఇతరదేశములు తోడ్పడుచున్నవి. కాని, హిందూదేశమునకు దురవస్థ ప్రాప్తించినపుడు, ఇతర ఆశియాదేశములు అయినను, తోడ్పడకుండుటయు కాక, యిట్టిసమయమునందే హిందూదేశమునుండి రాబట్టదగిన లాభముల నన్నిటిని రాబట్టుటకు యత్నించుచున్నవి. ఈ సమయమున జపాను సలుపుచున్న ప్రయత్నము లిందులకు నిదర్శనములు. హిందూదేశము ఆర్థికదుస్థితిలో మునిగియుండి, పంటల ధరలుతగ్గి ప్రజలు బాధపడుచున్న సమయమున, ఆంధ్రదేశము మరింత యధికబాధలకు లోను గావలసివచ్చినది. విశాఖపట్టణము, గంజాము, పశ్చిమగోదావరిజిల్లాలలో ౧౯౩౭ సంవత్సరము అక్టోబరు నవంబరునెలలలో జరిగినవఱదల బీభత్సమువలన, ప్రజలకు గలిగిననష్టము నింతింతని వర్ణింప వీలులేదు. ప్రభుత్వమువారీవిషయమై ఎప్పటివార్తల నప్పుడు ప్రచురింపక, ఇటీవలనే కొంతవృత్తాంతమును దెలిపెడి నివేదికను ప్రచురించిరి. ఇంతకాలము జరిగినపిమ్మట వెలువడిన నివేదికకు విలువయుండజాలదు. ప్రజలకు గలిగిననష్టముల నీనివేదిక చులుకనజేయుచున్నది. దీనిప్రకారమయినను, ప్రజలనుభవించిన బాధలకు తగిననష్టపరిహారము వారికి చేకూరలేదని తోచక మానదు. విశాఖపట్టణమండలమునందు ఏజెన్సీలోను, మీరభూములలోగూడ తీఱని నష్టము సంభవించినది. మూడుజిల్లాలలోను, నదులును, కాలువలును ఏకమై భూములను నీటిమ[?]ము గావించెను. గంజాముజిల్లాలో నాగావళినదియొక్కభాగమంతయు వఱదలతో నిండిపోయెను. విశాఖపట్టణమండలములో ప్రభుత్వ నివేదికప్రకారము, మీరభూములలో తొమ్మిదితాలూకాలును, ఏజెన్సీలో నాల్గుతాలూకాలును వఱదలపాలయ్యెను. పొత్తంగి,పాడవాతాలూకాలలో చెట్లు వ్రేళ్లతో గూడ పెల్లగిలి, పంటలను నాశనముజేసెను. కొండలపైనుండి ఇవి జాఱిపోయెను. ౨౬౮ గ్రామములకు పైగా ఇందువలన నష్టపడెనని, నివేదిక దెలుపుచున్నది. కాని, ఈ మొత్తముకన్న నెక్కువగ్రామములే నష్టపడెనని, యూహింపవచ్చును. ఎన్నియిండ్లు కూలెనో, ఎందఱు ప్రజలకు నిలువ నీడ లేకపోయెనో, ఎన్నిభూములు వఱదలమూలమున బీడుపడెనో యూహించుట సులభసాధ్యము. పశ్చిమగోదావరిమండలమునందు, భీమవరం, తాడేపల్లిగూడెము, ఏలూరు తాలూకాలో పల్లపుభాగములు కొల్లేటివఱదలచే మునిగిపోయెను. గంజాంమండలములో ముగ్గురు మాత్రమే కనిపెంపలేదని నివేదిక దెలిపెనను, చనిపోయినవారిసంఖ్య చాల అధికమని పత్రికలకు వార్తలరుదెంచెను. విశాఖపట్టణమండలములో 333 గ్గురు చనిపోయిరని, ప్రభుత్వమువారు ప్రకటించిరి గాని, యీమొత్తము చాల స్వల్పమని యూహింప నవకాశము గలదు. గంజాములో చనిపోయిన పశువులసంఖ్య చాల ఉన్నను, ప్రభుత్వమువారికి సమాచారము తెలియలేదు. ఇటులే పశ్చిమగోదావరిమండలములో పోయిన పశువులసంఖ్యయు ప్రభుత్వమువారికి తిన్నగ దెలియలేదు. పశువులకొట్టములు కొన్ని నాశనమయ్యెనని మాత్రము ప్రభుత్వమువారు అంగీకరించుచున్నారు విశాఖపట్టణమండలములోమాత్రము ౬౩౦౦ పశువులు చనిపోయెనని ప్రభుత్వమువారు అంచనా వైచిరి. గంజాముమండలమున ౧౮౬౬ గృహములకుపైగ నాశనమయ్యెననియు, అందలి ప్రజలకు నిలువ నీడ లేకపోయెననియు,విశాఖపట్టణములో ౨౬౪౮ కుటుంబములకు ఇండ్లు కూలెననియు, ఏలూరు తాలుకాలో ౬౬౯ గృహములును, భీమడోలు తాలూ

కాలో ౨౧౫ గృహములును నష్టపడె ననియు, భీమవరం తాలూకాలో ౨౦౦ గుడిసెలు నష్టపడె ననియు, సూచింపబడినది. గంజాముమండలమున నూటయేబది ఎకరముల పంట పాడయ్యెనట. కొంతభాగము ఇసుకతో నిండిపోయెనట. విశాఖపట్టణములో ౩,౭౦౦ ఎకరముల పంటభూమి నీటిమయ మయ్యెను. రెండువందల ఎకరములు ఇసుకతో నిండిపోయెను. ప్రభుత్వమువారి అంచనా ప్రకారము ౧౫౦,౦౦౧ రూపాయల పంటలు నష్టము జెందెను. విశాఖపట్టణపు ఏజెన్సీలో, అనేకభూములు వఱదలచే నష్టము చెందుటయేకాక, వరిభూము లనేకములు ఇసుకచే కప్పబడెను. ఇవి సాగుబడికి శాశ్వతముగ నిరుపయోగ మయ్యెనట. వరిపంటలో పదవవంతువఱకు చెడిపోయెను. జయపురములో ఇరువదిమూఁడు గ్రామములలో భూములు నష్టపడి ఇసుకతో నిండెనని, ప్రభుత్వమువారు దెలుపుచున్నారు. మల్కనగిరిలో మితిలేని నష్టము గలిగెను. రాగి, వోడ్లు, మిరెపకాయలు, వరి, మున్నగుపంటలు కొట్టుకొనిపోయి, భూములలో చాలభాగము సాగుబడికి నిరుపయోగ మయ్యెను. భీమవరం తాలూకాలో ౨౨,౩౫౦ ఎకరముల మాగాణిపంట నష్టపడెను. తాడేపల్లిగూడెముతాలూకాలో రెండువేల ఎకరములును, ఏలూరుతాలూకాలో ౨౮,౦౧౦ ఎకరములును నష్టము జెందెను. ప్రభుత్వభవనములకును, ఆస్తికిని గలిగిననష్టము చాల గలదు. అదిమాత్రము ప్రభుత్వపునివేదికలో పూర్తిగ వివరింపబడెను. ఇంతవఱకు తెలుపబడిన వర్తమానము ప్రభుత్వసమాచారముపై నాధారపడి యున్నది. వాస్తవముగ జరిగిన నష్ట మింతకన్నను చాల నధిక మని, పత్రికలకు జేరినవార్తలు దెలిపియుండెను. గంజాము మండలములో మైనరు ఇఱ్ఱిగేషను వర్కులకు ౭,౫౦౦ రూపాయిలనష్టము కలిగెనని అంచనా వేయబడినది. లాంగుల్యా, ఋషికుల్యానదులకును గిరిసోలాకాలువకును, కలిగిననష్టమును పరిహరించుటకు ౯౫,౫౦౦ రూపాయ లగునని సూచింపబడినది. విశాఖపట్టణములో డెబ్బది ఇఱ్ఱిగేషనువర్కులకు నష్టము గలిగెను. వీనిని మరమ్మతుజేయుటకు ఇరువదిమూఁడువేల రూపాయలవ్యయ మగు నని అంచనా వేయబడినది. శారదానదిలో అసాధారణ మగు వరదలు సంభవించెను. పార్వతీపురము డివిజనులో నేమి, నాగవళీ ఇఱ్ఱిగేషను ఏర్పాటుక్రింద నేమి, చాలనష్టము సంభవించెను. మొత్తము మీఁద డి. పి. డబ్లియు. శాఖవారికి ఇఱువదివేలరూపాయలు మరమ్మతు కగునని, ప్రభుత్వమువా రూహించుచున్నారు. పశ్చిమగోదావరిజిల్లాలోని భీమవరంతాలూకాలో ఎనమదుర్రుకాలువకట్ట తెగెను జిల్లాలోని ఆఱుఇఱ్ఱిగేషను చెఱువుల కట్టలు తెగెను. విశాఖపట్టణము ఏజెన్సీలో వంతెనలు, రోడ్లు చెడిపోయెను. విశాఖపట్టణము పీరభూములలో రోడ్లకు గలిగిననష్టమును భర్తీచేయుటకు లక్షల కొలది ద్రవ్యము కావలె నని సూచింపబడెను. పశ్చిమగోదావరిలో వంతెనలకును రోడ్లకును చాల నష్టము గలిగెను. కాని, ప్రభుత్వమువా రీమూఁడుమండలములకును జేసినసహాయము చాలస్వల్పము. ఇరువదినాల్గుగంటలలో వఱదలువచ్చి నాశముజేసియుండుటచే, విశాఖపట్టణపు ఏజెన్సీలో ప్రభుత్వమువా రేమియు జేయజాలకపోయిరని, సమాధానము చెప్పబడినది ప్రభుత్వమువారు ౧౯౩౧ సంవత్సరపు అక్టోబరునెలలో జరిగిన తుపానునుగూర్చి యిటులు ప్రకటించిరి:

"అక్టోబరునెల ౧౩, ౧౫ వ తేదులలో చెలరేగిన తుపాను అపూర్వమయినది మానవులస్మృతిలో ఏజెన్సీ భాగములందంతటను ఇంతటితుపాను ఇదివఱకెన్నఁడు సంభవించియుండలేదు. విశాఖపట్టణము పీరభూములలోనితాలూకాలలోనున్న చెఱువులు సెప్టెంబరువర్షములవలన నదివఱకేనీటితో నిండియుండెను. వఱదలవలన వచ్చిన అధికమగు నీటిని భరించుటకు వీనికి శక్తి చాలకపోయెను. ప్రతిసంవత్సరము మరమ్మతు జేయుచున్నను గూడ పాలకొండతాలూకాలో ౨౫ ప్రభుత్వపు చెఱువులు నష్టము జెందియుండుటబట్టి వెల్లువవలె పాఱెడినీటి తాఁకుడుకు ఏచెఱువులును తాళలేవని విదితము గాఁగలదు. ఇంతియ కాక ఎస్టేటుతాలూకు చెఱువులు పెక్కులు

అసంతృప్తికర మగుస్థితిలో నుండుటచే మఱిదలబీభత్స మధిక మయ్యె ననుటకు సందియము లేదు. ఏ జెన్సీప్రదేశములకు సంబంధించినంతవఱకు ఇట్టి అసాధారణవర్షపాతముయొక్క ఫలితములను నివారించుటకు ప్రభుత్వము వారు చేయదగిన దేమియు గనుపింపదు. అక్టోబరు ౧౩, ౧౪ వ తేదుల తుపాను చాల తీవ్రమయినను, అదృష్టవశమున విశేషమగు గాలితో గూడుకొని యుండలేదు. తుపాను చల్లారినపిమ్మట వాతావరణము నిర్మలమయ్యెను. ఇండ్లను వాకిళ్లను కోల్పోయినప్రజలకు ఎక్కువ కష్టములు గలుగకుండ నింక వలన వీ లయ్యెను. అదృష్టవశమున అంటువ్యాధులుగూడ జనింపవయ్యెను."

ప్రభుత్వమువారు దెలిపిన పై వృత్తాంతమువలన ఆంధ్రదేశమునందు మూడుమండలముల కెంతటినష్టము గలిగెనో యూహించుట సులభసాధ్యము. ఆర్థికదుస్థితి మరింత తీవ్రరూపము దాల్చుట కీవఱదలు తోడ్పడెననుటకేమయిన సందియ మున్నదా? ఆంధ్రుల దురవస్థ యింతటితో తీఱలేదు. పులిమీఁదపుట్ర యనునటుల కృష్ణ, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరిమండలములలో ఈ సమయముననే భూమి పన్నులు పెంచ బడెను. సెటిల్మెంటు ఆఫీసరుగారి రిపోర్టునందలి యూహలు నిరాధార మని రయితుస్థితిని స్వయముగ విచారించిన, మదరాసు శాసనసభవారిచే నియమింపబడిన ఆరోగ్యస్వామిసంఘమువారి రిపోర్టు సహేతుకముగ నిరూపించెను. మదరాసు శాసనసభవారు ఆరోగ్యస్వామి సంఘమువారి నివేదిక నామోదించి సెటిల్మెంటు ఆఫీసరుగారి రిపోర్టును నిరసించిరి. మాంటుఫర్డుసంస్కరణములమలులోనికి రాకపూర్వమే సెటిల్మెంటు రేట్లను నిర్ణయించుటకు శాసనబద్ధమగు నియమము లేర్పడవలయుననియు శాసనసభకు పీనిపై నధికార మేర్పడవలయుననియు జాయింటుకమిటీవారు దెలిపియుండిరి కాని, మాంటుఫర్డు సంస్కరణము లంతరించి నూతనసంస్కరణములు చేకూరెడిసమయమునగూడ, ఏరాష్ట్రమునందును లాండు-రివిన్యూచట్టమునిర్మింపబడ లేదు. ప్రాతనిరంకుశమార్గములు యథేచ్ఛగ కొనసాగింపబడుచున్నవి. లాండు-రివిన్యూచట్టములను నిర్మింపకున్నను, క్రొత్తసంస్కరణములు ఏర్పడువర కయినను రిసెటిల్మెంటును మానివైచుట లాభకరముగాదా? ఈసంగతినే ఆంధ్ర దేశములోని రయితుసంఘములవారును, రయితు ప్రతినిధులును, నెత్తిని నోరుబెట్టుకొని ఉద్ఘోషించియుండిరి. శాసనసభవారిటుల తీర్మానించిగూడ నుండిరి. కాని వీరెల్లర మొఱలు అరణ్యరోదనము లయ్యెను. మీఁదుమిక్కిలి వీరి ఆందోళనము రాజకీయపరిస్థితులచే ప్రేరేపింపబడెనని అధికారులు దెలిపి, పలువురను కారాగృహముల పాల్సేసిరి. పన్నుల నిరాకరణము నిమిత్తము ఈ యాందోళనము లేవదీయ బడెననియు, రయితులకు నిజమగునష్టమెట్టియు లేదనియు, స్థానికాధికారులు దెలుపసాగిరి. నిజము నిలుకడమీఁద తెలియునను సామెతవిధమున, మద్రాసు ప్రభుత్వమువారుగూడ నిట్టి సిద్ధాంతమును సమర్థింపజాలకపోయిరి. ౧౯౩౦-౩౧ పరిపాలనపురిపోర్టుకు పీఠికను వ్రాయుచు, దానియందు ప్రభుత్వమువారిటుల దెలిపిరి:

"సంవత్సరపు రెండవభాగమున, కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరిమండలములలో, హెచ్చగు రిసెటిల్మెంటు లాండురివిన్యూరేట్లను ప్రవేశపెట్టగూడదను ఆందోళనము వృద్ధిగాంచెను. ఈయాందోళనము, కాంగ్రెసు పేరుతో జరుగకపోయినను, కొందఱు కాంగ్రెసు అతివాదులగు వ్యక్తులు, పన్నుల నిరాకరణము గూర్చి గర్భితమగు సూచనల గావించుచు వచ్చిరి. అయినను ఇది సక్రమాందోళనముగనే సాగెను. ప్రభుత్వమువారికి అనేక మగు అర్జీలు పంపబడెను. ప్రభుత్వోద్యోగులతో సంప్రతింపులు జరిగెను. రయితుసంఘములు పెక్కులు ఏర్పరుపబడెను. ఈమండలములలోని కార్మికుల ఆర్థిక దుస్థితివలన, పరిస్థితులు మరింతవిషమ మయ్యెను. ధాన్యపు పాతరలపై నాల్గుదోపుడులుగూడ జరిగెను."

పైవాక్యములబట్టి రెండువిషయములు స్థిర మగుచున్నవి. మూఁడుమండలములందును తీవ్రమగుఆర్థికదుస్థితి

గలదనువిషయ మొకటి స్థిరమగుచున్నది. రిసెటిల్మెంటు రేట్లను ప్రవేశపెట్టవలదను ఆందోళనము సక్రమపద్ధతులపైననే సాగెనని ప్రభుత్వమువా రంగీకరించిరి. ఇట్టిసమయమున, జనసామాన్యపు సక్రమాందోళనమును నిరాకరించుటవలన, ప్రజలలో నెంత నిరాశ పెరుగునో, ప్రభుత్వమువారిపట్ల విశ్వాస మెటులు దొలగునో, గుర్తించుట యవసరము. నూతనప్రభుత్వమున కీవిషయమును వదలిపెట్టిన-చో, ఎట్టినష్ట ముండెడిదిగాదు. ఆర్థికదుస్థితి సర్వత్ర ప్రబలియున్న ఈ సమయమునందే, భూములపన్నులను గూడ పెంచుటవలన రయితు లనుభవించెడి బాధలకు మితి యుండదు. మొత్తముమీద ప్రజోత్పత్తిసంవత్సరమునందు, పఱగలచేతను, హెచ్చుపన్నులచేతను ఆర్థికదుస్థితిప్రవృద్ధి గాంచి, ఆంధ్రదేశప్రజలను మఱింత నిరాశాభూతుల గావించెను. మొదట సూచింపబడిన సంవత్సరఫలము చాలవఱకు మృగ్య మయ్యెను.

గాంధి-ఇర్విను ఒడంబడిక : అనంతరము

కడచినసంవత్సరము ప్రారంభమున భారతీయుల యాశలు వికాసముజూపెను. హైందవసమస్య అనుకూలముగ పరిష్కరింపబడు నను ఆశ సర్వత్ర వ్యాపించెను. ౧౯౩౧ సంవత్సరము, మార్చి ౫ వ తేదిని, ఢిల్లీలో గాంధి-ఇర్విను ఒడంబడిక జరిగెను. గాంధిమహాత్మునకును ఇర్విన్ప్రభువుగారికిని మధ్య ఒడంబడిక కుదిరెను. దీని ననుసరించి సత్యాగ్రహము విరమింపబడెను. కాంగ్రెసు ప్రతినిధులు రౌండుటేబిలుసమావేశములో పాల్గొనుట కవకాశ మీయబడెను. బ్రిటిషువస్తుబహిష్కారాంశము నిలిపివేయబడినను, విదేశవస్త్రబహిష్కారమును ఆర్థికముగ సాగించుటకు, ఢిల్లీ యొడంబడిక అంగీకారము చూపెను. దీనికిగాను అవలంబింపబడెడి శాంతమగు పికెటింగునకు అనుజ్ఞ యొసగబడెను. సత్యాగ్రహము నడంచుటకై ప్రయోగింపబడిన ఆర్డినెన్సు లన్నియు రద్దుచేయబడెను. ప్రాసిక్యూషనులను రద్దుచేసి, సత్యాగ్రహనిర్బంధితులను విడిచిపెట్టుటకు ప్రభుత్వమువా రంగీకరించిరి. ఆర్డినెన్సు క్రింద ప్రభుత్వమువారిచే స్వాధీనపఱచికొనబడిన ఆస్తిని తిరిగి ఇచ్చివైచుటకు ప్రభుత్వమువా రంగీకరించిరి. ప్రజోత్పత్తిసంవత్సరప్రారంభమునకు పూర్వము, కాంగ్రెసుకును ప్రభుత్వమువారికిని సంధికుదురుటచే, భావిపరిణామ మనుకూలముగ నుండు నని ఎల్ల రువ్విళ్లూరిరి. కాంగ్రెసులో కొందఱు దప్ప మిగిలినవా రెల్లరును ఢిల్లీ యొడంబడికతో తృప్తిజెందిరి. నిర్బంధములవలన హిందూదేశమున శాంతి యను ఎడారిని కల్పించుట జరిగెను గాని, అభివృద్ధి కెట్టి యవకాశము గలుగలేదని, ఇర్విన్ప్రభువుగారు గ్రహించి నిర్బంధవిధానమును విరమించి సమాధానపద్ధతి నవలంబించిరి. కాంగ్రెసుపక్షము లేకుండ సంస్కరణములను నిర్మించుట నిరుపయోగమని ప్రభుత్వమువా రపుడు గ్రహించినటులు ఇటీవల సర్ జార్జి రెయినీగారు భారత శాసనసభలో నొప్పుకొనియుండిరి. అట్టి సత్యమును వెనుక గ్రహించిన ప్రభుత్వసభ్యులు ఇప్పుడు గూడ ఆ సత్యమును మఱవకుండిన చో ప్రస్తుతవిషమస్థితి జనించెడిది గాదు. దురదృష్టవశమున, ప్రాతపాఠములను ప్రస్తుత ప్రభుత్వమువారుమఱచి కాంగ్రెసునాయకులను చెఱసాలయందుంచి సంస్కరణవిధానమును నిర్మింప యత్నించుట, వ్యర్థప్రయత్న మగుచున్న దనుటకు సందియము లేదు. ఇట్టి ప్రయత్నములు పూర్వమెల్లు నిరుపయోగ మయ్యెనో ఇప్పుడును అటులే నిరుపయోగములుగాకమానవు. కాంగ్రెసుపక్షమువారిని కారాగృహమునుండి వదలిపెట్టుచో, భద్రమేముండు నని రీడిగారు ప్రశ్నించుచున్నారు. కాని, వీరి నయినను శాశ్వతముగ కారాగృహములలో నుంచుటకు సాధ్యపడదని తెలుపనక్కరలేదు. నేడుగాకున్న రేపైనను వారిని విడిచివేయక తప్పదు. నిర్బంధములు, బలప్రయోగమును సాధనములు మాత్రమేగాని, లక్ష్యములు గావని విల్లింగుడను ప్రభువుగా రిటీవల తమప్రసంగములో దెలిపియుండిరి. అటు లగుచో, రీడిగా రయినను, వీనిని లక్ష్యములని భావింపగలరా? భావింపనిచో, ఇంకను ఆలసించుటకన్న దేశనాయకుల నిర్బంధవిముక్తులగావించి, వారితో సమాధానపడుటకన్నను అనుకూలమార్గము వేఱుండదు. కాలము గడచినకొలదిని, సమా

ధానావకాశము తొలగునుగాని, సమీపింప నేరదు. కాంగ్రెసు నాయకులను కారాగృహములో నుంచి సంస్కారిణములను నిర్మించినను, వాని నామోదించువా రుండరని తెలిసినవిషయమే. అందుచే, ఇక్కార్యమును సమయము మించినపుడు గావించుటకంటె వెంటనే కావించి, నూతనదృక్పథము నవలంబించుట శ్రేయస్కర మగును. ప్రజోత్పత్తిసంవత్సరము ప్రారంభమయినపిమ్మట, కరాచీ కాంగ్రెసు జరిగెను. గాంధిమహాత్ముడు కొంతవఱకు లొంగిపోయె నని భావించినయువకులు గలరు అందుచే కరాచీ కాంగ్రెసులో నిట్టివారి ప్రాతికూల్యము నెదుర్కొని, వారిని సమ్మతింపజేయుటకు, గాంధిమహాత్ముడు పడినశ్రమ వర్ణనాతీతము. దీనినిబట్టియే సమాధానమునకై ఎంతటిత్యాగములనయినను గావించుటకు మహాత్ము డెంత సంసిద్ధుడుగ నున్నాడో గ్రహింప వీలగును. కరాచీ కాంగ్రెసుమహాసభ డిల్లీ ఒడంబడికను ఆమోదించిన పిమ్మట, కాంగ్రెసుసంఘము గాంధిమహాత్ముని కాంగ్రెసున కేకైకప్రతినిధిగ నియమించియుండెను. కాని మహాత్ముడు ఇంగ్లండుకు బయలుదేఱులోపలనే, డిల్లీ ఒడంబడిక వివిధ రాష్ట్రములలో అధికారులచే భంగపఱుపబడజొచ్చెను. మహాత్ముడు లండనున కట్టిస్థితిలో వెడలుట గౌరవమా కాదా యనికూడ సందియము ఏర్పడను పరిస్థితులు చక్కబడనివో, మహాత్ముడు లండనునకు బోగూడదని, కాంగ్రెసుసంఘము నిర్ణయించెను. అయినను మహాత్ము డోరిమిని కోల్పోవక క్రిందియధికారులతో మొదలు రాజప్రతినిధిగారితోగూడ సంప్రతించి, ఇకముందయినను డిల్లీ ఒడంబడికకు భంగము కలిగింపబడ దనువాగ్దానమును బడసి, పయన మయ్యెను. గాంధి-విల్లింగుడను ఒడంబడిక, మహాత్మునికి ప్రయాణావకాశ మిచ్చెను. మహాత్ముడు ఎట్టకేలకు లండనుకు పయనమయ్యెను. దేశపరిస్థితు లెటులున్నను, బ్రిటీషుపాలకులకు తోడ్పడి, హైందవసమస్యాపరిష్కారము గావించుకొన వీలగు నని, మహాత్ము డెంచెను. మహాత్ముడు వెడలినపిమ్మట, హిందూదేశమునందు అధికారుల పూర్వవైఖరి మరల పైకి వచ్చెను.

మహాత్ముడు హిందూదేశమున లేనిసమయమున వారు గావించిన ఆరోపణలకు ప్రభుత్వమువారు ప్రత్యుత్తరంమును ప్రకటించిరి. దీనికి జవా బిచ్చుటకు మహాత్మునికి అవకాశము లేకపోయెను. అతడు లండనులో నున్నపుడు, కాంగ్రెసు ఆశయములను రౌండుటేబిలుసమావేశములోను వెలుపలనుగూడ బ్రిటీషువారిదృష్టికి దెచ్చుటకు యావచ్ఛక్తిని వినియోగించెను. రౌండుటేబిలుసమావేశములో మహాత్ము డొసగిన యుపన్యాసముల బోలు నుపన్యాసములను పార్లమెంటుసభలో గూడ ఎవరును నింతవరకు జేసియుండ రని యూహింపబడెను. బ్రిటీషురిపోర్టరు లీప్రసంగములను పూర్తిగ గైకొని ప్రచురించుచుండిరి. పాలకు లెటులభిప్రాయపడినను, హైందవస్వరాజ్యోద్యమము న్యాయమయిన దనునభిప్రాయమును, బ్రిటీషుప్రజలలో మహాత్ముడు వ్యాపింపజేయగలిగెను. రౌండుటేబిలుసమావేశములో మహాత్ముని కాశాభంగము కలిగినను, వారు సహకారమును వీడనాడుటకు తలపెట్టలేదు. రౌండుటేబిలుకమిటీలద్వారా, రక్షణలను మినహాయింపులును డిల్లీ ఒడంబడికలో సూచింపబడినవిధమున, హిందూదేశక్షేమమున కనుకూలించునవిగ నుండునట్లు, తాము ప్రయత్నింప వీలగునని, మహాత్ముడు భావించెను. లండనునుండి బయలుదేఱుసమయమున మహాత్ముడు ఇండియామంత్రిగారితోను, ఇతరప్రముఖులతోను సంప్రతించి, అనుకూలమగువాగ్దానముల బడసియుండెను. మహాత్ముడు ఇంగ్లండును వీడునపుడు, సహకారమును గాఢముగ నభిలషించె నని, వారితో సంప్రతించిన పలువురు ప్రముఖులు దెలిపియుండిరి. త్రోవలో ఇటలీప్రతినిధి యొకరు వీరితో సంప్రతింపగ, మహాత్ముడు సత్యాగ్రహమును వెంటనే ప్రారంభించెద నని, చెప్పినమాట యసత్యమనియు, ఇది వట్టికల్పన యనియు, మహాత్ముడు తెలుపుటయకాక, వారితో నాసమయమున నుండినపాశ్చాత్యప్రముఖు లీవిషయమును బలపఱచియుండిరి. ఇంతియగాక, మహాత్మునకు వంగదేశమునకు వెడలి, అక్కడి పరిస్థితులను స్వయముగ పరిశీలించుటకు హోరుగారు అవకాశము నొసగ వాగ్దా

సము జేసిరనికూడ తెలుపబడెను. హోరుగారీవిషయము తమకు జ్ఞాపకములేదని, ఎంతచెప్పినను, పండిత మదన మోహన మాళవ్యాగారు, ఈసంగతిని బలపఱచి, మహాత్మునకును హోరుగారికిని మధ్యజరిగిన ఉత్తరప్రత్యుత్తరములను ప్రచురించియుండిరి. మహాత్ముడు ఇంగ్లండు నుండి బయలుదేఱుచుండగ, రూటర్ప్రతినిధితో నిటులు పలికియుండెను.

"హిందూదేశమునకు మరలివచ్చుటకు నాకు సంతోషముగ నున్నది. కాని ఇంగ్లండును వీడుటకు కష్టముగ నున్నది. ఇది నాసుఖ మయిన స్థితి."

పైవాక్యముల నుచ్చరించినమహాత్మునకు ఇంగ్లండుపై నెట్టిప్రేమ గలదో దీనినిబట్టి గ్రహింపవచ్చును. పిల్సనా అను నౌకపైనుండి యంగు ఇండియా పత్రికకు డిసెంబరు 23 వ తేదిని వ్రాయుచు, తాము తొందరపడి ఎట్టినిర్ణయమునకు రామని, గాంధిమహాత్ముడు సూచించియుండెను. సర్ సామ్యుయల్ హోరుగారి నిష్కాపట్యమును, మహాత్ముడు మెచ్చుకొనెను. సమాధానమార్గము గుదురునేమో కనుగొనుటకు యావచ్ఛక్తిని వినియోగించెద మని, మహాత్ముడు సముద్రముపైనుండి వ్రాసెను. దీనినిబట్టి మహాత్ముని సద్భావమును గుర్తెరుంగ వీలగును. కాని హిందూదేశమునకు రాగానే, ఆర్డినెన్సులును, కాంగ్రెసుప్రముఖుల నిర్బంధములును తమ్మి నెదుర్కొనునని వారుకలనయిన నూహించియుండలేదు. పండిత జవహరిలాల్ నెహ్రూ, షెర్వాణీ, అబ్దుల్ గఫూరుఖానుగార్లు ప్రవాసమంపబడిరనియు, సరిహద్దుప్రాంతములో కాల్పులు జరిగెననియు తెలియగనే, గాంధిమహాత్ముడు విభ్రాంతి జెందెను. వెంటనే మహాత్ము డీక్రిందితంతివార్తను రాజప్రతినిధిగారికి పంపిరి.

"హిందూదేశమున నోడ దిగగనే, బెంగాలు ఆర్డినెన్సుకు తోడుగ సరిహద్దు ఆర్డినెన్సును, సంయుక్తరాష్ట్రముల ఆర్డినెన్సును, సరిహద్దురాష్ట్రమున కాల్పులును, ప్రియమిత్రుల అరెస్టులును సంఘటించు నని తలచుటకు నేను సంసిద్ధుడను గా నయితిని. ఇట్టిసందర్భములబట్టి మన యిరువురమధ్య స్నేహసంబంధము అంతరించెనని నేను తలంపవలయునా, లేక కాంగ్రెసుకు సలహా నిచ్చుటయందు నేను అవలంబింపవలసిన మార్గమునుగూర్చి మీయొద్దనుండి ఏమయిన సహాయము లభించునా?"

పైలేఖబట్టి, నిర్బంధములకు పిమ్మటగూడ మహాత్ముడు రాజప్రతినిధిగారిసహకారమును వాంఛించె నని, స్పష్టమగుచున్నది. రాజప్రతినిధిగారీతంతివార్తకు జవాబిచ్చుచు గాంధిమహాత్ముడు ఇండియాలో చాలకాలము లేకుండుటచే వారి కిక్కడిపరిస్థితులు తెలియ వనియు, కాంగ్రెసుసంచలనమునందు మహాత్మునికి ప్రత్యక్షముగ జోక్యములేదని తాము నమ్ముచున్నామనియు, అయినను బ్రిటీషుప్రభుత్వమువారి అంగీకారముతో ఇండియాప్రభుత్వమువారు గైకొనిన చర్యలగూర్చి మహాత్మునితో సంప్రతించుటకు తాము అంగీకరింపమనియు స్పష్టపరచిరి. రాజప్రతినిధిగారి జవాబు ఎంత విరుద్ధముగ నున్నదో తెలుపనక్కఱలేదు. ఏలన, గాంధిమహాత్ముడు కాంగ్రెసు సంచలనమునకు బాధ్యుడు గాడని, రాజప్రతినిధిగారే అంగీకరించిరి. మహాత్ముడు హిందూదేశములో లేనపుడు జరిగినపనులకుగాను నిర్బంధములు ప్రయోగింపబడె నని, రాజప్రతినిధిగారు చెప్పిరి. రాజప్రతినిధిగారును, ఇండియామంత్రిగారును, నూహించినవిధమున గాంధిమహాత్ముడు కాంగ్రెసుసంఘసభ్యులచే మోసగింపబడినచో, వారి అపోహలను తీర్చుటకు మహాత్మునితో సంప్రతించి వారికి సత్యమును తెలుపుటకన్నను ఫలప్రద మగు మార్గము వేఱుండజాలదు. అట్టియవకాశము లభించినందు కు రాజప్రతినిధిగారు సంతసించి దానిని చేపట్టియుండవలసినది. తమ యనుచరులు దోస మొనర్చిరని మహాత్ముడు కనుగొనునెడల, వారిచర్యలను సమర్థించుటకు మహాత్ముడు పూనుకొన డనియు, ఎట్టి విషమ పరిస్థితులలో నయినను సత్యమును విడనాడుటకు మహాత్ముడు వెను

దీయడనియు లోక మెఱింగిన సంగతియే. ఇర్విన్ప్రభువు గారు, మహాత్మునిసత్య ప్రియత్వమును పెక్కుపర్యాయ ము లుగ్గడించియుండిరి. సుప్రసిద్ధవ్యాసకర్తలగు విల్ ఫ్రెడ్డు వెల్లక్కుగారు ఇటీవల మాంచెస్టరు గార్డియను పత్రికకు వ్రాయుచు ఈయుగమున మహాత్మునికన్నను సత్యమా ర్గానుసరు లింకొకరు లేరని, చాటియుండిరి. ఇట్టిసందర్భ ములలో మహాత్మునితో సంప్రతించి, నిర్బంధావశ్యకతను వారికి రాజప్రతినిధిగారు తెలిపియున్న వో ఎంత యో మేలు జరిగెడిది. ఈవిషయమున రాజప్రతినిధిగారు చాలపొరబా టొనర్చి రని, సర్ పి. యస్. శివస్వామిఅయ్యరు, సర్ సప్రూ బోలు అత్యంతమితవాదనాయకులుగూడ చాటియుండిరి. మహాత్మునితో సంప్రతింప కుండుటకు రాజప్రతినిధిగారు దెలిపెన కారణములు నిస్సారములు. ఇట్టిపొరబాటువలన, హిందూదేశమునకు తీఱనివిషాదస్థితి దాపరించె నని, ఇకనయినను రాజప్రతినిధిగారు గ్రహిం చుట శ్రేయస్కర మగును. స్థలాంతరమున ముద్రింప బడిన గాంధీ రాజప్రతినిధిగార్ల ఉత్తరప్రత్యుత్తరముల గాంచినవా రెవ్వ రయినను, మహాత్మునిసద్భావమును రాజప్రతినిధిగారు తగినరీతిని గ్రహింపక, ఇండియా ఇంగ్లం డులసంబంధమునకు ప్రబలనష్టము గలిగించి రని, గ్రహింప గలరు. రాజప్రతినిధిగారికి గాంధిమహాత్ముడు పిమ్మట పంపిన తంతివార్త, వారిమనమునందు గలిగిన విషాద మును సూచించుచున్నది. రాజప్రతినిధిగారు స్నేహ ముతో జేసిన సూచనను నిరాకరించినందులకు గాంధి మహాత్ముడు మిగుల జింతించెను. భారతదేశమునకు ప్రాణప్రద మయిన విషయముగూర్చి తమతో సంప్రతిం చుటకయినను రాజప్రతినిధిగారు నిరాకరించియుండుట, విరుద్ధ మని మహాత్ము డెంచెను. ప్రజాభిప్రాయమును గ్రహించుటకు విల్లింగుడనుప్రభువుగారు అసలే పూను కొనకుండుట దురదృష్టమని మహాత్ముడు భావించెను. ఇప్పుడైనను రాజప్రతినిధిగారు తమనిశ్చయమును మార్చు కొని, తమయెడ స్నేహితునివలె ప్రవర్తింపవలయు నని, మహాత్ముడు కోరెను. కాని మహాత్మునికోర్కెను పాటింప వీలు లేదని, రాజప్రతినిధిగారు జవాబిచ్చిరి. మహాత్ముడు హిందూదేశమునకు వచ్చునప్పటికే నిర్బంధవ్యూహము పూర్తియయ్యెను. సహకారమువిషయమున మహాత్ముడు నిస్సహాయు డయ్యెను. దీనిఫలితము, మహాత్మునినిర్బం ధము. ఇట్టినిర్బంధకాలములో రౌండుటేబిలుకమిటీలు గావించువిచారణలవలన నెట్టిప్రయోజనము గలుగ దని తేలెను. మహాత్ముని నిర్బంధమున నుంచి, సంస్కరణముల నిర్మాణమును పూర్తిజేయవలయునను కోర్కె, గలదని బెంథాలుగారి రహస్యలేఖ తెలుపకయే తెలుపుచున్నది. ఇట్టియూహకు ప్రస్తుతసందర్భము లనుగుణముగ నుండు టచే, మహాత్మునినిర్బంధము కాకతాళీయము గాదని తలంపవలసివచ్చును. ఇప్పటికి దెలిసినసందర్భములబట్టి ప్రస్తుతస్థితికి మహాత్ముడేమాత్రము బాధ్యుడుగాడని, వెల్లడి యగుచున్నది. ఇంతియకాక స్వేచ్ఛగ నున్న మహాత్ముని కన్నను, కారాగృహమున నుండుమహాత్ముడు ఎక్కువ ఉపద్రవకరుడనుసత్యము,అనుదినము వెల్లడియగుచున్నది. భావికర్తవ్యమును ప్రభుత్వమువా రెటులు నిర్ణయించెదరో తెలియదు గాని, ప్రస్తుతసమయమున అత్యంతసహకార వాదులు దెలిపెడి హితవుగూడ వీరికి రుచించుటలేదనియు, నిర్బంధవిధానమును వీరు పూర్తిగ సాగింప నిశ్చయించి రనియు, విదిత మగుచున్నది. కాని, ఆంగీరససంవత్స రమునందయినను, పాలకులకు వివేకముదయించి, సమా ధానమార్గమును వారు చేపట్టునటుల పరమేశ్వరుడు అను గ్రహించుగాక యని, ఇండియా ఇంగ్లండుల సఖ్యము కోరువారందరును వేడుచుందురు.

* * * *

నూతనసంవత్సరము

నూతనసంవత్సరము శుభదాయక మగునా, లేక అనిష్టహేతు వగునా యని వితర్కించుట ప్రజలకు పరి పాటి యయినది. కాని, శుభాశుభములుగాని, లాభనష్ట ములుగాని, మానవులవైఖరి ననుసరించి యుండును. నిజ మాలోచించిన, మానవుడు ఫలాపేక్ష లేక కర్మ జేయుట

కర్తృడేకాని, ఫలమును నిర్ణయించుట కర్తృడుగాడు. శ్రీ కృష్ణభగవానుడీసంగతినే అర్జునున కిటులు బోధించెను:

శ్లో॥ కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన।
మాకర్మఫలహేతుర్భూ మా తేసంగో స్త్వకర్మణి॥

మానవుల కధికారము కర్మల నొనరించుటయందే కలదు కాని ఫలమునందు ఎట్టి అధికారమును లేదు. అందుచే ఫలము నాసింపక కర్మల గావించుచో, కర్మల జేయని వానికివలె బంధన మేర్పడజాలదు. ఆకారణముచే సత్యమని నమ్మినధర్మమును భారతీయు లాచరించుటయే యుక్తమము. గెలుపుగాని ఓటమిగాని, పాటింపబడదగిన విషయము గాదు. ఏలన,

శ్లో. హతోవా ప్రాప్స్యసే స్వర్గం
జిత్వావా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠకౌన్తేయ
యుద్ధాయ కృతనిశ్చయః.

అని శ్రీ కృష్ణభగవానుడు అర్జునున కిచ్చినసందేశమే, సత్కర్మ లాచరించువా రెల్లరకును వర్తించును. స్వరాజ్యసంపాదనకై ఎందరో కారాగృహములకు జనిరి. ఎందరో అపూర్వత్యాగముల నొనర్చిరి. వీరికర్మయొక్క ఫలితము నిప్పుడు గ్రహింపవీలు లేకపోయినను, స్వార్థరహితమగు సేవ స్వాతంత్ర్యసిద్ధికి బునాదుల వైచుచున్న దనుటకు సందియము లేదు. అందుచే ప్రజోత్పత్తిసంవత్సరమునందువలె ఆంగీరససంవత్సరమునందుగూడ స్వరాజ్యము లభింపనివో, నిరాశ జెంద నవసర ముండదు. దేశసేవకై త్యాగమొనర్చుచున్నవారి త్యాగము నేడు గాకున్న రేపయినను ఫలింపకమానదు. సంవత్సరాది నాడు తీపి, పులుసు, చేదునుగలిపి ఆంధ్రు లారగింతురు. ఇటులనే సంవత్సరమందంతటను శుభాశుభఫలములు మిళితము గాంచును. కొన్నిప్రియములును అప్రియములునుగూడ జేరి జీవితమును ప్రేరేపించును. కాని ప్రియము లభించినపుడు ఉప్పొంగుటయు, అప్రియము వాటిల్లినపుడు విషాదభరితులగుటయు, ధీరులలక్షణము గాజాలదు. హిందూతత్త్వమంతయు ఇట్టిద్వంద్వభావమునకు విరుద్ధముగ నున్నది. ఈకారణముచే ఆంగీరససంవత్సరమునందు, ఎట్టిఫలము చేకూరినను ఆంధ్రులు అప్రమత్తులై తమధర్మమును నిర్వహించెదరుగాక యని, పరమేశ్వరుని ప్రార్థించెదము.

* * * *

**ఆంధ్రదేశపరిణామము**

ప్రజోత్పత్తినామ సంవత్సరమునందు ఆంధ్రమహాజనులు దేశశ్రేయముకొఱకు స్వలాభమును గూడి పాటింపక అప్రమత్తులై త్యాగముల సలిపిరి. అందువలన ఆంధ్రరాష్ట్రాందోళనము విశేషముగ వ్యాప్తి గాంచలేదు. కాని రౌండుటేబిలు సమావేశము జరుగనున్న సమయమున ప్రత్యేకాంధ్రమహాసభ చెన్నపురిలో గూడి, రౌండుటేబిలుసమావేశమునకు వెడలిన ఆంధ్రప్రతినిధులకు రాష్ట్రపుకోరికను తెలుపవలయునని సందేశ మంపియుండెను. ఆంధ్రప్రతినిధులగు బొబ్బిలిరాజు, వరహాగిరి జోగయ్యపంతులు, ది. బ. మోచర్ల రామచంద్రరావు పంతులుగార్లు మున్నగు ఆంధ్రప్రముఖులు రౌండుటేబిలు సమావేశసభ్యులకు ఆంధ్రరాష్ట్రవాంఛను తెలుపుటయు, కాక, ఇండియామంత్రిగారికి గూడ దీనిని నివేదించియుండిరి. ఉత్కళరాష్ట్రవిచారణ జరుగుచున్న యీ సమయమున, ఆంధ్రరాష్ట్రవిచారణగూడ జరిగినమేలుగ నుండెడిది. అటులు జరుగకుండుటచే, ఉత్కళరాష్ట్రపు సరిహద్దులను నిర్ణయించుటకు చాల చిక్కులేర్పడుచున్నవి. స్టేటుకౌన్సిలుసభలో దిః బః నారాయణస్వామి చెట్టిగారు దెచ్చిన ఆంధ్రరాష్ట్ర తీర్మానమునకు ఇండియా ప్రభుత్వసభ్యు డిచ్చిన ప్రత్యుత్తరము మిగుల నిరుత్సాహముగలిగింపకమానదు. కాని, ఆంధ్రులు నిరుత్సాహులుగా నక్కఱలేదు. ఆంధ్రులకోరికను అధికారవర్గమువారు సఫలపఱుపకపోయినను, స్వరాజ్యము లభింపగనే, భాషల బట్టి నూతనరాష్ట్రములు తప్పక నిర్మింపబడును. ఆసమయమున ఆంధ్రరాష్ట్రమును నిర్మింపకతీఱనిస్థితి సంభవింపగలదు. కాంగ్రెసుమహాసభయు, సర్వపక్షమహాసభయు,

ఆంధ్రరాష్ట్రనిర్మాణము నామోదించి యున్నవి. అందుచే ప్రజాభిలాషలు నెఱవేఱునపుడు, ఆంధ్రుల ప్రియ మగు కోర్కెగూడ నెఱవేఱకమానదు. ఆంధ్రరాష్ట్రము లభించినపిమ్మటగాని, ఆంధ్రులసర్వతోముఖాభివృద్ధి త్వరితముగ, సాగునని తోపదు. వివిధజీవితశాఖలలో ఆంధ్రులకు దగిన ప్రోత్సాహము కలుగుటలేదు. అయినను ఆంధ్రులు ముందునకు వచ్చుచున్నారని గ్రహింపవచ్చును. ప్రొఫెసరు రాధాకృష్ణనువంటి తత్త్వవేత్తలు ఆంధ్రవిశ్వవిద్యాలయమున కధిపతులుగ నుండుటచే, వీరినాయకత్వమున ఆంధ్రదేశమునందు సరియగు విద్యావిధానము వ్యాపించునని తలంపవచ్చును. ఆధునికసమయమున సుప్రసిద్ధులగు ఆంధ్రకవిపుంగవు లింకను బయలుదేఱకపోయినను, రవీంద్రనాథునిబోలువారు ఆంధ్రదేశమునం దుదయింపకపోయినను, ఆంధ్రులు కేవలశబ్దాలంకారములతోనే తృప్తి జెందక, భావమునకు ప్రాముఖ్య మీయవలయుననుతలంపు వ్యాపించియుండుట శుభచిహ్నము. ఇట్టియభిప్రాయము గలవారిలో తమ భావాతిశయమువలన లోకమును భ్రమింపజేయగలవారు బయలుదేరకపోయినను, త్వరలో నట్టివా రుద్భవించెద రనునాశ కెడము గలుగుచున్నది. అందుచే కవిత్వముగూర్చి ఆంధ్రుల కొందరలో గలిగిన భావపరివర్తనము నూరక నిరసించుటకన్నను, అట్టివారికి తగినప్రోత్సాహ మొసగి, వారియందు గల గుణాతిశయమును పైకిదెచ్చుట, ఆంధ్రమహాజనుల ధర్మమగును. సంగీతవిద్యయందు ఆంధ్రులు వెనుకబడియున్నారను ప్రతీతి నానాటికి దొలగుచున్నది. దాక్షిణాత్యులతో పోటీసలిపి, వారినిమించగలవారుగూడ బయలుదేఱుచుండ, ఆంధ్రుల సొమ్మగు కర్ణాటకగానము, మరల ఆంధ్రులను వరించునని నమ్ముట కవకాశము గలదు. ఇక నాటకములవిషయమున, తగిన కళాపోషకులు లేనికతన, కట్టుదిట్టములు లేనినాటకముల నాడుచు, ప్రజలప్రశంసకవి యంతగ పాత్రము గాకున్నను, అభినయప్రావీణ్యమునం దేమి, పాత్రధారణసామర్థ్యమునం దేమి, ఇతరప్రాంతములకు దీసిపోనినటులు ఆంధ్రదేశములో గలరనియు,వారికి తగినసహాయము లభించుచో, వారినైపుణ్యము పైకి రాగలదనియు, ఎంచవచ్చును. ఆధునిక చిత్రకళావిషయములో వంగదేశమువలె ఆంధ్రదేశమును ప్రత్యేకప్రావీణ్యము జూపెయుండెను. కాని దీనికిని తగురీతి ప్రోత్సాహము లేనందుచే, కళానిపుణులు కృశించుచున్నారు. ఢిల్లీలో జరిగిన అఖిలభారతపిటెన్నిసుపందెములలో ఆంధ్రులు సింగిల్సు ఆటలోను, డబుల్సు ఆటలోను, ఉత్తీర్ణు లయి, మద్రాసు రాజధాని కంతకును, గౌరవమును సంపాదించిరి. ప్రధానపట్టణ మగు చెన్నపురిలోగూడ టెన్నిసులందు ఆంధ్రుల ప్రావీణ్యము గుర్తింపబడు చున్నది. ఆంధ్రోద్యమము చురుకుగ బనిచేయునెడల ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి సుసాధ్యమగును. కాని దేశదృష్టి ఇతరసంచలనములలో నిమగ్నమై యుండుటచే, ఆంధ్రులదృష్టిగూడ యావద్భారతవ్యవహారములలో విశేషముగ లగ్నమై యున్నది. అయినను హైందవప్రతిభ ప్రపంచదృష్టి నాకర్షించునపుడు ఆంధ్రు లిందులకు శక్తివంచనలేక తోడ్పడి, యశముగాంచగల రనునమ్మకము గలుగుచున్నది. గాంధిమహాత్ముడు ఆంధ్రులసామర్థ్యమును గ్రహించి దాని నిదివఱ కుగ్గడించియుండెను. ఆంధ్రులతో కలసి మెలసి మెలగెడి యితరరాష్ట్రములవారును, ఆంధ్రులు దేశాభ్యుదయమునకు తోడ్పడుచున్న విధమును గుర్తించుచున్నారు.

**పాలకులకు మనవి**

సంవత్సరాదిసంచికపీఠికను ముగింపక పూర్వము పాలకుల కొకమనవి గావింపవలసియున్నది. నిర్బంధప్రయోగమువలన పాలకులకోర్కె లీడేరెనని, వారు తలంచుచో, ఇంతకన్నను పొరపాటు వేఱుండదు. కాంగ్రెసునుండి ప్రజలమనములను మరలించుటకు నిర్బంధవిధానము తోడ్పడలేదని, మితవాదులు గూడ దెలుపుచున్నారు. ప్రజలలో నిరాశ గలిగించుటకును, ప్రభుత్వమువారిపట్ల అవిశ్వాసమును గలిగించుటకును మాత్రమే నిర్బంధవిధానము తోడ్పడుచున్నది. నిర్బంధము ను మనస్స్ఫూర్తిగనామోదించువా రేపక్షమువారిలోను

గనుపింపరు. ప్రబలబాహ్యాసంచలనము నరికట్ట వీలయి నను, వారిమనములను ప్రేరేపించుభావములను ఏ ఆర్డి నెన్సులును అణచివేయజాలవు. ఇంతవఱకు ౧౯౩౨ వ సంవత్సరమునందు ఎనిమిది ఆర్డినెన్సులు ప్రయోగింప బడెను. ఇంకను ఎన్ని ప్రయోగింపబడనున్నవో తెలి యదు. ప్రజలలో బెరిగిన అశాంతి నివి పెరుగజేయు చున్నవిగాని, తొలగించుటలేదని, దేశస్థితిని జాగరూక తతో కనిపెట్టుచున్నవారు దెలుపుచున్నారు. లాఠీ ప్రయోగాదిబలప్రయోగమును కన్నులార గాంచు ప్రజల కు బలప్రయోగముపట్ల మఱింత ఏవగింపు గలుగుటచే, అశాంతి వ్యాపించుచున్నది. ప్రజలమనములలో బెరిగిన విముఖతను దొలగింపవలయు ననిన, పాలకులు సమా ధానమార్గము నవలంబించి, నిర్బంధములను పూర్తిగ విడనాడవలయును. 47-వ కాంగ్రెసుమహాసభ ఏప్రిల్ 24 తేదిన డిల్లీలో పండిత మదనమోహన మాళవ్యాగారి యధ్యక్షతక్రింద జరుగనున్నది. దీనిని ప్రభుత్వమువారు జరుగనిచ్చునో, కాంగ్రెసుప్రముఖులను నిర్బంధవిముక్తుల గావించి, ఆర్డినెన్సులను రద్దుజేయుట కింతకన్నను అను కూలసమయము లభింపజాలదు. ఇర్విన్‌ప్రభువుగారివలె విల్లింగుడన్‌ప్రభువుగారును బలప్రయోగము నిరుపయోగ మనిత్వరలో గ్రహించి, ఆంగీరససంవత్సరమున నిర్బంధ విధానమునువిడనాడి, ప్రజలలో బెరిగిన అశాంతిని బోద్రోలుట అత్యవసర మని విన్నవించెదము.

**ఉగాదిసంచిక**

కడచిన ఉగాదిసంచికను ప్రచురించుసమయమున, నిర్బంధమున నున్న ఆంధ్రపత్రికాధిపతు లగు కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు,విడుదలయై సంచికను స్వయ ముగ నిర్వహించి, పూర్తిజేసిరి. ఈపర్యాయము అట్టిభాగ్య ము లభింపదయ్యెను. వారింకను కారాగృహమునందు నిర్బంధితులైయున్నారు. అయినను ఆంధ్రాభ్యుదయము, వారి మనము నెల్లపుడును ప్రేరేపించుచుండు ననుటకు సందియము లేదు. వారు సంచికప్రచురణసమయమున స్వే చ్ఛను గోల్పోయియుండుటయు, ఆర్డినెన్సులవలన వ్యాస ప్రకటనమున కేకాక,ఛాయాపటప్రకటనమునకుగూడ తీఱని నిరోధము లేర్పడియుండుటచేతను సంచికానిర్వహణము ఈపర్యాయము మిగుల కష్టసాధ్యమయినది. అయినను దీనిని సకాలమునకు ప్రచురించుటకు తోడ్పడిన వ్యాస కర్తలకును, ఛాయాపటములను పంపిన మహాశయులకును, కృతజ్ఞతాపూర్వకవందనముల నిందుమూలమున దెలుపు చున్నారము. సంచికలో ముద్రింపబడిన త్రివర్ణచిత్రముల గాంచిన, ఆంధ్రచిత్రకారుల నైపుణ్యమును గ్రహింప వీ లగును. ఆంధ్రచిత్రకారుల నైపుణ్యము నానాటికి విస్త రించుచు, ఆంధ్రుల కమితోత్సాహము గలిగించుచున్నది. ప్రతాపరుద్రుని నాటకమును కీ। శే। మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు రచించి,ప్రతాపరుద్రుని మంత్రి యుగంధరుని ఆంధ్రులెన్నటికిని మఱచుటకు వీలు లేకుండ అద్భుతరీతిని చిత్రించిరి. అట్టి ప్రతాపరుద్ర మహా రాజును బందీగ గొంపోవుచున్న చిత్రమును,సుసర్ల వేంకట రామయ్యాగారు కడునిపుణతతో రచించి, ప్రతాపరుద్రుని జీవితములోని ప్రధానఘట్టమును దిక్ప్రదర్శనము గావిం చిరి. ఉగాదిగూర్చి సెట్టి లక్ష్మీనరసింహముగారు రచించిన పద్యములు ఉగాదిపండుగకు ముందు ఆంధ్రులలో నుండు పూర్ణోత్సాహమును స్ఫురింపజేయుచున్నవి. ఉగాదిగూర్చి పూడిపెద్ది వెంకటరమణయ్యగారు వ్రాసినవ్యాసము వచ నములో నున్నను, సరసపద్యకావ్యమువలె రసమును గ్రుమ్మరించుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకుసంవత్స రమునకు లక్షరూపాయలవార్షికమూల్యము నొసగిన జయ పురం మహారాజాగారిత్రివర్ణచిత్రము, ఆంధ్రుల గౌరవ మున కెప్పుడు పాత్రమగుచునే యుండును. వారి వైదుష్య మునకు వారి భూరిదానమెంతయు వన్నెబెట్టుచున్నది. సంచికయందుగల పద్యవ్యాసములు శయ్యాగాంభీర్యము ను, భావాతిశయమును జూపుచున్నవి. సంచికయందు భాషలో వేర్వేఱు భాగములకు సంబంధించిన వ్యాస ములు గలవు. సారస్వత సంబంధమగు వ్యాసము లీ సంచికయందు ప్రాముఖ్యము నధికముగ బడయుటకు

కారణములు చదువరులకు తెలిసినవే కాన, వాని నిట ప్రత్యేకముగ వివరింప బనిలేదు. ప్రస్తుతనిర్బంధములు తొలగి, మరల అనుకూలవాతావరణ మేర్పడినపిమ్మట, సర్వభూషణసమన్వితమగు సంచికను ప్రచురించి, పాఠకుల కందజేయగలమని నమ్ముచున్నారము. సంచిక యందలి కథలు మనోహరమై యొప్పుచు, కథారచన యందు ఆంధ్రులు అభివృద్ధి గాంచుచున్న విధమును దెలుపుచున్నవి. మాధవారణ్యునిగూర్చి కురుగంటి సీతారామయ్య, ఎం. ఏ. గారు రచించిన వ్యాసము వారి జీవితముగూర్చి పెక్కువిశేషముల దెలుపుచున్నది. ఆపస్తంబునిగూర్చి పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసిన వ్యాసము, వారిజీవితవిశేషముల నెఱుగ గోరువారికి మిగుల లాభకారిగ నుండగలదు. ఆపస్తంబుని నాటి ఆచారములు చక్కగ వివరింపబడినవి. సంగీతమును గూర్చి తెలుగుభాషలో వ్యాసముల వ్రాయువా రరుదుగ నున్నారు. వింజమూరి నరసింహాచార్యులుగారు, భారతీయరాగపద్ధతినిగూర్చి వ్రాసిన వ్యాసము పండితసమ్మతముగ నుండి, వారిపరిజ్ఞానమును వెల్లడిజేయుచున్నది. విభీషణశరణాగతికి సంబంధించినకథ అన్నిప్రాంతములలో ప్రజలను రంజింపజేయుచుండును. ఇట్టి విషయమును మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ఆంధ్రభాషలో వ్యాసరూపమున చర్చించి, విభీషణుని యందలి గుణాతిశయమును చక్కగ వివరించిరి. అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు అచ్చతెలుగు భాషలో మంచిబ్రతుకునుగూర్చి వ్రాసిన వ్యాసము, భావమునందేమి, శైలియందేమి, నిరుపమానమై యొప్పుచు వారి కీర్తిని పెంపుజేయుచున్నది. తలిశెట్టి రామారావుగారి హాస్యచిత్రములు పాశ్చాత్యపత్రికలలో ప్రచురింపబడు చిత్రములను మఱపింపజేయుచు, చదువువారలకు ఆనందమును గూర్చుచు, ఆధునిక సంఘమునందలి లోపములను వెల్లడిజేయుచు, సంస్కరణావశ్యకతగూర్చి ప్రబోధము గలిగించుట కెంతయు చాలియున్నవి. ఈప్రస్తావనలో పేర్కొనబడని వ్యాసములును, పద్యములును, చిత్రపటములును కలవు. కాని, దిఙ్మాత్రముగ కొన్నిటిని మాత్రమే పేర్కొంటిమి. వీనిని రచించిన ఆంధ్రప్రముఖులెల్లరు మాకీసమయమున తోడ్పడినందులకు, వారికి కృతజ్ఞతను దెలుపుచు, ఇకముందు గూడ వారు సంచిక ప్రచురణమునకు శక్తివంచనలేకతోడ్పడి, ఆంధ్రసారస్వతసేవ నొనర్చెదరుగాక యని, విన్నవించెదము.



పండిత మదనమోహన మాలవ్యాగారు
(ఇటీవల షష్టిపూర్తి మహోత్సవము జరిగినది)

# వినయాంజలి

అయినంపూడి గురునాథరావు గారు

నవరత్నమయదరీ • శైలసంపద్యుక్త
మిహికాచలాదిభూ • మీధరములు
ప్రవిమలవాః పూర • భవ్యభాగీరథీ
ప్రముఖవిఖ్యాతత • రంగిణులును
దివ్యౌషధివ్రాత • దీపితనందనో
ద్యానసన్నిభమహా • కాననములు
సకలభూతాధార • సస్యసంఘాతసం
పన్నోర్వరాభూరి • భాగములును

గలిగి జంబూమహోద్వీప • గతసమస్త
వర్ష తిలకాయమానవై • వఱలు నీకు
లలిత భక్తిని సవినయాం • జలి ఘటింతు
భవ్యసద్గుణనికురంబ! భారతాంబ!

## ఉగాది

సెట్టి లక్ష్మీనరసింహముగారు

శ్రీరసవత్ప్రసంగహృత
చిత్తుఁడు, భర్తృయుతాంబికాశుభాం
గీరసనాగ్రరంగచరి
ఖేలదమోఘపవిత్రనాముఁ, డాం
గీరసముఖ్యసద్విబుధ
కీర్తితవర్తనుఁడైన విష్ణు వాం
గీరసవత్సరంబున సు
ఖింపఁగఁజేయుత సర్వలోకమున్

ఆందోళనము కల్గె నమలామ్రపల్లవ
మ్ములకుఁ గోకిలవోరకులమువలనఁ,
గీరద్విజాళి దీక్షించి పంచాంగంబు
సాఁగించె మాధవాస్థానసీమ,
రమణీయసౌందర్య మమరారె మేలిక్రొ
న్ననల వల్ల లతకూనలకు నెల్ల,
సదమలభక్తితో జనులు శ్రీరామలీ
లానమారంభాభిలాషు లైరి,
వచ్చె' వచ్చెఁ' గ్రొత్త వత్సరం బిది, మహో
త్సవదినం, బటంచు జనములు నగ
రముల, గ్రామములను, బ్రమదంబు నొందిరి.
ముదముల పెనుగాది యిది యుగాది




పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

ఉగాదివేకువ. లోక మప్పుడే కానుకల సందడులతోఁ గలకలలాడుచున్నది. వేగుఁజుక్క తెలిసూత్రమును బన్ని నీలమణులకై దేవులాడుచున్నది. గంధవహుఁడు చీరుముత్తెముల నోడిఁ బోసికొని దారపుపోచకై తడవులాడుచున్నాఁడు. తేఁటి ముంజేత గంధ మిడికొని గిన్నెకై గిరగిర తిరుగుచున్నది. విడియువిడని చిన్నిచేతుల నాలత కూన విరిసరు లల్లుచున్నది. వచ్చియురాని పనితనమున నీచివురాకు ముక్తాహారములఁ గూర్చుచున్నది. తెలిసియుఁదెలియని విన్నాణమున నీలేఁగొమ్మ పూలగుత్తులఁ గట్టుచున్నది. అదిగో! చిలుక ముక్కున పవడముఁ గఱచికొనిపోవుచున్నది. సీతాకోకచిలుక చిత్రపటముం దిరుకేల నిరికించికొనిపోవుచున్నది. రాయంచ ముంగాళ్ల పద్మరాగమణు లెత్తికొనిపోవుచున్నది.

ఆకులకు కరవై వెలితివెలితిగఁ గూర్చికొన్న నాయాకుటీరముసందులనుండి యీసందడులఁ జూచుచు నాలో నే నాలోచించికొనుచుఁ గూర్చుంటిని. తెలిసియుండియు స్వప్నమాలికల సంతరించికొనుచున్నాను. అక్కడక్కడ రాలు పులుఁగుల పలుకుల నేరికొనుచున్నారు మాగన్ను వెట్టికొనియు విశ్వమంతటి నొక్కపటమునఁ జూచుచున్నాను.

అదిగో! విశ్వకామిని పరమపురుషునకై కూర్చుచున్న పుష్పమాలికలోని క్రొంబూవు. వసంతరాగమాలపించి వన్నెకెక్కిన యామెచివురువ్రేళ్ల నీయుగాది పూ వెంత కలకలలాడుచున్నదో! వెలుఁగు నీడలవలె నీప్రసూనదళము లొండొంటఁ గ్రిక్కిరియుచున్నవి. ఇందలి మధులేశమున కాసవడి యెన్నిజీవు లీపత్రముల కూర్పుల దారిచేసికొనఁ బ్రాఁకులాడుచున్నవి! ఈమధుకణ మాపరమపురుషుని ప్రేమమే. ఈప్రసూనవికాస మాతని మందహాసమే. జగన్మోహనమై జల్లుజల్లున నిండు వెల్లివిరియు వలపుటల లాతని యూర్పుటలలే! ఆహా! ఈ పూవురేకుల శోభ లప్రతిమానములు! మహాపురుషుల చిత్రపటములఁ జిత్రింప నెత్తిన జిలుఁగువస్త్రము లివి. జగత్సౌభాగ్యమున రాగరేఖలఁ జిలుకరింపఁ దెరచిన రంగుచిప్ప లివి. చారిత్రకోదంతముల స్వర్ణాక్షరముల లిఖింపఁ బఱచిన పుటపంక్తు లివి. జీవనసౌధనిర్మాణమునకై మలఁచిన చంద్రకాంతశిలాఫలకము లివి. మహాత్ముల స్వార్థత్యాగ మభివర్ణింప నిలిపిన శాసనపట్టము లివి. ఇట్లాలోచించుకొనుచుండ నేదో వినవచ్చిన ట్లయినది.

ఆజగత్కాంత చదువఁదెఱచిన మహాగ్రంథములోని నూత్నకావ్య మీయుగాది. అదిగో! ఆమెపరనారంభమున గళమ్ము సవరించుకొనుచున్నది. ఆగళరవమ్మునఁ జిలుకలు పలుకుచున్నవి. కోకిలములు కూయుచున్నవి. భరద్వాజములు పాడుచున్నవి. అంత నేఁ గన్ను లరవిచ్చిచూడ నుంకించితిని. ఆమె చివురాకుచేతులఁ గుసుమాంజలి ఘటించి చదువ నారంభించినది. విశాలముగ విప్పిన యామెకన్నుల కాటుక రేకలై రేయి కరగుచున్నది, క్రొందళుకై దివసము తాండవించుచున్నది; నీడలై నీలిమబ్బులు నింగిఁ బ్రాఁకుచున్నవి. ఆమె సవరించుకొను కెమ్మోవికావి ప్రకృతిహృదయమున రాగరేఖలు రచించుచున్నది. ఆమసి గోముల నలముచున్నది. సందె పూఁతల సంతరించుచున్నది. ఆమెక్రొన్నుడులు సాగరగర్భమున ముక్తాఫలములై మురియుచున్నవి. సుమముఖమ్ములఁ దేనె సోనలై దిగజారుచున్నవి. కువలయమ్మున వెలుఁగు రేకలై ప్రాఁకుచున్నవి. అదిగో! ఆమె

సవిలాసముగ నూత్న రాగ మాలపించుచున్నది. అదియే ప్రేమతరంగములుగఁ బృథ్వి నెల్లయెడల వెల్లివిరియుచున్నది. ఇందలి భావగాంభీర్యము, ఇందలి పదార్థసార్థకత, ఇందలి శైలిసామ్యము నెఱుంగ నెవఁడు సమర్థుఁడు? నాకన్నులయెదుటఁ బరమార్థవేదియగు నాపరమపురుషుఁడు నిలిచిన ట్లయినది. నాహృదయము క్రొవ్విరివలె విరిసినది.

ఓజగన్నాయకా! ఈయుగాది చిత్రవిచిత్రమై యలరారుచున్నది. నేఁటి వేగుజాము నీకై నీరాజనమెత్తుచున్నదో, లేక వేగుజామునేన నీవే జిలుఁగుసాలువుఁ గప్పుచున్నావో! రేపకడ నీకై వింజామరలు విసరుచున్నదో, లేక రేపకడతల నీవే తురాయి నిడుచున్నావో! లేఁబగలు నీకై కనకాంబరముఁబరచుచున్నదో, లేక లేఁబగటికి నీవే కావిచీరఁ గట్టించుచున్నావో! దివసము నీకై చిత్రపటముల నంతరించుచున్నదో, లేక దివసమును నీవే సింగారించుచున్నావో! లేఁబ్రొద్దు నీకై కరదీపికల నెత్తుచున్నదో, లేక లేఁబ్రొద్దునకు నీవే వజ్రకవచమును దొడుగుచున్నావో! సందె నీపదమ్ములఁ గుంకుమపరాగముఁ జల్లుచున్నదో, లేక సందెముంగాళ్ల నీవే లత్తుక నలందుచున్నావో! మునిమాపు నీకై కస్తూరికాన్క వెట్టుచున్నదో, లేక మునిమాపుకన్నుల నీవే కాటుకరేక లిడుచున్నావో! రేయి నీకై సన్నజాజుల నేరికొనుచున్నదో, లేక రేయిమేన నీవే మగఱాలనగలు దొడుగుచున్నావో! ఏమో! ఏది యెట్లయిన నేమి? ఈదినమెల్లఁ గాన్కలతోఁ గలకలలాడుచున్నది.

ఇంతవరకుఁ బరమపురుషు ధ్యానించుచుఁ గన్నులుమూసికొన్న నేను తిరిగి స్వవిషయకచైతన్యమునఁ గన్నులించుక విప్పితిని. ఈయుగాదిదినమున నిరుపేదనై యీపర్ణకుటీరమున నొంటరినై యున్న నాకు, ముచ్చటకయిన నొక్క యుగాదికానుక నొసంగువారు లేరని విన్నఁబాటున ముడిచికొనిపోయి దిస్సవడిన యాకుటీరాంతరమున నల్లనఁ జూచితిని. విడివిడిగ వెలితివెలితిగ జారిపోయిన యాపర్ణములసందున మిలమిలలాడుచుఁ దళితళలాడుచు నేదో జారిపడిన ట్లయినది. ఉగాది విరిసిన కల్పతరుశాఖనుండి పారిజాత మొండు పట్టుదప్పి యిందుఁ బడినదేమో! ముస్తాబగుచున్న ప్రొద్దుపడఁతి చేతిముకుర మిటు జారినదేమో! ఉగాదికానుకల గంపనుండి కనకభూషణ మొండిటు దొరలినదేమో! పూదండ లల్లి యలసిన పుష్పలావికచేతి దారపుపోచ యీయాకులదారిని జారినదేమో! ఉగాది నెగురవైచు బాలకునిచేతి గాలిపటము పైఁడిజాలి పట్టుఁదప్పి యిటు డూసినదేమో! ఏమో! దానిని తెలిసికొనఁ దెలివిఁగొని కన్నులు విశాలముగ విప్పితిని. సోగమేనితో, సుందరవదనసౌభాగ్యముతో మణిభూషల ధాళధళ్యముతో, మజిలీను కావిచీరతో, మందహాసముతో, అడుగుల సడి లేకుండ, నేలదూర్వాంకురములు నలుగకుండ, ఉగాదిపడఁతి యొయ్యారముగ దిగివచ్చి నాకన్నులముంగల నిలిచినది. చీఁకటిని జీల్చివైచు నామెమేనితళుకు నిరుపేదనట్టింట నిలిచినది. దీనుఁడనై దిస్సవడియున్న న న్నామె తన వెచ్చని మునువ్రేళ్ల వాత్సల్యమునఁ బట్టినది. చిఱునవ్వుతో నామె నన్నుఁ బలుకరించినది. ఆమెచెక్కులు గులాబీరేకులఁ జివురించినవి. ఆమెయంగుళ్యగ్రములు మాలతీకోరకమ్ములఁ దొడిగినవి. ఆమెపదమ్ములఁ బద్మరాగోదయమయినది. ఆమెపలుచనిచీర తెరచాటునఁ దూఁగాడు మృదుకరమ్ముల నుగాదికానుక లురుకుచున్నవి. నే నానందాశ్చర్యముల నిండిన యెడందతో నాపర్ణకుటీరమును బరికించితిని. ఆ చీఁకటికొంపలో నుగాదిపండుగ యొక్కమాటుగ నవతరించినది. పైఁడినీటి కలయంపి! వన్నెవన్నెల ముగ్గులు! నాఁటి యామెవాత్సల్యమునకు గాలి కరఁగినది; కటికనేల పులకించినది; చీఁకటి చిఱునవ్వు నవ్వినది. ఎందుండి వచ్చినదో! ఆమెచీరకుచ్చెళ్లు నలుగనైన నలుగలేదు. ఆమెపదతలమ్మునఁ బారాణిజాడలు చెదరనైనఁ జెదరలేదు. ఆమెమేనిచందనపు పూఁత కరఁగనైన కరఁగలేదు. ఆమెపలుచని తొగరుపెదవులమీఁదఁ దూఁగు నూర్పుటలలు తడఁబడనైన తడఁబడలేదు. అప్పుడువిరిసిన సుమమ్ము

వలె నామెముఖము క్రొందళ్కులఁ గుమ్మరించుచున్నది. ఆమెకదలికల వినూత్న సౌరభమ్ములు వెడలుచున్నవి.ఆమె నవీనత, ఆమెసౌందర్యము, ఆమె వాత్సల్యము, తిలకించి నేను పులకించితిని. విశ్వాసమునఁ గరఁగిన నాహృదయము క్రొత్త గీతముల నాలపించినది. వాని రాగభేద మెఱిఁగి యామె బంగరువీణతీవల బిగించి శ్రుతిమీటినది. రసతరంగములలోలోన నిమిడ్చికొనలేక కంఠమెత్తి కావ్యముల రచించితిని. ఆమె వానినెల్ల నందే స్వర్ణాక్షరముల లిఖించినది. అప్రయత్నముగ జారిన నానుడుల నెల్ల నామె యాణిముత్తెములపేరుగ నలంకరించికొనినది. ఆమె నాకు కానుక నొసంగవచ్చిన ఉగాదిదేవతయని నేను సవినయమ్ముగ లేచి నిలిచి వంగి యామెకు నమస్కరించితిని. ఆమెపదతలమ్మున నామొగమునీడఁ జూచికొంటిని. తన మృదుకరమ్మున నాశిర మంటి ఆమె నన్నాశీర్వదించినది. మొగిడ్చిన నాముంజేతుల నామె పూదండ యిడినది. పులకించిన నామేన భూషణమ్ము లెన్నో తొడిగినది. కట్టికొన్న నాతెలిమడుగు పీతాంబర మయినది. నాపర్ణకుటీరము స్వర్ణకుటీర మయినది. నాతేటకన్నీటిబొట్లు ముక్తాహారము లయినవి. కటికిపేదకు కనకాభిషేక మయినది.

ఇది ఉగాదినాఁటి తొలిప్రొద్దువెలుఁగురేక. ఇదె నా ఉగాదికానుక.

---

# తామస ప్రణయము

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

సాగతగీతముల్ పాడ కుల్లాసమ్ము పొంగు చల్లార్పవే ముద్దుపికమ!
"త్రోవతప్పితివోయి బావయ్య!" యని పెడదారిఁ ద్రొక్కింపవే గోరువంక!
"విషపునవ్వులు కట్టిపెట్టుమింక" నటంచుఁ గండ్లెఱ్ఱజేయవే గండునెమలి!
గుమ్మ మెక్కినయెడఁ గొంకక "పోపొమ్ము రావ"ద్దనంగదే రామచిలుక!
చిల్లునడె వీనుదోయి, గుభిల్లుమనియె - నుల్ల మాలింపనాలింప గొల్లకతలు,
ఉడికియున్న నాకన్నులఁ బడకమున్న - నంపివేయుఁడు నెచ్చెలులార! వాని.

---



# సాయం సమయము

నేమాన సూర్యప్రకాశకవిగారు

తనకు బ్రియమ్ములైన విరితమ్ముల నమ్ములుగా గ్రహించి స్త్రీ
జనవధ మాచరించును నిశాచరగంధవహు ల్సహాయులై
తనర దమి స్మరుం డది యధర్మము నే నినుఁడ న్సహింతునే
యని కినుక న్వహించె నన నారవి పూనె ఘనారుణద్యుతిన్.

పికపాళి ఫుల్లచంపకనగావళి గాంచి
పల్లవితామ్రవిభ్రాంతి డాయ
నబ్జాస్యు సరస్సితాబ్జమండలి గాంచి
రక్తోత్పలములంచు రక్తి గోయ
నచ్చర ల్వననిర్ఝరాంబువు ల్గాంచి వ
సంతమం చొండొరు ల్చల్లులాడ
సతులెల్ల ఘనఘనసారచూర్ణము గాంచి
సంకీర్ణకుంకుమశంక నంట
నెసగె నసదృశగతి జపాకుసుమవిసర
కింశుకప్రసవాశోకకిసలనికర
పద్మరాగసురాగప్రభానిభంబు
లగుచు దివసాంతశాంతసూర్యాతపములు.

అమితామోదము దాల్చి య స్తకుధరోద్యానంబున న్నిల్చి కే
ళిమెయిం బశ్చిమదిగ్వధూటి దగ వెల్గింపంగ దీపించునె
ట్టిమతాబా యన నెంతయు న్మెఱసె మార్తాండప్రబింబంబు త
ద్రమణీయారుణకాంతిసంతతులు నా రంజిల్లె సంధ్యారుచుల్

అవిరళరాగసంపదల నంది యినుం డపరాంగనామణిం
గవయు టెఱింగి పద్మిని వికాసము దక్కి కరంబు స్రుక్కి జ
క్కవరొద జాల మూల్గుచు మొగంబు ముడించె బరాంగనారతుం
ధవు గని కాంత స్వాంతమున దాపము గోపము జెంది కుందదే.

ప్రోది సరోజషండముల బొద్దున జేరి మరంద మాని యా
హ్లాదము మీర నేగ కపు డంబుజము ల్ముకుళింప జిక్కి లో
వేదన జెందుచుండె నళిబృంద మెఱుంగుదురే మహాసవా
స్వాదనలోలురైన కువిచారులు భావిప్రదోషసంగతుల్.

హరికరవాలధారాహతాఖిలమం
దేహాంగగళితశోణిత మనంగ
నరుణాశ్వఖురధూతచరమాగతటజాత
చటులధాతుపరాగపటల మనగ
ఖనదీచరదహీనకలహంసకవితాన
చరణచంచుప్రభాస్ఫురణ మనఁగ
శశినిశాపరిణయోత్సవకల్పితానంత
కాయమానవితానగణ మనంగఁ
నినకరస్పర్శనశ్రీవిహీనఖిన్న
పద్మినీకాంతదీర్ఘికాభ్రాంతచక్ర
వాకపటువిరహాగ్నికీలాకలాప
సంచయం బన మిగుల నెసంగె సంధ్య.

# ఆంగీరస

సూరి రామసుబ్బరాయ శాస్త్రిగారు

సంతత ప్రభవోజ్జ్వల సత్త్వ విభవ
దీక్షమంత్రాస్త్ర శక్తి ద్యుతి ప్రమోద
విబుధలోక ప్రజాపతి విబుధజీవ!
ఆంగిరస! చేకొనంగదే అంజలి యిదె

నాకలోకపు వార్తల వేడ్కఁ దెల్పు
మేమి నిర్ణయమును జేసి రింద్రసభను!
ఎట్టి శ్రీముఖమును బంప నెంచినారు!
సింహరాశిని జేరి యీస్థితిని మాకుఁ
గలుగఁజేసితివివక్రగతిఁ వీడి
సౌమ్య భావము వే గను పరిసమితిని

త్రిదివవాసులు చూడ ముప్పదియుమూఁడు
కోటులే యుండ భారతగోత్రయువకు
లధికమా శేలయను నీర్ష్య నందినార!
సుమనసులు మీకు నియ్యది అమరుచితమె!
అధ్వరంబులఁ జేయించి అదితిజులకు
హవ్యముల నీయ లేదని అలుకఁ గొనిరి!

యమనియమములచే నింద్రియవిషయముల
నెల్లఁ, బరమార్థమును మది నెంచి బ్రహ్మ
కర్మఁము నేయుకంకొను యాగ మెద్ది!
చక్రపాణికిఁ బ్రీతి యజ్ఞంబు సల్ప
గోపకులఁ గినక బాధింపఁ గోరి వజ్రి
ఱాలఁ గురిపింప మున్నేమి రాణ నెంచె!

ఆత్మభూయాగపథముచే నమరరాజ్య
మైనఁ జేరఁగఁజాలు తమ మే మంచుభీతి
నందినారలో ధాత్రీశ్వరాదిసురలు!
ముల్లె యంతయుఁ దలుగ నీభూమి మరలఁ
జేరనగు స్వర్గభోగముఁ గోర నేల!
శాశ్వతసుఖమ్ము ముక్తియె చాలుఁ గాని

భారతము బహుధాన్యసంపదలతోడ
మహితనిగమాగమార్థ ప్రమాధితోడ
భూరివర్య్యక్రమవిక్రమస్ఫూర్తితోడ
నలర నాశీర్వదింపు మోయార్యవృషభ! -







శ్రీ శ్రీ శ్రీ

జయపురసంస్థానాధీశ్వరులైన

శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారి

# పట్టాభిషేక మహోత్సవము

సెట్టి లక్ష్మీనరసింహముగారు



శ్రీ వైకుంఠపురమునం
బావనసింహాసనంబుపై నుపవిష్టుం
డౌ విష్ణుఁడు ప్రోచుత నిను
శ్రీ విక్రమదేవవర్మ నృపతివరేణ్యా!

అశ్రాంతంబును దావకప్రజలు నీ
శాధీనులై నిన్ను భ
క్తిశ్రద్ధావతులై భజింపఁగ, భవ
ద్దేశప్రజాసంఘు స
చ్ఛ్రేయస్కరమౌనటుల్ జయపురీ
రాజ్యంబు పాలింప, రా
జా శ్రీ విక్రమదేవవర్మధరణీశా,
నీకు దీర్ఘాయు వౌ!







# అమృతాంజనము

"నా
మార్గదర్శి!
నా
వైద్యుడు!!
నా
స్నేహితుడు!!!"



బూటకమైనవి,
కృత్రిమమైనవి,
అంజనములు,
అమృతములు,
మందులు,
బాములు,
తదితరములు.

"ఇత్తడి పుత్తడి యగునా, తొత్తది నగ లెన్ని యిడిన దొరసా నగునా?
యుత్తమకులుఁ డౌనా, దా లత్తునఁ దాఁ దరిగినను గులాము గులామే!"

"పసముత్య మొకటిచాలును, గసవ్రాడ్చిన చింపిరాలు గంపెండేలా
రసికుండొక్కఁడె చాలును, రసహీనులు పదువు రేల రాయనిబాచా!"

"కోతి దాఁజెట్టెక్కి కూసినంతనె క్రింది కొదమసింగమువాసి కొఱఁతవడునె?
పుల్లేరు దానెంత పొరలివచ్చినఁ బెద్దకొల్లేటికడుపు దాఁ గొదవయగునె?
ప్రాచితీఁగెలు చాల పయిఁబాకి పెరిఁగిన మంచిమ్రానికి లావు కొంచెమగునె?
క్రించుమానిసి తానెంత గింజుకొన్న మంచివాని పొగడ్తలు మాన్పలేఁడు."

"కొంకనక్కకు శౌర్యగుణ మెంతగల్గినఁ, గంఠీరవముమీఁదఁ గవయఁగలదె?
బలుగూడకొంగకుఁ దెలుపెంత గల్గిన, నవమరాళమురీతి నడువఁగలదె?
బొంతకాకికిని గొండంత నోరున్నను, గోకిలతో సరి గూయఁగలదె?
యెంతబలమున్న వైరిభూకాంతుఁ డధిప, నీ విరాఘాటధాటికి నిలువఁగలఁడె?"

స్త్రీల శ్రద్ధ సామర్థ్యములే కుటుంబజీవిత ఆనందము.

## దేశధనము అభివృద్ధిబొందుటకు స్త్రీలబాధ్యతయు వృద్ధిపొందవలెను

పేదలును సులభముగ ధనమును మిగుల్చుటకు, దానితో కుటుంబ నిధిని కల్పించుటకు ఇది చక్కనిమార్గము

## "ఒక్కొక్కటి నూరై నూరే వేయియగును."

రూపాయలు **1000** పొందవచ్చును

రిలయన్సు అన్యోన్య సహాయ పద్ధతిమీద (The Reliance Mutual Benefit Scheme) 18 మొదలు 60 వయస్సువరకు గల స్త్రీలు పురుషులు అందరు చందాదారులుగ చేరి రూ 1000 ల వరకు సాయమును బొందుటకు త్వరపడుడు. ప్రవేశ రుసుము రూ 5—8—0 లు మాత్రమే సంవత్సర చందా రూ 1-0-0; నెల చందా రూ 1 కంటె యెక్కువచెల్లింప నక్కరలేదు. 10 సంవత్సరములవరకు చందాదారులుగనుండి పిదప రిటైరయినను లేక అంతకు పూర్వమే మరణముచెందినను నిబంధనల ప్రకారము ఫలమును పొందుటకు బాధ్యతగలదు. ఎవరికిగాని అధికఖర్చులేదు ఇదివరకే చేరియున్న చందాదారులు 17500 లకు మించియున్నారు.

సహాయమును పొందిన కుటుంబములు —

ఇదివరకే 17 హక్కుదారులకు, ఒక్కొక్కరికి రు. 1000 లు వంతున నీయబడినది మొత్తము రూ 17000 లు

వివరములకు యీక్రింది చిరునామాకు వ్రాయుడు —

**నీలకంఠన్ అండ్ కంపెని,** జనరల్ ఛీఫ్ ఏజెంట్లు,

ది రిలైయన్సు అస్యూరన్సు కంపెని, లిమిటెడ్, బెంగళూరుసిటి.

సమర్థులును, అనుభవమును పలుకుబడియుగల ఏజంట్లు కావలయును చక్కని ఆదాయము లభింపగలదు




పాచియే దంతముల యందమును చెరచుచున్నది

## దానిని పోగొట్టుటకు నేడే

లయన్ దంతక్రీము
లయన్ దంతచూర్ణము } నుపయోగింపుడు

**LION DENTAL CREAM**
**LION TOOTH POWDER**

మీపండ్లను నాలుకతో రుద్ది పండ్లలో పాచియున్నదేమో చూడుడు. ఆపాచియే పండ్లయొక్క అందమును దేహారోగ్యమునుపాడుచేసి "పైయోరియా" అనునట్టి అపాయకరమగు వ్యాధిని కలుగజేసి మరణమును కలుగజేయుటకుగూడ కారణభూతమగుచున్నది యని పలువురు వైద్యశాస్త్రవేత్తలు నుడువుచున్నారు అందువలనదంతములయొక్క స్వభావ సౌందర్యమును, కాంతియు నెప్పటికిని మార్పుజెందకుండ నుండుటకును, దేహారోగ్యమును కాపాడుటకును తప్పక లయన్ దంతముల క్రీము, లేక లయన్ దంతచూర్ణము నుపయోగింపుడు

**HEBATBHOY ABDEALI,**
**15, Mirza Street, Bombay No 3.**

మద్రాసు స్టాకిస్టు: ష్యాం అండు కో,
6 బందరువీధి, మద్రాసు

ఏజెంట్లు:— హెబాట్ భాయి, అబ్దియాలి,
15 మిర్జావీధి, బొంబాయి నెం 3.

జె. యం. షెత్, 260, చైనాబజారు.   ఏ. బి. పరీఖ్, 268,-చైనాబజారు.




(రాజ్యము గోల్పోయి కనకవతీ జీమూతకేతువు లను తన తలిదండ్రులతో వనవాసము చేయుచు, సిద్ధరాజకుమారిని మలయవతిని పెండ్లాడి యొకానొకదినమున దక్షిణసముద్రతీరమున విహరింప నిచ్చగలిగి వచ్చుచుండును.)

జీమూతవాహనుఁడు —

అమితపటీరభూజకుసుమాపచయాత్తమనోజ్ఞగంధతుం
దము నయి మందమందగమనాకలితం బయి దక్షిణాంబుధి
క్రమణసముజ్ఝితోష్ణ మయి కమ్మని చల్లని పిల్లగాడ్పు నా
శ్రమ మెడఁబాపి యింద్రియపరంపరకున్ సమకూర్చె నూత్నతన్.

“అవుర! యిదేమి దక్షిణమునం దెటు లీరజతాద్రి తోఁచె”నం
చవిరళవిస్మయంబున రయంబునఁ గాంచఁగ నేగుదేర, నే
భువనమునందు నేప్రళయపుందఱిఁ గల్గని యస్థిపుంజముల్
శివ! శివ! కానవయ్యె మది చిల్లులువోవఁగ నేమి పాపమో!

“గమగమలాడు చందననగంబుల పూవుల కమ్మతావు లు
ల్లమునకు బాళిఁ గూర్ప సవిలాసముగా విహరింతు నేఁ” డటం
చమితముదంబుతోడ మలయాద్రికి రా, నకటా! యిదేమి యీ
యెముకలప్రోవు లద్రులటు లీక్షణపాత్రము లయ్యె నియ్యెడన్!

తల పగులనయ్యె నీయ - స్థుల దుర్గంధమ్ము సోఁకి, చూడ్కులయందున్
జ్వాలనమ్ము గ్రుమ్మరించెడిఁ - బలలవసాకర్దమము లపారాకృతులై.

ఈదుర్గంధముచేతఁ జేరఁ జను టె; ట్లీదుష్క్రియాదారుణ
ప్రాదుర్భూతికి హేతువున్ దెలిసి, యాపైఁ దత్ప్రతీకారమున్
ఖేదం బైన నొనర్చి యాత్మకును శాంతిన్ గూర్చుకోం జెట్లు? నా
పాదంబుల్ వెనుకాడుచున్నను మనోశ్వం బేగు మున్ముందటన్.

అక్కట భోగిభోగము లనంతములై కనవచ్చుచుండె, నిం
దెక్కడి విన్నిసర్పతతు, లెవ్వ రిటుల్ వధియించి, రిందఱున్

మక్కువ నేలు వాసుకి సమాప్తము నొందినవాఁడో! తానునున్
దిక్కఱి వీరితోడనె గతించెనో యెంత యుపద్రవం బయో!

ఇంద్రనీలపుఁబూస లిటు నటు చిమ్మినగతిఁ గన్నుగ్రుడ్డు లగ్గలము దోఁచె
మృదుతరకౌశేయసదృశంబులగు భోగతతు లిట జర్జరితంబు లయ్యెఁ
బ్రత్యగ్రసంభూతపల్లవాంకురములకరణి నాలుకలు నల్గడలఁ జెదరె
శోణమృత్పిండరాసుల చందమున మాంసఖండముల్ గుట్టలకరణి నెసఁగె
అయ్యయో! యిట్టి పాపకృత్యమ్ము సలుప - నెవ్వఁ డొడిఁగట్టినాఁడొ? తద్ధృదయ మశ్మ
మయమొ? కాదేని యీసంఘమారణమున - కెట్టు లంగీకరించుఁ గర్తృత్వ మూన?

తల్లిం దండ్రిని బాసి కందువులు, భర్తల్ చచ్చి సాధ్వీజనం,
బిల్లాండ్రన్ బెడఁబాసి గేస్తులును గూయుం బెట్టుచుండన్, గటా!
యుల్లం బింత ద్రవింప కందఱకు నాయుశ్ఛేదియై, యేమి సం
పల్లబ్ధిన్ మఱియంగ నెవ్వఁడు మదిన్ భావించె నీచక్రియన్?
"ఆహవరంగ మేమొ యిటు లందఱు ద్రుగ్గఁగ" నన్నదోఁ బర
వ్యూహముసం దొకండుఁ బడియుండఁడె? జాడయు లేదె, "సర్వసం
దోహము తామె వైరమునఁ ద్రుంగిన" వంచన యోధులట్టు లీ
దేహము లారయన్ గనను, దీనతఁ జచ్చినయట్లు గన్పడున్.

కనినకొలంది నామనసు కాలి పెరిల్లున వ్రీలుచుండెఁ, గ
న్గొనలుఁ గదుష్ణబాష్పజలకూపము లయ్యెడిఁ గాలుసేతు లే
పనికిని గాకయుండెను శవంబటు నాతనుః వేమొ నాకె సీ
యనుకొనఁ జేసె నెవ్వ రెదరైరొ కదా, యిట కేగుదెంచువో?

(మఱియొకవంక చెవి యొగ్గి)

అదియే మీదెస నార్తకంఠరవ మన్నట్లయ్యె? నౌ—నిశ్చయం
బది యింకొక్క నెలంతరోదనమునం దాలీనమై యెంతయున్
హృదయచ్ఛేదక మౌచు నుండె—నదిగో నేడ్పొప్ప రక్తాంబరం
బు దలం దాలిచి యొక్క నూత్నముఖి మూహాంతన్ గనన్ వచ్చెడిన్.

కట్టిన రక్తవస్త్రములఁ గన్నులఁ గాఱెడు నశ్రురాజి ని
ట్టట్టును నొత్తుకొంచుఁ దన హస్తము నూని చలించు వృద్ధతో
దిట్టతనంబుఁ బాసి కడు దీనముగా విలపించుచుండి క
న్పట్టునఁ దోఁచు నీతఁ డొక పాఁపకొమారుఁ డటంచు నెంచెదన్.

ఈయమ తల్లి గావలయు, నీతఁడు తత్సుతుఁ-డౌను, వీని కే
దో యొక గొప్ప యాపద యనూహ్య, మసాధ్యము గల్గవచ్చు, న

ట్టై యగునేని యెట్లయిన నీయమ దుఃఖముఁ దీర్చి పుత్త్రుఁగా
కీయెడ నేమికీడు ఘటియిల్లెనో మెల్ల గ్రహింతుఁగా కిఁకన్.

పీఁటలమీఁది పెంక్లి యెడఁబెట్టి శరీరము వీడ వీఁడు దుః
ఖాటవిలోనఁ జొచ్చినటు లాయమ యేడ్చెడు నేడ్పు దెల్పె, ని
ష్పాటను వీరి దుఃఖ మెడఁబాపకయుండిన నా శరీర మిం
కేటికిఁ, బ్రాణ మేటి కెపుడేని నశింపక దాఁచియుంచినన్?

పాపము! బిడ్డఁ గౌఁగిటను బట్టి జనించుటఁగోలెఁ దత్కృత
వ్యాపృతులన్ స్మరించుచు ననంతముగా విలపించి తల్లి యీ
యాపదఁ దీర్పఁ డంచు దెస లన్నియు మ్రోయఁగ నేడ్వ, నొక్కఁడున్
దాపున కేగుదేఁ, డభయదాన మొసంగఁడు, కావఁ డిస్సిరో!

(సంభ్రమముతో ముందునకుఁ జని)

"అభయం బిచ్చితిఁ దల్లి! నీసుతున కేయాపత్తు రానున్న నా
దు భుజాశక్తిని దీర్చెదన్ వలయుచోఁ దోర్లన్ సమర్పింతు దు
ర్లభమౌ దేహమునైన, నీమది విచారం బింకఁ బాయందగున్
శుభరీతిన్ భవదాత్మజాతుఁ డలరించున్ బెండ్లియై మిమ్ములన్.

నీని ప్రాణంబునకు నాదు ప్రాణ మడ్డు - వైచెదను దల్లి! యేడ్వ కెవ్వారు మీరు
ఏమి యాపత్తు వచ్చె ముం దెఱుకపఱుపు - మవల దైవంబు గల దింత యడల నేల?

ఓయన్న ఫణికుమార మ-దీయానుజునిఁగను నామదిన్ నినుఁ దలఁతున్
బాయక నీకయినట్టి య-పాయము వచియింపు మెది యుపాయమొ చూతున్."

అన్న జీమూతవాహనుం డనెడిపేరి-వాఁడ విద్యాధరేశాత్మభవుఁడ నిందు
లీల విహరింప వచ్చి యీ ప్రోల నున్న - యస్థిశైలంబు లేమని యరయుచుంటి.

అరసెదుతటి మీ యేడ్పులు - కఱుకోలలరీతిఁ జెవులఁ గాఁడిన మీకున్
శరణం బిచ్చితి నీకత - సరగున వచియింపు మనసు శాంతము గాఁగన్."

శంఖచూడుఁడు—(ధైర్య మూని)

తనమాతృదాస్యహేతువు-లని కద్రూసుతులయెడ మహావైరంబున్
గొని వినతాసుతుఁ డెప్పుడు - కనువెట్టి వధించి మేఁతగాఁ గొనఁదొడఁగెన్.

హరికిన్ వాహనమై, సమస్తవిహగాధ్యక్షత్వమున్ బూని, ని
ర్జరలోకేశ్వరు గెల్చి, దుర్లభబలప్రాగ్భారుఁడై మించు నా
గరుడుం డస్మదహీంద్రలోకమును జీకాకౌనటుల్ సేయఁగా
నురగేంద్రుం డొనరించె నొక్కసమయం బొండెద్దియున్ దోఁపమిన్.

"అందఱ నొక్కనాఁడె నుఱుమాడుట పాడియటయ్య నీకు? దై
నందినవృత్తి నొక్క ఫణినందనుఁ గూడుగ నంపువాఁడ, వా
నిం దిని తృప్తి నొందుము, ఫణిప్రకరంబును గావు"మంచు వేఁ
డం దల యూఁచె దార్క్ష్యుఁడు, కడంగెను వాసుకి బాస తీర్పఁగన్.

అవె భీతోరగనాయకప్రహితతార్క్ష్యాహారభూతాహిభో
గవరాస్థిప్రచయంబు, లయ్యవె విహంగస్వామితుండాగ్రకో
టివిదీర్ణామిషఖండతండములు, కంటే! యివ్వియే యాంత్రరా
శివిశేషంబు లిఁ కెన్ని తజ్జఠరముం జేరంగ నున్నట్టివో!

ఆవంతున మాయింటికి - నావంతయి వచ్చె జీవనంబులపై నా
కావంత యాస గల్గ ద-యో వంతయె కాక శరణ మున్నదె యెచటన్?

నాపేరు శంఖచూడుం - డీపె మదీయాంబ, వృద్ధ, యేఁ గా కన్యుల్
ప్రాపు గలుగ రని మది సం-తాపింతును గాని చావ దైన్యము నొందన్

ఎన్నిదినాలనుండి యిటు లీవధ నిచ్చలు నోచునుండెనో
యెన్నఁగఁ జాల, దీని హరియించెడువాఁ డొకఁ డున్న రాఁడె యో
యన్న యిదేటిసాహసము యాచనికామరపాదపంబ వౌ
ని 'నొక్క యల్పభోగి మరణించు'నటంచుఁ ద్యజింప నాయమే?

నాగమాత—

పెండిలి యంచు బందుగులు పీఁటలపై సతితోడ పీనిఁ గూ
ర్చుండ వచించువేళకు మహోగ్రభుజంగమనాథశాసనం
బండకు భిండివాలమటు లాశుగతిం బఱతేర గుండియల్
బెండువడంగ వధ్యశిలపెండ్లికి నాకొడు కీతఁ డయ్యెడిన్.

మధుపర్కంబులు రక్తవస్త్రములుగా, మాంగల్యదీర్ఘధ్వనుల్
వ్యథమై హెచ్చిలు రోదనధ్వనులుగా, నాహూతబంధూత్కరం
బధరస్పందవిహీనరూపములుగా నౌనట్లు నాపుత్రుఁ డి
ట్లధమప్రకియఁ జెల్లిపోవలసె నాప్రారబ్ధకర్మంబునన్

ఎఱుఁగుదువేని దండ్రి యెదియేనిఁ బ్రతిక్రియఁ దెల్పు, మాఖగే
శ్వరునిఁ బ్రసన్నుఁ జేసికొను శక్తి గలాఁడవయ్యేని మాకునై
శరణము వేఁడి నాకడుపు చల్లగఁ బ్రోవుము, నేఁడు మీర లి
ద్దఱు సుఖులై బయల్పడెడు దారిఁ గనుంగొను వత్సలుండవై

జీమూతవాహనుఁడు—

కటకట! యెంతమాట వినఁగావలసెన్ జతురబ్ధిమేఖలా
ఘటితధరిత్రి నొక్కఁడును గారుణికుం డుదయింపఁడయ్యె, ది
క్తటములు దిక్కులేని భుజగంబుల యార్పుల వ్రీలునట్లు ప్ర
స్ఫుటముగ సర్వసంహరణమున్ ఖగరా జొనరింప మాన్పఁగన్!

ఏమంచున్ దలపోసి వాసుకి, భుజంగేంద్రుండు జీవించియే
మీమీవం తని యన్యులం బనిచెఁ బేర్మిన్ వేయినోళ్లున్న వం
దేమోమైనను "మీర లేటి, కిదె, నేనే మీకు మాత్రై ఖగ
స్వామిం దృప్తి నొనర్తు" నంటకును వాచాకుంఠితం బయ్యెనే.

తన సుపర్ణత్వంబు గనుపింపఁ జేసెనే పన్నగభక్షణావసరమందె?
తన వైనతేయత ధన్యత గొల్పెనే భుజగమాంసమ్ములోఁ బొట్ట నింపి?
తన ఖగేశ్వరత సార్థకము గావించెనే కుండలిమండలిఁ జెండివైచి?
తన విష్ణుకైంకర్యము నిజంబు చేసెనే చక్రిమండలము ధ్వంసంబుచేసి?
ఎంతవాఁడైన నేమి? కాసంతపొట్ట - కదయుఁడై యిన్ని జీవుల నన్వహంబు
చించి భక్షించు నాఁకలిచిచ్చణఁగెనె-యావగింజను నరపీసమైనఁ గాని?

తన యొకజీవమున్ దలఁచి, తల్లడమందుచు, నేడ్చుచున్, గలం
గిన హృదయంబులన్ గరుణ గీల్కొన దైన్యము నుగ్గడించుచున్,
దినదినమున్ మహాప్రళయనీరధి మున్గుచు నున్న నాగరా
జిని గనుచున్ ఖగేంద్రుఁ డెటు జీవము దాలిచి నిల్చియుండెనో!

అంతటి దివ్యమూర్తి కిది న్యాయ్యము కాదని యొక్కఁడైనఁ గా
సంత హితమ్ము సెప్పఁడె, చరాచరసర్వజగత్ప్రణేత శ్రీ
కాంతుఁ డెఱింగి యిట్టిపని కాదని కింకరు మందలింప రాఁ
డెంత యఘంబు భోగికుల మెల్ల నొనర్చెనో యిట్లు కూలఁగన్?

తప్పదు నాప్రతిజ్ఞ; యిఁక దైన్యముఁ బాసి గృహంబు చేరి సొం
పొప్పఁగఁ బెండ్లియాడి సుఖ ముండుము, నీకును మాఱు నన్ను నే
నప్పనసేసెదన్ దిను మటంచు ఖగేంద్రున, కంతఁ దప్ప నీ
ముప్పు, తనంత నాప్రతిన పూర్తివహించు, గణించి యంపుమా.

అభయం బిచ్చితి నన్న నాలుక విశీర్ణాకారమైనన్; వచో
వ్యభిచారంబున కోర్వఁజాల, నసుజన్మా! నేను జీవించియుం
డ భయం బించుక నీకు రా, దవుల నన్యాయంబుగా నండజ
ప్రభుఁడున్ జంపఁడు నిన్ను—నీవు చిరమున్ వర్ధిల్లుమా స్వేచ్ఛమై.

నాతమ్ముండవు నీవ, యీయమయె యన్నా నాకునున్ దల్లి, నా
కేతద్దీనజనావనార్త్తసుకృతం బీయంగదే యంచు నిన్
జేతుల్ మోడిచి వేడికొందు నిఁక నాజీవించుటన్ జిత్తమం
దేతన్మాత్రము నెంచ, కిట్లగునదే యేనాటికైనన్ సరే.

శంఖచూడుఁడు —

శివ శివ! యెంతమాటను వచించితి; నాయెడఁ బ్రేమపుట్టి య
ట్టివిధిభయంబుఁ దీర్చితి, ఘటించితి ధీరత నంతె కాని నా
యవసర మీవు దీర్పఁగ నొకంతటిదా? యసువుల్ త్యజింపఁగా
నవునె భవాదృశోత్తమున కక్కట నావిధి గాక నీదియే?

ఒరులకై వాఙ్మనసతాపమో శరీర-పీడనో పొంది వారి యభీష్టములను
దీర్పఁజనుఁ గాక ప్రాణసమర్పణంబు-సేసి యెందఱ నరుఁడు రక్షింపఁగలఁడు?

నీ వటు లేగుదేని ఖగనేత మహాగ్రహ మొంది నేఁడె భ
స్మావిలమున్ బొనర్చు భుజగాళము నెల్ల, భుజంగరాజు నా
పై విలయాగ్నియై కినియు, వ్యర్థముగా మరణింతు వీవు, సం
భావన సేయు మప్పటికిఁ బాయదు నాకు వధంబు నమ్ముమా!

నీ కంత దయయె యుండిన, - నీకెలన వెలుంగు దుర్గ కేఁగి మరల నే
నీకడకు వచ్చుదాఁకఁ గృ-పాకర! యిందుండు బట్టలవి యిట నుంతున్. (అని యరుగును.)

జీమూతవాహనుఁడు — (లేచి)

వధ్యశిల నెక్కుటకు రక్తవస్త్రయుగ్మ-మితఁడు గొనివచ్చె నివి ధరియించి యటకుఁ
బోలుత నే నేగి ఖగరాజతుండపూర్తి - ప్రతినపూర్తి నొనర్తుఁగా కతిరయమున.

పాదము లంటి మ్రొక్కి భయభక్తులఁ బక్షివిభున్ మహాఘసం
పాదక మైన యిట్టిపని మానుమటంచు వచింతునేని నా
పై దయ మాను నీవధము ప్రాజ్ఞుఁడె కాయతఁ—డిన్నినాళ్లు నా
మాదిరిఁ గోరి యెంద అవమానముఁ బొందిరొ కాక వ్యర్థులై.

అందఱు చెప్పియుండ్రు, "రసహాయుల వీరలఁ జంపఁగా" దటం
చుం దన మొక్కలంపుఁ బరుసుందనమే బయ లెక్కఁ బక్షిరా
జందఱఁ ద్రోసిరా జను—ననన్యపథం బిది ప్రాణ మర్పణం
బిందులఁ జేసి తద్ధృదయ మెట్టిదియైన మరల్పఁ బూనికన్.

పక్షిరాజె కాదు బ్రహ్మాండనాయకుం-డైన [illegible] గాని త్యాగియంత రాత్మ
కలఁపఁగలఁడె వేయుగాఁ జనఁగలఁడొకో-యాయి యేనిగరఁగునాయముగను (అనివెడలును.)

(తదనంతరము రక్తాంబరధారియై జీమూతవాహనుఁడు బోరగిలిపరుండియుండ గరుత్మంతుఁడు ప్రవేశించును.)

గరుత్మంతుఁడు ——

నేఁ డదియేమొ నామన సనేకవిధంబులఁ జంచలించు, న
వ్వాఁడె ఫణీంద్రపుత్రుఁ, డదె వధ్యశిలాతటి రక్తవస్త్రముల్
పోఁడిమిఁ దాల్చి పండుకొనెఁ, బోయి భుజించి మనోవికార మే
జాడఁ దొలంగునో తగ విచారణసేసి దృఢత్వ మొందెదన్.

(వేగముతో జీమూతవాహనుని బొడిచి తినుచు)

అహాహా! యీఫణియామిషంబు కడు రుచ్యంబై నవీనాకృతిన్
ముహురాస్వాదనలోలజిహ్వకును సమ్మోహంబు వాటించు, న
న్వాహమ్ముల మెక్కెడు మాంసమట్లు గనరా, దామీఁద వీఁ డెట్లు నా
కు హితం బౌనటు లొత్తగిల్లు నెద సంకోచింపఁ డింతేనియున్.

కటకులో నఖరముఖంబుల వెన్నుమాంసము లొల్వఁ దనుఁగానిపరణి నుండుఁ
దుండాగ్రమున నస్థిమండలమ్మును భిన్నమొనరింప బాధచే నుస్సు రనఁడు
పతనాహతుల భూమిపైఁ బొరలించిన నయ్యో యటంచు సుంతైన ననఁడు
రక్తప్రవాహముల్ ప్రవహించుచుండిన విలపించి శరణంబు వేఁడుకొనఁడు
ఎచట మాంసంబు మిగులునో యచటు చూపు-నిన్నిదినములనుండి యహీంద్రవర్గ
మాహరింతును గాని యీయనువువాని-నొక్కనిం గన నిది యేమి యక్కజంబొ

(వినుట యభినయించి)

"ఆలస్య బొనరింతు వేల ఖగరాజా! మాంస మైపోవ దీ
కేలన్ గల్గు, భుజమ్మునం గలదు, భక్షింపంగదే యిచ్ఛమై,
నాలోపం బెదియే ఘటిల్లదుగ దన్నా"యంచు వాక్రుచ్చు నీ
వ్యాళంబున్ గ్రసియింప నింద్రియము లస్వాధీన మయ్యెంగదే!

ఈతం డాఫణిజాతి కాఁ డొకమహార్షీంద్రుండు; కాఁడేని మ
చ్ఛాతాతిస్వగుతుండదంతనఖఘాతం బోర్చి దేహాదికా
తీతుం డై పలుకంగలాఁడె యిది నా కేదో మహాపాయ, మీ
పాతిత్యంబు తరించు టెట్లో, మది కంపం బందు నత్యంతమున్!

శంఖచూడుఁడు——(సంభ్రమముతో వ[illegible] ఱొమ్ము గొట్టుకొనుచు)

ఆఁగుమాఁగుము పక్షీంద్ర! యతనిఁ జంపకురా యితం డొక విద్యాధరప్రభుసుతుఁ
డేను ఫణినయ్య, నీవంతు నేన కాని - యితఁడు కాఁ డెంత యవిమర్శకృతికి నైతి!

(సమీపించి)

వ్యాళమను నేను, సనుఁ బరి - శీలన గావింపు, రెండు జిహ్వాలు, ఫణమం
దోలి హరిపాదముద్రలు - గ్రాలవె ? యిమ్మహితుఁ దగునె గ్రసియింపంగన్ ?

అదె యీయుత్తముఁ గన్నవారు, నదనీయంబౌ కళత్రంబు వీ
నిదశక్ వజ్రనిపాతమట్లు విని క్లాంతిన్ వచ్చుచున్నారు, త
ద్వదనంబుల్ తిలకించి యే మనుచు నోదార్పంగనౌ నీకృపా
స్పదుఁ డస్తంగతుఁ డయ్యె వీని బ్రదికింపన్ జూడు నీశక్యమేన్.

(రోదనముచేయుచుఁ దొట్రిలునడకతో కనకవతీ జీమూతకేతువులును, వారివెంట నవ శమై దుఃఖితయగు మలయవతియుఁ బ్రవేశింతురు.)

కనకవతీ జీమూతకేతువులు—

జీమూతవాహనా ! చేరరా వేమిరా, వచ్చి చేయవదేమి వందనంబు?
మముఁ గన్నతండ్రి ! రాజ్యము పోయినను నిన్నె రాజ్యమ్ముగా నెంచి బ్రదుకుచుంటి;
మస్మత్తపఃఫలంబా ! మమ్ము విడనాడి యరుగ నీమన సెట్టు లనుమతించె ?
నస్వయాలంకారమా ! నిన్నుఁ దిని కాని గిరుడునాఁకలిచిచ్చు తఱుఁగదయ్యొ !
వనములో నాకుటింటిలో వాసమున్న - నీముఖేందువు దోఁప నిర్నిద్రసుఖము
నెనసి బ్రదుకుచు నున్న మా కింకమీఁద - నేది దిక్కుగాఁ జూపెంచి యేగితయ్య ?

పాఁడ వోటఁగోలెను గృపారస మూరఁగ నర్థివాంఛిత
ప్రాపణనై పుణీవ్రతముఁ బట్టి చరించుచు నేఁటితోడ నీ
పాఁపకుమారుఁ గాచుటకుఁ బ్రాణముల్ గడ కిచ్చి తద్వ్రతో
ద్యాపన మాచరించితె ఖగాధిపు నోజ్జగఁ జేసి నందనా !

అయ్యయొ ! రక్తపూరముల నస్థులుమాత్రము గానవచ్చున
ట్లయ్యెనె మాతనూజుగతి ! యభ్రగనాయక ! పొట్టచిచ్చు పో
నయ్యె నటంచు వీనిని బరాసు వొనర్చితి, మాకుఁ బొట్టచి
చ్చెయ్యెడ నెట్టు లాఱు నిఁక నెట్లు మహీస్థలి నిల్చువారమో !

ఎమ్ములు తక్క మాంసము, నొకించుక నెత్తురు, నొక్కనాడికాం
శమ్ము వెలార్పకుండ నిటు సర్వము మాసుతుమేను మ్రింగఁ జి
త్తమ్మున వాని కుండు కృప తండ్రి! యొకించుక నీదు చిత్తభా
గమ్మున సోఁకదాయె మును కల్గినఁ గల్గకయున్న నయ్యెడన్!
హా నాథ యనుచు నీపసికూన సుశీలావతింప కోడలు ద్రోవక
దీనముగ నేడ్చుచును రాఁ - బ్రాణము పో కింతెదవ్వు రానయితి మయో !

(అని మూర్ఛిల్లుదురు.)

# పి. శి. ఏ. అండు కంపెని,

## ఆయుర్వేదసమాజమువారి శ్రేష్ఠమయిన ఆయుర్వేదీయ ఔషధములు



### మదనకామేశ్వర లేహ్యము

ఇందు సాలామిశ్రీ, సఫేదామిశ్రీ మొదలగు శ్రేష్ఠమయిన వస్తువులుచేర్చి తయారు జేయబడినది మేహము, నికాృక, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వ్యాధులను ఖండించి, బలమును, వీర్యవృద్ధిని, రక్తవృద్ధిని, సంభోగశక్తిని, సంతానప్రాప్తిని కలిగించు వరప్రసాదము వేలకొలది డబ్బీలు విక్రయమగుచున్నవి 2 డబ్బీలు చాలును 20 తు॥ డబ్బిరు 1-4-0

### పాలసుగంధిలేహ్యము

రక్తశుద్ధికి శ్రేష్ఠమయినది సవాయిమేహములు, మేహములు, మేహపొడలు, మచ్చలు, పుండ్లు, చర్మరోగములు, కీళ్లనొప్పులు మొదలగువానిని ఖండించుటలో శ్రేష్ఠమయినది 4 డబ్బీలుచాలును 20 తులముల డబ్బి రు 1—4—0

### రోజాపుష్ప లేహ్యము

మలబద్ధమును ఖండించుటలో శ్రేష్ఠమయినది అజీర్ణము, గర్భవాయువు మొదలగువాటిని హరించి కాలప్రవృత్తిని చక్కగా కలిగించును 15 తు॥ డబ్బి 1-కి రు 0—10—0

### క్షయారిష్ట లేహ్యము

శ్వాసకాసలు, దగ్గు, ఉబ్బసము, అత్తి మొదలగువాటికి శ్రేష్ఠమయినది 15 తులముల డబ్బి రు 1—0—0

### మహాఖండార్ద్రక లేహ్యము

రుచికరమయినది పైత్యములు వాంతులు ఛర్ది ఎక్కిళ్లు అమ్లపైత్యము మొదలగువాటిని హరించును 15 తు॥ డబ్బి రు 1-0-0

### చ్యవనప్రాస లేహ్యము

క్షయదగ్గు, ఉబ్బసము, బలహీనత, అజీర్తి మొదలగువాటిని హరించును 15 తులముల డబ్బి రు 1—4—0

### గంధక రసాయనము

ఇది రక్తశుద్ధికి శ్రేష్ఠమయినది. మేహపొడలు, మచ్చలు స్థిరించినపాతసుఖవ్యాధులు చర్మరోగములు మొదలగువాటిని ఖండించుటలో జగత్ప్రఖ్యాతిని బడసియున్నది

10 తులముల సీసా రు 1—12—0

### ఘనసార చందిని

శగరోగములకు సిద్ధౌషధము ఎరుపు, తెలుపు, పసుపు, మొదలగు శగరోగములు, స్త్రీలకుసుమవ్యాధులను ఖండించును.

సీసా 1-కి రు 1—4—0.

దీనిని చందనిఅత్తరు అనుపానముతో చేర్చి పుచ్చుకొనినమిక్కిలి శీఘ్రముగా గుణముగలిగించును చందనిఅత్తరు సీసారు 1-0-0

### కందమూల రసాయనము

ఇది మూలవ్యాధి (మొలలజాడ్యము) నకు మంచిమందు

15 తు॥ డబ్బి రు 1—0—0.

### మహాద్రాక్షాది చూర్ణము

దీనియందు అభ్రకసిందూరము చేర్చబడియున్నది ఇది రక్తక్షయ, పిత్తము, స్త్రీల కుసుమవ్యాధులను, ప్రమేహము, వంధ్యారోగము మొదలగువాటిని హరించి స్త్రీలకు సంతానమును గలిగించుటలో అమోఘమయినది. 5 తు॥ రు 1-0-0.

### అజీర్ణవాయువ మాత్రలు

బిడ్డలకుగలుగు గర్భవాతము అజీర్ణముహరించి 2-3 విరోచనములగును సీసా 1-కి రు. 0—4—0.

### సుఖవిరేచన మాత్రలు

కొక్కిగాని వికారముగాని లేక చక్కగా 2-3 విరోచనములగును 50 మాత్రల సీసా రు 0—4—0

యింకా అనేకఔషధములుగలవు. కోరినవారికి మా సచిత్రము క్యాట్లాగును పంపెదము పోస్టుఖర్చులు ప్రత్యేకముగా యివ్వవలెను రు 5-0-0 లకు పైబడిన ఆర్డర్లకు రు 1-కి రు 0-2-0 కమీషన్ యిచ్చెదము

పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేద సమాజము-పెదదేపి-నెల్లూరుజిల్లా.



గోండాల మహారాజుగారికొఱకు మైసూరి పనివారు తయారుచేసిన

సుందరశిల్పయుతమగు కజ్జితెలు



ఆసామున తేయాకుతోటలో పనిచేయుచున్న కూలీలు

**మలయవతి**—

నా నోములు నా తపములు - నీనాఁటికి భస్మమయ్యెనే నాథా! యీ
మే నేల నీవు లేనిదె-నేనును నీవెంట వత్తు నిలువందగదే!

దీనులఁ గావ నాపతి స్వదేహము నీకు నొసంగి ధన్యుఁడై
పూనిన పూన్కి తీర్చుకొని పోయెఁగదయ్య! తదాప్తి కేను నా
మేని నొసంగుచుంటిఁ దినుమీ యిదిగూడ; సుఖింతు వీవునున్
నేను సుఖింతు, నన్నుఁ గనెనేని సుఖించు విభుండు నచ్చటన్. (అని మూర్ఛిల్లును.)

గరుత్మంతుఁడు ——(నిర్విణ్ణుఁడై కొంతతడ వుండి)

అకటా! వీరలు పుత్రకున్ బనవి మోహాక్రాంతులై, రింక వీ
రికి నేరీతిఁ బ్రబోధమున్ సలుపుదున్ వృద్ధత్వమం దిట్టి పు
త్రకశోకమ్మున ముంచివైచితిని దద్రామాలలామంబు కం
టికిన్నీ నేలకు నొక్కధారగను గుందెన్, గుంది మూర్ఛిల్లెఁ దాన్.

స్వార్థపరత్వ మెంతిటికి వచ్చెను, నా యొకపొట్టకై మహా
నర్థము నాగలోకమున కన్వహమున్ ఘటియింతుఁ గాని య
న్యార్థము హేఁగా నితఁడు ప్రాణము లిచ్చు టెఱుంగనైతిఁ; బా
పార్థిని గాక నా కొక మహత్త్వము చేపడు టెట్లు దైవమా!

ఈతఁడు నాగజాతికయియే యుదయించెను, గాకయున్న ని
ర్హేతుకజాయమానకరుణోరితుఁడై యిటు లేల వచ్చు? నా
కేతఁడి నెందఱున్ దినిన నింత ద్రవింపని చిత్తమందు వి
ఖ్యాతకృపారసం బుదయ మౌనె ఫణిప్రకరంబుపట్టునన్?

ఈయస్థిరాసులను గని - నాయశ మని గరువ మొందినాఁడను గద ము
న్నీయెడఁ గీన సిగ్గయ్యెడి - హేయంబగు మేను వెంప నే మచ్చె, నయో!

(మూర్ఛితులు కదలుట గని)

ఓమహనీయులార! కరుణోదధులార! వినుండి, మీసుత
గ్రామణిఁ బొట్టఁ బెట్టుకొనఁ గల్గిన కూళను నేన నిచ్చలున్
బాముల వేఁటలాడి తిను బాలిశబుద్ధిని గాన కన్నులం
దా మధికంబు గాఁగ నిజ మారయనైతి క్షమించి ప్రోవరే.

పన్నగుఁ డంచు నెంచి మొసవన్ దొరఁకొంటిని గాని యల్ల యా
పన్నశరణ్యుఁ డీతఁ డని భావమునన్ గనుపింపఁ దిందునే?

నన్ను క్షమింపుఁ డిప్పుడయినన్ జేయి దాఁటిన దేమి లేదు నా
కున్న బలంబు చూపి యమృతోద్ధృతిచే బ్రదికింతుఁ గ్రమ్మఱన్.

(అమృతవర్షము కురియును. జీమూతవాహనుఁడు లేచును.)

శంఖచూడుఁడు —

నాకొఱకుఁ బ్రాణ మిచ్చిన - యోకరుణామూర్తి! నీదుయోషయు, జనకుల్
నీకై వగచుచు వచ్చి, ర - దే కనుమా. వారి వగపు దీర్పుము తొలుతన్.

(ఆశ్చర్య మభినయించును)

అయ్యో! తల్లియుఁ దండ్రియున్ సతియు నాహా యంచుఁ దన్ జుట్టుకో
నియ్యార్తావనుఁ డింత వారలఁ గనం డేమంచు వాక్రువ్వఁ బోఁ
డయ్యోదిక్కులు సూచు నేమికతమో యావంకఁ బక్షీంద్రు నే
యొయ్యన్ గాంచి వచింపఁజూచు నదియేమో విందు వెంటాడుచున్.

జీమూతవాహనుఁడు — (నిస్స్పృహముగా)

ఎంతయకృత్యమున్ సలిపి, తే నొకఁడన్ బ్రదుకంగ భూమికిన్
వంత దొలంగునే విపులపర్వతసన్నిభ మస్థిపుంజ మం
తంతఁ జిరంతనంబు లయి యట్టుల యుండఁగ—వానిఁ జూచు దోఁ
జింతిలునన్ను జీవనవిశిష్టు నొనర్చితి వెట్లు సైఁచెదన్.

నాకొఱకై జనింప ఖగనాయక! దీనులఁ గావనేని నా
కీకుతలంబు నారకమె, యిందఱు భోగులు నీదుపేరుగాఁ
గీకసరాసులై ధరణికిన్ బరువై పడియుండఁగా సుధా
సేకమునన్ నన్ బ్రదుకఁజేయుట కెంతయుఁ జింత నొందెదన్.

ద్రొక్కెదను, మద్గళంబు కఱుక్కున నఖరాంచలములఁ ద్రుంపుము, కాదే
నిక్కాకోదరకులములు-నెక్కొన బ్రదికించి యభయనియతిం గొనుమా.

ఆలును దల్లిదండ్రు లసహాయతఁ గాననమంద యుండినన్
జాలిని బొంద, నీవు కరుణం దిగఁద్రావి చిరంబుగా బహు
వ్యాళకళేబరామిషపరాశనవృత్తిఁ జరించుచున్ గడున్
గూళతనంబుఁ గంట కెదఁ గుందినయంతగఁ బక్షిశేఖరా!

ఆఁకలి దీఱ నాగముల నన్వహమున్ భుజియింతు నందువా
నీ కమృతంబు పాణిగతనీరకణం బగుఁ గాదె, యింక నీ
వాకమలాధిపాశ్రయము నందుటకున్ ఫల మయ్యెనొక్కొ, చీ
కాకయి, దిక్కు లే, కలయునట్టి సరీసృపులన్ గ్రసించుటల్.

గరుత్మంతుఁడు — (సాంజలిబంధుఁడై)

చచ్చినవాని నీకరణిఁ జంపఁగ న్యాయమె? నీకతంబునన్
వచ్చెను బుద్ధి, నీ వెటులు పంచెద వట్టుల చేయువాఁడ, నీ
నెచ్చెలి, దాసుఁడన్ ఫణుల నేఁడుమొదల్ వధియింప, వీరలన్
జెచ్చెరఁ దెచ్చి యయ్యమృతసేకమునన్ బ్రదికింతు చూడుమా.

(సాశ్చర్యముగా సుధావర్షమును సూచించుచు)

ఫణముల్ విచ్చుచు భోగముల్ మలక లోపట్లన్ బరీక్షించుచున్
గణముల్ గట్టి స్వబంధుసంతతుల, సాకాంతుంబుఁ గన్గొంచు, నీ
గుణముల్ పేర్కొనుచున్ ఫణీంద్రము లవే కోటానకోట్లేగుచున్
పణముల్ పూనెడి, దేవతల్ సుధను బైపైఁ జల్ల న్ప్రీతికై.

పునరుజ్జీవితనాగలోకములు సంపూర్ణానురాగంబుతో
నినుఁ గానం బొనరించుచున్నయవి వింటే యన్న! జీమూతవా
హాన! నీత్యాగమునన్ సమస్తమును సౌఖ్యం బందె నేనున్ జిరం
తనహింసారతి వీడి పుణ్యజననుత్యంబౌ యశం బందెదన్.

(దేవత లందఱును ప్రత్యక్షమయి విద్యాధరరాజ్యమున జీమూతవాహను నభిషిక్తు నొనర్తురు. అతఁడు జననీజనకులతోఁ, భార్యతోఁ గూడి యానందించుచుండును.)

గరుత్మంతుఁడు —

లోకంబుల్ సుఖియించుఁ బెక్కుకాలముల్ పొందున్ యదృచ్ఛారతిన్
నాకున్ సాత్త్వికవృత్తి చేకుఱుత మన్నా పైతృకప్రాభవ
స్వీకారంబున మేటివై యరయుమా విద్యాధరవ్రాత మి
ట్లాకల్పంబు 'దయాధివీరుఁ' డను విఖ్యాతిన్ గనుం గావుతన్.

దేవతలు— తథాస్తు, తథాస్తు.

(అందఱును నిష్క్రమింతురు.)







# గోమాత

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

పసుపునిగ్గులఁ గుంకుమమిసలు గ్రమ్మ
ఁగళలు గురియుచుఁ గనువిందుఁ గొలుపుచున్న
నీమొగముఁ గన్నఁ గడుపులు నిండిపోవుఁ
బండుముత్తైదువల్లె కన్పడుదువమ్మ!

అహరహము నీపదంబులయందు వ్రాలి
భక్తిఁ దియ్యని దీవనల్ వడయనెంతు
నీకొలువుచేతఁ గాకున్న నేకరణిని
వెలయు లోకైకపూజ్యఁడై వెన్నదొంగ?

మొగి సమీపించి యూఁదట మోరసాచి
నన్నునంటిన పాపముల్ నాకివైతు
వేయిజన్మంబు లెత్తిన వేయునేల?
నీఋణముఁ దీర్పఁజాలను నిజము తల్లి!

సరళభావంబు మోముపై జాలువాఱఁ
జెవులు దోరించి ముంగిటి చెట్టునీడ
నిలిచి చల్లనిచూపులఁ జిలుకునపుడు
అమ్మ! నాయిలువేలుప వని తలంతు

మీకులమహత్త్వ మెఱిఁగి భూలోకమందు
నిశ్చలంబుగ సంపదల్ నిలుచుపొంటె,
వంశవృద్ధియు, భద్రముల్ వడయుపొంటె
వేల్పుటేఁడను బూజించు వెల్లమొదవు









# ౧. సారస్వతము

## ప్రౌఢవ్యాకరణకారికా విమర్శనము

విద్వాన్, దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు

త్రిలింగ లక్షణ శేష మనునామాంతరము గల ప్రౌఢవ్యాకరణము చెన్నపురి విశ్వవిద్యాలయమున 'విద్వాన్' పరీక్షకును, నాంధ్రవిశ్వకళాపరిషత్తున 'నుభయభాషాప్రవీణ' పరీక్షకును బరసీయముగఁ బలుమారు నియమింపఁబడుచుండుటంజేసి పలువురకుఁ బరిచితమయియున్నది. కీ॥ శే॥ సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకర రచనాసమయంబున లక్ష్యంబులకయి భారతాదిగ్రంథపరిశోధనంబు సేయునెడఁ దమకు లభించిన ప్రయోగవిశేషంబుల నేర్చికూర్చి యీ వ్యాకరణంబు రచియించినటులు దమ పీఠికలోఁ దెలిపియుండిరి. ఇటులుండఁ గొంతకాలమునకు విజయనగరవాసులగు, కీ॥ శే॥ భాగవతుల రామమూర్తిశాస్త్రిగారీగ్రంథము నాలోకించి యిందలి సూత్రములను సంస్కృతీకరించి 'హరికారికా శేషసర్వస్వ' మనుపేర నొక కారికాగ్రంథము రచించియుండిరి. తత్పుత్రు లద్దానిని ముద్రింపించి ప్రకటించిరి.

తత్త్వ మిటులుండఁ గారికాగ్రంథపీఠికలో "శాస్త్రిగారు హరికారికలఁ బరిశీలించి వానిచేఁగూడ సాధింపఁబడని భారతాదుల ప్రయోగము లుండుటంజూచి వాని నన్నింటి నధిక్నశ్రద్ధతో, నతిజాగ్రత్తతో సాధించుచు హరికారికాశేషసర్వస్వమును రచించి"రని తత్పుత్రు కాశకులు నిరూపించియుండిరి దీనింబట్టి కారికాకర్తయే, భారతాది ప్రయోగముల సేకరించి స్వతంత్రముగ నీగ్రంథమును దొలుత రచియించెననియు, నద్దాని కనువాదమేకాని ప్రౌఢవ్యాకరణము స్వతంత్ర గ్రంథము గాదనియు నొక యభిప్రాయము లోకమున నెలకొల్పుట వీరి వాంఛితంబని తెల్లమగుచున్నది తన కారికల కాధారమగు ప్రౌఢవ్యాకరణంబు నొకింతయుఁ బరామర్శింపక 'హరికారికా శేషసర్వస్వ' మని నామకరణ మొనరించుటంజేసియు, "కరోమి కారికా స్సమ్యక్ హరిగ్రంథవిశేషకాః" అని గ్రంథాదిని వ్రాయుటఁజేసియుఁ గారికా కర్తకుసయితము పూర్వోక్తంబగు నభిలాషయే యుండినటులు పరిశోధకులకుఁ దోఁపకమానదు. గ్రంథనామమునుబట్టియుఁ, బీఠికలోని వ్రాఁతలంబట్టియుఁ దమ 'కారికలే స్వతంత్రము లనియు, వానింబట్టి ప్రౌఢవ్యాకరణసూత్రంబులు రచియింపఁబడిన' వనియుఁ గాలక్రమంబున నిరూఢంబు గాకుండునా యని వీరి సంకల్పంబు. ఈరీతిగ నొకరి యశంబు నొక రాపించుట న్యాయ్యంబు గాదు. ఇఁకఁ బయిమాటలకుఁ బోక గ్రంథద్వయంబును జేతఁబూని నిష్పాక్షికంబుగఁ బరిశీలింతము. ఈ పరిశీలనంబున దేని కేది మూలమో తేటతెల్లమగును. ఇంతియకాక యీవ్యాసంబునకు వేఱొండు ప్రయోజనంబు గలదు. కారికాకర్త యాంధ్ర లక్షణగ్రంథంబులఁగాని, లక్ష్యంబులంగాని స్వతంత్రముగఁ బరిశీలింపకయుఁ, బ్రౌఢవ్యాకరణ సూత్రముల యర్థమునేని సాకల్యముగా గ్రహింపకయు నీకారికల రచించియుంటచే వీనియందుఁ గొన్ని ప్రమాదములు దొరలియున్నవి. వాని నుద్ఘాటించి లక్షణవిశేషజిజ్ఞాసువులకుఁ జూపుట విక్కిలి యావశ్యకంబుగదా! అట్టి ప్రమాదంబులు గల కారికలనుబట్టియే యియ్యవి ప్రౌఢవ్యాకరణసూత్రముల ననుసరించి రచింపఁబడినవేకాని స్వతంత్రంబులుగావను తత్త్వంబు పృథగ్వ్యాఖ్యానపేక్షంబుగ విశదము కాఁగలదు. కావునఁ గారికలలోని ప్రమాదముల విమర్శించుటయుఁ, దన్మూలమునఁ బ్రౌఢవ్యాకరణమే కారికలకు మూలమను తత్త్వంబు వెలువరించుటయు నావ్యాసమునకు విషయంబులు—

౧. "సంఖ్యాప్రయుక్తవిశేషణ మేకాంతం బయి యమహద్విశేష్యక మయ్యు, సమస్తంబు, వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును, పూర్వపదంబు బహువచనాంతంబు నగు" 'తదంశము=అ యొకటియొక్క భాగము. అనఁగాఁ బాతిక లోనగునది.'

ప్రౌ. శబ్ద. ర.

ఈసూత్రంబున నన్వయం బొకింత క్లిష్టంబగుటచే నిందలి విధివాక్యముల రెండింటిని విభజించి చూపుచున్నాఁడను

I ఏకాంతంబును నమహద్విశేష్యకంబు నగు సంఖ్యాప్రయుక్తవిశేషణము సమసించినచో విశేష్యం బుత్తరపదంబయి యేకవచనాంతంబుగను, వ్యస్తం బగుచో విశేష్యంబు పూర్వపదం బయి బహువచనాంతంబుగను నయ్యెడిని —ఉదా=డెబ్బదియొక్క రథము, (సమస్తము) రథములు డెబ్బదియొక్కటి (వ్యస్తము)

II ఏకాంశాంతంబును మహదమహద్విశేష్యకంబు నగు సంఖ్యాప్రయుక్తవిశేషణము సమసించినచో విశేష్యం బుత్తరపదం బయి యేకవచనాంతంబుగను, వ్యస్తం బగుచో విశేష్యంబు పూర్వపదంబయి బహువచనాంతంబుగను నయ్యెడిని. ఉదా = మహాత్మునకు: రెండున్నరమానిసి (సమస్తము), మానుసులు రెండున్నర (వ్యస్తము).

అమహత్తునకు రెండున్నరరూపాయి (సమస్తము), రూపాయలు రెండున్నర (వ్యస్తము)

పయిరీతి నీసూత్రమును లక్ష్యానురూపముగ సమన్వయించు కొనక క్రమాన్వయంబునఁ బ్రమాదముఁ జెంది శాస్త్రిగారు,

"సంఖ్యాప్రయుక్త మేకాన్త మమహద్బోధకంచ తత్,
సమస్తం యది తన్నామో త్తరభాగేకతాభిధమ్.
తదంశాన్తం మహద్వాచి చామహద్వాచకంచ తత్
వ్యస్తం చేత్తద్విశేష్యస్తు పూర్వభాగ్బహుతాభిధమ్"
హరి శేష, శబ్ద. 3, ౪.

అనుకారికల్ రచించిరి. ఈకారికలవలన, ఏకాంతమగునెడ వ్యస్తపక్షమునను (అర్థములు డెబ్బదియొక్కటి), దదంశాంతంబగునెడ సమాసపక్షమునను (రెండున్నరమ్మానిసి, రెండున్నరరూపాయి) ప్రసిద్ధంబులగు రూపంబులు సాధింపఁబడకున్నవి. దూరాన్వయంబులు గలిగి, భ్రామకంబయి, క్లిష్టంబుగ నున్న యీ ప్రౌఢవ్యాకరణసూత్రమును బట్టి యీకారికలు రచియింపఁబడినటులు మన మంగీకరించినపక్షము ననే యివి యిట్లు లక్ష్యవిరుద్ధంబుగ నుండుట గొంతవఱకేని సహేతుక మగుంగాని లక్ష్యములఁ బరిశోధించి స్వతంత్రముగ రచింపఁబడిన కారిక లిటు లుండుట యెంతమాత్రమును సంభావ్యంబు గానేరదు

౨. "ప్రాప్తహ్రస్వంబులగు మూడేలమీఁది వర్ణంబులకు
ద్విత్వంబు బహుళంబుగ నగు—ఉ—ఉక్తము"
ప్రౌ శబ్ద ౧౦౦.

ఇట "పదియుత్తరపదం బగుచో నేనుదొమ్మిల నుమ్మలకు బిందువును, ఎని కెనును, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆపరువంబునకు సరళంబును గ్రమంబుగ నగు" (ప్రౌ—సమాస—౭౮) "పది యుత్తరపదం బగుచోఁ బూర్వపదంబుదీర్ఘంబునకు హ్రస్వం బగు-ఏనునేకు రాదు." (ప్రౌ—సమాస—౭౫) అనుసూత్రంబులచే 'మూ + పది' యనుచో హ్రస్వంబును, 'ఏడు + పది' యనుచో వర్ణవ్యత్యయ, సరళాదేశ, హ్రస్వంబులును గలుగఁగాఁ బ్రాప్తించిన 'ముపది, డెబది' యను వానిలోని పకారబకారములకు ద్విత్వమును విధించి 'ముప్పది, డెబ్బది' యను రూపంబులను బ్రకృతసూత్రము సాధించుచున్నది.

ఈసూత్రంబునకు లక్ష్యంబులు చూపఁబడకుండుటవలనను, నిట నవశిష్టంబగు ప్రక్రియ యీపరిచ్ఛేదంబునఁగాక సమాసపరిచ్ఛేదంబున దూరంబుగ నిరూపింపఁబడియుండుటవలనను, 'మూడే' ల యనుచో 'మూడు' అనువిభాగమునకు శీఘ్రోపస్థితి యుండుట వలనను నంతమాత్రమే గ్రహించి శాస్త్రిగారు 'మూ + డే'యను విభాగమువంకఁ బోక

"కృతహ్రస్వత్రియచ్ఛబ్దోపరివర్ణో ద్విరుక్తిభాక్"
హరి. శేష. శబ్ద. ౭౦.

అని కారిక రచియించిరి,

దీనింబట్టి మూఁడుశబ్దమునకుఁ బరంబుగనున్న వర్ణంబునకును యచ్ఛబ్దార్థకమగు 'ఏ' అనుదానికిఁ బరంబుగనున్న వర్ణంబునకును, ద్విత్వ మగునని వీరి యాశయము తేలుచున్నది. ఈకారికవలన 'డెబ్బది' యనుచోఁ బకారమునకు ద్విత్వము సిద్ధించుమార్గము తిరోహిత మయినది. ఇట నీసంఖ్యావాచకముల నడుమ యచ్ఛబ్దార్థకమున (ఏ) కేమి ప్రసక్తి యనియేని వీ రూహింపకుండుటయు, నదియునుగాక "ఇద మదనేతద్యత్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహులమ్, హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి" యని నన్నయభట్టారకుండును, "ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు." "త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" నని చిన్నయసూరియు, నీ 'త్రికంబుమీఁది' యను సూత్రమునుబట్టి "బహుళం ద్వే సర్వనామాయే రసంయోగినో హలః" అనికారిక రచియించి యిట్టిసంస్కృతీకరణంబునఁ గారికాకర్త కాదర్శప్రాయుఁడయి యున్న కృష్ణకవియు నిట్లు పలువురు లాక్షణికు లేకగ్రీవముగ సాధించియున్న 'ఏ + తెఱఁగు=ఎత్తెఱఁగు' అనుచోటి ద్విత్వముతో శేషగ్రంథకర్తయగు తనకు బొత్తిగాఁ బ్రసక్తిలేదనియైనఁ దలంపకుండుటయు, నదియునుంగాక యచ్ఛబ్దము నిటఁ బరామర్శించి నచో నేతచ్ఛబ్ద (ఈ)తచ్ఛబ్దము (ఆ)ల విషయమునమాత్ర మిట ద్విత్వమును విధింపవలదా? యనుశంకయయిన శాస్త్రిగారికిఁ బొడమకుండుటయు విమర్శకులకు వింత గొలుపకమానవు.

3. "కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును, వలనవర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు"
ప్రౌ-కారక-౪.

'ఇచ్చుటంజేసి, సంప్రయోగమునఁజేసి' ధర్మతనూభవువలనఁజేసి' యిత్యాదులు దీనికి లక్ష్యంబులు.—

ఈ సూత్రమునఁ జేతవిభక్త్యర్థకము లనుదానింబట్టి ద్వితీయకును నవర్ణకంబునకునుమాత్రమే 'చేసి' యనుప్రయుక్త మగునుగాని 'చేత' వర్ణకమున కనుప్రయుక్తము గాదు. అట్టి ప్రయోగము (చెప్పుటచేతఁ జేసి) సకలలక్ష్యలక్షణ విరుద్ధంబు కారికాకర్త యీయర్థంబు గ్రహింపక

"క్వచి త్తృతీయాపఞ్చమ్యోః చేతస్యవలనస్య చ,
చేసిశబ్దానుప్రయోగః ప్రాయశః పరికీర్తితః"
హరి- శేష-కారక-౨.

అనుకారిక రచియించెను. దీనివలనఁ బయిని జూపఁబడిన ద్వితీయావర్ణకఘటితములగు ప్రసిద్ధలక్ష్యము లెవ్వియు సిద్ధింపకుండుటయేకాక యెవ్వరును సమ్మతింపని 'ఇచ్చుటచేతఁజేసి' మున్నగురూపములు నిష్పన్నము లగుచుండుటంజేసి యీకారిక యవ్యాప్త్యతివ్యాప్తిదోషదూషిత మగుచున్నది. లక్ష్యముల నెదుట నిడికొని స్వతంత్రముగ రచింపఁబడిన కారిక యిటులుండుట యెన్నండును సంభావ్యంబు గానేరదు,

౪. "ఒకండ్వాదులు పరంబులగుచోఁ దఱుచుగ నున్ బడికగు"

ప్రౌ సమాస. ౨౨

దీనిచే 'ఉన్' అను నాగమము విధింపఁబడినది (పది + ఒకండు, = పది + ఉన్ + ఒకండు=) 'పదు నొకండు' మున్నగునవి దీని కుదాహరణంబులు.

ఇట సూత్రమున 'నున్' అనియుండుటంబట్టి యది నుగాగమమై యుండనోపు నని స్థూలదృష్టిని దలంచి కాఁబోలును శాస్త్రిగారు,

"ఒకండ్వాదౌ పరే ప్రాయః పదేః స్యాచ్చ నుగాగమః"

హరి. శేష సమాస. ౧౬

అని కారిక రచించిరి దీనింబట్టి నుగాగమంబు ప్రవర్తించినయెడ 'పదినొకండు' అని సిద్ధించునుగాని పదునొకండు మున్నగునవి సిద్ధింపనేరవు. తెలుఁగుసూత్రములఁ జూచి సంస్కృతీకరించునపుడు లక్ష్యసమన్వయమునఁగూడ దృష్టిఁబఱపినచో నిట్టిప్రమాదములు దొరలకుండెడివి.

౫ "పది యుత్తరపదం బగుచో నేనుదొమ్మ్రల నుమ్మ్రలకు బిందువును...... .. అగును"

ప్రౌ. సమాస. ౨౪

ఈసూత్రము 'ఏను, తొమ్మ్రి' అనువానిలోని 'ను, మ్మ్రి' అను వానికి బిందువును విధించును. దీనిచే 'ఏఁబది, తొంబది' యను రూపముల బిందువులు సిద్ధించును.

పయిసూత్రమున 'నుమ్మ్రలకు' అనియుండుటగాంచి శాస్త్రిగారు నుమాగమముల కని యర్థము చేసికొని కాఁబోలును

"పదిశబ్దే చోత్తరేతు ఏనో స్తొమ్మ్రే ర్నుమో ర్ద్వయోః, బిన్దుస్స్యాత్......... ....."

హరి. శేష. సమాస. ౧౭.

అని కారికే రచియించిరి. దీనింబట్టి యిట స్థాని (మ్మ్రి) స్వరూపమే వినష్టమయినది. వీరు సూత్రార్థమును సమంజసముగ గ్రహించినచో 'నుమ్మ్రోః' అనికదా ప్రయోగింపవలయును మఱియు 'తొమ్మ్రోః' అనుదానింబట్టి ప్రకృతంబున నేశబ్దమున కీప్రక్రియ యుద్దిష్టమయి నదో యదియయిన వీరు గుఱుతించినట్లు గానరాదు. 'తొమ్మ్రి' అను శబ్దమునకు షష్ఠ్యంతరూపము 'తొమ్మ్రేః' అనికదా యుండవలయును 'తొమ్మ్రలు' అనుచో బహువచననిమిత్తకంబుగఁ బ్రాప్తించిన యుకారమునుబట్టి యాశబ్ద ముకారాంత మని భ్రాంతిఁ జెందిరి. ఇది యెంతటి జాగరూకతయో భావింపుఁడు. 'హరులకు' అనుచో నగపడు 'ఉ' కారమునుబట్టి హరిశబ్దషష్ఠ్యంతమును సంస్కృతంబున 'హరోః' అని ప్రయోగించినటు లున్నది ఇట 'తొమ్మ్రి' యనుదాన 'మ్మ్రి' అను దానికి బిందువు రావలయునను నర్థము శాస్త్రిగారి మనంబున నున్నచోఁ దదనురూపముగ నిచటిశబ్దములు సాధువులుగనే ప్రయోగించియుందురేమో! అట్లుగాక యీతెలుఁగుసూత్రమునుమాత్ర మెదుట నిడికొని ప్రక్రియ నరయక కారిక రచియించుటచే నిట్టిప్రమాదము వాటిల్లినది

౬. "మతుబర్థంబునఁ జెంచునకుఁ దవర్ణకంబు పరం బగుచో నిత్యం బగు."

ప్రౌ. తద్ధిత ౪.

ఉదా: చెంచు + త = చెంచిత.

ఈసూత్రమునకు

"మత్వర్థే చెంచుశబ్దస్య తే పరే స్యా దివర్ణకః"

అనుకారిక గానంబడుచున్నది

'ప్రత్యయ ఇహ వర్ణకః' అనుమున్నగు సంజ్ఞావిధానంబులంబట్టి ప్రత్యయమును వర్ణకమనియు, నక్షరమును వర్ణమనియు వ్యవహరించుట యాంధ్రలాక్షణికసంప్రదాయంబు. ఈసూత్రంబున 'ఇ' అనునది ప్రత్యయంబు గాకుండుటచే దీనిని వర్ణకమని వ్యవహరింపరాదు. 'ఈవ్యవహారంబు' ప్రక్రియావిషయంబున నిట హానికరంబు గాకున్నను సంప్రదాయవిరుద్ధం బని చూపితిని

౭. "ఒక్కానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండుచనుచేర్కొనులు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వాని కడయచ్చు లకు లోపంబు విభాష నగు. అగుచో నుండుడకారంబు నకారంబగు. (చేరుకొను అనఁగా ననుప్రయుక్తమగు కొనుధాతు వని యర్థము)"

ప్రౌ క్రియా. ౨.

ఉండునే, చనునే, దొరకొనునే, మున్నగువానికి ఉన్నే, చన్నే, దొరకొన్నే మున్నగు రూపాంతరము లీసూత్రమున సాధింపఁబడును ఇట "తద్ధర్మార్థకంబులగు + ఉండు, చను, చేరుకొనులు" అనువిభాగమును గ్రహింపక, లక్ష్యముల నరయక "తద్ధర్మార్థకంబులు + అగు, ఉండు, చను, చేరుకొనులు" అని విభజించికొని శాస్త్రిగారు,

"అగూండుచనుశబ్దా శ్చానుప్రయుక్తకొను స్తథా,
తేషా మన్త్యస్య లోపోఽచో వా స్యాదుణ్డోస్తు డస్య నః"

హరి. శేష, క్రియా. ౨.

అని కారిక రచియించి యగుధాతురూపంబునకుఁగూడ నికార్యము విధించిరి. దీనివలన 'అగునే' యనుదానికి 'అగ్నే' యను రూపాంతరంబు నిష్పన్న మయ్యెడును. భారతాదిలక్ష్యములఁ బరిశీలింపఁ బనిలేదుగాని ప్రౌఢవ్యాకరణకర్త చూపినలక్ష్యములఁ బరికించినను నింతటి ప్రమాదములు లేకుండెడివి. వీరు 'అగ్నే' యను రూపమును సాధింపఁదలంచి 'అగూండుచనుశబ్దాశ్చ' యని యుద్దేశ్యదళంబున నగుధాతువునుగూడఁ జేరిచియుందురో లేక పయిని జూపినరీతిని దెలుఁగుసూత్రమునఁ బదవిభాగమునఁ బ్రమాదపడి యీరీతిని గారిక రచియించియుందురో విమర్శకులు పరిశీలింపఁదగుదురు.

౮. "ఆర్యాద్యర్థ మెుక్కచో నటుశబ్దపూర్వకంబు నగు"
ప్రౌ క్రియా. ౫.

అనుప్రయుక్తంబు లగు 'అయ్య, అమ్మ,' మున్నగువానికిఁ బూర్వము 'అటు' శబ్దము కొన్ని యెడలఁ బ్రయోగింపఁబడునని యీసూత్రమునకుఁ దాత్పర్యము.

"చెల్లునటయ్య, చెల్లునటమ్మ- దయసేయక తిన్ననిమేను వెన్నెలన్ వేఁతురటమ్మ యింత కనువేదురు సెల్లునటమ్మ యింతికిన్" ఇత్యాదులు లక్ష్యంబులు

ఇట సూత్రంబునందును బయినిజూపఁబడిన యుదాహరణంబులందుఁ బలుతావులను 'నటు' అని యగపడుచుండుటంబట్టి యయ్యది 'నటు' శబ్ద మని భ్రాంతిపడి శాస్త్రిగారు.

"ఆర్యాద్యర్థో భవే దత్ర క్వచి న్నటుపూర్వకః"

అని కారిక రచియించిరి కాని పయియుదాహరణ పద్యమునందలి 'వేఁతురటమ్మ' యనుచో 'అటు' శబ్దమును గుఱుతింపరయిరి అద్దానిని గుఱుతించినయెడ నన్నిలక్ష్యంబులందును ననుగతం బగునటులు 'అటు' శబ్దపూర్వకత్వమునే విధించియుందురుగదా! పయికారిక ప్రౌఢవ్యాకరణసూత్రమునుబట్టి రచింపఁబడక స్వతంత్రముగనే రచింపఁబడినయెడ 'నటుపూర్వకః' అని నటుశబ్దఘటిత మయియుండుట మిక్కిలి యసంభవము.

పయిని వివరించిన విషయములంబట్టి శాస్త్రిగారు భారతాదులందలి ప్రయోగవిశేషంబులను దాము గనిపెట్టకుండుటయకాక ప్రౌఢవ్యాకరణకర్త యుదాహరించిన ప్రయోగంబులందలి విశేషంబులయిన గుఱుతింపకుండుట విశదమగుచున్నయది ఇంతియకాక కారికలందలి భాషాస్వరూపమును బట్టి సంస్కృతభాషయందు సయితము వీరి కంతగాఁ బాటవ ముండినటులు గానరాదు. క్రిందిప్రయోగములను బరిశీలింపుఁడు.

"క్వచి ద్ద్విత్వస్య ప్రామాణ్యప్రయోగేషు న దృశ్యతే, ద్విత్వమ్. .. .. .." సంధి ౨

ప్రామాణికప్రయోగములనికాని, ప్రమాణప్రయోగములనికాని యనుటకు మాఱుగాఁ బ్రామాణ్యప్రయోగములఁట!

"దృశ్యతే సర్వపర్యాయయోల్లశబ్దస్య సప్తమీ"
సంధి ౪.

'సర్వపర్యాయయోల్లశబ్దస్య' యనుసిద్ధసమాసంబునడుమ యడాగమంబు సిద్ధించు టెట్లు?

"క్వచిత్క్వచి ద్భవేదప్రధానం ప్రాధాన్యవాచకమ్"
శబ్ద ౭.

ప్రధానవాచక (విశేష్య) మనుటకుఁ బ్రాధాన్యవాచకమఁట!

"పూరుషాణాంచ పృచ్ఛాయాం నిర్దిష్టస్త్రీనరోర్గ్రహే"
శబ్ద ౩౧

నృశబ్దమునకుఁగాని, నరశబ్దమునకుఁగాని షష్ఠీద్వివచనాంతరూపంబు 'నరోః' అని సిద్ధించు టెట్లు?

"ఎక్కటీతిపదోఽపి స్యాత్" శబ్ద-౬౧

"పోలెపోని బలేపదాః" సమాస-౩౨

"అకాన్తావ్యయః కర్తా"
సంజ్ఞా ౪

"ఇనన్న న్క్రియాపూర్వకాః కా స్యవ్యయా ఇహ"
వాక్య ౧౨

ఈరీతిని 'పద' శబ్దమును, నవ్యయశబ్దమును నిట్టియెడఁ బుంలింగముగఁ బ్రయోగింతురా?

"పరే సతీంచుక్ఛస్య స్యాత్ప్రకారో నహి దృష్టవాన్"

'నదృష్టః' (చూడఁబడలేదు) అనుదానికి 'నదృష్టవాన్' అనునది పర్యాయముగఁ బ్రయోగింపఁబడునా?

ఈరీతిని సంస్కృతాంధ్రముల రెంటను దగిన పాటవంబు గడింపనివారిట్లు లక్షణగ్రంథములను స్వతంత్రంబుగఁగాని, యనువాదరూపంబునఁగాని రచియింపఁబూనుటకంటె నుదాసీను లగుట యుత్తమపద్ధతి అనియ భాషకు మహోపకారకంబు ఇట శాస్త్రిగారి లోపము లెంచుట నా ముఖ్యోద్దేశంబుకాదు ఎన్నియో వత్సరంబులెంతయో పరిశ్రమ మొనరించి యీ ప్రయోగవిశేషంబుల నేర్చికూర్చిన సీతారామాచార్యుల ప్రౌఢవ్యాకరణంబునకుఁ గల వాస్తవికంబగు ప్రాథమికత్వంబును వెలువరించుటయుఁ, గారికలందలి ప్రమాదంబులను విద్యార్థిలోకంబున కెఱుకపఱుచుటయు నాయుద్దేశములు. మఱియుఁ గారికలకుఁ బ్రౌఢవ్యాకరణమే మూల మనుటకుఁ దగినయాధారము లింకను గారికలం దుపలబ్ధంబులయినను వానినెల్లఁ జూపఁబనిలేదనియుఁ, బయిని నిరూపించిన విషయంబులే తత్త్వనిర్ణాయకంబులు గానోపుననియు నిప్పటి కింతటితో విరమింపఁదలంచితి.

---



పూరీ జగన్నాథ దేవాలయము

M K R



కలారామ దేవాలయము, నాసిక

సూర్యాస్తమయము (తిరుచినాపల్లి వద్ద)  M K R.




# పాళ్యపు వెంకటాచలపండితుగారి ఆయుర్వేద సిద్ధౌషధములు




# లోకామయహర కస్తూరీమాత్రలు (రిజిష్టర్డు)







ఈ మాత్రలలో 1-2 ను తాంబూలముతోగాని విడిగాగాని ప్రతిదినము ఉపయోగించుచు వచ్చిన యెడల నోరు చాలాసేపు సువాసనగానుండును మరియు ఎటువంటి కఠినతరాహారము నైనను జీర్ణీకరించి, అంటువ్యాధులను రానియ్యక ఆరోగ్యమును రక్షించును. పిల్లల పడిశము దగ్గు పక్కలకురుప్పు, మాంద్యము, అజీర్ణభేది, ఆకలిలేకుండుట, చలిజ్వరము, జ్వరము, కడుపుబ్బరము, శీతవాతబాధ ఇంకా అనేకవ్యాధులను కుదుర్చును

పెద్దవారికి ఉబ్బు, దగ్గు, శ్వాసకాసము, అగ్నిమాంద్యము, జ్వరము, చలిజ్వరము, అజీర్ణభేది, శీతవాతనొప్పులు, కడుపునొప్పి, పల్లనొప్పి, మాంసఖండములయందునొప్పి, ప్లేగు, ఇన్ఫ్లూయంజా, కలరా మున్నగు రోగములను గుణపరచును

స్త్రీలు ప్రసవించినవారు స్నానము నాడు కస్తూరికి ప్రతిగా ఈమాత్రలనే సేవించవచ్చును వ్యాయామమునకవకాశము లేని స్త్రీ పురుషుల కీమాత్రలు సంజీవి

300 మాత్రలుగల సీసా 1-కి 4 అణాలు. పోస్టేజిలోబడి 6 సీసాలకు 1-8-0 12 సీసా 2-13-0 25 సీసాలు 5-3-0

కౌంటిజము——(గర్భాశయరోగములకు) స్త్రీలకు సంబంధవ్యాధులకు సర్వోత్తమగుణకారి అనేక ఔషధములు పనిచేయనివారి కీమందు గుణమునిచ్చును సీసా 1-8-0

సారస్వతాసవము——మెదడుకు దేహమునకు బలకారి మరపుటను పరిహరించి జ్ఞాపకశక్తిని వృద్ధపరచును కడుపునొప్పి, గొంతునొప్పి, అగ్నిమాంద్యము, నిస్సత్తువ, కండ్లమాంద్యము, పత్తెభ్రమలు, మున్నగు అనేక వ్యాధులను కుదుర్చి రక్తవృద్ధిని కలిగించును. ఉద్యోగస్థులకు ప్రధానమైనది

25 రోజులమందు 1-0-0

భావనాజీరకావ లేహ్యము——పిత్తమువలన, పత్తివాతమువలన కలుగు వాంతిభేదులను తలతిప్పుడం పుల్లత్రేపులు ఆకలి లేకుండుట ఆహారములో అరుచి, నేత్రములలో పచ్చని వర్ణము సహానయమగును 12 తులా టిన్ 0-8-0

24 ,, 1-0-0

మహాసౌభాగ్యశుంఠి——బాలింతలకు సర్వోత్తమమైనమందు దొరకిన మందులనిచ్చి దానివలన పిత్తవాతము ప్రకోపించి విపరీతచర్యలు కలిగిన సమ్మతిలు మందులకొరకు శోధించుటకన్న దేశవిదేశములలోనెల్ల 30 సంవత్సరములగా వుత్తమగుణకారియని పేరుపొందిన ఈమహాసౌభాగ్యశుంఠినే ఇవ్వకోరెను 24 తులం టిన్ రు 1-0-0

కాంతవటి——పిల్లలకుకాని, పెద్దవారికిగాని, కడుపు రోడమపక్క కలిగియుండు బల్లలు సందేహములేక గుణమగును దీనివలన కలుగు జ్వరము, రక్తహీనత, ఆకలిలేకుండుట మున్నగునవి పరిణామమగును 64 మాత్రలు 1-0-0

కాసకేసరి——పిల్లలకుకోరుదగ్గు, పెద్దవారిదగ్గులు, క్షయముయొక్కదగ్గు సహానయమగును సీసా రు. 1-0-0

మహాభృంగామలక తైలము—— తలకు చల్లదనము నిచ్చి కండ్లు చేతులు కాళ్లమంటను పరిహరించి కండ్లమంటను పోగొట్టి నిద్రపట్టులాగున చేయును

4 ఔన్సు 8 అణాలు. 8 ఔన్సు రు. 1

సోమకలా——మేహవ్యాధులలో పథ్యములేక సేవించవచ్చును—సెగరోగములను, మేహవ్రణములను, గుణపరచును.

24 మాత్రలు రు. 1-8-0

గర్భరక్షిణి——గర్భిణుల వోకరింతలు, వాంతి, నిస్సత్తువ, వొళ్లునొప్పి, ఆకలిలేకుండుట, మున్నగు చిన్నెలను కుదిర్చి శక్తిని కలిగించును. సీసా రు. 1-0-0.

గోరోజనమాత్రలు భేదిమందు——పిల్లలకుకాని, పెద్దలకుకాని భేదిగా ఇవ్వతగినమందు. జ్వరము, వాయువు, కడుపునొప్పి, అగ్నిమాంద్యము, సన్నిపాతజ్వరము, వీటిని గుణపరచును సీసా 1-కి 6 అణాలు

బాలసుఖోదయము (బాలామృతము) పిల్లలకు——ఎండుకొని రక్తవృద్ధిలేక కడుపువుబ్బి వుండుటను పరిహరించును అజీర్ణభేదులను పోనిచ్చును. మలబద్ధమును హరించును రక్తవృద్ధికి వుత్తమమైనది.

మందులన్నిటికిని పోస్టేజి వేరు సీసా. 8 అణాలు.

మామందులను కొనునప్పుడు ప్రతిమందుపైనను మా చిరునామాను రిజిష్టరైన ○ ఈవర్తక గురుతును చూచికొనుడు




## విలాసము:—శ్రీ సీతారాఘవవైద్యశాలా, మైసూరు.




తంతి విలాసము:—"పండిట్" మైసూరు.



శాంపిల్సు ఉచితము

సహజముగా శ్రేష్ఠమైన శిరోజముల టానిక్ అగు

# కామినియా నూనె (రిజిష్టర్డు)

మీ శిరోజముల సౌందర్యమును కాపాడును. శిరోజములకు, మెదడుకు, ఇది శ్రేష్ఠమైనట్టియు, లాభకరమైనట్టియు నూనె. దీనియందు చల్లదనమునిచ్చి, శిరోజములను పోషింపగల పదార్థములు గలవు. కామినియానూనె మాడును శుభ్రపఱచి, పట్టువంటి తళతళ మెఱయు వెండ్రుకల పెంచును. ఇది మంచి సువాసనగలది. దీని నుపయోగించినచో కాంతివంతమై, శిరోజములుగల్గి తలఅందముగా నుండును. నేడే ఒకసీసా పరీక్షింపుడు.

వెల రు. సీసా రు 1-0-0. 3 సీసాలు రు. 2-10-0.

వి. పి. చార్జీలు ప్రత్యేకము. పోస్టేజినిమిత్తం ఒక అణా స్టాంపునంపి, శాంపిలును ఉచితముగా బడయుడు

పరిమళముల రాజు

# ఓటో దిల్ బహార్ (రిజిష్టర్డు)

OTTO DILBAHAR

PERFUME OF ORIENT

DELIGHTFUL & LASTING

ఒక చుక్క మీ చేతిరుమాలునందు వేసికొనుడు. అద్వితీయమైనట్టియు, ఆనందదాయకమైనట్టియు, పరిమళము యెంతోకాలమైన నిల్చియుండును.

# ఫ్రాంకోలవండరు

అద్భుతమైన సువాసనగల మరియొక లోకప్రసిద్ధిగన్న పరిమళద్రవ్యము. ఇతర రకములును గలవు —

కామినియా లిల్లీ న్యూ, కామినియా రోజ్, కామినియా జస్మిన్,

కామినియా మస్కు, కామినియా సుగంధి, కామినియా డెయిసీ.

వెల $\frac{1}{4}$ ఔన్సు సీసా రు. 1-4-0. 1 డ్రాం సీసా 12 అణాలు.

వి. పి. చార్జీలు ప్రత్యేకము. 2 అణాలు స్టాంపులను పోస్టేజివగైరాలకు పంపి ఉచితమైన శాంపిలును తెప్పించుకొనుడు.




ఆసియా దేశపు గొప్ప సబ్బులు

# కామినియా టాయిలెట్ సబ్బులు

- ఉపయోగములో పోడిమి
- ధరలో పోడిమి,
- పరిమళము హాయిగా నుండును.
- రకమునకు సాటిలేనిది.

పలువిధ పరిమళములలో దొరకును.

కామినియా ట్రాన్స్‌పరెంట్ గ్లిసరిన్ సబ్బు, కామినియా లవండరు సబ్బు,

కామినియా చందనసబ్బు, కామినియా వైట్ రోజ్ సబ్బు, దిల్ బహార్ సబ్బు.

ఇవి యన్నియు మనోహరమైనట్టియు ఇంపైనట్టియు, పరిమళముల గలిగియున్నవి ఈ సబ్బులు మీకు నిశ్చయముగా సంతృప్తినిచ్చును

3 బిళ్లలుగల పెట్టె రు. 1-0-0. వి. పి. చార్జీలు ప్రత్యేకము.

మీ సమీపమందుగల దుకాణమునుండి తీయుడు, లేక మాకు వ్రాయుడు కొనునపుడు ప్రతిపెట్టెమీదను కామినియా అను పేరును గమనింపుడు ఇది స్వచ్ఛతకును, రకమునకు సూచన.

సోల్ ఏజంట్లు — ఆంగ్లో ఇండియన్ డ్రగ్ & కెమికల్ కంపెనీ,

155, జుమ్మామసీదు, తపాలాపెట్టె 2082, బొంబాయి.

# శ్రీ వాల్మీకి వాఙ్మయము

**శతావధాని వేమూరి నృసింహశాస్త్రిగారు**

శ్లో. వాల్మీకిం రఘునాయకోత్తమచరిత్రావేదకం సన్మునిం
విశ్వామిత్రమునిం వసిష్ఠ మనఘం శ్రీరామచంద్రం భజే,
అస్మద్దేశికవర్య మార్యవినుతం వాసిష్ఠరామాయణ
వ్యాఖ్యాతార మపారబోధజలధిం చానందబోధం యతిమ్.

శ్రీ సకలకవికుల తిలకుఁడును, సులలిత సరసతరవచననిచయ రచనా చాతురీధురీణుండును, నిజహృదయ కుహరనిహిత రఘువరుండును, చిరానుష్ఠిత తపోవిశేషలబ్ధ ప్రభావాతిశయుండును, సాక్షాత్కృత చతురానన కృతోత్సాహసంజనిత శ్రీ రామచంద్ర చరిత్ర గ్రథన ప్రవృత్తియుక్తుండును నగు శ్రీ వాల్మీకిమహర్షి జన్మజరామయ మరణ హర్షామర్ష శోకాద్యనర్థసంకట సహస్రసంకుల మగునట్టిదియు, తాపత్రయదావానలదందహ్యమానమగునట్టిదియు, నరిషడ్వర్గవ్యాఘవధ్యమాన ప్రాణినికాయము గల్గినట్టిదియునగు సంసారమహారణ్యమునందుఁ దిరుగుచు వివేకాంధమగు జగంబునుం జూచి శాస్త్రభానూదయముచేఁ బ్రబోధించుటకుఁ బద్మసంభవుని శాసనముచేతను, స్వయముగను ప్రవర్తించినవాఁడై శ్రీ రామచంద్ర మహోదయ వివిధ పవిత్రచిత్రచరిత్ర పూర్ణమగు పూర్వరామాయణమును, ఆత్మానాత్మవివేచనపూర్వకాత్మసాక్షాత్కారక్రమమగు నుత్తరరామాయణము నను రెండు నిబంధముల నిర్మించెను. ఆదికవియగు వాల్మీకి "మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అని సకల కవిపుంగవాంగీకృత మధుర సరసవచన రచనాతిశయముచే "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా" యను ప్రమాణముచొప్పున కర్మకాండ జ్ఞానకాండాత్మకమగు వేదమునందలి పూర్వకాండోదిత ధర్మము సర్వవర్ణాశ్రమ యుక్తులకు శ్రవణార్హత కలుగునటులు మృదు మధురవాగ్రచనలతో నుపమాద్యనేకాలంకారభాసురముగ శ్రీరామ కథావర్ణన వ్యాజముచే వెల్లడించుచు షట్కాండసహితము నుత్తరకాండయుక్తము నగు శ్రీమద్రామాయణమును కాంతాసమ్మితమై ౨౪ వేల శ్లోకములుగల కావ్యముగ రచించి, రామసద్గుణవర్ణనముచే రామునివలె నేకపత్నీవ్రతస్థుఁడుగను, "రామో ద్విర్నాభిభాషతే" అని చెప్పుటచేఁ బ్రతిమనుజుఁడును అనృతమువచింపరాదనియు లోనగుసకలధర్మజాతము నుపదేశించి జ్ఞానకాండమగు నుపనిషద్భాగమునఁ బ్రకటితమగు నాత్మానాత్మ వివేచనమును తదభిలాషులగు నధికారులకు కరతలామలకముగఁ దెలియుటకై బ్రహ్మశాసనమువలననే శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామ సంవాదరూపముగ వైరాగ్య ముముక్షూత్పత్తి, స్థిత్యుపశమ నిర్వాణము లనెడి షట్ప్రకరణయుక్తంబుగ నుత్తరభాగభాసురమైన శ్రీ యోగవాసిష్ఠమహారామాయణ మనుపేరిట ౩౨ వేల శ్లోకములుగల "ఉత్తరరామాయణము"ను రచించి,

"కథోపాయా న్విచార్యాదౌ
మోక్షోపాయా నిమా నథ,
యో విచారయతి ప్రాజ్ఞో
న స భూయోఽభిజాయతే." వైరాగ్యప్ర॥ ౨ స॰ ౩.

అనఁగా జ్ఞానాధికారప్రాపకధర్మతత్త్వజ్ఞానానుష్ఠానేశ్వరప్రపత్త్యుపాయభూత మగు షట్కాండాత్మక రామాయణమును ముందుగా విచారించి తదుదితార్థానుష్ఠానలబ్ధాధికారుండై వక్ష్యమాణషట్ప్రకరణ రూపములగు మోక్షోపాయముల నెవఁడు విచారించునో వాఁడు ప్రాజ్ఞుండై (అనఁగా ప్రజ్ఞచే కామకర్మవాసనాజ్ఞానబీజముల దహించినవాఁడు) తిరిగిపుట్టఁడు, ముక్తుం డగునని యు పూర్వోత్తరరామాయణములకు సంబంధమును జూపెనుగాన శ్రీరామాయణము శ్రీవాల్మీకిరచితము పూర్వోత్తరభాగములతో ౫౬,౦౦౦ ల అనుష్టుప్‌సంఖ్యగల గ్రంథము. ఇట్టి వాల్మీకివాఙ్మయము ననుసరించియే తదర్వాచీనులగు సర్వ కవివరేణ్యులు అష్టాదశవర్ణనలలోనేమి, ఉపమాద్యలంకారప్రయోగమునందేమి, కవిసమయసిద్ధప్రసిద్ధులలోనేమి, పదమైత్రిసందర్భమునందేమి, కావ్యలక్షణములలోనేమి, వర్ణనౌచితియందేమి స్వస్వప్రజ్ఞానుగుణముగ గ్రంథరచనల రచించిరని రసజ్ఞు లెల్లరకును సువిదితమే.

౨. ఈ పూర్వోత్తరరామాయణము లేక కర్తృకము లగుటవలననే, కథైక్యముగల స్థలములలో శ్రీమద్రామాయణశ్లోకములే వాసిష్ఠ

రామాయణమునందును గనఁబడెడిని. శ్రీవాసిష్ఠమున శ్రీరామ బోధ కొఱకు వేఱువే ఱుపాఖ్యానములఁ గొంతవర్ణనతోఁ గలసికథ కనిపించునే కాని శ్రీరామచరితము లేదు. శ్రీవిశ్వామిత్రమహాముని తన యాగ సంరక్షణార్థము శ్రీరామనయనమునకై శ్రీ దశరథమహారాజు కడ కేతెంచిన భాగ మొకటిమాత్ర ముభయస్థలములలో నున్నది. అందు బాలకాండ ౧౮ వ సర్గలో ౪౭ వ శ్లోకము మొదలు మూఁడు సర్గలలోని విశ్వామిత్రదశరథసంవాదరూపకథలో శ్లోకములలో పదసామ్యార్థసామ్యతాత్పర్యసామ్యకథాసామ్యములుమాత్రమేకాక అవియే శ్లోకములు ప్రాయశః రచియింపఁబడియున్నవి వాసిష్ఠమున వైరాగ్యప్రకరణమునందలి ౭ వ సర్గ ౭ వ శ్లోకము మొదలు చూడందగును. మఱియును పదప్రయోగమునందును, ఉపమాద్యలంకారనిరూపణమునందును, పదమైత్రియందును, శయ్యాయందును, బుద్ధిశాలి విమర్శనాబుద్ధితో రామాయణద్వయమును పరిశీలించినచో శ్రీమద్రామాయణకర్తయగు శ్రీవాల్మీకియే వాసిష్ఠమహారామాయణమునకుఁగర్త యనువిషయమున నించుకేనియు సంశయింపఁడు. వాసిష్ఠమునందు విషయము కేవలాద్వైతముగా- కొన్ని స్థలములలో శ్లోకములకు తాత్పర్యము గ్రహించుట కష్టమగునేకాని శైలి కఠిన మగుటవలన దురవగాహమని కర్తృభేదమును శంకింపరాదు కథారామాయణమునందు షట్కాండములు, వాసిష్ఠమునందు షట్ప్రకరణములు. అందుత్తరకాండకు నిం దుత్తరభాగము. వాల్మీకి రచించినవెంటనే కుశలవుల కుపదేశించినట్లు పూర్వరామాయణమునం దున్నది భరద్వాజున కుపదేశించినటులు వాసిష్ఠమునం దున్నది. ఇత్యాదిసందర్భములును సరిపోవుచున్నవి

3. బాలకాండమునందు విశ్వామిత్రమహామునిసమాగమసందర్భము వచ్చునప్పటికి శ్రీరామచంద్రమూర్తి పదునాఱువత్సరముల కించుకతక్కువ వయస్సునందుండి సకలతీర్థముల సేవింపవలయునని యభిలాషతో దశరథుఁ బ్రార్థించి ఆయనయానతిఁ బరివారసమేతుఁడై తీర్థయాత్రఁ జేసివచ్చి అనన్యలభ్యమగు వైరాగ్యముతో నుండ, దశరథుండు పామరదృష్టితో లౌకికకృత్యముల నాచరించుటకు ప్రోత్సహించుచు స్వయముగను, నన్యముఖముగను ప్రేరేపించుచుండ విషయవైరస్యముచే నెట్టివ్యాపారమునందును మనసు నుంచక తనలోఁదానే పిచ్చివానివలె నేమేమియో గొణఁగుకొనుచు నుండుసమయమున సవయస్కులగు పరిచారకులను బిలిచి తండ్రి "మీతో నేమైన నెప్పుడైన రాముఁడు ముచ్చటించునా ?" యని యడుగ వారలు "తొల్లిటి పగిది హర్షాతిరేకముగ మాటలాడుట లేదు. భుజించుట లేదు కారణమేమైయుండునో మాకు తెలియదుగాని సమీపమునకుఁ బోయి వినినమాత్రము 'నీత మాయు రనాయాసపదప్రాప్తివివర్జితైః, చేష్టితై రితి కాకల్యా భూయోభూయః ప్రగాయతి' (అనఁగ సంసారశ్రమహరమగు బ్రహ్మప్రాప్తి కలుగని చర్యలతోనే సర్వాయువు గడపఁబడుచున్నది) యని సూక్ష్మమధురధ్వనితో గానముచేయు"నని చెప్పఁగ విని వసిష్ఠవిశ్వామిత్రదశరథమహారాజాదులు రాముని సభకురావించి యడుగ దేహమును బాల్యాద్యవస్థలను స్త్రీలను కాలమును అనిత్యత్వాది బహుదోషయుక్తమగుటచే సహేతుకముగ నిందింపఁగ విశ్వామిత్రాది మునిపుంగవులు, బ్రహ్మర్షులు, రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మేంద్రాది దేవతలు, సిద్ధసాధ్యాది ఖేచరులు, భూచరులు సభ నలంకరించియుండఁగ రాముని వైరాగ్యసంపదను జూచి యచ్చెరువొంది రామునకు తగిన జ్ఞానము నుపదేశింపుమని ప్రార్థింప, శ్రీవసిష్ఠమహర్షి తన జన్మవృత్తాంతమును, వేదాంతప్రచారనిమిత్తంబును గ్రమముగ వక్కాణించి జ్ఞానోపదేశము చేయ నారంభింపఁగ ముముక్షువై శ్రీరాముఁడు మధ్యమధ్య ప్రశ్నించుట, దానికి సదుత్తరము వసిష్ఠుఁడు బోధించుట, తుదకు 'కృతార్థోఽస్మి' యని రాముం డనువఱకు 3౨ వేల శ్లోకములుగల గ్రంథము రచింపఁబడినది.

౪ ఐనను బాలకాండకథలోనేకదా శ్రీరామునిగూర్చి వసిష్ఠోపదేశము. పైన జరిగినకథకాని ఉత్తరకాండమున జరిగినకథకాని లేకయుండ వాసిష్ఠరామాయణ ముత్తరరామాయణ మేల యనఁదగినదని యందురేని పురాణస్మృతులవలె వేదోపబృంహకము శ్రీరామాయణములలో వేదపూర్వభాగమున చెప్పఁబడిన ధర్మజాతమును రామాచరణమూలమున ప్రకటించినదగుటం జేసి శ్రీమద్రామాయణమునకుఁ బూర్వరామాయణ మనియు, ఉత్తరభాగమగు నుపనిషత్తులలో బోధింపఁబడిన జ్ఞానము రామోపదేశముగ బోధించినదిగావున వాసిష్ఠమునకు నుత్తరరామాయణ మనియు ప్రసిద్ధి కలిగెనది దీరోదాత్తుండగు శ్రీరామచంద్రుని రెంటియందును కథానాయకునిగనే వాల్మీకి పేర్కొనినాఁడు. ~~కావి~~ పూర్వమున స్వతంత్రునిగ గ్రహించెను; ఉత్తరమున ముముక్షువైన వసిష్ఠశిష్యునిగ గ్రహించినాఁడు. శిష్యునిగ గ్రహించినమాత్రమున దీరోదాత్తనాయకత్వమునకు భంగము వాటిల్లదా యని శంకించినచో వాసిష్ఠరామాయణమునకు వ్యాఖ్యానము రచియించిన శ్రీమదానందబోధభిక్షువు వ్యాఖ్యానపేరిక శ్లోకములలో

శ్లో. "ఆవిశ్వాన్త ర్వసిష్ఠం బహిరపి కలయన్ శిష్యభావం వితేనే
యః సంవాదేన శాస్త్రామృతజలధి మముం రామచంద్రం ప్రపద్యే."

(అనఁగ పూర్ణానందస్వభావుండగు పరమేశ్వరుండు దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మస్థాపనలకొఱకు మాయామానుషవిగ్రహుఁడై యవతరించి దయచే, నజ్ఞానమహాపంకమునందు మునిఁగినవారల నుద్ధరించుటకు వసిష్ఠులోపలఁ బ్రవేశించి బాహ్యమునకు రామచంద్రరూపమున శిష్యభావమును వెల్లడించుచుఁ దనకును వసిష్ఠునకును సంవాదరూపమున శాస్త్రామృతజలధియైనవాఁడు, అట్టి రామచంద్రుని భజించెదను) అని నుడివిన వచనమును జూడ నట్టి శంక శమించును మఱియు మూలములో నిర్వాణప్రకరణములో శ్రీరామచంద్రుని సాక్షాత్పరమాత్మగనే వక్కాణించియున్నాఁడు.—

శ్లో. "అవతీర్ణ స్స్వయం విష్ణు ర్మానుష్యే రామనామధృత్,
ఖిన్న స్సంసారజాలేఽస్మిన్ యోగే నానేన బోధితః."

అనఁగ నీమనుష్యలోకంబున విష్ణువు తానే యవతరించి రామనామము నొందినవాఁడై సంసారంబనెడి వలలోఁ జిక్కి ఖిన్నుఁడై యీయోగంబుచే బోధింపఁబడియెనని యర్థముగాన ధీరోదాత్తత్వభంగము లేదు. స్వతంత్రనాయకత్వమునకును భంగములేదు.

౫ రామకథ సర్వజనసాధారణముగ విదిత మగుటంజేసియు, రాముఁడుపాస్యదేవత యగుటంబట్టియు, చరిత్రకథనంబున ధర్మబోధక మగుటవలనను, రామచరితస్మరణము దురితహారి యగుటచేతను, శ్లోక తాత్పర్యము సుబోధము కాఁబట్టియు, సర్వజనులకు నుపదేశార్హ మగుటకను, శ్రీమద్రామాయణమున కనేకవ్యాఖ్యానము లుండుటే కాక ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతస్థపండితులు స్వస్వమతానుకూలముగ వ్యాఖ్యానములు రచించుటయు, బహుభాషలలోనికి పరివర్తన మొనరించుటయు, నచ్చటచ్చట కించిత్కథాభేదముతో నధ్యాత్మరామాయణానందరామాయణాది నామాంతరములలో మున్యంతరకర్తృకముగ నుండుటయు, సమస్తపురాణములలో సంగ్రహముగ కథ యుదాహరింపఁబడుటయు, చప్పన్నాఱుభాషలలోఁ గీర్తనాదిరూపముగ స్త్రీ శూద్రసాధారణముగ నుండుటయు సంభవించినది. వాసిష్ఠరామాయణమన్ననో కేవలాద్వైతమతబోధ మగుటంజేసి తాత్పర్యగ్రహణము కష్టతర మగుటవలన నన్నివ్యాఖ్యానములుగాని స్వమతానుకూలముగ మతాంతరస్థులు వ్యాఖ్యానములఁ జేసికొనుటగాని సంభవింపలేదు కాన నద్వైతమతపండితైకవేద్యమే. అందును కతిపయవిబుధయతివరులకు మాత్రమే విదితమైనది. అయినను అభినందపండితుం డను నొకమహాత్ముఁడు ఇందలి కొన్ని యుపాఖ్యానములను వర్ణనాభాగమును త్రోసి ౬౦౦౦శ్లోకములసంగ్రహించి లఘుయోగవాసిష్ఠ మనుపేరిడెను ఇం కొకరు వచనరూపమున ముఖ్యతాత్పర్యమును తెలుఁగుభాషలో వ్రాసిరి ఇట్టివి యితరభాషల నేమేమి యున్నవో తెలియదు. మఱియు విద్వద్వర్యుండగు నులచనాటి కృష్ణయార్యుండను కర్ణాటకబ్రాహ్మణుండు వాసిష్ఠసప్తశతియనుపేరిట ౭౦౦ నీతివేదాంతబోధక శ్లోకముల నేఱి షుమారు ౬౦ సంవత్సరముల క్రిందట చిన్నిపొత్తము నేర్పఱచెను. దీనికి యోగవాసిష్ఠరత్నము లనికూడఁ బేరు కలదు. ఈ గ్రంథమునకు వారి యగ్రజుండగు వేంకటరమణపండితుండు సుబోధకముగ నాంధ్రతాత్పర్యమును వ్రాసెను. ఈయోగవాసిష్ఠము కేవలాద్వైతవేదాంతప్రతిపాదకమేకాక ప్రస్తావోచితములును, ప్రవర్తనోపదేశకంబు లగునట్టి నీతిబోధకశ్లోకములకు భాండాగార మనఁదగినది. పురాణములందువలె సృష్టిక్రమము, బ్రహ్మాండవర్ణనము, బ్రహ్మాండవైశాల్యముయొక్క కొలత మొదలగునవియు, ఉత్పత్తిప్రకరణమునందు ప్రపంచోత్పత్తిని "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అనుప్రతిజ్ఞానుసారముగఁ జూపించుచు నపవాదమును వివరించి జగన్మిథ్యాత్వమును సులభముగఁ గనుపర్చుచు శ్రీరామచంద్రునికి నుపదేశించుట యనుమిషచేత సుబోధకముగ ముముక్షుజనులకుఁ దెలియఁజేయఁబడియున్నది. దీనికి రెండువందల యిరువదిరెండు సంవత్సరముల క్రిందట శ్రీమదానందబోధయతీంద్రుఁడు సమస్తతాత్పర్యమును దెలియునటులు వాసిష్ఠార్థతాత్పర్యప్రకాశికయను నొక వ్యాఖ్యానమును రచించి పాఠకుల కత్యంతోపకార మొనర్చెను. అందు సకలశాస్త్రసంప్రదాయము లవసరము కలిగిన చోట్ల వ్రాయుచు శ్రీరాముని ప్రశ్నాంతర్గతభావమును, రామున కుపదేశించిన శ్రీవసిష్ఠమహర్షి యొక్క భావమును చక్కఁగ వెల్లడింపఁబడినవి. వాసిష్ఠము తర్కవ్యాకరణవేదాంతశాస్త్రములందుఁ బరిశ్రమచేసి అద్వైతమతాభిమానము కలిగినవానికి మననముచేసికొనుటకు మిగుల ననుకూలమగు గ్రంథమనియు, మనననిదిధ్యాసములంజేసినవారు తప్పక జీవన్ముక్తు లగుదురనియు నా నమ్మకము. మఱియు దీని ఫలశ్రుతి —

శ్లో. "అప్రబుద్ధోఽపి య శ్చేదం నాచయేద్భక్తిభావితః,
తస్య నిర్మలతా మేతి చిత్తం నాత్ర సంశయః."

(ఈశాస్త్రము ప్రబుద్ధుఁడుకానివాఁ డెవ్వఁడైనను భక్తియుతుఁడై చదువునేని వాని చిత్తము నిర్మలభావము నొందును. ఈ విషయమై సందేహము లేదు) అనియున్నందున వేదాన్తానుభవ మిదివఱకు లేనివా రందఱును జదివితీరవలసినదిగఁ దోఁచెడిని.

౬ వాసిష్ఠార్థప్రకాశికయను వ్యాఖ్యానమునకుం బూర్వము వాసిష్ఠమునకు వ్యాఖ్యానములు లేవని యానందబోధయతీంద్రుఁడు వ్రాసిన వ్యాఖ్యానపీఠికాంతమునం దిట్లు తెలియఁజేసియుండెను.

శ్లో. "అనన్యపూర్వవ్యాఖ్యాతం గ్రంథం మే వ్యాచికీర్షతః,
సన్తః శ్రమజ్ఞాః కృపయా క్షమధ్వం స్ఖలితం క్వచిత్."

(అనఁగ నిదివఱ కెవనిచే వ్యాఖ్యానము చేయఁబడని యీగ్రంథమును వ్యాఖ్యానముఁ జేయఁబూనిన నాకుఁ బ్రమాదమువలన వచ్చు స్ఖాలిత్యములను శ్రమ నెఱిఁగిన సరసులు దయచే క్షమింపవలయును) అని నుడివినందున పూర్వము వ్యాఖ్యానములు లేవు. తరువాత నింతకన్న విశేషములఁ గనుపఱుపఁదగిన పాండిత్యలోకోపకారబుద్ధి వాగ్రచనాసామర్థ్యాదులు లేనందున నెవరును రచింపలేదుగాన నిది యొక్కటియే వ్యాఖ్యానమని స్పష్టము.

౭. వ్యాఖ్యాంతమున వ్రాసిన శ్లోకముం జూడ,

శ్లో. "ఋతురసతురగమహీ (౧౭౬౬) శకవికారశుభవత్సరస్య
శిశిరర్తౌ]
ఫాల్గునసితసప్తమ్యాం భృగురోహిణవృషభలగ్నకే సిద్ధమ్."

(అనఁగా విక్రమార్కశకము ౧౭౬౬ వికారి సంవత్సరశిశిరర్తువు ఫాల్గునశుక్లసప్తమీ, శుక్రవారము రోహిణీనక్షత్రము వృషభలగ్నమున వ్యాఖ్యానము రచించుట సిద్ధించినది) అని నుడువఁబడినది. ఇప్పటికీ ౧౯౮౯ – ౧౭౬౬ లేక ౨౨౩ సంవత్సరముల క్రిందటనని తేలినది. పైన వ్రాయఁబడిన సంఖ్య శాలివాహనశకమని గ్రహించినచో

నిప్పటికి ౨౭-సంవత్సరముల క్రిందట రచించిన ట్లగును. బొంబాయిలో నిప్పటికి ౭౦ వత్సరముల క్రిందట నాగరలిపిలో ముద్రితమయిన సవ్యాఖ్యవాసిష్ఠరామాయణగ్రంథ ముఖపత్రమందు ప్రాచీనానేక లిఖితపుస్తకముల సంపాదించి శ్రమచే ముద్రించినామని వ్రాయ నవసర ముండదు అప్పటికి ౧౭ వత్సరము లగుసుగాన రచయిత్రి సుమతి చేతనే ముద్రింపందగును కాఁబట్టి విక్రమాబ్దములనే పేర్కొనినటులు తోఁచెడిని. ఈవ్యాఖ్యాత గురుపరంపరవిషయమై పరంపరలో నెవ రేయేగ్రంథముల రచించినది లోనగుచర్చ వ్రాయవలసిన యవసరము కలదుకాని గ్రంథవిస్తర మగుసుగాన మఱియొక వ్యాసము వ్రాయఁ దలఁచి యావిషయ మింతటితో విరమించితిని. అతిప్రాచీనమును ఋషిప్రోక్తము నగు నీవాసిష్ఠము కేవలాద్వైతప్రతిపాదక మగుటచే నితరులు బ్రహ్మసూత్రాది మతగ్రంథములకు స్వమతానురూపముగ భాష్యాదుల రచించినట్లు ఈగ్రంథమున కొకరైన స్వమతానుకూలముగ వ్యాఖ్యను వ్రాయరైరి.

౮. ఈ యోగవాసిష్ఠముగాక జ్ఞానవాసిష్ఠ మను పేరుతో తత్త్వసారాయణమను మఱియొక గ్రంథము కతిపయజనవిదిత మైయున్నది అదియుఁ గర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండలను మూఁడు ప్రకరణములు గలిగియున్నదిగాని యది వసిష్ఠుఁ డుపదేశించినది కాదు అందలి సిద్ధాంతములకు నిందలి సిద్ధాంతములకును బహుభేదము కలదుగాన వాసిష్ఠ మను నామమాత్రముచే నదియే యిదియని భ్రమ కలుగవచ్చునుగాన నట్టి భ్రమ కలుగకుండుటకై గ్రంథద్వయమునకు నామైకమాత్రసామ్య ముండినను కర్తృభేదవిషయభేద సిద్ధాంతభేదము లున్నయవి యని హెచ్చరిక చేయుచున్నాను

౯. ఇందు ప్రథమమగు వైరాగ్యప్రకరణమున కథానుక్రమణికయు, జగద్దోషకథనమును, శుకోపాఖ్యానమును దెలుపఁబడియున్నవి. అందు జగద్దోషకథనమున నాయుర్విత్తాదులవల్ల కలుగు దుఃఖముల వివరమును, దేహాత్మభ్రమమునఁ గల్గు ననర్థములను వివరించుటయు, మనోనిగ్రహమువలని లాభము మొదలగు విషయములు బాగుగ వివరింపఁబడియున్నవి రెండవదియగు ముముక్షువ్యవహార ప్రకరణమున పురుషప్రయత్నబలమును, శుభాశుభవాసనాఫలమును, గురులక్షణమును, ఉపదేశాధికారిలక్షణమును, సాధుసంగమువలని లాభమును, జీవన్ముక్తధర్మమును లోనగునవి వివరింపఁబడియున్నవి మూఁడవదియగు నుత్పత్తిప్రకరణమునఁ దొమ్మిది యుపాఖ్యానములుగలవు మొదటిదియగు నాకాశజోపాఖ్యానమున జగంబునకుఁ బరబ్రహ్మము వివర్తకారణ మనియు, బ్రహ్మమునకుఁ గలిగెడు జీవభావమును, జగదాత్మల కభేదంబును, దృష్టాంతపూర్వకముగ నుపన్యసించి, తద్బోధనిమిత్తము ఆకాశజుఁడను ద్విజుని యుపాఖ్యాన ముదాహరింపఁబడినది. ఈకథ మిగులఁ జమత్కారజనకమగు సంవిధానము గల్గియున్నది. రెండవదియగు లీలోపాఖ్యానమున జగన్మాయామయత్వస్థాపనార్థము బహువిధదుర్ఘటనాపరత్వముఁ జెప్పి తదనుగుణంబగు లీలోపాఖ్యానము చెప్పఁబడియున్నది మూఁడవదియగు కర్కట్యుపాఖ్యానము బ్రహ్మదృష్టివలన లాభమును చెప్పఁదలఁచి వ్రాయఁబడియున్నది. నాల్గవదియగు నైందవోపాఖ్యానమునఁ బ్రపంచసృష్టికి మనస్సు కారణమను సంగతి యుక్తియుక్తముగఁ దెలుపఁబడియున్నది. ఆఱవదియగు కృత్రిమోపాఖ్యానమున మనోవ్యాపారప్రబలత్వము స్థిరీకరింపఁబడియున్నది. ఏడవదియగు చిత్తోపాఖ్యానమున మనఃకల్పితమగు సుఖదుఃఖాదికము ననుభవించుటకు ప్రధానమగు శరీరస్వరూపవిచారణకొఱకు చిత్తాఖ్యాన ముదాహరింపఁబడినది. ఎనిమిదవదియగు బాలకోపాఖ్యానమునందు ప్రపంచంబు మిథ్య యైనను సామాన్యులకు పారమార్థిక మని తోఁచు విషయముంగూర్చి వివరింపఁబడియున్నది లవణోపాఖ్యానము స్వల్పకాలముననే అనేకసంవత్సరములు మానససంసార మొనర్చువిషయ సమర్థనార్థము వ్రాయబడియున్నది తొమ్మిదవదియగు శాంబరికోపాఖ్యానమున ప్రపంచము మనఃకార్యమగుట దృష్టాంతపూర్వకముగఁ దెలుపఁబడియున్నది మొదట పామరజనరంజనముగ కథారూపంబుగ విషయమును బోధించి పిదప విషయవివరణము చేయఁబడినది కథారూపమును, విషయగాంభీర్యమును గలిగియుండుటచే సర్వజనాదరణీయమైయున్నది. ఇటులే తక్కిన మూఁడుప్రకరణములలో నుండు విషయసారమునుగూర్చి వ్రాయఁదగినను, పాఠకజనకుతూహలాను సారముగ నింకొకతఱి వ్రాయఁదలఁచి సంగ్రహము వ్రాయుట మాని విషయాంతరచర్చకుఁ బూనుకొనుచున్నాను

౧౦. శ్రీరామచంద్రునకు వసిష్ఠమహర్షి పదునెనిమిదిదినములలో నీయోగవాసిష్ఠాంతర్గతబోధఁజేసినటులు ఈ క్రిందిశ్లోకమువలనఁ దెలియఁబడుచున్నది నిర్వాణప్రకరణమున —

శ్లో. "అష్టాదశేతి దివసాన్ విపథే వరిష్ఠాం
గోష్ఠీం వసిష్ఠమునినా సహ రామచంద్రః,
పీత్వా భవప్రభవమోహ మథావతస్థే
నిర్వాతవారిధి రివాచలసత్త్వపూర్ణః"

(అనఁగా శ్రీరామచంద్రుం డీవిధంబున వసిష్ఠమహామునితోడఁ బదునెనిమిదిదినంబులు శ్రేష్ఠంబగు సభను గావించి చలింపని యూదోగణంబులతోఁ గూడి వాయుసంబంధంబు నొందని సముద్రంబువలె నుండెనని యర్థము) 'అచలసత్త్వపూర్ణః' అనుశబ్దము రామపరం బగునపుడు రజస్తమంబులఁబాసి చలింపని సత్త్వమాత్రావశిష్టంబగు చిత్తంబుచేఁ బూర్ణుఁడై యొప్పారునని యర్థము. ఇదియునుగాక ఈగ్రంథమునందచ్చటచ్చట బోధఁజేయుచునుండఁగ సూర్యాస్తమయ మైనచో,

శ్లో. "ఇత్యుక్తవ త్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయే ఽస్తమినో జగామ,
స్నాతుం సభా కృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహాజగామ."

అని దివసపూర్తియు మఱుదినమునఁ దిరిగి సూర్యోదయమ్మునకే సభావారందఱుఁ జేరుటయు వసిష్ఠరాముల సంవాదప్రారంభమును వర్ణింపఁబడుచునేయున్నది

౧౧ ఈ గ్రంథమున నద్వైతమత ప్రసిద్ధములగు నేకజీవవాదము, దృష్టిసృష్టివాదము, వివర్తవాదము, ప్రతిబింబవాదము, అజాతవాదము మున్నగునవి విశేషించి ప్రదర్శింపఁబడినవి మఱియు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అను నద్వైతసిద్ధాన్తసంగ్రహ శ్లోకార్థమును బాగుగ ఋజువుచేయుచు దృశ్యమిథ్యాత్వము ననేక యుక్తులతో నుపపాదించి, యుపాఖ్యానకథనముచే ఋజువుచేసి యొప్పించి, జీవుఁడు కల్పితుఁడుగాని వాస్తవుఁడుగాఁడు, కేవలచిన్మాత్రమగు బ్రహ్మపదార్థ మొక్కటియే సత్యము, అంతఃకరణోపాధికుండగు వ్యష్టిజీవుండును సమష్టిమాయోపాధికుండగు నీశ్వరుండును, జడము దృశ్యంబగు ప్రపంచము రజ్జువునందు సర్పమువలెఁ దోఁపింపఁబడి కల్పితులు కాని వాస్తవులు గారనియు, భ్రాంతిదృష్టితోఁ జూచు వారికి వాస్తవములని తోఁచునేకాని సర్వాధిష్ఠానమగు చైతన్యమును గోచరించు దృష్టితో జ్ఞానము కలిగి చూచువారికి మిథ్యాభూతములై యధిష్ఠానచైతన్యమగు పరమాత్మ యొక్కటియే శేషించు ననియు, అప్పుడు సర్వదుఃఖధ్వంసమై, నిత్యనిరతిశయానంద మునుభవించి కృతార్థుం డగుననియు బోధింపఁబడియున్నది శ్రీశంకరాచార్య విరచిత శ్రీశారీరకబ్రహ్మసూత్ర భాష్యాదిప్రస్థానత్రయములలోనేమి యితరములగు నద్వైతగ్రంథములలోనేమి పైవిషయము నిర్ణయింపఁబడి యున్నను "యావత్పరమతం న నిరాక్రియతే తావత్స్వమత మప్రతిష్ఠితం భవతి" అను న్యాయానుసారము మతస్థాపనార్థము వెయలువెడలిన గ్రంథములుగాన చార్వాకాదినాస్తికమతములను సాంఖ్యాద్యాస్తికమతములను ఖండించుటకొఱకు తత్తన్మతముల ననువదించి పూర్వపక్షముగ స్వీకరించి సిద్ధాన్తమును ప్రతిపాదింపవలసివచ్చినందున గ్రంథములు పెద్దవియై యనేకశాస్త్రములందుఁ బ్రవేశముగల వారికిఁగాని సుబోధము కానివియై వ్యాఖ్యానోపవ్యాఖ్యానభాషాన్తరీకరణాద్యపేక్షచేతినే జిజ్ఞాసువుల నుద్ధరించునవిగా నున్నయవి. ఈ వాసిష్ఠమన్ననో నితరవాదములుకాని మతఖండనములుకాని లేనిదియై ౩౨ వేల శ్లోకములు గల్గి ఉపాఖ్యానములతోసహా కేవలాద్వైతానుభవబోధకముగ నుండుటంబట్టి యెట్టి యధికారికైనను తగినంత జ్ఞానదాయకముగ నున్నదని చెప్పవచ్చును

౧౨ ఏతద్గ్రంథస్థవిషయగాంభీర్యమును జూపుట నీక్రిందిశ్లోకములఁ జూడనగు. ఉత్పత్తిప్రకరణమున లీలోపాఖ్యానములో ౨౧వ సర్గలో సరస్వతీదేవి లీలయను రాజపత్నికి నుపదేశించు సందర్భమున

శ్లో. "మహాచిద్రూప మేవ త్వం స్మరణం విద్ధి వేదనమ్,
కార్యకారణతా తేన సశబ్దో నచ వాస్తవః. ౨౩.

శ్లో. ఏవం నకించి దుత్పన్నం దృశ్యం జిజ్జగదాద్యపి,
చిదాకాశే చిదాకాశం కేవలం స్వాత్మని స్థితమ్." ౨౪

(అనఁగా మాయోపాధికి నంతఃకరణోపాధికిని భేదము పరామర్శించినచో నీయుపాధిద్వయముచే నుపహితమగు నధిష్ఠానసన్మాత్రమందుఁగూడ భేదకల్పనయగుటవలన కార్యసత్త కారణసత్తవలనఁ గలిగిన దని భ్రాంతిపడి పూర్వావస్థమైనది కారణము, నుత్తరావస్థమైనది కార్యము ననియు నింతవఱకుఁ దెలిసికొనుచుంటివి గాని యటులు గ్రహింపరాదు. మఱియేమన మాయామాయాకార్యముల నుపేక్షించి ఆరెండింటియందు ననుగతమగు సన్మాత్రాత్మక చిద్రూపమునే స్మరణముగఁ దెలిసికొనుము. అయ్యది యెట్టులన —మృత్తు, పిండమునందును, ఘటమునందు నున్నదిగనుక ప్రత్యేకముగఁ బిండదృష్టిని, ఘటదృష్టిని ఉంచినచోఁ బిండము కారణమనియు, ఘటము కార్యమనియు నేర్పడును. అటులుగాక పిండమందును ఘటమందుఁగూడ మృత్తునందలి దృష్టియే యుంచినచో కార్యకారణభావము నశించి, పిండఘటముల కధిష్ఠానమగు మృత్తుమాత్రమే గోచరించును అటులే ఇట్టి ప్రత్యగ్దర్శనముచే మాయాశబళమగు నీశ్వరుండు కారణమనియు, నంతఃకరణోపాధికుండగు జీవుండు కార్యభూతుం డనియు, భేదబుద్ధి నశించునుగాన నీరీతిగఁ జూచినయెడల జగదాదిదృశ్య మేమియు పుట్టనేలేదనియు,చిదాకాశమునందే చిదాకాశము ప్రతిష్ఠింపఁబడియున్న దనియుఁ దెలియఁబడును. ఇయ్యది 'సభగవన్ కస్మిన్ ప్రతిష్ఠితః, స్వే మహిమ్ని ప్రతిష్ఠితః' అను ఛాన్దోగ్యశ్రుతిప్రమాణానుసారము చెప్పఁబడినది

శ్లో. "దృశ్యం నాస్తీతిబోధేన మనసో దృశ్యమార్జనమ్,
సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః."

అనఁగ, దృగ్రూపంబగు నాత్మవలన నాకాశాది ప్రపంచంబు పుట్టెను. ఉపాదానకారణ వ్యతిరేకంబయిన కార్యం బుండదుగావున కార్యంబగు ప్రపంచమంతయు దృగ్రూపంబగు నాత్మయేకాని అన్యంబుగానను జ్ఞానముచే మనస్సునకు దృశ్యవిస్మరణము సంపన్నంబయ్యెనేని సర్వోత్తమంబగు మోక్షసుఖము సిద్ధించెడిని. ఇదిసిద్ధము జీవన్ముక్తియు నిదియే

౧౩ విదూరథమహారాజునకును సింధురాజునకు యుద్ధప్రసక్తియందు (అనఁగ నుత్పత్తిప్రకరణములో లీలోపాఖ్యానమందు ౩౦వ సర్గ మొదలుకొని) నానావిధాయుధవిశేషములతో నత్యద్భుతమగు యుద్ధమును వర్ణించుటయేకాక పెక్కువేల బ్రహ్మాండములు, సప్తసముద్రములు, వానిపరిమాణములు, తద్గతద్వీపములు, భూమియొక్క ఆకర్షణశక్తియు, భరతవర్షమందలి సమస్తదేశవిశేషములును వరుసఁదప్పక ప్రాచ్యాదిదిగ్విభాగపూర్వకముగ వర్ణించి వసిష్ఠమహర్షి శ్రీరామునికి నుపదేశముచేసెనను మిషచే భూగోళశాస్త్రతత్త్వమును లోకమునకు శ్రీవాల్మీకి తెలియఁజేసి తనకుఁగల లోకజ్ఞానమును లోకాంతరజ్ఞానమును తనవాఙ్మయమునందుఁ బ్రకటించి నిరీహులైనవారుసహి

తము నిష్కామముగ లోకోద్ధరణమునకై చేతనయినంతరీతిగ పాటు పడుచుండవలయునని బోధించి తమజన్మమును సార్థకముగఁజేసికొను టయేకాక తదాసక్తిగల విజ్ఞానులజన్మమును సార్థకమగునట్లు ఆధ్యాత్మికజ్ఞానమువలయువారికి నాధ్యాత్మికజ్ఞానము బోధించుటయేకాక ప్రపంచతత్త్వము నెఱుఁగఁదలఁచి గ్రంథపఠనమునకై పూనుకొనినవారలకుఁ బ్రత్యేకశాస్త్రముగ చేయఁదగినంత విషయవిమర్శనచేయఁదగిన విషయవిభాగమును గనుపఱిచి యాధికారికదేహోపలబ్ధిచే కాలము గడపినటులు సూక్ష్మబుద్ధితో విమర్శించి చూచువారికి తోఁచకమానదు. కనుకనే వాల్మీకి యుత్పత్తి ప్రకరణములో ౪వ సర్గలో

శ్లో "శ్రుతేఽస్మిన్ వాఙ్మయే యస్మా జ్జీవన్ముక్తత్వ మక్షయమ్,
ఉదేతి స్వయమేవాత ఇదమే వాతిపావనమ్" ఉ॥ ౭॥౧౦.

అని చెప్పి—

శ్లో. "య దిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్,
ఇమం సమస్తవిజ్ఞానశాస్త్రకోశం విదు ర్బుధాః."
ఉ. ౭, స ౧౩, ప.

అని సమస్తవిజ్ఞానములకు కోశాగారమని వక్కాణించెను ఇంతియే కాక ముముక్షువ్యవహార ప్రకరణములోఁ బ్రస్తావవశమున వసిష్ఠుండు శ్రీరామునకు నీగ్రంథప్రాశస్త్యమును బోధించుచు,

శ్లో "యస్మిన్ శ్రుతే మతే జ్ఞాతే తపోధ్యానజపాదికమ్,
మోక్షప్రాప్తౌ నరస్యేహ నకించి దుపయుజ్యతే"
మోక్షప్ర ౧౭ సర్గ, ౩౫

అనిచెప్పి

శ్లో. "ఏతచ్ఛాస్త్రఘనాభ్యాసాత్ పౌనఃపున్యేన వీక్షణాత్,
పాండిత్యం స్యా దపూర్వంహి చిత్తసంస్కారపూర్వకమ్"
మోక్ష. ౧౭ సర్గ ౩౬.

అనఁగ వాసిష్ఠరామాయణమనెడి శాస్త్రమును దృఢముగ నభ్యసించి మరల మరల దానింజూచుచుండుటవలన చిత్తమునకు మంచి సంస్కారమదయించి తరువాత సర్వవిజ్ఞానములలో నపూర్వమగు పాండిత్యము కలుగునని తాత్పర్యము ఇట్లు వాల్మీకి స్వయముగ చెప్పుకొనియున్నది విచారించువానికిఁ దథ్యమని తోఁచకమానదు.

౧౪. ఇఁక కావ్యలక్షణముల నాలోచించిచూచినచో నాలంకారికసమ్మతములగు నగరార్ణవశైలర్తు ప్రభృత్యష్టాదశవర్ణన లత్యద్భుతశైలిలో నుండుటయే కాక,

శ్లో. "సర్గై రనతివిస్తీర్ణై శ్శ్రావ్యవృత్తై స్సుసంధిభిః,
సర్వత్ర భిన్నసర్గాన్తై రుపేతం లోకరంజనమ్"

అనఁగ నత్యధిక సంఖ్యాకములు కానట్టివియు, విన సొంపైన వృత్తములు గల్గినట్టివియు, మంచి సంధులతోఁ గూడినట్టివియు, ప్రతిసర్గాన్తమున వేఱువేఱు వృత్తములుగలవియునగు సర్గలతోఁగూడిన కావ్యము లోకరంజకము—అని యున్నయది 'ఉపమా కాళిదాసస్య' అని యుపమాలంకార ప్రయోగమునందుఁ బ్రసిద్ధివహించిన శ్రీ కాళిదాసకవివరుండు శ్రీవాల్మీకిమహర్షి రామాయణమునందు బహుళముగఁ దగినటు లుపయోగింపఁబడుచువచ్చిన యుపమానుసారముగఁ బ్రయోగించుటవలననే మహాకవియని పేర్కొనఁబడియె నట్టి యుపమలు శ్రీరామాయణమునందువలెనే వాసిష్ఠమహారామాయణమునందును దఱుచు వాల్మీకి ప్రయోగించి తన వాఙ్మయమునకు వన్నె తెప్పించి యర్వాచీనకవులకు మార్గదర్శకుం డయ్యె ఒక్కయనుష్టుప్శ్లోకమునందు నొక్కొకచో రెండుపమానములును, నొక్కొకచో నాల్గుపాదములయందు నాల్గుపమానములును బ్రయోగించును అట్లు శ్రీమద్రామాయణమందును, వాసిష్ఠమునందును దఱుచు కాన్పించును. కాని వాసిష్ఠమునందలి శైలి కొంచెము రామాయణముకంటె కఠినమైనదని చెప్పకతప్పదు ఏలయన ఓజోగుణ మెక్కువ కన్పించును శ్లోకమునందు అర్ధభాగ మొక్కటియే సమస్తపదముగ నుండును వేదాంతభాగము వచ్చినప్పుడు తాత్పర్యగాంభీర్యము తప్పదుగదా! అయినను స్వాధీనవాక్కులుగల మహానుభావు లెన్నిప్రయోగవైచిత్ర్యములఁ జూపలేరు!

౧౫ ఇట్టి గుణగణముల విమర్శించుచు నామూలాగ్రము గ్రంథమును పరిశీలించి చూచినచో నెన్నియో విశేషములు వ్రాయఁదగియున్నవి. ఇయ్యది నల్గురు విమర్శనదక్షులగు విద్వాంసు లొకచోఁ జేరి విమర్శించినచో నిందుండు సమస్తవిషయముల వ్రాయుట కలవియగునుఁ దుర్లభము. అట్టిస్థితిలో నే నొక్కఁడనే వ్రాయుటకు సామర్థ్యము సమయము చాలనందున నింతటితో దిఙ్మాత్రము పండితులకు రుచిచూపించి విపులవిమర్శనాకుతూహలులకు తద్భారమును వదలి నే నింతటితో విరమించుచున్నాను.

# అలంకారశాస్త్రము

శ్రీ మాధవరామ శర్మగారు

కావ్యనిర్మాణమునఁ, దత్స్వరూపదోషగుణాలంకారాద్యవధారణమునను శక్తి నుల్లసింపఁజేయునది యలంకారశాస్త్రము. భాషావ్యుత్పత్తికి వ్యాకరణ మపేక్షింపఁబడునట్లే కావ్యనైపుణ్యమునకై యలంకారశాస్త్ర మపేక్షింపఁబడును. కావ్యనైపుణ్యమేకాక వాక్యదోషజ్ఞానముగూడ దీననె కలుగును. వ్యాకరణాదిశాస్త్రజ్ఞానమె యుండి యలంకారశాస్త్రపరిచయము లేనివాఁడు "చింతారత్నమివ చ్యుతోఽసి", "గుణై రనర్ఘైః ప్రథితో రత్నైరివ మహార్ణవః" ఇత్యాదులం దుపమానోపమేయములకు లింగభేద మవిశిష్టమయినను "మొదటిదే దుష్టముకాని రెండవది కా"దని యెట్లెఱుంగఁగల్గును? ఇట్లె 'జఘనకాంచి' యనునది పునరుక్తిదోషదూషితమని, 'కర్ణావతంస' మనునది యట్లుగాదని యెట్లు చెప్పఁగల్గును? కాన నీయలంకారశాస్త్రముకూడ వ్యాకరణాదికమువలె నవశ్యముగా నధ్యేతవ్యము. అలంకారశాస్త్రోపజ్ఞాత లెవరో, యెప్పు డది యుత్పన్న మయినదో నిర్ణయించుట శక్యము కానిపని. వేదమున నుపమ, దృష్టాంతము మొదలగు నలంకారములు గన్పడుచున్నవి. అంతమాత్రమున నచట నీచర్చ ప్రారంభమయిన దన లేము. ఇట్లే యితరస్థలములందుఁగూడ నెఱుంగవలయును. ఉపమ యనుపదము వేదమునఁ గానవచ్చుచున్నది. కాని యది యలంకారశాస్త్రీయపారిభాషికపదమని యనుకొనుటకు వీలులేనట్లు 'దృష్టాంత'మని సాయణమాధవుఁ డర్థము వ్రాయుచున్నాఁడు. "ఉపమానాని సామాన్యవచనైః", "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే" యను పాణినిసూత్రములందు వాడఁబడిన వీయాలంకారికపారిభాషికములె. "ఆనుమానికమప్యేకేషాం శరీరరూపకవిన్యస్తగృహీతే ర్దర్శయతిచ" యను బాదరాయణసూత్రమునందు రూపకపదముగూడ నిట్టిదయ. "శ్యేనే నాభిచరన్ యజేత" యనుచోటఁ దద్వ్యపదేశమువలన నామధేయత్వ మంగీకరింపవలయునని ప్రతిపాదనముచేయు మీమాంసకులును "తేన వ్యపదేశః, ఉపమానం" అనుటవలన నుపమానపదము నీయర్థముననె వాడినారని తెలఁపవచ్చును. మహాకవి కాళిదాసున కనంతరమే యీశాస్త్రచర్చాప్రారంభము నూహించువారు ప్రసిద్ధాలంకారికగ్రంథములం దంతటను నాతని కృతుల నుండి తీసికొనఁబడిన పద్యము లుండుటను హేతువుగఁ జెప్పుదురు. భామహుఁడు మొదటగా నీయలంకారశాస్త్రమును బ్రకాశింపఁజేసియుండవచ్చును. ఇప్పటికిఁ దెలిసిన యాలంకారికులలో భామహుఁడె మొదటివాఁడగుట యీయూహ కాధారము. బాణునకన్న భామహుఁడు పూర్వుఁడనుట నిర్వివాదము. ఈకాలపౌర్వాపర్యవిమర్శనము చరిత్రకారులపని యగుట నిట నాచర్చ యవసరముకాదు. అగ్నిపురాణ మీశాస్త్రమునకు మూలముకావచ్చును. అందుఁ గావ్యలక్షణ మున్నది. శబ్దార్థాలంకారములు, రీతులు, గుణములు, దోషములు, రసములు చెప్పఁబడినవి. అగ్నిపురాణమున 332-వ యధ్యాయము మొదలుకొని ౧౧ అధ్యాయముల నీశాస్త్రమునుసంబంధించిన విషయములె ప్రతిపాదితములు. అందుఁ గావ్యసంబంధివిషయము లిట్లున్నవి.—

| అధ్యాయము | శ్లోకములు | | విషయము |
|---|---|---|---|
| ౩౩౭-లో | ౩౮½ | లందు | కావ్యాదిలక్షణము |
| ౩౩౮-*,, | ౨౭½ | ,, | నాటకనిరూపణము |
| ౩౩౯-,, | ౫౪ | ,, | రసనిరూపణము |
| ౩౪౦-,, | ౧౦ | ,, | రీతినిరూపణము |
| ౩౪౧*,, | ౨౦½ | ,, | నృత్యాదులం దంగకర్మనిరూ[పణము |
| ౩౪౨*,, | ౩౩ | ,, | అభినయాదినిరూపణము |
| ౩౪౩-,, | ౬౫ | ,, | శబ్దాలంకారములు |
| ౩౪౪-,, | ౩౨ | ,, | అర్థాలంకారములు |
| ౩౪౫-,, | ౧౮½ | ,, | శబ్దార్థాలంకారములు |
| ౩౪౬-,, | ౨౫ | ,, | కావ్యగుణవివేకము |
| ౩౪౭-,, | ౪౦½ | ,, | కావ్యదోషవివేకము |

ఈయధ్యాయము లలంకారప్రతిపాదకములనియు నందున్నది. ఇందు మొత్తము ౩౬౬½ శ్లోకములచేఁ గావ్యవిషయములు చర్చింపఁబడినవి.

భరతుని నాట్యశాస్త్రము కాళిదాసునకన్నఁ బ్రాచీనము. "విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రస నిష్పత్తిః" యనునది భరతసూత్రమనియె యాలంకారికులు పల్కుచున్నారు. ప్రాచీనకాలమున గ్రంథమంతయు సూత్రాత్మకముగ నుండెడిదేమో! ఇందు షష్ఠాధ్యాయమున రసములు విచారింపఁబడినవి. అందే రసముల యుత్పత్తిని, వర్ణదైవతములను జెప్పి తత్తద్రసస్థాయిభావములను, తత్స్వరూపములను, దద్దవాంతరవిభాగములను నిరూపించినాఁడు. ఆయారసముల నుచితముగ సంభవించు వ్యభిచారులను సంఖ్యానమొనర్చెను. సప్తమాధ్యాయమున భావముల నిర్వచనము, వ్యభిచారిభావముల లక్షణమును విపులముగఁ జెప్పఁబడినవి. తరువాత,

"ఉపమా దీపకంచైవ రూపకం యమకం తథా,-
కావ్య స్యైతే హ్యలంకారా శ్చత్వారః పరికీర్తితాః."

అని నాలుగేయలంకారము లనెను. వానికి లక్ష్యలక్షణప్రదర్శన మున్నది. పిమ్మట శ్లేషప్రసాదాదిదశగుణముల లక్షణములు వ్రాయఁబడినవి.

అయినను నలంకారశాస్త్రచర్చ గుణీభావమునే పొందినదిగాని ప్రధానముగ విమర్శింపఁబడలేదు. దీనికిఁ బ్రత్యేకత్వము భామహకాలమునఁ గల్గినది. భామహుఁడు తన కావ్యాలంకారసంగ్రహమున మేధావిమతమును ఖండనమొనర్చె ననుచున్నారు కాని, మేధావికృతిగాని, యాతని మతప్రతిపాదకవచనములుగాని యుపలబ్ధముకామి ప్రస్తుతము ప్రస్తుతింప నక్కరలేదు.

ఈశాస్త్రమున దోషగుణాలంకారరసములు నిరూపణీయములె యయినను నిది యలంకారశాస్త్ర మను పేరుతోడ వ్యపదేశింపఁబడుటలో హేతువు స్పష్టముగఁ దెలియకున్నది. అలంకార మనుశబ్దమునకు రెండు వ్యుత్పత్తులు చెప్పవచ్చును. "అలంక్రియతే ఽనేనే త్యలంకారః"యని కరణసాధనమున నొకటి. ఇట్లు వ్యుత్పన్నమయిన యలంకారశబ్దము యమకోపమాద్యలంకారబోధకము. "అలంకృతి రలంకారః" యను భావసాధనమున రెండవది. ఈవ్యుత్పత్తి నాశ్రయించినపు డలంకారశబ్దము దోషరాహిత్యమున, గుణానుప్రాసోపమాద్యలంకారసాహిత్యమునఁ గలిగిన సౌందర్యపర మగును. ఈశాస్త్ర మట్టిసౌందర్యమును ప్రతిపాదించునదిగాన నలంకారశాస్త్ర మను వ్యపదేశము గలిగియుండవచ్చును. ఈయభిప్రాయమునకు సాధకముగనే వామనుని గ్రంథసందర్భము కన్పడుచున్నది.

గౌతముని శాస్త్రము ప్రమాణప్రమేయాదిషోడశపదార్థప్రతిపాదకమయినను నందు పరార్థానుమానపర్యాయమగు న్యాయమె ప్రధాన మగుటచే నది న్యాయశాస్త్రమని వ్యవహరింపఁబడుచున్నట్లు, ఈశాస్త్రము దోషగుణాదిప్రతిపాదకమయినను నిందు యమకోపమాద్యలంకారములె మహావిషయముగల వగుటచేత, కావ్యవ్యవహారప్రయోజకము లగుటచేతను ప్రాధాన్యము గలవియగుట దీనికి నలంకారశాస్త్ర మను వ్యవహారము సిద్ధించియుండవచ్చుననియుఁ దోఁచుచున్నది. "కావ్యవృత్తే స్తదాశ్రయా"త్తను ధ్వనికారుని వచనము చూడ నఁ౦

* వీనిలో దృశ్యకావ్యసంబంధివిషయములు గలవు.

కారములె కావ్యవ్యవహారప్రయోజకములని తెలియు చున్నది.

కాని యలంకారశాస్త్రమని పేరువచ్చుట కిది బీజము కావచ్చును. భామహుఁడు, దండి, ఉద్భటుఁడు, వామనుఁడు మొదలగు ప్రాచీనాలంకారశాస్త్రకారు లనే కు లున్నారు. వారు వ్యంగ్యార్థము వాచ్యమున కుప స్కారకమె యగుట నది యలంకారమునందె యంతర్భ వించునని తలఁచి "అలంకారాఏవ కావ్యే ప్రధాన"మ్మని సిద్ధాంతముచేసిరి. అందుచే నాకాలమున నలంకారమె ప్రధానముకాఁగా "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి" యను న్యాయము ననుసరించి యాశాస్త్రమున కలంకా రశాస్త్ర మను వ్యపదేశము సిద్ధించెను. అర్వాచీనాలం కారికుఁడగు నానందవర్ధనాచార్యుఁడు నిగూఢవిచారణము చేసి ప్రతీయమానార్థమె ప్రధానమనియు, గుణములు, నలంకారములు నాయర్థమున కుపస్కారకములనియు ధ్వన్యాలోకమున వ్రాసెను. వ్యంగ్యము మూఁడువిధ ములు—వస్తువు, అలంకారము, రసము అని. వీనియం దును రసరూపవ్యంగ్యమె ప్రధానమయినది. వస్తువు నలం కారమును దుదకు రసపర్యవసన్నత నొందుటయే యిందు హేతువు. శరీరమునం దాత్మవలెఁ గావ్యమున రసమె ప్రధానముగ నుండుఁగావున "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి"యనున్యాయమున నిప్పుడు "రసశాస్త్ర"మను వ్యపదేశ ముండుటయె న్యాయమయినను, నలంకార ప్రాధాన్యము లేకపోయినను ప్రాచీనప్రచారప్రణాళిక ననుసరించి యలంకారశాస్త్రమనియె యిప్పటికి నిది వ్యవహరింపఁబడుచున్నది.

ఆనందవర్ధనునకుపూర్వపు టాలంకారికు లందరు నలంకారప్రాధాన్యవాదులు. వారి గ్రంథసరణినిబట్టిచూడ నలంకారమునె కావ్యాత్మగ నంగీకరించినట్లు కన్పడుచు న్నది. దండివామనులు రీతిప్రాధాన్యవాద మొనరించి కావ్యాత్మత్వము దానికె చెప్పిరి. నవమశతాబ్దమునకుఁ బూర్వపు వారి గ్రంథములు, కారికాత్మకములయినను సూత్రప్రాయములుగ నభిప్రాయగర్భితములుగ విషయావ బోధకములుగ నున్నవి. ఆగ్రంథములందు విషయముపై విపులచర్చ కానరాదు. తన్మతానుయాయివ్యాఖ్యాతలు గూడ చాలవఱకు తమవ్యాఖ్యానములను విషయతత్త్వ మును ప్రధానముగఁ దెలియఁజేయుటకు పర్యాప్తము లగు నట్లుగ రచించినట్లు కన్పడును. అప్పటికాలమునం దలం కారప్రాధాన్యవాదమున నెక్కుడుగ వివాదములు లేక పోవుటయె వారిగ్రంథములందలి వాదబాహుళ్యాభావ మున కారణము. కావ్యోపస్కారకసామగ్రియందు వైచి త్ర్యప్రదర్శనమునకె వారు ప్రయత్నించిరి. వీరి గ్రంథము లందలి భాష లలితముగ, నక్లిష్టముగ నుండును. వామ నునిగ్రంథము సూత్రరూపముగ నున్నది. మిగిలినవి శ్లోకాత్మకములు. ఆనందవర్ధనుని కాలమున ప్రస్థానము పుష్కలమగు మార్పును బొందినది. అలంకారప్రాధాన్య మంతరించినది. అతని బుద్ధికుశలతచే చిరంతనాలంకారి కుల సూక్ష్మబుద్ధులచేఁగూడ నున్మీలితముకాని ధ్వనిప్రస్థా నము పైకివచ్చినది. కావ్యవిషయమున చిరంతనప్రణాళిక మారునప్పటికి వివాదము లనేకములు బయలుదేరియుండ వచ్చును. వాని నన్నిటిని నిరాకరించి ప్రతివాదులచేఁ దనవాదము నంగీకరింపఁజేసి యానందవర్ధనుఁడు గ్రంథ మును రచించియుండును. ధ్వనిస్థాపనమున వచ్చు నాక్షేప ములఁ బరిహరించి, దాని యపరిహార్యతను ప్రదర్శించి, కావ్యమహత్త్వము తత్ప్రయోజ్యమెయని సూచించి "కావ్య స్యాత్మా ధ్వనిః"అని చాటినాఁడు. తరువాతివా రీమార్గ మునె యవలంబించినారు. తార్కికుఁడగు మహిమభట్టు మాత్రము ధ్వని కనుమానాంతర్భావమును ప్రబలప్రయ త్నమున పాండితీప్రకర్షచే సాధించుటకు వ్యక్తివివేకమును వ్రాసినాఁడు. భట్టనాయకుఁడు తన హృదయదర్పణమున ధ్వనివాదమును నిరాకరించెనని మహిముఁడు చెప్పు చున్నాఁడు. కాని యాగ్రంథము కాలగర్భమున లీన మయినది. ధ్వన్యాలోకమున నొక్కధ్వనియె విచారింపఁ బడినది. దీనిపై నభినవగుప్తపాదాచార్యులు లోచనమను వ్యాఖ్యానమును వ్రాసినాఁడు. ఇతఁ డాలంకారికశిరో మణియని మమ్మటాదుల యాశయము. రసగంగాధరము

నందలి పరిష్కారములకు లోచనగ్రంథమె యచ్చటచ్చట నాధారముగఁ బొడగట్టుచున్నది. లోచనగ్రంథము చాల ప్రౌఢముగ నుండును. కొన్నికొన్ని విషయములు దురూహములుగ నున్నవి. లోచనమువంటి రమ్యబహుగుణగ్రంథము లేదనవచ్చును. ఇప్పుడు ముద్రితమయిన గ్రంథమున త్రుటితభాగములు, నశుద్ధపంక్తులును బహుళముగ నున్నవి. చతుర్థోద్యోతలోచనము నిర్ణయసాగరయంత్రమున ముద్రితము కాలేదు. కలకత్తాపత్రికలోఁ బ్రకటింపఁబడుటవలన దానికిఁ గీర్తిశేషత్వము తప్పినదిగాని పాఠకసౌకర్యము గలుగలేదు. నూతనోపలబ్ధకౌముదీవ్యాఖ్యనుగూర్చి, లోచనమ్మును బరిశోధించి, యుపలోచనము గూర్చి మహామహోపాధ్యాయ, కుప్పుస్వామిశాస్త్రిగారు ప్రకటింపనున్నారని విని దేశాభ్యుదయము గలుగనున్నదని తలఁచితిమిగాని యది త్వరలోఁ బాఠకలోకము నన్నుగ్రహించు సూచనలు కన్పడమి చింతింపవలసివచ్చుచున్నది. విజయనగరసంస్కృతకళాశాలాపండితులగు శ్రీ ఘరవస్తు గోవిందాచార్యస్వామిగారియొద్దఁ లోచనపరిశుద్ధపాఠ మున్నదఁట. దాని సత్వరప్రచురణమును వినీతపాఠకలోకము గోరుచున్నది.

దీనితరువాతి గ్రంథములు వాదోపవాదములతోడను, ఉక్తిప్రత్యుక్తములతోడను, పూర్వపక్షసిద్ధాంతములతోడను మిశ్రితములై, జటిలములై, న్యాయసాపేక్షములైయున్నవి. కుంతకుని మతము కొంత వక్రమయినది. అతఁడు వక్రోక్తియే కావ్యజీవమని వాదించును. ధ్వన్యాలోకమునందలి వ్యంజకసామగ్రినే యాతఁడు వక్రతయను పేరుతోఁ బెంపొందించినటులఁ గన్పడుచున్నది. ఇతని గ్రంథము పద్యమునందలి రమ్యతను దెలిసికొనుటకుపకరించునటుల నితరగ్రంథము లుపయోగింపవు. అలంకారసర్వస్వాదిగ్రంథము లౌక్తికకావ్యాంగమునె విచారించునవికాని సర్వాంగముల విచారించు సాహిత్యదర్పణమువంటి గ్రంథము లరుదుగ నున్నవి.

అప్పయ్యదీక్షితాద్యర్వాచీనాలంకారికులు ప్రాచీనమతములఁ ఖండించి కొన్నిసిద్ధాంతముల నుట్టంకించిరి. కొన్నికొన్ని స్థలములందుఁ బ్రాచీనమతమును ఖండించుచు వేరుమార్గము నాశ్రయించి రనుట సాహసోక్తి కాఁజాలదు. సాహిత్యవ్యుత్పత్తిని గల్గించుటకు నవీనగ్రంథములు బాగుగ నుపయోగించుచున్నవి. నవీనగ్రంథముల రచనాప్రణాలిక యెంతయు హృద్యమయినది. వాదోపవాదముల నుపశమింపఁజేయునట్టియు, నలంకారగ్రంథముల కేకవాక్యతను సంపాదించునట్టియు నలంకారరహస్యమును దెలియఁజేయు కూలంకషగ్రంథనిర్మాణావశ్యకత గలదు. మహోదారుల యాదరమునఁగాని యామహత్కార్యము కాదు. ఏ రెండు మూఁడుగ్రంథములో బాగుగ పఠనపాఠనాదివ్యవహారమున నుండుటచేఁ బరిశుద్ధముగ నున్నవికాని విశ్వవిద్యాలయమువారి యాదరణమునఁ బ్రసిద్ధిని గనుచున్న యుత్కృష్టగ్రంథములు చాలవరకుఁ దప్పులతోఁ గూడుకొని యుండుటచే ప్రమాదము సంభవించుచున్నది. ముఖ్యముగ ధ్వన్యాలోకము, లోచనము, వక్రోక్తిజీవితము, చిత్రమీమాంస, దశరూపకమునందలి ప్రమాదము లనర్థబోధకము లగుచున్నవి. వానివలన నపసిద్ధాంతము వ్యాప్తమగునేమోయని భీతి గలుగుచున్నది. మద్గురువర్యులగు మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి కటాక్షమున నవి కొంతవరకు సవరింపఁబడినవి. కాని యాప్రయోజనమును వారి శిష్యప్రశిష్యకోటియే పొందుచున్నది. సర్వసాధరపాఠకవర్గమున కందుటలేదు.

న్యాయవ్యాకరణశాస్త్రములు యోగ్యపఠనపాఠనాదివ్యవహారమునఁ గొంతవఱకు నిరూఢస్థితిని బొందఁగల్గినవి. కాని యలంకారశాస్త్రీయగ్రంథములవలన పుష్కలప్రయోజన మున్నను నవి విపులప్రచారముగలవి కాకపోవుటచే వీనిపై నాదరము బాగుగఁ జూపువారు లేకపోవుటచే నంతకంతకు దానిస్థితి శోచ్యముగ నున్నది. దానికి నిరూఢస్థితిని సంపాదింపవలసిన యావశ్యకత పూర్ణముగ నున్నది. గ్రంథపారిశుద్ధ్యసంపాదనకై పరిశోధన మత్యవసరముగ నున్నది. పండితసహాయ మపేక్షణీయముగ నున్నది. విద్యార్థులు తమ వ్యాసంగము

కేవలపరీక్షోత్తీర్ణతకే పర్యాప్తమగునటు లొనరింపక విషయతత్త్వగ్రహణలాలసతచేఁ గరోరవ్యాసంగము చేయుచుఁ బరిశోధింపవలసిన యవసర మున్నది. వ్యాఖ్యాతలు వ్రాయు భిన్నభిన్నాభిప్రాయముల కైకార్థ్యమును నిస్సందిగ్ధత్వమును సంపాదించుటకుఁ దీవ్రపరిశీలన మత్యవసరము. విశ్వవిద్యాలయమువా రీవిషయమును దీవ్రముగ నాలోచింతురని పూర్ణముగ విశ్వసించుచున్నాము.

సోదరులారా! శోచ్యస్థితిలో నున్న యలంకారశాస్త్రము నుద్ధరించుటకు ప్రబలపుష్కలప్రయత్నమును సల్పుటకు సన్నద్ధులు కావలయునని ప్రార్థింతును.*

(నాయీవ్యాసమునకు కొంతవఱకు బాలబోధినీ నామకకావ్యప్రకాశిక వ్యాఖ్యాతృపీఠిక యాధారము)

---

## చూడదగ్గవారు




* ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము, కొవ్వూరు నేను వెళ్లినపుడు అచటి విద్యార్థిసోదరుల చర్చాసంఘమున నే నీవిషయమునుగూర్చి బ్ర॥శ్రీ అబ్బూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యాధ్యక్ష్యమున నుపన్యసించితిని. ఆయుపన్యాససారాంశమే ప్రకృతవ్యాసరూపమును ధరించినది.

# లేఖనప్రమాదము

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు

సంధివశమున నకారము లోపించినపు డచ్చోట సంధికలుగుటకుఁ బూర్వ మకార ముండెడి దనువిషయమును సూచించుటకు సంస్కృతలిపియందు అనఁగా దేవనాగరియందు 'S' అను గురుతు వాడఁబడుచున్నది. ఉదా॥ रामोऽब्र. ఆంధ్రలిపియందుమాత్ర మీ గురుతు 'ఽ' అనుమాదిరిని వాడఁబడుచున్నది. ఆంధ్రభాషయం దీగురుతునకుఁ బ్రయోజనము లేకపోయినను సంస్కృతమును దెనుఁగు లిపిలో వ్రాయునపుడు దీనికిఁ బ్రయోజనము కలదని చెప్పకతప్పదు. కావున నీవిషయ మాంధ్రులకుఁగూడ మిక్కిలి యుపయోగకారి కావున నాయీ లేఖనప్రయత్నము విఫలము కానేరదని విశ్వసించుచున్నాను.

సామాన్యముగ మీఁదిగురుతుయొక్క యుపయోగము పూర్వరూపసంధి, సవర్ణదీర్ఘసంధి, స్వాదిసంధులయందుమాత్రమే కన్పడుచున్నది, ఉదా॥

(౧) పూర్వరూపసంధి = హరే + అవ = హరేఽవ.

(౨) సవర్ణదీర్ఘసంధి = రమా + ఆసీత్ = రమా ఽఽ సీత్.

(౩) స్వాదిసంధి = శివ, స్ + అర్చ్యః = శివోఽర్చ్యః

ఈగుర్తు నుపయోగించుటవలన నెచ్చటెచ్చట సంధికలిగినదో, యెచ్చటెచ్చటఁ బదములను విరుపవలెనో బాగుగఁ దెలిసికొన నవకాశము కలుగుచున్నది. అందుకొఱకే యీమీఁదిగురుతు నిర్ణయింపఁబడినదనికూడ మన మనుకొనవచ్చును.

ప్రస్తుతము లేఖనమునందు దీనిని వాడుటలో మనవారు చాల జాగ్రత్తను జాగరూకత వహించియున్నను సవర్ణదీర్ఘసంధివిషయమున మాత్రము జాగరూకతను వహింపలేదని చెప్పవచ్చును.

అకారసూచకమగు చిహ్నము నకారములేనియపుడే, అనఁగాఁ బూర్వమున నచ్చోటున నకార ముండి ప్రస్తుతసమయమున లోపించినపుడే యుపయోగింపవలెను. కాని యకారచిహ్నము లేనియపుడు కూడఁ గారణాంతరమున నచ్చట అకార మున్నదని యూహింప వీలు కలిగినపుడు చిహ్నము నుపయోగింపనక్కఱలేదు. ఈ మీఁది నియమములనుమాత్రము ముఖ్యముగఁ బాటింపవలెను. ఈ నియమములను పాటింపనపుడు మన కకారచిహ్నమువలనఁ గలుగవలసిన ప్రయోజనము కలుగనేఱదు.

ప్రస్తుతకాలమున వ్రాఁతలో మీఁదినియమములకు విరుద్ధముగనే యీగుర్తు లుపయోగింపఁబడుచున్నవి. పూర్వరూపస్వాదిసంధులలో నకారము లోపించినయపుడు దానిని దెలిసికొనుట కకారచిహ్నమును విడిచి మార్గాంతరము లేనందున నచట లేఖనప్రమాదమునకుఁ దగినంత యవకాశము లేదు సవర్ణదీర్ఘసంధియందుమాత్రము మఱికొన్ని సాధనములు కలవు. వానిని దిఙ్మాత్రము చూపెదను.—

(౧) అత్ర + అభవత్. = అత్రాభవత్.

మీఁదిసంధిలో రెండుహ్రస్వాకారములు పోయి దీర్ఘాకారము సంధివశమునఁ గలిగినది ఇచ్చట అకారచిహ్నము లేకున్నను నష్టము లేదు. మొత్తముమీఁద వచ్చిన దీర్ఘాకార ముండుటచే దానింబట్టి రెండుహ్రస్వాకారము లచట నుండినవని నిర్ణయింప నవకాశము కలదు. దీని నాలోచింపక చాలమంది యిట్టిచోట్లఁగూడ "అత్రాఽభవత్" అని వ్రాయుచున్నారు. ఇట్టిచోట్ల నుపయోగింపఁబడిన యీ యకారచిహ్నము విపరీతార్థబోధకముకూడఁ గాఁగలదు. అకారచిహ్న మకారస్థానముననే వచ్చును; కావున నీగురుతుగలచోట నొక యకార మున్నదని భావించినచో దానికిఁ దొలుతనున్న పదము స్వభావముగనే "అత్రా" అని దీర్ఘాంతముగ నున్నదేమోయని భ్రమ కలుగవచ్చును. ఈరీతిగనే యూహించుకొనవచ్చును.

(౨) తదా + అబ్రవీత్ = తదాఽబ్రవీత్.

ఈమీఁదిస్థలమున నొకపదము దీర్ఘాకారాంతము; మఱియొకటి హ్రస్వాకారాదికము. ఇట్టిచోట నొకయకారపు గురుతు నుపయోగింపవలెను. అట్లుపయోగింపనిచో "తదాబ్రవీ"త్తనుచోట పదవిభాగ మెట్లుచేయవలెనో యని సందేహము కలుగును. కావున "తద-అబ్రవీత్", "తదా-ఆబ్రవీత్", "తద-ఆబ్రవీత్", "తదా-బ్రవీత్" అని యనుచితములగు విరుపులను జేయవీలగును. ఒకగుర్తు నుపయోగించి "తదాఽబ్రవీత్" అని వ్రాసినచో నకారస్థానమున గురుతు కలదుగాన "తదా అబ్రవీ"త్తని విరుపుచేయ వీలగును. కాని యిట్టియెడ నిట్లువ్రాయక కొందరు గురుతును వాడకుండనే వ్రాయుచున్నారు.

కొంద అనవసరముగ "తదాఽఽబ్రవీ" త్తని రెండుగురుతులను వాడు చున్నారు. ఈరెండుపద్ధతులును న్యాయవిరుద్ధ ములు. గుర్తును వాడనపుడు కల్గునష్టములు వివరింపఁబడియే యున్నవి. రెండుగుర్తులను వాడినచో "తదా-ఆబ్రవీ" త్తనియే పదచ్ఛేదము చేసికొనవీలగును. రెండుగుర్తులున్న దీర్ఘమనియే యర్థము సిద్ధించునుగదా!

(3) వేద + ఆత్మానమ్ = వేదాఽత్మానమ్

ఇచ్చటఁగూడ నొకహ్రస్వాకారమును, ఒక దీర్ఘాకారమును గలవు. ఇచ్చట నొకగుర్తు పెట్టితీరవలెను. లేనిచో మీఁది యుదాహరణమునందువలె నిచటఁగూడ ననుచితముగఁ బదవిభాగ మొనర్చ వీలు కలుగుచుండును. రెండు చిహ్నముల నుపయోగించినచో రెండు పదములును దీర్ఘాంతములే యనుకొన వీలగును. కాన నొక్కగుఱుతే యావశ్యకము.

ఇట్టిచోటుల నొకగుర్తు నుపయోగించినపుడుకూడ "వేదా అత్మానమ్" అని విపరీతపు పదవిభాగమున కవకాశము కలదు. కాని గుర్తును వాడనపుడును, రెండుగుర్తులను వాడినపుడునుగూడ దోషముల కవకాశ ముండుటంబట్టియు, నొక్క అకారచిహ్నమునే వాడుట పద్ధతికి సరిపోవుటయేగాక యొక్క సందేహమునకే యవకాశము కలుగుటంబట్టియు, నొక్క అకారచిహ్నమునే వాడుట యెంతయు సముచితము. ఇట్టియెడఁ బదవిభాగమును సందర్భానుసారముగనే గమనింపవలెను.

(౪) రమా + ఆసీత్ = రమా ఽఽ సీత్.

ఇట్టిచోట్ల రెండును దీర్ఘాకారములే యగుటంజేసి పదములను విడఁదీయునపుడు సుగమముకొఱకు రెండుగుర్తులను వాడవలెను గుర్తులను వాడనిచో "రమ-అసీత్", "రమ-ఆసీత్", "రమా-అసీత్", "రమా-సీత్" అని విపరీతపదవిభాగములును గలుగవచ్చును ఒక్క చిహ్నమునే యుపయోగింతుమేని "రమా-అసీత్" అనియే పదవిభాగము కలుగవచ్చును. కావున రెండుదీర్ఘాకారములు వినఁబడవలెఁగాన రెండుగుర్తులను వాడుట యుక్తము, కొంద ఱిట్లు వాడుటలేదు

పైయుదాహరణములవల్లను కారణములవల్ల దేలినసారరూపములగు నియమముల నిటఁ బొందుపఱతును.

(౧) రెండు హ్రస్వాకారములకు సంధివచ్చినపు డట్టియెడ నకారపుగుర్తు నుంచనవసరములేదు అట్టిచోట్ల నాగుఱుతు విపరీతార్థబోధక మగును.

(౨) ఒకహ్రస్వాకారము, ఒకదీర్ఘాకారము కలిసి సంధివచ్చినప్పుడు తప్పక యొకయకారచిహ్నము నచట నుంచవలెను. ముందు పదము దీర్ఘాంతమును, వెనుకటిపదము హ్రస్వాదియు నయినపు డేమియును నష్టములేదు కాని మొదటిపదము హ్రస్వాంతమును, రెండవపదము దీర్ఘాదియు నగునపుడుమాత్రము సంధిని విడఁదీయుటలోఁ గొంచెము చిక్కుగానుండును కావున నట్టి పదచ్ఛేదనము మాత్రము పరిశీలించి యొనర్పవలెను.

(3) రెండుపదములును క్రమముగ దీర్ఘాకారాంత, దీర్ఘాకారాదులగుచో నప్పుడు రెండకారచిహ్నముల నుపయోగించవలెను. కాని యొక్కగుర్తుగాని గుర్తుపెట్టకపోవుటగాని సరిపడదు.

(౪) పూర్వరూపసవ్వాదిసంధులయందును గుర్తు నుంచుట యుచితము. అది యంతటి దుర్గమమగు విషయముకాదు.

ఈమీఁదివిషయమును ప్రాయసకాండ్రు పరికించి వ్రాయఁగడంగినచో నింతటినుండియు నిదివఱకలవాటులో నున్న లేఖనప్రమాదములు రూపుమాసిపోఁగల వని విశ్వసించుచున్నాను.

---

# ఆంధ్ర భాషా వైదుష్యము

కవికొండల వేంకటరావుగారు

భాషాప్రవాహమున నీఁదులాడువారు కవులు; భాషాప్రవాహమున నవగాహనతత్పరత మునకలిడుచుఁ బునీతులగువారు పాఠకులు; భాషాప్రవాహమున మునిఁగి యీఁదులాడి, తీర మెక్కి, తీరపుటంచులనే త్రచ్చాడుచు బట్టలారవేసికొనువారు లాక్షణికులు. భాషాప్రవాహము స్వతస్సిద్ధము, సార్వజనీనము, నవనవోన్మేషితము. పాఠకుఁ డెంతసేపును గవితో నీఁదులాడుటా, లాక్షణికునితో గట్టెక్కి యొడలు తుడుచుకొనుటా యనునుయ్యూఁత నూగులాడుచుండును. లాక్షణికుఁడను "నీవిప్పుడు గవితో నీఁదులాడుటకు దిగితివా సుడిగుండములోఁ బడిపోదువు. గట్టెక్కు, గట్టెక్కు. అదిగో సుడిగుండము" అని—కవిపిలచు. "ఇక్క డెప్పుడైనను సుడిగుండ మున్నదేమో నాకిప్పు డగపడుటలేదు. ఇదంతయు నిర్మలముగను, నీలముగను నున్నది. ఇటు రా నాతో నీఁదులాడుము. ఒడ్డున మునిఁగిన నదియు నొక తానమే?" అని చేయివీచువాఁడు కవి.

కవి సముత్సుకుఁడు. ఆకొనసనుండి యీకొనసకుఁ బ్రవాహమునంతను నీఁదివేయుటయ యతగాని కృషి. అతఁడు ప్రాచీనపదములని, యర్వాచీనపదములని, భేదము పెట్టుకొని గీతలు గీసికొనుచుండఁడు. ఏవైనను బ్రవాహమున జీవనవంతములై ప్రవాహము నుబ్బించుచున్నవా, లేవా అనుచూపే యతనిది. తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము నను రేవుపావంచాల విభ్రాంతు లతనికి లేవు. పాఠకున కొకభయ ముండవచ్చును. ప్రవాహ మతివేగభరమగునదేని తన రేవులో తన కాలి క్రింద నిలద్రొక్కికొనియున్న యిసుక కొట్టుకొనిపోవునమోనని; లాక్షణికున కొక మనోవైకల్య ముండవచ్చును. ప్రవాహపుఁగోఁత తా నిలువంబడినయట్టి గట్టునుత దెగఁగోయునదేమోనని—కాని కవి కాభయము కాని, ఆమనోవైకల్యముగాని కలుగదు. అతని కాలిక్రింది యిసుకపోయిన నిలువీఁత యీఁదఁగలఁడు. గట్టుతెగిన వోఁ బ్రవాహ మింకనుం బలుపైనదని వ్రేళ్లుకితలఁ బండీ యాకసంబు నరయువాఁడు.

ఇఁక మన ముపమానమును వదలి కేవలభాషాస్వరూపమునుగూర్చి చర్చింతము.

ఏదేని గ్రంథమునం దొకమాట యున్నదన్న నొకరేస కనంబడెనన్న నది వాడుకలో నున్నదిగనే మన మెంచవలయును. ఏమనిన వ్రాఁతయనున దెప్పుడును వాక్కునకుఁ బరముగాని పూర్వమున వచ్చునది కాదు. ఒకనితో ననకున్నను, వ్రాయసకాఁడు తనలోఁ దానైనను మననము సేసికొని స్వగతంబట్లు వెలువరించుకొనుఁగనుక వ్రాఁతయనున దొకవిధమగు మాటలాడుటయ యని యంగీకరించవలసినదే. కావున బాసను వాడుకబాసయని, వ్రాఁతబాసయని విడఁదీసి రెండుపాయలుగఁ జూపుట సంకుచితము. మఱియును మనము వాడెడు పదములను దత్సమములు, తద్భవములు, దేశ్యములు, గ్రామ్యములు అని విడఁదీయుచు వానిలోఁ గడపటిగుంపును బ్రయోగంబున కనర్హంబులుగ నిర్వచించుట మనభాషకు లేనిపోని వంకర తెచ్చిపెట్టుటయని నాయభిప్రాయము. తత్సమములు, తద్భవములు, దేశ్యములుమాత్రమే వాడి గ్రామ్యము లనుగుంపును మనము వాడుటలేదా? వాడుచున్నాము. "లక్షణవిరుద్ధంబగు

భాష గ్రామ్యంబు" అని కొందఱును, పామరజనభాషితము గ్రామ్యములని కొందఱును. ఒకానొకతెగ తెనుఁగు పదమ్ములను బ్రయోగంబున కనర్హంబులని త్రోసిపుచ్చుటకంటె భాషను సమగ్రదృష్టిం బరికించి తెనుఁగువారిచే వాడఁబడు స్వతస్సిద్ధపదంబుల నన్నింటిని ఏస, జాతీయమ్ములసమేతమ్ముగ సరిసమానదృష్టి నరయుట చక్కని పని. "లాంతరు", "కార్డు", "రోడ్డు", "సిరా" ఇత్యాద్యన్యదేశ్యపదంబులను బ్రయోగార్హంబులుగ నిరూపించి, "వస్తాడు" "తెస్తాడు" "వచ్చేని" "తెచ్చేని" "రావాల" "పోవాల" ఇత్యాదిస్వదేశస్థుల నుడువులం బరిత్యజింపవలసినదని నిర్దేశించుట 'పొరుగింటి పుల్లకూర రుచి' యన్నసామెత నాకుఁ దోఁపింపఁజేయుచుండును.

సభ్యాసభ్యత్వములు లాక్షణికభావములు కేవలము మాటలో లేదు. ఒకమాట నొకసమయమం దొకనిచే ననిపించుటయందుఁగాని యొకభావ మొకమాటను వెలువరించుటయందుఁగాని కలదు. పామరజనుఁ డొక్కరుండు"అయ్యవరేణ్యులకు వందనంబు"అని యనక"అయ్యోరికి దణ్ణం"అన్న, వానిని "వెధవా! నీకు వివేకము లే"దని త్రోసివేయుదమా? త్రోసివేయము. పైపెచ్చట్టిండు వినయసంపన్నుం డని కొండాడుదుము. సభ్యాసభ్యత్వములు, ప్రయోగార్హానర్హతలుమాటనుబట్టి కాదు,ఆమాట వెలువడు సందర్భంగాని బట్టియని గమనించవలసియుండును. ప్రాజ్ఞుం డాగ్రహించి తత్సమతద్భవదేశ్యపదంబుల బండబూతులు తిట్టిన మన్నింతుమే? అట్లే వివేకవిహీనుండవాచ్యంబులు గూసిన సైరింతుమే? కావున సభ్యాసభ్యత్వము, ప్రయోగార్హానర్హత సమయస్ఫూర్తినిఁబట్టి, సాంఘికమర్యాద ననుసరించియు గణింపఁబడునట్టివిగాని కేవలవైయాకరణుల పదవిభజనంబున వచ్చునట్టివిగ భావింపఁజనదు.

ఆంధ్రభాషయొక్క స్వతస్సిద్ధ సమగ్రస్వరూపంబుతోఁ జెలిమి గలుగఁజేసికొనవలయు ననియెడు నుత్కంఠ మెఱసి యాస్వతస్సిద్ధపు ఖనినుండి ఎంతవఱ కెంతెసమంజసముగ నెంతసమయోచితముగ నెంతయింపుసొంపుగ మాటల నేర్చిపేర్చి కవి వాడుచున్నాఁడో తెలిసికొంట యాంధ్రభాషావైదుష్యము. అందున కమరము, ఆంధ్రనామసంగ్రహము, నన్నయభట్టీయము, చిన్నయసూరీయము పఠించి యాకొలతబద్దను కొలచుట స్తనశల్యపరీక్షవంటిది. భాషయందలి స్వతస్సిద్ధప్రభావము ననుసరించి దాని వాడుకసరణిని బరిగణింపఁ బూనుకొనవలయును.

భాషామూర్తిని మనకు సాక్షాత్కరింపఁజేయునవి మనము పఠించునట్టి గ్రంథములు, మనము పరిచయము గలుగఁజేసికొను జనులయొక్క వక్కాణింపులు నైయున్నవి. చనిపోయిన మానవు లేప్రకారము వచించియుండిరో యిప్పుడు వినుట యసంభవము. కాని వారి భాష మనలో వాడుకకు వచ్చునది గ్రంథములమూలమున నని తెలియనగు. ఆగ్రంథములను, మన మిప్పటికిని వాలాయము పఠించుచు నందలి భావములను మైఁజొక్కించు వారల మగుదుమేని మనయెదుట నప్పటి మనీషి యొకండు నిలిచి మనతో సంభాషించుచున్నాఁడని యనుకొనవలసినదే. కావున భాషాస్వరూపముయొక్క జీవకళ గమనించుటయందుఁ బ్రస్తుతప్రచారమందున్న పుస్తకములును, మన మిపుడు వాడుకొనుచున్న పలుకులును, మనముం దిప్పు డచ్చువడుచున్న, రచింపఁబడుచున్న పుస్తకములును అన్నియును సాహాయ్య మొనగూర్చునట్టివి. అట్టి విశాల దృష్టి నరయక మనము దినదినము చదువుకొందుముగాక భారతభాగవతములభాష వేఱు, మనము దినదినము మాటలాడుకొను శైలి వేఱు, మనము ప్రతిదినమును విరచింతుముగాని, ఆ వ్రాయు పదగుంఫనమ్ము వేఱు అని 'గదులుగదులుగ' విడఁదీసికొనుచు గోడలు నిర్మించుకొనుటలో భాషయొక్క ఆంతరంగికసౌష్ఠవము గోలుపోవువార మగుదుము. పెద్దయుందృష్టి దద్దయుంగన్న నన్నయ్యతిక్కన్నలును, పోతరాజుత్యాగరాజులును, మీరును నేనును, మనముందు రానైయున్న యెల్లవారును భాషానాడీస్థానమ్మునఁ దోడంబుట్టువులని యెఱుంగునది.

ఇంకనుం భాషాయోషామతల్లి చేరుగడకుం బోయి నమస్కరింతము. (ఏభాషకైనను పరివర్తన మిట్టిది)- (౧) మనము పోనుపోను సంక్షేపించుటకు యత్నింతుము. (౨) క్రొంగ్రొత్తభావములను బ్రస్ఫుటీకరించుటకై క్రొత్త యేసలను గల్పింతుము. (౩) సందర్భోచితముల బురస్కరించుకొని యొత్తు లూఁదుచుందుము. దీర్ఘహ్రస్వమ్ములను విటతాటమ్మొనరింతుము.

మొదటిదాని కుదాహరణమ్ములు—

కొట్టినవాఁడు, కొట్టినాఁడు, కొట్టాఁడు, కొట్టేడు. ఇవన్నియు నే నుదాహరించినపక్కి నిప్పటికిని వాడుకలో నున్నవనియే యంగీకరించవలసియుండును. ఏమనిన మనము "కొట్టినవాఁడు, కొట్టినాఁడు" అన్నరూపము లున్న పుస్తకముల నిప్పటికిని చదువుట మానలేదు. "కొట్టాఁడు, కొట్టేడు" అనుపదముల నుపయోగించుచున్నాము. కావున నాయుద్దేశ్యములో కవి పైనాలుగుభాషణంబులను తెనుఁగు భాషకు స్వతస్సిద్ధభూషణంబులుగ నంగీకరించి యయ్యె తగుతావుల నుపయోగించుట సల్లక్షణము. "వాఁడు కొట్టినాఁడు కుక్కను, వాఁడు కుక్కను గొట్టినవాఁడు" అనుటకంటె "వాఁడుకుక్కను కొట్టాఁడు" అనుటయం దంద మెక్కువున్నది. ఒకటిరెం డక్షరములు కలిసివచ్చుచున్నవి. "ఎడు"అను ప్రత్యయమున నేసగ నుపయోగించుటయం దొక్కొక్కప్పుడు విరామము సూచించుచు.—"వాఁడు కొండెక్కి చుట్టునుం జూచేడు" (కొండొకవడి అధ్యాహార్యము). ఒక్కొక్కచో హేళనం బగపఱచు.—"గంజికొట్టేడు." కావున నయ్యెప్రయోగంబుల నర్థములేనివానిగఁ గాని ప్రయోగానర్హంబులుగఁగాని త్రోసిపుచ్చిన ఆయందమునకు వెలియౌదుము. సంక్షేపరూపంబుల కింకను నుదాహరణంబులు—

మార్గంబుననే=మార్గాన్నే
మార్గము వెంబడి=మార్గమమ్మట
జేగురురంగు=జేగ్రుంగు
నేటికిఁగూడా=నేటిక్కూడా
చెప్పఁదగినది=చెప్పఁదగ్గది
ఆలాగున=ఆలా
రానేలేదు=రానేలే
పిల్లవానిజుబ్బా=పిల్లాడిజుబ్బా
తన్ను వాఁడు=తంతాడు
జనము=జనం

ఏతాదృశంబు లింకనుం బెక్కు లూహ్యంబులు. వాని నుపయోగించుటా యుపయోగించకపోవుటా యను మీమాంసం దగుల్వాడుకంటె ఆయవి యుపయోగించుట వలని సౌలభ్య మద్భావము నేమైనఁ గుంటువడఁ జేయుచున్నదా యని విమర్శించుట మేలుపని.

రెండవదాని కుదాహరణమ్ములు—

పూలు వాడిపోతాయి (ఒకచిన్న బాలిక పూలు గోయుతరి)
సదురుకోని (ఒక తూర్పుపడఁతివిషయమున)
ఎందుకెళ్లే (ఒక రైతూను)
ఎహేయ్ ఎహేయ్ (గొడ్లకాపరి గొడ్లను)
పోంగొట్టేవాఁడు (పురాణపక్కి)

మూఁడవదాని కుదాహరణమ్ములు—

ఇఖ తప్పదన్నాడు
మాంచి హెచ్చఱిగ్గా
ఉః ఆకర్షిస్తూంటుంద
పళ్లు
ఖంగారు

ఇట్టిమార్పులు భాషకు నిరంతరమూ జఱుగుచు వచ్చినవే. మీరు చిన్నయసూరి చదువుఁ దప్పకవీయుఁడు దిలకింపుఁడు. కల్లూరి మల్లాదివారల వ్యాకరణపుఁ బుటలం ద్రిప్పుఁడు. గిడుగునుదువుల వినుఁడు. వారు చూపిన మార్పులు, వారగపఱచిన జాతీయములు గమనించినచో భాషకు మార్పు సహజమ అని తేటతెల్లము. మెచ్చిన కొకకొన్నింటి నెత్తిచూపెదఁగాక—

# యునీక్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్ వారితో భీమాచేసికొనుడు

## స్థాపితము: 1912—హెడ్ ఆఫీసు:— కలకత్తా

దేశబంధు సి. ఆర్. దాసుగారిచే

స్థాపింపబడినది.

దానిపాలిసీ లధికవ్యయము లేకుండ (1) శాశ్వత అశక్తులకు లాభములను, (2) వృద్ధాప్య మందు లాభములను సమకూర్చును.

గతించిన పాలసీలు నవీన స్కీములో మరల నుద్ధరింపబడుచున్నవి. ఇందు పాతబాకీ



ప్రీమియములు చెల్లింప నక్కరలేదు కాన పాలసీదార్లు ఎవ్విధమైన నష్టము నొందరు.

హక్కుదారులగూర్చి చిక్కేమియు లేనియెడల చావును తెలియజేసిన యెడల వెంటనే సగము సొమ్ము ముందరగా ఇంపబడును.

ఈ కంపెనీ మిక్కిలి ఉత్తమమైనట్టియు, సహేతుకమైనట్టియు, భీమా విషయముల నేర్పాటుచేసియున్నది. కడపటి అయిదుసంవత్సరముల లెక్కలు కట్టుటలో రు 1000 లకు రు 50 లు బోనసును ప్రకటించియున్నది. ఈదఫా 1932 మేనెలలో వచ్చేవాల్యుయేషనుకు యింక నెక్కువబోనసునివ్వవీలున్నట్టి సూచనలుగలవు.

ఈ కంపెనీ ప్రీమియములు చాల తక్కువ.

యునీక్ వారి ఏజెన్సీని తీసికొనిన మీకు లాభింపగలదు.

వివరములకు యీదిగువ విలాసమునకు వ్రాయుడు:—

బ్రాంచి ఆఫీసులు :— మద్రాసు, లేక బెజవాడ,

చీఫ్ ఏజెంట్లు:— **మెస్సర్సు శ్రీనివాస అండు కో.,**

నైజాంరాష్ట్రము, వరంగల్.



నాగూరు మసీదు

(హిందువులు ముసల్మానులు — ఉభయులకు పూజాస్థానము.)

M K R



బెంగళూరుచెంత నొక చెరువు

M K R

పాదము లొత్త రమ్మనుటగానీ

చాలా రసికత్వ మబ్బె

ఏలా సేనా మాటలు

అంధ్వఅక్షుం దలాయొకటి

మా నెఱజాణవు (మహా)

ఇంకా నొకకొన్ని కూర్పవలె

దానవేంద్ర! మైనా కల దొక్క విన్నపము

అంతా సంశయమే

కూడీకూడని చిన్నకూకటులతో

కూడదంటే నెమ్మోముమంచి

దర్యోధనుం డైతేనేమి

చూతాము, ఉందాము, ఇత్తురు, ఇత్రు, పోయేటి అనేటి, రెండోరోజు, ఓనాఁడు, చెపితే జెప్పనీ, నిల్తాము ఇత్యాదులు కోటానకోట్లు.

ఈపైమా ర్పింత పరిపాటిగ జఱుగుచున్నప్పుడు మాకీపెద్దవ్యాసము ఎందుకందురేమో పాఠకులు : తిరిగి మొదటికి వత్తము.

"ప్రవాహమునఁ గవితో నీఁదులాడుటకు యత్నించుచు నేషుడియ క్రొంగ్రొత్త లాఘుడియ నారయఁ దగుఁ గాని పాఠకుఁడు లాక్షణికునింబోలి గట్టెక్కి పొడిబట్ట మడిబట్టఁ గట్టుకొని నన్ను ముట్టుకొనకుమని యదియొక తీరు సంకుచితాసనమునం గూరుచుండరాదు. అట్లున్న భాషయొక్క యనుక్షణపరివర్తనమంజీరనినదము వినఁబడదు. భాష యేనాఁటికిని స్వతస్సిద్ధస్వరూపముగలది,నిత్య మూరునది, సార్వజనీనమైనది, నవనవోన్మేషితమైనది" అని హెచ్చరించుటకు.

---

# పాలకురికి సోమనాథకవి: నమస్కారగద్య

బండారు తమ్మయ్యగారు

తేనియసోనలం జిలుకు తేటగు జానుతెనుంగుఁ బల్కులన్
వీనులఁ దన్పుకబ్బముల నిక్కపు దేసితెనుంగుఁగైతకున్
బ్రాణము వోసినట్టి బుధవంద్యుని, శ్రీబసవేశచింతనా
సూనృతచిత్తుఁ బాల్కురికిసోమకవీంద్రుని సంస్మరించెదన్.

గతసంవత్సరాదిసంచికలో నేఁబ్రకటించిన సోమనాథుని పంచప్రకారగద్యను పాఠకమహాశయులు పఠించి యాతని గద్యకృతుల లక్షణస్వరూపాదికములను గొంత వఱకుఁ బరిశీలించియుందురని తలంచెదను. అందలి పంచవిధగద్యములలోను మొదటిది యెట్టి పాదనియతిగాని, మాత్రాగణనియమముగాని లేక, అనంతుఁడు, అప్పకవి తమ లక్షణగ్రంథములలో నుదాహరించిన గద్యలక్ష్యమునకు సరిపోవుచు నందులకు విశేషముగ అంత్యానుప్రాసాలంకారముతో మాత్రము శోభిలుచున్నది. తక్కిన నాలుగు గద్యములును నొకమాదిరి పాదనియతితో మాత్రాగణబద్ధము లయియుండుట గమనింపఁదగియున్నది. ద్వితీయతృతీయగద్యములు రెండును నాలుగేసిమాత్రలు గల గణములు నాల్గింటితోఁ గూడినపాదములతోఁ గూర్పఁబడి యందు మొదటిది ముక్తపదగ్రస్తముతోను, రెండవది యంత్యానుప్రాసముతోను నలంకృత మయియున్నవి. నాలుగవగద్యము అయిదేసి మాత్రలు గల గణములు రెండును, అయిదవగద్యము నాలుగేసి మాత్రలు గల గణములు రెండును గల్గిన పాదములతో నంత్యానుప్రాససంయుతములుగఁ గూర్పఁబడినవి. శబ్దాలంకారములలో సోమనాథున కంత్యానుప్రాసమునెడ నత్యంతాభిమానము. బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలో నాశ్వాసాంతకథాశ్రోతృసంబోధనములఁ దిలకించునది. ఈతనితరువాత వెలసిన హుళక్కిభాస్కరుఁడు, బమ్మెరపోతనామాత్యుఁడు మున్నగు నిజామురాష్ట్రకవులు యీ యనుప్రాసప్రియత్వమునకుఁగూడ సోమనాథుఁడే మార్గదర్శకుఁడు కానోపును. పాఠకుల పరిశీలనార్థము సోమనాథుని నమస్కారగద్య నిప్పుడు ప్రకటించుచున్నాను. ఈగద్యము కూడ నాలుగేసిమాత్రలు గల గణములు నాల్గింటితోఁ గూడిన పాదములతోఁ గూర్పఁబడినది. కాని ప్రతిపాదము సంస్కృతచతుర్థీవిభక్తిప్రత్యయములతో, నమోవాకముతో నంతమగుచుఁ గేవలసంస్కృతకృతివలెఁ గాననగుచున్నది. అయినను పంచప్రకారగద్యమునందువలెఁ గాక యీగద్యమునం దాంధ్రభాషలో ద్విపదలు, రగడలునందువలె ద్విపాదప్రాసనియతి పాటింపఁబడుట పరిశీలింపఁదగినది. ఇతరగద్యములందువలెఁ జివరమాత్రము ననేకాక ప్రతిపాదాంతమునను నమస్కారము గూర్పఁబడుటచే దీనికి నమస్కారగద్యయని పేరిడినట్లు తోఁచుచున్నది. సోమనాథుని గద్యకృతులు సంస్కృతపదభూయిష్ఠములుగ నున్నను, అందునను నీనమస్కారగద్యమున్నగునవి కొన్ని సంస్కృతవిభక్తిప్రత్యయములతోఁ గూడఁ గూర్పఁబడినను, వీని నన్నిటిని గేవలగీర్వాణభాషాకృతులుగ గణింపరాదని నాయభిప్రాయము. కవిచరిత్రమునందు శ్రీ వీరేశలింగముగారును, బసవపురాణపీఠికయందు శ్రీ ప్రభాకరశాస్త్రిగారును వీనిని సంస్కృత

కృతులుగనే గణించిరి. కాని యది సరికాదని తలంచెదను. శ్రీ వీరేశలింగముగారు కర్ణాటకకవిచరిత్రకారుల వ్రాతల ననుసరించుటయేకాని యీగద్యకృతులను జూచినట్లు కానరాదు. సోమనాథుఁడు బహుభాషాసంప్రదాయముల నెఱింగినవాఁడు. ఆతనికాలమునాఁటి యాంధ్రచ్ఛందోగ్రంథము లింతవఱకు మనకు లభింపలేదు. అప్పటి మనభాషాచ్ఛందోగ్రంథములలో గద్యలక్షణ మెట్లు నిర్వచింపఁబడెనో తెలియరాదు. సంస్కృతలక్షణవేత్తలుకూడ గద్యమును వచనపర్యాయముగనే నిర్వచించిరి. కావున మన సోమనాథుని గద్యకృతులు సంస్కృతలక్షణమునకు సరిపడనేరవు. సోమనాథుఁడు వీనిని సంస్కృతభాషాకృతులుగనే గణించియున్నచో "ఉరుతరగద్యపద్యోక్తులకంటె", "ఆరూఢగద్యపద్యాదిప్రబంధ, పూరితసంస్కృతభూయిష్ఠరచన", "ఉపమింపగద్యపద్యోదాత్తకృతులు, ద్విపదయు సమము భావింపనెట్లనిన" అని తన యాంధ్రభాషాగ్రంథములలో నుదాహరించుటలో సారస్య మేమి ? కావున వీని నాతఁడు ఆంధ్రభాషాకృతులుగనే యుద్దేశించియుండునని నాయాశయము.

కర్ణాటకవియగు నృపతుంగుఁడుకూడఁ దన 'కవిరాజమార్గము'లో సోమనాథునివలెనే యంతకుఁబూర్వమాభాషలో వెలసిన గద్యపద్యకృతులను బ్రశంసించినాఁడు

"మిగె కన్నడకబ్బంగళొ
ళగణితగుణగద్యపద్య సమ్మిశ్రితమం
నిగదిసువ గ్గద్యకథా
ప్రగీతియం తచ్చిరంతనాచార్యర్కళ్.
విమలోదయనాగార్జున
సమేతజయబంధుదుర్వినీతాదిగళ్ (?)
క్రమదొళ్ నెగళ్తె గద్యా
శ్రమపదగురుతాప్రతీతియం కైకొండర్."

ఈతఁడు పేర్కొనిన యాకర్ణాటగద్యకృతుల స్వరూపస్వభావాదులఁగూడ నిప్పుడు సరిగా నిర్ణయింపరాకున్నది. కర్ణాటచ్ఛందోలక్షణకర్తయగు నాగవర్మకూడఁ దన ఛందోంబుధిలో గద్యమన వచనమనియే నిర్వచించినాఁడు. కాని రఘటా(రగడ)లక్షణమును జెప్పుటలో నాతఁడు

"గణనియమవిపర్యాసదొ
ళెణెవడెదొ ళ్పెసెదుమాత్రె సమనాగె గణా
గ్రణియ మతదింద తాళద
గణనె గొడంబట్టు దదువె రఘటాబంధం."

అని సమానమాత్రలుగల కొన్నినియమితగణములను దాళానుగుణముగఁ గూర్చుటయే రగడలకు ముఖ్యమని వ్రాసినాఁడు. ఈపద్యమునకు Rev Kittel పండితుని వివరణమును దిలకింపుఁడు.—

"The Raghate is neither built on the system of the syllable feet nor on that of a mere number of moras but on an equal number of moras (matras) included within certain feet (gana)and harmonises with beating time in music (తాళ)."

కన్నడములో ముఖ్యమయిన రఘటాభేదములు మూఁడుగలవు.—

"మందానిలలలితోత్సవ
వెందే రగళెగళ నామ మక్కుం క్రమదిం
దొందకె పదునాఱిర్ప
త్తొంద క్కిర్పత్తునాల్కుమాత్రె గళబలే.
ఇప్పత్తుమాత్రె లలితెగె
బప్పుదు పదునాఱుమాత్రె మందానిలకం
తప్పదు వుత్సాహక్కుఱొ
యొప్పవు దిప్పత్తునాల్కుమాత్రె గళబలే."

"There are three Kinds of Ragale which are frequently used, the Mandanila, Lalita and Utsava (Utchaha). The Mandanila has 16 moras in each quarter, the Lalita 20 and the Utsava 24. The Mandanila consists of 4 feet (ganas) of 4 moras, Lalita 4 feet of 5 moras and Utsava 8 feet of 3 moras."

వీని నన్నిటిని బర్యాలోచించినచో సోమనాథుని పంచప్రకారగద్యయందలి ద్వితీయతృతీయగద్యములును, ఈనమస్కారగద్యమును లక్షణవిషయమునఁ గన్నడమందలి మందానిలరగడను బోలుచున్నవని చెప్పవచ్చును. మొత్తముమీఁద సోమనాథుని గద్యకృతులు ప్రాచీనకర్ణాటాంధ్రగీర్వాణచ్ఛందస్సంప్రదాయముల ననుసరించిన యొకవిలక్షణాంధ్రకృతులుగ గణింపఁదగునేమో యని నాయాశయము. విజ్ఞులు నిర్ణయింతురుగాక!

ఈనమస్కారగద్యమునకు నాయొద్ద నున్న ప్రతిలో నంతిమశ్లోకములు లేవు. శ్రీప్రభాకరశాస్త్రిగారి బసవపురాణపీఠికనుండి గ్రహించి వాని నిందుఁ జేర్చితిని. నాప్రతులతో సరిచూచి సోమనాథుని యీలఘుకృతులను సమగ్రముగఁ బ్రకటించుతలంపుతోఁ బ్రాచ్యలిఖిత పుస్తకాలయమందున్న ప్రతులయొక్క నకళ్లకయి శ్రీశాస్త్రిగారిద్వారమునఁ బ్రయత్నించియు విఫలమనోరథుఁడ నైతిని. అందుచే నాయొద్దనున్న యేకప్రతినిబట్టియే లేఖకదోషములను నాకుఁ దోఁచినంతవఱకు సవరించి యీగద్యకృతులను బ్రకటించుచున్నాఁడను. అర్థము సుగమముకాని తావులందు అసలుపాఠములను పుటలయడుగునఁ గనఁబఱచి నాసవరణపాఠములను గద్యములోఁ గుండలీకరణమునఁ జూపితిని. అంతిమశ్లోకమందలి 'అష్టోత్తరకుసుమం' అనువిశేషణముచే నీగద్యమందు 108 పాదము లుండవలెనని తోఁచును. కాని నాప్రతినిబట్టి నే నిప్పుడు ప్రకటించినవి 118 పాదము లగుచున్నవి. కొన్ని ప్రక్షిప్తము లిందుఁ జేరినవేమో? లేక ప్రాసయతితోఁ గూడిన పాదద్వయము నొక్కకుసుమముగనే సోమనాథుఁ డుద్దేశించినచో నట్టివి మఱి యింకను 49 పాదము లుండవలెను. శాస్త్రిగారు ప్రాచ్యలిఖితపుస్తకాలయమునఁ జూచిన ప్రతిలో నెన్నిపాదము లున్నవో తెలియదు. పరిశీలించిచూచినచో సోమనాథుఁ డొక్కొక్క యంత్యానుప్రాసమున కెనిమిదేసి పాదములచొప్పున రచింపవలెననెడి నియమమునుగూడఁ గైకొనినట్లు కాన్పించును.

## నమస్కారగద్య

శ్రీకంఠోద్భవవేదచోదితలసద్వీరవ్రతప్రక్రియా-
చారాదేశకదేశికాయ, భువనస్తుత్యాయ,నిత్యాయ, స
ద్భాండాగారధురంధరాయ, సుమహారుద్రాయ భద్రాయ తే
సాక్షాచ్ఛ్రీవృషభాధిపాంశబసవాధీశాయ, తస్మై నమః.
శ్రీమదసంఖ్యాతమహాప్రమథగణేభ్యో నమః
అపిచ శ్రీప్రమథేంద్రాయ నమో, వ్యపగతహృద్గతతాంద్రాయ నమః ౧
సాధితచాళుక్యేంద్రాయ నమో, మేధాజితవాణీంద్రాయ నమః ౨
[౧] (నిశితప్రతిభా)సాంద్రాయ నమో, విశదయశోజితచంద్రాయ నమః 3
[౨] (సుకృతమహోత్కట)రుంద్రాయ నమో, నిక్కృతశ్రీమధుపేంద్రాయ నమః ౪
సుగుణానందకరండాయ నమో, జగదవనకళాశౌండాయ నమః ౫
సురుచిరశమదమషండాయ నమో, హరగణదిగ్వేదండాయ నమః ౬
ఖండితపితృపతిదండాయ నమో, దండితదురితోద్దండాయ నమః ౭
శమితమదాసమకాండాయ నమో, విమలయశోబ్జభవాండాయ నమః ౮
సహజదృగంచలశాంతాయ నమో, మహిమాక్రాంతదిగంతాయ నమః ౯

౧. సశివాసుఖాంత. ౨. సుకృతాదుత్కట.

స్వీకృతశివసిద్ధాంతాయ నమో, లోకా[౨a](యతిక)దురంతాయ నమః ౧౦
పరమైకాంతనిశాంతాయ నమో, వర[౩](నిర్మలసు)స్వాంతాయ నమః ౧౧
స్థిరజయకాంతాకాంతాయ నమో, విరహితమాయాధ్వాంతాయ నమః ౧౨
శశ్వదనశ్వరపుణ్యాయ నమో, విశ్వవితానవరేణ్యాయ నమః ౧౩
సురమునిపరిషదగణ్యాయ నమో, [౪] (విరమితపటుత్రై)గుణ్యాయ నమః) ౧౪
త్రిజగదవనైపుణ్యాయ నమో, రజతరుచిరలావణ్యాయ నమః ౧౫
ప్రోత్సారితకార్పణ్యాయ నమో, హృత్సముదితకారుణ్యాయ నమః ౧౬
శ్రుతినాదామృతకుంభాయ నమో, గతగర్వావష్టంభాయ నమః ౧౭
సురుచిరసూనృతగుంభాయ నమో, విరహితసంసృతిదంభాయ నమః ౧౮
సకలకళావిస్రంభాయ నమో, నికృతవినిర్జితజంభాయ నమః ౧౯
చరలింగార్చారంభాయ నమో, హరగణమూలస్తంభాయ నమః ౨౦
స్వసమయసరసిజహంసాయ నమో, విస్మృమరమఖవిధ్వంసాయ నమః ౨౧
శరణపరిషదవతంసాయ నమో, గురుపదపద్మోత్తంసాయ నమః ౨౨
స్వార్జితసత్యవతంసాయ నమో, వర్జితలఘుమీమాంసాయ నమః ౨౩
సుకృతిజనోత్కరశంసాయ నమో, నికృతోభయమీమాంసాయ నమః ౨౪
[౫](విద్వజ్జనసు)శ్లోకాయ నమో, [౬](విద్విషగణ)కుట్టాకాయ నమః ౨౫
శివసంవిత్పరిపాకాయ నమో, భవిమస్తకలుంటాకాయ నమః ౨౬
స్థాపితవీరపతాకాయ నమో, వ్యాపితమహిమాస్తోకాయ నమః ౨౭
సదసద్వస్తువివేకాయ నమో, విదళితబహుజల్పాకాయ నమః ౨౮
శ్రేష్ఠాగమమయ[౭](వాక్యాయ)నమో, నిష్ఠిత[౮](శివలింగైక్యాయ) నమః ౨౯
[౯](విమలజ్ఞానవిలోక్యాయ) నమో, [౧౦](దమితరిపుగణాధిక్యాయ నమః) ౩౦
శాపనిహితచాళుక్యాయ నమో, దీపితపరమాత్మైక్యాయ నమః ౩౧
[౧౧](చరితార్థత్రై)లోక్యాయ నమో), [౧౨](గురుతరభక్తిసుశక్యాయ నమః) ౩౨
[౧౩](ప్రణుతసకలగీర్వాణాయ నమో), గుణమణిరంజితశాణాయ నమః ౩౩
త్రిజగన్నుతకల్యాణాయ నమో, భజనాసక్తత్రాణాయ నమః ౩౪
(అష్టాంగాతిధురీణాయ నమో), [౧౪](ఇష్టశరణగణ)ప్రాణాయ నమః ౩౫
ఖ్యాత[౧౫](విమలతర)సుగుణాయ నమో, నీతిదయానిర్వాణాయ నమః ౩౬
పరిచితశైవరహస్యాయ నమో, విరచితజంగమదాస్యాయ నమః ౩౭
సదమలభక్తోపాస్యాయ నమో, మదరిపుగజపంచాస్యాయ నమః ౩౮
[౧౬](శివపదరతవరివస్యాయ నమో), భువనజనైకనమస్యాయ నమః ౩౯

---

౨a. చార. ౩. నైర్మల్య ౪. వరకామితఫలపుణ్యాయనమః ౫. షడ్వర్గాది ౬. విద్విజన. ౭. వ్యాఖ్యాయ. ౮. రుద్రాద్యైఖ్యాయ. ౯. శ్రౌతాచారద్యైఖ్యాయనమో ౧౦. ధౌతసకలవస్త్వైఖ్యాయనమః. ౧౧. ప్రాకృతభవసంహారాయనమో. ౧౨. దీకృత అపూవిధ్వంసాయ నమః. ౧౩. ప్రణవదుభయనిర్వాణాయనమో. ౧౪. నిష్ఠితజంగమ. ౧౫. వినుతగుణ. ౧౬. శివసుఖసామ్రాజ్యస్యాయ.

విహితాగమభరితాస్యాయ నమో, రహితేంద్రియవైరస్యాయ నమః ౪౦
కృత్తదురితవనదుర్గాయ నమో, దత్తవిలసదపవర్గాయ నమః ౪౧
పరిపాలితసన్మార్గాయ నమో, విరహితరిపుషడ్వర్గాయ నమః ౪౨
శరణోత్కరసంసర్గాయ నమో, నిరసితనిఖిలస్వర్గాయ నమః ౪౩
సాక్షాత్కలియుగరుద్రాయ నమో, భక్షితవిషసంవర్గాయ నమః ౪౪
త్రిగుణాతీతమనస్కాయ నమో, నిగమార్థాంగవచస్కాయ నమః ౪౫
సుగుణోత్తర౧౭(సుమన)స్కాయ నమో, దిగధిక్రాంతయశస్కాయ నమః ౪౬
అగణితభక్తిశిరస్కాయ నమో, జగదురుతరతేజస్కాయ నమః ౪౭
సంగతభుజగోరస్కాయ నమో, ౧౮(లింగార్పితచేత)స్కాయ నమః ౪౮
శ్రీఋషభేంద్రాకారాయ నమో, వీరాచారోద్ధారాయ నమః ౪౯
సారాగమవిస్తారాయ నమో, భూరివికారనికారాయ నమః ౫౦
స్వైరేంద్రియధిక్కారాయ నమో, స్ఫారానందవిహారాయ నమః ౫౧
౧౯(సూరిసుఖద)మందారాయ నమో, భూరిదయామృతపూరాయ నమః ౫౨
సచరాచరసంధానాయ నమో, అచలవ్రతసువిధానాయ నమః ౫౩
సాహసకర్మవిహీనాయ నమో, ౨౦(దేహగుణాగుణరీణాయ) నమః ౫౪
శివలింగపదధ్యానాయ నమో, అవినాశన ౨౧(సుఖలీనాయ) నమః ౫౫
పరమపదాపరదానాయ నమో, వరసరసస్వరగానాయ నమః ౫౬
తుంగితగురుచరలింగాయ నమో, లింగితషల్లింగాంగాయ నమః ౫౭
సంగతశివయోగాంగాయ నమో, భంగితశమనానంగాయ నమః ౫౮
మంగళమహిమోత్తుంగాయ నమో, సంగమవరగురులింగాయ నమః ౫౯
మంగళప్రసంగసంగనబసవలింగాయ తే నమస్తే నమస్తే నమః

మఘవత్ప్రణుతపదాబ్జాతాయ౨౨ (పూతాయ)
వీఘనత్రితయసుఖోద్ధరణాయ శరణాయ
కుసుమశరరిపుభక్తవృషభాయ వృషభాయ
బసవాయ తే నమస్తే నమస్తే నమః
సరసనమస్కృతిగద్యం, వరపదమణిఖచితవాక్సువర్ణాభమ్,
అష్టోత్తరశతకుసుమం, రచితం పాల్కురికి సోమనాథేన.

నమస్కారగద్య సంపూర్ణమ్

---

౧౭. వాచ. ౧౮. లింగవిలీనమన. ౧౯. భూరిసుఖవి. ౨౦. దేహగణఘణలీనాయ. ౨౧ [illegible] ౨౨. [illegible]

# వాసిరెడ్డీయము

అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు, యమ్. ఏ.

వాసిరెడ్డీయమనునది రెండాశ్వాసములుగల ఒక అముద్రిత గ్రంథము. దీనిని రచించిన అమరవాది రామకవి గుంటూరు మండలవాసి. సత్తెనేపల్లి తాలూకాలోని బాలేమర్రుఅగ్రహార మీయన జన్మస్థలము. సుమారు ౭౦ సంవత్సరములు జీవించి, కాళయుక్తి సం కార్తికబహుళ షష్ఠినాఁడు (౧౯౧౮ సం) దివంగతుఁడైనాఁడు.

ఈరామకవి రచించిన గ్రంథములలో ముఖ్యమైనవి ద్రౌపదీ పరిణయము, వాసిరెడ్డీయము, కార్తికపురాణము అను గ్రంథములు. వీనిలో మొదటిదగు ద్రౌపదీపరిణయము ఎనిమిదాశ్వాసముల ప్రబంధము. భారతములోని ద్రౌపదీస్వయంవరకథను విస్తరించి ప్రబంధ రూపముగా రచించినాఁడు ఆధునికులచేఁ గృతములగు ఉత్తమకావ్యములలో నిదియొక ముఖ్యమయినది. ఈరామకవి మిక్కిలి ప్రౌఢకవి. కవితాధార ధారాళమయి, మనోజ్ఞముగా నున్నది శైలి గంభీరమై కవియొక్క కల్పనాచాతుర్యమున కెంతయు ననుకూలముగ నున్నది. గ్రంథములోఁ జాలభాగము నారికేళపాకమే ఈద్రౌపదీపరిణయ ప్రబంధము కృష్ణాతీరస్థమయిన ముక్తీలాపురమునం దవతరించియున్న శ్రీముక్తీశస్వామి కంకితము చేయఁబడినది. తత్పురాధిపతియైన శ్రీరాజావాసిరెడ్డి భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడు బహద్దర్ మన్నె సుల్తానుజమీన్‌దారు ఈకృతిని భరించినాఁడు. గ్రంథకర్త గ్రంథాదియందుఁ గృతిభర్తృవంశమయిన వాసిరెడ్డివారి చరిత్రయంతయుఁ జక్కగ వర్ణించియున్నాఁడు.—

ఈవర్ణనతోఁ దృప్తినొందక, తమ వంశచరిత్ర మంతయుఁ బ్రత్యేకగ్రంథముగ రచింపుమని, పైరాజావారి వంశీయులలో నొకరగు వాసిరెడ్డి వేంకటలక్ష్మీనరసింహనాయఁ డనువారు కోరుటచే వాసిరెడ్డీయ మను నీగ్రంథమును రామకవి రచించియున్నాఁడు. ఈ సంగతినే కవి యిట్లు వివరించుచున్నాఁడు.

"నను, మత్పూర్వబుధార్జితాగణితమాన్యక్షేత్రభవ్యాగ్రహా
రనిరాయాససమగ్రజీవను, సుధీంద్రశ్లాఘ్యమానప్రవ
ర్తను, నచ్ఛామరవాదిరామయను, మేధాదక్షిణామూర్తిసాం
ద్రనవానుగ్రహభాక్కవిత్వమహిమున్, రప్పించి తానిట్లనున్."

"కృతవేదాధ్యయనుండు, సూనృతవచఃకీర్ణుండు, సన్నప్రదా
త తమోహారుఁ, డయాచకుండు, గిరిశధ్యానావధానుండు, వి
శ్రుతశిష్టాగ్రణియౌ భవద్గురుఁ డహో! సోమేశ్వరాభిఖ్యదీ
క్షితవర్యుండు, తదాత్మజుండవగు నీశీలంబు సామాన్యమే!"

"ఘనవాక్ప్రౌఢిమ, ద్రౌపదీపరిణయగ్రంథాది, మావంశవ
ర్ణనముం జేసితివంచు వింటి; మఱియున్ మాప్రాజ్యరాజ్యంబు,హూ
ణనరేంద్రుల్ గయికొంట, దానికగు నానాకారణంబుల్, రయం
బున నీ వొక్కప్రబంధ మార్యవరు లామోదింపఁ గావింపుమా!"

ఇట్లు కోరినమీఁదటఁ దా నీప్రబంధరచన కంగీకరించితి ననియును,

"వాసిరెడ్డిచరిత్రమై వఱలుకతన
వాసిరెడ్డీయ మనఁగ నాహ్వయ"

మొనర్చితి ననియును గవి తెలుపుచున్నాఁడు.

## వంశచరిత్రము

వాసిరెడ్డివారి వంశావళి నంతయుఁ గవి వర్ణించినరీతి నిట సంగ్రహించుచున్నాను

విష్ణుపాదోద్భవమయిన నాలవజాతిలోఁ గతిపయప్రజ ఋజుమార్గవర్తనులై యుండిరఁట. వారినిఁ గాంచి, తగుపెద్దలు "మహాశుభవైభవశాలి కమ్మ!" అని దీవించిరఁట. అంతటినుండి యది కమ్మజాతియై వర్ధిల్లెనఁట. ఇట్లు తత్కులోత్పత్తివిధానమును జమత్కారముగఁ దెల్పి, ఆకమ్మకులములో వాసిరెడ్డివా రెట్లు ప్రభవించిరో కవి తెలియఁజేయుచున్నాఁడు.

రెడ్డిరాజులలో ముఖ్యుఁడగు అనవేమారెడ్డిసార్వభౌముఁడు రాజ్యమేలుచున్న కాలములోఁ బైకమ్మకులములో సదాశివనాయఁడను నొక శూరవరేణ్యుఁ డుద్భవించియుండెను. ఈతని శౌర్యాదులఁ గూర్చి విని, అనవేముఁ డాతనిఁ బిలిపించి, యోగ్యతను బరీక్షించి, కొంతసేన కధికారిగా నియమించెను. అటుపిమ్మట నొకానొకసమయమునఁ బశ్చిమదేశాధిపతులు రెడ్డిప్రభువుపైఁ దిరుగఁబాటొనర్చి తా

మీాయవలసియున్న కప్పము నెగవైచిరి. అంత వారిపై ననవేముఁడు దాడివెడల, వారొక రాయబారిముఖమున నాతని కిట్లు కబురంపిరి: "ఇంతసేన వ్యర్థముగా నశింపనేల? మొనగాని నొకరి నేర్పఱచికొని, ద్వంద్వయుద్ధముసేయ నాజ్ఞాపింతము అప్పుడగు జయాపజయములఁ బట్టి మన గెలుపోటముల నిర్ణయింతము." ఇట్లు వర్తమాన మంపినపుడు, తనసేనయందుఁ దగినశూరు నొక్కనినైనను గాంచనేరమి, ననవేముఁ డేమియుఁ బాలుపోక దిక్కులు సూచుచుండ, సదాశివనాయఁ డా పనికిఁ దా నంగీకరింతు ననెను

"అని వేవేగ సదాశివప్రభుఁడు దృప్యద్యుద్ధసన్నద్ధుఁడై
తనతో మార్కొనఁబూనియున్న రిపుయోధశ్రేష్ఠుతో మోహరిం
చి, నితాంతాహవ మాచరించి, యతనిన్ సింహంబు మత్తద్విపం
బునుబోలెం దునిమెన్ హితాహితులకున్ మోదంబుఖేదంబుఁగాన్"

ఇట్లు

"పెనఁకువ నోర్చి, శాత్రవుల బిట్టరిగాఁపులఁ జేసి, రాజరా
జనిరెడి వాసిరెడ్డి కలరార్చుటఁ దా నల వాసిరెడ్డి నాఁ
దనరె సదాశివప్రభుఁడు ధాత్రి, క్రమంబున వాసిరెడ్డివా
రనఁగఁ దదీయవంశభవు లందఱు విశ్రుతి కెక్కి రున్నతిన్."

ఈరీతి వైరుల హతమొనర్చి, తన పేరుప్రతిష్ఠలఁ గాపాడఁ జాలుటచే, మిగుల సంతసించి, అనవేమసార్వభౌముఁడు సదాశివనాయనికి దక్షిణదేశమం దొకకొంతభాగ మిచ్చి, 'రాజా' బిరుద మొసంగి గౌరవించెను. ఇట్లా ప్రభువుచే ననుజ్ఞాతుండై సదాశివనాయఁడు రాజ్య మేలుచుండ, నాతని పూర్వపువైరులు ఒకానొకరాత్రి నాతని బంధుమిత్రయుతముగ సంహరించిరి. దైవకృపవలన నెట్టెటో, ఒకబ్రాహ్మణపురంధ్రి సాహాయ్యమున నాసదాశివప్రభుని పుత్రుఁడు, రెండేండ్ల ప్రాయముగల శ్రీగిరిమల్లిఖార్జుననామకుఁడు వైరులచేఁ జిక్కక, నిజ మాతామహస్థానమును జేరఁగల్గెను ఇతని సంతతియే క్రమేణ శాఖోపశాఖలుగా బయలుదేఱి, వృద్ధిఁజెంది జగమున వినుతి కెక్కినది. సదాశివనాయనియందు గౌరవాదరములుగల, ఆనాఁటి ఓఢ్రకర్ణాటదేశపాలకు లందఱు తమకు గప్పముకట్టు నేర్పాటుమీఁదఁ గొంతభూమిని శ్రీగిరిమల్లిఖార్జుననాయని సంతతివారికి 'మిరాశిదఖల్' పఱచిరి.

ఇట్లు వృద్ధిగాంచిన వాసిరెడ్డీయులలో వీరపనేఁడు సుప్రసిద్ధుఁడయ్యె. తనతో సమానులగు వీరులు లేరనునటు లీతఁడు 'ముస్తుఫాన్నగరి' పేరిటిరాష్ట్రమును బరిపాలించెను ఇతనికి రాఘవయ్య, చౌదరిరామన్న, చంద్రమౌళి అను మువ్వురు పుత్రులు గలిగిరి. ఒకప్పు డీముగ్గురును గొంతదేశము సంపాదింపఁగోరి ఢిల్లీపాదుషాహును బోయిచూచిరి.

"కని, యప్పాదుషహాకు విభ్రమచమత్కారంబులన్, హర్షపూ
ర్తినిఁ గావించి, తదీశువల్ల నల నందిగ్రామసీమోపవ
ర్తనసర్వంబునకున్ స్థిరంబగు జమీన్‌దారీమిరాశీదఖల్,
ఘనసమ్రాడ్బిరుదాంకముల్ వడసి వేడ్కన్ వచ్చి, రత్తత్ప్రభుల్."

తమ స్వార్జితమయిన నందిగామసీమయంతయు మూఁడువంతులుగా విభాగించుకొనిరి పెద్దవాఁడైన రాఘవయ్యకు మాగల్లువంటును, రెండవవానికి రాఘవపురియును, తృతీయుఁడగు చంద్రమౌళికి చింతలపాటివంటును బాలువచ్చినవి,

చింతలపాటివంటున కధిపతియైన చంద్రమౌళి కృష్ణాతీరమున వెలసియున్న ముక్త్యాల రాజధానిగాఁగఁ గొంతకాలము రాజ్యముచేసిన పిమ్మట నాతని పుత్రుఁడు రాఘవయ్య రాజ్యమునకు వచ్చి పరిపాలించెను. ఈయనకు రాజమౌళి అచ్చన్నగార లను పుత్రద్వయము గల్గెను. పెద్దవాఁడైన రాజమౌళి పెద్దకాలము ప్రజారంజకముగ రాజ్యమేలి అమితదానపరుఁడై 'నిస్సీమభూదానచక్రవర్తి' అను బిరుదము గాంచినాఁడు. ఈరాజమౌళికి శ్రీచంద్రమౌళియు, నాతనికి రామలింగ వీరన్న ప్రభువు లను వారలును జనించిరి జ్యేష్ఠుఁడగు రామలింగశౌరి రాజ్య మేలుచుండ వీరనప్రభువు సేనాధిపతియై, అన్నను గొలిచియుండె. ఇట్లుపాలించిన రామలింగక్ష్మాపతి కైదుగురు, రాజమౌళి, లక్ష్మీపతి, రాఘవయ్య, చంద్రమౌళి, వేంకయ్యప్రభుఁడు అనువారలు పుత్రులైరి వీరిలోఁ బెద్దవాఁడైన రాజమౌళి, తన యనంతరము తనకు సంతతిలేమిం జేసి, తన తరువాతితమ్ముని సింహాసనాసీనునిం జేసెను ఇట్లు క్రమానుగతముగ రాజ్యలక్ష్మి రామలింగని నాలవకొడుకగు చంద్రమౌళిని వరించెను. ఈతని ప్రాభవమునుగూర్చి కవి యిట్లు పలుకుచున్నాఁడు—

"అతని ప్రభుత్వవేళకు సమస్తనిదర్భమహోపవర్తనం
బకులితసార్వభౌమ బిరుదాంకితహూణ నృపాధికారసం
గతమయి క్రాలఁగాఁ దదధికారవశుండయి, యాతఁ డుర్వి న
ద్భుతగతి నేలెఁ దాఁ దనకు ముక్తిపురం బది రాజధానిగాన్."

ఆచంద్రమౌళిభూకాంతుఁడు సుప్రసిద్ధ శివపూజాధురంధరుఁడగు చినవేంకటాద్రినిఁ గనినాఁడు పిమ్మట నీ చినవేంకటాద్రినాయఁడు ముగ్గురుకొడుకులను గనెను. పెద్దవాఁడు భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడు. చంద్రమౌళి రెండవవాఁడు. కనిష్ఠుఁడు సదాశివప్రసాదప్రభుఁడు భవానీప్రసాద భూకాంతుఁడు చాలకాలము రాచఱికమనుభవించి, అనేకభూదానము లొనర్చి, రాజ్యము నిజసుతుఁడగు ఉమామహేశ్వరుని కైవసమొనర్చి, శివపూజాలగ్నమానసుఁడై విశ్రాంతి గైకొనెను ద్రౌపదీపరిణయము నంకితముగొనిన దీయనయే యనుసంగతి నీక్రిందిపద్యము చాటుచున్నది —

"అల ద్రౌపదీపరిణయము
వెలయ మదుక్తకృతి నొంది స్వీయంబగు చిం
తలపాటిగ్రామమునఁ గు
చ్చలమాన్యము నా కతం డొసఁగె బహుమతిగాన్"

**Badshahi Depilatory Powder.**

Delicately Perfumed Removes Hair Neatly and Safely from any part of the body keeping the skin glossy to its natural colour

**Price As 10 Post As 6**
**3 Bottles Rs 2—4 Post FREE**

# బాద్‌షాహి
## డెపిలేటరీ పౌడరు

మంచి పరిమళముగలది శరీరమందే భాగముననైనను వెంట్రుకలను సుఖముగాను అందముగాను తొలగించును చర్మమును సౌందర్యముగా కాపాడును. వెల 10 అణాలు పోస్టు 6 అణాలు 3 సీసాలు 2-4-0 పోస్టు ఉచితము




# కా మ ల తా హె యి రా యి లు
## శి రో జ ము ల కు మే లై న ది

# KAMLATA
## HAIR OIL
REGD



వెల సీసా 1-కి
రు. 1—0—0
పోస్టేజి ప్రత్యేకము.

అకాలమునసే వెంట్రుకలూడుట మున్నగునవి జరుగకుండ శిరోజములను పట్టువలె పెంచును చుండ్రును రానీయక మాపును ప్రశమముచేయును మరియు నిది మెదటికి చలువ నిచ్చి మనోహరముగా నుంచును.

ఇంతే గాక, దాని సువాసన మిక్కిలి శ్రేష్ఠమైనది. ఆనంద దాయకముగా నుండును.






# ఓ టో ఫు ప శై యు (రిజిస్టర్డు)

మంచి రకముల పుష్పసారములచే నిది తయారుకాబడినందున దాని పరిమళ మింతంతని చెప్ప నలవికాదు చేతిరుమాలుమీద కొన్ని చుక్కలు వేసినంతనే చాలరోజుల వరకు దాని సువాసనపోదు. ఒకసారి పరీక్షించి తృప్తి చెందుడు.

| | | | |
|---|---|---|---|
| ½ ఔన్సు బుడ్డీ రు | 2—0—0 | ⅛ ఔన్సు బుడ్డీ రు | 0—12—0 |
| ¼ ,, ,, | 1—4—0 | ½ డ్రాము కొయ్యకేసు | 0—8—0 |

**C. C. MAHAJAN & Co.,**
**281, Jumma Masjid, Bombay. 2.**
**MADRAS STOCKISTS. J. M. SHETH 260, CHINA BAZAR ROAD.**

# బోసు పరిశోధనాలయ చిత్రములు



౧. సర్ జగదీశచంద్ర బోసుగారు, K T, F R S, D Sc



౨ బోసుగారి పరిశోధనాలయము, కలకత్తా

ఎడమవైపున బోసుగారి గృహము కుడివైపున పరిశోధనాలయము ఈభవనముఖమునగల గడియారము లోపలగల మరియొక్క గడియారముతో విద్యుచ్ఛక్తిద్వారమున సంబంధము గలిగియున్నది



3 పరిశోధనాలయమునందలి
పరిశోధకుల వసతిగృహము



౪ పరిశోధనాలయ పశ్చాత్ప్రాంగణము
ఇందు మొక్కలు, జంతువులు నిలువచేసిన భాగము లున్నవి.

# రామన్ పరిశోధనాలయ చిత్రములు



౧ రామన్ పరిశోధనాలయాంతర్భాగమున సర్ సి వి రామనుగారు



౨ రామన్ పరిశోధనాలయాంతర్భాగము
హిందూ విశ్వవిద్యాలయాధ్యాపకులు సోగానిగారి
'ఎక్సరే'లతో పరిశోధనము



3 రామన్ పరిశోధనాలయము, కలకత్తా

ఇంతటితో మొదటిశాఖయొక్క చరిత్ర ముగిసినది కవియును, కృతిభర్తయు సమకాలికు లగుటవలన, నాపయిని చరిత్ర వర్ణించుటకు వీలుకాకపోయినది.

రెండవవంటున కధిపతియైన చౌదగిరామనక్షితిపతి రాఘవపురము ముఖ్యపట్టణముగాఁ జేసికొని రాజ్యమేలినాఁడు అక్కాలమున నీతఁ డనేకధర్మకార్యముల నొనర్చెను. ఈరాజన్యునకు వీరపనేఁడు, రాఘవయ్య, చినపద్మనాభరాయఁడు, చంద్రమౌళి, రామలింగము, నారసింహప్రభుఁడు అను నార్వురుపుత్రు లుదయించిరి జ్యేష్ఠుఁడగు వీరపనేనికి వీరశిరోమణియగు సూరయ్యచౌదరి జన్మించి, తండ్రి యనంతరము రాజ్యాధిపత్య మొందెను. ఈతని రాజ్యపరిమితి యిట్లు వర్ణింపఁబడినది —

"మగఁటిమి నప్పనంబు గడిమన్నెవజీరుల నోర్చి కాంచు స
త్యగుణవదాన్యశీలయుగ మాత్మధనం బగుచుండ ముస్తుజా
న్నగరును ముస్తుభాన్నగరు నాఁగల సహ్యభవోభయప్రతీ
రసురుతరోపవర్తనము రాజ్యము సూరయ చేసె నున్నతిన్."

సూరయ్యకుఁ గల్గిన యిరువురు కొడుకులలోఁ జినసరసన్న పెద్దవాఁడు. చినరామలింగం చిన్నవాఁడు చినసరసన్న రణకుశలుఁడే కాక నీతికోవిదుఁడుగూడ నైయుండినాఁడు. ఇతనిపిదప నీతని యవీయుఁడు చినరామలింగభూపతి ప్రభుత వహించెను.

ఈచినరామలింగముయొక్క తాతకు ద్వితీయసోదరుఁడైన చినపద్మనాభముయొక్క కథ యిట ప్రసంగవశమున వర్ణింపఁబడు చున్నది. ఈయన కొంత దేశము సంపాదింపఁగోరి హైదరాబాదు నవాబుగారిని దర్శించి, శ్రీవారిచే 'సెబాస్గిరి' వడసి—

"పాదుషాహీమెహర్బా నిట్లు గీల్కొల్పి
చినపద్మనాభుఁ డింపెనయ, బెత
వోలును, పెనుగంచిప్రోలు లోనైన నా
నాసీమలకు జమీన్దారిసనదు,
మన్నెవారీమున్నతి, గడిదుర్గప
తులచేఁ గొను వర్తదారిసనదు,
తెల్ల జెండా, పగల్ దివ్వె, భూచక్ర-
గొడుగు 1, నాప్తాగిరి, కూనిసెలవు 2
అలఘుదేశముఖీపరువాజి పటహ
హస్తితురగాది బహుమతు లల నబాబు
వలనఁ గొనివచ్చి, సత్రంబు లలవరించి
బ్రాహ్మణావనకారియై ప్రభుత సలిపె"

చినపద్మనాభము జైత్రయాత్ర గావించి, తన విరోధులగు వెలమ లను రామరాజమంత్రప్ప మొదలగువారినిఁ దునుముటయేగాక వారి కోటల దున్నించి, ఆముదపువెదలు వేయించినాఁడఁట! స్వస్థానమునకు వచ్చిన పిదప నీతఁడు వైరిదుర్భేద్యమగు చింతపల్లికోటను గట్టించినాఁడు. ఈతనికి 'సేతిపద్మనాభ' మనువ్యవహారము కలదని యని ప్రాప్తించినవిధమును గ్రంథకర్త యిటులు నుడువుచున్నాఁడు.—

"ప్రణుతవదాన్యుఁ డాతఁడు శరన్నవరాత్రమహోవ్రతార్పితా
దనములఁ బోయు నాజ్యములు—ధారుణిఁ జేరి కరుల్గగట్ట, నె
ట్టన నవిపారలన్ సెలగుటన్ ఘటియించిరి, 'సేతిపద్మనా
భనృపసమాహ్వయం బఖిలబాడబు లన్నెఱ మన్నెరేనికిన్."

ఈచినపద్మనాభశౌరికి సంతతిలేమి, యాతఁ డార్జించినదెల్ల నతని యన్నగారి మనుమఁడును, రాఘవపురమున కధిపతియునయిన చినమలింగప్రభువునకు సంక్రమించెను అతనికిఁగూడ సంతతిలేమిం జేసి, ఆతని రాజ్య మంతయును, అనఁగా రెండవవంటయిన రాఘవపురీ జమీ యావత్తును, మూఁడవవంటుదారైన రాఘవయ్యగారి వంశీయులకుఁ జేరిపోయెను

మూఁడవవంటయిన మాగల్లుచేకొనిన రాఘవయ్యకోవ యిట్లు వర్ణింపఁబడియున్నది ఈరాఘవయ్యకుఁ బెదపద్మనాభనాయఁడను పుత్రుఁ డుదయించి సకలజనానుమోదియు, ధర్మకార్యనిరతుఁడు నై, అనేకభూదానము లొనర్చినాఁడు ఈయనకుఁ బెదరాఘవయ్య, చంద్రమౌళి, నాగన్నచౌదరి, రామన్న, లక్ష్మీపతి, బుచ్చనప్రభువు అను నార్వురు పుత్రులు గల్గిరి. వీరిలోఁ బెద్దవాఁడు రాజ్యమేలినపిదప జ్యేష్ఠకనిష్ఠన్యాయ మనుసరించి క్రమేణ నాగన్న ప్రభువాయెను. అతనికి రామన్న, జగ్గన, నాయఁడమ్మ * అను మువ్వురు సుతు లుదయించిరి జ్యేష్ఠుఁడగు రామనప్రభువునకు పాపయాఖ్యుఁడగు పుత్రుఁడును నాతనికి రామానాయఁడు, రామనాథబాబు అను కుమారయుగ్మకమును జన్మించె నాగన్నగారి నాయఁడమ్మగారికిఁ జంద్రమౌళియను సుతుఁ డుదయించి, యాతఁడు పిమ్మటఁ బద్మనాభ రామన్నగారు, జగన్నాథబాబు అను నిద్దఱు పుత్రులఁ గాంచెను.

నాయఁడమ్మగారికంటెఁ బెద్దవాఁడైన జగ్గననాయఁడు మిగుల శూరుఁడు కావుటంజేసి, పెక్కు జైత్రయాత్రలు సలిపి, అనేకసీమలఁ దన రాజ్యములోఁ గలిపికొనినాఁడు. ఈతని కాలమునాఁటికి రెండవ వంటుజమీకూడ వచ్చి చేరిపోయెను. ఈతఁడు సెఱదాత. కవియొక్క జన్మస్థానమయిన బాలేమఱ్ఱగ్రహారము నొసంగిన దీప్రభూత్తముఁడే.

1 ఇట్టి ప్రయోగముయొక్క సాధుత్వము చింత్యము
2. కూనిసెలవు అనఁగా, మరణదండన విధించు నధికారము
* ఇట్లు నాయఁడు శబ్దమునకు అమ్మ అనుపదము చేర్చి పేరు పెట్టుకొను నాచారము ఇప్పుడు గూడ మగవారిలో నున్నది. వాసిరెడ్డి వారిలో నిప్పుడును నాయఁడమ్మ అను ఆయన ఉన్నాఁడు.

ఈజగ్గన్నక్ష్మాపతికి మహానుభావుఁడైన శ్రీవేంకటాద్రినాయఁ డుదయించినది ఈరాజచంద్రునిఁగూర్చి అధికముగాఁ జెప్పవలసినది లేదు. ఏలన,

"అతఁ డంఘ్రివిన్యాసి యగునాఁడె, తన్మూర్తి
　　యశము దిక్తటముల నంకురించె;
అతఁడు విద్యాభ్యాసి యగునాఁడె, తద్గుణా
　　వళితన్జ్ఞజిహ్వానివాసి యయ్యె;
అతఁడు ఖర్జూరిక నడరునాఁడే తన్మ
　　హాస్ప విద్విట్పర్వ లడ్డగించె;
అతఁడు రాజ్యారంభి యగునాఁడె, తద్రిపు
　　వ్రజ మటవీక్రమారంభి యయ్యె;
రాజమాత్రుండె? దర్శనార్థకృతశతస
హస్రనిష్కపదార్పణాజస్రహర్షి
తయవనేడ్దత్త మన్నెసుల్తానుబిరుద
ముద్రితవిభుత్వతతి వెంకటాద్రినృపతి".

ఈయన కృష్ణాతీరస్థము, గుంటూరుపురమున కనతిదూరస్థమునై వెలసి చరిత్రప్రసిద్ధమగు నమరావతీపట్టణమును దనకు ముఖ్యపట్టణముగాఁ జేసికొని ధరణిఁ బాలించెను. ఈకమ్మకులమునం దుద్భవిల్లిన రాజోత్తములలో నీయన కెనయగువా రెవ్వరు లేరనియే చెప్పనొప్పు. సుప్రసిద్ధశివపూజాధురంధరుఁడగు నీప్రభువు దేవాలయముల కొనర్చిన సేవ అపారమయినది. జీర్ణప్రాయములై మిక్కిలి హీనస్థితియం దున్న పెక్కుదేవాలయముల నుద్ధరించి, వానికి భూవసతి గల్పించి, తనజన్మము సార్థకము చేసికొనినాఁడు. ఇప్పటికినిఁ గన్నులపండువుగ నీయనవిగ్రహము, అమరావతియందలి దేవాలయములోని గర్భగృహమున కెదురుగ నుండి, దేవదర్శనమునకు వచ్చువారల హృదయ మాకర్షించుచున్నది.

ఈయనప్రాభవ మింతింత యనరానట్టిది. ఈప్రభువుకాలమునాఁటికి విదర్భదేశ మంతయుఁ దురుష్కులచేతనుండి దాఁటి, పాశ్చాత్త్యులగు హూణుల (బ్రిటిషువారు) స్వాధీనమాయెను. వారివలన 'యిస్తిమిరాశి' నొంది, శ్రీ వేంకటాద్రినాయఁడు తన జమీని బరిపాలించినాఁడు. ఈపద్యము గాంచుఁడి —

"అష్టదుర్గాటవీహంవీర్రరతిపతి
　　చౌశీతిగజఘటాచక్రవర్తి
జన్నిగట్టడిగుత్త జట్టిమల్లుఁడు, మన్నె
　　హంవీర బిరుదు రాజాధిరాజ
బిరుదు, రాజాబహదరు మన్నె సుల్తాను,
　　సరు * దేశముఖమహాబిరుదు, రెడ్డి
కర్ణాటనృపరమాకమనుండు, గడిదుర్గ
　　గండరగండఁడు, కదనవిజయ
వీరశంకరబసవహంవీరమన్నె
రాయపరరాజభీకరరాజచంద్ర
బిరుదుఁడై వేంకటాద్రిభూవిభుఁ డశేష
జనులు జయవెట్టఁ బ్రాజ్యరాజ్యం బొనర్చె"

ఈ నృపాలశేఖరుం డొనర్చిన దానధర్మము లపమానములు. "లలితసాలగ్రామలక్షదుం" డగు నీరాజు సాక్షాత్తు "గోదాననృగరాజు" "ప్రతిచండికానవరాత్రవ్రతాయుత దంపతిపూజైక ధన్యమూర్తి" యును, "అఖిలపుణ్యస్థలాధ్వాన్న సత్రస్థాపి"యునై విలసిల్లినాఁ డీయన. ఒకానొకప్పు డీయన మత్స్యపురాణోక్తక్రమంబున హిరణ్యగర్భమహము గావించి, ఆధర్మ..వ్రక్కలుచేసి, అర్థులకుఁ బంచియిచ్చినాఁడు. ఈయన యీావి నెంతని కొనియాడఁగలరు?

"సరసులపాలిజీవనము, సంతత మర్థులకొంగుముల్లె, భా
స్వరకవిరాజి కుద్గమితపద్మనిధానము, మిత్రపాళికిన్
భరితవనూత్కరంబు, బుధపంక్తికి నిష్కటకల్పకంబు పో
స్థిరముగ వేంకటాద్రినరదేవశిఖామణియీావి; మాయురే!"

ఈప్రభూత్తమునిగుఱించి యెంత వర్ణించినను దనివి తీఱదు. ఇన్ని పలుకు లేల?

"సుమనస్తతి సుమనోబృం
దము; జాహ్నవి కృష్ణ; నందనము నందన; మ
య్యమరావతి అమరావతి;
అమరేంద్రుఁడు వేంకటాద్రియై యతఁ డలరెన్."

ఇట్లీరీతి నతులైశ్వర్యభోగంబులఁ దులఁదూఁగుచుండిన యీ నృపశేఖరున కనపత్యచింత యొకటి గాటముగ నలముకొనినది. కాఁబట్టి కొంతవడికి హితులగు తజ్ఞులతో నాలోచించి, తన పితృవ్యుల పౌత్రులగు జగన్నాథబాబు రామనాథబాబుగారలను వరుసగఁ దన పెద్దభార్యకును, ద్వితీయభార్యకును దత్తత నలవరించినాఁడు. మృడుని గజముఖుడవలె నీపుత్రద్వయము తనుఁజేరికొలువఁ బెద్దకాలము నీధరణి నేలి, తుదకు "అస్త్రచంద్రవసుసద్ధవ" హూణశకాబ్దమందు (1815 A D) నీయైహిక యాత్రఁ జాలించినాఁడు.

శ్రీవేంకటాద్రినాయనియనంతరము జ్యేష్ఠపుత్రుఁ డగు జగన్నాథబాబు న్యాయలబ్ధమగు సింహాసన మధిష్ఠించి, లోకరంజకముగఁ బాలింపసాగెను. ఇంతలో శ్రీవాసిరెడ్డిసంస్థానసౌభాగ్యాకాశమునందు దురదృష్టమేఘము లలముకొన నారంభించినవి. రాజుగారి సోదరుఁ డగు రామనాథబాబుహృదయసీమ నీర్ష్యానలము రగుల్కొనఁ జొచ్చినది. అన్నదమ్ముల కిరువురికిని విరోధము పుట్టించుట కిట్టితఱి యెప్పుడు

* 'సరు' అనునది ఇంగ్లీషులోని 'Sir' అను బిరుదమునకుఁ దెలుఁగు రూపము.

ప్రాప్తించునా యని కాచికొనియున్న దుర్మార్గులగు వారల కీయదను పండుగసమయ మయినది

ఇంకేమున్నది? ఇటువైపు కొందఱు, అటువైపు కొందఱు చేరి పురు లెక్కించినారు క్రోధానలము మెండైనది. ఏకరీతిగాం బెరింగి శాఖోపశాఖలుగా విస్తరిల్లియున్న వాసిరెడ్డివంశమహావృక్షమునం దిట్టి మాత్సర్యమను పురువు ప్రవేశించినతర్వాత, ఈమహాతరువు వ్రీలిపోవుటలో వింత యేమి? అభిమానధనులగు శ్రీరాజావాసిరెడ్డి వేంకటాద్రినాయఁడుగారి దత్తపుత్రు లిరువురు దమ తగాదా పరిష్కరింపు మని ఆంగ్లప్రభుత్వమువారియండఁ జేరినారు.

క్రమేణ, వ్యాజ్యపుగ్రంథము చిన్నచిన్న కోర్టులనుండి దాఁటి, పై మద్రాసుహైకోర్టుదాఁక నడచినది. క్రిందిన్యాయస్థానములలో గెలుపోటములు పరస్పరమయినను దుదకుఁ బ్రధానన్యాయస్థానమువారు జగన్నాథునికే జయలక్ష్మిని వశపఱచినారు అంతట మరల సింహాసనారూఢుఁడై జగన్నాథబాబు నిర్విచారముగఁ బ్రాభవము సల్పుట కారంభించి, తండ్రికిఁ దగినకొడు కనిపించుకొని, ౧౮౨౫-వ సంవత్సరమున నాకము సేరఁబోయెను

అన్న యిట్లు మృతినొందఁగానే, అపరిమితానందభరితుఁడై రామనాథబాబు సింహాసన మాక్రమించెను. కాని యెక్కువకాల మీయానంద మనుభవించుట విధి ఓర్వలేకపోయెను. పట్టుమని పది మాసము లాతఁడు రాజ్యపాలన మాచరించెనో లేదో, "లేటుజగన్నాథబాబు"గారి జ్యేష్ఠమహిషి, అచ్చమ్మగా రడ్డుదగిలి, మరల వ్యాజ్యము లోనికి దింపెను ఇట్లు వీ రిరువురు రచ్చలకెక్కి పోరాడుచుండ, ద్వితీయభార్యయగు రంగమ్మగారు వీరిద్దఱి నధఃకరించి, తన దత్తపుత్రుఁడగు లక్ష్మీపతినాయనికే రాజ్యము రావలయునని తాను గూఁడ బోరాటములోనికి దిగినది ఈవిధమున వీరు మువ్వురు ధనవ్యయ మెంతేని లెక్కసేయక, పరస్పరవిజిగీషువులై వాదోపవాదములు సల్పుచుండిరి

ఇది యిట్లుండ, ఈతగాదా పరిష్కరింపఁబడువఱకు సంస్థానము ప్రభుత్వమువారి 'తణిఖీ' క్రింద నుంపఁబడినది ఇందువలన సరియైన నాథుఁడులేమి, రాజ్య మరాజక మాయెను. జగన్నాథుని జీవితాంతమువఱకు, పేష్కస్తీలో నొక్కపైసయైనను బాకీపడని వాసిరెడ్డివారిసంస్థాన మాభూకాంతునన్తరము, క్రమేణ ఋణగ్రస్త మాయెను అయినవారసులు మువ్వురు కోర్టులంబట్టి తిరుగుచుండ, సంస్థాననియుక్తులును, పైపరామరికకై నియుక్తమైన ఉద్యోగిగణమును జేరి, యెవరిచేతి కందినరీతిగా వారు దోచుకొనుటలో నాశ్చర్యమేమి? ఏయేఁటి కిస్తీ, ఆయేఁడు చెల్లుఁబడికానందున, ప్రభుత్వమువారికి సంస్థాన మెంతయో బాకీపడెను.

"అయ్యోష బహుధాచరితం
-బయ్యెఁ బ్రభుత్వంబు, కుట్ర లనవరతము మెం
డయ్యెన్; మాంద్యగ్రస్తం
బయ్యెన్ దొరతనము; వెలితియయ్యెన్ బెట్టున్."

"ఆవాసిరెడ్డిరాష్ట్రము
పావిరి నక్కఱవువలన వైభవహీనం
బై వఱలె; నార్వశేయుని
చే వెసఁ బీల్వఁబడు తొంటిసింధువుమాడ్కిన్."

ఇట్లుండ, మూలుగునక్కపైఁ దాటికాయ పడువిధమున, దేశములో దుర్భిక్ష మొకటి సంప్రాప్తించెను దీనిచే విదర్భదేశమంతయు గగ్గోలువడి, నీరస మయిపోయెను వివిధసంస్థానప్రభువులు 'జేబిరాకు' నందిరి. ఎల్లయెడల నాంగ్లప్రభుత్వమువారికిఁ జెల్లవలసిన పేష్కస్తీ లట్టె నిలువఁబడిపోయినవి.

ఇట్టి విషమపరిస్థితులలోనే, ౧౮౩౧-వ సంవత్సరము మార్చినెలలో హైకోర్టువారు వాసిరెడ్డివారి దావాను బరిష్కరించివైచిరి. అదృష్ట వశమున రామనాథునికి మరల ప్రాభవము సల్పుభాగ్య మబ్బినది కాని యీపర్యాయ మాతఁడు రాజైనను గాకున్నను నొకటియే యయ్యెను. ఏలయన నీతడవ నీయన పేరునకుమాత్రమే రాజు. ప్రభుత్వమువారి బాకీ చెల్లుబడియగుపర్యంతము ౧౨౦౦ రూపాయల మాసభృతిఁ గైకొనుచు నీయనకు ప్రభుత్వమువారి నియుక్తునిభాతి రాజ్యము సేయవలసివచ్చినది

ఎట్లయినను రాజ్యమనునది లభించెఁగదా యని సంతోషించి, రాజ్యపాలనము సాగించుచుండ, పితూరీకాం డ్రూరకుండలేకపోయిరి. రామనాథునిమీఁద లేనిపోని నేరములు గల్పించి గవర్నమెంటున కెఱుకపఱచిరి దీనినిఁ గాంచి, సకలవిషయములు కూలంకషముగ విమర్శించి, యేయేసంస్థాన మెంతెంత చెల్లింపవలసియున్నదో అరసి నిర్ణయించుటకుఁగాను, సర్కారువారొకవిచారణసంఘమును వాల్టర్ ఇలియాట్ (Walter Elliot) అనునాతని నాయకత్వముక్రింద నేర్పాటుచేసి పంపిరి అంత నాకమిటీ వచ్చి, విచారించినట్లు విచారించి, పేష్కస్తీ యేమాత్రము చెల్ల నేరదనియు, సర్కారువారు సంస్థానములను దమక్రిందికిఁ దీసికొనుటయే మే లనియు, వాసిరెడ్డివారికుటుంబమున కొకలక్షరూప్యముల లవణసు (allowance) నేర్పాటుచేయవలయు ననియు రిపోర్టుచేసినది

ఆహా! ఎంతో సంభవించినది! తరతరములుగ వచ్చుచుండిన వాసిరెడ్డివారి ప్రాభవము, శ్రీరాజా వాసిరెడ్డివేంకటాద్రినాయఁడుబహద్దర్ మన్నె సుల్తాను ప్రభువువారు సల్పిన దశశతగ్రామాధిపత్యము, కుంటెనకాండ్రమూలమునఁ బరప్రభుత్వముపాలైపోయినది. సంస్థానమంతయు గవర్నమెంటులోఁ గలసిపోయి, రామనాథప్రభృతులకు, సర్కారుదయానుసారముగ జీవనభృతి యేర్పడినది చేయునది లేక, వారివారి "లవణసు"లఁ బుచ్చికొనుచు వాసిరెడ్డివంగడమువారు కాలక్షేపము సేయుచుండిరి.

ఆనాఁడు హైకోర్టువారు, తన పుత్రునిదత్తత రద్దొనర్చి, రాజ్యము రామనాథున కిచ్చినందులకై రంగమ్మ, ఊరకుండలేక ప్రీవీ కౌన్సిలునం దప్పీ లొనర్చినది. అది అచ్చట ననేకవర్షములుగాఁ బడి యుండి, తుదకు ౧౮౮౭-వ సంవత్సరమున విచారణకై గ్రహింపఁబడి నది. ౧౮౮౮-వ సంవత్సరము మార్చినెలలోఁ దైవారితీర్మానము భారత దేశమునకు వచ్చి రంగమ్మకు జయ మొసంగినది రామనాథుఁడు హక్కుదారు కాఁ డనియు, జగన్నాథబాబున కనంతరి మాతని దత్తపుత్రుఁడని నిశ్చయింపఁబడిన శ్రీలక్ష్మీపతినాయఁడే నిజమగు నధి కారి యనియు నట తీర్మానించిరి.

దీని ననుసరించి, అంతపర్యంతము రామనాథునకుఁ జెందు చుండిన వేయిరూపాయల మాసభృతి, లక్ష్మీపతినాయని కేర్పాటు చేసిరి మద్రాసుప్రభుత్వమువారు. లక్ష్మీపతినాయఁడు నంతటితోఁ దృప్తి నొందక, తమసంస్థానము దమకు వచ్చునట్లు చేయవలసిన దని పార్లమెంటువారికి విజ్ఞాపన మంపికొని, రాజ్యము లేకపోయినతర్వాత నెచ్చట నుండిననేమియని, సపరివారముగ స్వదేశము విడిచివచ్చి, చోళ మండలాంతర్గతకాంచీపురమునం దేకామ్రనాథుని సన్నిధిని, రాణదలి ర్చునట్లు గౌరవప్రదముగఁ గాలము గడపసాగెను. తన రాజ్యము పోయినను, రాచఱికమమాత్రము పోనీక, అనేకదానధర్మాదిసత్కా ర్యము లాచరించి, వంశగౌరవము నిలువఁబెట్టినాఁడు.

ఈభూజానికి, లక్ష్మీనృసింహనాయఁడు జన్మించి, తండ్రిని మించిన కొడు కాయెను. తండ్రిగారివలెనే, యీయనగూడ నేకామ్ర నాథుని కనేకవిధములఁ గైంకర్యము నడపినాఁడు ఈయనయే ఈ కృతిభర్త. జనకునివలెఁ బార్లమెంటువారి కీయనయు నొక విన్నప పత్ర మంపినాఁడు కాని, ఫలిత మొక్కటియు రాయెనది. ఈయనకోరిక ప్రకార మీవాసిరెడ్డీయమును రామకవి ౧౮౯౧-వ సంవత్సరమున విర చించినాఁడు.

> "సితకరనిధికరిశశిశ
> రితహాయనాబ్దమున వాసిరెడ్డీయాఖ్యం
> చిత మేతద్వ్యవహారచ
> రితము నృసింహవిభు నాజ్ఞఁ గృతిసేయఁదగన్"

## ప్రభుత్వమువారి న్యాయదృష్టి

ఈ గ్రంథములో కవి తత్తత్సందర్భానుసారముగ బ్రిటిషు వారిని, వారి ప్రభుత్వమును వేనోళ్ళఁ బొగడి, తన రాజభక్తియంతయుఁ జూపియున్నను, మొత్తమమీఁద నీవాసిరెడ్డివారి సంస్థానమునకు ప్రభు త్వమువారు సల్పిన యనాదరణమును వెల్లడించివైచినాఁడు అనేక లక్షలఖరీదుసేయు వాసిరెడ్డిసంస్థానము నేకొలఁది వెలకో తీసికొనవెంచి, ఈప్రభుత్వమువా రితరదేశాధీశుల నీనేలకు వెలవెట్టకుండ నాటంక పఱచిరి.

> "అందు వాసిరెడ్డి వయిన యెస్టేట్ల 'నా
> బాది' యయినపిదప వారసుల కొ
> సంగదలఁచి యిపుడు సర్కారున నసూదు
> పఱతు మెవరు విలువ పాడవలదు"
>
> "అని జట్టికాండ్ర కాడ్గరు
> దనరిచి కృష్ణోభయోరుతటకనదుపవ
> ర్తనము లైదైదువేలకుఁ
> గొనిరి ఖరీదులు ఘటించి కుతలాధ్యక్షుల్"

ఇఁక వీరి యనునయము చూడుఁడు!

> ". చిరకాల పౌర్విర్కార్జితరాజ్యము నశించె
> 　గద నేటితో నని మది వగవకుఁ
> డిదె బాకిపడు కప్ప మెల్లఁ దీరినతోన
> 　మీ పరిబ్రహిమంబు మీకు నిత్తు
> మని "యినాయితునామాలఁ" బనిచి మరల
> వారిసుల కీయఁదలఁచి సర్కారుక్రిందఁ
> జేర్చు చున్నారము బకాయ నెల్లుదరుక
> నెవ్వ రీరయాస్తి నెలఁబాడ నెసఁగదనుచు"
>
> "పాటలుపెట్టవచ్చిన నృపాలురఁ బాటలు నెట్టకుండ నే
> ర్పా టొనరించి, యింత సులభక్రయమే మనకుండ మందికొ
> మాట కిరారొనర్చి పెస మాబహుకోట్ల ఖరీదు సేయు నె
> స్టేటు బాకయైనువేలు వెలఁజేసి దివాణ మనూరె నేకొనెన్"

విచారణసంఘమునకు నాయకుఁడుగావచ్చిన వాల్టరు ఈలి యట్ దొర చెప్పినవిధానమైనను అమలునకు రాకపోయెను ఆయన వాసిరెడ్డివారి వంగడమునకు మొత్తముమీఁద నొకలక్షరూపాయలు 'లవణసు' నీవచ్చునని అభిప్రాయపడిరిగదా! ఇంచులకు బదులుగాఁ గొన్ని వేలరూప్యములు భృతిగా నేర్పడినవి.

ఎట్టిసంస్థానమున కెట్టిదశ పట్టినది! ఆహా! "...ఏమల, కుల పైచిల్లి, నేమ్కసై, దశశతగ్రామ లీల ప్రాభవం, బలరారించిన మేటికిక్ లవణ సాహో! వేయురూపాయలా?" అని పాపము రామ నాథబాబు కన్నీరు పెట్టుకొన్నాఁడట!

## గ్రంథరచనావిధానము

ఈవాసిరెడ్డీయములోని కవిత్వమునకును, మిగిలిన పుస్తకముల లోని కవితారీతికిని గొంచెము భేదము గలదు. ఈ కృతిలోఁగూడను బ్రథమాశ్వాస మంతయుఁ బ్రబంధములఫక్కినే రచింపఁబడియున్నది. ద్వితీయాశ్వాసముమాత్ర మట్లు గాదు

'సహజముగా రామకవిగారిది కొంచెము క్లిష్టమయిన కవి త్వము. కొన్ని చోట్ల నన్వయకారిన్యముగూడ సంభవించుచున్నది.

ప్రథమాశ్వాస మంతయు శుద్ధము గ్రాంథికపదనిబద్ధ మయి అలరుచున్నది. పెక్కుచోట్ల నలంకారములు, కల్పనాచతురిమ గను పట్టుచున్నవి ఇందులోని విషయమంతయు వంశావళియొక్క వర్ణన మే కాన, కవి తన పోకడల నిట నిర్వహించుట కవ్యంతర మేమియు లేకపోయినది. మెండుగ నర్థాలంకారములు రచించుట యం దీయన కమితప్రీతి ఒక్కొక్క రాజుయొక్క చరిత్రము వర్ణించు సందర్భమునఁ బెద్దనాది సుప్రసిద్ధలాక్షణికకవుల పోకడల నీయన చాలభాగ మనుసరించినాఁడు ఈయనకవిత్వములో నెట్టి యనర్గళమయిన ధార కలదో అచ్చటచ్చట సందర్భానుసారముగ నే నెత్తివ్రాసిన పద్యములే తెలియఁజేయఁగలవు

మహాకవుల గ్రంథములందుఁగల పద్యముల మనమునం దుంచు కొని, ఆమాదిరి పద్యముల రచించుచు యనిన యీ కవికి నెక్కువ యిష్టము నిదర్శనమున కీక్రిందిపద్యముఁ జూపుఁడు ——

"ఆగతాభోగభోగానుభవంబున
నేరాజు స్వారాజు నేవగించు;
నశ్రాంతవిశ్రాణనశ్రీధురీణత
నేఘనుం డాఘను నెగ్గులాడు;
దృఢభుజోర్జితేజితతేజఃపరంపర
నేయినుం డాయిను నేవగించు;
సంధానుసంధానబంధురాభివచ్ఛక్తి
నేనరుం డానరు నీసడించు;

ఆ వె నతఁడు బలాఘురోన్మదాత్యంతపరిపంథి
గంధసింధురౌఘసింహసారరి
నెలయు వాసిరెడ్డి వేంకటలక్ష్మీనృ
సింహనాయఁ డధిపశేఖరుండు"

ఇట్లనేకములు సూపవచ్చును

ఈయనకుఁ గల అలంకారప్రియత్వ మొకప్పు డతిమాత్రమై, అన్వయకాఠిన్యములోనికి దింపుచున్నది. అలంకారములలోఁగూడ శ్లేషగర్భితమయిన దీయన కెక్కువ నచ్చును ఇది దిఙ్మాత్రముగ సూచింతును ఈక్రిందిపద్యములోని శ్లేషఁ గాంచుఁడు ——

"కరియే యసీమసంగతి? తలవడఁకుఁ డొం
దియును మాతంగికాప్తి విడఁడయ్యో
హరియేమి శ్రుత్యనుకరుఁడు? వృద్ధుం డయ్యు
నెవ భుజంగీసక్తి వదలఁడయ్యో

కిరియే, అపంకసంచరుఁడు? ముదుకం డయ్యుఁ
బారదారికవృత్తిఁ బాయఁడయ్యో
గిరియే యమహాటి? దుస్తరవయఃక్రముఁ డయ్యు,
మఱి రంకువర్తన * మానఁడయ్యో

ననుచుఁ గరిహరికిరిగిరులను హసించి
పృథివి, వేడ్క నవారణవిభు నశేష
భోగి యక్షయసౌకర్యపూర్ణుఁ డవన
మద్రి యగు వేంకటాద్రిప్రభుని వరించె"

ఒక్కపద్యములో నెన్నియలంకారములు! శ్లేష, విరోధము, క్రమము మొదలైన వన్నియు నిం దిమిడియున్నవి

ఇట్లెన్నియేని గనిపించుచున్నవి పారిజాతాపహరణములోని నృసింహస్తుతిపరమగు పద్యమును మనమునం దిడుకొని, యీరామ కవి యెట్లు ప్రతిబింబమును గల్పించినాఁడో గమనింపుఁడు

"సాంద్రప్రదోషసంజాతుం డగుటఁజేసి,
పుణ్యోదయక్రమంబు వెలయింప
జన్మప్రదేశనాశకుఁ డయి పుట్టుట,
జన్మభూములకు స్వాస్థ్యంబు నెఱపఁ
బౌరుషంబు కొంతఁబడి ప్రవర్తిల్లుటఁ
బరిపూర్ణపౌరుషస్ఫురణ నెగడ
శస్త్రచాతురి నరిజయ మొందఁజాలమి,
శాస్త్రచాతురి నరిజయము నొందఁ
గోరి తొల్లింటఁ దినకైవ కొంతలెల్లఁ
బాపుకొనఁ బూని లోకసంభావ్యలీల
నవతరించు నృసింహుఁ డొనరఁగ మించె
వాసిరెడ్డినృసింహభూపాలకుండు"

ఈకవికిఁ గల్పనలోన్న విశేషప్రేమ ఉత్ప్రేక్ష, అత్యుక్తి మొదలగు నలంకారము లీయనసొమ్ము ఒకపట్టున,లక్ష్మీనృసింహనాయని పరాక్రమము వర్ణించుచుఁ గవి యిట్లుత్ప్రేక్షించుచున్నాఁడు.——

"స్థిరసారంబగు లక్ష్యమేతు, నిదియే చిత్రక్రమంబంచు నం
బరదూరస్థితలక్ష్యయంత్రము నభోవార్ధిస్ఫురత్బింబని
ర్భరదృష్టిం దునుమాడఁజూచి ఘుషయ ంత్రచ్ఛేదిపార్థుండె క్ర
మ్మఱ లక్ష్మీపతినాయఁడై పొడమె పో మ్మనందు రుర్వీజనుల్."

ఇట్లు రచనావిధానమునందే కాక, విషయప్రతిపాదనము నందునుగూడఁ బ్రాచీనకవుల ననుకరించినాఁడు అన్నగారిపై జరిపిన

* రంకువర్తన——ఇది సంస్కృత సమాసము. రంకు అనఁగా నొకవిధమగు ఇఱ్ఱి అట్టిదానియొక్క - సంచారము కలిగియుండుట అని యొక అర్థమును, రంకువర్తనమన వ్యభిచార మనియు నీరెం డర్థములు కవ్యభిప్రేతములుగాఁ దోఁచుచున్నవి. కాని రెండవఅర్థమున శకటరేఫము కాని సాధురేఫము కాదు.

వ్యాజ్యములో మొదటఁ దనకుఁ బరాభవము కల్గినప్పుడు రామనాథ బాబు చేసిన ప్రసంగము భారతములోని

" దేవతల కైన నొక్కొక
వో వలయున కాదె శత్రునూదనవిధికా
లావాప్తికి మును దమ స
ద్భావములనడంచియుండుగఁబడియుండుటయున్ "

విరాటపర్వము ప్రథమ-౬౩ ప

మొదలగు నీతిబోధకపద్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది వీలుకలిగి నప్పు డెల్లఁ గవి నీతిబోధక మయినట్టివియు, జ్ఞానదాయక మయి నట్టివియుఁ నగుప్రసంగముల రచించియున్నాఁడు

ఇట్లీ ప్రథమాశ్వాసమంతయు నర్థాలంకారములతోను, ముక్తపద గ్రస్తము, అనుప్రాసము, యమకము మున్నగు శబ్దాలంకారములతోను శోభిల్లుచున్నది. ద్వితీయాశ్వాస మన్ననో అట్లు కాదు. దీనికిఁ గారణము, తత్ప్రతిపాద్యమానవిషయ భేదమే ద్వితీయాశ్వాసమంతయు సంపూర్ణముగ వ్యవహారకాండను గుజించిన దైయున్నది వ్యాజ్యము లాడుట, గెలుపోటములు, దుఃఖవిచారములు - ఇత్యాదివిషయములనే కవి యిందు వర్ణించియున్నాఁడు.

ఇట్లు న్యాయస్థానములయందలి వ్యవహారాదివిషయములు వర్ణింపఁబడియుండుటచే నీభాగమంతయు, వ్యావహారికపదసంకలితమై యొప్పుచున్నది న్యాయశాస్త్రమునం దుపయోగింపఁబడు పారిభాషిక పదములు, వాని వికృతులు పలురీతుల వాడఁబడియున్నవి ఇంగుచే నిది యంతయు విలక్షణముగనున్నది. కలక్టరు, కోర్టు, బోర్డుమెంబరు, ఆన్సరు, లా, సమను, ఇంటర్, ఉయల్, నోటీసు మున్నగు నాంగ్లభాషావ్యావహారికపదములును, మురాఫా, కిస్తీ, దఖల్, గరీబు నూరత్-ఇత్యాది హిందూస్థానీశబ్దములును, పెక్కుచోట్ల నీకవి ప్రయోగించియున్నాఁడు. ఇదిగాక నొకటిరెండుచోట్ల 'సంబడము' 'పడితరములు' మొదలగు ద్రావిడపదములు గూడఁ గాన్పించుచున్నవి.

కొన్ని విలక్షణములైన ప్రయోగములు గన్పించుచున్నవి కొన్నిచోట్లఁ గర్త్రర్థమునందుఁ గర్మణిప్రయోగము, లౌకికవ్యవహారములోనిది, యీ ఆశ్వాసములోనికిం జొరఁబడినది. 'వారు తీర్మానించిరి' అనుటకు, 'వారు తీర్మానింపఁబడిరి' అనియు, 'సమనువచ్చిన' దనుటకు 'సమను రాఁబడినది' అనియుఁ గొన్ని అనిష్టప్రయోగము లేలకో యిందుఁ గానవచ్చుచున్నవి

కొన్నిచోట్ల, 'మాలుకానిపని', 'బిట్టధారిటి' ఇత్యాదివిలక్షణ భూతపదసంయోగములు దృశ్యమానము లగుచున్నవి లేఖకప్రమాద జనితదోషములేమోకాని కొన్ని స్ఖాలిత్యము లొకటిరెండుచోట్లఁ గంట బడుచున్నవి —"అవశ్యముకర్త్రిణి", "నాయకి" ఇత్యాదులు. "నఃకా" అనుసూత్రము వైకల్పికముగాఁ బరిగ్రహించికాఁబోలు, కొన్నియెడల నుగాగమరహితముగానే, "సాలును,", "గడువును" మున్నగు వానినిఁ బ్రయోగించినాఁడీకవి

" ప్రమాదో ధీమతామపి " అన్నట్లు పొరఁబాటు లేరికైనను రాకమానవుగదా! దీనిమాట కేమిగాని, గ్రంథము మిక్కిలి చక్కఁగా రచింపఁబడియున్నది కవితాధార అనర్గళ మయి ప్రవహించు చున్నది

ఈవాసిరెడ్డియమువలనఁ బ్రకృతము కమ్మకులచరిత్ర రచింపఁబూని [illegible] లేదు కొలఁదికాలములోనే యీగ్రంథము ముద్రింపఁబడవచ్చు నని నా నమ్మిక.

---

# వాసిరెడ్డి వంశావళి

(కవిగారు వర్ణించినట్లు వాసిరెడ్డి వారి వంశవృక్షము నిటం బొందుపరచుచున్నాము)




(1) నేతిపద్మనాభమను నీ చినపద్మనాభశౌరికి సంతతి లేనందున, ఆయన ఆస్తియంతయు చినరామలింగమునకు చెందినది.

(2) వేంకటాద్రినాయఁడుగారి పినతండ్రి పౌత్రుఁడగు జగన్నాథబాబు మొదట దత్తపుత్రుఁడుగా గ్రహింపఁబడెను.

(3) పైవారి పెదతండ్రికొడుకగు రామనాథబాబు వేంకటాద్రినాయని ద్వితీయపుత్రుఁ డాయెను ఇందులకు వారల పరస్పరవయోభేదమే కారణము.

# దశావతారపద్యములు - శ్రీ కృష్ణదేవరాయలు

గర్భాం అప్పారావు గారు, B. A., B. Ed.,

ఈ వ్యాసము యొక్క ప్రధానోద్దేశము శ్రీకృష్ణదేవరాయలచే రచింపఁబడిన ఆముక్తమాల్యదలోని దశావతారపద్యముల ప్రాశస్త్యమును జూపుట అయిన నందులకై కడంగుటకు మున్న ఆముక్తమాల్యద ప్రశంస చేయుట మేలు.

ఆంధ్రభోజుండని సుప్రసిద్ధిని గాంచిన శ్రీ కృష్ణదేవరాయలు విష్ణుచిత్తీయమను నామాంతరము గల యీ ఆముక్తమాల్యదకు కర్త సంస్కృతమున ననేకగ్రంథముల రచించి పెద్దనాద్యాంధ్రకవులఁ బోషించి యాంధ్రభాషను దా నొకగ్రంథమును రచించిన యీరాజకవి ఋణము మన మెట్లు తీర్చుకొనఁగలమో తెలియదు

ఈ యాముక్తమాల్యద యాంధ్రమహాకావ్యములలో నగ్రేసరమని గణింపఁబడినది. ఇందు గమనింపవలసిన నూతనాంశము సజీవపాత్రవర్ణన ఆయాయి ప్రకరణముల కనుగుణముగా పాత్రల శీలమును గుణదోషములను బ్రకృతి కనుగుణముగా వర్ణించు షేక్స్పియరు మున్నగు నాంగ్లేయకవులవంటి యాంధ్రకవుల కొందఱిలో నీతఁ డొకఁడు పాత్రపోషణము, రసౌచిత్యము, భావౌచిత్యమును జూపి కవి యిందుఁ దన నిరంకుశస్వాతంత్ర్యమును జూపియున్నాఁడు ఆంధ్రవాఙ్మయ ప్రౌఢప్రబంధములలో దీని కిదియె సాటి ఈగ్రంథరాజము పాషాణసదృశమై నారికేళపాకమున నొప్పుచున్నది పాకమన నర్థగాంభీర్యము.- "అర్థగంభీరిమా పాకః" (విద్యానాథుఁడు). ఇయ్యది రెండువిధములు ద్రాక్షాపాకము, నారికేళపాకము అందు హృదయంగమ మగునది ద్రాక్షాపాకము; తద్విపర్యయము నారికేళము ఈగ్రంథమునం దేభాగము చదివిన నీక్లిష్టపాకము గన్పట్టును ఇందులకు దృష్టాంతముగా నొక్కపద్య ముదాహరించెదను —

"లలితోద్యానపరంపరాషికశుకాలాపప్రతిధ్వానము
ల్వాలభీనీలహరిన్మణీపికశుకస్వానభ్రమం బూన్ప మి
న్నులతో రాయు సువర్ణసౌధముల నెందుం జూడఁ జెన్నొందు శ్రీ
విలుబుత్తూరు సెలంగుఁ బాండ్యనగరోర్వీరత్నసీమంతమై"

౧ ఆ. ౫౧.

ఇంతటి కఠినపాకమునకుఁ గారణము కఠినములు, నపూర్వములు నగు పదములఁ బ్రయోగించుట. అందు దేశీయపదప్రయోగము ప్రధానము. 'పాదూవాహ, కలంబ, ఏధన' మున్నగు నసామాన్య సంస్కృతపదములతోడను, 'ఉలియ, వింగడము, సన్నగాళ' మొదలగు దేశీయపదములతోడను నిండియున్నది అలంకారకాఠిన్యము, నవీనవర్ణనాంశములు, వర్ణనాగాంభీర్యము, కవియొక్క దూరాలోచనములగు నుద్దేశములు నీయర్థగాంభీర్యమునకుఁ దోడ్పడుచున్నవి. కవి తన సమకాలీనులనుగాని, తనకు ముందువారినిగాని వర్ణనాంశముల ననుకరింపక స్వతంత్రమార్గ మవలంబించుటచేఁ జదువరుల కీనూతనమార్గము దుర్గమ మైయున్నది

శైలి ఓజోగుణలక్షణముల నలరారుచున్నది అనఁగా దీర్ఘసమాసముల నిండియున్నది ఉదాహరణము —

"కాంచె న్వైష్ణవుఁ డర్ధయోజనజటాఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాటచరన్మరుత్రయదవీయఃప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృతవ్రణచ్ఛలనలిప్యాపాదితాధ్వన్యని
స్సంచారార్తమహోఘలోపమఘలస్ఫాయద్వటక్ష్మాజమున్."

౬-౧౫.

సంస్కృతపదబాహుళ్యమే కాక సంస్కృతపద కాఠిన్యము కూడఁ గొన్నియెడలఁ జూపట్టుచున్నది

"అర్థాంభోబ్ధియుగ మ్మహోవచనకవ్యాహార మాహోవచ
స్సిద్ధ మ్మాఃకృతతాం గతః కలిరితి శ్రీసూక్తివిద్యాధర
మ్సిద్ధౌద్ధత్య మగాల్లయం హి కుధియా మిత్థం వదత్కృష్ణర
మ్యర్ధిరాడ్గ్రణిగెల్పుటుత్సవమునం దయ్యె న్నభ మ్మంతయున్."

౪-౬౧.

పద్యములు సులభసాధ్యములు కాకపోవుటచేతను, కథ మత విషయక మగుటచేతను దీనిఁ బఠింపఁగోరువా రరుదు. ఇందలి పద్యములు కఠినపదభూయిష్ఠములై యెంత శ్రుతికటువులై యుండినను ఓపికగలిగి పైకఠినపదార్థము భేదింపఁగలుగు చదువరుల కంతరార్థము గన్పట్టునపుడు కలుగు నానందము వర్ణనాతీతము. అచ్చటచ్చట సరళసరణియు సౌకుమార్యమును గల పద్యములు సయితము స్వభావానుగుణముగాఁ జెప్పఁబడకపోలేదు.

# తిరువాంకూరు చిత్రములు







1. అనంతపద్మనాభాలయద్వారము
2. వస్తుప్రదర్శనశాల
3. పురమందిరము
4. కోట, సింహద్వారము
5. పద్మతీర్థము, అనంతపద్మనాభాలయము







హిజ్ హైనెస్ శ్రీ పద్మనాభదాస వాంచిపాల రామవర్మ
కులశేఖర కిరీటపతి మన్నె సుల్తాన్ మహారాజరాజ రామరాజ బహదూర్ షంషేర్‌జంగ్
తిరువాంకూరు మహారాజుగారు — జననము 7-11-1912, పట్టాభిషేకము 6-11-1931.



తిరువాంకూరు మహారాజుగారు, వారితల్లియు, సోదరియు, సోదరుడును

"వాతెఱ తొంటికై వడి మాటలాడదు
కుటిలవృత్తి వహించెఁ గుంతలంబు
లక్షులు సిరులు రా నఱచూడ్కిఁ గనుఁగొనె
నాడించె బొమ గొని యాననంబు
పసగొను ల్నిగయ వక్షము పేతుఁ గడకొత్తెఁ
బాణిపాదము లెఱ్ఱవాఱఁదొడఁగె
సారెకు మధ్యంబు దారిద్ర్యములు చెప్పె
నొచ్చొర్వ కిటు లోఁగఁజొచ్చె మేను
వట్టి గాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె
నాభి నానాఁటి కీగతి నాటి పొందు
చవుకయైనట్టి యిచ్చటఁ జనదు నిలువ
ననుచు జాఱెనకరణి బాల్యంబు జాఱె" (౫-౭)

పైపద్యమునందలి పదములు మృదుమధురములై శృంగారరసమును బోషించుచున్నవి. బాల్యము జాఱుటకు హేతువులు చమత్కారముగాఁ బడినవి.

" సెలవులు నాకుచు వెలియరుంగులు సూడ
కరిగి పాదూవాహు నరయువారు
తమ్రమోల నుండునందలము గానక దాఁటి
పేరెలెంగున బెస్తఁ జీరువారు
నగరు వెల్వడుదాఁకఁ దెగిపోయి మఱి నిల్చి
తోడివిద్వాంసులఁ గూడువారు
నెదు రైన తమవాని గృహకృత్య మడిగి వాఁ
డనువని తప్ప నూఁకొనెడివారు
వాద మే మాయె నన్న భూవరునిపకు
పాత మాదాసరికిఁ గల్గి బ్రతికె ననెడు
వారు నౌ లెం డిటు విమర్శదూర మైన
వాకిట వసించు నెవ్వఁ డన్వారు నగుచు. (౮-౭)

పైపద్యము హాస్యరసమును బోషించుచుఁ గవియొక్క పరహృదయ భావజ్ఞత వెల్లడిచేయుచున్నది మొత్తముపై నీప్రబంధమందుఁగల పద్యము లతికఠినములై యుంటచే మనువసుచరిత్రాదికావ్యములవలెఁ గాక యందఱచేఁ బఠింపఁబడకున్నది జనసముదాయమునకుఁ దగినది కాకపోవుటచే దీని యుత్కృష్టతకు లోపం బేమియు లేదు.

ఆంధ్రభాషాజ్ఞానము కొంచెమైనఁ గలుగు ప్రతిమనుజుఁడును దైవభక్తిచేనైన నిందలి దశావతారపద్యములు చదివి గ్రంథప్రాశస్త్య మెఱిఁగి తద్గ్రంథపఠనకుఁ బ్రయత్నింతు రనునమ్మకముతో నిం దాపద్యములఁ బొందుపఱచుచున్నాఁడను. ఈ పద్యము లన్నియు నలంకారభూయిష్ఠము లై యున్నవి. భావములును గల్పనలును అతిదూ రానీతములు.





"దివిజద్వేషి నుదారవారిచరమూర్తిం ద్రుంచి చాతుర్య మొ
ప్ప వడిం జౌకపుఁదెల్ల కౌచుగమిదంభం బొంద మైఁ దాల్చి వే
దవిశుద్ధాక్షరపఙ్క్తిఁ గ్రమ్మఱఁగ వేధం జేర్చెదో నాఁగఁ ద
ద్భువనం బద్ధిసితాంబుబిందు లలమం బ్రోద్యద్రుచిన్ దాఁటవే".
(౮-౧౭)

ఆంగ్లేయకవిశిఖామణి షేక్స్పియరు రచించిన

"The poet's eye, in a fine freuzy rolling,
Doth glance from heaven to earth, from earth to heaven;
And as imagination bodies forth
The forms of things unknown, the poet's pen
Turns them to shapes and gives to airy nothing
A local habitation and a name."

అనువాక్యములు కవిసముదాయమునుగూర్చి చెప్పెనో లేక యీకవినుద్దేశించి చెప్పెనో యనుసంశయము పుట్టించున ట్లీపద్య మున్నది పాతాళమును సత్యలోకముతో ముడిపెట్టి పాఠకుల బుద్ధి నిటునటు నాడించుచున్నాఁడు అలంకారము కైతవాపహ్నుత్యనుప్రాణితోత్ప్రేక్ష.

"ఎలమి యుగాంతవారి కెదురెక్కుతఱిన్ వడిఁ దాలుగహ్వరం
బులఁ జనునీటివెల్లిబడిఁ బోవుసపక్షనగోరువాశ్చరం
బులు దనుఁ దాఁకఁ దద్గతత మ్రోయునజాండమ దైత్యవేదప
ఙ్క్తులు గొని కూల్చినట్టిజయదుందుభిఁ జేసితికా మురాంతకా."

ఇట ఱ్ఱొత్తనీటి కెదురేగు చేఁపల స్వభావవర్ణన చేయుచు మహామీనము ధరించిన బ్రహ్మాండమును దగిలిన పర్వతములవలనఁ గలిగిన శబ్దము జయభేరినిగాఁ జెప్పియున్నాఁడు ఈజయభేరీనాద భావము సార్వభౌముఁడగు కవియే యెఱుంగవలయును.

"మితి గడవం దిమింగిలత మెయ్యెమ్మయి పెంచిన నీదువాతఁ గు
త్సితషలలాశి యైనచిఱుఁజేఁ పది ద్రెళ్లుట నీవు మ్రింగుటే?
శ్రుతు లగునూరుపు ల్మగుడఁ జొచ్చుతఱి న్భవదేధనైధనై
ధితజవశక్తి నీడ్చుకొని తెచ్చుట కాక తదల్పతాల్పతన్."

ఇందు ఫలాపేక్షతో దేహాభిమను లై కర్మఫలత్యాగముచేయని వారు, జన్మాంతరములందు ఆఫలములన పొందుచున్నారు-అను గీతా వాక్యము స్ఫురించుచున్నది. సోమకుఁడు అప్రయత్నముగా తాను జేసిన పాపకర్మఫలమును బొందుచున్నాఁడు.

"అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్."
గీతా-౧౮-౧౨.

"జలప్రారబ్ధ వమానమృణ్మయమహీసంరక్షకై గారయీ
బలె ముక్తామణి శుక్తి శంఖనికురుంబం బెల్లఁ బూర్ణంబుగా
బలభిద్వజ్రసదృఙ్నిజోపరిపరిభ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టి ఘరట్టమైన కమఠస్వామి న్మనం గొల్చెదన్."

ఇందలి భావము మథింపఁబడిన సముద్రమువలె నతిగభీరమై యున్నది. పద్యమును దఱచినకొలఁది లోకానందకరమగు పదార్థములు వెల్వడును. బుద్ధిని పొడిగించి లోఁతుగాఁ బంపినఁగాని 'ఘరట్ట' మైన కమఠస్వామిని సందర్శింప సంభవింపదు

"ఒకమఱి బుడ్డగింప విలమోదకము ల్పయి కుబ్బి చిప్ప ద్ర
చ్చుకొని మహోర్భవీథిఁ జన నూకరత స్మయి వెంచి వెండి క్రిం
దికిఁ గయి వ్రాలు తత్సలిల నిర్మలధార నదఃపరస్ఫుర
త్ప్రకృతికి నీయజాండమును బంగరుముంగరఁగా నొనర్పవే"

ఇం దగమ్యగోచర మగు ప్రకృతి కొకరూపము కలిగించి బ్రహ్మాండము నొకసామాన్యనాసాభరణముగ నొనరించి యుదకధార యను కాఁడచే నదికి లీలావిగ్రహస్వరూపుఁడగు దేవుని ప్రభావమును దృగ్గోచరము చేసి కవి తన శేముషీప్రభావమును వెల్లడిచేయుచున్నాఁడు.

"అసురేంద్రాశయకుండి కాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టక్ దదుద్దామదీ
ర్ఘసటాఝాటముఁ బెల్లగించుగతి నాంత్రశ్రేణిఁ గిన్కం బెరం
జుసితక్రూరభవన్నఖావళుల ప్రోచు న్నృత్యపంచాననా."

"మునుము న్దెల్పునుదూఱఁ దూఱుమఱి కెంపు స్వెండియుం దూఱఁ గం
దనగాయం గల నల్పుఁ దోఁప నఖకోణశ్రేణిచే విక్రమం
బునవాఁ డుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీ తేజముం
గొనులీల న్విదళింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ"

"బలిదైతేయభయాంధకారభరితబ్రహ్మాండగేహంబులోఁ
పలఁ బైమం డెడుతత్ప్రితాపమయదీపజ్వాల డింద గ్గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయు నుద్యత్తన్మహాచ్ఛాయనాఁ
గలనీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా"

కవి మరలఁ దనకుఁ బ్రియమగు నుత్ప్రేక్షాలంకారమును మొదటి పద్యమున భ్రాంతిమదనుప్రాణితము చేసి తిర్యగ్జంతుస్వభావమును జాటి రెండవపద్యమున స్వభావోక్త్యనుప్రాణితమును, మూఁడవ దానియందు రూపకానుప్రాణితమును జేసి స్వకీయాద్వితీయవర్ణనాకౌశలమును భావగాంభీర్యమును జాటుచున్నాఁడు.

"శమితక్షత్త్రికళత్రనేత్రజలవర్షావేళ నీకీర్తిహం
సము క్రౌంచస్ఫుటతావకాంబకసుషిం జాఁగంగ నీక్షించి వ
ర్షము రా నంచలు నంద నేఁడుఁ జన నిచ్చ న్నాటి తచ్చేష్ట వా
యమిఁ దిర్యక్కతి దా గతానుగతికం బౌఁగా కురారీ హరీ"

పరశురాముని క్రౌంచపర్వతభేదనమంతి సత్యమే మోకాని కవియగు నీరాజహంస తన కీర్తిహంసముచే తద్భేదన మొనరించి యితరకవి హంసలకు మానససరోవరంబయి యీపద్యమునఁ దిర్యగ్జాతిలక్షణమును దెలిపి తనకుఁగల ప్రకృతిపరిశీలనజ్ఞానమును స్పష్టపఱచుచున్నాఁడు.

"పవిధారాపతనంబుఁ గైకొనని యప్పొలస్త్యుమై సప్తధా
తువులం దూఱఁ బరిశ్రమంబునకు నుద్యోగించె నా సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక వెసం - జన్నట్టి యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగు న్నిరుల్ రఘుకులస్వామీ, రమావల్లభా."

ఆహా! కవిచాతుర్యము! కిష్కింధాప్రాంతమందలి సప్తసాలము లెక్కడ? రావణునిదేహస్థితము లగు సప్తధాతువు లెక్కడ? ఇయ్యది శత్రుమారణ మొనర్చుటకు ముందు కృష్ణదేవరాయలు చేయు పరిశ్రమమును సూచించుచున్నది

"స్యందనస్థితబిడౌజఃక్షుత్ప్రజాడ్యకృ,
జ్ఝంఝామరుద్గరు ఝ్ఝాత్కృతములు,
క్రవ్యాశిరాడ్గాత్ర కనదసృగ్గాహన,
స్ఫుటశల్యహవ్యభుక్ఫూత్కృతములు,
యోధవర్మితహృత్పుటోత్క్రాంతనిజపాత,
సాలాశ్మకృతముహుస్థాత్కృతములు,
పతితోగ్రరక్షఃకబంధభారభృశార్తి
భుగ్నభోగఫణీంద్రఫూత్కృతములు,
శ్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు
దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు
కలుషము లడంచుఁగాత లంకాపురాంగ
ణాంబరచరత్కలంబకదంబకములు."

ఇయ్యది కఠినసంస్కృతపదభూయిష్ఠంబై యిట్టిపద్యములకు నాయకమణియై చూపట్టుచున్నది. ఇందలి పదములా బాణములవలె నల్లిబిల్లిగ నల్లుకొని కటువులై ధ్వనిచేతనే బాణవర్ణనను వ్యక్తీకరించుచున్నవి. ఈ బాణముల స్థితిని వీక్షించుటకు మన జ్ఞానచక్షువున్నలు దిక్కుల బాణవేగమునఁ బరగించవలెను అహో కవిబుద్ధినిశితత్వము!

"క్షితి హాలకృష్టిఁ బుట్టి యడఁగెక్ క్షితియందున సీత, యంచుఁ ద
త్ప్రతి విరహార్తి పొండిమముఁ దాలిచి రామశరీర మెత్తి యా
క్షితి ఖననక్రియ న్మగుడఁ జెందఁగఁగాక కళిందజాతట
క్షితి దునసేటికి న్హాలముచేతను నీకవశాత్మత న్హారీ."

ఇందుఁ గవి కవితాకన్యను ఫలోత్ప్రేక్షచే నలంకరించి బలరాముని కృషిప్రయోజనమునకు వన్నె పెట్టి కర్షకుల కష్టమునకు లక్ష్మియె ఫలము గావున బలరాముఁడు లక్ష్మ్యంశసంభూతురాలగు సీత కొఱకే భూమిని దున్నెననుట రమణీయము. భూమిని దున్నువారికి లక్ష్మి ప్రసన్నురా లగుట వింతకాదు.

"ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచలవాంతవారిధా
రాయుతచంద్రకాంతఫలకావళి బింబితయై వెలుంగ నా
రాయణమూర్తి మత్కవచరత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నోయదువీర, వృష్టిఁ బసి యాఱడఁ బ్రోవనె సప్తరాత్రముల్."

ఇచ్చటఁ గవి నారాయణకవచప్రభావమును విశదీకరించుచు ననన్యసాధారణమగు కృష్ణవిగ్రహమును స్వాధీనముచేసికొని సర్వము తన్మయముగఁ జూచుచుఁ బాఠకులఁ దరింపఁజేయుచున్నాఁడు.

> "తరుణత్వత్సుత బాణపంచకమునన్ దైత్యాబలాశ్రేణి త
> ద్వరసందోహము యుష్మదాత్మకజరద్బాణం బొకంట న్జైడన్
> ద్వరఁ గావించితి వేటికో యహహా బుద్ధం బయ్యో నీభావ మ
> త్తరుణీశీలతనుత్ర మేటికి నసాధ్యం బౌటఁగా కేశవా."

> "ఘోరాపారమహోఘపంచకముఁ జెక్కల్సేయఁగా నేర్ప నా
> దారాపంచకధావనం జెలఁగుగంధర్వంబుఁ ద్రొక్కించు బ
> ల్బీరంపున్నెఱరౌతు కీకటశరాళీవారవాణీభవ
> ద్ఘోరద్రాఘంతకృపాణికాద్వితయవిద్యుద్గ్రంథినిం గొల్చెదన్."

ఇందలి కడపటి రెండుపాదము లశ్వగతులను ధ్వనింపఁజేయుచున్నవి. పంచమహాపాతకనాశనమునకై ధారాపంచకమును సమకూర్చుట కవినైపుణ్యము విశదమగును.

పైదశావతారపద్యములలో కవి తఱుచు వీరోచితములగు నాయుధములను, నఖములను, బాణములను వర్ణించుచు వానినే స్మరించుట చూడ నీతఁడే యొకరి ప్రమేయము సాహాయ్యము లేకయే యీతద్గ్రంథమును రచించె నని రూఢిగాఁ జెప్పుటకు వీలగుచున్నది.

---




గొప్పవారిని నాటకానికి పిలచినయెడల

# కవితాపరామర్శము

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

మన మనుకొనుపదములనే
మన వాడుకనున్న యర్థమర్యాదలనే
యను వెఱఁగి కూర్చి జగముల
నొనరఁగ మోహింపఁ జేయుచున్నారు కవుల్.

ఎఱుఁగఁ జేతురు కవులు సాహిత్యవిజయ
ఘంట మ్రోఁగించి తమతమ ఘనయశంబు
గణన గావింత్రు ప్రాజ్ఞు లాగంటమ్రోఁగు
మ్రోఁతలంబట్టి తన్మూల్యముల తెఱంగు.

తల్లి వాగ్దేవి వీథుల నెల్ల నింపె
రసవదుజ్జ్వలశబ్దార్థరత్నములను
విసువక రసైకదృష్టిచే వెదకుకవుల
నెవనికో గాని కన్పడ వవి యదేమొ!

పదములను గుదిగూర్చుటే పద్యరచన
మనుచు మందుఁడు సంబర మందుఁ, గాలు
సేతులు కదల్చుమాత్రమే యీఁత యనుచు
ముదమున మునుంగు బాలుని చదురుతోఁప.

కందువ యెఱింగి పదములఁ బొందుపఱచు
తెలివితేటలు లేని మూర్ఖులకుఁ దోఁచు
నర్థమును దుఃఖహేతువే, నిర్ధనునకు
వారక ఘటిల్లు పుత్త్రలాభంబువోలె.

పదము భవ్య మయ్యుఁ బ్రమదంబు నింపదు
చోటుగానిచోటఁ జొనుపఁబడినఁ
దరుణిముక్కుకొనకుఁ దగిలింపఁబడినట్టి
కళుకునిగ్గురవల కమ్మకరణి.

కావ్యశోభ నెల్లఁ గంగారు గావించు
మ్రుక్కడియగు పద మొక్కఁడైన
ముత్తియముల వరుసఁబోలు దంతముల సొం
పెల్లఁ జెఱచు గొగ్గిపల్లుపగిది.

ఒకటి నేఁ డెల్లి యొకటి యెల్లుండి యొకటి
గాఁగఁ బదముల నెట్టులో కలయఁగూర్చి
కకవికలుగాఁగఁ గడుఁ దికమకలుకుడిచి
యుప్పచప్పని పద్యంబుఁ జెప్పఁ గుకవి.

స్థూలబుద్ధియైన దుష్కవినుడులును
స్థూలములె యటంచుఁ దోఁచు నాకుఁ
గాకయున్న నకట! గాఢయత్నంబున
నేని యవ్వి చెవుల కెక్కవేల?

వ్యంగ్యసౌరభ్యరసలసద్వాక్యసరణి
సుకవి యొనరించు నిందయు సుఖకరంబె,
కంపుగొట్టెడు కడుపీరసంపు నుడుల
దుష్కవి యొనర్చు నుతియును దుఃఖకరమె.

సుకవులకు నెట్టిక్లేశమో కుకవులకును
అట్టిక్లేశమె; కొంత హెచ్చైన నగును
వేఁకటిమొదలుగాఁ బ్రసవించువఱకు
శ్రమము తుల్యమె దుష్పుత్త్రజననికైన.

ధాతకు జగంబుపై దయ తప్పి చనుటో?
భారతీదుర్మరణయోగమో? రసజ్ఞ
జనుల పాపమొ? యీమూఁటి సంఘటనమొ
కావలయు దుష్కవిత కాదికారణంబు.

బ్రహ్మహత్యకుసైతము పాచితంబు
నేర్పఱించిన ఋషు లదియేమొ కాని
తెలియ దుష్కవితకు శుద్ధి పలుకరైరి
దానిఁ దలపెట్టుటకుఁగూడ తలఁకిరేమొ!

---

# శ్రీకృష్ణదేవరాయలు

సోమంచి వాసుదేవరావు గారు

అతులితమహితవిద్యాపురీసామ్రాజ్య వైభవలక్ష్మి నెవ్వాఁడు వొందెఁ
బృధుఁకళింగాధీశ వీరభద్రోదార భయదప్రతాప మెవ్వాఁడు సెఱిచె
నుభయసారస్వతాభ్యుదయకారణముగా భవ్యకవీంద్రుఁ డెవ్వాఁడు వఱలె
రుచిరవదాన్యతాప్రచురమహాకళా ప్రౌఢనిరూఢుఁ డెవ్వాఁడు దనరె
నతఁడు నుతియింపఁబడు హరిదంతిదంతి - దంతకుంతకాంత ధవళకాంతికీర్తి
లలితలక్ష్మీకటాక్షలీలానిశాంతుఁ - డనఁగ శ్రీకృష్ణరాయాఖ్యుఁ డనఁగ జగతి.

వైష్ణవమతసంస్థాపన - నిష్ణాతుండగు నృసింహనృపనందనుఁ డా
కృష్ణుండు పుట్టె నల శ్రీ - కృష్ణుని యంశమున నంచు నెంతురు విబుధుల్.

కవితాస్త్రీలోలుఁడు కృ - ష్ణవిభుం డభినందనీయనానాసుకవి
ప్రవరుల నాదృతిఁ జూచెను - భువిఁ గీర్తి దనర్చె నాంధ్రభోజుం డనఁగన్.

శ్రీభూమీకాంతలతో - శోభిలు హరికంటె నతఁడు శోభిలె మిగులన్
శ్రీభూమీతిరుమలచి - న్నాభామిను లాత్మసతులు నలువుర చేతన్.

సాళువతిమ్మయసచివో - ద్వేలసుధీవైభవమున విశ్రుతధరణీ
పాలకిరీటమణీఘృణి - లాలితపదపద్ముఁ డయ్యెలావిభుఁ డొప్పెన్.

రసమంజరియు మదాలసచరిత్రయును సత్యావివాహంబుఁ జింతామణికృతి
సకలకథాసారసంగ్రహం బాదిగాఁ గలుగు ననేకసద్గ్రంథములను
దేవభాష రచించి తెనుఁగున నాముక్తమాల్యదాభిఖ్యోత్తమప్రబంధ
మొనరించి యీగతి నుభయభాషాకవితామతల్లులఁ గడుఁ దాన పెంచి
యాంధ్రకవితాపితామహాద్యఖిలసుకవి - నికరకృతసత్ప్రబంధవాణీవిలాస
రమణుఁడై కృష్ణరాయలు ప్రథితకీర్తిఁ - బరఁగె నాంధ్రభోజాదిసద్బిరుదములను.

మది నయ్యాదివరాహసంగసుఖసంపద్వైభవం బిచ్చగిం
పదు భూభృత్తతి నెంచ దించుకయు సర్వస్వామిసంభోగ మొ
ల్లదు విద్యాపురనాథకృష్ణనరపాలశ్రీభుజామధ్యసౌ
ఖ్యదశాఖేలనలోల యైన ధరణీకాంతావతంసం బొగిన్.

ఒకవంకఁ బెద్దనార్యుఁడు నందితిమ్మన్న యుద్ధవర్ణనలు సేయుచు నెసంగ
సాళువతిమ్మయసచివోత్తముఁడు రాజకార్యతంత్రము లొక్కగతిని దెలుప
సైన్యసన్నాహవిశారదులైన యాదండనాయకు లొక్కదండ నిలువ
వినయవిధేయులై కనుసన్నల మెలంగు సామంతనృపు లొక్కచక్కిఁ గొలువ
నృత్తగీతవినోదముల్ నెఱపు శారదేందుముఖు లొక్కవంక నమందగతులఁ
గొలువ జైత్రయాత్రాభిముఖుండు కృష్ణుఁ - డెసఁగు వృత్రునిపై కేఁగు నింద్రురీతి.

రమణీయోదయపర్వతాగ్రమున కుగ్రస్ఫూర్తి శ్రీకృష్ణరా
యమృగేంద్రుండు పరాక్రమస్ఫురణ నుద్యల్లీల లంఘింప బీ
రము వోనాడి తదద్రినాథుఁడు గజేంద్రస్వామి వేవేగ విం
ధ్యమహీభృద్భయదాటవీగమన మొందన్ గగ్లె నెంతేనియున్.

మొదల నుదయగిరిసమున్నతిం జేకొని - యవలఁ గొండవీటి కరిగి పిదప
జమ్మిలోయఁ బడుచు నెమ్మి బెల్లముకొండఁ-గొనె నృసింహకృష్ణకుంజరారి.

ధృతి నవలఁ గటకపతిగజ - పతికుంభవిదారణప్రభవమహాక్తికసం
తతికైతవవిజయరమా - సతీమతల్లీవిలాససంగతిఁ గాంచెన్.

విజయపురాధినాయకుఁడు వీరనృసింహకుమారరత్న మ
గ్గజపతివీరభద్రమహికాంతుని నాజి జయించి విస్ఫుర
ద్విజయరమాధురంధరతఁ దేకువఁ దర్పనరాజ్యలక్ష్మి తోన్
గజపతియానమై వెనుకొనన్ మరలెన్ గజరాజకన్యతోన్.

ఆమీఁదఁ బతి తురంగమ - సామజబలయుక్తుఁడై విజాపురరాజ్య
శ్రీమీఁది కరిగి రాచూ-ర్నామకదుర్గమును వశపఱచుకొనెఁ గడఁకన్.

ఆతఁడే దురుష్కవీర - వ్రాతమ్ముల నాజిఁ దునిమి రంభాసంభో
గాతతసౌఖ్యులఁ జేసెఁగ-దా! తగవరిగా నృసింహతనయుఁడు పోరన్.

విజయరమాయుక్తుం డగు - గజపత్యరి పొట్టునూరికడ నిల్పిన యా
విజయస్తంభమ యాభూ-భుజుని యశోన్నతిని దెలుపుఁ బొలుపుగ నెపుడున్.

తిరుపతి కేఁగి వేంకటపతి న్నిజదైవము మ్రొక్కి నంత శ్రీ
గిరిపతి మల్లికార్జునుని గేవలభక్తి నమస్కరించు శ్రీ
వరు నల సింహశైలపతిఁ బాయక కొల్చు నుమేశుఁ గాళహా
స్తిరమణు సేవసేయు నరసింహునికృష్ణుఁ డభేదభక్తితో.

ఆతఁడు తదీయదేవాలయములఁగుఱిచి - ద్రవ్య మెంతే నొసంగి నిర్మాణకృతులు
పొనరఁజేసి యశస్ఫూర్తిఁ భువిఁ దనర్చె - రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

విద్యారణ్యులచేఁ బ్రతిష్ఠితమునై విద్యావిశేషజ్ఞుఁడున్
బ్రోద్యత్కీర్తిరమాకరగ్రహణరమ్యుం డైన శ్రీకృష్ణుచే
మాద్యద్విస్తృతి నొంది యెంతయును సామ్రాజ్యంబు నాఁ బొల్చి యా
విద్యానామకరాజధాని మహి శోభిల్లెన్ సమభ్యున్నతిన్.

ఆంధ్రభాషామతల్లిభాగ్యంబుకలిమి - నవని శ్రీకృష్ణరాయాఖ్యుఁ డవతరించె
నాఁటి యున్నతి గలుగ దేనాఁటికైన - నాఁటి రారాజు గలుగఁ డేనాఁటికైన.

తల్లి! యోయాంధ్రభాషాయతల్లి! యేల - కన్నదోయిని బహుబాష్పకణము లురల
నేడ్చెదవు కృష్ణరాయక్షితీంద్రుగుఱిచి - కలరుగా మమ్మువంటి భక్తులు ధరిత్రి.

---



# ఇత్తడి పూసగంటము

కొత్తపల్లి సూర్యారావు గారు



ఏలర పిన్నవాఁడ చలియించెదు భీతిలి యాస్యపద్మముల్
వ్రేలఁగవైచె దేష్టయిన వింటివొ కంటివొ నన్ను భూతబే
తాళకులంబుఁ గాంచినటు తందరగొందువు ధైర్యమూను నా
లీలలు నేఁటి బాలకులు లేశ మెఱుంగరు విన్ము తెల్పెదన్.

అన విని యేర వింత యిదియా పలుకాడెడు, నిట్టిరూపు చూ
చినయది గాదు మున్నిటు వచించెడుయంత్రము లెన్ని లేవు, కూ
లినయిలు బోడిగోడ వెడలించినఁ దోఁచిన త్రుప్పటుక్కు మే
కున కెటు గల్గె వాగ్ఝరి యకుంఠిత మిద్దియు, దీని మాటలున్.

వినఁబడుఁ బెద్దగాఁ జెవికి విద్యుదుపాశ్రితతంత్రినుండి వ
చ్చినయదివోలె నాకె, కడుఁ జిత్రము—కన్గొనువాఁడ దీనిఁ, జె
ప్పిన నొకవేళఁ జెప్పను భవిష్యదుదంతము పైతృకప్రవృ
త్తిని—బలువింత చిత్రమ నుతింతును నిన్నిలువేల్పురీతిగన్.

కారణ మేమి యిట్లిట నొకండవ యున్కికి నెంతకాల మీ
యోరువరాని దుర్దశల నొంది వసించితి విప్డు నేను నీ
జేరకయున్న నే మగుదు చెప్పుమ నీకలరూపు నాకు నీ
కేరహి బాంధవంబు గల దేమొ యకారణబాంధవా యనన్.

ఏమివచించితే మగుదు నింతియ, నీ వరుదెంచి తీయఁగా
నీమెయి నొందు దైవ మిటులే యొనరించును దీనికంటె వే
ఱేమి—యదృష్టవంతుఁడవు వృద్ధికి రాఁగలవాఁడ విట్టి నా
నోములపంటఁ గాంచితి నినుం గులవర్ధన యిన్నినాళ్లకున్.

పితృపైతామహమైన యి ల్విడిచి నీ పిన్నప్డు మాతామహో
ర్జితకు గ్రామముఁ జేరి తీవు జననీప్రేరేపణన్ ; బుద్ధిహీ
న తదావాసముమీఁది ప్రేమమున మాన్యస్థానశైథిల్య మొ
ప్పి తెవుల్గొం టయి యీల్గె నచ్చటనె నీవే నిల్చి తాయింటికిన్.

స్వగృహం బెంతటి కష్టదాయి యయినన్ స్వైరప్రచారార్హ, మ
న్యగృహం బైనను భేద మెంచికొనినన్ స్వావాససౌఖ్యంబు రా
దుగదా తిన్నను బస్తుపడ్డ నెటు లెందున్ స్వేచ్ఛ నీయింటిలో
మగ మొక్కొక్కటి యుండియుం గులము పేర్మాయించె దుర్బుద్ధియై.

ఊరుం బేరును వన్నెవాసి ధన ముద్యోగంబు వాల్లభ్య మె
వ్వారు న్మెచ్చెడువారె కాని నిగసింప న్లేద యేస్వల్పసం
సారచ్ఛిద్రము సుబ్బనీక, పొడమ న్సందీయ కెచ్చిల్లి ర
వ్వారి న్నె నెటు విస్మరింతును భవద్వంశీయులం బూర్వులన్.

మేడల మిద్దెల న్మసలి మేటులసంగతిఁ గూడి యూరిలో
వాడలవాడలం దిరిగి వాదులు దీఱిచి మధ్యవర్తితం
బ్రోడతనంబుఁ జూపి బహుభూముల గుత్తలు వ్రాసి తీసి వే
జాడల సంచరించితివి సజ్జనసేవ ననేకకాలమున్.

నా విని బాలుఁ డేమి యిది న న్వెఱఁగందఁగఁ జేయుచుంటి నీ
వేవగ నాచరించితివొ వృద్ధసమాశ్రయ మప్డు త్వద్విధో
దావహవృత్త మెల్లెఱుఁగనయ్యెదనో కరుణింపు మాత్మవం
శావళి దానఁ దేటపడునట్లుగ నున్నది వింతవస్తువా !

అన జైవాతృక ! వింతవస్తువును నేనా ? యావిరాడ్రూపసే
వనము న్మాని వతారపూజనము సల్పం బోవున ట్లీరు నా
వెనుక న్వచ్చిన యస్థిరార్థముల రీతిన్ లోఁగుటం బాలుమా
లి నను న్వింతగఁ జూడఁజొచ్చెదరు నే లేఖిన్యభిఖ్యాతమున్.

తోమును నన్నుఁ బట్టి పయిత్రుప్ప దొలంగఁగఁ గొంతకొంతగా
నామెయిరూపు తేటవడు నావుడు నట్టులు చేసి చూచినన్
సా మపరంజివోలె మఱిసామును జొక్కపుఁజొక్కమట్లుగా
నేమివచింప వింతలపయిం బలువింత లటంచు నిట్లనున్.

వింతలు చూపుటం గడుఁ బ్రవీణుఁడ వట్టులు తోఁచు నిన్ను నే
నింతయు నెంచలేను వచియింపుము నీచరితంబు విందు నా
స్వాంతము వొంగ నావుడును నర్భక ! నాతలమీఁది పేరు వీ
క్షించితె ? కాంతిపుంజ మటఁ జీకటి గ్రమ్మినఁ గాననయ్యెదన్.



కీ. శే. బిడారం కృష్ణప్పగారు



కీ. శే. సి. కన్నయ్యగారు



కీ. శే. గోవిందసామి పిళ్లైగారు

తేఱిపాఱఁజూడు - తెలిసితి నేమది ?, చదువు, "కృష్ణమూర్తిశాస్త్రిగంట"
మతని నెఱుఁగుదేమొ యక్కజపుంగని, యెఱుఁగ నెవఁడో యమ్మహీసురుండు.

నీప్రపితామహుండ, యతనిం దలపించితి మంచివేళ నీ
కాప్రమదాశ్రు లౌనవి మదక్షుల దుఃఖపు వేఁడిబాష్పముల్
వే ప్రవహించుఁ జూచితె వివేకధనుండు మహాతపస్వి యా
విప్రుఁడు వాని వాక్యములు వేదములయ్యెను నాఁటివారికిన్.

ప్రభురీతి స్వవచనాజ్ఞ నిల్పెఁ బ్రజగాం బ్రశ్నింపఁ డెవ్వాఁడుఁ ద
త్ప్రతిభ కడ్డం బొకయింత లేదు విను లాభంబైన నష్టంబయే
ని భయం బందుచు రెండుపక్షములు మన్నించుం దదాజ్ఞావిధి
న్విభవోపేతుఁడు నప్రతిగ్రహుఁడు దుర్భేద్యం డభేదాత్ముఁడున్.

నాచేఁ గావ్యములున్ శ్రుతిస్మృతిపురాణంబుల్ ప్రబంధేతిహా
సౌచిత్యప్రకటార్థశాస్త్రములు వ్రాయంజేసె మన్మూలకృ
ద్వాచాలత్వము శ్రోత్రపేయము సుతవ్యాహారము స్మరించి యా
వాచస్పత్యభిరాము నీవలనఁ బ్రాప్తంబయ్యెఁ గీర్తింపఁగన్.

అనినన్ దోషము గాదు నే ననిన నత్యాసక్తి నన్మ్రొక్కఁ గీ
ర్తనసేయున్ వ్యవహారవేళ, వలదా! రాద్ధాంతసిద్ధాంతముల్
విని వ్రాయ న్నియమంబు మాఱ దది రీతిం దేశదేశంబులం
దున నన్నందున ముట్టికొన్నతఁడు భీతుం డన్యథావర్తిలన్.

ఇనుఁడే గంటము ముట్టుకో భయము తా నెవ్వైన ముట్టంగఁ ద
ప్పనిపోటున్ గుడి కేగు మేఁకవలెనే వానిచ్చి నాకేల నే
ననినం దప్పెడువాఁడనే విడుఁడు నన్నం చెట్టులో చేరు న
గ్గన భీతిల్లుఁ, గలండె యిప్ప డటులం గావించువాఁ డొక్కఁడేన్.

కల్లలతోడఁ బుట్టుఁ గలకాలము మోసమె యెంచుఁ - జెప్పిన
న్గొల్ల మెలంగఁ డచ్చుకొని యిచ్చినపత్రము చేతివ్రాలు నేఁ
జెల్లను గృత్రిమం బను "రిజిష్టరు"చేసియు లేదు పొమ్మనుం
జల్లగ నిప్పు, డప్పుడు వచస్థితి మార్పుఁడు చావుమూఁడినన్.

నీకుఁ బితామహుండు జననీజనకు ల్ముద మొందఁజేయుచున్
లోకుల మెప్పు నంది తలలోపలి నాలుకవోలె నల్పసం
ఖ్యాకసమంబుల న్మడిసె గర్భిణియై సతి యుండ నంత న
త్యాకులుఁ డైన తండ్రి యతియత్నతఁ గోడలి రక్షసేయఁగాన్.

నీజనకుండు పుట్టె రజనీకరవక్త్రుఁడు సోమయాజి వి
ద్యాజలజోద్భవుండు నను నాదర మొప్పఁగ మంచెఁ దాతగా
రోజ సమస్తమందు బలియుండయి వృద్ధుని గద్దెనుంచి తాఁ
బూజయొనర్చుచు న్నడపె భూములుఁ బుట్రలు నార్జవంబునన్.

పుత్రుని మాటయు న్మగనిపోకయుఁ దాతకుఁ దల్లి కెన్నఁ డే
మాత్రముఁ దోఁపకుండుగతి మానుగ సేవ యొనర్చుచున్ దివా
రాత్రము లాజ్ఞయాజ్ఞయని రంజిలఁ జేయుచుఁ జేతులార స్వ
ర్యాత్రికు లైనవారికిఁ గ్రియ ల్నడపె న్విధివ న్ముదంబునన్.

కాలము మాఱెఁజొచ్చినది కార్యము లెల్లను మాఱెఁజొచ్చె న
క్కాలపువా రడంగిరి వికారము లుప్పతిలెం గ్రమంబుగా
శైలియు మాఱె నీపితయు జాయకు లోఁగి విచిత్రకార్యముల్
చాల నొనర్చెఁ గొన్నిటిని జ్ఞప్తికి వచ్చినవానిఁ దెల్పెదన్.

ఈవు కడుపునఁ బడిన దౌహృదవతియగు-నీజననికోర్కెకై సోమయాజిగారు
చేసె స్థలభాండశుద్ధి యచ్చెరువుగాదె-స్త్రీవశుల చర్య లవి నాదు చిట్టివాఁడ!

ఏ మైపోయెనో తాతతీరుపును సద్వృత్తంబు నుద్విజ్య ప్ర
జ్ఞామేయత్వముఁ జూచువారికిని నాహాపుట్టఁగాఁ జేసె నా
సామాన్యాకృతి నర్థహీనులకునై సర్వంబు న ప్పిచ్చుచున్
భూమార్థంబు కుసీదవృత్తిమెయిఁ బ్రోవుం జేయ నెంచెం గటా!

తాను బుచ్చుకొన్న ధన మిచ్చు కొనవచ్చె-నిలువఁబడిన పాట నిఖిల మప్పు
గొన్నవార లీయకున్న నెత్తిని చేతు-లబ్బెఁ గొన్నినాళ్ల కాతనికిని.

ఓనరసింహ! యేమనుదు నున్నది కొన్నది రెండుఁ బోయెఁ ద
న్మానినియన్న కొంత గొని నాశ మొనర్చెను స్వాలకత్వముం
బూని - కలర్థముం గుడువఁబోక సుఖంబుగ లేనిపోని వి
జ్ఞానముఖంబునం జెడి విశాలయశస్స్ఫూర్తిఁ దెచ్చికొందు రే.

వచ్చినది తెచ్చికొని తినవలసినంత-గలదు రాఁబడి యత్యాశవలన మొదలుఁ
జెడియె నయ మింక నీకొంప విడిచెను సుడి-వోయియుండును బ్రదికినఁబూఁటలోన.

అట్టివాఁ డిట్టు లగుటమె యద్భుతంబు-లక్ష్మిచంచల యన్న వలదు విశేష
మేల యిటు వచ్చితివి నిన్ను నెట్లు విడిచె-మామ పౌరుగూరు రాఁ జెప్పుమా యొకింత.

తాత పేరిటివాఁడ వుత్తముఁడవు ప్రపి - తామహునికై వడియుఁ దల్లి మోమువాఁడ
వట్టి నినుఁ జూడఁగల్గెనో వత్స, నన్నుఁ-గనఁగవచ్చితివే శుభ భాగ్యంబుకలిమి.

నీవె చెప్పితి వంతయు నేను దగ్గృ-హమున నిలువఁగ ననువులే దతని సతియు
"దిక్కుమాలినబాలుని దెచ్చి పెంచు-కొంటిమో"యని నన్గని గొణుఁగుకొనును.

ధన ముడివోవ నే మగును దల్లియుఁ జేరఁగనీదు-దానికై
పనివడి యిల్లు వీడి యిటు వచ్చితి నిక్కడ ముష్టి యెత్తుకొం
చును బడియుండ నొప్పఁగద సొంతము నాకిట బోడిగోడలై
నను-నినుఁ గాంచి నాకు నదనంబుగ ధైర్యము శౌర్య మొట్టెడున్.

బ్రాహ్మణుండ నిన్నివత్సరంబులు తల-కెక్క జందెము బుజ మెక్క లేదు
గాన నీవు చెప్పఁగా వింటిఁ బితరుల-పేళ్లు మేనమామ ప్రేమ యిదిగో!

వత్స! భయంబు లేదు నిలువంబడియుండుము నామమాటపైఁ
గుత్సితవృత్తిఁ గాను నినుఁగొందును నాసుతునట్లు నీకు నా
పత్సమయంబు గా దిది శుభంబయివు నమ్ము శకంబు మాట నీ
వత్సర మెట్టు లుండునో శివా యని చేయుము మద్వచఃస్థితిన్.

మీపూర్వులకడ నేనే-యేపనిఁ జేసినను నేఁడు నేనే నీకై
వ్యాపారం బొనరించెద-వ్యాపాదముగాదు నమ్ముమా నామాటన్.

కవిలెల్ వ్రాసినయప్పనప్పు లవి చక్కంబెట్టె మీతండ్రి, య
ట్టివి రాకుండ నృపాలదత్త మపుడప్డే చేసె నిక్షేప మా
వివరం బేనొకరుండ నేర్తుఁ దెలియన్ వీక్షించితిన్ గుర్తుగాఁ
దన దిప్పట్టున నెత్త, నూరఁగల పెద్దం జూడఁగాఁ బొమ్మనా.

ఒక్కకుటీరము న్నిలిపి యొద్దిక చేయఁగఁ గోరు పూర్వపు
న్మక్కువఁబట్టి నీ కతఁడు మన్నన సాయముచేయు దానిపైఁ
జక్కఁబడు న్సమస్త మని జానుగఁ గార్యము చెప్పి యట్టులే
మిక్కిలి నేర్పుతో జరుప మెల్లగ నిట్లను గింట మంతటన్.

నన్ను నూడఁబీఁకినట్టి వోటికి మఱి - కొంతమీఁదఁ గుండగూఁడు గలుగు
పూడ్చివేసినారు పోయి దానిని జూడు - నీకుఁ జెప్ప నదియు నియమవిధులు.

న న్నొక సాధనంబుగను నానిచి గోడను ద్రవ్వుమయ్య నే
నన్నిటి కన్నిరీతులను నయ్యెద నీకు సహాయభూతమై
యన్నను నట్లు చేయ నొక యన్నువచెంబున రూకలుం బదా
ర్వన్నెపసిండి రేవ నొకపత్రముఁ గాంచెను బాలుఁ డద్దిరా!

తాళపత్రమందుఁ దాఁ జేసినట్టి రహస్యగోపనంబు నద్ది చెందు
టకును గుర్తులున్న నొకకొంతసేపు బాలకుఁడు ఆచ్చవడి చలనముదక్కి.

బాలుండా! యువి యొక్కమాఱుగనె త్రవ్వంబోకు, నానాఁటికిం
బాలింపందగు బుద్ధిహీనుఁ డయి యమ్మన్లేదు నీతండ్రి యీ
నేలక్, రేకయు, బైటఁబడ్డయదిరా నీకంచు లేనవ్వున
న్మేలంబాడి గడించు దమ్మిడిని బేర్మిం గొమ్మనా దానిలోన్.

ననుఁ బూర్వార్జితమట్లు దాఁచికొను మన్న న్మేలు: నీమేలు నా
నెనరు న్వర్షశతంబు నొండొకటితో నేస్తంబు గావింపవే
నిను నాదైవము నెట్లు వాయుదును నానిర్వాహము న్నీవు చే
సి విలంబెట్టితి లేనివో నెటులు గాసింజెందఁగా నౌదునో.

* * * * * * * * *

అదియే వెట్టి యటంచు నూఁగృతము కార్యం బెప్డుఁ గాలానుసా
రదశం జెప్పను నిద్రపోవునతనిం బ్రత్యక్షమై లేపుఁ బో
వదు వ్యర్థంబుగ నేదియుం బ్రదుకుమీ ప్రాజ్ఞుండవై యెల్ల నె
మ్మది యోజింపుము నావచస్సులను సంబంధంబు నానాఁటికిన్.

అని మౌనంబు భజించిన ట్లయిన నాహా యంచు గంటంబు ము
ట్టి నిజోరఃస్థలి నద్దుకొంచు విల మంటి న్నీకృపాపారదృ
ష్టిని నే నెన్నఁడు నీదువాక్యముల వాసిం గాంతు దుర్మార్గమం
దున దుస్సంగతిఁ బోను సత్సరణి నుందున్ సజ్జనశ్లాఘ్యతన్.

నీవ ధనంబు నీవలన నేను మదన్వయుల న్మదీయభా
గ్యావహమార్గముం దెలిసి యుందితి మోదము, నీహితంబు నా
కీవహి సిద్ధమౌ ఫలము నిచ్చెను జేతికి, బుద్ధిగల్గి మే
కో వెఱ పేల, నీవు పలుకు న్విరమించితి వేమి చెప్పుమా!

నే ననర్థప్రసంగంబు నేరఁ జేయ నీకొఱకు వాక్కు నిల్పితిని మఱి నన్నుఁ
గదపకుము హాయిగానుండు కందునిన్ను నని నటులుండె బాలుఁ డత్యాదరమున.

క్రమముగ నందఱం గలసి గ్రామములోన మెలంగుచు, న్సమ
స్తముఁ గడు జాగరూకతఁ బ్రశస్తగతి న్విహరించి, బంధుబృం
దము గడియించి, మాతృసుతం గొని యత్తకు సిగ్గుదెచ్చి ది
వ్యమగు గృహస్థత న్మనియె నార్జన కొప్పుగ వెచ్చపెట్టుచున్.

# సేవాధర్మము

ఉభయభాషాప్రవీణ, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

(రఘువంశమునుండి తెనుఁగు సేఁత)

పూర్వకథ —

దిలీపుఁడు కులగురువగు వసిష్ఠుం జేరి యతనికిఁ దన యనపత్యతం దెలిపి వగవ నమ్ముని శేఖరుం డతని నోదార్చి, "రాజా! నందిని యనుపేరం బరఁగు నాహోమధేనువును బూజింపుము. అదియ నీయాప్సితంబు నొసఁగు" ననుడు నన్నరపాలుం డమ్మొదవుం భక్తిసంయుక్తి సేవించుచుండె. ఒకనాఁ డక్కామధేనువును మేఁతకొఱ కటవికిం దోలుకొనిపోయి—

మనుజవిభుండు దుష్టమృగమండలిచే మొదవించుకేనియున్
జెనకఁ దరంబుగాని దని చిత్తమునం దలపోసి చెంగటన్
దనరు తుషారశైలసముదంచితశోభలఁ గాంచుచుండఁ బెం
పెనయఁగవచ్చి పైదుమికి యీడ్చెను సింగ మొకండు ధేనువున్.

గుహాలు మాఱుసెలఁగ గో వప్పు డఱచిన - యాఱు పార్తసాధు వగు నృపాలు
శైలసక్తదృష్టి వైళమ మరలించెఁ - బ్రగ్రహముల నీడ్వఁబడినభంగి.

ధాతుమయతుహినాద్రినెత్తమునయందుఁ - బుష్పితంబైన లొద్దుగుపోల్కి నెఱ్ఱఁ
దనము నెగఁజిమ్ము కుత్తిపైఁ దాండవించు - తెల్లమొకమును గాంచె నవ్విల్లుదాల్పు.

అంత మృగేంద్రగామియు హతారియు నార్తశరణ్యుఁ డైన భూ
కాంతుఁడు స్వప్రమాదమునఁ గల్గినచెట్టకు సిగ్గు నంది దు
స్స్వాంతము వధ్యమైన మృగవల్లభముం దెగటార్పఁ నిషం
గాంతరశస్త్రముం దివియ నాసపడెం గడునల్కఁ దోల్కఁగన్.

సింగము నేయుటకై నృప - పుంగవుఁ డమ్మొత్తఁ గరము పొదినిడ నది స
క్తాంగుళి యయ్యెఁ జిరాపిడి - రంగుగఁ జిత్తరువునందు వ్రాసినభంగిన్.

తనకరం బట్లు ప్రమోడువాఱిన వివృద్ధ - రోషుఁడై రాజు మాంత్రికరుద్ధవీర్య
భోగిభంగి సమీపారిఁ బొదువలేని - సొంతతేజుచే లోలోనఁ జూడఁబడియె.

తన యున్కికి వెఱఁగందెడు - మనుకులమణి సింహసత్త్వమాన్యుఁ గని యి
ట్లనెఁ గేసరి మనుజోక్తుల - జనపాలుఁ డవేల చిత్రచకితుఁడుగాఁగన్.

"ఏల వృథాశ్రమించెదు నరేశ్వర! నీదు శరంబు వచ్చినం
జాలదు నన్నుఁ గూల్ప నిది సత్యము! యంబరచుంబిపాదపో-
న్మూలనకార్యనిర్వహణముం బొనరింప సమర్థమైన వా
తూలజవంబు పర్వతముతో నెదిరించిన లాభ మున్నదే!

శివుఁడు దా వెండికొండనాఁ జెలఁగు నాము - కెద్దు నెక్కుచుఁ బాదంబు నింత మోపి
దయఁ బవిత్రమొనర్చు నీదాసునడుము - నధిప! నన్నుఁ గుంభోదరుఁ డండ్రు జనులు.

చూడు మీదేవదారు వీశునకు ముద్దు - బిడ్డ యిది, గౌరి బంగారుబిందె లనెడి
చన్నుఁగవనుండి నిస్సృతిగన్న జలప-యస్సుచేఁ బెంచెఁ గందునియట్ల దీని.

చెక్కుటితీటఁ దొలంపఁగ - నొక్క వనేభంబు రుద్ద నొకపరి గీరిన్
రక్కసిముల్కులఁ జిక్కిన - యక్కొమరుం గూర్చిపోలె నద్రిజ వగచెన్.

అదిమొదలో నృపాల! వనహస్తిభయార్థము నన్ను సింగపుం
గొదమను జేసి, యీతుహినగోత్రగుహాగృహవాస మిచ్చి నన్
గదిసెడు సత్త్వకోటి నెరఁగా నియమించెఁ ద్రిశూలపాణి, య
మ్ముదలఁ దలన్ధరించి సతము న్నెఱవేర్తు మదీయధర్మమున్.

క్షుధితుఁడగు రాహు వైందవసుధనుబోలె - శంభునిర్దిష్టభోజనసమయ మగుచుఁ
బ్రాప్తమగు నీసురభిరక్తపానమునను - నేఁ గడుంగడుఁ దృప్తినందెద నరేంద్ర!

ఓపినకొలంది గురుభక్తి సూపి తీవు - శస్త్రసాధ్యంబుగాని రక్ష్యమును విడువ
శస్త్రధారుల కీరితి సన్నమగునె? - సిగ్గు విడనాడి యిఁక నిల్లు సేర వయ్య!"

మృగరా జిట్లు వచించిన - ప్రగల్భవాక్యముల విని నృపాలుండు నిజా
శుగ మడఁగుట శివు మహిమము-నఁగదా! యని విడచె మనమునం గల రీఢన్.

అతఁడు బాణప్రయోగమం దాద్యవితథ-యత్నుఁడై కులిశంబు సేయందలంచి
వేఁడిముక్కంటిచూపుచే బ్రమోడువాఱు - నింద్రుఁబలె నిల్చి కేసరి నిట్లుపలికె.

"సింగమ విను మిబ్భంగిన్ - భంగపడిన నే వచించు పలుకెంతయు న
వ్వంగఁ దగినదియ యైనఁ బ - రేంగిత మీ వెఱుఁగుదానవే యని వినుతున్.

అతులచరాచరసృష్టి - స్థితిసంహృతికర్తయైన శివుఁ డెంతయుఁ బూ
జ్యతముఁడ గురుని ధనం బీ-గతి ద్రోలం జెడ నుపేక్ష కర్తవ్యమొకో!

అట్లగుట నీవు నాదేహ మారగించి - యాఁకటిం బాపికొమ్ము సాయంతనమున
కమ్మకొఱకు 'నంభా' యని యఱచు లేఁగ-దూడఁ దుంచి యిమ్మనిగోవు వీడు మిపుడు."

ఒడయనినుడి విని పడఁకుల - నడఁగిన విరులెల్లఁ జెల్ల నల్లన నగి య
వ్వెడదమొకంపు మొకం బ-వ్విడిముడిదొరతోడ నిట్లు వెండియుఁ బలికెన్.

"ఎదురుగొడుగులేని యేలికతనమును - గ్రొత్తజవ్వనంబు గొనబుమేను
నల్పమైన ఫలము నాశించి విడచెద - వెంత మూఢబుద్ధి వీవు నృపతి!

భూతదయ నీకుఁ గలదేనిఁ జేతమందు - నరయు మిద్దాని, నీవు మైఁదొరఁగ నొక్క-
మొదవ జీవించు నటుగాక బ్రదుకుదేని - జనకువలె నెల్లజీవుల సాకఁగలవు.

గురువునకు నుండె నీయా వొకొండె, దాని-విడువ శిఖితుల్యుఁడే శాప మిడు, నతండ
టంచు వెఱచెదె? తద్దోష మార్ప నీకుఁ - గుండపొదుగుగోవులు లేవె కోట్లకొలఁది?

అట్లగుట నెల్లశుభముల ననుభవించు - నీబలిష్ఠశరీరంబు నిలుపుకొమ్ము
మనుజనాథ! భూస్పర్శనమాత్రభిన్న - శాతమన్యవపదము రాజ్యంబు నువ్వె."

సింగ మిటు పల్కి విరమింప శీతగిరియు - జనవిభున కల్ల ప్రీతి నుచ్చైస్స్వనమునఁ
జెప్పెనోయనఁ గందరాసీమనుండి - మూఱిఁబోవుచు వెడలెను మాఱుమ్రోఁత.

శివకింకరుఁ డిట్లన మా - నవపతి తద్గ్రహణభీశనయనంబులఁ ద
న్నవలోకించెడి గురుధే - నువుపైఁ గడు జాలి నొంది నుడివె న్మగుడన్.

"క్షత్త్రజాతివాచకము లోకమున వెలయు - చుండెనుగదా వినాశమునుండి కాచు
చున్నదనెడి వ్యుత్పత్తిఁ దద్భిన్నవృత్తి - కేల రాజ్యంబు, ప్రాణంబు లేల చెపుమ?

లాఁతిమొదవుల నొసఁగి యేరీతిఁ దబిసి - మంట చల్లార్తు నిది వేల్పుదంటగిడ్డి
కంటె వెల్తిది గాదు ముక్కంటికరుణ - యుంట నీతొడుకుం బట్టుకొంటి వీవు.

నాయొడలిని వెలఁగా నిడి - యీయాస్రం బ్రోచు టొప్ప నిటు లొనరింపన్
నీయశనబాధ చను, ముని - రాయని హోమాదివిధుల రాయిడియుఁ జెడున్.

రక్ష్యమును మిత్తికిడి శరీరంబు గాయ - పడని సేవకుఁ డెటు నిల్చు ప్రభువునెదుట
నీవు నొకయయ్యకడఁ గొల్వు నెఱపవొటు? - లేదె నీకును నాకావులీల ప్రమాఁకు?

నే నవధ్యుఁడ నని యెంతువేని నాయ - శోంగరక్షణ సేయు మీయంగముఁ గొని
బుద్బుదప్రాయమును బంచభూతమయము - నైన మేనిపై మముబోటు లాసపడరు.

మాటలాడుకొంట మైత్రికి మూల మ - మ్మైత్రి పాదుకొనియె మనకు నిచటఁ
గాన మిత్రుకోరికను భంగపఱుచుట - నీకుఁ దగదు భూతనేతృదాస!

అందులకు నొప్పి మొదవు సింహంబు విడచె - నపుడ నృపబాహునిర్బంధ మడఁగె నంత
ముక్తశస్త్రుఁడై నిజదేహమును మృగేంద్ర - మున కొసఁగె రాజు మాంసంపుముద్దఁబోలె.

అపు డధోముఖుఁడై నరేంద్రాగ్రసరుఁడు - ఘోరసింహనిపాతంబుకొఱకు నెదురు
సూచుచుండఁగ నతనిపై సోరిదిఁ బడియె - లసదమరహస్తనిర్ముక్తకుసుమవృష్టి.

అంత “లేలెమ్ము వత్సా!” యటంచు నొక్క - యమృతమయి వాణి చెవిసోక నవనిభర్త
లేచి పాల్చేపి తనతల్లిలీల నున్న - సురభిఁ గనె ముందు సింగంబు సురిగిపోయె.

ఎంతయు నబ్బురంపడు నరేంద్రున కిట్లని పల్కె గోవు “నీ
స్వాంత మెఱుంగ సాధుజనసత్తమ! సింగమ నైతి నేన న
న్నంతకుఁడేని డాయ భయ మందు ఋషీంద్రునిశక్తిఁ జేసి, యిం
కెంత తదన్యఘాతుకము లించుక నీవ తలంచి చూడుమా.

నీదయకును గురుభక్తికి - మోదించితి వరముఁ గోరుము పయస్సాకఁ జే
గా దెట్టికోర్కెనేనియు - నీఁదగుదుఁ బ్రసన్ననైన నేను గుమారా!”

పదపడి మానితార్థియు స్వబాహుసమార్జితవీరశబ్దుఁడై
పొదలిన యవ్విభుండు కరము ల్ముకుళించియు “వంశవర్ధనున్,
సదమలనిత్యకీర్తివిలసచ్చరితున్ సుతు ని”మ్మటంచు న
మ్మొదవును వేఁడె నేఁడు వ్రతముల్ ఫలియించె నటంచుఁ బొంగుచున్.

“మెచ్చితిఁ గుమార! నీవర - మిచ్చితి” నని పల్కె ధేను “యిదె త్రాగుము నా
యచ్చంపుఁబాల” నని భా - స్వచ్చరితుండగు దిలీపు సందేశించెన్.

---




౧

క్షమావతి. ఆమె త్యాగశీలిని. ఆమె ప్రాచీనసాహిత్య సాహిత్యమున తన జీవితమును పునీత మొనరించుకొన్నది. పూర్వప్రాయమునుండి యనుభూతముగా జ్యోతిషశాస్త్రము నవగతముచేసికొని యమూల్యసూక్తములను నావిష్కరించినది. ఆయపూర్వసూత్రములే నాటినుండి నేటివఱకు హిందూహృదయమున శబలితరోచిస్సులతో నాయకమణులగా ద్యోతించుచున్నవి.

ఆమె మేధావి. ఆమె ద్రష్ట. ప్రతిస్వల్పవిషయము నామె ప్రకృతిభండారమునుండియే సేకరించుకొన్నది. ఆమె వ్రేలికొనలు నిరంతర మేతారకాగణమునో గుణించుచుండును. వివిక్తవిభావరీవేళల నామె తరళనయనము లేగ్రహాగతినో పరీక్షించుచుండును.

ఆమె విజ్ఞానతృష్ణకు ఆవలి సీమ లేదు. అందుచేతనే జీవితాంతము నామె హృదయప్రశాంతిని నోచుకొనలేదు. నూత్నదర్శనములకు, నూత్నపరీక్షలకు నామె తపించిపోయెడిది.

దైనందినకార్యము లామె వ్రేలిగుణింపులను జరిగిపోవలయును. నాడు జరగినవి. నేడు జరగుచున్నవి. ఆమె సమంకితసూత్రము లంతగా హిందూకేదారమున వేళ్లు పాఱినవి; తొలకరించినవి; సుమించినవి.

ఆమె నందనప్రమదావనమునుండి జారిపడిన పారిజాతప్రసూనము. ఆయమరసుమప్రమదామణి నెటుల గైసేయుటో ఈర్ష్యావిలులగు పండితశౌండులకు దెలిసినదికాదు హృదయము గ్రహించిన మిహిరునకు దెలిసినదికాదు.

౨

క్షమావతి పండితకుమారి. ఆమెతండ్రి అతనాచార్యుడు వ్యుత్పన్నుడు, విద్యాచార్యుడు, కాశ్మీరబ్రాహ్మణుడు. సమగ్రవిద్యావ్యాసంగములో నాతనితల నెరసిపోయినది. విద్యాకాంక్ష యాతని కనులలో నింకను తరళించుచుండెను. ఆమరణాంతము నాతడు నవీనశాస్త్రచర్చ గావించినాడు.

రెండుమూడు శతాబ్దములకుపూర్వము హస్తినాపురము (ఢిల్లీ) రాజకీయాందోళనలపాలయి యట్టుడికినట్లుడుకసాగినది. ఆరాజకీయవిప్లవవాయువు లాకళోపాసకుని విద్యాసమాధినుండి లవలేశమేని కదలింపలేదు.

అపరూపవ్యక్తులకు లోకవాసనలతో నిమిత్తము లేదు. వారలకు ద్వంద్వముల భేదాభేదము లుండవు. వారు అతీతులు.

కొన్ని జనపదములు నిర్ధూమధామము లయినవి. విప్లవకారులు కొందఱు సార్వభౌముని ప్రాణాపహరణమునకు బూని విఫలీకృతు లయినారు. సంఘమరణములు సంభవించినవి. సస్యలక్ష్మిని కార్మొయిళ్లు కాఱుక్రమ్ముకొన్నవి. విశేషములపై విశేషములు తామరతంపరలవలె వచ్చుచుండెను. కాని యేబదియేండ్లు పై

బడిన ముదుసలి చెక్కుచెదరనిహృదయముతో గ్రహభ్రమణములను గుర్తించుచుండెను.

తూరుపుదెసను నీలాంబరవక్షమును ముద్దాడు కాశ్మీరపర్వతశ్రేణి; పడమర హిందూకుష్‌పర్వతపాళి. ఆమధ్యప్రదేశము ప్రకృతిప్రసాదితము. అది నైసర్గిక సౌందర్యఖండము. ఆగ్రామము శ్రీనగరము; అతనాచార్యుని జన్మస్థానము.

3

కుమారావతి తల్లిలేని బిడ్డ. ఆమెను గని తల్లి కదళీతరువువలె నశించిపోయినది. ఆమె మాతృప్రేమోన్మీలనరాగనయనములను నొక్కపరియేని చూడలేదు. ఆమె వసుంధరావక్షమున పసిగన్నులు తెఱచునప్పటికి ఆయమృతవాత్సల్యనేత్రములు మూసికొనిపోయినవి. చిరంతనము మూసికొనిపోయినవి.

అతనాచార్యుడు వాత్సల్యము పుంజీభవించిన పుణ్యమూర్తి. జరాభారమున ముగ్గిన పండుహస్తములతో నాసుకుమారిని అల్లారుముద్దుగా పెంచినాడు. పూలపొత్తికలలోనుంచి లాలించి తల్లిలేని లోపమును కలిగించినాడుకాడు. అతడే యామెకు తండ్రి, తల్లి, సర్వస్వము.

ఆతని ముదినడకలలో నామె తప్పటడుగులు కలసినది. ఆత డస్తమింపనున్న జ్యోతి. ఆమెజీవితజ్యోతిర్వర్తి ఇంకను మసివాఱలేదు; నుసిపోవలేదు. తండ్రి విజ్ఞానరోచిర్మయూఖను తనలో విలీన మొనరించుకొన్నది. ఏబదియేండ్లనుండి స్వానుభవమున గ్రహించిన జ్యోతిషశాస్త్రతత్త్వము నామె చిన్నారిప్రాయముననే యలవరించుకొన్నది. అతనాచార్యు డొకనాడు కుమార్తెనేత్రములలో ఉజ్జ్వలతారకాద్వితయమును చూచినాడు. భ్రుకుటినాట్యములో దీక్షను, తృష్ణను పరికించినాడు.

అప్పటి కామెకు పదియేండ్లు దాటినవి. పదకొండవయేడు ప్రవేశించినది. అప్పటికే యామె గణితశాస్త్రమును తండ్రివేలిత్రిప్పులను నేత్రపక్ష్మములను నేర్చికొన్నది. భాస్కరాచార్యుని సూత్రములు, వరాహమిహిరుని సూక్తులు కొట్టినపిండి యయినవి.

ఆయేకాంతజనపదము—మూసికొన్న వాతావరణము—వ్యాప్తిలేని యాప్రకృతి—ఆమెదృష్టిప్రసారమునకు చాలినదికాదు. ఆమె విజ్ఞానవీక్ష ప్రపంచించిపోవలయునన్న విశాలాకాశావకాశములు కావలయును.

అతనాచార్యుడు యోచించినాడు. పుట్టిననాటినుండి వాసముచేయుచున్న జన్మభూమి. కుమార్తె పురోభివృద్ధి. దేనిని కాంక్షింపవలయును? అది సమస్య. ఒక ప్రశాంతనిశాంతమున కన్నీళ్లతో నొక నిశ్చయమునకు వచ్చినాడు. కుమారికాసహితుడై అంతటి వయస్సులో అతనాచార్యుడు వారణాసికి ప్రయాణము చేసినాడు

౪

వారణాసి విద్యాసరస్వతికి పుట్టినిల్లు. పావనగంగా సవంతిచే పునీతమయిన పుణ్యతలము. సాహిత్యము, శాస్త్రము అక్కచెల్లెండ్రు. పారపొచ్చెములు లేకసాహార్దముతో మెలగుచుండురు. నాటి కళాలయములకు నేటి కళాలయములకు ఆకృతులలో, రీతులలో, బోధనాపద్ధతులలో విపర్యాస మున్నది. ఏయాశయము నాడు హిందూ హృదయమున ద్యోతించెనో, ఆయాశయమే నేడు హిందూహృదయమున ప్రభావంత మగుచుండెను. అందులో పరిణామము లేదు. ప్రవహించునది ఒక్కటే స్రవంతిక. ఒక్కటే గత్యము. కాని దానినిజేరు గతులు వేఱు. గతులు భిన్నములయినను ఆశయ మొక్కటే అయినప్పుడు మన్నింపవలయును.

బ్రహ్మచారులు విద్యానిరతులై అచ్చటికి వచ్చుచుందురు. ఉభయసంధ్యల వేదఘోష. శాస్త్రపఠనము పవమానవీచికల తేలితేలి గంగాతరంగాగ్రముల తూగాడుచుండును.

కాశికాపురి విశ్వనాథుని కాణాచి. భారతసంహిత ప్రణేత వ్యాసభగవానుడు ఒక్కనాటి యాకటివేగున తాగికోలేక వారణాసిని నిర్దహింప యత్నించినాడు. అది కొనసాగినదికాదు. పార్వతి అన్నపూర్ణమ్మయై ఆఋషి కల్పుని యలుక మాన్పి ముద్దుగా సుద్దులుచెప్పినది.

అతనాచార్యుడు జగమెఱింగిన బ్రాహ్మణుడు. ఆతడు జగము నెఱింగినవాడు.

పండుతమలపాకువయస్సులో ఆతనికన్న మెఱయించు విషయ మేముండును? కుమారివ్యుత్పన్నురాలు కావలయును. అదియే యాతడు కాంక్షించునది. అంత కన్న నితరము నాశింపడు.

ఆనవీనసీమలో తండ్రికుమార్తె లిరువురు అచ్చటి పరిస్థితులను తెలిసికొనుచు కొంతకాలము గడపినారు.

క్షమావతి వయస్సుచెడ్డది. ప్రకృతిలోని ప్రతి నూత్నవిషయమును అలవరించుకొన అత్తైత్తిచూచును. కేలు సాచును. క్రేళ్లుఱుకును. ఒక్కొక్కప్పుడు విక్రీత మయిపోవును.

అతనాచార్యుని రాక మొదట కాశికావిశ్వేశ్వరుని దేవాలయఘంటికలలో మ్రోగెను. గంగాతరంగాగ్ర వీథుల బడిపోయి ఆశాంచలముల నల్లుకొన్నది. ఆతని యాగమనము ప్రతిజీవికి జీవముపోసినది. వారణాసియే చదువుల పాలవెల్లి యయిపోయినది. నాటికినేటికి విద్యాసంస్థలలో వన్నెయు, వాసియు గన్నది.

ఒక్కొక్కశాస్త్రములో సిద్ధులైన పండితప్రకాం సన్నిధిని చేరి బ్రహ్మచారు లావిద్యను సమగ్రముగా ంచెదరు.

కొలదికాలముననే అతనాచార్యుని గృహము యిపోయినది. కన్నులలో విద్యారోచిస్సు బ్రహ్మచారికి ఆతని గృహము తేనెపట్టు

కొలదికాలముననే వివిధశాస్త్రపండితశిఖావతంసులతో నాతనికి పరిచయ మయినది.

ఇది క్షమావతివిద్యాభిరతికి దోహద మయినది కాశికాపురివాతావరణమే ఆమెను సంపూర్ణముగా మార్చివేసినది. దీక్ష కన్నులలో తళుక్కొత్తినది. తృష్ణ హృదయమున పూర్ణించుకొన్నది. వికాసము వదనమున ప్రభాసించినది.

తండ్రి ఉగ్గుబాలతో రంగరించిపోసిన జ్యోతిష శాస్త్రమున కిప్పు డామె యగ్రాయము చెప్పకొనసాగినది. ఇతరశాస్త్రములు దానికి ప్రోది. విద్యాసార్వభౌముల మధ్య మెలంగుచు క్షమావతి యనూచాన హిందూజ్యోతిషమును జీర్ణించుకొన్నది. ఆమె భావిభవితవ్యము ఆనందగీతాతోరణములతో విరాజిల్లుట కదియే మూలకందము.

ॐ

విద్యామధువును గ్రోలుటకు హరిదంతపదముల నుండి యువకభ్రమరకుమారులు దీక్షాపక్షముల నల్లార్చికొనుచు అతనాచార్యుని గృహారామమును జేరి శాస్త్రఝుంకారము చేయసాగిరి.

అందులో నెన్నదగినవాడు మిహిరుడు. ఆతడు బ్రాహ్మణబాలకుడు; వంగీయుడు. ఆతని గ్రామము చంద్రపురము. ఆపురము లేతతమలపాకుల పంటకు పేరొత్తినది. దాని నాథుడు చంద్రకేతువు. ఆతడు ఢిల్లీసార్వభౌముని సామంతుడు. ఏటేట కప్పములు గట్టివేయుచు ఆతని రాజభక్తిని వెల్లడించుచుండెను. ఆతడు సరసుడు, రసజ్ఞుడు.

మిహిరుడు చంద్రకేతుని ఆశ్రితుడు. ఆతనికాలముదా రారాజవంశమున కొలువుచేయుటయేగాక ఏదియో సంబంధబాంధవ్య మున్నదనికూడ ప్రతీతి.

చంద్రకేతుని సాదరవీక్ష మిహిరునిమీద ప్రసరించినది. మిహిరున కాస్థానపండితుల సంపర్కము కలిగి

నది. వ్యాకరణము, ఛందస్సు, గణితము, జ్యోతిషము నేర్చికొనినాడు. నేర్చికొన్న విద్యకు శాణపెట్ట జన్మ సీమను వీడి మిహిరుడు అతనాచార్యుని గృహమున కాలిడినాడు.

తెలివితేటలలో, సూక్ష్మగ్రహణములో మిహిరుని చెప్పి యింకొకరిని చెప్పవలయును. అతనాచార్యుని సుధా ప్రసన్నదృష్టి యాతనిపై ప్రాలినది. గురుదేవుని హృదయమున నాతని కావాసము లభించినది.

అతనాచార్యుని కుడికన్ను క్షమావతి; ఎడమకన్ను మిహిరుడు. ఇద్దఱియెడ నెఱమఱికలు పాటింపక విద్యా ప్రదానము చేయుచున్నాడు.

మిహిరుడు క్షమావతి సహాధ్యాయి. అతనితో నామెక్లిష్టసమస్యలను, విద్యావిషయములను చర్చించెడిది. అప్పుడప్పుడు వారు కొన్నిసిద్ధాంతములు చేసి తామరస పత్రములో నిడి గురుసన్నిధిని చేర్చెడివారు. గురుదేవుడు ఆసిద్ధాంతములను సమాలోచనముచేసి పరిష్కరించి వాని కగ్రస్థానము నిచ్చెడివాడు.

క్షమావతిబుద్ధి కత్తిమొనవంటిది. పదను విశేషము. అది స్త్రీప్రకృతికి సహజము. ఏవిషయమున నయిన నామె తన నెచ్చెలితో తీసిపోయెడిదికాదు. ఒక్కొక్కప్పుడు శాస్త్రచర్చలో ముందంజవేసి మిహిరుని యోడించెడిది. అసాధ్యములయిన సమస్యలను దూదిపింజలవలె విడదీసి విద్యాపీఠమును ఉత్సవముతో ముంచెత్తెడిది. అతనాచార్యున కానందము అమందము. మిహిరునకు కన్నెఱ్ఱ కొంచెము.

చిన్ననాటినుండి క్షమావతికి జ్యోతిషమన్న పెరుగన్నము. సహజదోహదమువలన నది వికాసిల్లినది. నేడు జ్యోతిర్విద్యలో ఆమె కందెవేసినచేయి లేదు. ఆ విద్య అనితరదుర్లభము. సామాన్యవిద్యార్థి దానిపొంతకు బోలేడు. ఆవిద్యారహస్యములను క్షమావతి మిహిరునకు సూచించినది, బోధించినది. అతని కాశాస్త్రరహస్యములు మనమెక్కినవి కావు. ఆశాస్త్రపరిశోధనమందు మిహిరుడు విస్తారము జోక్యముచేసికొనలేదు. అదియంతయు క్షమావతికి వదలివేసినాడు.

ఆసహాధ్యాయులు యువకులు. ఒకచెట్టునీడనే విద్యాసమాధిలో మునిగెడివారు. పూజాపురస్కారములకు ఒక్కసారి లేచి ఒకచెట్టుపూవులను కోసికొని తెచ్చి కూర్చెడివారు. ఆకూర్చిన దండలో వారివారి వాంఛాప్రసూనములను చేర్చెడివారు. అది సహజము. అవిలంఘ్యము. ఇంచుమించుగా ఇరువురుసమానవయస్కులు. అందులో విపరీత మేమున్నది?

స్నేహసూత్రముకన్న నపూర్వసూత్ర మేదో వారి హృదయములను సూత్రీకరించినది. కన్నులను కలపినది. దరహాసములలో సుధామధువును చిలకరించి పోసినది.

అతనాచార్యుడు గ్రహించినాడు. ఆతని హృదయము ప్రాపంచికవిషయసమాలోచనములో పండిన హృదయము. ఆతడు లౌకికుడు. ఆలోచించినాడు. చిఱునవ్వుకొన్నాడు. వారు ముగ్ధులుకారు. చదువుకొన్నవారు; హృదయమున్నవారు. వారి లక్ష్యమునకు స్థిరత్వము నాపాదింపవలయును. వారి భవితవ్యజీవితపథమును సుగమము చేయవలయును.

## ౬

నాడు కాశికి బోయినవారు మగుడిరారని వాడుక. మధ్యమార్గముననో, కాశీవిశ్వనాధుని యాలయ శిఖరమును చూచియో కొనప్రాణములను విడచివైతురని అభిప్రాయము. ఆనాడులలో ప్రయాణమన్న ప్రహసనము. దారిలో ఎన్నియో కాలిచెప్పులు అరిగిపోవును. యాత్రార్థులు వారి సమస్తమును ఆప్తుల కప్పగించేసి ప్రయాణించెడివారు.

కారుమొయిళ్ల దొంతరదొంతరలః
లెన్నికవిసినను దరిద్రులకే! శ్రీమంతులు పం
కముల కెట్లు దూరులో, అట్లే కష్టములకు

తీర్థయాత్రాచణశీలివై చంద్రపుర రాజేశ్వరుడు బయలుదేరినాడు. అనుచరులతో, మిత్రులతో, విదూషకులతో, రాణివతో బయలుదేరినాడు. రాజేశ్వరులు కాననసీమ నున్నను, నగరమున నున్నను విభేద ముండబోదు. రథయానము, నావికాయానము సమానమే.

అది శుభవాసరము. వృద్ధపురోహితులు కంపిత కంఠములతో ఆశీర్వచనములను గురియించుచున్నారు. మధురమోహనవాద్యములు మొరయుచుండెను. యమునా నదిపై చంద్రకేతువు వారణాసికి బయలుదేరినాడు.

ఆయమునాహృదయము తరంగిత మగుచుండెను. నదీవక్షమును చీల్చికొనుచు నావ బడిపోవుచుండెను. ఆచుట్టునున్న ప్రకృతిశోభ కన్నులకఱవు దీర్చును. ఆయనంత నైసర్గికమాధుర్యమున విలీనమయిపోబుద్ధి జనించును. కవితాహృదయము లీలాతాండవ మాడును. దాని కంత ముండబోదు, తుది కానరాదు.

దూరమునుండి కాపుల ఏలపాటలు, నీపవృక్షముల మాటుననుండి గోపాలుర అవ్యక్తమురళీధ్వనులు శ్రుతిపర్వ మగుచుండెను. అది యేమి కనులవిందు. అపరారుణరాగరేఖాంచితసాంధ్యలక్ష్మి యమునాస్రోతస్వినీభంగాగ్రవీథుల నృత్యకేళి చేయుచుండెను. ఏహృదయము ఆనందమున నిట్టూర్చదు. నాటి పాటగాని మురళీగీతికలను దాచుకొన్న యమున అప్పుడప్పుడాపాటల తీయదనములను మోయలేక మలయకుమారికల కప్పగించుచుండెను.

కష్టమన్న నేమో ఎఱుంగక చంద్రకేతువు వారణాసికి జేరుకొనియెను.

అట్టివారికి ప్రయాణసౌలభ్యము విదితముకాదు. వారు రాజులు. రాజులురాజులు.

వంగభూమిప్రాంతముననుండి సుధామధుకణము గంగపుష్కరిణీతీరమున వచ్చిపడినదని పసికట్టినారు. పండాలు, పురోహితులు, వైదికులు, వందలు తండోపతండములుగా వచ్చి మూగినారు.

శాంతికపౌష్టికకర్మలను నెఱపుటకన్న చంద్రకేతుని కన్నులలో ఒకవాంఛ మెరయుచుండెను. అతనికి మిహిరుని చూడవలయుననియున్నది. ఆతనికోరిక నెఱిగి, మంత్రి మిహిరునికోసము ప్రతిసంస్కృతవిద్యాపీఠమునకు పండాసహాయమున పరిచారకులను పంపినాడు.

తుదకు పరిచారకులు క్షేమావతితో శాస్త్రచర్చ చేయుచున్న మిహిరుని గనుగొన్నారు. వానికి చంద్రకేతుని యాదేశము నివేదించినారు. ఆతనిహృదయము అవ్యక్తానందము ననుభవించినది. కాని చెప్పకోలేని భావ మాతనిని కుంచించినది. చిరునవ్వుతో క్షేమావతి చెంత సెలవుదీసికొన్నాడు. చంద్రకేతుని సన్నిధానమునకు బోయి మూర్తీభవించిన విద్యామూర్తివలె నిలువబడినాడు. ఆవిశిష్టమూర్తిని చూడగనే చంద్రకేతునకు అపరిమితానందము కలిగినది.

మిహిరుడు పెరిగి పెద్దవాడయినాడు. అంగకములు మాంసలములై స్నిగ్ధములైనవి. చేరలకు గొల్వగల్గు కన్నులలో మహస్సు వెలిగిపోవుచున్నది. నూనూగుమీసములు తుమ్మెదచాలు లైనవి.

మిహిరుని యోజస్సు చంద్రకేతువు గ్రహించినాడు. ఆవిద్యాసముద్రుడు తన యాస్థానమున నుండ నభిలషించినాడు. రాజుగారి కోర్కె మిహిరునకు దెలిసినది.

ప్రత్యుత్తరముకోసము రాజు ఎదురుచూచుచుండెను. వినీతభావమున క్రిందుకు వాంచియున్న మొగము నెత్తి మిహిరుడు చంద్రకేతుని చూచినాడు.

అది నిశ్చయముగా మిహిరునకు పరీక్షాసమయము. చంద్రపురాస్థానములో పండితపదవి కోరుకొనకయే వచ్చుచున్నది. ఆతని శ్రమలకు ఫలము కలిగినది. ఆతని స్వప్నముల కాకృతి యేర్పడినది. అది బహుజన్మ

కృతానేకఫలము. అతని చుట్టపక్కములలో నిరంతము ఉండవచ్చును. కాని క్షమావతి. క్షమావతి ఆతని గన్నులకు గట్టినది. ఆప్రేయోమూర్తి నెట్లు వీడిపోవగలడు? ఆమె యాతనిపాలి పారిజాతము. ఇప్పుడు వియోగమన్న చిరవియోగమేకాక బహుజన్మవియోగ మగును. అంత నాతనిలో ఒకయూహ మెఱసినది. ఆతని ముఖముద్రికలను చంద్రకేతువు గుర్తింపకుండనుండలేదు.

"ప్రభూ! ధన్యుడను. న న్నాహ్వానించి మీ యుదారహృదయమును వెల్లడించినారు. చంద్రపుర విద్యాపరిషత్తులో నుండవలసినంత యోగ్యత నాకడ లేదు. మీ రొసగు గౌరవతాత్పర్యములకు నేను తగను. నే నింకను విద్యార్థిని. జ్యోతిషమున వన్నెయువాసియు గన్న వ్యుత్పన్నుని దీసికొనిపొండు. వారణాసి పండిత శౌండులకు పుట్టినిల్లు."

"మే మెఱుంగుదుము. నీయెడ మాకు గల సద్భావము ని న్నాహ్వానించినది. ఈప్రదేశము మాకు నూతనము. ఇచ్చటి పండితుల పరిచయము మా కంత లేదు. అయినను చంద్రపురము ఇసుకఎడారి. అచ్చటకు రా నెవ్వ రభిలషింతురు?"

"సత్యము. కాని మాగురుదేవులు జ్యోతిషమున నిధి. వారణాసి వారికి జేజేలువెట్టినది. ఈయూరు వారికి గ్రొత్త."

"వారు వచ్చుట కంగీకరించెదరా?"

"బహుశః అంగీకరింపవచ్చును. వారి కొక్కగాని యొక్క కుమార్తె. ఆమె విద్యాసరస్వతి. ఆయమపురో భివృద్ధికొఱకే వా రీపురము విజయముచేసినారు. ఆమె నొక్కగృహిణిగా జేయవలయునని మాగురుదేవుల ఆశయము. మీరు ఆహ్వానించిన వారు మారుపలుకకపో వచ్చును"

ఆమాటల భావమును చంద్రకేతువు చిఱునవ్వుతో గ్రహించినాడు.

అతనాచార్యుని దర్శనము మఱునాడు చేయుదు నని చంద్రకేతువు పలికినాడు.

మిహిరుడు తలవాంచికొనియే గురుపీఠాభిముఖుడైనాడు.

## ౭

తపస్వికన్యల పాదలాక్షారుణాంక రేఖికలవలె నరుణారుణరాగములు మెఱసినవి. దూరమున రేగుచున్న హోమపరిమళధూమము నాహరించుకొని, పూర్ణించుకొని మందమయినది ప్రత్యూషఃపవనము.

అవి సంక్రాంతిదినములు. క్షమావతి వేకువనే లేచినది, వాకిట కలయంపి ఇల్లినది; వింతవింత అందములతో క్రొత్తగ్రొంగొత్త ముగ్గులను రచించినది. వాని కామెయే ప్రణేత కాబోలు.

అది ఒక ప్రశాంతప్రదేశము. ఉన్నతతలమున ఒకకుటీర మున్నది. నాలుగుబారల దూరములో శుక్రవార మభ్యంగస్నానము చేసి పూజాద్రవ్యములతో దేవాలయమునకు పోవు పుణ్యకాంతవలె గంగాభవాని ప్రవాహిల్లుచున్నది.

కుటీరమునకు దక్షిణపార్శ్వమున గున్నమావి ఉన్నది. ఆమావిచాయల రాతిచప్పరము లున్నవి. విద్యార్థులు కిలకిలమనుచు కూర్చుండిఉన్నారు. పావుకోళ్ల ధ్వని అయినది. గుసగుసలుపోవుచున్నవారు నిమ్మకు నీరొత్తిన ట్లయినారు. అతనాచార్యుడు వచ్చి కృష్ణాజినమున పద్మాసనములో గూర్చుండెను. ఒకబ్రహ్మచారి ముందునకు వచ్చి వల్లెవేసిన శ్లోకములను అప్పగించెను. వేఱొక కాకపక్షుడు వేదమున కన్వయము చెప్పకొనసాగెను. మిహిరుడు ద్వారముఖమున దృష్టిసారించి చూచుచున్నాడు. అప్పుడప్పుడుమాత్రము గురుదేవుని సౌమ్యవదనము నాలోకించి, కాంతులువిరిసికొన్న చూపులతో, సిగ్గుతో క్షమావతిని చూచుచున్నాడు. క్షమావతి కన్నులు త్రపాప్రసన్నము లగుచున్నవి; సుధాప్రసన్నము

లగుచున్నవి. ప్రతిమానచంద్రులతో ప్రభాసిల్లుచున్న నీలిసరస్సు లామెకన్నులు. నిరంతరతారకాపరీక్షవలన ఆమెకనులు తారకలైనవి.

“మహారాజరాజశ్రీ పరమభట్టారక చంద్రకేతు మహారాజులుంగారు విజయముచేయుచున్నారు” అని విన్నవించినాడు.

బ్రహ్మచారు లావార్తను లక్షింపక ఎవరి పారములను వారు చదువుకొనసాగిరి. మిహిరుడు గురుదేవుని వంక సాకూతదృష్టితో చూచెను. గురుదేవుడు లేచి నిలువబడెను.

శిష్యుడు గురుదేవు ననుసరించెను. క్షమావతి చంచలదృగంచలములు మిహిరునిపై వ్రాలినవి. మిహిరుడు చిఱునవ్వినాడు.

రాజునకు స్వాగతమీయ ఛాత్రసమేతుడై అతనాచార్యుడు కొంచెముముందున కరిగినాడు. చంద్రకేతువు రాజలాంఛనములతో ఎదురయినాడు. ఆతడు సాహిత్యేశ్వరుడు; ఈతడు రాజ్యేశ్వరుడు. ఆకృతిలో, నడకలో, కన్నులలో నెంతవ్యత్యాసము. మిహిరుడు గురుదేవుని చంద్రకేతువునకు బరిచయముచేయ నవసరము లేకపోయినది. నమస్సులు, దీవనలు, కుశలప్రశ్నలు జరగినవి.

అందఱు కలసి పర్ణశాలకు అరుదెంచినారు. ఆప్రశాంతపునీతవిద్యాపీఠమును చూచి రాజు నిట్టూరినాడు. ఆనందమున నాతని హృదయము పింపిళ్లు గూసినది.

చెప్పలేక చెప్పలేక రాజు తన అభీప్సితమును నివేదించినాడు :

“మాది ఒక పెద్దఎడారి. మీరు విద్యాసింధువులరు. మీవిజ్ఞానవిలోకనమున వారణాసి ధన్య అయినది. మాపురమునకు విజయముచేసి మమ్ము ధన్యుల జేయవలయును” అని పునీతభావమున పలికినాడు.

ఆవిజ్ఞాపనముతో క్షమావతి అతనాచార్యుని కన్నులకుగట్టినది. ఆతనికి షష్టిపూర్తి అయినది. అతనికేమి కావలయును? కుమార్తెపురోభివృద్ధి. అంతకన్న నావృద్ధున కేమి కావలయును? ఆతని కొక ప్రశాంత ప్రదేశము కావలయును. కుమార్తెకు ఒక ప్రశాంత గృహము కావలయును.

అదివఱకు అక్కడకు వచ్చి నిలచియున్న క్షమావతివంక తండ్రి చూచినాడు. ఆమెచూపుల భావమును గ్రహించినాడు. ఆతడు జ్యోతిషి.

మిహిరునివంక చూచినాడు. ఆతని చూపుల భావమును గ్రహించినాడు. ఆతడు లౌకికుడు.

జ్యోతిర్మయూఖవలె నున్న క్షమావతి చూడగనే చంద్రకేతుని చేతులు తమంతటనే జోహారు పెట్టినవి.

“తమంతట తాము వచ్చి యడిగినప్పుడు కాదనజాలను. నాదృష్టికి దేశవిభేదము లేదు. ఇంతటినుండి వంగదేశము నాదేశము. నాకుమార్తెసౌభాగ్యము నా భాగ్యము” అని గురుదేవుడు పలికినాడు.

చెంతనున్న శిష్యుల కన్నులు చెమ్మగిల్లినవి.

౭

కాశ్మీరబ్రాహ్మణుల ఇంటిఆడబడుచు వంగదేశీయుల కోడలైనది.

ఆమెపారాణిపాదము వంగగృహమున బెట్టగనే వంగదేశలక్ష్మి నిత్యకల్యాణము పచ్చనితోరణముతో ప్రభావంత మాయెను.

ఆమెవిజ్ఞానము సర్వతోముఖముల వ్యాపించినది. భర్తసహాయమున, తండ్రిఆచార్యకమున ఆమె జ్యోతిర్విద్యలో కూలంకషపాండిత్యము గణించుకొన్నది. ఆ నాళులలో జ్యోతిషశాస్త్రమున నామె కందెవేసిన చేయి లేదు. నేడు లేదు. అపూర్వములుకాదు, క్లిష్టసమస్యలయినను నామెచేతిలో దూదిపింజలట్లు విడిపోవలయును.

అంతవఱకు వంగహృదయమునకు గ్రాహ్యముకాని జ్యోతిస్సూత్రముల నామె ఎన్నిటినో సిద్ధాంతీకరించినది, నిరూపించినది.

ఆమె యతిలోకవిదుషీమణి. అయినను ఆమె సహజస్త్రీత్వమును విడనాడికోలేదు. ఆమె తన విద్య వలన మానసికప్రవృత్తిని పరివర్తనము చేసికొన్నది.

భర్తయందలి ప్రేమము శివజటాజూటచ్యుతపవిత్ర గంగాజలముకన్న పవిత్రమయినది, స్వచ్ఛమయినది. తండ్రియందలి భక్తివాత్సల్యములు పొరపొచ్చెములు లేనివి. నక్షత్రగత్యగ్రహణముతోపాటు గృహకృత్య నిర్వహణము నామె ఏమఱుటలేదు. తోడిస్త్రీలతో కలసి మెలగునప్పు డామె వినీతమును కోరుకోలేదు.

క్షమావతికి చంద్రకేతుని జోహారులతోపాటు ఉపహారములకుగూడ పరిమితి లేదు. ఆతని దానహస్త మామెశిరస్సున శాశ్వతముగ నిలిచిపోయినది.

అంతటివిజ్ఞానవతి, అంతటిజ్యోతిషి, అంతటిరూపవతి తన యాస్థానమునం దుండెనని చంద్రకేతుని గర్వమునకు నిస్సీమ.

అచ్చటి పండితశౌండుల ఆదరణమున చంద్రకేతుని భావములో పరిణామము కలిగినది. పండితావతంసులు కారణము గ్రహించినారు. క్షమావతి వారి సుఖోపజీవితమార్గకంటకి అని గ్రహించుకొన్నారు. ఆమె సిద్ధాంతీకరించిన నూత్నసూత్రములకు ఔదలలు వంచిన వారు నేడు పెడమొగ మయినారు. వారికన్నెఱ్ఱకు మంటలు మాసినవి.

క్షమావతి ఎంతటి విజ్ఞానశీలియో, అంతటి నమ్రశీలి.

ఇరువదిరెండేండ్లు దాటకుండగనే మొలకవెన్నెల వంటి ఆమెయశస్సు వసంతపదములతో హరిదంతపదము అను మార్కుమోసినది.

ఆమెను దండ నుంచుకొని భారతమాత సాంధ్యనటుని నిత్యతాండవకేలిలో తన పదవిన్యాసము చేసినది.

సరస్వతియే మానవరూపమున భూతధాత్రి నవతరించి స్త్రీముఖమున జ్యోతిర్విద్యను ప్రతిష్ఠించినదని నాడు చెప్పకొన్నారు; నేడు చెప్పకొనుచున్నారు.

పండితుల హృదయమున రేకొత్తిన భావము ఫలప్రదముకాక నూరకపోదు.

ఆమెపతనకారణము నెమకుచున్నారు. వారు పండితులు. వారి కవగతముకాని విషయము లుండవు. ఎంతటి నైచ్యమున కొడిగట్టిఅయిన వారి కార్యమును సాధించుకొందురు. ఈర్ష్యావిలులు కార్యసాధనమున ఉచితానుచితములు పాటింపరు.

క్షమావతిజీవిత మొక విజయగీతి. ప్రతిపదము విజ్ఞానమునకే నూత్నములయిన సూత్రములతో నిండిపోవుచుండెను. ప్రతిపదము ఉపజ్ఞతో, ఓజస్సుతో పూర్ణించిపోవుచుండెను.

ప్రతిదినము ఆమె ఏదియో ఒక నూత్నసిద్ధాంతమును కనుపెట్టుచుండెను. ఆమెమూలమున ఎన్నియో గోపనవిషయములు వెల్లడిల్లినవి. ఆమెపాండితీప్రకర్షకు దిగ్గజములవంటి పండితులే తెలతెల్లబోవసాగిరి. ఆమె పురోభివృద్ధి సభాపండితులకు హృదయశల్య మయినది.

చంద్రకేతుని దయావీక్ష వారినుండి మరలి క్షమావతియెడ కేంద్రీకరించినది. వారి మాటకు సభలో పాటింపు లేదు. వారి విజ్ఞానచంద్రికలను క్షమావతి యశఃకీర్తులు ముంచెత్తినవి. ఇది భరింపరానిది.

౬

౧౭౪౨-వ సంవత్సరప్రాంతమున వంగభూమిలో భూకంపము వచ్చినది. శతవృద్ధు లిట్టి భూకంపమును చూచియుండలేదని మాట యిచ్చిరి. గ్రామములు క్రుంగుడుపోయినవి. పంటలు ధ్వంసము లయినవి.



కవిసార్వభౌమ, రవీంద్రుడు
(ఇటీవల వీరికి సప్తతిపూర్తి మహోత్సవము జరిగినది)



శ్రీమతి డా. అని బిసెంటమ్మగారు
(85–వ జన్మదినోత్సవమును గాంచినది)



సర్ అతుల ఛటర్జీ

ఇండియా హైకమీషనరుగ నున్న వీరు ఇండియా మంత్రికార్యాలయ సభ్యులుగ నియమింపబడిరి.



బ్రజేంద్రలాల్ మిత్ర

వైస్రాయి ప్రభుత్వమున లామెంబరుగ నున్న వీరు నానారాష్ట్రసభలో భారతీయప్రతినిధి వర్గమునకు నాయకుడుగ నియమింపబడిరి



బల్లూభాయి దేశాయి

బార్డోలీ విచారణలో రైతులతరఫున వాదించిన బొంబాయి అడ్వొకేటు పూర్వపు అడ్వొకేటు జనరలు



సర్ భూపేంద్రనాథ మిత్ర

ఇండియా హైకమీషనరు



సర్దారు శివదేవసింగు

ఇండియామంత్రికార్యాలయ సభ్యులుగ నియమింపబడిరి.

క్షామము వచ్చినది. నిలువనీడలేక, తినుటకు తిండిలేక ప్రజలు అల్లాడిపోసాగిరి. ఆవత్సరము ప్రజానాశనము, గోనాశనము, సస్యనాశనము పెచ్చుపెరిగినది. దినము దినము దుర్భిక్షు ప్రబలుచుండెను. నిమిషనిమిషమునకు జనుల ఆక్రందనములు చంద్రకేతుని వీనుల సోకుచుండెను. "అన్నమో రామచంద్రా" అనుపదము వారి జీవితగీతికి అనుపల్లవి అయిపోయినది.

చంద్రకేతువు కరుణాప్రసన్నుడు. వారి ఆక్రందనములకు వాని మనస్సు వెన్నవలె కరగిపోయినది. క్షామ నివారణోపాయ మాలోచింపవలయును. ఎంతధనమైన వెచ్చింప నిశ్చయించి చంద్రకేతువు ఒకనాడు సభతీర్చినాడు. పండితులను రావించినాడు. ఆనిండుసభలో క్షామమునకు ప్రతిక్రియ నూహింపవలయునని పలికినాడు.

వారు మీనమేషములను గుణించినారు. శ్లోకములను పఠించినారు.

భూదేవి ప్రకోపమందినది. ఆమెశాంతికి శాంతి కర్మలను చేయవలయును అని సూచించినారు.

ఎంతటి విజ్ఞానవిశిష్టుడైనను మిహిరుని పూర్వవాసనలు వదలినవికావు. పండితుల సూచన అతని యంగీకారము నందినది.

చంద్రకేతువు శాంతికకర్మాచరణమునకు కావలసిన ధనము ధారవోసినాడు. ఈవిషయము క్షమావతి చెవిసోకినది. ఆమె పకాలున నవ్వినది. తన మిహిరుడు పండితుల మాటలకు తలయొగ్గెనని విని కొంచెము వేధిల్లినది. కాని ఆమె హృదయమును మార్చుకొనలేదు.

ఇన్నినాళ్లు సకలశాస్త్రములను తఱచి నిగ్గును సంపాదించుకొన్న పండితప్రకాండులు ప్రకృతిసహజసూత్రములను గుర్తింపలేరైరని యామె చింతించినది. ప్రకృతి పరిణామమును పరివర్తనము సేయ దేవతారాధనలు, శాంతికపౌష్టికకర్మలు వినియోగించునా? భూకంపకారణము ఆమె చక్కగా సిద్ధాంతములతో నిరూపించి చెప్పినది. ఆమె వాదమును ఎదుర్కొనవలసినదని విద్యావిశిష్టులను ఆహ్వానించినది.

ఒక్కరు ఆమెఆహ్వానమును అంగీకరింపలేదు. కాని ఆమెపై నిప్పులు చేటలతో చెరగిపోసినారు. కోపముతో వారు పరవళ్లు ద్రొక్కినారు.

స్త్రీ తమను ధిక్కరించుటయా? సమయము లభించినది. అణగియున్న వారి కోపము, ఈర్ష్య రేగినవి. పండితులు ఎవరికి దోచినట్లు వా రామెను తూలనాడిరి. నిండుసభయనిఅయిన యెంచలేదు.

"ఈభూకంపమునకు కారణము ఆమంత్రకత్తెయే! ఆమెమూలముననే పాడిపంటలతో నిత్యకల్యాణముగా నుండెడి ఈదేశము ఈతిబాధలకు లోనయినది. ఆమె నీదేశమునుండి తరలింపవలయును" అని కొందఱు ఐకకంఠ్యముతో బలికినారు.

ఆతీర్మానమును తక్కిన పండితతల్లజులు ఏకగ్రీవముగా ఆమోదించినారు.

ఆమెపై పండితులు లేనిపోని నీలాపనిందలు కల్పించినారు. మిహిరుని చెవిలో విషము నూరిపోసినారు. ఆముగ్ధహృదయుడు కిమ్మనలేదు.

"క్షమావతి వంగదేశమునుండి తరలిపోవలయును." అని చంద్రకేతువు మ్రొక్కినకరములతో ఆశ్రీముఖమును లిఖించినాడు.

మిహిరునకు ఏమియు పాలుపోయినది కాదు. ఇంతకుపూర్వమే ఆమెతండ్రి దివంగతుడయినాడు. ఆమె ఏకాకిని.

## ౧౦

ఆమె చనిపోయినది. కాని ఆమె ప్రతిహిందూ హృదయమున జీవరాగకళలతో పిసాళించుచున్నది.

హిందూవనితకు త్యాగము పెట్టినదిభిక్ష. ఆమె కాలి నుసియయి తన బూదినుండి ఇతరులకు సౌఖ్య

మ్మును పంచిపెట్టినది. అందుచేతనే భారతమాత గౌరవముతో తాండవించుచున్నది.

యుగయుగాంతరములనుండి ఒక్కటే గీతి, ఒక్కటే శ్రుతి, ఒక్కటే చరిత ఆవృత్త మగుచున్నది. నామరూపములలో భేదమున్నను, వస్తువులో భేదము లేదు. అది విశిష్టవిషయము.

పార్వతీపరమేశ్వరులు పురాణదంపతులు, అర్ధనారీశ్వరులు. వారలే హిందూస్త్రీపురుషులకు ఆదర్శప్రాయులు. ఒకరు లేకున్న ఒకరు జీవింపలేరు. హిందూ గృహలక్ష్మి ఏకాంతజీవితము నెఱుగదు.

మిహిరుడే చంద్రకేతుని శ్రీముఖమును దెచ్చి క్షమావతికి ఇచ్చినాడు. ఆమె చూచుకొన్నది. ఆతడు కంపిల్లుచు ఆమెప్రోల నిలువబడినాడు. చిఱునవ్వు మాత్ర మామెచెకిలిపెదవులనుండి చెదరిపోవలేద. విధి శాసనానుగతికి జోహారువెట్టినది. ఆమె తనకోస మెన్నడు తలారింపలేదు. కాని ఆమె ఎంతటి విజ్ఞాన మూర్తిఅయినను స్త్రీ అమాయకుడయిన తన నాథుని జూచి కన్నీరొడ్చినది. ఈర్ష్యావిలులగు పండితుల చేతులలో చేయికలసినందులకు మిహిరునిపై ఆమె జాలి నొందినది.

"ధన్యను, నామృత్యువును నా నాథుడే ప్రసాదించినాడు"అని అనుకొన్నది. సంధ్యాసమయము. క్షమావతి జీవితకావ్యమునకు ఆశ్వాసాంత మగుచున్నది. దూరము నుండి ఆమెభరతవాక్యమును ఒక శకుంతము పఠించుచున్నది. దేవాలయఘంటికానినాదములో వెలికి ఏదో కవిసినది.

సంధ్యాసమయము. మిహిరుడు కులదేవతకు పూజాపురస్కారములు చేయుచున్నాడు. చందనగంధములతో అగరుధూపములతో అర్పించినాడు. దేవిని గొంతెత్తి నుతించినాడు. స్తోత్ర మయినది. కనులు మూతగొన్నవి. మిహిరుడు నిశ్చలసమాధిలో మునిగినాడు. ఒక పాషాణవిగ్రహముసన్నిధిని ఇంకొక పాషాణ విగ్రహ మయిపోయినాడు. ఆతని జీవనసంధ్యలో ప్రార్థనాగీతి సమాప్త మయినది. కనులు విచ్చినాడు. కనులు విచ్చి దేవీమూర్తిసమక్షమున రక్తపువెల్లువలో విగత జీవియై పడియున్న ప్రతిదేవీమూర్తిని పరికించినాడు

క్షమావతి చేసేత దేవతాహస్తమునుండి కరవాలమును గొని నిండుజీవితములను త్యజించుకొన్నది. రక్తపు సోనలో దోగియున్న విశిష్టత్యాగశీలిని మిహిరుడు చూచినాడు. స్థాణు వయినాడు.

"ప్రభూ! నేను మరణించుచున్నాను. నీవంశము, నీదేశము మంగళోత్సవములతో వెలుగు నను సంతృప్తితో నేను మరణించుచున్నాను. ప్రభూ! నమస్సు" అని దేవీ ముఖమునుండి వెలువడినవి.

అవియే కకుబంతముల ప్రతిధ్వనిల్లినవి. ప్రతిచిగురాకు, ప్రతిచిఱుగాలి, ప్రతిచిఱుకెరటము ఆసందేశముతో వంగదేశమును ముంచెత్తినది.

ఆమె చనిపోయినది. కాని ప్రతిహిందూహృదయమునను ఆమె జీవరాగకళలతో పిసాళించుచున్నది.

ఆమె త్యాగశీలిని.

---






# సంసారసాగరం

కాళ్ళూరి వేంకటరామారావు గారు

సాయంకాల మైదుగంటలయేసరికి ఆకాశం కారుకమ్ముకు పోయింది. కుండపోతల్లులుపడ్డట్లు వర్షం ప్రారంభించింది. ఉదయంనించీ చిన్నచిన్నచినుకులను రాలుస్తూ సంచరించిన మేఘాలన్నీ గూడుకట్టుకుని ఒక్కసారిగా నిమ్మరించేస్తున్నాయి అయిదు నిముషాల్లోనే భూమి అంతా జలమయమై పోయింది.

యథాప్రకారం అయిదుగంటలకే మిల్లు కూసింది. వేలకొద్దీ పనివాళ్లు చీమలబారుల్లాగ నాలుగుమూలలనించీ బైటికొచ్చేశారు దూరపు గ్రామాలనుంచి వొచ్చినవాళ్లు వర్షానికి లక్ష్యపెట్టకుండా బుర్రలమీద గుడ్డ ముసుగువేసుకుని, భోజనపాత్రలుగల చిక్కాలను బుజాలకు తగిలించుకుని ఇంటిదారిపట్టారు వర్షపుజోరు తగ్గుతుందేమోనని మిగిలినవాళ్లు ఆకాశంవంక చూస్తూ వసారాలలో నిలబడ్డారు.

విశ్వనాథమువద్ద గొడుగున్నది వానవురవడి చూస్తే గొడుగు లాభం వుండదని అతనికి తోచింది అందుచేత కొంచెం తగ్గినతరువాత పోవచ్చునని అతడు ఆఫీసుగదిలోనే కూర్చున్నాడు.

అరగంట దాటినది వర్షం తగ్గేసూచన లేమాత్రమూ లేవు క్రమంగా చీకట్లు మూసుకొస్తున్నాయి మిల్లుకీ విశ్వనాథంయింటికీ మైలుదూరంపైగా వుంది ఇంక ఆలస్యంచెయ్యడం మంచిదికాదనుకుని అతడు మెల్లిగా నడకసాగించాడు.

గాలి "రయి" మని ధ్వనిచేస్తూంది. గొడుగువేసుకున్నాడన్నమాటేకాని విశ్వనాథముబట్టలన్నీ పావుగంటలోనే తడిసిపోయాయి మరికొంతసేపటికి గాలిపోటుకి ఆగేటట్లుకనబడనందున అతడు గొడుగు ముణిచేశాడు. మార్గమంతా జారుబరదలతోనిండిఉండెను బురదచిందులు పడి అతనిపంచ ఎర్రబడిపోయింది. చలిచేత విశ్వనాథం ఆపాదమస్తకమూ వొణికిపోతున్నాడు.

విశ్వనాథం యింటికిచేరేసరికి బాగా చీకటిపడిపోయింది. ఒకయెత్తుఅరుగుల యింటిని సమీపించి అతడు తలుపుతట్టాడు నాలుగైగు సార్లు తట్టిన తరవాత "ఎవరువారూ?" అని లోపలినుంచి ప్రశ్న వినబడింది

"నేనూ! తలుపు వేగిరం తియ్యి బట్టలన్నీ తడిసిపోయాయి. ఎన్నిసార్లు పిలిచినాపలకవేం? ఏంచేస్తున్నావు లోపల?" అన్నాడు విశ్వం



"అబ్బా, నిద్రపోయినపిల్లాణ్ణి లేపుతా వెందుకూ?"

"మీాశేనా ? ఉండండి, ఉండండి చెయ్యిపూరుకోలేదు. ఒరే అబ్బాయీ! అబ్బాయీ! నాన్నగారొచ్చారు, కొంచెం తలుపుతియ్యి బాబూ!" అని విశ్వనాథముభార్య సుందరమ్మ ఇంట్లో పిల్లవాడితో చెబుతూంది.

ద్వారంపక్కనే వున్న అరుగుమీాదికి వొచ్చి విశ్వనాథం కిటికీలోనుంచి లోపలికిచూశాడు. అతనికుమారుడు మంచంమీాద గాఢనిద్రలో వున్నాడు. పిల్లవాణ్ని అటూయిటూ దొర్లిస్తూ అతనిభార్య లేపుతూంది. అప్పుడతడు "అబ్బా! నిద్రపోయిన పిల్లాణ్ని లేపుతావెందుకూ? చెయ్యిపూరుకోలేదన్నావు ఏంపనిచేస్తున్నావేమిటి? ఈపాటి నువ్వే తలుపు తీసివుందువుకదా! రా! చప్పున తలుపుతియ్యి" అని గట్టిగా చెప్పాడు.

ఇంటివెన్నుపట్టెకి వేలాడుతావున్న ఇనపగజానికి తగిలించబడిన లాంతరువెలుగునందు సుందరమ్మ స్పష్టంగా భర్తకి కనబడుతూంది. ఆమెయేపనీ చెయ్యడంలేదు భర్తమాటలు విన్న తరువాత ఆమె మంచందగ్గిరే నిలబడి రెండునిముషా లేదో ఆలోచించినది. మళ్లా "ఒరేవ్! బాబూ! లేఅమ్మా! నాన్నగారు పిలుస్తున్నారు, తలుపుతియ్యి. అప్పుడే యెక్కడొచ్చిందిరా దిక్కుమాలిన నిద్దర?" అని విసుగుకుంటూ కుమారుణ్ని లేపుతూంది.

విశ్వనాథము పూర్తిగా తడిసి ముద్దయిపోయాడు ఈదురుగాలి కతనిశరీరం కంపించిపోతూంది. భార్యచేస్తూన్న కాలహరణం చూసినకొద్దీ అతనికి కోపం యెక్కువైపోతూంది. "ఏం? చెబితే వినబడదూ? చలితో చస్తూవుంటే బుద్ధీ జ్ఞానముండక్కర్లేదూ? తీస్తావా? తియ్యవా?" అని అతడు కోపంతో అడిగాడు

తల్లి యిచ్చిన కుదుపుల్లవల్ల ఇంతలో కళ్లు నులుపుకుంటూ పిల్లవాడు లేచాడు. సుందరమ్మ కుర్రాణ్ని తలుపుదగ్గిరికి తీసుకొచ్చి రెండుమూడుసారులు గట్టిగా చెప్పి వాడిచేత్తోనే తలుపు తీయించింది

విశ్వనాథం లోపలికొచ్చి "ఏం? తలుపునికూడా ముట్టుకోవాయేమిటి? పాపం! నిద్రపోతూన్న పిల్లాణ్ని చంపకపోతే యేం? తలుపేం తప్పుచేసిందీ? ఇహనైనా తీసుకెళ్లి పడుకోపెట్టు" అంటూ గదిలోకి వెళుతున్నాడు.

సుందరమ్మ పిల్లాణ్ని తిన్నగా వసారాలోకి తీసుకెళ్లి స్తంభం దగ్గిర నిలబెట్టి, వంటింట్లోకి పోయి, చెంబుతో నీళ్లు తీసుకొచ్చింది. ఆవిడ వచ్చేలోపున నిద్దరమత్తుమీాద వున్న బాలుడు గభీమని నేలమీాద పడిపోయాడు. అప్పుడు తగిలినదెబ్బతో వాడికి బాగా మెలకువ వచ్చింది. దెబ్బతగిలిన ప్రదేశం తణుముకుంటూ వాడు ఏడుపు మొదలెట్టాడు. "లేదురా! లేదులే! రెండుబిస్కత్తులు పెట్టనా? ఏడవకురా మరీ!" అని ఓదారుస్తూ సుందరమ్మ కుమారుడిచేతిమీాద యిన్ని నీళ్లుపోసి, తిరిగీ మంచంమీాద పడుకోపెట్టి, రెండుబిస్కత్తులు చేతులో పెట్టింది.

తలుపుతీసిన పిమ్మట కుర్రాణ్ని మంచందగ్గిరకి తీసుకెళ్లడానికి బదులు వసారాలోకి యీడుచుకుపోవడం చూసి విశ్వనాథము గదిలోకి పోకుండా ఆగి ఈ చర్యనంతటినీ కనిపెడుతున్నాడు. కఠినమైన చలిలో పిల్లవాడు పడుతూవున్న బాధ చూసి అతనిమనస్సు ఎంతో కష్టపడినది. అప్పటికప్పుడు చెంబెడునీళ్లు పోసి వాడిచేతులు కడుగవలసిన అవసరమేమిటో అతనికి బోధపడలేదు. కోపంపట్టలేక తడిబట్టలతోటే మంచందగ్గిర కెళ్లి భార్యని చూసి "ఇప్పుడు వాడిచెయ్యి కడగవలసిన పనేముందీ? వూరుకుంటూన్నకొద్దీ చాదస్తం మరీయెక్కువై పోతూందిలే" అని గట్టిగానే అడిగాడు

సుందరమ్మ యేజవాబూ చెప్పకుండా భర్తవేపుచూస్తూ నిలుచుంది కాని పిల్లవాడుమాత్రం "ఇందాకా చాకలాడు తలుపుముట్టుకున్నాడండీ, నాన్నగారూ? వాడికి మైల వొచ్చిందిటకదూ! ఆతలుపుని తడిపెయ్యమని అమ్మ యెంతోసేపు అమ్మమ్మతో దెబ్బలాడిందండీ! 'తలుపుకి మైలయేమిటి? నేను తడపను' అని అమ్మమ్మ తడిపిందికాదు నేను తలుపుముట్టుకున్నాను గనక నాచేతులు కడిగిందండీ అమ్మ!" అన్నాడు.

ఈమాటలు విన్న విశ్వనాథం యేంచెయ్యడానికీ తోచక భార్యవేపు నిఘాగా రెండునిముషాలు చూసి ఒకనిట్టూర్పు విడిచి, మామూలుకంటే గబగబ నడిచి గదిలోకి పోయాడు బిస్కత్తులు తినేసి కుర్రవాడు మళ్లీ నిద్రపోయాడు సుందరమ్మ వంటింట్లోకి నడిచింది.

తొడుక్కున్నచొక్కా వొదిలేసి వేరొకదాన్ని తీసుకోడానికి విశ్వనాథము మంచంకింద వున్న ట్రంకుపెట్టెని తెరిచాడు అప్పుడతని ఆశ్చర్యమేమనిచెప్పను! పెట్టె అంతా ఖాళీ. ఒక్కబట్టయినా అందులో లేదు. పెట్టెనిండా ఇస్త్రీమడత లుండడం ఉదయం కచేరీకి పోయేటప్పుడే అతడు చూశాడు. ఉదయం యింతట్లో యీబట్టలెల్లా మాయమైపోయాయా అని అతడు ఖంగారుపడి "ఏయ్! ఇందులో బట్టలన్నీ యేమైనాయి?" అని భార్యని అడిగాడు.

"అందులో బట్టలేనా? అవీ...మరీ.." అని సుందరమ్మ సంశయిస్తూ వూరుకుంది.

"ఏం? వూరుకుంటావేం?" అన్నాడు విశ్వనాథము

ఇంతలో సుందరమ్మతల్లి వంటింట్లోనించి అతవున్న గదిలోకి వచ్చింది "బాబూ ఏం జెయ్యగలం? కడుపుచింపుకుంటే కాళ్లమీాద, పడుతుంది ఇందాకా చాకలాడు బట్టలకొచ్చాడు. మంచంకింద బట్టలేవో వుంటే నేను వాణ్నే తీసుకోమని చెప్పాను. బట్టలన్నీ మూటగట్టుకున్న తరవాత ఏంచేశాడంటే—మాటలధోరణిలో ట్రాడి

కేదో మైలవొచ్చిందని చెప్పాడు. -మంచంకింద బట్టలు తీసుకునే టప్పుడు మైలవాడు పెట్టెని ముట్టుకున్నాడు ఇంక అందులో మడత లన్నీ మైలడిపోయాయని చాకలాడికి పడేసింది. నేను వొద్దు మొర్రో అని మొత్తుకున్నా వినలేదు ఏదెయ్యం పట్టుకుందోగాని యిల్లా యేడి పిస్తూంది" అని అల్లుడుతో చెప్పి వెళ్లిపోయిం దామె.

ఇంటికొచ్చి పొడిబట్టలు కట్టుకుని కాస్త సుఖపడదా మను కున్న విశ్వనాథుని మన -స్సెంతచిరాకు పడిందో వూహించుకోవల సిందే మాసినబట్టలతోపాటు మడతబట్టలుకూడా చాకింటికి పోవడం చేత ఇల్లంతా ఖాళీగా వుంది భార్యప్రవర్తనని తలుచుకుని అతడు కూర్చున్నపాటుననే నిట్టూర్పువిడిచి నేలమీద చతికిలబడ్డాడు అలాగ ఎంతసేపు కూర్చున్నాడో తెలియదు కాని, భోజనానికి పిలిచేవరకూ అతడు సర్వప్రపంచమూ మరిచిపోయాడని చెప్పవచ్చును అంతవరకూ బాధించిన చలి అతనిని విడిచిపెట్టేసింది.

అటుకమీద పెట్టెలోవున్న పట్టుపంచ కట్టుకుని, తడిపంచను ఆరవేశాడు. కాని అతనికి పట్టుపంచతోనే పడుకోక తప్పిందికాదు. యథాప్రకారం సుందరమ్మ తాంబూలం తీసుకొచ్చింది వేసుకొమ్మని ఎంతో బలవంతపెట్టింది విశ్వనాథుమనస్సు తాంబూలం వేసుకో డానికి తగినస్థితిలో లేదు. భార్యకి జవాబైనా చెప్పకుండానే అతడు శాలువా ముసుగుపెట్టుకుని పడుకున్నాడు.

మంచంమీద శరీరం వాల్చినతక్షణం నిద్రావశురాలైపోయిన సుందరమ్మకి, తెల్లవార్లూ నిద్రలేకుండానే వేగించిన భర్తసంగతి యేం తెలుస్తుంది? అతనిమనసులో పరుగెడుతూవున్న భావపరంపరల ధోరణిని కనిపెట్టడాని కామెకసలే సాధ్యంకాలేదు "ఈజన్మానికింతే సౌఖ్యం" అని గద్గదస్వరంతో అనేకసారు లనుకొన్న భర్తమాట దీర్ఘనిశ్వాసముల బడి కొట్టుకొని పోయాయి

౨

"నేను గోపాలంగారింటికెళ్లివొచ్చేసరికి కోటుతీసి పైనిపెట్టు, వాళ్లింట్లోపుస్తకం మరచిపోయాను పట్టుకురావాలి" అని భార్యతో చెప్పి విశ్వనాథం వెళ్లిపోయాడు సుందరమ్మ తిన్నగా బట్టలపెట్టె దగ్గిరకొచ్చింది. తెరిచివున్న పెట్టెలో చెయ్యిపెట్టబోయి తక్షణమే వెనక్కి లాగుకుని తదేకధ్యానంతో పెట్టెవంక చూస్తూకూర్చుంది.

బట్టలుతీసుకుంటూవుండగానే విశ్వనాథానికి స్నేహితుడింట్లో వొదిలిపెట్టిన పుస్తకంసంగతి జ్ఞాపకంవొచ్చింది అందుచేత తెరచిన పెట్టెను అల్లాగేవొదిలేసి అతడు వెళ్లిపోయాడు మరి అయిదునిముషా లకు పుస్తకంతో కూడా అతడు లోపలి కొచ్చాడు. "ఏం? కోటు తీశావా?" అని అడిగాడు,

"ఇదుగో తీస్తాను. ఇప్పుడే పిల్లలికి అన్నంపెట్టి చెయ్యి కడు క్కున్నాను" అంటూ గదిలోనేవున్న అలమారుదగ్గిరకి పోయి సుంద రమ్మ దేనికోసమో వెతుకుతూ నిలుచుంది.

"టైమయిపోయింది చూశావా? కోటు తియ్యమంటే తియ్య వేం? ఈపాటిపనికూడా నువ్వు చేసిపెట్టకూడదు కాబోలు? తీస్తావా? లేదా?"

సుందరమ్మ నిశ్చలంగా భర్తవేపు చూసింది. ఆచూపుల్లో ఏభావంగాని స్ఫురించడం లేదు అర్థరహితములైన ఆదృష్టులను చూసి విశ్వనాథము మళ్లా "అయ్యో! అల్లా చూస్తావేం? చెబితే వినబడదూ?" అన్నాడు.

"ఆబట్టలమీద వున్న పుస్తకాన్ని మీరు తీసెయ్యండి. నేను కోటుతీసి మీ కిస్తాను."

"పుస్తకాన్ని నువ్వెందుకు తియ్యకూడదూ"

"ఇందాకా మాలాడు తెచ్చిన పుస్తకంకాదూ అది?"

"అయితే?"

"మాలముండాకొడుకులు తెచ్చిన పుస్తకాలు యింట్లో పెట్టు కుంటారుటండీ మరీ? నరసమ్మగారి నడిగిచూడండీ. చెప్పరానివాళ్లు తెచ్చినపుస్తకాలు పనికొస్తాయేమో చెబుతుంది ఎక్కడలేని దిక్కు మాలిని క్షేమన్లూ మనకేవొచ్చాయిబాబూ! నేనేమన్నాతప్పే"

"మాలాళ్లుముట్టుకున్న యితరవస్తువులు మనకి పనికిరావడం లేదూ? వాళ్లుతెస్తూవున్న పళ్లుతోముపుల్లలూ, బియ్యమూ మొదలైనవి మనం హాయిగా వాడుకుంటున్నామా? లేదా? కొంచెం ఆలోచన వుంటే కాగితాలుకూడా అంతే అని నీకే తెలుస్తుంది"

"వాటి అన్నిటిదారీ వేరు కాగితాలదారి వేరు పోనియ్యండి ఎవరెల్లా పోతే నాకేం? నేనుమాత్రం మాలకూడు కలుపుకోలేను"

"అయితే నువ్వు కోటుతియ్యవన్నమాట?"

"మీకంతపట్టుదల యెందుకూ? పుస్తకం తియ్యకూడదూ?"

"పుస్తకంతీస్తే కోటుతీస్తావా?"

"ఆహా"

"మరి ఆపుస్తకానికి తగులుతున్న బట్టలనిమాత్ర మెల్లాముట్టు కుంటావు?"

"వాటికి పరవాలేదులెండి"

భార్యమూర్ఖత్వానికి విశ్వనాథము దుఃఖభరితుడై పోయాడు. ఇంత వాదన ఆమెతో చెయ్యడానికిబదులు నిముషంలో అతడే తనకు కావలసినబట్టలను తీసుకోగలడు కాని తనహేతువాదనచేత భార్య

చాదస్తాన్ని పోగొట్టాలని అతని ప్రయత్నం. కాని అల్లాటిసంస్కారము కామె పూర్తిగా నిరాకరించడమే అతనికి ప్రబలదుఃఖకారణమై పోయింది. విచారంతోపాటు కోపంకూడా అతనికి తలమున్కలై పోయినది. తీవ్ర స్వరంతో భార్యవంక చూసి "నా కిదంతా తెలియదు. కోటుతీస్తావా? తియ్యవా?" అని అడిగాడు.

సుందరమ్మ మాటాడలేదు. లోపలినుంచి అతని అత్తగారు వొచ్చి ట్రంకుపెట్టెలోని బట్టలు తియ్యడం మొదలుపెట్టింది విశ్వనాథ మామెను అడ్డుకుని "ఏమండోయ్! దీనితో లక్షసార్లు చెప్పాను మీకు అనవసరంగా యిలాటి వ్యవహారాల్లో కలగచేసుకోవద్దని ఆవిడ బట్టలు యెందుకు ముట్టుకోదో చూస్తాను. మీరు దూరంగా వుండండి. ప్రతిదానికీ మీరిల్లా సిద్ధపడబట్టే రోజు కిరోజూ ఆవిడస్థితి మరింత అర్థాన్నమై పోతూంది" అన్నాడు.



"ఏంచెయ్యను బాబూ... చీవాట్లుతింటూఉంటాను"

"ఏంచెయ్యను బాబూ! అలాంటిపిల్ల గనకనే నాబతుకిల్లా అయిపోయింది. లేక లేక మిగిలినపిల్లగదా అనుకుంటే అది మమ్మలిని ఇల్లా యేడిపిస్తూంది మీ రిద్దరూ దెబ్బలాడుకుంటే చూడలేక మధ్య వస్తూఉంటాను; చీవాట్లు తింటూఉంటాను" అని కళ్ల నీళ్లు తెముల్చుకుంటూ చెప్పి వెళ్లిపోయింది.

అత్తగారి కన్నీటిని చూడ్డంతోటే అతని కోపం యెక్కడిదక్కడే యెగిరిపోయింది. భర్త చెప్పినట్లూ నడుచుకోమనే ఆమె కుమార్తెకి యెప్పుడూ పోరి చెబుతూవుంటుంది. హేతువాదనకి పెడచెవిని పెట్టే కూతురి కామెమాటల లెక్క యేమున్నది? అందుచేత కుమార్తె చాదస్తాన్ని కప్పిపుచ్చడానికైతేనేమి, కూతురూ అల్లుడూ మధ్య తగువులు రాకుండా వుండటానికైతేనేమి ఆమె కుమార్తె చెయ్యవలసినపనుల్లో చాలభాగం తనే చేస్తూవుంటుంది.

కేవలం కడుపుతీపిచేత మధ్యగా వొచ్చిన అత్తగారిని తొందరపడి మాట లనేసినందుకు విశ్వనాథం కొంచెం పశ్చాత్తాపపడ్డాడు. అందుచేత అతడే కోటుతీసుకుని తిన్నగా మిల్లుకి పోయాడు. ఈ వాగ్వాదనలవల్ల అతడు అరగంట ఆలస్యం అయినాడు మిల్లుమేనేజరు అతన్ని చూసి "ఏమయ్యా! ప్రతిరోజూ ఆలస్యమే అయితే యెల్లా యేడుస్తుంది వ్యవహారం? ఎన్నిసార్లు చెప్పడం? ఈమారు జుల్మానాకి సిఫార్సుచెయ్యక మానను. జాగ్రత్త" అని కఠినంగా మాట్లాడాడు మానధనుడైన విశ్వనాథాన్ని ఈమాటలు శూలపుపోటులై తాకినవి

పైచెప్పబడిన మోస్తరు సంఘటనలు విశ్వనాథంయింట్లో నిత్యకృత్యంగా జరుగుతూవుంటాయి.

## 3

ఒక్కర్తేకూతురవడంచేత సుందరమ్మ కాలు నేలమోప నక్కర లేకుండా పెరిగింది కుమార్తెచేత పనిచేయించడమంటే తల్లి సీతమ్మకి నాటికీ నేటికీకూడా కిట్టదు. పద్ధాలుగేళ్లు వొచ్చేదాకా కూతురికి చెయ్యికూడా కడిగించిం దామె సుందరమ్మ కాస్త కూరతరిగిందంటే ఆవేళల్లా పిల్ల అలిసిపోయిందని తల్లి వొగుస్తూనేఉంటుంది.

సుందరమ్మ ఏదైనాపట్టు పట్టిందంటే కొంపలుమునిగిపోయినాసరే జరిగితీరవలసిందే చిన్నతనంనుంచి ఆపిల్లమాటకి వ్యతిరేకం లేకుండానే సాగింది తనకోరిక సరియైనదా కాదా అని పరీక్షించుకోవడ మామెతత్వంలోనే లేదు తనకితోచినదే మాట కాని యితరులభావము నామె యెన్నడుగాని లక్ష్యపెట్టి యెరగదు. అత్తవారింటి కాపుర మామె చెయ్యలేదు. తల్లిసర్దుబాటువల్లనూ, పుట్టినయింటినివాసంవల్లనూ ఆమెగుణాలు ఏమాత్రమూ మారకుండా అలాగే వుండిపోయాయి. కాపురాని కొచ్చినతరవాతకూడా ఆయేటి కాయేడు హెచ్చబడుతున్న కొద్దీ ఆమెబుద్ధి ఒకవిధమైన మూర్ఖత్వంలో బడిపోయింది.

నెల్లిమర్లలో బ్రాహ్మణకొంపలు అసలే తక్కువ. ఉన్న పది యిళ్లూ వైదికులవే ఆచారవ్యవహారాలు కేవలం ఆరోగ్యసూత్రములన్న సంగతి ఆగ్రామస్థులు నమ్మరు ఆచారాలను ఏర్పరిచేటప్పుడు మన ఆరోగ్యాభివృద్ధియే పూర్వుల ప్రధానలక్ష్యమై వుండేదని వారు ఒప్పుకోరు ఆచారాలకే పాపపుణ్యాలకే సంబంధంలేదని చెప్పేవాళ్లు ఉత్తవెర్రివాళ్లలాగు కనబడతారు వారికి. బ్రహ్మభ్రూణహత్యాది హత్యా

నోములెన్నిచేసినా పశ్చాత్తాపముపొందనక్కర్లేకుండా, వెంటనే స్నానంచేసి మంత్రంజపిస్తేచాలు పాపాలన్నీ పటాపంచలై పోతాయనే నమ్మకం వారిది సుందరమ్మ అలాంటి ప్రజలమధ్యనే పెరిగింది.

* * * * *

విశ్వనాథము పదిమందికల కుటుంబంలో పుట్టాడు. అతని తండ్రి పిల్లలకందరికీ తగిన విద్యాభివృద్ధిని కలిగించాడు. ఆడామొగా భేదం లేకుండా ఆయింట్లో పిల్లలంతా చదువుకున్నవారే. అంతాజ్ఞానవంతులే అవడంచేత ఇంటికొచ్చినవారందరికీ ఆకుటుంబంచూడ వేడుకగా వుంటుంది.

భార్య కాపురానికి వొచ్చిందిమొదలుకుని విశ్వనాథం అత్తవారి వూరయిననెల్లిమర్లలోనే ఇల్లరికం వుండిపోయాడు.

నెల్లిమర్లకి తూర్పుగా 'చంపావతి' అని ఒకచిన్న జీవనది ప్రవహిస్తూవుంటుంది. ఊరికి రెండుమైళ్లదూరంలో వున్నప్పటికీ రైలుస్టేషనుకి 'నెల్లిమర్ల' అనేపేరే వుంది స్టేషనుమాస్టరుకి తోడు ఒకేబంట్రోతు మాత్రమే పూర్వం ఆస్టేషనులో వుండేవాడు. తంతివార్తాసౌకర్యము లప్పట్లో ఆస్టేషనుకి వుండేవికావు. మొన్నమొన్నటివరకూ గడియారంలో టైముకానిచ్చి స్టేషనుమాస్టరు ప్లాటుఫారము మీద నిలబడి దక్షిణీయంత్రంలోనుంచి రైలువొచ్చేదిక్కుకి తొంగి తొంగి మాడ్డమే జరిగేది ఒక్కొక్కవానరోజున ఎవరూ ప్లాటుఫారం మీదికి వెళ్లిచూడ్డానికి అవకాశంలేనప్పుడు ప్రయాణీకులకి తెలియకుండానే రయిలు హఠాత్తుగా వొచ్చి ఖంగారుపెట్టేసేది మిల్లు వొచ్చినతరవాతమాత్రం ఆస్థలానికి కొంతప్రాముఖ్యము ఏర్పడినది.

విశ్వనాథము మిల్లులో గుమస్తాగా ప్రవేశించి అయిదేళ్లకిపైగా అయింది భార్య కాపురానికొచ్చిన రెండేళ్లవరకూ అతనిజీవితం ఒకమోస్తరుగా బాగానే జరిగిందని చెప్పవచ్చును అటుపైనిమాత్రం అతడు సుఖించాడనడానికి వీలులేదు సుందరమ్మకి రెండోసారి పురుడు వొచ్చినదగ్గిరనుంచీ యీచాదస్తం అధికమైపోయిందని సీతమ్మగారు చెబుతూవుంటుంది పురిటిరోజుల్లో తలుపుతెరుచుకుని కూర్చోవడంవల్ల యేగాలో ధూళో ప్రవేశించిందని ఆవిడనమ్మకం. ఏదియేలాగైనప్పటికీ నిప్పునికూడా కడిగితేగాని పనికిరాదనే స్థితిలోవుంది సుందరమ్మచాదస్తం. దీనికితోడు చిన్నప్పటినుంచీ దోహదంచేసి పెంచిన మూర్ఖపుపట్టుదలయును, బద్ధకమును పోగయి విశ్వనాథుని గృహజీవితమును నరకప్రాయ మొనర్చినవి.

సహధర్మచారిణియగు భార్యవలన పొందదలచుకొన్న స్నేహలాలన మతనికి కరువైపోయింది. అత డింటికొచ్చేసరికల్లా దూరానికి పోవడమేకాని సుందరమ్మ ఒక్కనాడైనా దగ్గిరకిచేరి మంచి మాటలాడిన పాపాన్నిపోలేదు ఒకవేళ భర్త సమీపంగా వెళ్లడం తటస్థించిందో, అంటరానివాడెవడో వొస్తున్నట్టుగా ఆమె తనచీరకొంగులను దగ్గిరగా ముణుచుకొని పక్కకి తప్పుకోడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది "అడ్డమైన మాలాళ్లదగ్గిరనుంచీ వెళతారుబాబూ; మీబట్టలు ముట్టుకుంటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలికూడాను" అంటూ భర్త ఎప్పుడేనా ముట్టుకుంటే తక్షణం చీరను తడిపేసి నీళ్లుపోసేసుకుంటుంది మిల్లుబట్టలను వొదిలేసి రాత్రివేళ వేరేబట్టలను కట్టుకున్నప్పుడుతప్ప పగటిపూట ఆమెశరీరస్పర్శగాని, సంభాషణభాగ్యంగాని అతని కెన్నడూ లభించలేదు

ఇహ పిల్లలవిషయంలో, పాలుతాగడంమానేసినమర్నాటినుంచీ మరి బిడ్డలకి తల్లిని ముట్టుకోడానికి వీల్లేదు "వీథుల్లో ఆడుకునే కుర్రాళ్లు నన్ను తగలడానికి వల్లకాదు" అని దగ్గిరకి చేరినప్పుడల్లా సుందరమ్మ పిల్లలను కసిరి కొడుతూవుంటుంది పిల్లలభారం అంతా సీతమ్మగారిదే.

ఈచాదస్తంవిషయంలోనే భార్యాభర్తల మనస్సులు అతకలేదు అన్నివిధములా గణనీయుడైన భర్తను చూసుకుని సుందరమ్మ గర్విస్తూనేవుంటుంది కచేరీదుస్తులను ధరించి సైకిలెక్కి మిల్లుకి వెళుతూవుంటే ఎంతో కుతూహలంతో వీథి మలుపుతిరిగేవరకూ భర్త సోయగమును తదేకధ్యానంతో చూస్తూ గుమ్మంలో నిలుచుంటుంది. అతని గుణాలనుగురించిగాని, అలవాట్లనుగురించిగాని తోడిఆడవాళ్లతో ముచ్చటించడాని కెంతో సరదాపడుతుంది. అతని సుగుణాలనూ, అందమునూ యితరులు మెచ్చుకుంటూన్నప్పుడు ఉప్పొంగిపోతూఉన్న సంతోషంతో వింటూవుంటుంది భర్తతో కలిసి యెక్కడికెళ్లాలన్నా ఉత్సాహంతో బయలుదేరుతుంది. ఎరిగినవారెవరైనా "మీ ఆయన యెవరమ్మా?" అని అడిగితే "అదుగో చూశారూ ఆవుంగరాల క్రాపింగు" అని మందహాసంతో సుందరరూపియగు విశ్వనాథాన్ని చూపించడాని కెంతో ముచ్చటపడుతుంది ఇన్నిలక్షణాలూ వుండికూడా అవ్యతిరేకపుబుద్ధి కలగడాని కామెమనస్తత్వం యేలాంటిదో గ్రహించడం దుస్సాధ్యం

"సూర్యకాంతి కల్మషహరం కాబట్టి నీచీరలు యెండలో ఆరేసుకో" అనేవాడు విశ్వనాథం. "అడ్డమైన కాళ్లతోనూ కాకులెక్కి చీరలని తొక్కితే నాకు పనికిరాదు. కాకుల్నిచూస్తూ యెవరు కూర్చుంటారు?" అని సుందరమ్మ తనచీరల నెప్పుడూ గదిలోనే ఆరేసి తాళంవేస్తూఉంటుంది. గాంధిమహాత్ముని కీర్తించి, "అతని ఆదేశానుసారం ఖద్దరు కట్టాలి మనం" అని అత డన్నవెంటనే "ఆ, పోనిద్దురూ, ఏడిశాడు మోకుల్లాగ ఆముతకగుడ్డ లెవరు మొయ్యగలరూ?" అంటుంది సుందరమ్మ

ఖద్దరునిగురించి చెప్పేటప్పుడు, అంత మోటుమాటలతో భార్య తిరస్కరించడమనేది విశ్వనాథంమనస్సును చీల్చేసేది. ఇట్టిసంఘటనల

మూలమున అతనిహృదయం దుఃఖభరితమై అకాలముననే మోడువారి పోయినది

స్త్రీలను బాధించడం విశ్వనాథము తత్వంలోనే లేదు అందుచేత ఎంతకోపం వచ్చినా అణుచుకోవడమేకాని అతడు భార్య నెన్నడు గాని కొట్టి తిట్టి యెరగడు. అంతగా కోపం అతిమిక్కిలి అయిపోతే "ఇంక నాకు సౌఖ్యం సున్నా" అనుకుంటూ ఒంటిగా యెక్కడికో పోయి తన నిర్భాగ్యపువిధిని నిందించుకుంటూ కూర్చోవడమే అతడు చేసేపని

భార్యను సంస్కరించాలని అతడు చేసినప్రయత్నా లన్నీ యిన్నీకావు ఆచారాలన్నీ మన ఆయురారోగ్యాభివృద్ధికేననీ, పరిశుభ్రతకోసమే ననీ అతడు ఉదాహరణపూర్వకంగా రోజూ ఆమె చెవుల్లో నూరిపోసేవాడు. పూర్వాచారాలను సరిగా అర్థంచేసుకోక గుడ్డిగా అనుసరించడం తప్పని విద్యాధికుల వ్రాతలను పత్రికలనుండి చదివి వినిపించేవాడు. తను ఆచరించి చూపించేవాడు అన్నీ "మహాబధిరశంఖారావము"లవలె నిష్ఫలములై పోవడం చూసి అతడు విసిగి పోయినాడు.

## ౪

ప్రతిమనిషి జీవితంలోనూ వివాహం ఒక ముఖ్యమైన ఘట్టం యావజ్జీవమూ సుఖమో దుఃఖమో ప్రతివ్యక్తికీ యిక్కడే నిర్ణయమై పోతూఉంటుంది నూటికి తొంభైమందిజీవనాలు దుఃఖభాజనమై పోడానికికూడా యిదే కారణం విశ్వనాథముకూడా యీతొంభై మందిలో మొదటివాడుగానే చేరిపోయాడు

ఆనాటి కానాడు విశ్వనాథుడి కింటియందు సౌఖ్యము కరువై పోయింది. ఇంటికిరాగానే సుందరమ్మఅజ్ఞానము అతనికి ప్రతిగమయం లోనూ కనబడుతూవుండేది సౌందర్యోపాసకుడును జ్ఞానవంతుడునునగు అతనిమనస్సు, సౌందర్యరహితమును, అజ్ఞానభరితమును నగు యింటిని చూచి వేదనాపూరితమైపోయినది. అల్లాంటి అజ్ఞానాన్ని సవరించడానికి ప్రయత్నించాడో యింట్లో దెబ్బలాట తప్పదు క్షమాత్రైసంగతి తెలిసినదే అయినా వాదనవచ్చినపుడు తల్లి ప్రాణమవడంచేత సీతమ్మకుమార్తె పక్షాన్నే మాట్లాడేది కూతురు గుణాలను ఎరిగిఉండీకూడా అత్తగారు ఆమెను వెనకేసుకుని రావడంచూస్తే విశ్వనాథానికి శరీరం మండి పోయేది. మాటమీదిమాట రావడంతోటే దెబ్బలాట అయేది.

ఇంట్లో కలహంజరిగినరోజున విశ్వనాథముమనస్సు యమయాతన ననుభవించేది. ఆనాడల్లా అతనికి నిద్రాహారాలు ఉండేవికావు. నిష్కల్మష బుద్ధిలో తను చేసిన విమర్శనలను సరిగా అర్థం చేసుకోక పోవడము సరికదా దెబ్బలాటలు కూడా జరగడం అతనికి మిక్కిలి బాధ కలిగించేది. ఇదికాక యిరుగు పొరుగువాళ్లువిని ముచ్చట్లకింద చెప్పుకోవడంవల్ల తనబతుకు వెలితి అయిపోయిందని అతడు తెలుసుకున్నాడు. ఈ అసందర్భాలను తప్పించుకొనుటకు అతడు తరుచు ప్రయత్నిస్తూవుండేవాడు. అవసరములైన పను లుంటేనేతప్ప యింటికెళ్లడాని కతని మనస్సు ఇష్టపడేదికాదు క్రమక్రమంగా గృహజీవితమం దతనికి ఆకర్షణలేకుండా పోయినది

నెల్లిమర్లకి సమీపంగా చంపావతీస్రవంతికావలిగట్టున "నారాయణపురం" అన్నేగ్రామం ఉండేది ఆగ్రామంలో ఎక్కువ మంది క్షత్రియులు నివసిస్తూ ఉండేవారు శార్వరిసంవత్సరపు ఉప్పెనలో నదిపొంగి ఆవూరుగుల్లో చాలాభాగం కొట్టుకుపోయింది. ఆస్థలం యెప్పుడైనా అపాయకరమే అగుటవల్ల అక్కడ కొక అరమైలు దూరాన్ని మెరక ప్రదేశానికి పోయి ఆగ్రామస్థులు మళ్లా యిళ్లు కట్టుకుని నివసిస్తున్నారు

పూర్వపుగ్రామం ఉండే స్థలానికి "పాతూరుదిబ్బ" అనివాడుక నామంకలిగినది లోగిళ్ల పాడుగోడలును గచ్చుమండువాలును నారింజ, సపోటా మొదలైన పెంపుడుచెట్లును నేటికీ అక్కడ నిలిచి సంపన్నక్షత్రియగృహస్థుల పూర్వపు నివాసములను నిదర్శనపరుస్తూ వుంటాయి

విశ్వనాథము షికారుస్థల మదే ఆపాడుగోడలమధ్య తిరుగుతూ చంపావతీనదీసైకతములను చూస్తూ, తుంగభద్రాతీరస్థమగు హంపీ క్షేత్రాన్ని ఊహించుకోవడ మతనికి మామూలు మునుపు ఎప్పుడైనా సాయంకాలంవేళలలో వెళ్లేవాడుకాని ఇప్పుడు "పాతూరుదిబ్బ" అతని నివాసస్థలమే అయిపోయినది తీరుబాటున్న ప్రతిఘడియా అతడక్కడే గడపడం ప్రారంభించాడు అనుకూలదాంపత్యంలేని యింటి కంటె పాతూరుదిబ్బయే అతని కెక్కువ ఆకర్షణీయంగా కనపడినది. అక్కడ కూర్చుని ఆశిథిలావస్థయందుకూడా సౌందర్యభరితములై యున్న ఆగోడలతో తన దీనచరిత్రాన్ని చెప్పుకునేవాడు.

ఇల్లాగా కొంతకాలం గడిచిపోయింది భర్త తరుచు యింటి దగ్గిరవుండకపోవడం సుందరమ్మ కనిపెట్టకపోలేదు. కారణంమాత్రం ఆమె అవగాహన చేసుకోలేకపోయింది.

ఒకనాడుసాయర్కాత్రే మారుగంటలపుడు పాతూరుదిబ్బమీద ఒక గచ్చుచప్టామీద కూర్చుని విశ్వనాథము తనస్థితిగతులనుగురించి ఆలోచించుకుంటున్నాడు ఇంతలో అతని బాల్యస్నేహితుడగు కృష్ణమూర్తి అతన్ని సమీపించి "ఏమోయ్! ఒక్కడివే కూర్చున్నావు?" అని పలకరించాడు.

విశ్వనాథ మతన్నిచూసి "అబ్బే! యేమీలేదు. షికారుగా వొచ్చాను నువ్వెక్కడికి బైలుదేరావు?" అన్నాడు. ఇంతలో కృష్ణమూర్తికూడా అక్కడ కూర్చున్నాడు.



అణ్ణామలై విశ్వవిద్యాలయ ప్రథమపట్ట ప్రధానసమావేశము



ఆంధ్రవిద్యార్థులు, ప్రభుత్వవ్యవసాయ కళాశాల, కోయంబత్తూరు

పుష్పమాలాలంకృతులు రా. బ. భాగవతుల విశ్వనాథముగారు (యస్. ఐ. సి.) ఈసంఘమున కధ్యక్షులు.



గుంటూరు గాయకసభ



హిందూనాట్యసమాజము, ఛత్రపురము

"నేనా? ఇంతసేపూ పేకాటలోకూర్చుని ఇప్పుడే కాస్త పొలం వెళుతున్నాను. ఒక్కడివీ కూచుని యేంచేస్తావు రా. మా తోటలోకి వెళదాం"

కృష్ణమూర్తీ విశ్వనాథమూ కలిసి విజయనగరం కళాశాలలో చదువుకున్నారు నెల్లిమర్లలో కృష్ణమూర్తిది పెద్దకాంపల్లో ఒకటి. పాడీపంటా, తోటా దొడ్డీ ఉన్న నిండైనసంసారం విజయనగరసంస్థానంలో విద్వాంసులుగావుండి అతనితండ్రితాతలు సంపాదించిన యినాములవి. కృష్ణమూర్తి స్కూలుఫైనలువరకూ చదువుకున్నాడు. ఎప్పుడోతోచినపుడు పొలంమీదికివెళ్లి వ్యవసాయం చూసుకోవడం తప్పవేరేపని అతనికిలేదు

గ్రామంలోని యువకులు తగినంతపని లేనివాళ్లు చాలామంది అతని స్నేహమును సంపాదించారు. వృథాగా కూర్చోవడ మెందుకని వీరందరూ కలిసి అతనియింట్లోనే పేకాటక్లబ్బు ఒకటి స్థాపించి బహుశ్రద్ధగా నడపడం మొదలెట్టారు అదికారణంగా కృష్ణమూర్తికి పొలంపనియందు విరక్తిపుట్టింది అహోరాత్రము లతనియింట్లో పేకాట సాగుతూంది.

కృష్ణమూర్తి అమాయికుడు మెత్తనిమనస్సుగలవాడు. మొదట ఊళ్లో దుండగీళ్లందరూ తనయింటికి రావడం అతనికి కష్టంగానే వుండేది. కాని మొగమోటమిచేత వాళ్లని యేమీ అనలేకపోయేవాడు వాళ్లందరూ పేకాడుతూవుంటే చూస్తూ కూర్చునేవాడు కొన్నాళ్లు "వీళ్లందరినీ యింట్లోకి చేరనిస్తున్నా వెందుకురా బాబూ!" అని అతని తల్లి నెత్తీనోరూ మొత్తుకుంది "లేదమ్మా! పొమ్మంటాను" అని యింటో జవాబుచెప్పడమేకాని వాళ్లదగ్గిరనోరెత్తి పొమ్మనడం అతనికి చేతనయేదికాదు.

క్రమంగా అతన్నికూడా పేకాటలోకి లాగారు స్నేహితులు ఆట ప్రారంభించిందిమొదలు కృష్ణమూర్తికి నష్టమేకాని లాభం యెన్నడూ రాలేదు నష్టం వచ్చినకొద్దీ జూదగాళ్లకుండే వీరావేశమూ ఉద్రేకమూ అతన్నికూడా ఆవహించి ముందు వెనకలు చూడకుండా చేసేశాయి "ఇది బహుపొరపాటుపని" అని ఒక్కొక్కప్పుడు తల్లి కోప్పడినప్పు డనుకునేవాడు కాని ఆబుద్ధి అట్టే సేపు నిలిచేదికాదు క్రమంగా తల్లిని యెదురుకుని "ఉండవమ్మా! నీకేంతెలుసును? పేకాట ఆడినంతమాత్రాన్ని తప్పేముందీ?" అని జవాబుచెప్పేస్థితిలోకి దిగింది ఇప్పు డతని వ్యవహారం.

కృష్ణమూర్తీ విశ్వనాథమూ కలిసి తోటలోకి వెళ్లారు. అన్నిరకాలచెట్లతోనూ నిండిన గొప్పతోట అది. ఆమాటా యీమాటా చెప్పుకుంటూ, మాలీలు కోసియిచ్చిన అంటుమామిడికాయలు తింటూ వారిద్దరూ చీకటిపడేవరకూ తోటలో గడిపేశారు. వీరికి ముందుగానే పేకాటస్నేహితులు నలుగురు తోట కేవలం తమ స్వంతసొత్తులాగు భావించుకుంటూ విహరిస్తున్నారు. విశ్వనాథం వుండడం చూసి వాళ్లు కృష్ణమూర్తిని సమీపించక వేరొకమూలకి పోయారు.

ఊళ్లో ప్రవేశించి ఎవరింటికి వారు విడిపోయేటప్పుడు కృష్ణమూర్తి "అప్పుడప్పుడు వస్తూవుండవోయ్, నీలాగ ఉద్యోగం సద్యోగం లేకపోయినా నీస్నేహానికి మేముకూడా కొంత అర్హులమే." అని చెప్పి తోటనుంచి తెచ్చిన సపోటాపళ్లన్ని సంచిలోనుండి తీసి విశ్వనాథం చేతులో పోశాడు.

కృష్ణమూర్తియింట్లో పేకాట క్లబ్బువిషయమై విశ్వనాథము యిదివరకే కొంత విన్నాడు. అలాంటిస్థలానికి వెళ్లడంలోగల ఉచితానుచితముల నతడు చాలవరకు తర్కించుకున్నాడు. ఊరికే వెళ్లి గంటో, రెండుగంటలో కూర్చుని వొచ్చినంతమాత్రాన్ని తప్పేముంది? కృష్ణుడు చాలా పెద్దమనిషి" అన్ననిశ్చయంలోకి వొచ్చాడు చివరకు.

ఎంతకాల మని విశ్వనాథం పాతూరుదిబ్బతో స్నేహం చెయ్యగలడు? అతని కక్కడ క్రమంగా విసుగెత్తినది. ఒంటిగా అక్కడ కూర్చోవడ మతనికి కష్టంగా తోచినది. నాలుగురోజులు స్థలాలు మార్చి షికారుచేశాడు స్థలం మార్చినంతమాత్రాన్ని ఒంటరిభావం అతన్ని విడిచిపెట్టలేదు.



'ఇల్లా కుర్చీమీదకూచుని పేపరు చూసుకుంటానులే.'

అందుచేత మరునాడు మిల్లులో పని పూర్తికాగానే విశ్వనాథం తిన్నగా కృష్ణమూర్తియింటికి వెళ్లాడు. వీథిసావిట్లో రెండుచోట్ల రెండు పేకాటకచేరీలు మంచిరద్దీగా సాగుతున్నాయి. కృష్ణమూర్తి పూర్తిగా ఆటలో మునిగివున్నాడు. విశ్వనాథాన్ని చూడగానే అతడు లేచి "రావోయ్! రా. చెయ్యియివ్వనా?" అని గౌరవించాడు.

"అక్కరలేదు ఇల్లా కుర్చీమీదకూచుని పేపరుచూసుకుంటానులే." అని విశ్వనాథంకూర్చున్నాడు మళ్లీ అందరూ ఆటలోపడిపోయారు, ఆటగాళ్లందరూ విశ్వనాథంరాగానే ఒకరివేపొకరు భావగర్భితంగా చూసుకుంటూ ముసిముసినవ్వులు నవ్వుకున్నారు

ॐ

చెవుల్లో రింగుమని లక్ష్మి మ్రోగుతూవుంటే, తోడిమనుష్యులంతా ఉత్సాహంలో తెప్పతేలిపోతూవుంటే ప్రక్కని విశ్వనాథం ఒక్కడూ ఎన్నాళ్లని వార్తాపత్రికలతో కాలక్షేపం చెయ్యగలడు? క్రమంగా ఆటగాళ్లలో విశ్వనాథానిదే మేలుచెయ్యి అయిపోయినది. ఇంత కొద్దికాలంలోనే యీసామర్థ్యాతిశయం అద్భుతంగావుందని అందరూ మెచ్చుకునేవారే అయినారు జూదంఅంటే అసహ్యించుకునే విశ్వనాథము జూదగాళ్లలో మొనగాడై పోయాడు.

భార్య తనకు అనుకూలవతికాదన్న విచార మిప్పు డతనికిలేదు. పూర్వము మిక్కిలి భారముగానుండిన కాల మిప్పుడు సుకరముగనే గడిచిపోతుంది రాత్రిపూటకూడా భోజనమైన తరవాత పేకాటకిపోయి ఏ అర్ధరాత్రిదాటిన తరవాతనో గాని అత డిల్లుపట్టడంలేదు సుందరమ్మ ఏంచేసినా సరే అతడు కలగచేసుకోవడం లేదు. తనంతట తను వొచ్చి ఆమె యేదైనా పనిచేస్తే అడ్డుపెట్టడు. చెయ్యకపోతే పిలిచి చెయ్యమనడు మునుపు బట్టలుకట్టుకున్నాడంటే అల్లా దిద్దుకునీ, యిల్లాదిద్దుకునీ గంటసేపు పట్టేది ఇప్పుడు భోజనం కానిచ్చి నిలబడ్డాకేని టైములేదు. బొగ్గులకుంపటిని పడకగదిలోకి తెచ్చి కాఫీ చెయ్యబోతే భార్యను చూసి "ఇదా కాఫీ కాచేందుకు స్థలం? నీకు యింక జ్ఞానం రాదు. వసారాలో పెట్టు" అని కుంపటిన్ని విసిరికొట్టేవాడు పూర్వం ఇప్పుడు పడకగది యెలాగున్నా అతడు లెక్కచెయ్యడం లేదు. పళ్లుతోము పుల్లల కట్టలూ, మాసినబట్టలూ, కాఫీ కాచినపుడు రాలిపడిన మసిబొగ్గులూ మొదలైనసామానులు గదిని అలంకరిస్తున్నాయి. ఎవరూ ముట్టుకోని స్థలముకదా అని అతడు కూర్చునే పేము కుర్చీమీద సుందరమ్మ తనువాడుకునే నీళ్లబిందెను దాచుకుంది.

పూర్వం యిలాంటి అనుచితపుపనులు చూస్తే విశ్వనాథానికి వొళ్లు మండుకొచ్చేది. కాని యిప్పు డతని కాప్రసక్తియే పోయింది. ఇల్లా అతను మారిపోయి ఏడాది కావచ్చింది.

* * * * *

ఒకనాడు మధ్యాహ్నం మూడుగంట లవుతుంది గోపాలరావింట్లో తుంగచాపమీద నలుగురైదుగురు స్త్రీలు కూర్చున్నారు. గోపాలరావుభార్య జానకమ్మ వారితో సంభాషిస్తూ పిల్లకి జడ వేస్తూంది.

"మొగాళ్లిల్లా చేసినా చెల్లుతుందమ్మా. ఇదే ఆడవాళ్లయితే ఊరంతా గోలఅయిపోవును" అని ఏభైయేళ్లవయస్సుగల సుబ్బమ్మ అన్నది.

"పిన్నిగారూ! యీవిషయంలోమాత్రం మీరు ఒకపక్షం మాటే ఆడుతున్నారు సుమండీ! సుందరమ్మసంగతి మీకు తెలియదు. బొత్తిగానే మొగాడి ఆలనా పాలనా వుండొద్దుటండీ?" అని జానకమ్మ పలికినది.

"ఆ! పోనిద్దూ! మనమందరమూ మహా ఆలనా పాలనా చేసేస్తున్నాము! అది చెయ్యకపోయింది! పెళ్లాంలో తప్పుంటే దిద్దుకోవాలి అంతేకాని ఏడాదినించి యిల్లుపట్టడాయెను! ఇదేంబాగుంది నీకు!"

"దిద్దుకోమంటారా? మీకు సంగతి బాగానే తెలిసింది లెండి? అంతఓర్పుతోనూ జాగ్రత్తతోనూ పెళ్లాంవిషయంలో సంచరించిన మనిషి విశ్వనాథమేకాని రెండోవాడు లేడు. మీరెల్లా చెప్పినాసరే కాని మొగాళ్లని దిద్దుకోవడంలో మనంకూడా చాలాభాగం ప్రయత్నించాలి సుమండీ"

"నువ్వయితే బాగా దిద్దుకుంగువుకాబోలు?"

"మీరల్లాఅంటే నే నేంచెప్పను? విశ్వనాథాన్ని మనం అందరమూ యెరుగుదుముగదా? అత డల్లర చిల్లరమనిషి అని మనం అనగలమా చెప్పండి? అటువంటివా డిల్లా అయిపోడానికి కారణం మనం వూహించాలి ఇంటికొచ్చేసరికల్లా అన్నీ వొళ్లుమండుకొచ్చే పనులే నే నిల్లా నిజంచెప్పినందుకు సుందరానికి కోపంవొస్తే వొచ్చుగాక!"

"జానకమ్మక్కయ్యా! అంత ఒళ్లుమండుకొచ్చేపను లేనేం చేస్తున్నానమ్మా? నువ్వూ అలాగే అంటావు?" అని సుందరమ్మ విషాదసూచకంగా అన్నది

"సుందర్రత్న! నేను నీతో లక్షసార్లు చెప్పాను. ఇప్పటికైనా కాస్త నిదానిస్తూవుంటే కొన్నాళ్లకైనా వ్యవహారం బాగుపడవచ్చును. నీమీద నాకు విరోధం లేదుకదా"

"వాళ్లది బొత్తిగా మాలకూడమ్మా! చూస్తుచూస్తూ నేను కలుపుకోలేను"

"అయ్యో! సుందరం! అక్కడే వుంది నీపిచ్చి. నీఅమ్మమ్మ మాటలు యిప్పుడు పనికిరావు ఈ కాలానికి తగినట్లు ఇప్పుడు నడుచుకోవాలి."

"ఆమాట నేను ఎన్నిసార్లో చిలక్కి చెప్పినట్లుగా చెప్పానమ్మా! నామాటవింటే యింతఖర్మం యెందుకొస్తుంది?" అని సీతమ్మగారన్నది.

"కాదుటండీ మరీ! మొగాడిసౌఖ్యం మనంకూడా కాస్త చూస్తూవుండాలి. సీతమ్మ పిన్నీ! మీరు లక్షవిధాల అతనికి లోటు రాకుండా చేస్తూవుండబట్టిగాని లేకపోతే యీసరికే యెన్ని ప్రమాదాలు జరిగివుండునో అనుకుంటాను."

"అలాగే గాని పైవాళ్ళ మెందరంచేసినా భార్యచేసిన పాటి వొస్తుందిటమ్మా? కూతురని కూతురుమాట ఆడగూడదుకాని ఇందులో అతన్ని అనవలసినపని లేదు. మా బుద్ధిమంతుడుసుమా! పడుచుదికదా అని ఓతలదువ్వుకోవడమా? జడవేసుకోవడమా? రోజుకి రెండు స్నానాలైతే యింక జడవేసుకోవడమెల్లాగ? మొగుడని వీథిలోనించి రాగానే దగ్గిరకెళ్ళడమూ, ఏంగావాలో చూడ్డమూ లేదు. అతడురాగానే ఆబట్టలతోటి తన్నుముట్టుకుంటాడని చటాలున లోపలికి పారిపోవస్తుంది. పెళ్ళాం తనదగ్గిరకొచ్చి తన సౌఖ్యంచూడలేగు కదా అన్న కోపంచేత అతడు మంచినీళ్ళేనా అడగకుండా వీథిలోకి పోతాడు. చెప్పిచెప్పి అతనిప్రాణమూ, నా ప్రాణమూ విసిగిపోయాయి. ఇప్పుడు ఇంట్లో వుండరో అని యేడుస్తుంది ఉంటేమాత్రం అతని సౌఖ్యం చూస్తుందన్న నమ్మకం నాకు లేదు. ఇంతకీ దానికర్మం యెల్లాగో అల్లా జరగకమానదు. కాని యీకష్టాలన్నీ చూడవలసివచ్చింది కదా అని నేను ఏడుస్తున్నాను" అని సీతమ్మగారు అమాయకపు ధోరణిలో చెప్పి ఏడిచింది.

అందరూ కలిసి తన్నే నిందిస్తున్నారుకదా అన్న ఉడుకుమోతుతనంచేత సుందరమ్మకూడా తనలోతనే యేడుచుకుంది.

* * * * *

ఒకనాడు రాత్రి తొమ్మిదిగంటలప్పుడిన్ని మెతుకులు నోట్లో వేసుకోడానికని విశ్వనాథం యింటికొచ్చాడు. గత కొద్దిరోజులనించీ అతనికి ఆటలో చాలానష్టంవస్తూంది ఆనెలలో అతనిజీతం దమ్మిడీ అయినా యింటికిచేరలేదు. ఆనాటి సాయంకాలమల్లా అతడు నష్టాన్నే పొందాడు. కలిగిననష్టాన్నిచూసి అతనిమనస్సుచాలావిచారపడింది. ఏ ఉపయోగమైనఖర్చుకికాకుండా అంతసొమ్ము పోవడం అతనికి భయం కలిగించింది. అంతటినుంచి ఆటకివెళ్ళడం మానెయ్యాలని గాఢంగా ఆలోచిస్తూన్నాడు. "అల్లామానేస్తే కాలం యెలాగు గడుస్తుంది?" అని అతనిమనస్సు మళ్ళావెనక్కి లాగుతూంది. ఈ రెంటిమధ్యా బడి అతడు కొట్లాడుతున్నాడు.

భోజనం ప్రారంభించాడు. అత్తగారు వొడ్డిస్తూంది. సుందరమ్మ ఎదురుగాగోడకిచేరబడికూర్చుంది. పిల్లలంతా నిద్రలోఉన్నారు భర్తనడవడికనుగురించి ఆమె యిదివరకెన్నడూ గట్టిగా ప్రశ్నించివుండలేదు. క్రమంగా విశ్వనాథం అసలే యిల్లుపట్టకపోవుట నామె సహించలేకపోయింది. అందుచేత సుందరమ్మ "ఏమండీ! మీ రెంత మొగాళ్ళయినా అల్లా డబ్బు తగలెయ్యడం బాగుందా?" అని భర్తని అడిగింది

విశ్వనాథం తలయెత్తి సుందరమ్మవంక నిశ్చలంగా ఒక్కనిముషం చూశాడు. అదివరలో యెంతకాలం యింటికిరాకపోయినా అంతపరీక్షగా అడిగివుండని భార్య యిప్పుడు డబ్బు యెక్కువగా పోయినప్పుడు శ్రద్ధచేసి అడగడం అతడు కనిపెట్టాడు తనకంటే డబ్బే ఆమెకి ప్రధానమైపోయినట్లుగా అతని కామెప్రశ్నలో ధ్వనించింది

మాటలో అలాంటి అవకతవక వున్నప్పటికీ న్యాయం చెప్పవలసినప్పుడుమాత్రం భర్త యిల్లుపట్టడంలేదుకదా అన్న విచారమే ఆమెను బాధిస్తూందని చెప్పక తీరదు కాని హృదయంలో ఏమున్నదో ఏం తెలుస్తుంది?

భార్యవల్లనే తనకు యింట్లో సౌఖ్యం లేకుండాపోయింది కదా అనే ఆలోచనతో బాధపడుతూవుండే విశ్వనాథాని కామె ప్రశ్న అల్లా ధ్వనించడంలో ఆశ్చర్య మేమున్నది? అందుచేత ఆతనికి కొంతకోపమూ, కొంతవిచారమూ కలిగింది. అతడు "ఏం? ఏం చెయ్యమంటావు?" అని మళ్ళీ అడిగాడు. అతనిస్వరం కొంచెం కఠినంగానే వుంది. ముఖంలో చిరాకూ చిరిముడి పాటూ గోచరిస్తున్నాయి.

"మీరు సొమ్ము తగలేస్తూఉంటే యింట్లో మాగతి యేంగావలసింది? నేనూ పిల్లలూ మావాళ్ళయింట్లోపడి తింటూవుండబట్టి మీ ఆటలు సాగుతున్నాయి. మీ కాపాటి గ్రహింపు వుండొద్దూ?"

సుందరమ్మ మృదుత్వంలేనిమాటలకి విశ్వనాథం అలవాటుపడేవున్నాడు. కాని ఆనాటి భార్యమాటలలో అన్నీ అతనిమట్టుకు వ్యతిరేకార్థాన్నే సూచించాయి అప్పుడతడు "అవును మాకు గ్రహించగల బుద్ధి యెక్కణ్ణించి వొస్తుంది? మీవాళ్ళింట్లోకి చేరబట్టే నన్నిలాంటిమాట లనడానికి నీకు ధైర్యం కలిగింది ఇక్కడ వుండడం నాదే పొరపాటు. తగినట్టూ బుద్ధిచెప్పావు లే." అంటూ పురిషిట్లో నీళ్ళుపోసుకొని మిగిలినభోజనం చెయ్యకుండానే లేచిపోయాడు

భోజనం ప్రారంభించి నాలుగైదుముద్దలైనా తిన్నాడో లేదో అల్లుడు లేచిపోవడం చూసి అత్తిగారు చాలా విచారించింది. "భోజనం వేళ అల్లాటిప్రస్తావన యెందుకు తెచ్చావే బాబూ?" అని ఆమెకుమార్తెపైని కోపపడినది. విశ్వనాథం ప్రథమకోపము నామె పూర్తిగా యెరుగును.

తన సంభాషణాపరిణామము యిల్లా వొస్తుందని సుందరమ్మ యెరగదు. తప్పు తనదో భర్తదో ఆలోచించుకోవడాని కామెకి వీలు

చిక్కలేదు. "నే నేం చేశానమ్మా?" అని తల్లికి జవాబుచెప్పడంతోనే ఆమెకి సరిపోయినది.

సీతమ్మగారు చాలాసేపు బతిమాలినది. భార్యకూడా చాలాసేపు చెప్పింది. "నే నేం తప్పుమాట లన్నానండీ? మీరు చేసినదంతా బాగానేవుందికాబోలు? భోజనం మానెయ్యడంకూడా యెందుకూ?" అని సుందరమ్మ అన్నది.

అసలే కాగుతూవున్న చమురుమీద నీళ్లు జల్లినట్లయింది. ఇంగితమెరిగి మాట్లాడ్డం సుందరమ్మకి మొదటినించీ అలవాటులేదు. మొదట అన్నమాటలకే లోపల కుమిలిపోతూవున్న విశ్వనాథాన్ని యీమాటలు మరింత బాధించాయి. తక్షణమే అతడు కుర్చీమీదనుండి లేచి సుందరమ్మమెడమీద చెయ్యివేసి గదిలోనుంచి అవతలికి గెంటేశాడు. దానితో తల్లీ కూతురూకూడా అక్కడనుంచి వెళ్లిపోయారు.

సాయంకాలం డబ్బుపోయినందువల్ల కలిగిన చిరాకుచేతనూ, ఇంట్లో భార్యా ఆడినమాటలవల్లనూ అతనిమనస్సు క్షోభించిపోతూంది. "ఏమూలా సౌఖ్యంలేని నాబతు కెందుకూ యింకా?" అని అతడు మాటిమాటికి విచారించాడు. మళ్లీ కృష్ణమూర్తి యింటికిపోతేగాని మనశ్శాంతికుదరదని అతనిమనస్సు లాగుతూంది. జూదంలోకి వెళ్లకూడదని అంతరాత్మ యెదిరిస్తూంది. చాలాసేపు తర్కవితర్కము లైనపిమ్మట యింకయెన్నడూ పేకాటలోకి వెళ్లకూడదనే నిశ్చయించుకున్నాడు. ఆనాడే వొచ్చిన 'భారతి' చదువుకుంటూ గదిలో కుర్చీలో కూర్చున్నాడతడు

కాపురాని కొచ్చిన యీయేడెనిమిదేళ్లలోనూ సుందరమ్మమీద భర్త యెన్నడూ చెయ్యిచేసుకోలేదు అంతగా కోపంవొస్తే "అబ్బా! వెధవగోల!" అనివిసుక్కుంటూ వెళ్లిపోవడమే అతని కలవాటు అలాంటప్పుడు భర్త తనమెడమీద చెయ్యివేసి గెంటడంతోటే సుందరమ్మకోపం అపరిమితమైపోయినది ఎన్నివిధాల డబ్బు పాడుచేస్తూ తిరిగినా వూరుకుని బహుశాంతంతో సంచరించిన తనయెడల భర్త బహుక్రూరంగా ప్రవర్తించాడని ఆమె కుమిలిపోయినది అందుచేత నామె మూతిముణుచుకుని ఒకమూల కూర్చుంది

రాత్రి పదిగంటలుదాటింది. ఇంక పడుకుందామని చదువు ముగించి విశ్వనాథం లేచాడు. మంచంమీద పక్క వేసిలేదు "ఏయ్! యిల్లారా!" అని భార్యని పిలిచాడు సుందరమ్మవొచ్చింది.

"ఈ పక్క వెయ్యలేదేం?"

"ఇల్లూవాకిలీ, పెళ్లామూబిడ్డలూ అక్కర్లేనివాళ్లకి పక్క యెందుకూ?"

"ఇల్లూవాకిలీ అక్కర్లేదని నీతో యెవరన్నారు?"

"ఎవరో అనేదేమిటి? మనిషి ప్రవర్తన తెలియదూ?"

"అయితే నువ్వు పక్క వెయ్యవన్నమాట?"

"వెయ్యనని ఎవ్వరుచెప్పారు?"



'వెయ్యనని ఎవ్వరు చెప్పారు'

"మరి యెందుకువెయ్యలేదూ యీవేళ?"

"సరిగా మీరు వేళకి పడుకుంటున్నారుగనక నా? నేను వేళకి వెయ్యలేదని తప్పుపట్టడం మాత్రం తెలుసును"

"నీజవాబులు బహుపొగరుగా వున్నాయి సుమా! ఒళ్లూ పయీ తెలియకుండా మాట్లాడకు జాగ్రత్త!"

"ఎవరిది పొగరో తెలుస్తూనేవుంది! 'మొగాణ్ని కదా అథార్టీ చెయ్యవొచ్చునుకదా! నాకెవరు అడ్డు?' అని కాబోలు మీ అభిప్రాయం?"

"నోరుముయ్యి, లేకపోతే—"

"ఇక్కడ మీచేత దెబ్బలుతినేవా ళ్లెవరూలేరు" అంటూ గదిదాటి వెళ్లిపోయింది.

తనూ భార్యా వేరేకాపురం చేసేటప్పుడైతే యెలాగుండునో చెప్పలేముగాని అత్తవారింట్లో వున్నప్పుడు భార్య అల్లా తృణీకరించి వెళ్లిపోవడం విశ్వనాథానికి బహుఅవమానకరంగా తోచింది. ఇంతా పిలిచినందుకు పక్కవెయ్యలేదు సరికదా ఎందుకూ పనికిరానివాడి కింద తీసిపారేసినందు కతడు పిడుగుదెబ్బ తిన్నట్టు మతిపోయి కొంత

సేపు ఏమీతోచక అలాగే నిలబడిపోయాడు. అయిదునిముషాలు తల వంచుకుని ఆలోచించాడు. భావతరంగసంఘర్షణమున అతనిహృదయం అల్లకల్లోలమై పోయినది. "ఈ వెధవయింట్లో యింక వుండకూడదు." అనుకుంటూ వెంటనే ఖండువా బుజంమీద వేసుకుని విశ్వనాథము గబగబ నడిచి వీథిలోకి పోయ్యాడు. లాంతరు వెలుగులో అతనికండ్లయందు నిల్చిన అశ్రువులు మిలమిల మెరిశాయి.

## ౬

నాటిరాత్రి విశ్వనాథం మరి యింటికి రానే లేదు. మర్నాడు పుదయం యెనిమిదిగంటలైనాకూడా అతనిజాడ లేకపోయింది. సీతమ్మా కుమార్తెకూడా ఆందోళనాపూరితహృదయములతో యేమీతోచక కొట్టుకుపోయారు. "ఇన్నేళ్లు ఒంటికొచ్చికూడా యింగితజ్ఞానం యెరక్కపోయావు. ఎక్కడెల్లా ప్రవర్తించాలో తెలుసుకోలేవు. అతని మనస్సు బహుసున్నితమైనది. ఏమాట అతన్ని అనడానికే నాకే భయంగా వుంటుంది" అని కూతురును చీవాట్లు పెడుతూ సీతమ్మ మాటిమాటికీ వీథిలోకి చూస్తూ నిరాశతో మళ్లీ లోపలి కొచ్చేస్తూవుండేది. కృష్ణమూర్తియింటికి కబురంపారు "ఎక్కడికి వెళ్లాడో మాకు తెలియదు" అనిమాత్రం జవాబు వచ్చింది.

సుందరమ్మహృదయముకూడా భారముగానే వుందని చెప్పక తప్పదు. తొందరలో భర్తను ఆడినమాటలను తలుచుకుని ఆమె చాలా నొచ్చుకున్నది. ఇల్లా పశ్చాత్తాపపడిన సమయము లెన్నో యిదివరకే ఆమెకు గడిచాయి. తీరావేళకిమాత్రం ఆమె కవి జ్ఞాపకమురావు. చిన్నతనంనుంచీ వున్న అలవాటుచేత ఆమెబుద్ధి తోచినట్లూ పోవడమే కాని ఆమెకి లోబడి ప్రవర్తించే మామూలు లేదు. భర్త రాకపోవడానికి తోడు తల్లి అనేమాటలకు పౌరుషంవచ్చి ఆమె గదిలోకి పోయి చాలాసేపు ఏడిచినది.

మిల్లుకివెళ్లేవేళ దాటిపోయినా విశ్వనాథం రాకపోవడంచూచి సుందరమ్మకి ఆతురత యెక్కువైపోయింది. 'ఎక్కడికెళ్లినా కచేరీవేళకి రాకమానరు.' అనే ధైర్యంతోవుంది ఆమె యీవరకు. ఆ ఆశ కాస్తా పోవడంతోటే ఆమెను ఒకవిధమైన దైన్యభావంఆవరించేసింది. "అమ్మా, యెలాగే? ఏమయారంటావు?" అని మాటిమాటికీ తల్లి దగ్గిర కొచ్చి అడుగుతూవుండేది. ఆ ప్రశ్నలోనే ఆమెకుగల బెంగ స్పష్టపడుతూఉండేది. భర్తవిషయమై ఆమె అదివర కెన్నడుగాని అంత ఆదుర్దా పొందివుండలేదు. ఇంట్లో ఉండిపోదలుచుకున్న భర్త మళ్లీ వీథిలోకి పోవడానికి తన తొందరపాటే కారణమని ఆమెకప్పుడు బాగా స్ఫురించినది. ఎదురుగా విశ్వనాథం వున్నట్లయితే తక్షణం క్షమాపణకోరుకోడాని కామె సిద్ధంగా వుంది. కాని చెయ్యికాలిన తరవాత లాభ మేముంది?"

*    *    *    *    *

సాయంకాల మైనుగంటలు దాటింది. సీతమ్మకీ బిడ్డకీ కూడా అంతవరకూ భోజనాలు లేవు. గోపాలరావుభార్య జానికమ్మ కిల్లలను జాగ్రత్తగాచూస్తూ ధైర్యంచెబుతూ ఆవేళల్లా అక్కడేవుంది.

మునమును చీకట్లు కమ్ముకొస్తున్నాయి. "ఏపూరికో వెళ్లిపోయారు" అని గద్గదస్వరంతో సుందరమ్మ తల్లితో చెబుతూంగి. కుమార్తెలో ఆనాడుకలిగినమార్పు సీతమ్మ కాశ్చర్యంకలిగించింది. భర్తకోసం ఆమెపడే పరితాపమును అల్లుడు ఒక్కసారిచూస్తే యెంత బాగుండునోకదా అని ఆమె అనుకుంది. "ఈ విచారమూ ప్రేమా యిదివరకుంటే బతికిపోదునే తల్లీ!" అని సీతమ్మ నిట్టూర్పు విడిచినది.

ఇంతలో హఠాత్తుగా వీథిలో గలభా బయలుదేరింది. అదేమిటో చూడ్డానికి తల్లీకూతురూ యింకాలేవకముందే పదిమంది మనుష్యులు ఏదోబరువును లోపలికి మోసుకొస్తున్నట్లుగా వారికి కనబడింది. ముందుగా గోపాలరావు లోపలికొచ్చి "దీపం యిల్లాతెండి." అని సీతమ్మతోచెప్పాడు. ఆమె దీపంతెచ్చేలోపుగానే హాలులో ఒక మంచంవేసి తమచేతుల్లోని బరువును దానిపైని దింపేటట్టు చేశాడతడు.



'ఆమె దీపం తెచ్చేలోపల......దింపేటట్టు చేశాడతడు.'

దీపం వచ్చింది. మంచంచుట్టూ జనంమూగి ఉన్నారు. ఇంకా చాలామంది లోపలికొస్తున్నారు. ఇంటి ముందు రోడ్డుమీద వందలకొద్దీ జనం పోగయ్యివున్నారు. అంతాకోలాహలంగా వుంది. గోపాల

రావు జనసమ్మర్దం లేకుండా సర్దుతున్నాడు. "ఏమిటి బాబూ యిది ?" అని సీతమ్మగారడిగిన ప్రశ్నకి జవాబు చెప్పడానికైనా అతనికి తెరిపి లేకపోయింది.

ఇదంతా చూసేసరికి సుందరమ్మకి ఒళ్లూ పయీ తెలియలేదు. ఏదో ప్రమాదం జరిగిపోయినట్లుగా ఆమె మనస్సు గభీమని కుంగిపోయింది. ఆమె దృష్టి ప్రశాంతంగా వుండక వెర్రివాళ్ల చూపులవలె గిర్రున తిరిగిపోయింది. ఒక్క చెంగున ఆమె మంచం పక్కకి చొరుచుకుపోయింది.

మంచముపైని ఒకవ్యక్తి పడుకునియుండెను పైనికప్పినబట్టలన్నీ రక్తసిక్తములై వున్నాయి. డాక్టరు వైద్యోపచారము చేస్తున్నాడు.

దీపముకాంతిలో విశ్వనాథము ముఖము సుందరమ్మకి స్పష్టంగా కనబడినది. ముఖంపైనంతటా రక్తధారలు ఎండిపోయి వున్నవి. సమాధినిష్ఠాగరిష్ఠుడగు యోగిపుంగవునివలె అతనికండ్లు మూతలు పడి ఉన్నాయి. కేవలం ప్రేతకళలు లేకపోయినా జీవకళ లున్న ట్లేమీ గోచరించడం లేదు.

సుందరమ్మకళ్లు తిరిగిపోయాయి. 'అమ్మో' అని ఆమె ఒక్క అరుపు అరిచి నేలపై పడిపోయింది. అక్కడే వున్న జానకమ్మయును, సీతమ్మయును కలిసి చైతన్యరహితమైన ఆమెశరీరాన్ని లోపలికి తీసుకుపోయి మంచంమీద జాగ్రత్తగా పడుకోపెట్టారు

శరీరాన్ని పరీక్షించి అవసరమైనచోట్లలో అవసరమైనకట్లు కట్టి మందువేసి డాక్టరుపని పూర్తిచేసుకువేసరికి రాత్రి పదకొండు గంటలయింది. అతడు వెళ్లినతరవాతగాని గోపాలరావుకి యింట్లోవాళ్లతో మాట్లాడ్డానికి వీల్లు కలగలేదు.

"ప్రాణభయం వుండకూడదు. ఏటిఒడ్డున బండరాళ్లమధ్య పడివుండగా విశ్వనాథాన్ని పల్లెవాళ్లు చూసి బైటికి తీసుకొచ్చారు. అప్పటికే అతనికి స్మృతి లేదట. ప్రాణం పోయిందనే వాళ్లనుకున్నారు. డాక్టరు చూసి చెప్పేవరకూ గూడా మాకందరికీ అభయమే వేసింది. కర్రలతో ఎవరో బలమైన దెబ్బలు కొట్టినందువల్ల కలిగిన గాయాలని డాక్టరు చెప్పాడు. ప్రాణాపాయం రాకూడదు కాని రెండుమూడు రోజులు చూసిగాని యేమీ చెప్పలేనన్నాడాయన. తలమీద దెబ్బలు మోపైనవి తగిలేయండీ! కట్లుకడుతూన్నప్పుడు చూడలేకపోయాను" అని చెప్పేటప్పుడు స్నేహపాత్రుడైన గోపాలరావు దృష్టు లశ్రునిరుద్ధములైనవి. విశ్వనాథాన్ని కనిపెట్టుకుని అతడారాత్రి అక్కడే వుండిపోయాడు.

సుందరమ్మస్థితి మరింత అధ్వాన్నమైపోయింది. తెలివి వొచ్చిన తరవాత భర్తదగ్గిరకి తీసుకెళ్లమని ఆమె పట్టుపట్టింద్ది. ఆస్థితిలో ఆమె అతన్ని చూడ్డం మంచిదికాదని గోపాలరావెంతచెప్పినా ఆమె లక్ష్యపెట్టలేదు. తీరా అతన్ని చూసినవెంటనే ఆమె మళ్లీ మూర్ఛపోయింది. తరువాత ఎన్నిసారులు కోరినా ఆమెను మరి విశ్వనాథం దగ్గిరకి తీసుకెళ్ల లేదు. కాని తెల్లవార్లూ ఆమె సరియైనస్థితిలో వుండలేదు. ఉన్మాదినివలె ప్రవర్తించిందని చెబితే చాలును.

మర్నాడామెమనస్సు కొంత కుదుటబడి పరిస్థితులను గ్రహించడానికి తగినస్థితిలో కొచ్చింది. భోజనం చేసేటప్పుడు ఒక్కగడియా తప్ప ఆమె నిత్యమూ భర్తసన్నిధినే ఉండి ఉపచారములయందు నిమగ్నురాలై పోయినది భర్త సేవవిషయంలో యిప్పుడామె వెనకా ముందూ చూడ్డంలేదు. తననీడను ముట్టుకోడానికైనా సందేహించే సుందరమ్మ నేడెంత అసహ్యాపుపనినైనా భర్తకోసం నిముషంలో చేసేస్తూంది. ఎరిగినవారందరికీ "ఈవిడ పూర్వపు సుందరమ్మేనా ?" అనిపించిందామె ప్రవర్తన.

భర్తపడుకున్న గదిని శుభ్రంగా వుంచడం, ఎప్పటికప్పుడు పక్కదుప్పట్లు మార్చడం, గదిలో సుగంధద్రవ్యములు అమర్చడం, వెయ్యివిధాల ఊహించి భర్తకి తోచిన సౌకర్యాలు కలిగించడం ఈ ఒక్క రోజులోనూ ఆమె యెక్కడ నేర్చుకుందో చెప్పలేము. పూర్వం ఏపని చేసినా బహుమోటుతనంగానూ, అశ్రద్ధతోనూ చేసే సుందరమ్మకిప్పటి కౌశల్యమూ, శ్రద్ధాభక్తులూ, ఆలోచనా యెల్లావొచ్చాయో ఊహాతీతమే.

కాని భార్య తెలివితేటలతో ప్రవర్తించగా చూడాలని రాత్రింబగళ్లు ప్రయత్నించి విఫలమనోరథుడై దుఃఖితాత్ముడైపోయిన నిర్భాగ్యజీవనుడగు విశ్వనాథానికి కామెలో కలిగిన యీ హఠాత్పరివర్తనను చూసి ఆనందించగల అదృష్టము లేకపోయింది. నాలుగురోజులవరకూ అతనికి శరీరస్మృతి రాలేదు.

అయిదవనాడతనిస్థితి చూసి వైద్యుడు నిరాశతో పెదవి విరిచేశాడు. ఆరోజున విశ్వనాథానికి పూర్తిగా స్మారకం కలిగింది. తన దుస్థితికి కారణం చెప్పగలిగాడతడు.

భార్యతో వివాదపడిన నాటిరాత్రి అతడు తిన్నగా కృష్ణమూర్తి యింటికే వెళ్లాడు, అక్కడ తెల్లవారగట్ల రెండుగంటలవరకూ పేకాటలో కూర్చున్నాడు. అదేమికారణమో కాని ఆరాత్రి లాభమంతా అతనిదే అయింది. ఆటగాళ్లందరూ నష్టపోయిన డబ్బు నాలుగైదు వందలదాకా అతనిదగ్గిర పోగయినది. అది చూసి వాళ్లందరూ "మీకు రోజూ నష్టంరావడం యిష్టంలేక కొంతలాభం కలిగించాలని అల్లా ఆడాంకాని మీపాటి తెలివితేటలులేక కాదయ్యా! మీరు గెలిచారు గనక గెలుపులో పదోవంతు తీసుకుని మిగిలినది మాకిచ్చెయ్యండి" అంటూ విశ్వనాథంతో తగువుపడ్డారు. అందు కతడు ఇష్టపడలేదు.

ఆట పూర్తికాగానే ఆ హాలులోనే ఒకబల్లమీద విశ్వనాథం పడుకున్నాడు. అతనికి నిద్ర యింకా పూర్తిగా పట్టకముందే యిద్దరు ముగ్గురతనిదగ్గిరకొచ్చి "అల్లాయేటివోడ్డు వెళ్లివొద్దాంరండి" అని తీసుకెళ్లారు. అక్కడ పదిమంది హఠాత్తుగా అతనిమీదపడి, నోట్లో గుడ్డలు కుక్కి డబ్బుతీసుకోబోయారు. చేతులోవున్న కర్రతో విశ్వనాథం కొంతవరకు ధైర్యంగా దెబ్బలాడాడు. కాని ఎదురుపార్టీ ఎక్కువమంది అయిపోవడంచేత అతన్ని చావమోది సొమ్ముతీసుకుని దూరంగా దుబ్బుల్లోకి యీడిచేసిపోయారు. పల్లెవాళ్లొచ్చి చూసే వరకూ అతడాస్థితిలోనే అక్కడే వుండిపోయాడు.

## ౭

"కడమవన్నీ యెలాగున్నా తలమీద బహుశా పైనదెబ్బ తగిలిందండీ! ఈవేళ తెలివిగావుండి మాట్లాడుతున్నారు. కాని రేపు సాయంకాల డాటడం కష్టమని నాఅభిప్రాయం. ఎంతప్రయత్నించినా నేడి యెక్కడంలేదు. క్రమంగా వాతం కమ్ముకొస్తూంది. ఇంతకీ దైవానుగ్రహం యెలాగుంటుందో చెప్పలేం. అలాగని మనపని మానకూడదు." అని డాక్టరు విశ్వనాథంమంచందగ్గిర కూచుని తనచుట్టూ వున్నవారందరితోనూ చెప్పాడు.

ఈమాటలు వింటూన్న సుందరమ్మతల తిరిగిపోయింది. మెల్లిగా గోడనానుకుని ఆమెగదిలోకి పోయింది. మిగిలినవారందరి కళ్లూ అశ్రుపూరితములై పోయాయి. గౌరవనీయుడైన విశ్వనాథం అలాంటి దుర్మరణము పొందడం వారికి భరించరానిదై పోయినది.

సుందరమ్మ దుఃఖము వర్ణనాతీతము. తెలివివొచ్చినతరవాత భర్త ఆమెవంక ఒకటిరెండుసార్లు చూసి మళ్లీ తక్షణం దృష్టులను మరల్చేసుకుంటూవచ్చాడు. అతని కళ్లలోనిల్చిన దుఃఖాశ్రువులుమాత్రమామెకు కనబడ్డాయి. దీనాతిదీనములైన ఆచూపు లామె హృదాయాన్ని కలచివేశాయి. "ఆనాడు నీతోవాదనే లేకపోతే నాగతి యింతమట్టుకు రాకపోవునేమో" అని అతనిదృష్టులు చెబుతున్నట్టుగా ఆమె భావవీథిని గోచరించినది. ఎక్కడికెళ్లినా సరే, ఏంచేస్తున్నా సరే ఆమె కామాటలే వినబడుతున్నాయి. ఎవ రేమాట్లాడినా వాళ్లు "నీనించే నిక్షేపంలాంటివాడి కిన్ని పాట్లొచ్చాయి. భర్తని ఆదరించుకోలేని నీబతు కెందుకు?" అని తన్ను నిందిస్తున్నట్లే వినబడేది.

తనతో యేమైనా భర్త మాట్లాడుతాడేమో అని సుందరమ్మ చాలాసారులు చూసింది. కాని ఆమెవేపు చూసినప్పుడల్లా తక్షణం దృష్టి మరల్చేసుకుని వేడి నిట్టూర్పులు విడుస్తూవుండేవాడు విశ్వనాథం. అత డల్లాచెయ్యడంవల్ల నామె హృదయవ్యథ ద్విగుణీకృతమై పోయింది. అత డీలోకాన్నే విడిచిపెట్టవలసివొస్తుందని డాక్టరు చెప్పినప్పుడు ఆమె అసలే నిలవబడలేకపోయింది.

ప్రతినిముషమూ, ప్రతిఘడియా భర్త దీనవదన మామె మనోవీథిని నిలిచి "ఇంక యీజన్మానికి నా కింతేసౌఖ్యం" అని యింకా వరలో లాగే అనుకుంటున్నట్లుగా తోచేది. తాను నేరస్థురాల ననే భావం యెలాగో ఆమెహృదయంలో ప్రవేశించి బాధించడం మొదలు పెట్టింది. వేదనాపూరితమైపోయినమనస్సు ఆమెను నిలవనియ్యడం లేదు. మనశ్శాంతిలేక సుందరమ్మ ఒకరోజల్లా యమయాతన ననుభవించింది.

ఆఖరురోజు వొచ్చింది ఆరోజు డాటడం దుర్ఘటమని డాక్టరు చెప్పాడు. దాని కనుగుణంగానే విశ్వనాథంబాధ ఎక్కువై పోయింది. పడుకోలేక, కూర్చోలేక, నిద్రపోలేక అతడు వేగిపోయాడు. దగ్గిరవున్నవా రెవరూ ఆతనిబాధను చూడలేకపోయారు. డాక్టరు మళ్లావచ్చి చూసి ఇంక కొన్నిగంటలుమాత్రమే వ్యవధి వుందని చెప్పి వెళ్లాడు.

ఏవిధాన్నీ సుందరమ్మమనస్సు కుదుటబడలేదు భర్తయెదుటికి వెళితే తన్ను చూడగానే అతడు కళ్లు మూసేసుకుని శరీరబాధకి తోడు మరింత మనోవేదననుకూడా అనుభవిస్తున్నాడు. పోనీకదా అని లోపలకుపోతే అక్కడ వుండడాని కామెమనస్సు ఒప్పుకోకుండా వుంది. ఈమోస్తరుగా ఆమె యెటూతోచక కొట్లాడినది. చివరకు తన అజ్ఞానమును సైరించి భర్తను రక్షించమని నిశ్చలమనస్కురాలై సర్వేశ్వరుని ప్రార్థించినది. ప్రవాహమునబడి కొట్టుకుపోతున్నప్పుడు తృణకణమునకై చెయ్యిజాచినట్లుంది అన్నీ చాలించుకున్న భర్త జీవిస్తాడని ఆమె అనుకోవడం. అందరూ నిరాశచేసుకున్నా ఆమెకి మాత్రం ఆ ఆఖరు గడియలోకూడా ఆశాజ్యోతి కనిపిస్తూనే ఉండి ఉండాలి. లేకపోతే ఆప్రార్థనలో అర్థమేముంది ?

ప్రార్థనవల్ల ఆమెకు కొంతచిత్తశాంతి కలిగినది. ఆ సమయమున తనకర్తవ్య మొకతటిల్లతవలె తటుక్కున నామె మనోవీథిని మెరిసింది. తక్షణం ఆమె అక్కడ నిలవక తిన్నగా భర్తసమీపానికి పోయింది. సుందరమ్మ రాగానే విశ్వనాథం తన బాధనంతా మరిచిపోయి సదానందంగా ఆమెవేపు కొంచెంసేపు చూసి మళ్లా కళ్లుమూసేసుకున్నాడు. దుర్భరవేదనా దహ్యమానమగు నతని మనసునం దెట్టిటి తలపులు పొరినవో ఎవరు చెప్పగలరు? అశ్రుపూరితలోచనయైన భార్యను చూడ్డంచేత అతనికి కలిగిన మనోవేదనను గుర్తించడాని కెవరికి సాధ్యమవుతుంది?

గోపాలరావు ఇంగితజ్ఞుడు. ఇహలోకంలో ఆఖరుసారి భార్యాభర్తలికి ఒక్కనిముషకాలం యేకాంతవాసమును సమకూర్చడం సమంజసమని అతనికి తోచింది. వెంటనే అక్కడివారి నందరినీ పైకి వెళ్లవలసిందని కోరాడు.

అందరూ పోయిన తరవాత సుందరమ్మ భర్తపాదాలను ఒత్తుతూ మంచంమీద కూర్చుంది. అవిరళాశ్రుగళితములగు నామె నేత్రములు కృశీభూతమైన భర్తృవదనమువంక తదేకధ్యానంగా చూస్తున్నాయి. స్పర్శనుగ్రహించి విశ్వనాథం కళ్లు విప్పిచూశాడు. ఇద్దరి దృష్టులును నిశ్చలంగా కలుసుకోడానికదే మొదటిసారి. సుందరమ్మ అతని తల దగ్గిరకి జరిగికూర్చుంది. తన రెండుచేతులమధ్యా భర్తహస్తాన్ని మెల్లిగా



'తన రెండుచేతులమధ్యా......మెల్లిగా పట్టుకుంది.'

పట్టుకుంది అతనితో ఏదోచెప్పాలనుకుంది గాని కొంతసేపటివరకూ మాటరాలేదు. చివరికి కంఠం సవరించుకుని మెల్లిగా "నాతప్పు క్షమించండి" అనిమాత్రం అనగలిగింది.

ఆమాటలోనే ఆమెహృదయగతవిషాదభరము విశ్వనాథానికి వ్యక్తమైపోయింది. శోకవ్యాకులితయైన భార్యను చూసి సహజదయాస్వభావుడగు నతనిమనస్సు ద్రవీభూతమై పోయింది. నీరసంగా అతడు "విచారపడకు" అన్నాడు. అతనికళ్లలోకూడా నీళ్లు ప్రత్యక్షమైనాయి.

అతని అనునయవాక్యంవల్ల సుందరమ్మకి కొంచెం ధైర్యం కలిగింది. కాని అనిష్కల్మషహృదయుణ్ని చూసినకొద్దీ ఆమెకు విచారం అధికమే అయినది. "అయ్యో! నాపాపానికి నిష్కృతి లేదు. వళ్లూపయీ తెలియకచేసిన పనులకి యిప్పుడు ఎంత పరితపించిపోతున్నానో భగవంతుడికి తెలుసును. అబ్బా! మీబాధ మాడగలిగేకంటె భగవంతుడు నన్ను తీసుకుపోతే యెంత బాగుండును? నా కింక ముక్తి యెక్కడ?" అని పొంగిపోతూవున్న దుఃఖాన్ని ఆపుకోలేక వావిడిచి ఏడ్చింది.

"సుందరం! యెవరి కర్మాన్ని యెవరు తప్పించగలరు? నాకిల్లా బాధపడే యోగం వుంది. ఇందులో నీ తప్పేముంది? ఏడవకు. వూరుకో!" అని అతికష్టంతో అన్నాడు.

"ఇది నేను చేతులారా చేసినపాపం. నన్ను పెళ్లిచేసుకున్నందుకు ఒక్కనాడైనా మిమ్మలిని సుఖపెట్టలేకపోయిన నిర్భాగ్యురాలిని. ఇప్పుడెంత యేడుస్తే యేంలాభం? మీరు మనఃపూర్తిగా నన్ను క్షమిస్తేనేగాని యీపశ్చాత్తాపము నన్ను దహించేస్తూంది. ఇంక యెన్నడూ మీకు వ్యతిరేకం చెయ్యనని దైవసాక్షిగా చెబుతున్నాను. మీరు నన్ను క్షమిస్తారనే నమ్ముతాను. ఏం? మాటాడరేం?" సుందరమ్మ దుఃఖసంక్షుభితహృదయయై వొణికిపోతూ చెప్పింది కన్నీళ్లామె చెక్కులపైనుండి ధారగా స్రవిస్తున్నాయి.

పశ్చాత్తప్తమనస్కురాలగు భార్య విషాదభరమును విశ్వనాథము చూడలేకపోయాడు. అయినా ఆమె పశ్చాత్తాప మతని మండుతూవున్న హృదయానికి కొంత ఉపశాంతిని కలిగించినది. పెళ్లి అయిందిమొదలు ఒక్కనాడైనను సౌఖ్యపడకపోయినప్పటికీ ఆవిచారమును ఒక్కసారి చూసేసరికే అతడు తన పూర్వకష్టములను మరిచిపోయాడు. ఆమెయూలమున తనుపడిన మనోవ్యథఅంతా అతనిలోనించి ఎగిరిపోయింది.

అంతవరకూ నిస్తేజములై వున్న అతనినేత్రాల్లో ఒకవిధమైన కాంతి గోచరించినది. బాధాసూచకమై దీనాతిదీనమై, కళావిహీనమై ఉన్నముఖం ఒక్కక్షణంలోనే ఆనందభావసంభరితమైనట్లు కలకలలాడింది. భార్యముఖం వేపు నిదానించి చూశాడు కొంతసేపు. "సుందరం! నాజన్మ తరించింది. ఇంక నేను—బతికివున్నా ఒకటే—ఏమైనా ఒకటే. ఈనాటికైనా నీహృదయాన్ని సంపాదించుకోగలిగాను కదా అని నామనస్సు ఉత్సాహభరితమైపోతూంది. నామనస్సులో నీమీద యేవిధమైన కోపమూ లేదని మనఃపూర్తిగా చెబుతున్నాను. నువ్వు నాకు అనుకూలవతివి కాలేదన్న విచారమే గాని కోపం లేనే లేదు. ఆవిచారంకూడా నేటితో పోయింది. ఈ ఆనందం అనుభవించడానికి నేనింకా ఆట్టేకాలం బతకనేమో అన్నవిచారంమాత్రం నన్ను బాధిస్తూంది" అని విశ్వనాథము కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

సుందరమ్మ పైటచెరగుతో అతని అశ్రువులను తుడిచింది. "అబ్బా! మీకన్నీళ్లుచూసి నేను భరించలేను. మీరుబతుకుతారు. ఏ పరవాలేదు. అధైర్యపడకండి" అంది.

"ఆఁ—! సుందరం! డాక్టరు నేనుబతుకుతాననే చెప్పాడా? నిజం? అమ్మా! అమ్మా! ఎన్నిదెబ్బలు ఎన్నిదెబ్బలు! ఆవేళే



సారస్వతనికేతనము, వేటపాలెము స్త్రీలశాఖ



సారస్వత నికేతనము, వేటపాలెము (శ్రీసీతారామాంజనేయ భజనసంఘము)



ఆంధ్రగ్రంథాలయము, కర్నూలు



ఉ వెం శ్రేష్ఠిగారు

(వేటపాలెము సారస్వత నికేతనాధ్యక్షులు)

గతసంవత్సరము పల్లికొండ ధర్మవివాహోపనయన సభ జరగించిన వివాహోపనయనములకు సంబంధించిన వధూవరులు, వటువులు.



(ఇది మితవ్యయ విధానమున శ్రీమంతులు తమయింట జరుగు నొక్క పెండ్లితో పాటు ఇట్లే కొన్ని పెండ్లిండ్లు మొదలయినవి కావించిన దేశమునుబట్టిన ఆర్థికదుస్థితి చక్కబడగలదు )



ఆంధ్రాగ్నికుల క్షత్రియ యువజన మహాసంఘము, రంగూను

స్వాతంత్ర్యైశ్వర్యములకు మార్గము నీ దుర్గతిని పోగొట్టు రోజు

# మార్చి తేది 21

అంధకారము — వెలుతురు
అపజయము — జయము
వేదటికము నుండి

దుఃఖము — సౌఖ్యము
వ్యాధి — ఆరోగ్యము
ధనమునకు

నవరోజీ

## రెండు గొప్ప యమానుష బలములకు పోట్లాట

మార్చి 21 తేదీ నుంచి చెడుగుల యుద్ధపర్యవసానము నిశ్చయించును. ఆరోజున సూర్యుడు తన ప్రయాణమును పూర్తిజేసి మేషరాశియందు ప్రవేశించును. ఆరోజుననే భూమి స్వర్గమునకు దరిగానుండును. నమ్మకముగల మనుజులు ప్రార్థనలు సల్పి దైవానుగ్రహము నొందుదురు ఈ రోజుననే నవరోజ మంత్రవేత్త తనమంత్రోపాసములను పూర్తిజేసి, శనిగ్రహ పీడితులగు తనభక్తులకు సౌఖ్యమును ప్రసాదించును ఈవత్సరమున వెయ్యిమంది రక్షింపబడి దేవుని దయను బడయుదురు.

మరల 12 ఏండ్లయిన తర్వాత గ్రహములు నిస్థానములందు మార్చి 21 తేదీ యందుండును. కాని పూర్వముకన్న యీమార్చి 21 తేదీ మంత్రబలమనేకరెట్లు హెచ్చుగ నుండును. అసమానసంఖ్యాకులగు జనులీసంవత్సరము సహాయమును గోరుదురు ఇట్టి సహాయవాత్సల్యమైన జనప్రవాహము 1870-వ సం॥ నుండి దైవిక నవరోజీయొక్క అద్భుతకార్య ఫలములవలన హెచ్చగుచువచ్చుచున్నది క్రూరమగు హీనదశవలన బీడితులగువారీక్రొత్తబలమును పొందుదురు.

### నవరోజి గుణములు

(1) వ్యాపారమునను, ఉద్యోగమునందును జయమును సమకూర్చును, లాభములను హెచ్చు చేయును
(2) పరీక్షలందు సాఫల్యము.
(3) దావాలలో కార్యసిద్ధి నొసంగును
(4) వివాహవిషయములందు కోరినకోర్కెల నన్నిటిని జేకూర్చును.
(5) శత్రువులమీద జయము.
(6) పెద్దల దయ గల్గించును
(7) ఆశ్చర్యకరమగు ధనసంప్రాప్తి
(8) వ్యాధులబోగొట్టి ఆరోగ్యమునిచ్చును.
(9) తనపట్ల ఎల్లరి అనురాగమును హెచ్చించును
(10) ఆకస్మికమగు గండములనుండి తప్పించును.
(11) చెడుఅలవాటులను పారద్రోలును.
(12) తేజస్సును, గుణశీలములను వృద్ధిచేసి గొప్పపేరుప్రతిష్ఠల నొసంగును.

### నిరుపమాన లాభముల నొందుటకు దైవిక తాళము.

### నమ్మకము ప్రధానము

నమ్మకములేక దుష్కర్మలకు బాల్పడి హీనమునొందుచున్న మూఢజనులనుమనము ప్రతిరోజున చూచుచున్నాము. శాస్త్రములను భగవంతుని నమ్మమనెడి వారెవరున్నారో రండు మీ కపనమ్మకములు శనియొక్క అంధకారమువలననే పుట్టుచున్నవి

### 1932 మంత్ర రక్షలు

పూర్వమింతటి బలముగలవి లేవు 1932 సంవత్సరపు నవరోజ మంత్రబలము లత్యధికములు మాదగ్గర నివి హెచ్చుగాలేవు వీనిలోనొకటి వెంటనేపొంది మీదుర్దశను బాపుకొనుడు మార్చి, ఏప్రల్ నెలలలో నీమంత్రబలము అసమానమని గ్రహింపుడు త్వరపడి ఆర్డర్లను జేయుడు.

నవరోజి వారి నధికముగ తృప్తిజేయని యెడల వారిటుల ననేకమైన యోగ్యతాపత్రములను ఉత్తరములను పంపి దానినటుల గొనియాడుదురా?

**నవరోజి** లాభం లేకపోతే సొమ్ము వాపసు చేయబడును.

### రక్షల ఖరీదులు

నెం 1 — మొదటి ఐటెమ్‌లోని ఫలితములు సమకూర్చును దినిబల మారునెలల వరకే ఖరీదు రూ 2
నెం 2 — బలము హెచ్చు ఐటెములు 1 నుండి 7వఱకు పయోగించుటకు శ్రేష్ఠమైనది 1 సంవత్సరమువఱకు బలముతో నుండును రూ 5
(1, 2 నెంబర్లకు ప్రత్యేకమగు వెండి తాయత్తు ఖరీదు రూ 1
నెం 3 — అద్భుతఫలితముల నిచ్చును. 12 ఐటములకును మంచిది నవరోజ్ దినమందు సుముహూర్తమున తయారుకాబడ్డది జీవితకాలముల కత్యంతసహాయకారి చక్కనిబంగారు సుతో రు 25
నెం 4 — (ప్రత్యేకమగు హబిబీమంత్రరక్ష) జన్మకాలమువలనగలిగెడి చెడుగులతోను, దుర్దశలతోనుపోరాడి వానిని తరుమును. అసామాన్యమైనమంచి వెల్లినుగల్గి సాలిగ్రామము గలలాకెట్‌తో నుండును నిమిషమాత్రమున నద్భుతగుణమిచ్చును దీనిని కోరువారు తమ జ్యోతిష్కునితో వారిజన్మకాలమును రిగావ్రాసిపంపవలెను రు 75 (రు 20 అడ్వాన్సుగా) పంపవలెను
ఇతర దేశస్థులకు — ఖరీదులు నెం1 4షి నెం2. 10షి నెం3 2పౌ. 10 షి నెం 4. 6 పౌ. పా ఇతర దేశములవారుదీనినిగోరునపుడు తిమఆర్డర్లతో ఖరీదునుగూడపంపవలెను

## హబీబుల్లా సాహెబ్

పోస్టుబాక్సు 731, బొంబాయి

వ్యవహారములలో వాని నవలంబించెడి పద్ధతులు విస్తరింపబడినవి. గ్రంధకర్తగారి పాండితియు, లోకానుభవమును ప్రతిపుటను దేజరిల్లుచున్నవి. వాస్తవమున ఈ గ్రంధమందలి విషయము, లక్ష్యము, పద్ధతి, శైలి ఒకదానికొకటి వన్నెపెట్టుచు ప్రశంసార్హములుగ నున్నవి. మన గ్రంధకర్త భారతీయ ధర్మములయొక్క పునాదులను పెకలించకుండ కాలవాహినిలో నిలిచియున్న ఆర్యధర్మసాయము మును సంపూర్ణముగా నుపయోగించుచు ప్రస్తుత కర్తవ్యమును నిరూపింప యత్నించియున్నారు. ఇదియే నాకు మిక్కిలి నచ్చిన విషయము."

**యస్. రాధాకృష్ణన్.**

"ఈ మానవజీవితమున భారతధర్మములకు భంగకరముగాని ఆధునిక జీవితమును గడపవలసిన మార్గములు సులభమగు శైలిలో సోదాహరణముగ ఎల్లరకు తెలియు రీతిని ఉపదేశింపబడినవి. గాంధియుగమందు కలిగిన మార్పును పేర చక్కగ నిరూపించిరి. బాలరామకృష్ణయ్యగారు ఆంధ్ర సారస్వతమునకు నూతనవికాసమును దెచ్చిరి. ఈ గ్రంధమందు మానవజీవితము సార్థకమగుటకు వలయు మార్గములు ప్రాసంగుచ్ఛంబుల సులోచకముగ వివరింపబడినవి."

**ఆంధ్రపత్రికా సంపాదకీయము.**

"ఈ గ్రంధమును విమర్శింప బూనిన యెడల విషయము పరుగని చెప్పవచ్చును."—

**రాయసం వెంకటశివుడు.**

"ఇందులో మునుపెన్నడు ఉన్న తాత్పర్యములు ఎలుగెత్తి వ్యాఖ్యానింపబడియున్నవి. నీతిరింహితమైన ఈరీతి ప్రపంచకాని కీలాంటి గ్రంధ మెంతో అవసరం. ఈ యుగమందలి యువకుల ప్రవర్తనను సంస్కరించడానికే వ్రాయబడింది ఈ గ్రంధం. వయసుచల్లినవారుకూడ ఈ గ్రంధాన్ని చదివితే ఆత్మజ్ఞానవంతు లవుతారు."—

**భారతి.**

కాళ్లు వ్రాసిన, మానవజీవిత విషయసూచిక పుస్తకము పంపబడును. దీనిని చదివిన, గ్రంధముయొక్క ప్రాశస్త్యము చక్కగ తెలియగలదు.

త్వరపడుడు (శ్రీ గాంధి భగవద్గీత) మంచి తరుణము

# గాంధిగారినిష్కామయోగము

మిక్కిలి స్వల్పధర సాదాపేపరు బైండు 0-6-0 స్పెషల్ బైండు 0-8-0 కొలది ప్రతులు మా వద్దనే కలవు. తరుణము మించిపోవును. 440 పేజిలు. ఇది తెనుగులో కేవల నూతన గ్రంథము. ఈ తృతీయముద్రణ నిష్కామయోగము గాంధిగారి గుజరాతీ లనాసక్తియోగమునకే కేవల శుద్ధానువాదము. ఇందు 18 అధ్యాయముల మూలశ్లోకములు, మహాత్ముని అర్థము, వ్యాఖ్యానము కలవు. ఇక 1000 ప్రతులు మాత్రమే కలవు తృతీయ ముద్రణము!!! 5000 ప్రతులు.

చిరునామా:—

**మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.**

# ది స్టాండర్డు బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్.,

(ఇంకార్పొరేటెడ్ ఇన్ ఇండియా)

హెడ్ ఆఫీసు:—**260** చైనాబజారురోడ్, మద్రాసు.

బ్రాంచిఆఫీసు—విజయనగరం.

## ఆథరైస్డ్ మూలధనం రు. 20,00,000 లు.

### డైరక్టర్లు

మ. రా. రా. శ్రీ శ్రీరాజా యా. శివరామప్రసాద్ బహదూర్, చల్లపల్లి రాజాగారు.

" తహావార్ ఓ. జులదత్ దస్తగహా యమ్. వెంకటాద్రిఅప్పారావుబహదూర్ జమీన్ దార్, వుయ్యూరుఎస్టేటు,

" యస్. సి. నాగిశెట్టియార్ గారు, మేనేజింగుడైరక్టరు, గురుబసవ కంపెనీ లిమిటెడ్, మద్రాసు.

" డాక్టరు ఎ. వి. అవధాని. ఫిజిషన్ & సర్జన్, మైలాపూరు, మద్రాసు.

" ప. రాఘవన్ నాయరుగారు, B A. Com, అసిస్టెంటుసెక్రటరీ, ది సదరన్ ఇండియా చేంబరు ఆఫ్ కామర్సు, మద్రాసు.

" యస్. మాధవన్ నాయరుగారు B A (ఎక్సుఅఫీషియో, జనరల్ మేనేజరు.)

" ఎ. వెంకటరత్నం పంతులుగారు, మర్చంటు, ఏజంటు, మేనేజింగుడైరెక్టరు.

" టి. రామమూర్తి పంతులుగారు, B A రివెన్యూఆఫీసరు, తిరుపతి, తిరుమల దేవస్థానం—తిరుపతి.

" దశిక నాగేశ్వరం చెట్టిగారు, బ్యాంకరు, ల్యాండులార్డ్ అండు మర్చంటు, తణుకు—(వెస్టుగోదావరిజిల్లా).

మా హెడ్డాఫీసులోను, బ్రాంచిఆఫీసులోను బంగారు వస్తువులమీదను, ధాన్యము మొదలగుసరుకులు గవర్నమెంటు పత్రములు మొదలగువాటిమీదను తగిన శెక్యూరిటీలమీదను సరసమైన వడ్డీరేట్లకు ఎంత స్వల్ప మొత్తములైనను ఎవ్వరికైనను అప్పు యిచ్చెదరు కర్రెంటుఅక్కౌంటు, సేవింగ్సుబ్యాంకు, ఫిక్సెడ్ డిపాజిట్లను మిక్కిలి అనుకూలమైనపద్ధతులపై తీసుకొనెదరు. అన్నివిధములైన బ్యాంకింగు వ్యవహారములు జరుపుదురు

తెలుగుజిల్లాలలో క్రొత్తపద్ధతిగా ఆక్షన్ చిట్టి సిస్టమ్ ఏర్పాటు చేయుడమైనది గనుక యావన్మంది వారి వారికి తగినట్లు చిట్లను తీసుకొనవచ్చును. రూల్సు వివరములకు, దరఖాస్తుఫారములకు, షేరుదరఖాస్తుఫారములకు వడ్డీవివరములకు మా హెడ్డాఫీసునకుగాని, బ్రాంచిఆఫీసునకు గాని, స్వయముగావచ్చిగాని వ్రాసిగాని తెలిసికొనవచ్చును.

మా బ్రాంచీలో యీసంవత్సరం మే నెల 7 వ తారీఖున మొదటచీటి సీరీసు వేలంవేయబడును.

ఏ. వెంకటరత్నం,
మేనేజింగు డైరెక్టరు.

చచ్చిపోవలసింది నీనిజమైనహృదయాన్ని తెలుసుకుని మనశ్శాంతి పొందడానికే కాబోలు భగవంతు డింతకాలం బతికించాడు అయితే సుందరం నేను బతుకుతా నన్నాడా డాక్టరు ?”

ఆతురతాసహితములై జాలిగొల్పుతూ ఉన్న అతనిదృష్టులు సుందరమ్మ హృదయాన్ని కలిచివేశాయి. జీవితమాధుర్యమును గ్రోలి వుండకపోవడంచేత అంతవరకూ అతనిమాటలు వైరాగ్యభరితములై, నిరాశావివశములై వుండేవి. భార్యలోని మార్పును చూసినతరువాత మాత్రం అతనికి భావిజీవితమందు ఆశాజ్యోతి కనబడినది ఇంకా కొంతకాలం బతికి సుఖిద్దామనే ఆశతో ఆయువకుని ప్రాణం కొట్టుకుంటూన్నట్లు అతనిప్రశ్నలే స్పష్టపరిచాయి అంతవరకును ప్రాయోపవిష్టుడై ఉన్న విశ్వనాథాని కప్పటినుంచే ఆసన్నమృత్యుదేవతతో పోరాటము ప్రారంభమైనది

“మీకేం భయంలేదు తప్పకుండా బతుకుతారు” అని మాత్రం సుందరమ్మ చెప్పింది కాని డాక్టరుమాటలను స్పష్టంగా విన్నటువంటి యామెకు ఆశ యెక్కడిది?

* * * * *

ఇంతలో గోపాలరావు లోపల ప్రవేశించినందున సుందరమ్మ లేచినిలబడింది. అంతాకలిసి విశ్వనాథానికి ధైర్యంచెబుతూ ఆఖరు గడియకి నిరీక్షిస్తూ కూర్చున్నారు

నీరసమూ, ఆయాసమూ అధికముగానే ఉన్నప్పటికీ విశ్వనాథము పూర్వంకంటె ఎక్కువ ఆసక్తితో మాట్లాడుతున్నాడు తనకు వేసేమందులను గురించిగాని, డాక్టరు చెప్పినమాటలనుగురించిగాని అతడు దివర కొక్కసారైనా ప్రశ్నించలేదు కాని ఆ సాయంకాలం మాత్రం అన్నివిషయాలూ వివరంగా అడిగి తెలుసుకునేదాకా అతడు విశ్రమించలేదు మాట్లాడినందువల్ల బాధ హెచ్చయిపోతుందని ఎన్నిసార్లు హెచ్చరించినా అతడు వినిపించుకోలేదు ఆరిపోయే ముందు దీపమువృద్ధి పొందినట్లే అని అతని మాటలను చూసి అక్కడివారంతా భావించుకున్నారు

సాయంకాల మైనది అంతదాకా మాట్లాడుతూవున్న విశ్వనాథం అప్పుడే నిద్రపోయాడు ఏనిముషాన్ని ప్రాణంపోతుందో అనే భయంచేత గోపాలరావు తరుచు వచ్చి ఉచ్ఛ్వాసనిశ్వాసములను పరీక్షించి గుండెలమీద చెయ్యివేసి చూస్తూవుండేవాడు

దాహానికి మూడునాలుగుసారులు తప్ప ఆరాత్రిఅల్లా విశ్వనాథము మరి లేవలేదు. బాధవచ్చిన యీ వారంరోజుల్లోనూ అతడెన్నడూ అంతవొళ్లుమరిచి నిద్రపోలేదు ఆ నిద్ర సుగుణమో దుర్గుణమో నిర్ణయించుకోలేక పోయాడు గోపాలరావు కాని నిద్రలోనే ఎక్కడప్రాణంపోతుందో అని ఆతడు ఖంగారుపడ్డాడు డాక్టరు మాట లతనిచెవుల్లోరింగుమంటూనేవున్నాయి

ఉదయం యెనిమిదిగంటలకి డాక్టరు వొచ్చాడు తనుపెట్టిన గడువుదాటి విశ్వనాథం జీవించివుండుట అనుభవశాలియైన డాక్టరుకి ఆశ్చర్యమును కలిగించింది రోజులాగుకాకుండా అతని పరీక్ష ఆనాడు చాలాసేపు పట్టింది చూచిన అవయవాన్నే మళ్లా చూస్తూ, ఏదోసంశయం నివారణమై పోయినట్లుగా తలపంకించుకుంటూ గంటన్నరసేపు గడిపాడతడు పరీక్ష పూర్తి అయేవరకూ ఎవరెన్నిప్రశ్నలు వేసినా డాక్టరు జవాబుచెప్పలేదు

పనిముగించుకుని, పరీక్షనిమిత్తం వుపయోగించిన పనిముట్లను జాగ్రత్తపెట్టినతరువాత ఒక్కనిట్టూర్పువిడిచి చిరునవ్వుతో డాక్టరు కుర్చీలో విశ్రాంతిగా కూర్చున్నాడు అతని అభిప్రాయం వినే కుతూహలముతో అందరూ అతని వేపేచూస్తూ నిలుచున్నారు

“దైవానుగ్రహం వున్నప్పుడిల్లాగే జరుగుతుందండీ. నిన్నటివరకూ నాకు ఏవిధమైన ఆశాలేదు మన విశ్వనాథం మళ్లా మనలో పడ్డాడు ఆసంగతి నిర్ధారణ చేసుకోడానికే యింతసేపు పట్టింది నా పరీక్ష ఇంక మీరు ఖంగారుపడకండి ఔషధసేవ సవ్యంగా నియ్యండి ఏమీ పరవాలేదు” అన్నాడు డాక్టరు

* * *



షాహుకారూ ఇంకా ఒక్కరిద్దరు స్నేహితులూ కూర్చున్నారు వారి మధ్య వెండిపళ్లెంలో నూగురూపాయలూ, తమలపాకులూ, చెక్కలూ వున్నాయి. ప్రక్కనే కొంచెందూరంలో సుందరమ్మా, సీతమ్మా జానికమ్మా నిలుచున్నారు.

విశ్వనాథము పళ్లెమును డాక్టరుకి అందించి "యీస్వల్పబహుమతి పుచ్చుకోండి. ఒకనాటివాళ్లము కాదుకదా" అన్నాడు.

డాక్టరు మందహాసపూర్వకంగా అందుకుని "మీరు బహుమతి యివ్వాలా? మనలోమనకి యిల్లాంటివి వుండకూడదు కాని విశ్వనాథంగారూ? మీలాటికేసును నేను యిన్నాళ్లబట్టి యీవృత్తిలో వున్నాను గాని యెక్కడా చూడలేదయ్యా! మీరు కేవలం మృత్యుదేవతని జయించేశారన్నమాట" అన్నాడు

విశ్వనాథం దరహాసితవదనుడై నిండుసంతోషముతో, ప్రక్కనే వున్న భార్యావేపు చూశాడు. సుందరమ్మ పరిపూర్ణవస్త్రాలంకారములతో మహోత్సాహభరితురాలై నిలుచుండి. ఆమె నేత్రముల యందు ప్రేమరసము తొణుకులాడుతూంది. పూర్వపు వైరియాపమంతా పోయి ఆమె సార్థకనామధేయవలె నిండుసౌందర్యముతో చూపట్టిం దారోజన

విశ్వనాథ మా సౌందర్యస్వరూపమును కొంతసేపల్లా తనివిదీరా చూసి నవ్వుకుంటూ "ఈమృత్యుదేవతని జయించడంలో నాకు సహాయంచేసిన సత్యభామ వేరే వుంది. మనమందరమూ ఆవిడకే కృతజ్ఞులమై వుండాలి" అని సాభిప్రాయంగా సుందరమ్మకేసి చూశాడు. లజ్జారుణకాంతులు చెక్కులయందు చిందులాడ సుందరమ్మ మృగు మధురమందహాస మొనర్చి కొంచెం వెనక్కి తప్పుకొన్నది

---



స్న ము

మొక్కపాటి కృష్ణమూర్తి, కాకినాడ.



# చిత్రశాల:

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు



౧

'వాణీ!'

......పలుకదు. ఎన్నిసారులు పిలిచినా, తలఎత్తి అతని వైపైనా చూడదు; కొంచెంసేపు ఆమెను చూస్తూ, అలాగే నిలుచుని ఖిన్నుడై తిరిగి వెళ్లిపోతాడు.

చంద్రవాణి తోడివా రందరికన్నా చాలా చక్కనిది. ఆ యీడుపిల్ల లందరూ, ఆమెతో తిరిగేవా రందరూ, బాగానే ఉంటారు కాని అంత నోరూరించే రూపము మరెవ్వరికీ లేదు.

కాలేజీ విడిచిపెట్టడం వ్యవధానంగా, శివస్వామి వాణిసూక్కలు దగ్గర కాపాలా వేసేవాడు. బద్ధకంగా ఉంటే బడిఅయినా మానుకునేవాడు కాని నాలుగువేసేటప్పటికల్లా, చక్కగా క్రాప్ దువ్వుకుని—సిల్కువర్టు వేసుకుని—సిగరెట్టు కాల్చుకుంటూ—'మీనాక్షీ కాలేజీ' దగ్గర ప్రత్యక్షమయేవాడు.

మొదటిరోజుల్లో, వెంట ఎప్పుడూ ఎవరో ఒకరు తీయకుండా ఉంటూండటంచేత, వీలులేక, సిగ్గుపడి తనవంక చూడటంలేదేమో ననుకునేవాడు. కొన్నాళ్లు పోయినతరువాత—తలచుకుంటేనే మతి అంతా చెడిపోయేది!—మరి ఏధన్యాత్ముడైనా, ఆమె యౌవనాన్ని ధన్యం చేస్తున్నాడేమోనని అనుమానపడి, అనవసరంగా అసూయపడేవాడు. తాను మనసులో భావించుకున్న, అప్రియుడు, ఆమెను పరిరంభం చేసుకుంటూన్న దృశ్యాన్ని పదేపదే ఊహించుకుంటూ, నిద్ర లేకుండా అనేకరాత్రులు గడిపేవాడు

ఎరుగున్నంతవరకూ, స్నేహితు లందరికీ కాలేజీ వదలిపెట్టగానే, ఎవరిపని వారి కుండేది కాంపౌండుదాటేదాకా కబుర్లు చెప్పుకుంటూవచ్చి, రోడ్డుమీద కాలుపెట్టగానే ఎవరిదోవను వాళ్లు చల్లగా సద్దుకునేవాళ్లు. ఎన్నడూమాడ బలుకకపోయినా, ఎవరి మటుకు వారికి తెలుసును, మిగతావాళ్ల పను లేమిటో!

అందరూ అదృష్టవంతులే! శివస్వామికిమాత్రం ఆభాగ్యం అబ్బలేదు. లేతవయసులో, నవనవలాడుతూ, సామ్రాజ్యాన్నంతా ఏకచ్ఛత్రంగా ఏలడానికి తగినవాడనీ,—ఏలుతున్నాడనీ—చూసినవాళ్లందరూ అనుకుంటుంటే నిజంగా, ఒకపధహారేండ్ల చామనచాయపిల్ల కోసం కలువరిస్తూ ఆమెతోడి చెలిమికి తల్లక్రిందుగా తపస్సుచేస్తున్నాడు.

అతని వయసూ, వలపూ వ్యర్థమయిపోతున్నాయి. ఆమె అతన్ని గమనించడమన్నా లేదు. చెలులందరితో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ—శివస్వామికిమాత్రం పెడమోమై—నిత్యమూ అతని ఎదుటనుంచే షికారుపోయేది. స్వామి ఆమెను వెంబడించిపోయి, తిరిగి వెళ్లేవరకూ అప్రాంతాల్లోనే ఉండి, మామూలు వేళకే, మామూలుకన్నా ఎక్కువ విచారంతోనే యింటికి వెళ్లిపోయేవాడు.

తానై పలుకరిస్తుందేమోనని ఎంతో ఆసతో ఉన్నాడు. పోనీ, అంతకు నోచుకోకపోయినా, ఓమారు సవిలాసంగా తనవంక చూసినా చాలు, ధన్యుణ్ణవుతా ననే స్థితిలోకి వచ్చాడు. కాని, వాణికి జాలన్నా లేదు.

గాంధర్వవిధిని తన్ను వరించడానికి వాణికి ఏమైనా అభ్యంతరం ఉందేమోనని చాలారోజులదాకా సంశయించాడు స్వామి. మంచి వంశంలో పుట్టి, అదుపుఆజ్ఞలలో పెరిగినపిల్లగనుక, స్వతంత్రించడానికి భయపడి, 'పెద్దలున్నారు. వా రెఱిగి పెండ్లిసేయగలరు. వేగిరపా టింత వల' దటంచు సందేశమేమైనా పంపిస్తుందేమోనని కనిపెట్టుకుని కూర్చున్నాడు. మళ్లా, అదీకాదేమో.

ఆమె ఉపేక్షచేసినకొద్దీ స్వామికి మరీ ఆవేశం హెచ్చిపోతూంది. ఏలాగైనా సరే, వాణిని తనదాన్నిగా చేసుకోవాలిసిందే!

ఎన్నాళ్లు ఓపికపట్టి చూసినా, ఎంత ఉవ్విళ్లూరినా, ఏమీ ప్రయోజనం కనబడటం లేదు. సాహసం చేయాలి. మరోవిధాన వాణి వశమయేటట్టు లేదు. ఆమెను చూసినకొద్దీ స్వామికి రకరకాల ఆలోచనలు తోచేవి—షికారు పోతూంటే, దారి కడ్డుతగిలి, అనుగ్రహిస్తేకాని వీలులేదని—అందరిఎదుటా — బతిమాలనో,—ఏసినీ

మాకో, నాటకానికో వచ్చినప్పుడు అమాంతం కారులో వేసుకుని చక్కా పోవాలనో—ఈమాదిరిగానే కాని, ఎందుచేతనో ఏవీ క్రియారూపాన పరిణమించలేదు.

ఎన్నటికి వాణి కనికరించదేమో,—జన్మంతా ఆమె లేకుండానే గడుపవలసివస్తుందేమో, అని తలచినమాత్రాన్నే తగని దిగులుగా ఉండేది స్వామికి.

చివరకు, ఓనాడు, ఏమైనా సరే ఏలాగైనా ఆమెను పలుకరించి, ఆమెతో మాట్లాడితీరాలని నిశ్చయించుకుని బయలుదేరాడు. దోవలో, తనకు సాయమై, ఆమెను ఒనగూర్చమని వసంతమాధవులను మనసులో వేడుకున్నాడు........ వాణికన్న క్షణం ముందుగానే, తడబడే పదాలతో, 'న్యూషాలిమర్' ఉద్యానం ప్రవేశించి, ఆమె రోజూ కూర్చునే చలువరాతి మంటపానికి సమీపాన్నే, ఆమె ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ ఉన్నాడు.

హంసలుకూడా చూసి నేర్చుకోదగిన వయ్యారినడలతో వాణి ప్రవేశించింది. వాయల్ లేతఊదాసిల్కుచీర కట్టుకుని, ముదురు రంగులో, చమ్కీపని చేసిన శాటిన్‌బాడిస్ తొడుక్కున్నది. ఒంటిన 'ఏవో రెండుమూడు నగలున్నా, ఆఅందంలో కలిసిపోయి కనిపించడంలేదు. అడుగడుగుకీ చక్కదనం ఒలికిస్తూ వచ్చి అక్కడనే కూర్చుంది

ఆమె సౌందర్యాన్నంతా అనిమేషనయనాలతో చూరగొంటూ 'అలరెడు కెంపు లల్లార్చిన యందాక ననిమిషకన్య కాదనగ తరమె?' అని అనుకున్నాడు స్వామి

సమీపించాడు, ఏలాగో ధైర్యము తెచ్చుకుని,

'వాణీ!'

అని పిలిచాడు ఆఉద్రేకంలో, ఆలోచించనన్నా లేదు. ఆమె పరాభవిస్తుందేమోనని అయినా వెనుదీయలేదు ఒకసారి—కోపంగానైనాసరే—ఆమె మాటాడితే, రతనాలవంటి ఆపలువరుస కనబడనిస్తే, అంతేచాలు ఆతనికి

ఆప్రాంతాల్లో వాళ్లిద్దరూతప్ప ఎవ్వరూ లేరు ఉన్నా, అప్పటిస్థితిలో లక్ష్యంచేసేవాడే కాదు స్వామి. వాణి మారుపలికితే, కౌగిటిలో అదుముకుని జన్మసార్థకం చేసుకోవలెనని, ఆమె అంగీకారం కోసం తహతహపడుతున్నాడు.

భావను రసానికి తగినట్టుగా నడిపిస్తూ తనకథంతా వినిపించాడు వాణికి. చివరకు ప్రేమ, లేకపోయినా, తన అవస్థను చూసి అయినా కనికరించమన్నాడు.

స్వామి ఆమెదగ్గర భక్తుడిలాగా చాలాసేపు దోసి లొగ్గి నిలుచున్నాడు. వాణి, అంతా విని, వినిపించుకోకుండా లేచిపోయింది.

నిత్యమూ ఆమె స్వామికన్నులకఅవుదీరా కనబడేది; దగ్గరజేర నిచ్చేది. మనసులో కోరికలన్నీ తెలియజెప్పనిచ్చేది. కాని, మారు పలుకదు; ఎన్నిసార్లు పిలిచినా తలఎత్తిఆతనివైపైనా చూడదు.

౨

'ఊహుఁ...ఆలాకాదు....., సరిగా నిలువలేవూ....ఇంకా కొంచెం తల పైకి ఎత్తాలి...ఎవరిమీద ఆకోపం?. ఏమి టాపోజు, ఎందుకు వచ్చిందిరా దేవుడా, ఎప్పుడు తప్పించుకుని బయటపడుదామా అని ప్రాణాలు బిగపట్టుకొని నిలుచున్నమాదిరిగా ఉంటావేం? ముఖంలో కాస్త ప్రసన్నభావం కనపడనీయి'

.. ...నవ్వింది.

'ఎన్నిమాట్లు చెప్పను ఎందుకూ ఆలా ఎవరినో వెక్కిరిస్తునట్లుగా నవ్వుతావు ..పోనీలే, కాని...అబ్బ! అదుగో మళ్లా అంతా చెడగొట్టావు నీవు నవ్వావద్దు, కోపగించనూవద్దు, సౌఖ్యంగా, ఈధోరణంతా మరచిపోయి ఏదో ఆలోచిస్తున్నదానిలాగా ఉండమా... ఊఁ... నావైపు చూస్తావేం?,

మళ్లా నవ్వింది

'మళ్లా మొదలా? అప్పుడే ఆగులాబీలన్నీ తుంచేశావూ? అదేమిటి,లోలాకు మెలితిరిగింది?పైటమీది అంచంతా ముడిగిపోయి... మహాఅందంగా ఉన్నావులే! చెప్పినట్లుగా వింటావా లేదా? లేకపోతే నీసాహాసము ఉండను...తెలిసిందా.. ఏం?,

..... మాట్లాడదు

'నన్ను విసిగించడమే నీకు ముఖ్యమా?—చక్కనిదాన్నని ఎందుకూ నీకింత గర్వం? అమ్మ! ఇప్పటికి ఏలాగైతేనేం మనసు కుదిరింది .. ఇంకా కొంచెం ముందుకు రా. .మరీ అంత వెలుతురులోకి వద్దు సూర్యకాంతి ముఖంమీద మాత్రం పడేటట్టు . అదుగో, ఆలాగే ఉండు,

... ... . ...

శ్రీమాన్ చాలావృద్ధిలోకి వస్తూన్న చిత్రకారుడు ఖండాంతశాల్లో ప్రముఖులందరూ ఆతని చిత్రాల్ని చాలా ప్రశంసించారు. ఒకటిరెండు 'అంతర్జాతీయచిత్రకళాప్రదర్శనాల్లో ఆతనికే ఉత్తమ సత్కారం జరిగింది. చక్కగా చదువుకున్నవాడు—చాలా అందగాడు.

శివస్వామికీ ఆతనికీ ఎంతో స్నేహం. చిన్నతనంనుంచీ, చాలా కాలందాకా కలిసి చదువుకున్నారు. తరువాతకూడా కలిసి తిరుగుతూండేవారు ఇద్దరూను. శ్రీమాన్‌కు స్వామిఅంటే చాలా అభిమానమూ, గౌరవమూను

... ... ... ...

నీళ్లల్లో తిరుగుతూన్న హంసపిల్లలతో ఆడుకుంటూ, వాణి కొలను ఒడ్డున నిలుచున్నది. ఆమనోహరమూర్తిని రత్నావళికి లక్ష్యంగా చేసుకొని చిత్రించడానికి యత్నిస్తున్నాడు సమీపంలో శ్రీమాన్.

కొంచెందూరంలో, ఓజాకామల్లె బెవరు చాటుగా, వీరిరువురినీ, రెప్పవేయకుండా కనిపెడుతూ నిలుచున్నాడు స్వామి

అప్పటికి వారంరోజులనుంచీ ఆకథ జరుగుతున్నది

శివస్వామి చాలా మారిపోయినాడు. కాని అదేమో వాణిలో కూడా ఏదో మార్పు కనబడుతూనే ఉంది. ఒక్కొక్కప్పుడు ఆమె ఆకర్ణాంతవిశాలలోచనాలు ఆతన్ని సవిలాసంగా సత్కరించేవి. మరొకప్పుడు దైన్యానికి తావులయేవి. ఈవిభ్రమాలన్నిటికీ లోగి ఆతడు వివశుడయిపోతూండేవాడు.

శ్రీమాన్‌కు తానే వాణిని ఒకటిరెండుసార్లు చూపించాడు. అప్పటి మాటలలోనైనా, తానువలచిన పిల్ల అనే ఉత్సాహమేతప్ప వేరే లక్ష్యమామెయందు ఉన్నట్లు తోచలేదు స్వామికి శ్రీమాన్ ఎన్నడూ తానై వాణిని గూర్చి ప్రశంసించలేదు స్వామితో

వాళ్లిద్దరికీ ఏలా అంతస్నేహం? అతినిదగ్గర వాణి చాలాచనువుగా ఉంటూందే? ఆతన్ని వరిం. ... ఊహుఁ... . కాదు. వాణి అంత అన్యాయం చేస్తుందా ఏమో? ఇంతకూ శ్రీమాన్ ధన్యుడు,

'స్వామీ!'

ఆతనికి ఏమీ గోచరించడం లేదు తానొకటి తలచితే దైవ ...కాదు.. వాణి మరొకటి తలస్తూంది ఆమె ఆలోచించి చేసిన పనే ఇది. లేకపోతే ఆ ..

కోమలం వాణిఅంత చక్కంది కాకపోయినా, ఆమెకు ఎంతో తీసిపోయిందికాదు. వాణిని చూచిన కళ్లతోఅయితే ఏమో కాని, ఏంతరసికుడికైనా ఆమెమించి మనసు మరల్చుకోడానికి చేతనవుతుందా?

వాణి శ్రీమాన్‌తో మాటలాడుతూందనే, స్వామి ఎంతో వేదన పడుతున్నాడు. అది చాలనట్లు, కోమలం అతన్ని మరీ కష్ట పెడుతూంది.

నిత్యమూ ఆతనున్న తావు వెదుక్కుంటూ వచ్చేది కోమలం. ఇక నిలువనిచ్చేది కాదు 'తనంత తా వలచివచ్చిన' కాంతను చులకనచేయడం మంచిదికాదనే పంథాలో పుట్టాడేది ఎంతస్నేపైనా. కాని స్వామికి ఆమె చెంత నున్నదనే స్పృహఅయినా ఉండేది కాదు. ఆమెను పలుకరించికాని, ఆమెతో మాట్లాడికాని 'ఎరుగడు. తా నున్నంతసేపు, ఆమెకూడా విడువకుండా అక్కడనే ఉండి వెళ్లిపోయేది'—మరునాడు మళ్లా మామూలుగానే ఇరువురూ తారసిల్లేవారు;

వాణీ, శ్రీమాన్ చాలాత్వరగా 'వెళ్లిపోయేవారు' స్వామి ఎంతోసేపటికి తెలివితెచ్చుకుని ఉస్సురనుకుంటూ కాలుసాగించేవాడు నిత్యమూ అంతే బయలు దేరేటప్పుడు చాలా ఉత్సాహంగా ఉండేవాడు. ఆనాడైనా వాణి ఒంటరిగా వస్తుందేమో—శ్రీమాన్‌తో ఎందుచేతనన్నా పోట్లాడి, మాటలాడటం మానేసింగేమో—నిజంగా శ్రీమాన్‌మీద, తా ననుకున్నట్లుగా ఆమెకు మనసు లేదేమో.. .. ఏమో, ఈలాగే చాలా అనుకునేవాడు.

కాని, మామూలుమాదిరిగానే, వాళ్లిద్దరూ కనబడేవారు...మరి కొంతసేపటికి కోమలం ప్రత్యక్షమయేది

## 3

'చివురాకు చెలిచేత
పిలువనంపింది
సరికన్నె ప్రాయాన
విరజాజిమొగ్గ

ఏవేళకయినాను ఎదురుచూసేవా
పోవాలి నినుబాసి తీరునుగా..

తేటవెన్నెలమీద
తేలివచ్చింది
చాటుగా మాటుగా
చామంతిరెమ్మ ...

నీహారగిరిహిమా
నీచర్చతోను
జోహారు లన్నదీ
జూకాచమేలి...

శరదంబువాహాల
జత చేసుకుంది
మరచిపోయేనని
మందారమాల

కోయిలల కందని వి
హాయసపథాల
సాయమాతా నంది
సంపంగిరెమ్మ, ఏవేళ.

... ... ... ...

'నన్నిక్కడ నిలువనీయవా?'

'నేను పలుకరిస్తే మారుపలుకవా?'

'కోమలం!'

'స్వామీ!'

'నేను నిన్ను ప్రేమించుతేను.'

'నేను,...మరి.. నిన్ను ప్రేమించకుండా ఉండలేను'.

'ఎంతచక్కగా పాడింది...ఎవరో ఆ...అమ్మాయి'

'ఎంతచక్కగాఉంది...వాణికాక మరెవరోఆ...అమ్మాయి!'

'ఎవరు?'

'కనపడటం లేదూ...వాణీ...!...'

'నాతో మాటాడవద్దు'

'నీవు నేను మాట్లాడితే వినవద్దు'

'అసాధ్యురాలవు!'

'నీవుగాక... '

.. .. .. ..

'సంజెలో లేమావి
కొంజివురుచాయలో
మంజులముఖాబ్జసుమ
మావిలాసాలలో....
నీచాయ లేదోచునే...

చేతలో జాజితోలి
పూతలో కోయిలల
మాతలో గొజ్జంగి
లేత త త్తళలలో...
నీవలపులే నిలుచునే...

వగరులో మట్పదుల
పొగరులో కరవీర-
తొగరులో తొగకన్ను
నిగనిగన్ని గలలో .
. నీసొగయాల్ తలనూపునే...'

. . ..

'కలువలన్నీ ఎందుకూ ఆచంద్రుణ్ణి చూసి అలా నవ్వుతుంటాయి?'

'చక్కనివాడని'

'ఉహుఁ.'

'చక్కిలిగింత పెడుతాడని.'

'బలేబా గుంది. ఏలాగూ గిలిగింతలతో నవ్విస్తాడని, తామే ముందు నవ్వేస్తున్నాయేమా?...అయినా చెప్పుతో చూదాంమరి?'

" .. .. .. .. "

'ఎందుకో చెప్పనా, పాపం,... ముద్దొస్తూంటానుకదా నన్ను చూసి ఈకన్నెలందరూ, విరగబడిపోతారు అనే దిలాసాతో, ముసిముసినగవులతో ఉదయిస్తున్నాడు కాని, అదేమిటి, ఆమొగాన. . మచ్చ ... మచ్చ ... ఆసంగతి మరచిపోయినాడా అని నవ్వుకుంటున్నాయి.'

'కలకలలాడుతుంటాడు . . రాజుకే వంక పెడుతున్నావూ?'

'కిలకిలా నవ్వుతూంటవి, కలువలన్నీ అందుకనే.'

'పోనిద్దూ. అద్దంలో చూసుకునిరావడం మరచిపోయి ఉంటాడు.'

'అతనా మరచిపోయేది.మరి.. అలాగయితే కనపడ్డ సరస్సులో అల్లా ఎందుకూ ప్రతిబింబిస్తూంటాడు రాత్రంతా అక్కడనుంచి కదలడేం?'

'అందంసంగతి తెలియక '

'ఊఁ. అర్థం తెలియక కాదేం?'

'చంద్రుడికా కళంకదోషం అన్నది గీర్వాణి.

'అందుకనే.. శ్రీమాన్ కుడిచెంపకా అంత బ్లూప్యాచ్ . ' అన్నది . . చం . . ద్ర . . వా . . ణి . .

౪

మహారాజు దుష్యంతుడు కణ్వపుత్రిని గాంధర్వవిధిని పరిగ్రహించాలనీ, లేకపోతే నిలువలేనని అనుకున్నాడు. నిశ్చయించుకున్నాడు—తరువాత ఓనిమిషానికి, కలకంఠవధూకాకలకంఠ మాధురితో 'కింకీతలై?' అన్నదాని తెలుగు ఎత్తుకుని ఆఅమ్మాయి చేతకూడా అంతకన్న పక్కాగడుసుగా ఏదో మారు పలికించాడు చివరకు ఏలాగో ఒప్పించాడు. మళ్లా ఎన్నాళ్లు జరిగాయో .. ... శకుంతలను కడుపులోఉన్న కొడుకుతోకూడా మాలినీతీరాన్నుంచి పంపించివేసేటప్పుడు, కుసలిమహర్షి పడుచుగొంతులో గాద్గదికం స్పష్టముగా వినిపించింది . . .. ..... . .. .. .. . .. .ఎత్తినప్పటినుంచీ, ఎప్పుడు పడుదామా అని కాచుకొనియున్న యవనిక, దాని పుణ్యాన చివరకు గౌరవంగా క్రిందకు వాలింది.

. .. . .. .. .. .

'జయము జయము మహారాజునకు' అన్నది కులుకుతూ రమణ.

'సంతోషించాం లే, తెలివికి' అని సవిలాసంగా మారుబలికింది, ఓచిన్ని చపేటంతో సత్కరించి, కుచ్చుతలపాగ తీసివేస్తూ కోమలం.

'చాలాబాగుంది కోమలం! వేషం చాలాచక్కగా వేసుకున్నావు. కాని అదేమిటి? మాఅన్నయ్యామీసం పెట్టావేం? మహారాజాయెను. ఇంకా పెద్దమీసా లుండొద్దూ?'

'నీ కేం తెలుసు. ఈమీసాలకే భయపడి, వరించకుండా కుంతల తప్పించుకుని పారిపోతుం దనుకున్నాడు ఈదుష్యంతుడు.'ళ

'భయపడకేం శకుంతల! ఆశ్రమంలో నిలివేడేసి గడ్డాల ఋషుల నందర్నీ మాస్తూ. ఆమెకు కొత్తా?'

'కొత్తదికాదూ చిన్నమీసం, మన్ననిగడ్డం'

'అలాగేం'

'కాకపోతే, మీఅన్నయ్యమీసమేం . . ఇది . . పోనీ మీ అన్నయ్యానే అనుకో అదిగో మీవదినె వస్తూంది చూడు అంతా అయిపోయినా, ఆవయ్యారం, ఆనడక మానలేదింకా చూడు.'

'ఏం, రమణా! ఇందాకనుంచీ కనబడలేదేం' అని అడిగింది చమ్కీపనిచేసిన 'స్తనవల్కలం' సవరించుకుంటూ, సగముతీసివేసిన శకుంతలవేషంతో ప్రవేశించి వాణి.

'అవును ఏలా కనబడుతాను నీకు దుష్యంతుడిమీదనేకా దృష్టంతా.'

'అతను మీఅన్నే అయినప్పుడు నీ కింత ఉలు కెందుకూ?' అని అందుకున్నది కోమలం

వాణి కోమలంవంక బెదురుతూ చూసింది. కోమలం కను సైగతో ఆమెకు తెలియజెప్పింది.

'చాలాచక్కగా చేశావు వాణీ! అందరూ ఎంతో మెచ్చు కున్నారు' అని అభినందించి రమణ.

'అందరూ . . ఎవరు?'

'ఎవరా?.. వచ్చినవాళ్లందరూ..ఎరుగున్నవాళ్లు, ఎరుగనివాళ్లూ కూడా. మానాన్నగారు నిజంగా సంభ్రమం పట్టలేకపోయినారు. ఇక నేనా . . నాసంగతి సరేకదా...బ్రహ్మదేవుడు . . ఆముసలాడు మతి బోయి నన్ను ఆడదాన్నిగా చేశాడని అంతసేపూ తిడుతూనేఉన్నా; నేనే మొగవాణ్ణయితేనా'

'ఊఁ'

'అమాంతం స్టేజీలోకి దూకి నిన్ను ఎత్తుకొని పారిపోయి ఉందును'

'నిజంగా అంతబాగుందా. అయితే బాగున్నది నేనా, నా వేసమా.'

'రెండూను . . కాని ఏంలాభం'

'చాల్లే రమణా! ఎవరన్నా చూస్తే నీవు నన్ను మోహించా వనుకుంటారు.'

'నిన్నా.. నిన్ను మోహించని దెప్పుడు వాణీ.'

. . ... . ... ...

'అన్నయ్యా! నీక శ్లీపీ?' అన్నది రమణ.

'ఏం' అన్నాడు స్వామి మసులుతూ ఆమెవైపైనా తిరుగ కుండా.

'మరి నాకళ్లు చూశావా.'

'ఏం, నీకళ్లకేం, బాగానే ఉన్నాయి' అని చాలా అమాయి కంగా, తెలివితక్కువగా బదులుపలికాడు స్వామి.

'అదికాదోయ్ తాతయ్యా! నాకళ్లు చేసుకున్న పుణ్యం నీకళ్లు చేసుకోలేదుకదా, అని అన్నాను. అదీ తేడా.'

'ఏమి టావిశేషం?'

'వాణి . ఎరుగున్నావు కాదూ వాణిని... శకుంతలవేషం వేసింది...—ఇవాళ మాకాలేజీ ఆనివర్సరీ తెలుసునుకాదూ ఎంత బాగుం దనుకున్నావు...ఎందుకూ చూడనిజన్మ'

స్వామి మనసులో కోరికలన్నీ ఓమారిమూకుమ్మడిగా ముందుకు దూకినాయి కాని ఆసంచలనం ఆవంతైనా బయటపడనీయకుండ సంయమనంచేసుకొని, శాంతం, ప్రసన్నభావం అభినయిస్తూ,

'అలాగేం నాకు తెలిసిందికాదే. లేకపోతే నేనుకూడా వచ్చేవాడినే!' అన్నాడు.

'నీలాంటివాళ్లను రానియ్యరుకాదూ.'

'ఎందుచేతనో?'

'ఆఁ. ఏముంది. తలా మీసం నెరవలేదుకనుక.'

స్వామి కొంచెం ఆగి ఏమో ఆలోచించాడు.

'దుష్యంతు డెవరు?'

'కోమలం. నీ వెరుగ వనుకుంటాను. నీఅంత పొడుగ్గా చాలాఅందంగానే ఉంటుంది ఆఅమ్మాయికూడా. .'

—కోమలాన్ని తా నెరుగడుకాదూ! వాణి నంతకన్నా ఎరు గడు! రమణ ఎంత అమాయకురాలు! తోడివారందరకీ ఎంతకాలం నుంచో తెలిసిఉన్న ఆవిషయంకూడా ఆమెకు తెలియదే!

'నే నన్నానుకూడాను నవ్వుతూ కోమలంతో,_ఆమీసం సరిగా నీమీసంలా ఉన్నదని. నిజంగా చూసి అలా చేసినట్టున్నది' అని మళ్లా అందుకుంది రమణ.

'వాణి ఏ మన్నది.'

. 'ఏమనడ మేమిటి?'

'నామాట వచ్చిందికాదూ' పొరబాటున తప్పిజారి అనేశాడు. తరువాత నాలుక ఎంతకరుచుకున్నా ఏమిలాభం? కాని రమణకు అదికూడా అర్థమయినట్టు లేదు

'నీమాట వచ్చినా ఏమంటుంది? నిన్ను ఎరుగదుకాదూ!' తరువాత స్వామి ఏమీ మాటాడలేదు. ఆతడు వింటున్నాడో, లేదో అయినా గమనించకుండా రమణ, గబగబ కొంచెంసేపు ఆ మాటా ఈమాటా చెప్పి లోపలికి వెళ్లిపోయింది.

.. .. ..

'ప్రొద్దుపోతూంది ఇప్పు డెక్కడికి స్వామీ'

లోపలనుంచి ఎవరో ప్రశ్నించారు ఆతడు మారుపలుక లేదు. పెడల్ మీద ఓకాలు వేశాడు

'భోజనం చేయవా మరి ?—చేసిపోరాదూ ?'

వెనుకనుంచి సగంసగం వినపడ్డాయి ఆమాటలు గాలిలోంచి స్వామికి. అప్పుడే రోడ్డుమీదికి వచ్చేస్తున్నాడు

ఉండుండి, రెండుమూడుసార్లు పెద్దజ్యోతులు ఆతనిముందర నాట్యమాడి మాయమయినాయి రోల్ ఫిల్ములాగా రోడ్డు చుట్టుకు పోతూంది చివరకు అయిపోయింది.

బయలుదేరినప్పటినుంచీ, ఆస్పృహ లేకుండానే, స్వామి తిన్నగా కాలేజీహాస్టలుబయట ఆవరణవద్దకు వచ్చి ఆగిపోయినాడు. అప్పుడు తెలిసింది, ఆతనికి తా నెక్కడ ఉన్నదీని

౨

ఆలకిస్తున్నాడు ఆలకించినకొద్దీ మైమరచి ఆనందమయుడై పోతున్నాడు. ఎన్నిమార్లు విన్నా తనివితీరటం లేదు. కర్తవ్యాన్ని నిర్ణయించుకోలేకనూ కాదు, కాలు సాగకనూ కాదు ఎందుకో ఏమోకాని ఆచోటనే ఆగిపోయి, ఆలాగే నిలువబడిపోయినాడు స్వామి పాడుతూన్న ఆమోహనాంగి పాట చాలించలేదు మళ్లా, మళ్లా ఆపునాతే ఎత్తుకుని,

అడూకుంటానోయ్, పాట
పాడుకుంటానోయ్,
ఆడీ, పాడీ, అలసీపినా,
ఈడేనంటానోయ్, నీవూ ..
జోడేనంటానోయ్. .. ఏమోయ్

ఆడూకుంటానోయ్

ఈమారు ఇక ఆలోచించలేదు ప్రాకారలంఘనం చేసి లోపల ప్రవేశించాడు ముందు మందారచెట్లు బాగా ఒత్తుగా పెరిగి అడ్డమున్నాయి. వాటి కవతలనుంచే మళ్లా...

వావీ చూశానోయ్, మోవీ
కావీ చూశానోయ్,
కావీకన్న సొంపు నీమై
తావే నట్టానోయ్.. .. ఏమోయ్,
. ఆడూకుంటానోయ్।

ఈచరణం వినిపించింది.

చప్పుడు చేయకుండా, చెట్లమాటునుంచి తొంగిచూశాడు. చాలాసమీపంలోనే, వాణీ, కోమలం, మరెవరో ఇంకో అమ్మాయి ఉన్నారు. ఆయిద్దరూ కూర్చునిఉన్నారు వాణి వారిచేరువనే జ్యా పాదమీదికి ఓచేయి జాపి నిలుచుని పాడుతూంది

దగ్గరకు వెళ్లాడు కౌగిలించుకుని గబగబ ముద్దిడుకున్నాడు స్వామి ఆమెను. సమయము జూచి, 'అనసూయా ప్రియంవదలు' నిష్క్రమించారు

వాణి నవ్వుతూ ఆలాగే నిలువబడిఉన్నది

.. .. . ..

'అమ్మ! ఇప్పటికి నాకసి తీరింది' అన్నాడు స్వామి

వాణి సాభిప్రాయంగా స్వామివంక చూసి, సిగ్గుపడి, చిరునవ్వుతో తలవాల్చింది

'ఇకనైనా నీమౌనవ్రతం చాలిస్తావా ?'

వాణి 'అవు'నని తలఊపింది

'ఇంతకాలంనుంచీ నీనోటిమాట వినడానికే నోచలేదు నేను. పలికితే నోటిముత్యాలు రాలిపోతవా ?'

' . .. ..'

'నీతోడివా ళ్లంపెరతోనూ అంతచనువుగా, కులాసాగా తిరుగుతూండేదానివి నామీద నీకు ఎందుకూ అంతనిర్దయ ? ఎంత పలుకరించినా ఎన్నడైనా మారుపలికావా?'

' . .. .. ..'

'నిజమే, నానే అపరాధం కావచ్చును నీవు మెచ్చుకొనేటట్టుగా, నీరసత్వాని, చిక్కదనానికి సరిపోయేటట్టుగా నేను పిలువలేకపోయినానేమో! నామీద, నాస్థితిమీద జాలన్నా లేకపోయిందా నీకు ?'

వాణి నవ్వుతూంది ఆనవ్వును అర్థంచేసుకోలేక — స్వామి మళ్లా ఏదోవేదన పడుతున్నాడు ఆమె నవ్వుతూనే — ఆతని మాటలన్నీ వింటూనే, ఏదోవైపు తెప్పవేయకుండా చూస్తూంది. క్రమంగా స్వామికూడా, ఆసంగతి ఏలాగో గ్రహించి, తానుకూడా ఆమె చూస్తూన్నవైపే, ఏమిటో తెలియకుండానే చూస్తున్నాడు .

చాలసమీపంలో గులాబిపొద ఉన్నది దానినిండా విచ్చినవి, అరవిచ్చినవి, చాలా ఉన్నవి పూలు ఒకగండు కుమ్మెద ఎక్కడనుంచో వచ్చింది, ఆవేళ తిన్నగా, ఓచక్కని గులాబీదగ్గరకు వెళ్లి కావలసినంత మధువు గ్రోలి, తనత్రోవను సంగీతంపాడుకుంటూ చక్కగా వెళ్లిపోతూంది అదీ దృశ్యము

'సృష్టిలో చిత్రాలు చాలా ఉంటాయి' అన్నాడు స్వామి చివరకు, చాలా తెలివితక్కువగా.



కోకా వెంకటసుబ్బారావునాయడుగారు



వంగీపురం కృష్ణమాచార్యులుగారు



కూర్చున్నవారు కొల్లూరు ధర్మారావుగారు

నిలుచున్నవారు. వడ్లమాని అప్పారావుగారు



యం. కోటయ్యనాయడుగారు

(ఏలూరు వ్యాయామసంఘ కార్యదర్శి)

'అవును, చూసి నేర్చుకోవలసినవికూడా చాలా ఉంటాయి' అన్నది వాణి ఆతనివంక చూడకుండానే

స్వామి మనోవీథిని పెద్దమెరుపు మెరిసి, వెనుకటి సంశయాంధకారాన్నంతా పటాపంచలు చేసేసింది. కలలో కష్టాలు అనుభవించి, మహారాజయోగంలో మేలుకునేవాడిలాగా, స్వామి అంతకాలానికి, అప్పటికి మేలుకున్నాడు.

'నిజమేకాదూ!' అన్నాడు ఆమెకళ్లల్లోకి చూస్తూ కౌగిలి వీడకుండానే.

వాణి, స్వామికి మరీదగ్గరగా జరగి, ఆతనికౌగిలిలో అణిగిపోతూంది.

'అవును, గులాబీకి ఏమిస్వాతంత్ర్య మున్నది' అన్నది చెంపల మీది గంట్లు తడవిచూసుకుంటూ.

'మధుపకుమారుడిదేనా, ఇన్నాళ్లనుంచీ అపరాధం!'

'కాదా, మరి! ప్రేమమధువుతో, ప్రణయమధువుతో, పూర్ణంగా ఉబికిపోతూన్న గులాబీకన్నెను పలుకరించాలని, పలుకరించితే మారాడదని అనుకోడం ఆతని తప్పుకాదు? అంతప్రేమతో పొంగిపోతూ, ఆత డెన్నడు దరిజేరుతాడా అని కలువరిస్తూంటే, మారాన్నంచి పలుకరించి పలుకలేదని, ఖిన్నుడై తిరిగిపోతాడా? ఆతని కంతమాత్రం తెలియదు, కుసుమసుకుమారి తనకోసం తపించి వాడిపోతుందని'

స్వామి నూతనోత్సాహంతో, ఆమెవంక వింతగా చూస్తూ, ఆమెమాట లన్నీ ఆలకిస్తున్నాడు వాణి ఆతని అమాయికత్వానికి నవ్వి, ఆతన్ని చేరదీసి ముద్దిడుకున్నది.

'సృష్టిక్రమం తారుమా రవుతున్నది. గులాబీదగ్గరనా, మొకరితుమ్మెద పాఠం చదువుకునేది?' అన్నది వాణి.

'నేను సాహసం చేయలేకపోయినాను వాణి! నాతో మాటాడకపోతే, నామీద నీకు ప్రేమలేదనుకుని, విచారపడి ఊరుకునేవాణ్ణి.'

'సాహసం ఎందుకూ? అంతమాత్రం కనిపెట్టలేకపోయినావు కోమలాన్ని చూసిఅయినా నేర్చుకోలేకపోయినావే'

స్వామి కొంచెంకోపంగా ఊరుకున్నాడు

'అగుగో! అంతలోనే మళ్లా అలుకా! కాదు స్వామి! కోమలాన్ని నీకు పాఠంచెప్పమని నేనే పంపించాను అప్పటికయినా నీవు ఆలోచించలేకపోయినావు. గ్రహించలేకనేపోయినావుకదా కోమలం నిన్ను పలుకరించినట్లు నీవు నన్ను ఆనాడే.....'

వాణి సిగ్గుపడి ఆమీద మాటాడలేకపోయింది. ఆతని పెదవులకందకుండా, తనముఖం తిప్పేసుకుంది. స్వామి బలవంతాన ఆమె ముఖాన్ని తనవైపుకు తీసుకుని చాలాసేపు ముద్దిడుకున్నాడు.

—ఈల వినపడ్డది వాణి తటాలున ఆతని ఒడిలోనుంచి లేచి, ఆతని నక్కడే ఉండమని చెప్పి పరుగెత్తుకుని వెళ్లింది. మళ్లా వెంటనే తిరిగివచ్చి, ఆతన్ని కౌగలించి,

'ఇంక నీవు వెళ్లిపో. మావార్డెను పిలుస్తూంది. నేను వెళ్లాలి' అన్నది.

స్వామి ఆమెను వదలలేకపోయినాడు.

'అబ్బ! వెళ్లిపో' అని ఆతన్ని ముద్దిడుకుని, రేపు నాలుగు గంటలకు న్యూషాలిమర్' అని, అక్కడనుంచి గబగబ వెళ్లిపోయింది.

స్వామి అమితోత్సాహంతో ఒక్కఉదుటున కాంపౌండు వాలు దూకి ఈవలకు వచ్చేశాడు.

. . . . . . .

—శ్రీమాన్ చాలా ఆశ్చర్యపడ్డాడు. తలుపు తీయడంతోనే శివస్వామి, ఆతనిచాటున ఒదిగి సిగ్గుపడుతూ వాణి, ఆతని స్టూడియోలో ప్రవేశించారు. స్వామి ఆతన్ని కోపంగా చూసి, '—చేతనయితే వత్సరాజునుకూడా చిత్రించు.' అన్నాడు.

శ్రీమాన్ ఓనిమిషం ఆతనివంక చూసి, తరువాత ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలాగా నవ్వాడు

'అది చాలా పాతకథ.. స్వామి! వత్సరాజును చాలాకాలం క్రిందనే చిత్రించి.. చుకొన్నాను. మాసాగరికను నీవు చూడలేదు కాబోలు!'

అని అక్కడనున్న తెర ఆవలకు జరిపాడు. ఎదురుగుండా ఈజెల్ మీద సుగమతయారయిన బొమ్మ ఉన్నది. కొంచెంప్రక్కన నవ్వుతూ కోమలం కూర్చునిఉన్నది.

'రత్నావళి'

అని నవ్వి శ్రీమాన్ కోమలాన్ని చూపించాడు. —

'వత్సరాజుతన్ను చూపించుకున్నాడు.'

కోమలం పరుగెత్తుకుని వచ్చింది. వాణి ఆమెను కౌగిలించుకున్నది. ఇద్దరూ నవ్వుకున్నారు.

శ్రీమాన్ నవ్వుతూనే 'కోమలం! టీ పెట్టు. వా ళ్లిద్దరు' —అని స్వామి, వాణినీ, కనుసైగతో చూపి—'కూడా ఉంటారు' అన్నాడు...

వాణి నవ్వుతూ, కోమలంతోకూడా లోపలికి వెళ్లిపోయింది.

స్వామి దగ్గరనున్న కుర్చీలో కూర్చుని, నవ్వుమొగంతోనే శ్రీమాన్దగ్గరనుంచి అడిగి తీసుకుని సిగరెట్టు ముట్టించాడు...

# కవి ప్రతిభ

సామవేదం జానకిరామ శర్మ గారు

౧

ఆది మహారాజు శ్రీనృసింహాప్పరాయ - నతులకారుణ్యవారిధారాతి సిక్త
శీతలీకృతపూరితాశేష దీన - యాచక మనోరథావిష్ట యాంధ్రసీమ.
అతఁడు మాయాంధ్రనరపతి యప్పరాయఁ - డలఘుకృష్ణానదీప్రాంత తలమునందు.
నోజతో రాజధానిగా నూజవీడు - పట్టణంబునొనర్చి సంపదలఁ జెలఁగు.

అతనికీర్తి జ్యోత్స్నలావరింపనిచోటు, లాతనిఁ బేర్కొననట్టినోళ్లు
అతని యౌదార్యంబు నాశింపని మనంబు, లామహామహుఁ జూడనట్టికనులు
అతనిలోఁ దలంచి హర్షమందని ప్రాణు, లాతని వినఁగోరనట్టి చెవులు
అతనిచే సంతృప్తి నందకుండిన యాత్మ, లావిభు ప్రెుక్కని హస్తములును
అప్పు డాసేతుశీతాచలాంతభూమి - కాగడా ల్వెట్టి వెదకినఁ గానఁబడవు
జనులకొఱకయి కల్పభూజంబు ధరణి - నప్పరావయి రాజ్యాన నధివసింప.

'కొల్లేటిలో నక్కగుంపులు చలిబాధఁ గూయంచు బిట్టుగా కూఁతలిడును
శిరములు గుంగ గాసింజెందుదురు, మార్గగాములు బరువులు గలుగుకతన
భువి సర్వమును ద్యాగమును జేయు బైరాగి గణము గంజాయికై కష్టపడును
మశకంబులును కోట్లు పశువులపై వ్రాలఁ గందూతిబాధ సంకటముపడును'

అనుచు వచియింప వినియు దయార్ద్రుఁ డతఁడు - జంబుకంబులకై నటుఁ గంబళులను
వేయు, రాలను పాతింపఁ జేయు, మిగుల - నిచ్చు గంజాయి, స్తంభము లెన్నొ నిలుపు.

"దునియామే నహి యప్పరావు హామకోదూస్రా" యటంచాత్మలం
దున, బైరాగులు సంతసంపడుచు నెంతో వేడుకన్ భోజనం
బును, కాశీయును సేతుమధ్యలను భూపుండుంచు సత్రాలయం
దునఁ గావించి నుతింతు రాతనిని హిందూస్థానపుం భాషలోన్.

"రాయని భాస్కరుండు గవిరాజుల కిచ్చె నమూల్యరత్నముల్
దోయిట మంచి ముత్యములు దోరపుఁ గాంచన మ్రగహారముల్
వేయికిమించి యంచుఁ బదివేవురు వాకొను చుందు రద్ది సం
ఖ్యాయుత మీప్రభుం డీడు నయారె! యసంఖ్యములైన దానముల్"

అనుచుఁ గవీంద్రు లావిభు నహర్నిశముం గొనియాడుచుందు రా
తనికి శుభమ్ము లాత్మల సదా తలపోయుచునుంద్రు, నిత్యముం

జని యతఁ డష్టసంపదల శాశ్వతుఁడై తనరార దీవెనల్
ఘనముగ నిచ్చుచుండు రధికంబగు సంతస ముప్పతిల్లఁగన్.

చదివెను శాస్త్రముల్ శ్రుతులసారము తాఁ గనె సర్వ శిక్షలోఁ
గుదిరెను పాండితీపటిమ, కూర్చుకొనెం బటుశౌర్యధైర్యసం
పద, తగు బాహువిక్రమ ముపార్జనఁ జేసెను, తెల్గునాట సం
పదలకు స్థానమయ్యె నరపాలుఁ డజాతవిరోధి కైవడిన్.

మూఁడు భాషలు నేర్చిన ఱేఁడెయయ్యు - లేదు, నహి, నాస్తి, యన నేర్వలేదతండు
అధికదారిద్ర్యదుఃఖదావాగ్నియుడుప - దానధారల బీదలఁ దడుపువేళ.

భువి "నహింసాపరమోధర్మ"యని రాజు జీవుల కెగ్గింత చేయ వెఱచుఁ
బరకాంతలను మాతృభావానఁ గై సేయు, హాస్యానకు నసత్యమాడ వెఱచు
సారిది యర్థులు చేయు స్తోత్రాలకును నుబ్బఁ, డడిగిన లేదని యనఁగ వెఱచు
ఆపదలందు ధైర్యాలంబమును గొనుఁ దనసంపద స్తుతిఁ దలఁప వెఱచు
నమితశాంతదయాసత్యసమతి నృపుఁడు - తనకుఁ దా సాటిగా నాంధ్రతలమునందు
రాజ్యమును జేయఁ బ్రజ రామరాజ్యమందు - వలెనె సుఖముండి సంపద వర్ధిలుదురు.

వెలమకులంబులోఁ గడు వివేకులు పల్వురు నుద్భవించి రీ
కలిమియుఁ జెల్మియుం బ్రజల కష్టము లారసి పాపురీతి, జీ
వులయెడ నీడులేని దయఁ బూనుట, త్యాగమునందు రక్తి మా
టల వినయంబునందుఁ గలఁడా యొకఁడందురు వృద్ధకోవిదుల్.

* * * * * *

ఒకటియు రెండుగాదు కవి కొక్కని కొక్కొక యగ్రహార మా
సుకవిజనస్తుతుం డిడుటఁ జూచి ప్రధానులు ప్రాడ్వివాకులుం
దికమకనొంది, రాజునకుఁ దెల్పఁగఁజాలక ద్వారరక్షకా
ళికి "కవులన్నవారి నదలింపుఁ"డటం చిడి రాజ్ఞ లెస్సగన్.

౨

కాఁబోలు నితఁడు సాకారదారిద్ర్యంబు, అతిజీర్ణమలినాంబరాశ్రితుండు
కాఁబోలు యాచకగ్రామణి యాతండు, అతినిరాశాసూచితాననుండు
కాఁబోలు నితఁ డతిక్రాంతప్రాయమువాఁడు, అతినమితస్ఫాలనాంగయుతుఁడు
కాఁబోలు నతిదూరగామియౌ నీతండు, వ్యత్యస్తపాద విన్యాసయుతుఁడు
అనఁగ నొక వృద్ధకవిచంద్రుఁ డరుగుదెంచి - గంటమును తాటియాకుల గ్రంథమొంటు
చేత నిడుకొని ద్వారంబు చెంతఁ జేరు - చుండె నొకనాఁటి యపరాహ్ణ మెండలోన.

దవ్వుల ద్వారరక్షకులు తాము మహీసురుఁ గాంచి, యాత్మలం
దెవ్వఁడొ సత్కవిప్రవరు డిట్టులు దానరపాలుఁ గాంచఁగా
దవ్వులనుండి వచ్చెడుఁ యథార్థము "లోనికిఁ బోవరాదు నా
నెవ్విధిఁ గుందునో మనల నేమనఁ బోవునొ మీఁదఁ గ్రుద్ధుఁడై."

అనితలపోసి, భీతివినయమ్ములు ముప్పిరివైవ చెంతకుం
జనుటయు నాకవీంద్రుఁ డతి శాంతముతో "నొకయింత లోనికిన్
ననుఁ గొనిపోదురో" యనఁగ నమ్రశిరస్కులు నొచు విన్నపం
బును నొనరించినారు, "కవిపుంగవులైనను దెల్పుఁ"డం చొగిన్.

ఆవాక్యమ్మది కర్ణపేయమయితా నావృద్ధు నానందపా
రావారమ్మున నోలలార్చియును, మార్గాయాసముం దీర్పఁగా
"నేవీటన్ మముఁబోలు సత్కవులు లేరీనాఁడు నశ్లాట మే
మీవిఖ్యాతుని జూడ నెంతు" మనఁగా నెంతేని యాసేవకుల్ :

"స్వామీ! యేమని విన్నవింతుము? నృపాస్థానమ్ములోఁబూర్వమం
దేమోకాని కవీంద్రులం దనుపఁగా నెంతేని యత్నించి రా
సామీచీన్యమువీడి నేఁడు కవులన్ శాసింత్రు 'రావద్దటం'
చేమోమాటములేక యట్లగుటచే నేమందు మిప్పట్టునన్.

చెప్పఁగ రాని యంశమిది చెప్పితి మింతరహస్యవృత్తి లే
కిప్పగిదిన్, భవాదృశుల నేమని మేము మనంగలార మీ
చొప్పొక యింత నెంచియు, యశోధనులౌ తమ రిల్లుసేరఁగా
నిప్పుడు శ్రేయమౌ, బుధుల కేము వచించెడివార మౌదుమే?"

అనుచు వినయమ్ము, శాంతమ్ము, ననునయమ్ము-లొప్పఁగా ద్వారరక్షకు లుచితరీతిఁ
బల్కఁదా విని యాకవిప్రవరుఁ డపుడు-నిలువు నీరయి మాటాడ నేరఁడయ్యె.
కతిపయ నిమేషములు దా-నతిఖేదమునొంది విప్రుఁడంతట ధైర్యో
న్నతి హృదయమందు నిలిపి ర-వంతయుఁ? బల్కకను బట్టె వచ్చినత్రోవన్.

అతఁ డటు రాజవీథిఁ జనునప్పుడు నాతని చందమున్ జరా
నతమగు దేహమున్, మనసునందలి భంగముపాటు, క్షుత్తుచే
గతిఁగల తొట్రుపాటు, నధికంబగు సంపదలేమి సూచనన్
మతిఁ దలపోసి యొక్కమతిమంతుఁడు డాయఁగఁబోయి యిట్లనున్ :

"ప్రబలనైదాఘభానుసంస్పర్శనమున - నెల్లజీవుల ప్రాణాలు తల్లడిల్ల
సాగె, నిప్పులగాడ్పు విస్తార మగుట-నతిపిపాసకు లోనయ్యె నఖిలజగము.

అయయెూ! కాటికికాళ్లు సాఁచితి గదయ్యా, యిట్టిప్రాయమ్మునం
దయనంబందుఁ జరింప గ్రీష్మమునయం దాహా జవం బుండ దా
పయిఁ జింతించిన నేమిలాభము కటా ప్రాణంబు లేపాటి ? వే
దయసేయుం డిఁక మాగృహంబునకు సంధానింతు సేవావిధుల్.

ఎచ్చటినుండి తా మిచటి కేపనిపై దయచేసినారు? మీ
సచ్చరితంబునుం గళలసంపద, మేటికవిత్వశక్తియుం
బొచ్చెములేని మీముఖము పోల్చిన ద్యోతకమాయె, మీఁద నా
ముచ్చటలాడవచ్చు మునుముందుగ రండు భుజింప నింటికిన్.

అనుచుఁ గరుణార్ద్రహృదయుఁడై యతఁడు కవిని-స్వీయమందిరమునకును జేర్చి యధిక
గౌరవాదరయుక్త వాక్యముల భక్తిఁ-బంచభక్ష్యాన్నములఁ దృప్తిపఱచె మిగుల.

ఆపయిఁ దమ్ములంబు నిడి యాదట వీచెను దాళవృంతముం
దాపనిఁబూని, దాన వసుధామరుఁ డాత్మ సుఖించి, "మేలుమే
లీపరిచర్య చాలు నిఁక నెన్నటికేనియు విస్మరించమీ
యూపిరియున్నవట్టు, మన ముత్సుకతం గనె నోయి పుత్రకా!"

అని, "నావచ్చినకార్యమెల్ల వినవయ్యా, తాను యీరాజు భూ
మిని రాజన్యులలో వదాన్యుఁడనఁగా మించెంగదా, దాని నే
విని, దారిద్ర్యముఁ బాపుకో మనములో వేమాఱు చింతించి, యీ
తని దర్శింపఁగ వచ్చినాఁడను మహాతాత్పర్యయుక్తుండనై.

అవనిఁ బ్రభువులచెంతకు నరుగునపుడు - రిక్తహస్తాలఁ బోవ నయుక్తమనుచుఁ
గృతి రచించితి నొండు నాన్నృపతిపేరఁ-బలుకుపలుకునఁ దేవియ లొలుకునట్లు.

ఆకావ్యమ్మును జేతఁబుచ్చుకొని నే నానందయుక్తుండనై
యీకారిన్నృని జూడవచ్చితిని, తా నేమీ హృషీకేశుఁడో
నాకాధీశుఁడొ, శంభుఁడో, కవులపైనా శాసనా ల్చేయుటా?
హా కాల మ్మెటు మాఱిపోయె! వినవయ్యా మీఁదివృత్తాంతమున్."

అని తనకు ద్వారపాలురు-వినిపించిన తెలుఁగు నాఁటి విభుచిత్తంబుఁ
దనకుఁగల లేమిదశయును - వినిపింప గృహస్థుఁడనెఁ గవీంద్రునితోడన్:

"ఓకవిశేఖరా! యిటుల నూరక నావిభు నిందసేయుటే
కాక, నతండె యిట్టి దగుకార్యముఁ బూనెనయేని లోకమం
దేకవి కెవ్వఁ డిచ్చు నిఁకనేటికి? దీని రహస్య మిద్ది తా
మే, కుమతుల్ రచించి రిది మేలని, మంత్రులు ప్రాడ్వివాకులున్.

దీని యాథార్థ్య మిదియ సందేహమేల? - ఎట్టులైనను రాజు దా నిట్టి పనికిఁ
బూనఁగాలేఁడు, కవులను పూజసేయు - ప్రభువె 'రావద్ద'టంచును బలుకఁగలఁడె?

అదియునుగాక పట్టణమునం దచటచ్చట నిట్టివార్తలే
ప్రిదిలెడుఁగాన, వారిమఱపించి, నృపాలుని యొంటిపాటునం
దదనుగ్రహించి, చిత్తమున హత్తెడులీలను, విన్నవించుకో
నది వృథగాదు, మాగృహమునందున నుండుఁడు నంతకీరలున్."

అనుటయుఁ గవిపుంగవుఁ డా-తని గని మోదంబునొంది, తప్పక యటులే
నొనరింతు నెంత సుగుణుఁడ-వనయమ్ము మదిం దలంతునయ్యా యనియెన్.

3

"అకటా! యెన్నిదినమ్ము లీపురమునం దావాసముంజేతు నా
కిఁక వేతే యొకదారి కన్పడదు తానేమో మహాదాత యం
చకలంకంబగు కీర్తిగాంచెనని, నే నత్యాశతో రాఁగ, లో
నికి పోనీయకపోయి రాభటులు, కానీ, యీదినంబెట్టిదో!

దుర్భరంబగు దారిద్ర్య దుఃఖమనుభ-వింపఁగాలేక దాత లుర్వీధవులని
చేరఁగా వచ్చెదరు వారి చిత్త వృత్తి-తెలియఁగాలేక, లేమిని దీర్చుకొనఁగ.
కలియుగంబునఁ గీర్తిభాగ్యమున కాస-పడి నృపాలురు మెరమెచ్చుభాషణములఁ
బలుకుదురెకాని, దానంబు సలుపఁ దనుకుఁ-బ్రజ్ఞ కొఱవడు నుచితానభిజ్ఞులగుట.

దూరపుశైలముల్ నునుపుదోఁచువిధాన, మహీశు లెందఱో
కోరినఁగాని కావ్యములఁ గూర్చుఁడటంచును, సమ్మతింపకే
చేరితి నీమహీపతికి సేవలఁ జేయఁగ, కావ్యమొండు నా
ధారముఁగొంచు, నీతనివిధ మ్మది గాంచిన చిత్రమయ్యెడున్!"

అని యొకప్రొద్దు రాజుకొఱ కాయత దృష్టుల నాకవీశ్వరుం
డనిమిషలోచనుండయి మహత్తరమౌ నల నూజవీటి ప
ట్టణమున రథ్యలందుఁ గలఁడాయని, యారయుచుండె, మానసం
బునకొక యింత ధైర్యమును బూనుచు, వెఱ్ఱివిధాన వ్యగ్రుఁడై.

అంతలో శిబికారూఢుఁడౌచు రాజు - ప్రజల క్షేమమ్మునరయఁగా బయలుదేఱి
వచ్చుటనుగాంచి, యానంద భరితుఁడగుచుఁ-బల్కరించు నుపాయంబుఁ బన్నసాగె.

'తొలగుఁడు మీర' లంచు విభుతోఁ బరువెత్తుచువచ్చువారి మా
టల విని ప్రక్క-ప్రక్కల హుటాహుటిఁబోవు జనాళి, బోయవా
రల యొకవింత నాదమున రంజిలు పౌరుల, రాజుగాంచి మ్రొ
క్కులు పచరించువారిఁ గనఁగోరఁడు తాఁగవి ధ్యానమగ్నుఁడై.

అలయని బోయవారల మహాద్గమనంబున రాజు డాయఁగా
"వెలమకులంబునందు నిలువెల్లరు కాంత లనంగ విందు న
ప్పలుకు లబద్ధమాయె"ననిపల్కెను, బిగ్గరగా నృపాలువీ
నులఁ బడునట్లుగాఁ గవి యనూనవచశ్చతురత్వమేర్పడన్.

నేయినిబోయి భగ్గుమని నింగికిలేచు హుతాశుకీలనా
నీమెడ కన్నుగాన కిటులింగితముజ్జ విడనాడి, వెల్మలం
దీయపవాదు లేర్పడఁగ నిట్టుల వాగెడివాని రాజు వే
నాయెడ కీడ్చితెం డని జనంబుననుండి వచించె నుగ్రుఁడై.

అమితక్రోధాతిరేకాన నట్టులాడు - ప్రభుని మాటలచేఁ బ్రజ ప్రక్కకొదుగ
నొక్కత్రుటిలోన భటులు దా మక్కజముగఁ - గవిని దెచ్చిరి రాజసకాశమునకు.

ఆకవిచంద్రుఁ డెంతటి మహత్తరధైర్యయుతుండో! రాజుముం
దీకరణిన్ వచించి మది నించుక త్రొట్టుదనంబులేక, ని
ర్భీకత నాననంబు గనుపింప నృపాలునిమ్రోల నిల్చె, నా
హా! కవిచంద మేమొ యని యందఱు విస్మయమొందుచుండఁగన్.

రాజు కని పల్కెఁ గవిని, 'జరాభరాన-క్రుంది, కృశియించితివి, కవిరాజుననను
నిట్టుల విశృంఖలమ్ముగా నేలపలికి-తిపుడు దండింప నర్హుఁడ వేమియనెదు?'

అనవిని యాకవీంద్రుఁడు " మహాత్మ, నృపాలశిఖామణీ, కవీం
ద్రుని వచనంబు లెన్నఁడును దోషయుతమ్ములునౌనె? యూరకే
నను నిటు నిందసేయు టిది న్యాయముకాదు, కృపాపరీతులై
మనవిని చిత్తగింపుఁ డనుమానము లేదది సత్యమే " యనెన్.

ఆపలుకులు ములుకులుగా - భూపతి కర్ణములఁ దాఁక పుడమిని నెచ శే
విపరీత మాన తిమ్మిటు - కపటంబులు వల్క లెన్నగా దన నతఁ డున్.(?)

వెలమకులంబునందు నిలువెల్లరు కాంతలనంగ విందు న
ప్పలుకు లబద్ధమాయె జనపాలశిఖామణి యప్పరాయరా
ట్కలభపుఁ గీర్తికాంత, జయకాంత, మహిం గృతికాంత, మువ్వురుం
గల జగమెల్లయుం దిరుగఁగాఁ గనుఁగొంటిమి చిత్ర మిద్ధరన్.

అది వినినంత రాజహృదయంబున నెక్కడలేని సంతసం
బుదితముగాఁగ క్రోధమట నుండకపోయెను పౌరు లాత్మలం
దిది కడు వింతగూర్చె మన మిట్టిది మున్ను వినంగలేదటం
చెదల ముదంబునొందిరి కవీంద్రవచశ్చతురత్వభూతికిన్.

అంత నాకవి తాను ధరాధిపతికి - విన్నవించెను దనకావ్యవిధము నతని
కర్తగాఁ జేయుటను హెచ్చుకాంక్షతోడ - వచ్చుటయు నాదిగాఁ గల వార్తలెల్ల.

ఆనరపాలశేఖరుని యాస్యమునుండి కృపావినిర్గతా
హ్వానినదంబు ముందు వినవచ్చెను, పిమ్మట మేఘనాదస
మ్మానిత దివ్యవాగ్రచన పాయక వెల్వడె "తాము రేపు నా
స్థానములోన దర్శనము తప్పక నీయుఁడటం"చు శ్రద్ధతోన్.

అప్పటి కప్పుడే యుదధియందునఁ గ్రుంకె నినుండు, పక్షులుం
గుప్పలుగా కులాయములకుం జనుదెంచుచునుండె, నాలతో
నప్పురిఁ జేరుచుండిరట యాదవులెల్లరు, నాల్గుదిక్కులం
గప్పఁగసాగె చీకటి యఖండముగా నయనానురోధమై.

ఇటుల వచియించి రాజుతా నేగుటయును - పౌరులెల్లరు గృహములఁ జేరసాగి
రొకరితో నొక రాకవియుక్తిఁ గూర్చి - విస్మయముతోడఁ బలుకుచు వీధులఁబడి.

ఆమఱునాఁడు పట్టణమునందు దిశల్ కలయం గ్రమోఁగె "ను
ద్దామకృపావిభూతినతి ధర్మపరాయణుఁ డాశ్రితావనుం
డామహినాయకుండు వసుధామరు కిచ్చెను నగ్రహార మీ
భూమి గలంతకాల మనుభూతముగా" ననురావ మెంతయున్.

---






డా. సి. ముత్తుదంపతులు




సి వి యస్ నరసింహరాజుగారు



యస్ అనంతలక్ష్మీనారాయణరావుగారు



లెఫ్టినెంటు పి. గోపాలకృష్ణయ్యగారు



డా. యు. కృష్ణరావుగారు
చెన్నపురి పురపాలక సంఘసభ్యులు



పి. సాంబమూర్తిగారు
పాశ్చాత్యసంగీతమును నేర్వ యూరపుఖండమున సంచరించుచున్నారు



కెప్టన్ బి. టి. కృష్ణన్‌గారు
మదరాసు కళాశాలలో
శారీరక శాస్త్రోపాధ్యాయులు



ప్రొఫెసర్ పురుషోత్తంగారు



చావలి సుబ్రహ్మణ్యశాస్త్రి, రమణలాల్ బి. షాగార్లు



డా. ఎ. ఎ. ౦డగారు
మదరాసు ప్రభుత్వవిద్యాశాఖకు ఉపాధికారి

# అమృతసంజీవిని

## సకల వ్యాధులకును దివ్యౌషధము

**తప్పక ప్రతియింట నుండదగినది**

శరీరము పైపూతకును లోపలి కిచ్చుటకునుకూడ పనికివచ్చును

ఈ ఔషధములో విషపదార్థములు గాని, మత్తుపదార్థములు గాని లేవు. స్త్రీ, పురుషులు, పిన్నలు, పెద్దలు అను తారతమ్యము లేక అందరు ఉపయోగించవచ్చును. ఈ ఔషధమును శరీరముపై రాచినయెడల తలనొప్పి మొదలగు సమస్తనొప్పులను, కలరాను నివారించును.

దురద, గజ్జి, తీట, చిడుము, తామర మొదలగు చర్మవ్యాధులు నిర్మూలమగును. పండ్లనొప్పి, చెవిపోటు, పుప్పిపన్ను మొదలగుబాధలు శమించును. తేలు, తేనెటీగ, జెర్రి మొదలగు విషకీటకములు కుట్టినచోట ఈఔషధమును మర్దనచేసినయెడల బాధవెంటనేహరించును.

అనుపానము ఔషధముతో లోపలి కిచ్చినయెడల అజీర్ణవిరేచనములు, కడుపుబ్బరము, నొప్పి, నీళ్లవిరేచనములు, కలరా మొదలగు వ్యాధులను నివారించును.

మరియు దగ్గు, పడిసెము, ఉబ్బసము మొదలగు వ్యాధులందు "అమృతసంజీవి" సంజీవివలె పనిచేయును. కీళ్లవాతమునందు దీని నుపయోగించినయెడల నొప్పులు, వాపులు కూడ మానును. వెల బుడ్డి 1-కి రూ. 1-0-0. డజను రూ. 10-8-0.

# ముత్యాలపండ్లపొడి

ప్రతిదినము దీనిని పండ్లుతోముట కుపయోగించిన పండ్లను శుభ్రపరచుటయే గాక పండ్లసంబంధమైన అన్నిజబ్బులను ముఖ్యముగా పుప్పిపండ్లను, చిగుళ్లవాపును పోగొట్టగలదు. శాస్త్రయుక్తముగ తయారుచేసిన దగుటచే దేశమున అందరిచేతను కొనియాడబడుచున్నది.

పండ్లనుండి రక్తముకారుట, పండ్లపోటు, చిగుళ్లువాచుట, దుర్గంధము బయలుదేరుట మొదలగు అన్నిజబ్బులను మాన్పి చిరకాలము దంతములు పనిని చక్కగా జేయుటకు తోడ్పడును. పండ్లను ముత్యాలవలె శుభ్రముగను, తెల్లగను జేయును. అన్నిచోట్లను దొరకును. డబ్బా 1-కి అ. 0-4-0. డజను రూ. 2-8-0.

# జ్వరమాత్రలు.

అన్నిరకముల జ్వరములకును, శీత పైత్య జ్వరములకును గొప్ప దివ్యౌషధము. మంచినీళ్లతోగాని, అల్లము లేక మిరియాలరసముతోగాని తీసుకొనవలెను.

16 మాత్రలు సీసా రూ. 1-0-0. అన్ని షాపులలోను దొరకును.

**అజీర్ణపాశుపతము డిపో., రాజమండ్రి.**

# నోము

**బసవరాజు అప్పారావు గారు బి.ఏ.,బి.యల్.,**



పూతకృష్ణానదీజలస్నాత యామ
సగము తడియారుచున్న వస్త్రమ్ము దాల్చి,
శ్రమమటంచు భావింపకే సంతసమున
గిరిశిఖర మెక్కి రామలింగేశ్వరునకు
భక్తి నభిషేక మొనరించి ప్రముదితాంత
రంగయై వాసగృహము జేరంగబోవు.

చేరి, పూజాగృహమ్మున గౌరిదేవి
పసుపువిగ్రహమును వేదిపై నమర్చి,
పూల కుంకుమాక్షతలను పూజచేసి,
వానిలో కొంచెము శిరస్సుపైని దాల్చి,
మాతకు ప్రణామ మొనరించి మహితభక్తి,
దేవి కారగింపుగ నిడ్డ తీయజామ
పండు గైకొని, ప్రేమమ్మునిండు మదిని,
తేనె లొలుక 'అక్కా'యని దీనముగను
పంజరమునుండి పిలచెడు పం చవన్నె
రామచిల్కకు దినిపించి, "శ్యామ,విభుడు
చేతితోడ బెట్టకయె భుజింపుచుంటి
గాదె?" యని గద్గదిక బల్కు కాంత గనుమ

---

# దివ్యానుభూతి

శ్రీరంగం శ్రీనివాసరావు గారు, బి. ఏ.,

(కవితాసమితి)

సంకులపయోధరచ్ఛటాపంకిలనిబి
డాంధకారనిర్జనవీథికాంతరముల
నాచరించెడువేళ ప్రోన్మత్తరీతి,
అవశ మొనరించు దివ్యతేజోనుభూతి
సరసిమై చల్లనై నన్ను జలకమార్చె,
నందనవనీలతాంతకాంతస్రజమ్ము
గా నొకక్షణమ్ము నామెడ కౌగిలించె
కాలభటులు తొందరగా వినీలదీర్ఘ
సూత్రహస్తులు నను డాసి సుమదళీప
రీమళావృతమద్గాత్రసీమ కాంచి
తలకి తలయూచి ఇరులకై తరలినారు
ఇపుడు మేఘముల్ విచ్చిపోయినవి నాకు
గగనమందె కలదు తారకాస్రజమ్ము,
ఇంక నే నిత్యరాకాశశాంకమూర్తి
నై నభోరాజ్యపాలిక లావరింతు!

---

# ఆనందమే గానమాయెనే

తుర · వేంకటరామయ్య గారు (కవితాసమితి)

తెలుగుతోటలయందు
తిరిగేటివాడా!
దేవతారాగాల
దివ్యజీవనుడా!
ఏల వచ్చితివి - నే
డేల వచ్చితివీ!

క్రొత్తవెన్నెలదాన
క్రొందేనెదాన
వాడుటే యెరుగనీ
వలపులాదాన
చూడవచ్చితి పాట
బాడవచ్చితినే.

తేనెలా గ్రోలేటి
తీయనీవాడా!
కొమ్మల్లొ దిరిగేటి
తుమ్మెదాతేడా!
ఏదారి తప్పినా
విందు వచ్చావు?

సరసిలో పుట్టినా
చక్కనీదాన!
పండువెన్నెల్లకే
భయపడేదాన!
రాగాలు పాడుతో
సాగివచ్చానే

మాయపాటల్లోనె
మఱగించువాడా!
మత్తిల్లి లోకాలు
మరిచేటివాడా!
పాట లాకాశాన
పాడుకోవోయి!

దేవతాపుష్పమని
తెలిసి వచ్చానే
యుగయుగమ్ములు నిల్చి
యుండనెంచానే
అమృతదానమ్ము ని
న్నడుగుచున్నానే.

మాటలకు తక్కువా?
పాటలా తేడా!
మాయలకు దక్కువా
మన్మథునిజోడా!
నీమాటలకు నేను
ఏమనాలేనోయి?

కనకాల సరసిలో
కళలు గన్నావే
వేయిరేకులతోటి
వెలసియున్నావే
పాట లెఱుగని జీవ
మేటికేపూవ?

కమ్మనీ నీమాట
నమ్మలేనోయి
పొమ్మనాలేనోయి
రమ్మనాలేనూ
పోవాలి మాతల్లి
పూజ కీవేళ

ప్రేమ నెరగని పూజ
లేమి జేసేవే!
గాలిలో స్వర్గ మే
లీల గట్టేవే!
ప్రేమగానములోనె
"స్వామి" యున్నాడే

వెఱ్ఱితుమ్మెదతేడ
వేదాంతకాడా!
పూజింపకే ముక్తి
పొందేటివాడా!
ప్రేమించువారికా
ప్రేమ యేకాదా!

ప్రేమయే కృష్ణుడై
వెలసెనేపూవ!
ప్రకృతియే రాధయై
వలచెనే పూవ!
ఆనందమే గాన
మాయెనే పూవ!

---



ఆంధ్రయువతి

చిత్రకారుడు మంత్రవాది వెంకటరత్నము గారు, శారదానికేతనము, గుంటూరు.

# ప్రణయవాణి

**వేంకట కాళిదాస కవులు**

(ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు)

సఖుఁడు

శ్రీమద్గాంగతరంగశీకరచయస్తైమాభిరామానిల
స్తోమాకృష్ణపరీమళప్రచురసద్యోవిస్ఫురత్సూనముల్
ప్రేమాలింగితకిన్నరీమధురతంత్రీగానముల్ నందనా
రామస్థానము లప్సరోజనవిహారస్వైరతాధీనముల్.

అట సభాభ్యంతరమున సింహాసనమున - సుఖసమాసీనుఁ డాబిడౌజుఁడు; తదీయ
మస్తకన్యస్తనవరత్నమయకిరీట - రోచిరాలింగితమ్ము లాశాచయములు.

సఖి

శీతాంశుని పాలవెన్నెలలయం దీవాలుకారేణుమా
లాశయ్యాతలమందు నీయలలు సల్లాపించు గీతావళీ
ప్రాశస్త్యమ్ములయందు నీపవనసౌరభ్యంబులందున్ సఖా,
యాశల్ గల్గవొ నాకలోకసుఖభాగ్యప్రాప్తి వాటిల్లదో?

సఖుఁడు

ప్రాచి యదేకదే, మిసిమివన్నెల వెన్నెలఁ దెల్లఁబోవు తా
రాచయ మల్లదే, యమరరాజురథమ్ములు మబ్బు లల్లవే,
ఖేచరకామినీవిరహగీతరవమ్ముల మార్గ మయ్యదే,
ఓ చెలియా, కనుంగొనెదవో యమరావతిపొల్పు దవ్వులన్.

సఖి

రమణీయమ్ములు, హాసరోచిరుదయప్రాచీనముల్, నాదు నే
త్రములం దోఁచిన నీలినీడలకు, నిర్యన్నవ్యలజ్జావిలో
కమయూఖాకరతారకమ్ములకుఁ గాంక్షల్ సేయదో, అంతులే
ని మరుల్ పూనదొ, నీమనమ్ము ప్రణయస్నిగ్ధమ్ముకాదో సఖా!

ప్రేమపాశమ్ముగా నావరించు నాదు - నీలిమబ్బుదొంతరల వేణీభరమున
నాహృదయరాజవై నీవు మోహభావ-బద్ధుఁడవు గావొ,యౌవనభాగ్యమూర్తి!

అమృతరసమునె మించు తీయందనమున - నస్మదీయహృదంతర మాలపించు
వలపుపాటకు, నిలువునఁ బులకితుఁడవు - కరఁగకుందువొ నీవు శృంగారమూర్తి

ఇపుడు నీ మ్రోల నీబాలవీక్షణముల - జాఱిపడునట్టి కోమలచ్ఛాయలందె,
లేనగవులందె, కనుఁగొనలేవొ సఖుఁడ - స్వర్గలోకసౌభాగ్యసంపదల నెల్ల.

సఖుఁడు

ఈ తెలిరాతిరిన్ దళుకులే పులకించిన యాతరంగిణీ
శీతలవారిపూరమునఁ జెప్పఁగఁజాలని యంతరంగఘూర్ణ
లోతులలోన నగ్గదె కనుంగొనెదో, ప్రతిబింబమీను స్వ
శ్రీ (శ్రీ)తరుణప్రసన్న శుభనృత్యము మానవతీశిరోమణీ!

సఖి

ఒకరి కనుఁదోయినీడల నొకరి మూర్తి - యొకరి చెక్కిళ్ల చాయల నొకరియందఁ
మొకరి పూపుఁ బెడందలో నొకరి యెడఁద - ప్రతిఫలింపవె యమరశోభల సఖుండ!

సఖుఁడు

పున్నమచందమామ సురముఖ్యుల కిచ్చు సుధాతిధేయ మీ
వెన్నెల, పారిజాతసుమబృందము లీచెలువంపునవ్వులే
వన్నెల చిన్నిచుక్కలు; నభమ్మున నిప్పుడు స్వర్గలోకపుం
జిన్నెలు తోఁచుచున్నవి నిసిన్ గనుఁగొమ్ము వయోవిలాసినీ!

సఖి

చిరుతనగవులు వెలుఁగునా చిన్ని మోవి - చుంబనమ్మున నమృతంబు చూరఁగొనవొ?
తలఁపులో రహస్యమ్ముగా వలపు లీను - నట్టి నా సౌమనస్యమ్ము నరయలేవొ?

సఖుఁడు

చెలియా! చిక్కని తీయతేనియలె వర్షించున్ గదా నేఁడు నీ
పలుకుల్, నీశుభమూర్తిలోనఁ గల యాస్వర్గమ్ము సర్వమ్ము ద
వ్వులలోఁ గాక సమీపమై యిపుడు పొల్పొంగాంచు సద్యోభవ
త్పులక శ్రీకరగాఢతావకతనూద్యుక్తానుషంగంబునన్.

---





# ఆవేగము

కాళ్ళూరి వేంకటనరసింగరావు గారు



ఆకు లల్లార్పకయె భూరుహంబు లాగి
వెఱపునఁ రిచ్చవడి విన దొరకొనినవి,
దట్టపుఁ జెట్లగుంపులందలి మసకల
భావభరితనిశ్శబ్దరూపమ్ము గాంచి
గుసగుసలువోయినవి మిణుగురుబురుగులు,
కారుమసిమబ్బుమాటున కంపితుఁ డయి
తారి దాగుండె బాలసుధాంశుఁ డదిగొ!
భయదరోషకషాయితాపారజీవ
నోరుభారాన తొట్రుపా టొదవ దొరలి
హోరుహోరున బారెద వేరికడకు ?
ఓగభీరస్రవంతినీ! ఆగు మాగు.

*  *  *

ఏమిపుట్టెను గొడవ పుట్టింటిలోన ?
ఇమ్ములౌ మేటిలోయలోగిండ్ల విడచి
అమలస్ఫటికశిలాతలిమముల బాసి
తళుకుమణుల నిద్దంపుటద్దాల వీడి
వికచగిరిసుమోద్యానవాటికల దాటి
చారుకుంకుమారుణపంకచర్చ రోసి
పులుగుపాటకత్తెలకు మంగళము సెప్పి
తలలు వాలిచి విన్ననై నిలువరింప
నలవిగాకున్న లేతచేతులను బెనచి
వీడిపోలేక తమిబ్రబ కులాడి వేడు
వల్లరీవయస్యల నిరువంక కొత్తి,
బహుళప్రకృతిసౌందర్యసంపదల వదలి
లవణధామమ్మునకు తరలంగ నేల ?

*  *  *

తరిగి విరుగని బలుగిరిదొరలు, ధైర్య
సిరుల కిరవులు, కన్నవా రరసి నిన్ను
మహితభూరితరోరుసీమల గదించి
లీల నల్లారుముద్దుగా లాలసలను
నేల నడుగిడనీక మన్నింతురుగద!
ఆటపాటల దేలింప ననువుగా వ
లంతిగాలిబాలికల రప్పింతురుగద!
మబ్బుటోజ్జల బిలిచి నెమ్మదిగ నీదు
భావినీరదాగమశుభావసరమోద
గాథలను బలికింతురుగద ఘనముగ!
ఉదయసాయంత్రముల నయనోత్సవముగ
లేతనీరెండచీర లల్లించి తెచ్చి
సన్నవెన్నెలతోడవుల సంతరించి,
దినదినము సరిక్రొత్త నైపుణు లెలర్ప
హాయినీ తేటమెయి కయిసేయ నినువి
ఇందునిం దోడుకొని వచ్చుచుందురుగద!
ఇన్ని ముద్దుముచ్చటల కాల్దన్ని కొంచు
కన్నవారెల్ల నిలువు నిర్ఘాంతవోయి

స్థాణులై దీనదృష్టి నీసరణి గనగ
తావి కోనలెంతో విన్నవోవ నిట్లు
భయదరోషకషాయితాపారజీవ
నోరుభారాన తొట్రుపా టొదవ బారలి
లవణధామమ్మునకు తరలంగనేల ?
ఎడతెగని తన సొదయె ఘోషించుకొనుచు
చుట్టు సరికట్టు చెలియలికట్ట దాట
దారితెన్నుగానక తహతహల జిక్కి
కొట్టుకొను మరిమరి మొఱపెట్టుకొనును
అంబుధీశ్వరు డేమి సేయంగలండు ?
జడుడు బహుసఖీలోలుడౌ స్వామి, ప్రేమ
నీవెతల పాటరొదల నన్నింటి నార్పి
నిను గవుంగిట గరచునో, వినియు వినని
యటుల నాఱడిసేయునో, కుటిలగతులు
వాహినీసపత్నుల తలవంపు! తలచి
ఒక్కయడుగైన ముందరికూగి సాగ
కోగభీరస్రవంతినీ! ఆగు మాగు

* * *

ఆమహోన్నతపూతనగాళిలోన:—
శ్రీశివాజీమహారాజసింహునాటి
స్వేచ్ఛదేవతాపాదమంజీరనాద
మేదురామోదఖేలనోన్మాదనృత్య
వైఖరీచాతురుల మరువంగలేక,
మధురపూర్ణిమాచంద్రికామ్లానసురభి
వల్లికావితానము లలనల్ల నూగు
లాడవా నేడు అనుకరణానురక్తి ?
విమలవాలుకాపాళికావేదికలను
భక్తి స్వాతంత్ర్యదేవత బాదుకొలిపి
పరవిదారణశాస్త్రప్రపంచమర్మ
పండితాఖండచండ మార్తాండు డయిన
శ్రీప్రతాపసింహుడు పూజసేయువేళ
కొండపూవుగుత్తుల నేరి కోయు ముగ్ధ
భిల్లబాలికల్ మాధురుల్ వెల్లువలుగ
శ్రావ్యమోహనసంగతుల్ జార, పాడు
తన్మహాదేశభక్తవతంసశౌర్య
సారగాథాపరిప్లుతోదారవిజయ
గీతికావళీహృద్యసంకీర్తనముల
నుదయభాస్కరారుణకిరణోజ్జ్వలప్ర
శాంతవంశీనికుంజగర్భాంతరములు
మారుమ్రోగవే యుల్కి వేమారు నేడు ?
జ్ఞాన మెరిగినదాది స్వేచ్ఛావ్రతప్ర
పత్తి ముక్కాకదీరిన పౌరుషఖని,
"రామదాస"లసటను విశ్రాంతి గోరి
దాస్యశాస్త్రాలదంష్ట్రాంతాంతశయ్య
దీర్ఘనిద్రాపరీరంభదీక్ష మునుగ,
ఘోరకందరవీథీవిఘూర్ణమాన
బహుళనిర్ఝరనిర్ఘోషభాష, శోక
గర్భితముగ నాంధ్రావతి కరగి పాడు
అలసమధురముల్, మేల్కొలుపుల పదాల
దేల్చికొనిపోడె తావిసందిళుల నేడు
జాలిజాలిగా వలిపిల్ల గాలికొదమ ?

* * *

దివ్యగౌతమీభాగీరథీతరంగి
ణీసహోదరీమణు లంబునిధిని గలసి
ఏమి సలుపగజాలి రూహించుకొమ్ము,
రమ్ము, నాపలు కాలింపు మమ్మ! నెమ్మి
నిర్వైరము పాపపంకిల మీజగాన
నిముస ముండక, ఆత్మరూపము నడంచు-
నాలిసంకెళ్ల యీచెఱసాలలోని
మైలగాలిపీ లువక, నిర్మలపవిత్ర
భరతమాతృవిశాలగర్భాంతరాళ
నాళజీవస్రవంతుల నోలలాడ
గ్రుంకిపోవుద మిప్పు డకుంఠితగతి,
భువనమెల్ల విభ్రాంతి నీరవముగాగ
నోగభీరస్రవంతినీ, ఆగుమాగు.

---



యస్ యస్ రాజపుటానాస్టీమరు
(మహాత్ముడు లండనునకు ప్రయాణించినది)



జె మాక్లేగారు
(మహాత్ముని సన్మానించుటకై యేర్పడిన పార్లమెంటరీ సన్మాన సంఘమున కర్తృతులు)



కింగ్‌స్లేహాలు, బౌ
(లండనున మహాత్ముని విడిది)



అఖిలభారత స్వదేశీ ప్రదర్శనము, మదరాసు



దేశ సేవికల కోలాటము

(అఖిలభారత స్వదేశీ ప్రదర్శనము)



మదరాసు సంగీతకళాశాలా ప్రారంభోత్సవము




దక్షిణ భారత సంగీతపరిషత్తు

## ౩. చరిత్ర



# మాధవ విద్యారణ్యుడు[1]

కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.

క్రీ. శ. పదునాల్గవశతాబ్దము ప్రారంభమున మహమ్మదీయ తండయాత్రలమూలమున దక్షిణభారతమునకు వచ్చిన యాపత్తు గడచినతరువాత, విజయనగరసామ్రాజ్యము జీర్ణసనాతనమతము నుద్ధరించినవెనుక, వరలిన దార్శనికులలో విద్యారణ్యుడు ప్రప్రథముడును ముఖ్యుడును నైయున్నాడు. ఈయనపే రెత్తినవెంటనే కొన్ని ప్రశ్నములు వెడలుచున్నవి.—

౧. మాధవాచార్యవిద్యారణ్యనామముల బరగిన వాడొక్కవ్యక్తియా, కాదా?

౨. సాయణమాధవు లిద్దరు వ్యక్తులా, కాదా?

౩. సాయణమాధవుల పేరులతో వచ్చు గ్రంథపరంపరను వీరిలో నెవ్వరెవ్వరు రచియించిరి?

౪. విద్యారణ్యభాష్య మేకవ్యక్తికృతమా? కాకపోయిన నెవరెవరు రచియించిరి?

౫. సూతసంహితాభాష్యమును వ్రాసిన మాధవాచార్యుడు మాధవవిద్యారణ్యుడేనా, భిన్నుడా?

౬. భారతీతీర్థవిద్యారణ్యు లొక్కవ్యక్తియా, యిద్దరా?

౭. న్యాయసుధాకర్తయగు సోమేశ్వరుడు మాధవాచార్యపుత్రుడా?

ఈయధ్యాయమున నీప్రశ్నములకు సమాధానములను యథాశక్తి నియ్య బ్రయత్నింతును. మాధవాచార్యుడు తన తల్లిదండ్రులనుగూర్చి తాను రచియించిన పరాశరమాధవీయమున నిట్లు చెప్పుకొనెను.—

శ్లో॥ శ్రీమతీ జననీ యస్య సుకీర్తి ర్మాయణః పితా,
సాయణో యోగనాథశ్చ[2] మనోబుద్ధీ సహోదరౌ
బోధాయనం యస్య సూత్రం శాఖా యస్యచ యాజుషీ,
భారద్వాజం కులం యస్య సర్వజ్ఞ స్సహి మాధవః

మాధవసాయణయోగనాథులు సోదరులు. శ్రీమతీమాయణులు వీరి తల్లిదండ్రులు. మాధవుడు సోదరులలో జ్యేష్ఠుడు. ఆయన బుక్కరాయలవద్ద విజయనగరమున మంత్రిగాను, గురువుగాను ఉండెను. ఆకాలమున కింకను విజయనగరరాజ్యము సామ్రాజ్యగౌరవము నంది యుండలేదు. క్రమముగా బుక్కరాయసోదరుల వీర్యపరాక్రమములవలన విశాల మగుచుండెను. బుక్కరాయలాయనసోదరులలో మూడవవాడు కాని యందరిలో బ్రతిభాశాలి. అందుచే అన్నదమ్ములచే కేంద్రమున నియమింపబడి, యచ్చటనే యేలుచుండెను. ఈయనయన్నయగు కంపరాయలు ఉదయగిరి రాజధానిగా తూర్పుపరగణా నేలుచుండెను. బుక్కరాయల కుమారుడై, తరువాత దక్షిణమున ద్రావిడదేశమునకు వెడలి, మహమ్మదీయులను దక్షిణమున నామావశిష్టము

౧ నేను రచియించిన "దాక్షిణాత్యదార్శనికులు" అనుగ్రంథములో నిదియొక యధ్యాయము. ఈతదధ్యాయ రచనమునందు హితవర్యులును, మన్మిత్రులును నగు శ్రీయుత కనుపర్తి మార్కండేయశర్మగారు తమ స్వసర్వప్రకాశికాపత్రిక చైత్రవైశాఖమాస సంచికను వ్రాసిన వ్యాసము పకారక మయ్యెను.

౨ భోగనాథుడని పాఠాంతరము.

చేసిన గౌరవమందిన కంపన యీయనకంటె భిన్నుడు. ఆయనను కుమారకంపన యందురు. ఈసంగమవంశమున మొట్టమొదట చక్రవర్తియని పేరుపెట్టుకొని యేలినవాడు బుక్కరాయల కుమారుడగు II హరిహరరాయలు. ఉదయగిరియం దున్న కంపనవద్ద మాధవాచార్యసోదరుడును, వేదభాష్యకర్తయై ఖ్యాతినొందినట్టియు సాయణాచార్యుడు మంత్రిగా నుండెను. తరువాత ఆకంపరాయలు మృతినొందగా తత్సుతుడును, బాలుడును నగు సంగమకు గురువై విద్యాబుద్ధులు గరపి తత్కాలమున నావంక సామ్రాజ్యశత్రువులపై యుద్ధముచేసి జయించెను. ౧ ఆసంగతినే తన మాధవీయధాతువృత్తి మొదలగువానియం దీక్రిందివిధముగ చెప్పుకొన్నాడు.—

శ్లో॥ అస్తి శ్రీసంగమక్ష్మాపః పృథ్వీతలపురందరః,
యత్కీర్తిముక్తికాదర్శే త్రిలోక్యా ప్రతిబింబ్యతే
* * * *
తస్య మంత్రిశిరోరత్న మస్తి మాయణసాయణః

శ్లో॥ బాల్యేపి ప్రతిబోధయ స్వవిహితం శ్రీసంగమక్ష్మాపతిం –
బోధైకాస్పదసాయణార్యభగవద్భాష్యావతార స్వయమ్,
* * * *
దిష్ట్యా దైష్టికభావసంభృతమహా సంపద్విశేషోదయం
జిత్వా చంపనరేంద్ర మూర్జితయశాః ప్రత్యాగత స్సాయణః ౩

"శ్రీపూర్వదక్షిణ పశ్చిమసముద్రాధీశ్వర శ్రీ కంపరాజసుత శ్రీసంగమ మహారాజమహామంత్రిణా మాయణసుతేన మాధవసహోదరేణ సాయణాచార్యేణ విరచితాయాం మాధవీయాయాం ధాతువృత్తౌ.."

ఇందువలన బుక్కరాయల తండ్రియగు సంగమమహారాజును గ్రహించుటకు వీలులేదు. అట్లు గ్రహించిన యెడల సాయణునికంటె పెద్దవాడగు మాధవాచార్యుడు బుక్కరాయలకు మంత్రియై యుండ, చిన్నవాడగు సాయణుడు బుక్కరాయల తండ్రికి మంత్రి యగును అది యసంభవము. మాధవీయధాతువృత్తి రచియించిన కాలమునకు పెద్దసంగమమహారాజు చనిపోయియుండెను. పై యన్నదమ్ముల యిద్దర సాక్ష్యమువలన పరాశరమాధవీయము మాధవాచార్యరచితమనియు, చిన్నవాడగు సాయణుడు రచియించిన ధాతువృత్తికి పెద్దవాడగు సోదరుని నామము పెట్టెననియు, యిద్దరును సోదరులనియు తేలుచున్నది. రెండవప్రశ్నమునకు సమాధానము వచ్చినది ఇద్దరును భిన్నులని నిర్ధారణము.

జీవన్ముక్తివివేకమను గ్రంథమున నీక్రింది శ్లోకమున్నది.—

శ్లో॥ ఏతేషాంతు సమాచారాః ప్రోక్తాః పారాశరస్మృతౌ,
వ్యాఖ్యాతేఒస్మాభి రత్రాయం పరహంసో నిబధ్యతే,

ఈశ్లోకమువలన పరాశరమాధవీయకర్తయు, జీవన్ముక్తివివేకగ్రంథకర్తయు నొక్కరని స్పష్టము. వీనిలో పరాశరమాధవీయమును గార్హస్థ్యమున న్నాశ్రమస్వీకారమునకు పూర్వము రచియించెననియు, నీజీవన్ముక్తివివేకమును తదనంతరము రచించెననియు నీక్రిందివచనమువలన తెలియనగును.—

"ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య వేదార్థ మహేశ్వరవిరచిత జీవన్ముక్తిప్రకరణం సంపూర్ణమ్"

పై శ్లోకమునందలి "అస్మాభిః" అను పదము మన యూహను దృఢీకరించుచున్నది. యతులు రాజులవలె తమను చెప్పుకొనునపుడు బహువచనప్రయోగము చేయుట ప్రసిద్ధము కావున పరాశరమాధవీయగ్రంథకర్త తరువాత సన్యసించి జీవన్ముక్తివివేకమును రచియించెననుట స్పష్టము. ఆయన యెవ రను ప్రశ్నమునకు "వేదార్థమహేశ్వర" పద ముత్తర మొసంగుచున్నది. మాధవాచార్యునకు వేదార్థమును వ్రాయుటలో సంపూర్ణప్రసక్తి లేకున్నను వేదభాష్యమున కాయన పేరుకూడా కలుపుట

౧. Some Contributions of South Indir to Indian culture by S K Iyengar, pp 309 & 310.

౨ ఈసంగముడు బాల్యమునందే చనిపోయినట్లు తెలియుచున్నది

౩ అలంకారసుధానిధి.

సుప్రసిద్ధము తద్భాష్యమునకు విద్యారణ్యభాష్య మని కూడ పేరు కలదు [౧] సాయణాచార్యుడే

"ఇతి శ్రీసాయణాచార్యకృతే మాధవీయే వేదార్థప్రకాశికాయాం"

అని చెప్పుచున్నాడు. పూర్వాశ్రమమున మాధవాచార్యుడే తరువాత సన్యసించి విద్యారణ్యు డనునామము ధరించె ననుట కనేకాధారము లున్నవి. ఈయన సన్యసించి వ్రాసిన గ్రంథములలో జీవన్ముక్తివివేకముగాక వేదాంతపంచదశి యొకటి. [౨] అం దిట్లు చెప్పియున్నాడు—

శ్లో॥ నమః శ్రీశంకరానందగురుపాదాంబుజన్మనే,
సవిలాసమహామోహగ్రాహగ్రాసైకకర్మణే
తత్పాదాంబురుహద్వంద్వ సేవానిర్మలచేతసామ్,
సుఖబోధాయ తత్త్వస్య వివేకోఽయం విధీయతే

మరియు వివరణప్రమేయసంగ్రహమునందు,

శ్లో॥ స్వమాత్రయానందయతి త్రిజంతూన్
సర్వాత్మభావేన తథా పరత్ర,
యచ్ఛంకరానందపదం హృదబ్జే
విభ్రాజతే తద్యతయో విశంతి

అని చెప్పియున్నాడు.

పైశ్లోకములలో విద్యారణ్యుడు తన గురువు శంకరానందుడని చెప్పుచు మరికొన్ని స్థలముల మరియొక పేరును చెప్పెను.

శ్లో॥ పారం గతం సకలదర్శనసాగరాణాం
ఆత్మోచితార్థ చరితార్థితసర్వలోకః,
శ్రీశార్ఙ్గపాణి తనయం నిఖిలాగమజ్ఞం
సర్వజ్ఞవిష్ణుగురు మన్వహ మాశ్రితోఽస్మి
(సర్వదర్శనసంగ్రహము)

ఈసర్వదర్శనసంగ్రహము మాధవాచార్యకృత మని యీక్రిందిశ్లోకము ప్రమాణము—

శ్లో॥ శ్రీమన్మాయణ[౩]దుగ్ధాబ్ధి కౌస్తుభేన మహౌజసా,
క్రియతే మాధవార్యేణ సర్వదర్శనసంగ్రహః

ఈక్రింద చెప్పబోవు విషయములవలన పైగురుద్వయము సమన్వయమగును. ఈసర్వజ్ఞవిష్ణు వనునాయన తరువాత సన్యసించి విద్యాతీర్థుడను యోగపట్టమును స్వీకరించి కామకోటిపీఠాధిపతి యయ్యెను. శంకరానందుడు, భారతీతీర్థుడు, వేదాంత దేశికుడు, మాధవాచార్యుడు, సాయణుడు నీయనకు శిష్యులు. [౪] అందుచే సన్యాసమును గ్రహించి విద్యాతీర్థుడైన వెనుక వ్రాసిన గ్రంథములలో నీయనను మాధవాచార్యుడు యోగపట్టముతోనే నుతించి యున్నాడు.—

శ్లో॥ యద్విద్యాతీర్థసరవే శుశ్రూషాన్యా నరోచతే,
తదస్త్వేషా భక్తియుక్తా శ్రీవిద్యాతీర్థపాదయోః
(వివరణప్రమేయసంగ్రహము)

శ్లో॥ ప్రణమ్య పరమాత్మానం శ్రీవిద్యాతీర్థరూపిణమ్,
జైమినీయన్యాయమాలా శ్లోకైః సంగృహ్యతే స్ఫుటమ్
(జైమినీయన్యాయమాల)

శ్లో॥ యస్య నిశ్వసితం వేదాః యో వేదేభ్యోఽఖిలం జగత్,
నిర్మమే తమహం వందే విద్యాతీర్థమహేశ్వరమ్
(వేదభాష్యము)

వీరిలో వేదాంతదేశికుడును, శంకరానందుడును, భారతీతీర్థుడును పెద్దవారు. వారికంటె మాధవాచార్యులు చిన్నవాడు. వేదాంతదేశికుడు విద్యారణ్యుడు సన్యసించుటకు చాలాపూర్వమే ప్రసిద్ధుడై గ్రంథములను రచియించి మన్ననల నందెను. ఆయన రచియించిన తత్త్వ

౧. Sources of Vizianagar by S K Iyengar pp 3 & 4.

౨ "ఇతి శ్రీమత్పరమహంసవిద్యారణ్యమునికృతే" (ప్రకరణాంతవచనము).

౩ ఈ శ్లోకమున 'మాయణ' యనుటకు మారుగా 'సాయణ' యని చదివి యీ గ్రంథమును సాయణుని కుమారు డగు మాధవు డను నాయన వ్రాసెనని కొందరనుచున్నారు. ఒకవేళ యట్లయినను నాయన సర్వజ్ఞ విష్ణు శిష్యు డెట్లగును? మరియు సాయణపుత్రులు కంపణమాయణ సింగణలు అందు మాధవుడనువాడు లేడు కాదని శ్రీ చింతామణి పండితుడుకూడా చెప్పుచున్నాడు కాని కారణము నియ్యలేదు (J. O. R. 1928 p. 148).

౪. Sankaracharya, the great and his successors in Kanchi by N. Venkataraman, p 93

ముక్తాకలాపమునందలి శ్లోకమును మాధవుడు తన సర్వదర్శనసంగ్రహమున రామానుజమతమునుగూర్చి చెప్పునపుడు ప్రమాణముగా ననువదించుటయే యిందులకు తార్కాణము. శంకరానందుడు సన్యసించి విద్యాతీర్థుని తరువాత కామకోటిపీఠమునకు నిర్ణీతుఁడై యుండెను. మాధవాచార్యుని ప్రోత్సాహమున బుక్కరాయలచే పునఃప్రతిష్ఠిత మొనర్పబడిన శృంగేరీపీఠమునకు విద్యాతీర్థుడు భారతీతీర్థుని నిర్ణయించి యధిష్ఠింపజేసెను. కావున నీముగ్గురును మాధవాచార్యునికంటె పెద్దవారనుట స్థిరము. మరియు శంకరానందభారతీతీర్థులు సన్యస్తులై యితరులకు గురువులుగా నుండు యోగ్యతనుకూడా పడసియున్నారనుట దీనివలన సుగ్రాహ్యమగుచున్నది. వీరిలో శంకరానందుడు విద్యాతీర్థునివద్దగాక భారతీతీర్థుని వద్ద సన్యాసమును గ్రహించినట్లు కన్పట్టుచున్నది. విద్యారణ్యుడును విద్యలను- విద్యాతీర్థునివద్ద -నభ్యసించినను తత్త్వోపదేశముమాత్రము శంకరానందునివద్ద పొందెను. అందుచే విద్యారణ్యునికీసందర్భంబున శంకరానందుడు గుర్వుడును, భారతీతీర్థుడు పరమగురువును, విద్యాతీర్థుడు పరమేష్ఠిగురువును అయిరి. ఈవిషయము నింతకంటె విపులముగా తెలుసుకొనుట కవకాశము వచ్చును[౧] పైయున్ని నిదర్శనములవలన మాధవాచార్యుడే విద్యారణ్యుడయ్యెనని ధ్రువపడినట్లు తలంచనగును.[౨] కాని యిక్కాలంబునకూడ యింకను మాధవవిద్యారణ్యులు భిన్నులనువాదము చేయబడుచునే యున్నది. ఇటీవల "హిస్టారికల్ క్వార్టర్లీ" యనుపత్రికయందు నందూలాల్ దువేగారిట్లు వాదించినట్లు శ్రీ క. మార్కండేయశర్మగారు చెప్పుచున్నారు. తదభిప్రాయము ప్రమాదజనితమనుట నిక్కము. పైవచనములకు సహకారిగా పరంపరానుగతమగు సంప్రదాయము కలదు. వీరమిత్రోదయ మనుధర్మశాస్త్రగ్రంథమును వ్రాసిన మిత్రమిశ్రుడు తన గ్రంథమున "తనకు పూర్వము విద్యారణ్యుడు పరాశరస్మృతికి వ్యాఖ్యానమును రచియించెనని చెప్పినాడు.

"వ్యాఖ్యాతం చేదం శంఖవచనం విద్యారణ్యశ్రీచరణైః
పరాశరస్మృతిటీకాయాం పైతృకద్రవ్యవిభాగకాలే"

పరాశరమాధవీయము సన్యసించక పూర్వము వ్రాసిన దగుటచేతను, మిత్రమిశ్రుడు విద్యారణ్యుడు రచియించెనని చెప్పుటచేతను మిత్రమిశ్రునికాలమునకు మాధవునకే విద్యారణ్యుడను సంప్రదాయమున్నట్లు స్పష్టము.

విద్యారణ్యునికి సమకాలికుడును ప్రయోగరత్నమాలాగ్రంథకర్తయునైనగు చౌండపార్యుడు తన గ్రంథమునందు విద్యారణ్యునిగూర్చి యిట్లు చెప్పినాడు:

"శ్లో పదవాక్యప్రమాణానాం పారదృశ్వా మహామతిః,
సాంఖ్యయోగరహస్యజ్ఞో బ్రహ్మవిద్యాపరాయణః
వేదార్థవిశదీకర్తా వేదవేదాంగపారవిత్,
విద్యారణ్యయతిర్జ్ఞాత్వా శ్రౌతస్మార్తక్రియాపరైః
శ్రీచౌండపార్యప్రముఖైర్విద్వద్భిర్బ్రాహ్మణోత్తమైః,
వ్యాచష్ఫ్వాధ్వరతంత్రం స్వం సమంత్రార్థమితి స్ఫుటమ్"
(ప్రయోగరత్నమాల)

ఇందలి వర్ణనము మాధవవిద్యారణ్యునికితప్ప యెవ్వరికిని సరిపోదు. ఇట్టి వచనములనేకములు కలవు. కావున పైవచనములవలనను సంప్రదాయమువలనను మాధవుడే విద్యారణ్యుడనుట సిద్ధము ఇందుతో మొదటిప్రశ్నమునకు సమాధానము వచ్చినది.

సాయణుడు ధాతువృత్తిని వ్రాసి మాధవునిపేరును కలిపెనట్లు వెనుక చెప్పియున్నాను. అటువలెనే వేదభాష్యమునుకూడా తానే రచియించి అన్నగారి పేరును కూడా కలిపినట్లు చెప్పుచున్నారు. అందెంత నిజమున్నదో, చూతము. బుక్కభూపాలుడు మాధవాచార్యుని వేదభాష్యమును రచియింపుమని యాజ్ఞాపింపగా, మాధ

౧ విద్యారణ్యుల తరువాత విరూపాక్ష పీఠాధిపతి యయ్యెను

౨ సన్యాసమునకుతర్వాత రచియించిన గ్రంథములందు తానే పూర్వాశ్రమమున మాధవుడని చెప్పుకొనుట మన మతసంప్రదాయమునకు విరుద్ధము

వుడు వేదవేదాంగవేత్తయగు తన తమ్ము డున్నట్లు రాజు నకు విన్నవింప, నప్పు డాయనను రావించి యాయనను రచియింపుమని కోరిన ట్లీక్రింది శ్లోకము లొకముద్రిత ప్రతిలోమాత్ర మున్నవి

"శ్లో॥ స హ్యాహ నృపతిం రాజన్ సాయణార్యో మమానుజః,
సర్వం వే త్త్యేష వేదానాం వ్యాఖ్యాతృత్వే నియుజ్యతామ్
ఇత్యుక్తో మాధవార్యేణ వీరబుక్కమహీపతిః,
అన్వశా త్సాయణాచార్యం వేదార్థస్య ప్రకాశనే ౧

ఈ పైశ్లోకముల క్రిందిశ్లోకము ప్రతిబంధక మైయున్నది.

"శ్లో॥ యే పూర్వోత్తరమీమాంసే తే వ్యాఖ్యాయాతిసంగ్రహాత్,
కృపాలుర్మాధవాచార్యో వేదార్థం వక్తు ముద్యతః"

పూర్వోత్తరమీమాంసలకు మాధవుడు గ్రంథములను వ్రాసెననుట నిర్వివాదము. జైమినీయన్యాయమాలయను నామాంతరము గల యధికరణరత్నమాలయు నింతకుపూర్వమే రచియించెను. ఈ రెండుగ్రంథములును మాధవుడే రచియించెనుగాని సాయణుని కెట్టి ప్రసక్తి యును లేదు. అందుచే విద్యారణ్యునకు వేదభాష్యముతో సంబంధమున్నదని చెప్పిన పైశ్లోకము చరితార్థ మగుచున్నది. నిజముగా సంబంధ మున్నవిషయముకూడా సత్యదూరము కాదు. ఈప్రతిబంధకమును గుర్తించి కొందరు పైశ్లోకమున 'మాధవాచార్యః'అనుటకుమారుగా 'సాయణాచార్యః'అని పరిష్కరించినారు. కాని యప్పుడు సాయణునికి అనృత మాపాదించుచున్నామని వీరికి స్ఫురింపలేదు. సాయణు డెట్లు ఏగ్రంథములను వ్రాసి పూర్వోత్తరమీమాంసలను వాఖ్యానము చేసెను ? ఈప్రశ్న మప్పుడు నిరుత్తర మగును. కాబట్టి సాయణపదపరిష్కారము సహజము కాదు. గ్రంథములన్నిటిని పరికించిన సాయణుడు రచియించినవానికి మాధవునిపేరు చేర్పబడినదిగాని, మాధవుని వ్రాతలలో నెచ్చటను సాయణుని పేరును చేర్చినట్లు కానము. అందును వేదార్థవిషయము లో తనకును పాలున్నట్లు చెప్పెనేగాని మాధవీయ ధాతువృత్తియం దున్నదని మాధవు డెచ్చటనైన చెప్పెనా ? ఇట్లు పరికించిన, ధాతువృత్తియు సాయణరచితమనియు, వేదభాష్యరచనమున మాధవునకు పాలున్నదనియు గట్టిగా చెప్పవచ్చును. పైరెంటిలో వేదభాష్య మొకమహాత్కార్యము ఒక్కవ్యక్తియొక్క చేతిమీద చేయదగిన కార్యము కాదు. సాయణుడు చాలాభాగములు వ్రాసియుండవచ్చునుగాని యెవ్వరిసాయమును గొనలేదని చెప్పుట సరికాదు కొందరకట్లు సాయపడినవారికి భూదాన మిచ్చినట్లు శాసనాధారములు కలవు. ఈక్రింది వారు సాయపడిరట!

౧. నారాయణవాజపేయయాజి

౨. నరహరి సోమయాజి

3. పంఢరిదీక్షితులు౨

వీరేగాక యింకను ౨రరు సాయముచేసినట్లు శాసనము కలదట![3] ఇట్లిందరు సాయపడగా విద్యావంతుడును సర్వశాస్త్రవేత్తయు సర్వజ్ఞుడును నగు నన్నగారి సాయము వడయకుండునా ? నమ్ముటకు వలనుపడదు. వేదభాష్య మొక్కవ్యక్తికార్యము కాదనియు,ననేకవ్యక్తుల రచనమని యంతర్నిదర్శనము లున్నవనియు డాక్టరు పి. డి. గుణేగారు సహేతుకముగా చూపియున్నారు.[౪] మాధవాచార్యుడే యెట్టిసాయ మొనర్పనియెడల సమకాలికుడగు చౌండపార్యుడు "వేదార్థవిశదీకర్తా"యని మాధవాచార్యుని యనునా ? కాని వేదభాష్యమున ముప్పాతిక సాయణాచార్యుడే రచియించె ననుట కెట్టిసందియము లేదు. అట్టిరచనయం దితరుల సాయమొందెనని చెప్పుట యాయనకించిజ్ఞతాసూచకమును కాదు. సాయణుడు

---

౧ ఈశ్లోకములు ప్రక్షిప్తములని పరిశోధకుల యభిప్రాయము. (Ashutosh Vol, III Oriantalia, Part III , p 470)

౨ పైస్వధర్మప్రకాశినియందలి వ్యాసమును చూడుడు.

3 ఆనందాశ్రమముద్రణము నందలి జైమినీయమాల పీఠిక పుట ౯

౪. Ashutosh Memorial Volumes Vol III Orientalia Part. III. p. 467

నావంటియల్పజ్ఞుడనెడు మాటలతో మాసిపోని కీర్తిని సంపాదించి వైదికమతాకాశమున వెలుగుచున్నాడు. కావున సూచినంతవరకు మాధవీయధాతువృత్తిని సాయణుడు స్వయముగాను వేదభాష్యమునుమాత్రము మాధవ సాహాయ్యమునను రచియించెననియు, మిగిలిన గ్రంథములన్నియు మాధవుడే రచియించెననియు తేలుచున్నది. ఇందుతో మూడునాల్గు ప్రశ్నముల కుత్తరములు వచ్చినవి.

అయిదవప్రశ్నమునకు వత్తును ఈక్రిందిసూతసంహితావ్యాఖ్యయందలి వచనమును చూడుడు:

"ఇతి కాశీవిలాసక్రియాశక్తి పరమ భక్త శ్రీమత్త్ర్యంబక పాదాబ్జ సేవాపరాయణేన ఉపనిషన్మార్గప్రవర్తకేన మాధవాచార్యేణ విరచితాయాం సూతసంహితాతాత్పర్య దీపికాయాం "

మరియు నీగ్రంథమందలి యుపోద్ఘాతశ్లోకములుకూడా యీసందర్భమున ప్రస్తుతములు.

"శ్లో శ్రీమత్కాశివిలాసాఖ్యక్రియాశక్తీశసేవినా,
శ్రీమత్త్ర్యంబకపాదాబ్జసేవానిష్ణాతచేతసా
వేదశాస్త్రప్రతిష్ఠాత్రా శ్రీమన్మాధవమంత్రిణా,
తాత్పర్యదీపికా సూతసంహితాయా విధీయతే "

ఈరెండుభాగములును సంపూర్ణముగ సరిపోవుచున్నవి. దీనివలన నీగ్రంథకర్త క్రియాశక్తిశిష్యుడనియు, నుపనిషన్మార్గప్రవర్తకుడనియు, వేదశాస్త్రప్రతిష్ఠాతయనియు, మాధవమంత్రినామధేయము కలవాడనియు చెప్పబడినది ఈవిశేషణములచేతనే యీయన మాధవవిద్యారణ్యుడు కానట్లు కానవగును. మన మాధవవిద్యారణ్యుడు శంకరానందవిద్యాతీర్థశిష్యుడు మన విద్యారణ్యునిది భారద్వాజకులమని యిదివరలో తెలియును. ఈమాధవమంత్రిది ఆంగిరసగోత్రమని తెలియుచున్నది. మన మాధవాచార్యునకు "ఉపనిషన్మార్గప్రవర్తకుడ"ను బిరుద మెప్పుడును లేదు. ఈమాధవమంత్రి చౌండపార్యపుత్రుడు. మన విద్యారణ్యపితృనామధేయము మాయణుడు. కావున వీరిద్దరు నొకవ్యక్తి కాదనుట స్పష్టము.[౧] చౌండపార్యు డనినప్పుడు వెనుక ప్రయోగరత్నమాలాగ్రంథకర్త కావ. మరియొక చౌండపార్యుడని గ్రహింపవగును.[౨] ఇచ్చట నొకపొరబాటును చెప్పవలసియున్నది. తంజావూరు పుస్తకభాండాగారమునందలి యొక సూతగీతావ్యాఖ్యాగ్రంథమున నీక్రిందివచనము కలదు.

"ఇతి శ్రీమత్త్ర్యంబక పాదాబ్జ సేవాపరాయణేన శ్రీవిద్యారణ్యమునివర్యేణ విరచితసూతగీతా . "

సూతగీత సూతసంహితయందలి భాగమగుటచే నీవచనము లేఖకప్రమాదజనితమని వెంటనే తెలియుచున్నది. బ్రిటిషుమ్యూజియమునందలి ముద్రితపుస్తకపట్టికయందు సూతసంహితావ్యాఖ్యానము విద్యారణ్యరచితమని యొకచోటను మరియొకచో చౌండపార్యపుత్రుడగుమాధవమంత్రికృతమనియు చెప్పబడియున్నందున పరస్పరవిరుద్ధముగా నున్నది.[3] మొదటిది ప్రమాదము. మాధవసాయణు లిర్వురును మంత్రిత్వము చేసిరి. అందు మాధవాచార్యుడు తన జైమినీయన్యాయమాలయం దీక్రిందిశ్లోకమున తాను మంత్రినని చెప్పుకొనియున్నాడు.

"శ్లో ఇంద్రస్యాంగిరసో నలస్య సుమతిః శైబ్యస్య మేధాతిథి
ర్ధౌమ్యో ధర్మసుతస్య వైన్యనృపతేస్స్వౌజా నిమే ర్గౌతమః,
ప్రత్యగ్దృష్టి రరుంధతీసహచరో రామస్య పుణ్యాత్మనో
యద్వత్తస్య విభో ర్భభూ తుక్కలగురు ర్మంత్రీ తథా మాధవః "
౨ శ్లో ౪

ఇందున్న వర్ణనము మాధవమంత్రిదే యెందులేమో? కానేరదు. ఇందు "తస్య" యను పదముచేత నిర్దేశింపబడినవాడు బుక్కభూపాలుడు. మాధవమంత్రి బుక్కభూపాలునివద్ద యెన్నడును మంత్రిగా నుండలేదు. దండనాథుడుగా నుండెనని తెలియుచున్నది ఒకవేళ నీయనమనుమడగు బుక్కభూపాలునివద్ద నున్నట్లు చెప్పదురేమో! యీమాధవమంత్రి విద్యారణ్యునకు పూర్వమే క్రీ. శ. ౧౩౯౮ సంవత్సరమున చనిపోయినట్లు

౧. 1 Sources of Vizianagar, p 3
౨ 2 Ibid p 51
3 1 Catalogue of printed books in British Museum, pp. 554 & 807.

తెలియుచున్నది [౧] మఱియు మాధవాచార్యుడు గాని సాయణుడుగాని మంత్రిపదముతో పిలువబడియుండలేదు. మంత్రిత్వము చేసినను అది వారికి నిర్వచనము నిచ్చియుండలేదు. ఇందుతో నైదవప్రశ్న మైనది.

ఇక భారతీతీర్థునిగూర్చి ముచ్చటింతును. వీ రిద్దరును విద్యాతీర్థునిశిష్యులు అను మొదలగు సంగతులను వెనుక తెల్పియున్నాను. విద్యాతీర్థుడు శృంగేరీపీఠమును పునరుద్ధరించి దానిపైని భారతీతీర్థుని కూర్చుండబెట్టినట్లు చూచినాము.[౨] ఈక్రింది శ్లోకములు భారతీతీర్థుని విద్యారణ్యుని గురుపరంపరలో చేర్చుచున్నవి.

"శ్లో వ్యాఘూఘానా మిహ తనుభృతాం జాహ్నవీతీర్థ మేకం
విద్యాతీర్థం ప్రకృతివిమలం సద్వివేకోదయానామ్,
సర్వేషాం తు ప్రదమసుఖదం భారతీతీర్థ మాహు
స్తద్భావాన్మే విమలమనసో నిర్ణయే శక్తి రస్తి"
(కాలమాధవీయము)

ఈశ్లోకమునకు సుదర్శనుడు వ్యాఖ్యానమును వ్రాయుచు నిట్లు చెప్పినాడు.

"తీర్థపదావసానాని గురుతరగురుతమనామాని స్మృతాని"

"శ్లో స వంద్యాద్భారతీతీర్థయతీంద్రచతురాననాత్,
కృపా మవ్యాహతాం లబ్ధ్వా పరార్థ్యప్రతిభోఽభవత్"
(జైమినీయ న్యాయమాల)

ఇందువలన శంకరానందుడు గురువును, భారతీతీర్థుడు గురుతరుడును, విద్యాతీర్థుడు గురుతముడును నని సంప్రదాయ మున్నట్లు సుదర్శను నిది ప్రబలసాక్ష్యము. విద్యారణ్యుడు జైమినీయ న్యాయమాలా కాలమాధవీయములలో భారతీతీర్థుని పేర్కొనుటయు తరువాత సన్యసించిన వెనుక వ్రాసిన పంచదశీవివరణప్రమేయసంగ్రహములలో శంకరానందులను పేర్కొనుటయు చూడ. ముందు భారతీతీర్థుడు సన్యసించి శృంగేరీపీఠాధిపతియైన వెనుకశంకరానందుడు సన్యసించి తరువాత కొంతకాలమునకువిద్యారణ్యునకు సన్యాసగురు వయ్యె ననియు నూహకు తావొసంగి మన సిద్ధాంతమునకు బలకర మగుచున్నది. వీరిద్దరు రచియించిన గ్రంథములను గూర్చి కొంచెముగ చెప్పెదను. వీనియందలి వచనములను చూచిన సందేహాస్పదము లగుటచే వానినిగూడ చర్చించి సందేహనివృత్తిచేయుట యవసరము పంచదశియందలి కొన్ని ప్రకరణాంతవచనముల నీక్రింద నిచ్చుచున్నాను

"ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీ భారతీతీర్థ విద్యారణ్యకృత చిత్రదీపికాఖ్యం ప్రకరణం సంపూర్ణమ్"

"ఇతి పరమహంస విద్యారణ్యమునికృతౌ విషయానంద ప్రకరణం సంపూర్ణమ్"

"ఇతి శ్రీవిద్యారణ్యవివేకపంచక స్సంపూర్ణః"

ఈగ్రంథము సన్యసించినవెనుక వ్రాసినట్లు వెనుక చెప్పినాను. దీనిని కొంతభాగమును విద్యారణ్యమునియు, కొంత యిద్దరును వ్రాసినట్లు పైవచనములవలన తెలియుచున్నది. [౩]భారతీతీర్థు లొక్కరును వ్రాసినట్లు వచనము తెలియజేయుచున్న వైయాసికన్యాయమాలానామాంతరముగల యధికరణరత్నమాలయందలి యీక్రిందిశ్లోకమును చూడుడు :

"శ్లో ప్రణమ్య పరమాత్మానం శ్రీవిద్యాతీర్థరూపిణమ్,
వైయాసికన్యాయమాలా శ్లోకై స్సంగృహ్యతే స్ఫుటమ్"

"వైయాసికన్యాయమాలా" అనుటకుమారు "జైమినీయన్యాయమాలా" యని యుంచినయెడల వెనుకటి జైమినీయ న్యాయమాలయందలి శ్లోక మగుచున్నది. రెండును న్యాయమాలానామములు గలవే. రెండును శ్లోకమయములే.[౪] రెండింటియందు ప్రథమశ్లోకములు పోలుచున్నవి. మరియు మాధవాచార్యుడు వేదభాష్యప్రారంభమున వ్రాసిన "యే పూర్వోత్తరమీమాంసే" యనుశ్లోకము నిదివరకు చూచి

౧. Sources of Vızıanagar, p 4

౨. ఇచ్చట వెంకటరామణ గారు భారతీకృష్ణుడని నామము నిచ్చుచున్నారు. శృంగేరీవారి Sankara & successors. p 95 తీర్థసంప్రదాయము సుప్రసిద్ధము

3- Dr Keith's Sanskrit literature, p. 477.

౪ విస్తార మనునది విద్యారణ్య రచితమగు న్యాయమాలా వివరణరూపమగు గద్యభాగము.

నాము. దానివలన వేదభాష్యమునకుపూర్వము ఉత్తరమీమాంసాగ్రంథము నొకదానిని మాధవాచార్యుడు వ్రాసియుండవలెను. జీవన్ముక్తివివేక, పంచదశీ, వివరణప్రమేయ సంగ్రహములు, శంకరానందుని పేర్కొనుచున్నందున మాధవుడు సన్యసించినతరువాత వ్రాసినవియనుటస్పష్టము. అట్టియెడ నిక వేదభాష్యాత్పూర్వ మీయన రచియించిన యుత్తరమీమాంసాగ్రంథ మేది? మరియు రెండిటి రచనాపద్ధతి మిక్కిలి సన్నిహితము. కావున పైయున్నికారణములవలన విద్యారణ్యుడే వైయాసికన్యాయమాలను కూడా రచియించెనని చెప్పవలసియున్నది. దీనిని వేదార్థప్రకాశికకు పూర్వమే రచియించియుండవలెను. కాబట్టి రెండున్యాయమాలలను వెంటవెంట రచియించియుండవచ్చును. సామ్యము వీనిని బలపరచుచున్నది. కాని యంత్యవచనము వేరుదారిని చూపుటచే నొకవేళ అప్పటికే సన్యసించియున్న భారతీతీర్థుడును నీయనయు కలసి రచియించి తద్గ్రంథమునకు భారతీతీర్థునినామ మిడెనాయని కొంచె మనుమానమున కవకాశము కల్గును.

"ఇతి శ్రీమత్పరివ్రాజకాచార్య శ్రీ భారతీతీర్థమునిప్రణీతాయాం అధికరణ రత్నమాలాయాం చతుర్థాధ్యాయస్య చతుర్థః పాదస్సమాప్తః"

ఈవిషయము వివరణప్రమేయసంగ్రహముయొక్క కర్తృత్వమున కొంచె మనుమానము గొల్పుచున్నదిగాని యిద్దరును వేరువ్యక్తు లనునూహకు ప్రతిబంధకము కాదు. భిన్ను లనువాదమున కింకను అనేకాధారములు కలవు.

౧. వీరిద్దరు రచియించినట్లు చెప్పు గ్రంథములందలి వచనములలో మొట్టమొదట భారతీతీర్థుని పేరుండుటయు తరువాత విద్యారణ్యనామ ముండుటయు పరికింపగలము. ఇది సమంజసము. పరమగురుపునామము మొదట నిడుట శిష్యత్వమును సార్థకపరచుచున్నది.

౨. వాక్యసుధయను నామాంతరమున బరగు దృగ్దృశ్యవివేక మనునొకగ్రంథ మున్నది. దానికి మూడు వ్యాఖ్యానము లున్నవి. వానిలో నొకదానిని బ్రహ్మానందభారతియు, రెండవదానిని విశ్వేశ్వరపండితుడును, మూడవదానిని భీమదాసభూపాలుడును రచియించిరి. మొదటిది ముద్రితము. మిగిలిన రెండు నముద్రితములు. వీరిలో మొదటివ్యాఖ్యాత తద్గ్రంథము భారతీతీర్థుడు రచియించినట్లు చెప్పినాడు. రెండవవ్యాఖ్యాత విద్యారణ్యుడు రచియించినట్లు వ్రాసినాడు. మూడవయాయన వీరిద్దరుగాక శంకరాచార్యులు రచియించినట్లు చెప్పినాడు. తుది యభిప్రాయమును శంకరాచార్యులక్రింద విమర్శించియున్నాను. భిన్నకర్తృత్వోక్తి భిన్నవ్యక్తిత్వసూచకమని యిచ్చట తెల్పబడుచున్నది. కావున నీగ్రంథము కూడా విద్యారణ్యుడు సన్యసించినవెనుక నిద్దరును కలసి వ్రాసినదై యుండవచ్చును.

3. భారతీతీర్థునకును, విద్యారణ్యునకును రామకృష్ణుడను నొక పండితశిష్యుడు కలడు. ఆయన వేదాంత పంచదశికి వ్యాఖ్యానమును రచియించెను. వచనము నిచ్చుచున్నాను.

"శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య భారతీతీర్థ విద్యారణ్యమునివర్యకింకరేణ శ్రీరామకృష్ణరూపవిదుషా విరచితమ్"

ఉపోద్ఘాతమున నిట్లు చెప్పినాడు:

"శ్లో॥ నత్వా శ్రీభారతీతీర్థవిద్యారణ్యమునీశ్వరౌ"

పై రెండిటిని చదివిన పార్థక్యము మనస్సులకు సంపూర్ణముగా స్ఫురింపకమానదు. ఈయన చేసిన ద్వివచనప్రయోగము భిన్నవ్యక్తిత్వమును నిస్సందేహముగా సిద్ధాంతీకరించుచున్నది. ఈయనవాక్యము మన కవశ్యాదరణీయము. కీతుపండితుడుకూడా యిట్లే యభిప్రాయపడినాడు.[౧] అయిదవప్రశ్నమునకు సమాధానము వచ్చినది. తుదిప్రశ్నమును చర్చింతును. సోమేశ్వరభట్టను నొకపండితవర్యుడు కుమారిలుని తంత్రవార్తికమునకు న్యాయసుధయను నామాంతరముగల రాణకమను టీక నొకదానిని వ్రాయుచు నిట్లు తుదిని చెప్పకొన్నాడు:

౧. Keith's History of Sanskrit literature, pp. 477 & 478.





భా వ న

చిత్రకారుడు శ్రీ డి పాపారావుగారు



తంబూర్ వాలా

చిత్రకారుడు శ్రీ చామకూర సత్యనారాయణగారు

"ఇతి త్రికాండమీమాంసక ప్రతివసంతసోమయాజి భట్టమాధవాత్మజ భట్టసోమేశ్వర విరచితాయాం సర్వానవద్యకరణ్యాం న్యాయసుధాఖ్యాయాం.........".

ఇందు తాను భట్టమాధవునికుమారుడ నని చెప్పుకొన్నాడు. కాని యీ వచనమునందలి మాధవుడు మన మాధవవిద్యారణ్యు డనుట కెట్టియాధారమును కానరాదు. కా దని చెప్పుట కాధార మున్నది. మాధవాచార్యు డెచ్చటను భట్టమాధవు డని పిలువబడియుండ లేదు. కాని యీక్రింది జైమినీయన్యాయమాలయందలియంత్యవచనమును పరికింపుడు :

"ఇతి శ్రీమత్త్రికాండమీమాంసామండన ప్రతివసంతసోమయాజి మాధవవిరచితే జైమినీయ న్యాయమాలావిస్తారే" ౧

ఈవచనము కొన్నిముద్రితప్రతులయందు కానము. ఆనందాశ్రమప్రతియం దిట్లున్నది.

"ఇతి శ్రీమాధవీయే జైమినీయన్యాయమాలావిస్తారే .."

కాని పైవచనము తంజావూరుపుస్తకభాండాగారమందలి వ్రాతప్రతియందున్నది. ఇంతమాత్రముచేతనే గ్రంథము విద్యారణ్యరచితము కా దని చెప్ప వీలులేదు. మరియు నిది మాధవవిద్యారణ్యవిరచిత మనుట స్పష్టము.

"శ్లో॥ స ఖలు ప్రాజ్ఞజీవాతుః సర్వశాస్త్రవిశారదః,
అకరోజ్జైమినిమతే న్యాయమాలాం గరీయసీమ్.
తాం ప్రశస్య సభామధ్యే వీరశ్రీబుక్కభూపతిః,
కురు విస్తర మస్యా స్త్వ మితి మాధవ మాదిశత్."

కావున, న్యాయమాలావిస్తారములు రెండును మాధవాచార్యుని వనుట నిస్సందేహము. కాని న్యాయసుధాదుల రెండువచనముల సామ్య మాశ్చర్యమును గొల్పుచున్నది. మాధవాచార్యు డగ్నిష్టోమాదిక్రతువు లొనర్చిన కెట్టి యాధారములు లేవు. ఆయనను సోమయాజి యని యెచ్చటను పేర్కొనియుండలేదు. కాని యీయన శ్రౌతస్మార్తకర్మజ్ఞానమందు కుశలు డనుట కెట్టి యాక్షేపణమును లేదు. "త్రికాంతమండను"డని నిస్సందేహముగా చెప్పవచ్చును. కాబట్టి సోమేశ్వరుడను కుమారుడుండెనేమో యని మిక్కిలి యనుమానము వొడముచున్నది. ఈవిషయమున నింకను పరిశోధన మవసర మని తోచుచున్నది. మీమాంసాభ్యుదయకారుడు కూడా యిట్టిప్రశ్నమునే వేసి యెట్టి ప్రత్యుత్తరము నియ్యక వదలినాడు.౨ కాబట్టి యీసమస్యను పరిశోధకులకు వదలుచున్నాను. మాధవభట్టనుపేరుగల కవులు కొందరున్నారు కాని వా రెవ్వరును దాక్షిణాత్యులుగా కన్పట్ట లేదు. సోమనాధుడు మాత్రము దాక్షిణాత్యుడు కాన వానితో సంబంధమును కల్పుటకు వీలులేదు.

పైయన్నిప్రశ్నలకును సమాధానములను యథాశక్తిగా నిచ్చి తరువాత సామాన్యవిషయములను కొన్ని ముచ్చటింతును. ఈయననామముతో సంబంధముగల యీక్రిందిగ్రంథము లిప్పుడు ప్రచారములో నున్నవి.

౧. వేదార్థప్రకాశిక, లేక విద్యారణ్యభాష్యము.
౨. జైమినీయన్యాయమాల - తద్విస్తారము.
౩. పరాశరమాధవీయము.
౪. కాలమాధవీయము.
౫. సర్వదర్శనసంగ్రహము.
౬. వైయాసికన్యాయమాల, లేక యధికరణరత్నమాల.
౭. మాధవీయధాతువృత్తి.
౮. జీవన్ముక్తివివేకము.
౯. వేదాంతపంచదశి.
౧౦. వాక్యసుధాప్రకరణము.
౧౧. అనుభూతిప్రకాశిక.
౧౨. శంకరవిజయకావ్యము.
౧౩. అలంకారసుధానిధి.

౧ Descriptive Catalogue of Sanskrit Mss in the Tanjore palace library, p 5197.
౨. మీమాంసాభ్యుదయము.పుట ౫౦.

౧౪. దేవ్యపరాధక్షమాపణస్తోత్రము.౧

ఈ క్రింది గ్రంథములనుకూడా మాధవుడు రచియించెనని చెప్పుదురు గాని యది సరిగాదు.

౧. సూతసంహితావ్యాఖ్యానము.

౨. తైత్తిరీయోపనిషద్భాష్యము.

3. ప్రత్యక్షానుభవారూఢశాస్త్రము.

౪. బృహదారణ్యకవార్తికసారము.

వీనిలో మొదటిది చౌండపార్యుని పుత్రుడగు మాధవాచార్యకృత మని మనకు తెలియును. రెండవ దానినికూడా యాయనయే రచియించెను నాల్గవది సురేశ్వరాచార్యకృత మని వెనుక సురేశ్వరునిగూర్చి చెప్పినప్పుడు మనవిచేసుకొనియున్నాను. మూడవదిమాత్ర మనుమానముగా నున్నది.

ఈపుస్తకపట్టిక నొకమారు తిలకించిన నీయన సర్వతోముఖపాండిత్య మాశ్చర్యము గొల్పును.౨ ఈయన సర్వజ్ఞు డని చెప్పుట కావంతయును సందియము లేదు. ఒకవంక ఆన్వీక్షిక్యాదుల దిట్టయై విజయనగరసామ్రాజ్యస్థాపనము చేయజాలిన ప్రతిభాశాలియగు మంత్రివర్యుడు. మరియొకవంక సర్వశాస్త్రవేత్త. వేరొకవంక పండితకవి. ఈయన శంకరునితోపాటు సనాతనమతాకాశమున వెలుంగుచున్నాడు. శంకరుడు తదాకాశమునకు చండగభస్తి. ఈయన శీతకిరణుడు. శంకరుడు మిరుమిట్లు గొల్పును. ఈయన చల్లజేయును. శంకరుని ప్రతిభ దుర్నిరీక్ష్యము. ఈయనప్రతిభ యాహ్లాదకరము. శంకరుడు దండముతో శాసించును. ఈయన నచ్చజెప్పి యొప్పించును. శంకరుని వ్రాతలు కల్లోలవీచికాపరంపరాసమములు. ఈయనవ్రాతలు గంభీరసరోవరోదకోపమానములు. ఉపనిషత్కాలమునకు తరువాతి సనాతనమతమున వీరిద్దరిని చెప్పిననోట నితరులను పేర్కొనుటకు వీలులేదు. ఇటీవల విజ్ఞానవైశాల్య మలవడినకాలమునకూడా వీరితో సరితూగగల వ్యక్తి జన్మించలేదు. సనాతనమతము మహమ్మదీయఖడ్గము గడచుటయేకాక కోట్లప్రజల యంతరాత్మలను శాంతిల్ల జేయుచున్నప్పుడు తత్ఖ్యాతియంతయు వీరిద్దరిదియేయని చెప్పవలసియున్నది.

ఈయనకాలమున జైనమతము వ్యాప్తమైయుండెను. క్రైస్తవమతప్రచారము ప్రారంభించెను. సనాతనమతమును వీని రెండింటినుండి తప్పింపవలసియుండెను. అందులకు ప్రచార మవసర మని తోచి శృంగేరీపీఠమును పునరుజ్జీవింపజేయుటయేకాక వివిధప్రాంతముల మరియెనిమిది పీఠములను స్థాపించెను. పీఠముల కన్నింటికిని రాజమర్యాదలను కలుగజేసిన దీయనయే. సామ్రాజ్యకేంద్రమున నుండు విరూపాక్షపీఠమును తా నధిష్ఠించెను. ఆ యష్టపీఠములలో విరూపాక్షపుష్పగిరిపీఠములు మాత్రము ఇప్పటికిని కలవు వెనుక మన ముల్లేఖించిన ప్రశ్నములలో కొన్నిటికి ఉపపత్తుల నియ్యకపోయినను సంక్షిప్తముగా మనము చేసిన పరిష్కారములలో నేకీభవించుచున్న యీక్రింది వాక్యము నిచ్చుచున్నాను.

"ఏవం బహునా కాలేన రచితైః బహుభిర్గ్రంథైః సాగరతాం గతే ఽస్మిన్ మీమాంసాశాస్త్రే, దురవగాహతా మవలోక్య, ఝుడిత్యవబోధనాయ, శ్రీకంపరాజసుత శ్రీసంగమమహారాజమంత్రివర శ్రీమాయణతనూజేన శ్రీమతీగర్భజేన సాయనయోగనాథాగ్రజేన చంద్రవంశభూషణ శ్రీసంగమమహారాజాత్మజ శ్రీవిద్యాతీర్థయతిశిష్య శ్రీవీరబుక్కభూపతిమహామాత్యేన, శ్రీభారతీతీర్థయతి-శార్ఙ్గపాణితనయసర్వజ్ఞవిష్ణుశిష్యేణ శ్రీమాధవార్యేణ, పురాణపరాశరస్మృతీవ్యాఖ్యాయ, వేదభాష్యతః ప్రాక్ శ్రౌతధర్మప్రకాశకీయం జైమినీయన్యాయమాలా విరచయ్య వీరబుక్కాజ్ఞయైవ విస్తీర్ణా" 3

౧ విద్యారణ్యుడు సంగీతగ్రంథమును వ్రాసినట్లు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు చెప్పుచున్నారు (Journal of Andhra Historical Research Society Oct 1927.) కాని యట్టి గ్రంథ మెచ్చటను కానరాదు

౨ సర్వదర్శనసంగ్రహ మనూల్యగ్రంథము. మాక్సుమల్లరు పండితుడు వ్రాసిన "Six systems of philosophy" అను గ్రంథమున ~~కదిమాతృక ఈదేశమునందలి మతములస్వరూపము కావలె నన్న~~ నది యవశ్యపఠనీయము.

3 ఆనందాశ్రముద్రిత జైమినీయన్యాయమాలా పీఠిక

ఇందు బుక్కమహీపాలునికూడా విద్యాతీర్థశిష్యుని చేసినాడు. అందు తప్పు లేదు. భారతీతీర్థసర్వజ్ఞవిష్ణువులను విద్యారణ్యగురువులుగా పేర్కొనియున్నాడు శంకరానందుని వదలినాడు మాయణుని బుక్కభూపాలుని తండ్రియగు సంగమమహారాజునకు మంత్రిని చేసినాడు. పరిశోధన మావశ్యకమేకాని యైన నైయుండవచ్చును. అందులకు ప్రత్యక్షాధారము కానరాదు

ఈయనకాలమునుగూర్చి కొంచెముగ ముచ్చటించి యీమహామహు సెలవు గొందును. ఈయన మంత్రిగానున్న బుక్కరాయల రాజ్యకాలము క్రీ. శ ౧౩౫౪-౧౩౭౬ సంవత్సరముల మధ్య నని చెప్పుచున్నారు.

కుమారకంపనయొక్క దక్షిణదిగ్విజయయాత్ర యీసంవత్సరములమధ్య నని మద్రచిత "తంజాపురాంధ్రనాయకచరిత్రము" న శాసనాధారములతో చూపియున్నాను. విద్యారణ్యు డీసంవత్సరములలో నున్నట్టు స్పష్టము ఆయన క్రీ. శ. ౧౩౮౭ సంవత్సరప్రాంతమున చనిపోయినట్లు శాసనాధారము లున్న వని శ్రీయుత యస్. క్రిష్ణస్వామయ్యంగారు తెల్పుచున్నారు[౧] మీమాంసాభ్యుదయకారుడు క్రీ. శ. ౧౩౮౯ సంవత్సరమున చనిపోయినట్లు చెప్పుచున్నాడు కాని కారణములు చెప్పుట లేదు. అందుచే ౧౩౮౭ సంవత్సరమునే గ్రహింతము. ఈయన తన దేవ్యపరాధక్షమాపణస్తోత్రమున,

"మయా పంచాశీతే రధిక మపనీతేతు వయసి"

అని చెప్పుకొనియుండుటచే నీయన ౮౫ సంవత్సరములకు పైగా జీవించియుండెను. అందుచే క్రీ. శ. ౧౩౮౧—౧౩౮౭ సంవత్సరముల మధ్య నీయనకాల మని చెప్పుట సమంజస మని తోచును. క్రీ. శ. ౧౩౯౧ సంవత్సరమున మాధవుని పేర్కొనుచున్న శాసన మొకటి యున్నట్లు చెప్పుచున్నారు, కాని యది యీయనకు గాని చౌండపార్యపుత్రునికి గాని సంబంధించినది కా దని తోచుచున్నది.[౨] ఆమాధవమంత్రి క్రీ. శ. ౧౩౮౪ సంవత్సరమునసే మృతి నొందిన ట్లిదివరకే చెప్పియున్నాను. మాధవా! నీవు విద్యల కన్నిటికిని నిజముగా నరణ్యమవు! సర్వవిద్యలును నీయందు న్నవి! కీర్తిశేషుడన్న నిన్నే చెప్పవలెను!



౧ Sources of Vizianagar. p. 3.

౨ జైమినీయన్యాయమాల యుపోద్ఘాతము పుట ౯



# కాకతీయసామ్రాజ్యము

(కాకతిప్రోలరాజు చరిత్రము)

శ్రీ శేషాద్రిరమణకవులు

చిరకాలము నుండి అనుమకొండపురము మాధవవర్మ, పద్మ నేనుఁడు, వెన్నమరాజు, ఎఱుకదేవరాజు మున్నగు ఆంధ్ర రాజులు రాజధానిగఁ జేసికొని పరిసరదేశమును బాలించినటుల స్థానిక చరిత్రమునఁ గలదుగాని విశ్వసనీయమగు చరిత్రము లభింపలేదు కాకతి ప్రోలరాజుకాలమునుండి అనుమకొండపేరు దేశదేశములందుఁ బ్రసిద్ధమైనది త్రిలింగరాజ్యమునకు సంబంధించిన ఆంధ్రపతాకమును అనుమకొండ శైలశిఖరమునఁ దొలుతఁ బ్రతిష్ఠించిన ప్రోలరాజు జీవితచరిత్రమునఁ గొన్ని క్రొత్తయంశములు తెలియవచ్చినవి రాజ్యనిర్మాతయు, వీరాధివీరుఁడు నగు ప్రోలభూవల్లభుని సంపూర్ణచరిత్రమున కీవ్యాసము మచ్చుతునుక

## కాకతివంశము

కాకతివంశమున జనించిన వీరులు పలువురు పశ్చిమ చాళుక్యరాజులకుఁ బ్రతినిధులుగ నుండి యాంధ్రదేశమును బాలించిరి కాకతీయులు విష్ణుపాదోద్భవమగు జాతిని జన్మించితి మని శాసనములలోఁ జెప్పుకొనుటచే వీరల నాలుగవ జాతివారినిగ విశ్వసింపవచ్చును ఇటీవలి శాసనములలో గణపతిదేవాదులఁ బ్రశంసించుచు నేనానులు కాకతీయుల సూర్యవంశజు లనిరి స్థానికచరిత్రమునఁ జంద్రవంశజు లని చెప్పఁబడిరి సూర్యచంద్ర సంబంధమగు క్షత్రియవంశములకుఁ గాకతివంశము భిన్నమైనదని ప్రతాపరుద్రయశోభూషణమునందు విద్యానాథుఁడు పేర్కొనినాఁడు. కావునఁ గాకతీయులు నాలవజాతివారనియే విశ్వసింపవచ్చును ఇంతవఱకు జరిగిన పరిశోధనమువలన ప్రోలమరుసు అనువాఁడు కాకతి వంశమునకుఁ గూటస్థుఁ డనియు, అతనికి బేతరాజు జనించె ననియు, ఈతనికుమారుఁడె అనుమకొండరాజ్యస్థాపకుఁడగు (రెండవ) ప్రోలరా జనియు నొకశాసనము ౨ వలన స్పష్టముగాఁ దెలియుచున్నది. ఈశాసనమునందు ప్రోలరాజు త్రిభువనమల్లదేవపాదపద్మోపజీవి నని స్పష్టముగఁ జెప్పికొనినాఁడు అంతియకాక తాను దుర్జయవంశజుఁడ ననియుఁ, అన్మకొండాపురవరేశ్వరుఁడ ననియును, బలిహితచరితుఁడ ననియుఁ జెప్పుకొనినాఁడు ఇందువలన నిస్సంశయముగాఁ బ్రోలరాజు తొలుత క్రీ శ ౧౦౭౬ మొదలు ౧౧౨౬ వఱకు రాజ్యమేలిన పశ్చిమ చాళుక్యరాజగు త్రిభువనమల్ల విక్రమాదిత్యునికాలమున రాజప్రతినిధిగ నుండి యాతని యనంతరము స్వతంత్రుఁ డయ్యెనని తెలియుచున్నది. ప్రోలరాజుతండ్రి బేతరాజునకుఁ ద్రిభువనమల్లదేవుఁ డనునది బిరుదనామము బేతరాజు, అతనితండ్రి ప్రోలరుసు అనుమకొండఁ బాలించినటుల స్థానిక చరిత్రమునందుఁ గలదుగాని వారల జీవితచరిత్ర మింతవఱకు మరుగు పడియున్నది

## ప్రోలరాజుమతము

మహామండలేశ్వరుఁడగు కాకతిప్రోలరాజు జైనుఁ డని చరిత్రవిదులు తలంచిరి గాని యది ప్రమాదము కానోపును ౩ ఒకశాసనములో ప్రోలరాజు ఈశ్వరస్తుతి గావించి వరుణప్రతిష్ఠ నొనర్చినట్లును,౪ ఇంకొకతావున జలంధరభైరవుని బ్రతిష్ఠించినట్లును జెప్పుకొనినాఁడు కాన నీతఁ డార్షమతమువాఁ డనియే కంఠోక్తిగఁ జెప్పుకొనినాఁడు ప్రోలరాజు జైనుఁడనుటకుఁ బద్మాక్షీదేవళముచెంత అనుమకొండలోఁ

---

౧ ఈవ్యాసమున నుదాహృతములగు శాసనములు హైదరాబాదు ఆంధ్ర పరిశోధకసంఘమువారి తెలంగాణా శాసన సంపుటమునుండి యుద్ధృతములు

౨ చూ తెలంగాణాశాసనసంపుటము, కాకతీయశాసనములు ఖాజిపేటశాసనము.

౩ చూ. ఖాజిపేటశాసనము.

౪ చూ ఇనుగుర్తి శాసనము.

గల శిలాశాసనమునందలి ఈక్రిందిశ్లోకమునందలి జైనస్తుతియు, దానికి సంబంధించిన శాసనమును కారణములుగ మనవారు గ్రహించిరి

"శ్లో॥ శ్రీమజ్జినేంద్రపదపద్మ మశేషభవ్యం
సవ్యత్రిలోక నృపతీంద్రమునీంద్ర వంద్యమ్,
నిశ్శేషదోషపరిఖండనచండకాండం
రత్నత్రయప్రభవ మస్య గుణైకతానమ్ "

ప్రోలరాజు ఈపైశ్లోకమున జనేంద్రునిఁ బ్రస్తుతించియుండుట చేత నీతఁడు జైనమతావలంబకుఁడని స్పష్టముగా బోధపడుచున్నదని ఆంధ్రచరిత్రమునఁ జెప్పఁబడినది ప్రోలరాజు జైనుఁడనుట కీశాసన మెంతవఱకు సహాయపడునో యని మేము స్వయముగా నీశాసనముఁ జదివితిమి ప్రోలరాజునకుఁ గులక్రమాగతమంత్రియగు వ్యోజదండాధిపతియు నతని భార్య మైలమయుఁ గావించిన ధర్మము లందుఁ జేర్కొనఁబడినవి ప్రోలరాజు జైనుఁడనుట కీశాసన ముపకరింపదు ప్రోలరాజు శివభక్తిసంపన్నుఁడగు శైవుఁడని యతనికుమారుఁడగు రుద్రదేవుఁడు స్పష్టముగా "శివపాదపద్మయుగళ ధ్యానామృతానందభూః" అను విశేషణమునఁ జేర్కొనినాఁడు కావున ప్రోలరాజు శైవుఁడనుట సత్యము ప్రోలరాజుమంత్రి వ్యోజదండాధిపుని భార్య మైలమ్మ కడలాలయను బ్రతిష్ఠించెను. కడలాలయే పద్మాక్షి కానోపు ఏలయన ఈశాసనముగలతావున జైనవిగ్రహములు పెక్కులుగలవు స్త్రీవిగ్రహ మొక్కటియెగలదు నాఁడు కడలాలయగను ఆవల పద్మాక్షిగ నీవిగ్రహమె వ్యవహరింపఁబడియుండెను పద్మాక్షి జైనదేవత యనుటలో సందియము లేదు పద్మాక్షివిగ్రహము గల యఖండశిల కిరుపార్శ్వములఁ జెక్కఁబడిన జైనవిగ్రహములెకాక చుట్టునున్న జైనవిగ్రహములు గూడ నిందుల కాధారములు ప్రోలరాజు సర్వమతసమభావము గలవాఁడుగాన నాతని మంత్రులు జైనులుగ నున్నను సహించె ననియే యీశాసనముసారాంశము ఇంతయేల ? ఆత్రేయగోత్రుఁడును, నియోగి బ్రాహ్మణుఁడును, అద్వైతియు నగు ప్రోలరాజుమంత్రి గంగాధరుఁడు జైనప్రతిష్ఠ గావించితిననిని[౧] యొకశాసనములో నీక్రింది విధముగాఁ జెప్పుకొనినాఁడు

కం॥ పరమేశుండు హరిబుద్ధ
స్వరూపుండై యప్పురవరుల వచించు జినో
హరి యనియె పట్టశాలం
దిరముగ బుద్ధప్రతిష్ఠ నేసితి భక్తిన్

ఇటుల నెన్నేని జూపవచ్చును మాధవవర్మవంశజులు ఆర్షమతస్థులగు మేడరాజు-జగ్గరాజుల మంత్రియు నియోగియు నగు నాగదేవరాజు గూడ జైనుఁడె అంతియకాదు; నాగదేవరాజు ప్రోలరాజుమంత్రియగు వ్యోజదండనాథుని సమకాలికుఁడు అతఁడును[౨] దన శాసనములో మైలాంబవలె జైనస్తుతి గావించినాఁడు

శ్లో॥ " శ్రీమజ్జినేంద్రమకుటోజ్వలరత్నభూషా
నాగేంద్రహస్తసరసీరుహకర్ణపూరా,
విద్యాధరేంద్రరచితోత్తమ కుంకుమాంకా
భూయాత్సుఖాయ జినదేవపదాంబుజశ్రీః "

మంత్రుల మతమునుబట్టి రాజుల మతము నిరూపింప వలనుపడదనియు, ఆర్షమతమువారుగూడ జైనబౌద్ధమతములయెడ నాదరభావమును జూపిరనియు, ప్రోలరాజు శైవుఁడనియు నిరూపించుట కింతవఱకు కొనర్చిన చర్చ చాలును

## ప్రోలరాజురాజధాని

మహామండలేశ్వరుఁడును, వీరవతంసుఁడును నగు ప్రోలరాజు వీరభూమియు పితృపితామహుల కాణాచియు నగు అనుమకొండలోనె రాజధాని నేర్పఱచికొనెను పద్మాక్షిగుట్ట సిద్ధేశ్వరుగుట్టకు మధ్యగల విశాలమగు ఆవరణమున రాజమందిరములను నిర్మించెను పెట్టనికోటలవలె నున్న కొండలను గలిపి తూర్పుదిక్కునను ఉత్తరదక్షిణములను మహోన్నతములగు కట్టలు పోయించెను రాజమందిరములకుఁ బ్రధానద్వారము దక్షిణముగ నేర్పఱుపఁబడినది ద్వారరక్షణమునకు దృఢతరమగు ప్రాతికోటయు దానికిఁ జేరువలో నత్యున్నతమగు సింహద్వారము నేర్పఱచెను ప్రత్యర్థిరాజులు పశ్చిమదిశనుండి దుర్గమును ముట్టడింపకుండ సిద్ధసముద్రము, బాలసముద్రము అను రెండుతటాకములు, ఉత్తరదిశనుండి రాకుండ భద్రిసాగరమను నొకతటాకము నెలకొల్పెను ఈతటాకము లాయాదిశలఁ గాచుటయేకాక యగడ్తలకుఁ గూడ జలసహాయము గావించుచు నగరలక్ష్మికి విహారసరస్సులవలె నుండెను అంతతోఁ బోక ప్రోలభూవిభుఁడు రాజమందిరములకుఁ జుట్టునున్న మూఁడు కొండలపైనను ప్రాతికోటఁగూడ గట్టెను ఇన్ని సురక్షితసాధనముల మధ్య ఆంధ్రసామ్రాజ్యలక్ష్మిని ప్రోలభూపాలుఁడు ప్రతిష్ఠించి రాజ్యమేలసాగెను

## ప్రోలరాజుప్రత్యర్థులు

చాళుక్యసామ్రాజ్యపతనానంతరము ప్రోలరాజు నూతనముగా ఆంధ్రసామ్రాజ్యము నెలకొల్పుట తోడిసామంతరాజులకు బాధగ నుండెను పలువురు రాజులు ప్రోలుని యభ్యున్నతికి సహింపక ఆంధ్రసామ్రాజ్యమును ఛిన్నభిన్నము గావింపఁగడఁగిరి వారిలో తైలపదేవుఁడు, గోవిందరాజు, గుండరాజు, జగద్దేవరాజు, మున్నగువారు ముఖ్యులు జగద్దేవుఁడు ప్రోలరాజును బందిగాఁ గొనసెంచి

౧ చూ॥ కరీమునగరశాసనము

౨ పరకాలతాలూకా గోవిందాపురశాసనమునుండి.

నానామండలికాన్వితుఁడై అనుమకొండను ఎడతెగని పట్టుదలతోఁ గొన్నిమాసములు ముట్టడించి తుదకుఁ బరాభూతుఁ డయ్యెను సంధి నియమములలో జగద్దేవుఁడు తన పరిపాలనమునందున్న రాజ్యము నంతయు వదలి సామాన్యపౌరునివలె నెందో తలదాఁచుకొనవలసి వచ్చెను కావున ఒకశాసనములో జగద్దేవుని యనంతరము ప్రోల భూపాలుఁడు రాజ్యమునకు వచ్చినటుల ౧ నీ క్రిందివిధముగాఁ జెప్పఁ బడినది

"శ్లో యస్మాదిభక్తమాలక్ష్మ్యా జగద్దేవా దనంతరమ్,
కాకతీశః ప్రోలభూప స్స్వేభరాం పర్యపాలయత్"

ప్రత్యర్థిలోకము వశంవదమగుటతో ప్రోలుని రాజ్యము మిగుల విస్తీర్ణ మయ్యెను సంపత్సమృద్ధి యతిశయించెను పరివారము, సైన్యము, ప్రకృతివర్గము మెండయ్యెను రాజధాని అనుమకొండనుండి మార్చినఁగాని పురోభివృద్ధి కలుగదని తలంచెను హిడింబతీర్థవాసులగు త్రిదండిమహర్షులను, రామారణ్యశ్రీపాదులను రావించి వారి యానచే ఓరుఁగల్లు అను తావున మహత్తరమగు కోట గట్ట నారంభించి ప్రోల రాజు బొక్కసమున నున్న ధనమంతయు వ్యయపఱచెను అఖండశిల నొకదానిని కర్ణికగా నేర్పఱచి శ్రీచక్రానుసారముగా చుట్టు ఏడు ప్రాకారముల నేర్పఱచిరి మొదటి ప్రాకారము ఇటుకకోట రెండవది రాతికోట మూఁడవది పుట్టకోట దీని కావల నింక మూఁడు మంటికోటలు, పిదప నొక కంచెకోట వేయించెను ప్రోలరాజు తన యవశిష్టజీవిత మంతయు ఓరుఁగల్లుకోటను నిర్మించుటకును, అందు మనోహరతరములగు వాపీకూపతటాకాలయాదులు నిర్మించుటకును, వినియోగించెను ఏకసమయముననే ఓరుంగంట నూతననగరనిర్మాణము, అనుమకొండలో రాజధాని నిర్మాణము జరుగసాగెను

## ప్రోలరాజు పరివారము

పద్మాక్షిశాసనమునందు ప్రోలభూవిభుని మంత్రి వ్యోజదండనాథుఁడని కలదు ఇతఁ డొక సంగరమున మరణించినకారణమున సామ్రాజ్యరక్షణమునకై నూతనమంత్రి నన్వేషింపవలసివచ్చెను ప్రోల రాజు వేఁగిదేశములోని చెల్లకిపురవాసియు ఆత్రేయగోత్రుఁడును గోవిందరాజుతురుకమాంబలకుఁ బుత్రుఁడును నగు గంగాధరుని మంత్రిగాఁ జేసికొని అనుమకొండలో నాతనికి నెల వొసంగెను ఈయంశము దెలుపు ౨ శాసనపంక్తుల నిట నుదాహరింతుము

"క. వెలయంగ వేఁగిదేశం
బులోన నాత్రేయగోత్రపుంగవులు మహా
త్ములు చెల్లకిపురంబున
బలవంతులు పుట్టి పెరిగి పాలించి రనన్

ఉ భూధరధైర్యు నత్యధికపుణ్యచరిత్రుఁ డపారకీర్తిల
క్ష్మీధరమూర్తి శిష్టజనమిత్రుఁడు గోత్రపవిత్రుఁ డచ్యుతా
రాధనతత్పరుండు కుఱగాజ ?కుండు మతిప్రభాతిగం
గాధరుఁ డిద్ధరిత్రి ననఁగా నుదయించి శుభోదయంబునన్

క మాతాపితృవర్గము సం
ప్రీతిం జదివించి మచ్చి పెంచి లసద్వి
ద్యాతిశయకుశలుఁ జేసి వి
భూతిం బరిణయము చేసి పోషింపంగాన్.

చం సకలకలావిధిజ్ఞుఁ డనఁజాలి సమస్తజనాలిసద్గుణ
ప్రకరము నెప్పుడున్ బుధసభం బ్రణుతింపఁగ నున్నయట్టి నన్
బ్రకటితకీర్తి ప్రోలజనపాలుఁడు ఘోరతరాజిలోఁ డ
త్యకుటిలచిత్తుఁ డీతఁడని యాదరికన్ బిలిపించి పంపఁగాన్.

కం చనువుమెయి నగరిలోఁ దగు
పను లెల్లను బెంపుమెఱసి పరికించుచు నే
ర్పును భక్తియుక్తి నతిముద
మునఁ జేయుచుఁ దత్పురోత్తమున మతియుఁ బ్రభన్"

ఈగంగాధరుఁడు ప్రోలరాజున కనంతరము రుద్రదేవుని కాలమునఁ గూడ నమాత్యపదవి నిర్వహించి యత్యధికాదరసమ్మానము లొందినటులఁ బై శాసనముననే గలదు ఈగంగాధరుఁడు ప్రోలరాజు కాలమున మంత్రిపదవి నిర్వహించుచు సప్తసంతానము లొంది యనేక దేవాలయములను అనుమకొండలోఁ బ్రతిష్ఠించినాఁడు. డోండోండు అను నగ్రహారము పండితుల కొసంగెను బౌద్ధాలయము, త్రికూటాలయము, ప్రసన్నచన్నకేశవాలయము, పున్నేశ్వరాలయము, కేశవాలయము, భీమేశ్వరాలయము మొదలగు నాలయరాజముల అనుమకొండలోఁ బ్రతిష్ఠించినాఁడు ప్రభుమంత్రోత్సాహశక్తి సంపన్నుఁడగు నీగంగాధరమంత్రి ప్రోలభూపాలుని కాలమున నెట్లు నిర్వహించెనో యట్లె తత్పుత్రుఁడగు రుద్రదేవుని కాలమునసైతము మంత్రిపదవి నిర్వహించి కాకతీయసామ్రాజ్యము చిరస్థాయి యగుటకుఁ గారకుఁ డయ్యెను ఈతఁడు గావించిన ధర్మములు కరీంనగరమండలములోని నగునూరులో విశేషించి కాంచవచ్చును భావిపరిశోధనమున నీమంత్రీంద్రుఁడు ఆంధ్రసామ్రాజ్యాభివృద్ధికిఁ గావించిన ప్రయత్నపరంపరగుర్తు పట్టుట కవకాశము లభింపవచ్చును

ప్రోలరాజు సేనానాయకులలో ముఖ్యగణ్యులు పలువురు గలరు. రేచర్లగోత్రుఁడగు కామయసేనాని ప్రోలభూవల్లభునకు విశ్వాసపాత్రుఁడగు దండనాథుఁడు ఈయన అపరిమిత బలసహాయుఁడై మంథెన (మంత్రకూటము) పాలించు గుండరాజును వధించి యాతని

౧ చూ గణపవరశాసనము

౨ చూ కరీంనగరశాసనము.

రాజ్యము నాంధ్రసామ్రాజ్యములోఁ గల్పెను ఈవిజయము ప్రోలరాజు దని రుద్రదేవుఁడును కామసేనాని దని రుద్రసేనానియు చెప్పుకొనిరి

"శ్లో కృద్ధేనోద్ధురమంత్రకూటనగరీనాథాదయో నిస్త్రపో
గుండః ఖండిత ఏవ ముండితశిరాః క్రోడాంకవక్షస్థలః"
రుద్రదేవునిశాసనము

"శ్లో శ్రీమత్ప్రోలనృపాలసైన్యపతినా విఖ్యాతవిక్రాంతినా
యుద్ధే యేన మహాబలేన నిహతో మంథన్యగుండాధిపః"
రుద్రసేనానిశాసనము

ఈకామసేనాని రేచర్లగోత్రుఁడు వంశపరంపరాగతమగుసేనానాయకపదవియందుండి కాకతీయప్రోలరాజును సేవించిన మహావీరుఁడు ఇంతవఱకీమహావీరుని నామము చరిత్రవిదులకపరిచితముగ మఱుఁగుపడియుండుట సంతాపకరము

ప్రోలరాజుసామంతులలో వేమచోలబొడ్డమమల్లినాయకుఁగు నతవాటిసీమను బాలించువాఁడు ఈయన స్వామిభక్తిపరాయణుఁ డనియుఁ, గాకతిరాజ్యోద్ధారకుఁ డనియుఁ బేరుగాంచెను ౧ అమరేశ్వరాలయము గట్టించి మాటేరులో నీతఁడు తన విజయముల ధర్మముల నచటి శాసనమునఁ బేర్కొనెను ఈశాసనము నింక శోధించినఁ గొన్ని చరిత్రరహస్యములు వెల్లడికాఁగలవు గజసేనాపతి, అన్నసేనాపతి, విరియాలవెన్నఁడు మున్నగు సేనాపతు లెందరో ప్రోలభూపతి కాలమునఁ గలరు మార్కండేయపురాణకృతిభర్తయగు గన్నసేనాని కూటస్థుఁడగు మల్లసేనానియు, రంగనాథరామాయణవంశావతారికలోని కాటచమూపతియు, శివయోగసారమునఁ బేర్కొనఁబడిన ఇందులూరిగౌరనార్యుఁడు, జ్ఞానవాసిష్ఠరామాయణమునఁ బేర్కొనఁబడిన మొలుంగూరుపాలకుఁడగు రుద్రమంత్రియుఁ బ్రోలరాజునకు సమకాలికులు వీరలందఱు ప్రోలరాజునకుఁ బ్రతినిధులుగ నాంధ్రదేశమునందలి పలుతావుల రాజ్యపరిపాలనము గావించిన ప్రసిద్ధులు వీరల వివరములఁ దెలుపు ప్రత్యేకశాసనములకొఱకెక్కువ కృషి గావింపవలసియున్నది

## ప్రోలరాజు లలితకళాభిమాని

అనుమకొండలోని కోటమైదానమునకుఁ జేరఁబోవునపుడు శిథిలద్వారశకలములు తొలుత గోచరించును పిదప మహోన్నతమగు ద్వారము గోచరించును ఈద్వారముప్రక్కనుండి మంటికోటపైకిఁ బోయి కొండ యెక్కినచో ప్రోలరాజు కట్టించిన దృఢతరము మనోహరము సువిశాలము దుర్గమము అగు ఱాతికోట దృక్పర్వము గావించును కోటగోడలపయిని వేసిన పరుపుఱాళ్ల పొంకము, అవి కదలకుంటకై చేసిన సీలసంతెన, నేఁటికిని నాఁటిశిల్పమును స్మరింపఁజేయుచున్నవి కోటమైదానములోని సిద్ధేశ్వరాలయము ప్రోలరాజు నెలకొల్పినదే ఇందు శిల్ప మంతగా లేదుగాని శిలానిర్మాణము, దృఢతరమగు భిత్తికాకల్పనము చూడఁదగినది బాలసముద్ర మనుపేర నీనృపాలుఁడు నిర్మించిన తటాకము నేఁటికిని జెక్కుచెదరని యున్నతమగు కట్టతో అగాధజలవంతమై సుస్థిరముగా నున్నది వీథులలోఁ గనుపించు వీరశిలలు, నందులు, జైనవిగ్రహములు, లింగములు, లతాకృతులు గల స్తంభములు, శిథిలములై పూఁడిపోవనున్న వాపీసముదాయము నేఁటికిని బరిశోధకుల దృష్టి కుత్సాహకరములుగా నున్నవి ఏకశిలానగరనిర్మాణ మత్యాశ్చర్యకర మైనది ద్వారములు, మెట్లు, బురుజులు, విగ్రహములు, ప్రోలరాజునకుఁ గల లలితకళాభిరతికిఁ దార్కాణములు

ప్రోలరాజు వాఙ్మయమునకుఁ గావించిన మహోపకృతులు మఱచితిమి కాని యీతనికాలమున నగునూరు, మాటేరు, గూడూరు మున్నగు తావులఁ దెనుఁగుఁబద్యములతో శాసనములు నెలకొల్పఁబడినవి ప్రబంధకవిత కవి పైచేయిగ నున్నవి అందుచేఁ బ్రోలభూవిభుఁడు ఆంధ్రకవితారసికుఁ డనియుఁ గవితాకళోద్ధారకుఁ డనియుఁ జెప్పవచ్చును ప్రోలభూవల్లభుఁడు జైనుఁడు కాకపోయినను దన కోటయావరణములోనున్న జైనవిగ్రహముల సురక్షితముగ నుంచి భిక్షుకుల రాకపోకల కనుమతి యొసంగెను తాను శైవుఁ డయ్యు సిద్ధేశ్వరభక్తుఁ డయ్యు జైనులపైనఁ గాని, జైనభిక్షులపైనఁ గాని భిన్నభావము ప్రకటింపక కేవలరాజ్యాభివృద్ధియే ప్రదానలక్ష్యముగాఁ జూచుకొని కాలము గడపెను ప్రోలరాజు విశేషించి తన రాజధానీనగరమగు అనుమకొండలో సర్పప్రతిష్ఠలు, భైరవప్రతిష్ఠలు, కాళీప్రతిష్ఠలు, శివాలయప్రతిష్ఠలు గావించుచు వైదికమతాభిమానము వెల్లడించుచుంటచే జైను లీనృపాలునియెడ భిన్నాభిప్రాయముతో వర్తించుచుండె రనుటకుఁగూడ నవకాశములు గలవు

## ప్రోలరాజు కుటుంబము

ఈనృపాలునిభార్య ముప్పమదేవి చిరకాలమున కీదంపతుల కిరువురు తనయు లుద్భవించిరి జ్యేష్ఠుఁడు రుద్రదేవుఁడు, కనిష్ఠుఁడు మహాదేవరాయలు కుమారు లిరువురకు శివనామము లుంచుటగూడ నీతఁడు జైనుఁడు కాఁ డనుట కాధారముగఁ దీసికొనవచ్చును రుద్రదేవుఁడు భారద్వాజగోత్రుఁడును, శ్రౌతక్రియాకర్ముఁడును, సమస్తశాస్త్రపారంగతుఁడును నగు రామేశ్వరదీక్షితునియొద్ద సమస్తవిద్యలను, రాజనీతిశాస్త్రము నభ్యసించి కవితారచనమునందుసైతము నేర్పు గడించెను ప్రోలరాజు తన కుమారుఁడగు రుద్రదేవునిబాహుపీఠికపై రాజ్యలక్ష్మి నుంపకముందె అకాలమృత్యువువాతఁ బడెను రుద్రదేవుఁడు పితృమంత్రియగు గంగాధరుఁడు, సేనాపతియగు కాటయనాయకుఁడు

౧ చూ మాటేరుశాసనము.

మున్నగువారిసాహాయ్యమున రాజ్యేందిరను వరించి ప్రతిపక్షబృందమును వధించి శిల్పమునకుఁ గవితకుఁ జేయూఁత నొసంగి సోమనాథాదిమహాకవులచేఁ గవితారచనమునకుఁ బ్రోత్సహింపఁబడి యచిరకాలమున వాణీవిలాసాశ్రయుఁ డయ్యెను రుద్రదేవుఁడు తంద్రికాలమున వడఁగి మడఁగియున్న విరోధిబృందమును నుక్కడంచి అనుమకొండ రాజధానిగ నుంటకుఁ దగదని యోరుఁగంటికిఁ దన రాజధానిని మార్చికొనెను ఈయంశము శివయోగసారమునసైతము కలదు

"తరల అనుమకొండపురింబు గా దని యావిభుం డిల నోరుఁగ
ల్లనుపురంబు ఘటించి యచ్చటి కచ్చుగా నరుదెంచి య
మ్మనుజనాథుఁడు నాయకత్వము మల్లమంత్రికిఁ బిన్నమ
ల్లనకు ధారుణి పెద్దసంప్రతి నాతతంబుగ నిచ్చినన్"

అమ్మనుజనాథుఁడు అనుచో రుద్రదేవుఁ డని పూర్వోక్తపద్యమువలన స్పష్ట మగును ప్రోలరాజు క్రీ శ ౧౧౨౬ మొదలు ౧౧౬౦ వఱకు రాజ్యమును బరిపాలించె నని చరిత్రకారులు నిర్ణయించియున్నారు

## అనుమకొండలోని దృశ్యములు

మాధవవర్మమొదలుకొని పలువురు రాజులు అనుమకొండను రాజధానిగఁ బాలించినను బ్రోలభూపాలునివంటి స్వాతంత్ర్యశీలుఁడు మున్నెన్నఁడు అట నుద్భవింపలేదు సమయ మెఱింగి ప్రోలభూవల్లభుఁడు చాళుక్యరాజ్య మస్తమింపఁగనే ఆంధ్రసామ్రాజ్యమును నెలకొల్పి ఆంధ్రజాతి మఱచిపోరానంతటి మహోపకృతి గావించి యాంధ్రవ్యక్తిత్వము నిలువఁబెట్టెను భవిష్యదాంధ్రనగరమునకుఁ బునాది వేసెను ఆంధ్రజాతియం దంతర్లీనమైన పౌరుషము, రాజనీతి, కార్యజ్ఞత సామ్రాజ్యనిర్మాణమునం దన్వయింపఁజేసెను ఈ వీరాధివీరుఁడు పరిపాలించిన ఆంధ్రనగరరాజమగు అనుమకొండపురమున నాఁటి ప్రాచీనచిహ్నము లుపేక్షాదృష్టితో నాశనము గావింపఁబడుచున్నవి ప్రోలరాజు కట్టించిన యాలయములలో సిద్ధేశ్వరాలయముదక్క దాదాపుగ మిగిలినదేవళము లన్నియు నశించినవి నగరముచుట్టునున్న మంటికోట క్రమముగా రూపుమాయుచున్నది ఆంధ్రసామ్రాజ్యలక్ష్మీవిహారరంగమగు రాజమందిరప్రధానద్వారము కూలిపోవ సిద్ధముగా నున్నది రుద్రదేవనరపాలకుని బాల్యవిహారభూమియు అశేషభూపాలమౌళిరత్నఘృణీవేష్టితమును ప్రోలభూపాలరత్నసింహాసననిలయము నగు అనుమకొండకోటమైదానములో నొకప్రక్క శవదహనము, మఱియొకప్రక్క శవఖననము, ఇంకొకపైపున మలమూత్రవిసర్జనాయలములు నెలకొనియుంట సంతాపకరము ఆంధ్రుల వ్యక్తిత్వము పదియవశతాబ్దమునుండి సర్వతోముఖముగ వెలుంగుట కాస్పదమైన పుణ్యభూమి కాలిడరానంతటి హేయపద మగుటతోఁగాక యచటి శిథిలములుగూడ భగ్నాతిభగ్నము లగుచుంట చరిత్రవిదుల కెంతేని సంతాపకరము లనుటలో సంశయ ముండదు ఏనాఁటికేని ప్రోలరాజు సమాధి, ముప్పమదేవి సహగమన మొనరించినతావు, మాధవవర్మ బాణవిద్య నభ్యసించిన నెలవు, కుంతలదేవి మరణించిన ప్రదేశము గ్రంథాంతరసాహాయ్యమున దృఢపడినచో విణ్ణుమిత్రాలయములతో శ్మశానవాటికలతో నిండిన కోటమైదానములోని యాపవిత్రస్థలముల గురుతింపఁగలుగుట యెట్లు? కావున అనుమకొండనగరవాసు లీపవిత్రస్థలమును సాదరభావముతోఁ దిలకించుచు నున్నచో ఆంధ్రులు తమ యభ్యున్నతి కాస్పదమగు మాతృమండలసందర్శనమునకుమహోత్సాహముతో నుత్సవమునకు వచ్చునట్లు తండోపతండములుగ నేతేర నవకాశము గలుగఁజేసినవార లగుదురు

## ఆంధ్రసోదరులవిధి

కాకతీయసామ్రాజ్యమునకుఁ బ్రహ్మస్థానమగు కోటమైదానమునకు ముందున్న సింహద్వారములు కూలనున్నవి శిలాశాసనములు నానావిధముల నష్టము లగుచున్నవి వినోదార్థముగ బాలురు అపూర్వశిల్పరమణీయములగు విగ్రహముల నోపినకొలంది పాడుచేయుచున్నారు జీర్ణాలయములు తమ గృహావరణలో నుండఁగాఁ బలువురు రూపుమాపి గృహనిర్మాణము గావించుచున్నారు ఈయకృత్యములు దేశమం దంతటను జరిగినటులె కాకతీయాంధ్రసామ్రాజ్యప్రధానస్థలమునఁగూడ జరుగుచున్నవి సాంత్వనోక్తులతో నిట్టి యకృత్యముల నాఁపుట మానవధర్మము ప్రోలభూవల్లభుని శాసనచిహ్నములు ఆంధ్రదేశమునిండఁ గలవు ఎన్నటికేని యం దపూర్వచరిత్రస్థములు చిహ్నితములైనట్లు తెలిసికొంటిమేని కూన్యస్థలములో వాని దర్శింపఁజాలము ఏకశిలాశకల మేయపూర్వచరిత్రసిద్ధాంతమున కాస్పద మగునో యని సర్వవిధములఁ బ్రాచీనచిహ్నములఁ గాపాడుట మానవధర్మము

ఆంధ్రసోదరా! అనుమకొండలోని ప్రోలభూవిభుని స్మారకచిహ్నములయెడ నాదరదృష్టి ప్రసరించి దేశచరిత్రము నుద్ధరింపుము

తే గీ. పాడ వడంగిన యాంధ్రుల పూర్వయశము
మాటువడె భగ్నపాషాణమండపముల
అరసి పూర్వతరఖ్యాతి కలరుదేని
యరుగుడె మ్మనుమకొండ కోయాంధ్రపుత్ర!

# అది ఉల్లాసకరముగ నున్నదని నీవే చెప్పెదవు

## ఆ సుఖము నీకే తెలియును

నిర్మలత్వము

సుగుణము

పరిమళము

మితవ్యయమునకు

దివ్యమని పేరు పొందినది

అన్ని షాపులలో దొరకును




పదార్థచయముచేత, పనితనము, గుణము,

శోభ, విలువవలన

డ్రేల్స్

మాల్టైన్

గ్లిజరిన్

సబ్బు

## తప్పక స్వీకరించదగిన సబ్బు అని మీకే తెలియును.

దానిని వెలుతురులో చూచినయెడల స్వచ్ఛముగ తెలియునంత నిర్మలమైనది

అతి స్నిగ్ధమును శాస్త్రీయము నగు దాని పనితనము వర్ణనాతీతము దాని పరిమళము హృదయాకర్షణీయము

ఇక చాలకాలము అరిగిపోకుండునట్టి దాని గుణము దివ్యాతిశయము

కాగితమంత సన్నగ అరిగిపోయినను, మొదటిదానివలెనే అంత చక్కగ పనిచేయును

సోల్ ఏజెంట్లు —

# ఏ. వి. ఆర్. ఏ. ఆడికప్ప శెట్టి,

బొంబాయి. 52, బందరు వీధి, జి. టి. మదరాసు. కొలంబో.



# ఫిర్దౌసీ

పురిపండా అప్పలస్వామిగారు (కవితాసమితి)

పారసీకకవులలో సుప్రసిద్ధుడైన ఫిర్దౌసీచరిత్ర గమనింపదగినది. అతని జీవితము ఉత్సాహంతో ప్రారంభమై విషాదముతో ముగిసినది గజనిమహమూదుచేత వంచితుడై నిరాశాదుఃఖాలతో అతడు చరమదశ గడపి ప్రాణాలు విడిచేడు.

ఫిర్దౌసీ నిజమైనపేరు హుస్సేను 'ఫిర్దౌసీ'అనేది అతని ఉపనామము. పారసీకకవు లందరు ఇలాంటి మారు పేరులే పెట్టుకున్నారు. అది వారి సాంప్రదాయం

ఫిర్దౌసీతండ్రిపేరు ఇసాఖ్ హిజరీ ౩౨౯ ప్రాంతాన్ని "తౌసు"అనే పట్టణంలో ఫిర్దౌసీ జన్మించాడు అతడు జన్మించేటపుడు ఇసాఖు ఒకకల గన్నాడు తన కుమారుడు ఒకవృక్షముమీద పాడుతూవున్నట్లు, చుట్టు చేరి ప్రజలు కరతాళధ్వనులు చేస్తువున్నట్లు అతడు కలలో చూచాడు. దీని ఫలితం ఏమిటని జ్యోతిషవేత్తలని విచారించగా తన కుమారుడు ఒక మహాకవి అవుతాడనీ, అతని కీర్తి ప్రపంచమంతటా వ్యాపిస్తుందని వారు చెప్పారు జ్యోతిషవేత్తల వాక్యములు ఏమాత్రము అసత్యము కాకుండా ఫిర్దౌసీ తన కీర్తిచంద్రికలని ఈనాటివరకు విశ్వమంతటా ప్రసరింపజేస్తూనే ఉన్నాడు

అతడు బాల్యమునుండీ చాల గ్రంథాలు చదివి, మంచి విజ్ఞానాన్ని ఆర్జించేడు చక్కని కవిత్వపటుత్వము, 'కత్తివంటి పదునుగల భాషాశైలి', అలవడ్డతరువాత అతడు "షాహనామా" అనే ఉద్గ్రంథము వ్రాయ మొదలు పెట్టేడు "షాహనామా"అనగా "రాజులచరిత్ర" అని అర్థం పారశీకరాజుల వీరచరిత్ర అందలి కథావిషయం ఫిర్దౌసీకి పూర్వమే "షాహనామా" "దఖీఖీ"అనే కవి ప్రారంభించి వేయిపద్యాలవరకు వ్రాసి తాను ప్రేమించిన ఒకబానిసచేతి కత్తికి బలిఅయి మరణించాడు.[౧]

ఫిర్దౌసీ వ్రాయ సంకల్పించగానే అతని కలలో కనపడి "షాహనామా నేను ప్రారంభించి కొంత వ్రాసి నశించాను నీవు ఆభాగం అట్లే వుంచి మిగిలినది మాత్రము వ్రాసి, దీనివిషయంలో మరొక అభాగ్యుడు కూడ కృషిచేసేడని లోకం గుర్తించేటట్టు చెయ్యి"అని దఖీఖి చెప్పేడు ఫిర్దౌసీ తక్కిన భాగమే వ్రాయ మొదలు పెట్టేడు షాహనామా "బాహిరీ-తాఖ్ రబ్"అనే పార్సీ వృత్తములో అరవయివేల పద్యాలతో కూడిన గ్రంథం. ప్రపంచములోని గొప్ప ఇతిహాసగ్రంథాలలో ఇదొకటి. ప్రాగ్దేశానికి ఇది హోమరుకవి గ్రీకుభాషలో వ్రాసిన "ఇలియడ్" వంటిదని పాశ్చాత్యపండితులు వ్రాశారు, జర్మని, ఫ్రెంచి, ఇటలీ, ఇంగ్లీషు మొదలైన అనేకభాషల లోనికి దీని పరివర్తనము జరిగినది[౨]

౧ 'దఖీఖీ'గూర్చి ఫిర్దౌసీ తన షాహనామాలో ఇలా వ్రాసేడు "దురభ్యాసాలు అతని మిత్రులైనవి మృత్యువు ఆకస్మికంగా వచ్చి తన నల్లని కిరీటం అతని నెత్తిమీద కప్పింది, తన జీవితాన్ని దుర్గుణాలకి అప్పగించాడు భూదేవి అతనికి నిజమైన సుఖం ఒక్క రోజయినా యివ్వలేదు అతని బానిసచేతిలోనే అతడు గతించాడు"

౨ మనవారు భారతం, భాగవతం, రామాయణాలని పదేపదే తెనిగించడంకంటె విశ్వసాహిత్యంలోని ఇలాంటి గ్రంథాలు తెలుగుచేయడం ఉత్తమమైనదని గుర్తించడం అవసరం షాహనామా కొంతభాగము తెనిగించి "పారశీకధరాధీశ చరిత్రము" అనేపేరుతో శ్రీ రాజా రంగయ్యప్పారావుగారు ౧౮౯౯-వ సంవత్సరంలో ప్రకటించారు కాని దీని ప్రతులు ఇప్పుడు లభించడంలేదు.

తన గ్రంథముగూర్చి ఫిర్దౌసీ ఇట్లు వ్రాసికొన్నాడు' "షాహనామా చదివే ప్రతివ్యక్తి స్త్రీయైన, పురుషుడైన వీరకృత్యాలు చేయడానికి సంసిద్ధు లవుతారు".

"నేటి గృహాలు ఎండవానలకు నశించగలవు కాని తుపాను, వర్షం, ఏవీ నేను కట్టిన ఈకావ్యసౌధాన్ని పడగొట్టలేవు."

"స్వర్గం నాకవిత్వంముందు శిరస్సు వాల్చింది"

ఫిర్దౌసీ షాహనామా వ్రాస్తున్నవిషయం దేశంలో వ్యాపించింది ' అతని కావ్యం విన్నవారంతా అతనిని సన్మానిస్తూవుండేవారు ఈవార్త కొంతకాలానికి గజనీ పురసుల్తాను మహమూదు ఆస్థానంలోకికూడ ప్రాకింది భారతదేశంమీదకి అనేకదండయాత్రలు సాగించిన గజనీ మహమూదుపేరు మనలో చరిత్ర తెలియనివారికికూడ తెలుసు అయితే అతనిని ఒక భయంకరవిధ్వంసకారుడుగమాత్రమే చాలమంది యెరుగుదురు కాని అతడొక గొప్ప శిలాపోషకుడు, భాషోద్ధారకుడు

ప్రపంచంలోని సంపద, నిధులు, అమూల్యవస్తు సామగ్రి, అంతా తన భాండారంలో చేర్చడమే అతని సంకల్పం, అతని పిపాస. ఈపిపాసే అతనిని అన్నిదండయాత్రలు చేయించింది. అన్ని దేవాలయాలని నాశనం చేయించింది. అతని నొక రాక్షసుడుగ మార్చివేసింది.

ప్రపంచంలోని అమూల్యవస్తువుల నెలాగయితే తన భాండారంలోకి చేర్చేడో అలాగే సుప్రసిద్ధులైన కవులని, పండితులని, గ్రంథాలనికూడ తన ఆస్థానంలోకి చేర్చేడు. అతని ఆస్థానంలో నాలుగువందలమంది కవులు, పండితులు వుండేవారు వారిలో 'అన్సరీ' అనేవానిని కవిసార్వభౌమునిగ యేర్పరచి వారికి విశేషమైన ధనం ప్రసాదిస్తూ వుండేవాడు ఒకసారి అన్సరీ ఒక మంచిపద్యం చదవగా అతనినోరు రత్నాలతో నింపేశాడు. అతని ఆస్థాన కవుల్లో క్రయిస్తవులు, యూదులు, మొదలైనవాళ్లతో పాటు హిందువులుకూడ సన్మానం పొందుతూవుండేవారు. పారశీకవాఙ్మయానికి మహమూదు చేసినసేవ ఇంకెవ్వరు చేసిఉండరు

ఫిర్దౌసీవృత్తాంతము విని సుల్తాను తన ఆస్థానానికి రప్పించేడు ఫిర్దౌసీ తన వ్రాతగ్రంథంతో గజనీపురం చేరేడు. సుల్తానుఆస్థానం చేరేముందు అక్కడ ఒక చిత్రమైన సంఘటనం జరిగినది.

గజనీపట్టణముబైట ఉద్యానవనంలో అతనిని అన్సరీ, అస్జాదీ, ఫరూఖి, అనే ముప్పురు ఆస్థానకవులు కలుసుకున్నారు పల్లెటూరివానిలాగు కనిపిస్తూవున్న ఫిర్దౌసీని చూచి 'నీవెవ'రని అతని వారు ప్రశ్నించగా "నే నొక కవిన"ని అతడు బదులుచెప్పేడు నాగరికులైన వారు అతనిని పరీక్షించవలె ననేఅభిప్రాయంతో షఁ అను అంత్యప్రాసతో కూడిన పద్యపాదములు తలా వొకటి చదివేరు పారశీకవాఙ్మయంలో షఁ అనే అక్షరంతో ముగిసే శబ్దాలు మూడుమాత్రము వున్నవి నాల్గవది ఫిర్దౌసీయే చెప్పేడు

ఆపద్యభావాన్ని ఈక్రింద వ్రాస్తున్నాను—

అన్సరీ—చంద్రుడు నీచెక్కులంత ప్రకాశమానం కాదు

అస్జాదీ—నీముఖంవంటి పువ్వు ఈతోటలో లేనే లేదు

ఫరూఖి—నీకనుబొమలు కవచాన్నయిన దూసి కొనిపోతవి.

ఫిర్దౌసీ—పిషాన్ యుద్ధంలో జియో యొక్క ఈటె వలె.

నాల్గవపాదం ఫిర్దౌసీ పూర్తిచేయగానే అతని అసాధారణమైన కవితాశక్తికి ముగ్గురూ ఆశ్చర్యపడి, వారికంటె అతడు ప్రతిభావంతుడని గుర్తించి వారిలో ఒకనిగ చేర్చుకున్నారు

సుల్తానుఆస్థానం ప్రవేశించి ఫిర్దౌసీ తన కావ్యంలో నుండి "సోరబురుస్తము"ల కథాభాగం వినిపించేడు అతని ఆవేశకరమైన రచనానైపుణ్యానికి సుల్తానుఆస్థానమంతా

దిగ్భ్రమచెంది అతనిని వేనోళ్ల ప్రశంసించారు కవిసార్వభౌముడు అన్సరీ లేచి అతనిచేతులు ముద్దుపెట్టుకున్నాడు సుల్తాను సింహాసనం దిగిపోయి మహాగౌరవాన్ని ప్రదర్శించి "షాహనామా" తన ఆస్థానంలోనే వుండి ముగించమని కోరేడు ప్రతిపద్యానికీ ఒక సువర్ణదీనార మిస్తానని వాగ్దానం చేసేడు సుల్తానుకోరిక కాదనలేక ఫిర్దౌసీ సమ్మతించేడు

సుల్తాను అతనికి విశాలమైన భవనం, తగిన సామగ్రి, తాను నెలకొల్పిన పెద్దగ్రంథభాండాగారం, మొదలైనవి ఇచ్చి, అన్ని సౌకర్యాలూ యేర్పరచినాడు గ్రంథవిషయా న్ననుసరించి అతని మందిరంలో జాతీయవీరుల చిత్రపటాలు అలంకరింపజేసేడు.

ఫిర్దౌసీ తన శక్తినంతా వినియోగించి, ముప్పది సంవత్సరాలు శ్రమించిగ్రంథం పూర్తిచేసి సుల్తానుచేతిలో పెట్టేడు

సుల్తాను తన వాగ్దానం చెల్లించుకోవలసివుంది. కాని ఆకృతఘ్నుడు ఏమాత్రమూ హృదయంలేనివానివలె ప్రవర్తించాడు సువర్ణదీనారాలకి బదులు వెండి నిష్కములు కొన్ని సంచులలో వేసి ఫిర్దౌసీకి పంపినాడు కవిఅయినవానికి ఇంతకంటె అవమానం యేమి వుంటుంది ? ఫిర్దౌసీ ఈఅవమానం సహించలేకపోయాడు

ఆహతాశుడు, అవమానంతో, దుఃఖంతో క్రుంగిపోతూ ఇతరులకు తెలియకుండా గజనీపట్టణము విడిచి వెళ్లిపోయాడు పోయేటప్పుడు ఒకదుప్పటి, ఒకకర్రమాత్రం తనతో తీసుకున్నాడు. అప్పటికి అతని వయస్సు డెబ్బదివత్సరములు దాటినది.

వెళ్లిపోయేముందు తన ఆవేదనని తెలుపుతు కొన్ని పద్యాలు వ్రాసి సుల్తానుకు పంపేడు. నగరంలోని పెద్ద మసీదుమీద తన హతాశని వెల్లడిస్తూ వొకపద్యం వ్రాశాడు.

దేశచరిత్రలోవలె వాఙ్మయంలో కూడ సుల్తాను అపకీర్తిని ఈపద్యాలు చిరస్థాయిగ చేసివేసినవి.

పట్టణం విడిచి ఫిర్దౌసీ వెళ్లిపోయినసంగతి విని సుల్తాను అతనికోసం ఆరునెలలు వెదకించాడు. కాని, మరల లభించలేదు

ఫిర్దౌసీ దేశసంచారం చేస్తూ బగ్దాదుపట్టణం చేరుకున్నాడు దారిలో అతనిని అందరూ సన్మానం చేసేవారు కాని సుల్తానుమహమూదుకు భయపడి ఆశ్రయం ఇవ్వలేకపోయేవారు. ఫిర్దౌసీ తరువాత 'యూసూఫు-జులేఖా' అను ప్రేమకావ్యం వ్రాశాడు కొంతకాలానికి అతని స్వగ్రామం "తౌసు" చేరుకున్నాడు

ఇలావుండగా ఒకసారి సుల్తాను హిందూదేశం ముట్టడి ముగించి తన పట్టణం వెళ్లిపోతూ మార్గంలో ఒక శత్రువులకోట ముట్టడివేశాడు ఈవార్త తెలిసి కోటలోనివారు ఫిర్దౌసీ ఒకపుడు వ్రాసిన "నీకంటె గొప్ప చక్రవర్తులు ఎందరో ఈప్రపంచంనుండి వెళ్లిపోయారు నీ వెంతకాలం ఈదండయాత్రలు చేస్తుంటావు" అను భావంగల పద్యభాగం వ్రాసి సుల్తానుకు పంపారు.సుల్తాను సిగ్గుతో ఆముట్టడి విరమించి ఫిర్దౌసీఉనిక తెలిసికొని గజనీ పట్టణము చేరినతరువాత క్షమాపణ తెలుపుతూ అతనికి తొలివాగ్దానం చేసిన ధనముకంటె అధికముగా రాయబారులచేతి కిచ్చి పంపించేడు

కాని ఫిర్దౌసీ ఆసన్మానం చూడలేకపోయాడు. రాయబారులు తౌసునగరం చేరేసరికి అతడు మర్త్యలోకం విడిచి వెళ్లిపోయాడు ధనరాసులతో వారు పట్టణములోనికి ఒకద్వారమునుండి ప్రవేశిస్తుండగా అతని మృతకళేబరము మరొకద్వారంనుండి కదలిపోయింది.

---




# ఆపస్తంబుఁడు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీ నమ ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యః

తా మంత్రములం జేసినట్టియు, సంప్రదాయప్రవృత్తిచే మంత్రములం బాలించునట్టియు ఋషులకొఱకు నమస్కారము

విజ్ఞానధురంధరులగు మహర్షులకు మన భరతఖండము పుట్టినిల్లు అందు బారతి జాత్యంతరఖ్యాతులగు నాంధ్రజాతిలోని విజ్ఞానధురంధరులలో "ఆపస్తంబుఁడు" అగ్రగణ్యుఁడు కుమారిలభట్టాచార్యుఁడు, దిఙ్నాగాచార్యుఁడు, పండితరాయఁడు, ఆంధ్రజాతి పండితులలో వన్నెకెక్కినవారై యాంధ్రేతరదేశములలోఁ బ్రసిద్ధినొందినవారయ్యు, ఆపస్తంబునివలె మహర్షిత్వము నొందినవారు గారు పాణినిమహర్షిచే మహర్షి యనిపించుకొని పరాశరయాజ్ఞవల్క్యస్మృతులతోఁ బేర్కొనఁబడిన ధర్మములుగల యాపస్తంబుఁడు గల యాంధ్రజాతి పొగడఁదగిన జాతి యనఁబడును ఆపస్తంబునితో సమానుఁడగు మహర్షి యాంధ్రులలో మఱియొక్కఁడు కలఁడా? అట్టి యాపస్తంబుఁడెప్పటివాఁడు? ఎచ్చటివాఁడు? అప్పటి యాచారపద్ధతు లెట్టివి? వాని విజ్ఞాన మెట్టిది? వీనింగూర్చి నాశక్తికొలఁది వ్రాయుచున్నాను

## ఆపస్తంబుని కాలము

ఈ కాలమున మన వాఙ్మయములోని ప్రతియంశమును పాశ్చాత్యులే ముందుగఁ బరిశీలించి మనకు మార్గదర్శకు లగుచున్నందుల కొకప్రక్క సంతోషమును, మనవారి యౌదాసీన్యమున కొకవంక సంతాపమును నొందవలసియున్నది మన వేదచతుష్టయము నాంగ్లీకరించిన, 'గ్రిఫిత్తు' వలె మన శతపథబ్రాహ్మణము నాంగ్లీకరించిన "యగ్లింగు" వలె, మన ఋగ్వేదమును ముద్రింపించుటకు సంపాదకుఁడగు "మాక్సు ముల్లరు" వలె మన యాపస్తంబ ధర్మసూత్రముల నాంగ్లీకరించుటకు జర్మనుజాతిజుఁడగు "బుహ్లరు" దొర కారకుఁడయి యున్నాఁడు బుహ్లరు గారు తమ యాంగ్లీకరణ ధర్మసూత్రపు పీఠికలో నాపస్తంబుని కాలముఁగూర్చి విపులముగాఁ జర్చించి యాపస్తంబుఁడు ప్రసిద్ధవ్యాకరణశాస్త్రకర్తయగు "పాణిన్యాచార్యున" కించుమించు సమకాలికుఁడై క్రీ పూ పంచశతవత్సర ప్రాంతపువాఁడై యుండునని నిశ్చయించియున్నాఁడు అనఁగా పాణిన్యాచార్యులును క్రీ పూ అయిదవశతాబ్దపువాఁడనియు, ఆపస్తంబుఁడు నప్పటివాఁడేయనియు బుహ్లరుగారి తాత్పర్యమైయున్నది మఱియు బుహ్లరుగారు ఆపస్తంబుఁడు క్రీస్తుశకారంభమున నుండునేమో యనికూడ ననుమానించినారుకాని వారిచ్చిన యాధారములే వారిని బాధించుటచే నాపస్తంబుని క్రీ పూ ౫౦౦ సంవత్సరములకు వెనుకకు నెట్టికొనిపోయినారు ఆనెట్టివేయుటకుఁ గల కారణములు —

(౧) పాణినివ్యాకరణమున కందుబాటుగాక "ప్రాతిశాఖ్య" (వేదములోని శబ్దనిష్పత్తిని జేయు వ్యాకరణము)చేతనే నిష్పత్తింజేయఁగలపదముల నాపస్తంబుఁడుపయోగించుట,

(౨) శతపథబ్రాహ్మణ, ఛాందోగ్యోపనిషత్తులలోఁ బేర్కొనఁబడిన "శ్వేతకేతువు" అనుఋషిని "అవరులలోఁ" (చిన్నవారలలో) జేర్చుట—అనునవి ముఖ్యములు

పైరెండంశములఁగూర్చి యించుక విచారింతము ఆపస్తంబుఁడు పాణిన్యాచార్యుని స్మరింపలేదుగాని పాణిన్యాచార్యుఁడు ఆపస్తంబుని మహర్షిగానె యెఱిఁగియుండుటచేఁ బాణిని మహర్షికంటె చాల ప్రాచీనుఁడనవలసియుండును చూడుఁడు: అష్టాధ్యాయి ౪-౧-౧౦౪ (బిదాదిగణము) అందు భరద్వాజాదులతో నాపస్తంబునిగలిపియే కంఠోక్తిగాఁ జెప్పియున్నాఁడు కాని యా 'బిదాదిగణము'లో ఋషులు కానివారుగూడ చెప్పఁబడుటచే గొందఱు సందేహము నొందవచ్చును పాణినియొక్క యష్టాధ్యాయిలోని గణము లన్నిటికి నత్యుత్తమమగు "గణరత్న మహోదధి"యను

నిఘంటువును వర్ధమానపండితుఁడు క్రీ శ ౧౧౩౯ సం॥ రమున రచియించియుండెను అందు బిదాదిగణములోని యాపస్తంభభరద్వాజులు మహర్షులనియే వ్రాసియున్నాఁడు కాపాణిని చెప్పిన యాపస్తంబశబ్దమును బుల్హారుగారు చూచియుండలేదు ఇంతమాత్రమెకాదు పాణిన్యాచార్యులు తన యష్టాధ్యాయియొక్క "కృశాశ్వాది" గణములో పరాశరశబ్దమును గ్రంథకర్తృపరముగాఁ జెప్పియున్నాఁడు ఆసూత్రప్రకారము పారాశరీయమను గ్రంథ మర్థమగును అది పరాశరస్మృతి యనవచ్చును పరాశరస్మృతిలో ధర్మశాస్త్రకర్తయగు నాపస్తంబుని ధర్మశాస్త్రము పేర్కొనఁబడెను చూడుఁడు —

శ్లో॥ శ్రుతా మే మానవా ధర్మా వాసిష్ఠాః కాశ్యపా స్తథా,
ఆపస్తంబకృతా ధర్మాః శంఖస్య లిఖితస్యచ

ఆచారకాండ, ౧౪ శ్లో

తా (వ్యాసుఁడిట్లు పరాశరునితో ననుచున్నాఁడు) "ఓ తండ్రీ నేను, మనువుచే, వసిష్ఠునిచే, కశ్యపునిచే, ఆపస్తంబునిచేఁ జేయఁబడిన ధర్మములను, శంఖునియొక్క, లిఖితునియొక్క ధర్మములను వినియుంటిని" అని చెప్పియున్నాఁడు ఇందువలనఁ బరాశరస్మృతి పుట్టుటకుఁ బూర్వమె యాపస్తంబుఁడు ధర్మసూత్రములను రచియించె ననుట స్పష్టమగుచున్నది ఇంతమాత్రమెకాదు యాజ్ఞవల్క్యస్మృతికి మనుస్మృతితో సమానమగు గౌరవము దాని ప్రాచీనతచేఁ గలిగియున్నది ఆస్మృతిలోఁ గూడ నిట్లు గలదు —

శ్లో॥ మన్వత్రివిష్ణుహారీతయాజ్ఞవల్క్యోశనోంగిరాః,
యమాపస్తంబహారీతకాత్యాయన బృహస్పతీ
పరాశరవ్యాసశంఖలిఖితా దక్షగౌతమౌ,
శాతాతపో వసిష్ఠశ్చ ధర్మశాస్త్రప్రయోజకాః

యాజ్ఞవల్క్యస్మృ ఆ

తా మనువు, అత్రి, విష్ణువు, హారీతుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, ఉశనుఁడు, అంగిరసుఁడు, యముఁడు, ఆపస్తంబుఁడు, కాత్యాయనుఁడు, బృహస్పతి, పరాశరుఁడు, వ్యాసుఁడు, శంఖుఁడు, లిఖితుఁడు, దక్షుఁడు, గౌతముఁడు, శాతాతపుఁడు, వసిష్ఠుఁడు అనువారలు ధర్మశాస్త్రకర్తలు

ఈ యంశముల నొక యాజ్ఞవల్క్యశిష్యుఁ డెవరికో చెప్పియుండెనని విజ్ఞానేశ్వర పండితుఁడు తన యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యయగు "మితాక్షరి"లో వ్రాసియున్నాఁడు అందువలన నాపస్తంబుఁడు క్రీ పూ ౫ వ శతాబ్దమునకుఁ జాలపూర్వపువాఁడనుట స్పష్టము ఇపుడు కాన్పించు పరాశరయాజ్ఞవల్క్యస్మృతులు క్రీ పూ ౧ వ శతాబ్దము మొదలు క్రీ పూ ౬ వ శతాబ్దములోపున రచింపఁబడియుండునని కొందఱును, అంతకు పూర్వపువే యని మఱి కొందఱును తలంచుచున్నారు కౌటిల్యుఁడు (క్రీ పూ ౩౨౦) పరాశరుని ప్రాచీనాచార్యుఁడనె శ్వేతకేతువు నవరులలోఁ జేర్చియుండుటచే శ్వేతకేతువుకంటె నాపస్తంబుఁడు పెద్దవాఁడేమోయని బుల్హారుగారనుమానించినారు అదియు నసంభవమే యగును కారణ మేమనఁగా ఆపస్తంబుఁడు శ్వేతకేతువు నవరులలోఁ జేర్పలేదు తనకాలమునుండిన యవరలలోఁ గొందఱు శ్వేతకేతువువలె స్వల్పకాలము బ్రహ్మచర్యనియమముల నాచరించియే పూర్వపుణ్యవిశేషముచే వేదజ్ఞులగుచున్నా రనినాఁడు చూడుఁడు ఆపస్తంబధర్మసూత్రము,

సూ నియమేషు తపశ్శబ్దః

తా బ్రహ్మచారి ఆచార్యాదీనుఁడై చేయవలసిన నియమముల తపశ్శబ్దమని వాడఁబడును

సూ తదతిక్రమే విద్యాకర్మ నిస్స్రవతి బ్రహ్మసహాపత్యాదేతస్మాత్.

తా అట్టితపస్సు నతిక్రమించుటచే విద్యాకర్మ వ్యాపింపదు దీనివలన బ్రహ్మవిద్యను పిమ్మట తన కుమారునిగూడ బ్రహ్మచారి పొందింపలేఁడు

సూ కర్తపత్య మనాయుష్యంచ

తా నియమమును బాటింపక విద్యాగ్రహణమును జేసినయెడల "శ్వభ్ర"మను నరకమునఁ బడును ఆయుర్దాయముగూడ తగ్గును

సూ తస్మాద్ఋష యోఽవరేషు న జాయంతే నియమాతిక్రమాత్.

తా అట్టినియమములను సలుపకపోవుటచేతనే యిప్పటివారియందు (కలియుగమున వర్తించువారియందు లేక చిన్నవారియందు) ఋషులు పుట్టుచుండుటలేదు

సూ శ్రుతర్షయస్తు భవంతి కేచి త్కర్మఫలశేషేణ పునస్సంభవే

తా కొందఱు కర్మఫలశేషముచేత, పునర్జన్మము నొంది యిపుడును వేదర్షులై పుట్టుచున్నారు (అనఁగా పూర్వజన్మమున నియమము ననుసరించి యథోక్త బ్రహ్మచర్యముఁ జేసి వేదర్షులై తత్ఫలశేషము ననుభవించుటకుఁ బునర్జన్మము నెత్తి యిపుడును బ్రహ్మర్షులగుచున్నారు దీని కుదాహరణ మేమనఁగా) సూ. యథా శ్వేతకేతుః

తా శ్వేతకేతువట్లో అట్లు శ్వేతకేతు వనువాఁడు "ఉద్దాలక ఋషిపుత్త్రుఁడు అతఁడు పండ్రెండేఁడులు వచ్చువఱకు విద్యాభ్యాసముఁ జేయక, తండ్రి యట్లుండుట యుక్తముగాదని బోధింప, గురుకులముం జేరి పండ్రెండేఁడులుమాత్రమే నియమములఁ జేసి సాంగచతుర్వేదియై యిరువదినాలుగేండ్లు వచ్చునప్పటికి తనయింటికి వచ్చెను అనఁగా ప్రతివేదమును శాస్త్రము ననుసరించి పదిరెండేఁడులు చొ॥ నాలుగువేదములు నలువదియెనిమిదేండ్లభ్యసింపవలసియుండఁగా శ్వేతకేతువు వేదముల నన్నిటిని పండ్రెండు వత్సరములలోన నేర్చివచ్చియున్నాఁడు అట్లే యిప్పటివారలలోఁ గొందఱు పూర్వపుణ్యవశమున స్వల్పకాలములో సాంగవేదవేత్తలై వేదర్షు లగుచున్నారని తన

కాలపు వృత్తాంతము నాపస్తంబుఁడు తన ధర్మసూత్రములలో వ్రాసి యున్నాఁడు. *

పైసూత్రములోని శ్వేతకేతూదాహరణము ఇంతకుఁబూర్వము చెప్పఁబడిన యవరులకై యీయఁబడుటచే బుల్హారుగారు శ్వేతకేతు వాపస్తంబునికంటె చిన్నవాఁడగుటచేతనె యట్లు వ్రాసియున్నాఁడనిరి కాని పైసూత్రమునకు "హరదత్తాచార్యుఁడు" తన యుజ్వలా భాష్యమున ఛాందోగ్యోపనిషత్తులోని వాక్యముల నుదాహరించి యుండుటచే నాపస్తంబుఁడు ఛాంగోగ్యముఁ జదివి తత్ప్రతిపాదితుఁడగు శ్వేతకేతువునే తనకాలముననుండిన కుశాగ్రబుద్ధిగల యొక శ్రుతర్షిం గాంచి శ్వేతకేతువువంటివాఁ డపుడపుడు పుట్టుచుండునని వ్రాసియుండరాదా? నే నొక యేకపత్నీవ్రతస్థుఁడగు మహారాజును మనస్సున నుంచికొని 'రాజులకు నన్యస్త్రీసంగమాభావము దుర్లభము, కాని శ్రీరామునివంటివాఁ డపుడపుడు పుట్టుచుండును' అని వ్రాసిన యెడల నేను శ్రీరామునికాలపువాఁడ నగుదునా? అట్లే యాపస్తంబుఁడు శ్వేతకేతువుకాలపువాఁడు కాకుండినను "ఛాందోగ్యోపనిషద్గ్రథను"గాంచి శ్వేతకేతువు నేల తనకాలపు కుశాగ్రబుద్ధియగు శ్రుతర్షి ...నముగా వ్రాయరాదు? బుల్హారుగా రింకొక యసందర్భపు ...సిరి "ఆపస్తంబుని కాలమునకు వేదర్షులకాల మతిక్రమించి ... కారణము "అవరులలో వేదర్షులు పుట్టుచుండుట ...పస్తంబుఁడు వ్రాసెనఁట! ఇదియు నసంగతపు వ్రాఁతయె ఆపస్తంబునికంటె శ్వేతకేతువు చిన్నవాఁడైనచో యాజ్ఞవల్క్యుఁడును ఆపస్తంబునికంటెఁ జిన్నవాఁడె యగును యాజ్ఞవల్క్యుఁడు శ్వేతకేతుని తండ్రియగు నుద్దాలకునికడ వాజసనేయశాఖ (శుక్ల యజుర్వేదము) నభ్యసించినటులు బృహదారణ్యకోపనిషత్తు కడపటను కలదు. ఛాందోగ్యబృహదారణ్యకోపనిషత్తులలోని శ్వేతకేతు, యాజ్ఞవల్క్యుల చరిత్రలను జూచిన నాకాలమున వేదర్షులు తరపరంపరలుగాఁ బుట్టియున్నారని చెప్పవచ్చును అట్టి యెడ వేదర్షుల కేమి కొదువ? కాన బుల్హారుగారి వ్రాఁత లపాస్తములు. మఱియు నాపస్తంబుఁడు "గృహస్థుఁ"డైనను వత్సరమునకు రెండేసిమాసములు నియమములతో గురుకులముం జేరి విద్యాభ్యాసముఁ జేయవచ్చు ననుటకు శ్వేతకేతువుయొక్క యభిప్రాయము నిటులు వ్రాసియున్నాఁడు—

సూ నిశే వృత్తే సంవత్సరేసంవత్సరే ద్వౌద్వౌమాసౌ సమాహితః, ఆచార్యకులే వసే ద్భూయః శ్రుతి మిచ్ఛ న్నితి శ్వేతకేతుః

ఏతేన హ్యహం యోగేన భూయః పూర్వస్మాత్కాలా చ్ఛ్రుత మకుర్వీత

తచ్ఛాస్త్రై ర్విప్రతిషిద్ధం ఆ ధ ప్రశ్న ౧౩ ఖండ

తా గృహస్థాశ్రమమునఁ బ్రవేశించినను శ్రుతి నిచ్ఛయించు గృహస్థుఁడు ప్రతివత్సరము నాచార్యకులమున రెండేసిమాసములు సమాహితుఁడై యుండి విద్యను నేర్చుకొనవచ్చునని శ్వేతకేతువు (తన శిష్యులతోఁ జెప్పెను)

ఈనియమముచేతనె, నేను పూర్వకాలమున శ్రుతి నభ్యసించితిని అనికూడ శ్వేతకేతువు చెప్పెను అట్లు శ్రుతి నభ్యసించుట శాస్త్రములచేఁ బ్రతిషేధింపఁబడదు అనికూడ శ్వేతకేతువు చెప్పెను

పైకారణములచే శ్వేతకేతుఁడు పెద్దవాఁడై శిష్యులకుఁ బ్రత్యేకమొకవిధముగ శ్రుత్యభ్యాసమార్గముం గనిపెట్టి చెప్పినపిమ్మటను ఎంతయో కాలము గడచినపిమ్మటనే యాపస్తంబుడు ధర్మసూత్రములను వ్రాసియుండెనేకాని, ఆపస్తంబుఁడు తనకంటెఁ జిన్నవాఁడగు శ్వేతకేతుని యభిప్రాయములను వ్రాసియున్నాఁడని తలంప నించుకంతయుఁ బొసఁగదు

మఱియు నాపస్తంబుఁడు* ఉపబృంహితముగా స్వీకరించిన యజుర్వేదకారకములలోని "స్వాధ్యాయబ్రాహ్మణము"న, వేదాంగములుగా యాస్కుని నిరుక్తము గాని, లగధుని వేదాంగజ్యోతిషముగాని చెప్పఁబడియుండలేదు యాస్కుఁ డను ఋషి శుక్లయజుశ్శాఖాప్రవర్తకఋషిపరంపరలోని వాఁడుగా బృహదారణ్యకోపనిషత్తుయొక్క అధ్యా ౪, బ్రాహ్మణము (౬)న జెప్పఁబడియున్నాఁడు వేదాంగజ్యోతిషకర్తయగు "లగధుఁడు" క్రీ పూ ౧౨ వ శతాబ్దపు వాఁడని యాతని గ్రంథములోని గణితముచేఁ దెలియఁబడుచున్నట్లు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు వ్రాసియున్నారు అట్టి "యాస్కలగధుల" నిరుక్తజ్యోతిషములు రెండును ఆపస్తంబునిచే వేదాంగ విద్యలుగాఁ జెప్పఁబడినవి చూడుఁడు ఆ ధ ౨-౫-౧౧

శ్వేతకేతువు పాండవపురోహితుఁడగు ధౌమ్యుని శిష్యుఁడగు నుద్దాలకునిపుత్త్రుఁడు మఱియు పాండవప్రపౌత్రుఁడగు జనమేజయునిచే యజ్ఞముం జేయించిన యాజ్ఞవల్క్యుఁడు వ్యాసశిష్యుండగు వైశంపాయనుని శాపమునకుఁ బాత్రుఁడై కృష్ణయజుస్సు విడిచి పై యుద్దాలకునికడ శుక్లయజుస్సు నభ్యసించి వాజసనేయశాఖాప్రవర్తకుం డయ్యెను. పై యంశములు మత్స్యభాగవత పురాణములు, బృహదారణ్యకోపనిషత్తును జెప్పుచున్నవి శతపథబ్రాహ్మణమున శ్వేతకేతుయాజ్ఞవల్క్యు లిరువురు మిథిలాపురి కేఁగుచుండిన యంశము చెప్పఁబడెను పైకారణములచే శ్వేతకేతుయాజ్ఞవల్క్యులు పాండవప్రపౌత్రుఁడగు జనమేజయుని కాలపువారై మహాభారతయుద్ధానంతరము ౧౫౦ సంవత్సరములనాఁ డుండిరనుట

*వేదములోని యొకవాక్యముఁ దీసికొని వ్యాఖ్యానప్రాయముగా సూత్రమును రచించుట ఈయుపబృంహితవాక్యముల ప్రసక్తి బ్రహ్మసూత్రములకుఁ గలదు,

స్పష్టము. మహాభారతయుద్ధము క్రీ. పూ. ౧౫, ౧౬ శతాబ్దములలో నైయున్నదని “మహాభారత చరిత్రమున పురాణముల ననుసరించి నిరూపించియున్నాను. అందువలన శ్వేతకేతు యాజ్ఞవల్క్యులు క్రీ. పూ. ౧౪వ శతాబ్దపు ప్రాంతమువారై యుండుట స్పష్టము. అట్టి శ్వేతకేతుమతము నుదాహరించినట్టియు క్రీ. పూ. ౧౨ వ శతాబ్దములోని “లగధుని” వేదాంగజ్యోతిషము నుగ్గడించినట్టియు ఆపస్తంబుఁడు శ్వేతకేతులగధులకుఁ దరువాతను, పాణినిచే మహర్షి గాఁ బేర్కొనఁబడుటచేఁ బాణినికిఁ బూర్వమునను నుండును. పాణినిమహర్షి క్రీ.పూ. ఆఱు అయిదు శతాబ్దములలో నుండక క్రీ పూ. ౮ వ శతాబ్దమున నుండెనని కొందఱు తలంతురు. పాణిని “శ్రమణా, లోకాయత” అను బౌద్ధజైనమత శబ్దముల నుచ్చరించుటచే నాతఁడొకవేళ క్రీ పూ. ౫, ౬ వ శతాబ్దములలో నుండిన నుండవచ్చును. అట్టిపాణినికి ఋషియైన యాపస్తంబుఁడు లగధునకుఁ బిమ్మటివాఁడై క్రీ. పూ. ౧౦౦౦ సంవత్సరములప్రాంతమున నుండును.

మఱియు నాపస్తంబుఁడు విద్యాప్రశంసలో షడంగముల పేరు నెత్తెనే గాని, సాంఖ్యయోగ, వైశేషిక, న్యాయ వేదాంతదర్శనముల పేరులం దలపెట్టలేదు. పూర్వమీమాంసాదర్శనమును న్యాయదర్శనముగాఁ జెప్పియున్నాఁడు ఉపనిషత్తులలోఁ గొన్ని యప్పటికిఁ బొడమాపియున్నవి. ఐతరేయ, శతపథబ్రాహ్మణములు, బృహదారణ్యకములోని 3 మొదలు ౮ వఱకుఁ గల బ్రాహ్మణము లప్పటికిఁ బుట్టలేదు ఆపస్తంబుఁ డత్యంతకర్మవాదియైనను అద్వైతపరబ్రహ్మోపాసనమునం దభిలాషముకలవాఁడు. అతని యధ్యాత్మవిద్యావిశేషము, ఆ. ధ. ప్ర. ౧, ఖం. ౨౨, ౨౩ లలోఁ జెప్పఁబడెను. ఈ రెండుఖండములకు శ్రీమచ్ఛంకరభగవత్పాదులు చేసిన భాష్య మిటీవల తిరువాన్కూరుమహారాజావారి పుస్తకభాండాగారమునకుఁ జేరినదట! ఆపస్తంబుని యధ్యాత్మసూత్రములకును, బాదరాయణుని బ్రహ్మసూత్రములకుఁ గల తారతమ్యముఁ బరిశీలింపవలసియున్నది. పాణినికాలమునకు షడ్దర్శనములు పుట్టినటులం గాన్పించును. అనఁగా ఆపస్తంబ పాణిన్యాచార్యులయొక్క నడుముకాలముననే పూర్వమీమాంసకాక తక్కిన దర్శనములు పుట్టియుండును. ఆదర్శనము లైదును బుట్టుటకించుమించు నాల్గువందల సంవత్సరములకాలమైన నగునుగాన ఆపస్తంబుఁడు క్రీ. పూ. ౧౦౦౦ సంవత్సరములనాఁటివాఁడని తలంపుచు, డాక్టరు బుల్హారుగారు చెప్పినటులు క్రీ. పూ ౫౦౦ నాఁటివాఁడును, శ్వేతకేతువునాఁటివాఁడై క్రీ. పూ. ౧౪-వ శతాబ్దపువాఁడును గాఁడని దృఢముగాఁ జెప్పఁగలుగుచున్నాను.

చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రులచరిత్ర మొదటి భాగమున బోధాయనాపస్తంబులు క్రీ. పూ. ౪౭౭ ౩౨౩ సం॥రముల మధ్యకాలపువారని యేకారణమున వ్రాసిరో తెలియకున్నది. అది యెంతమాత్రము పొసఁగదని నాతలంపు. మఱియు పాణినికాలమున నాయుధధారణము బ్రాహ్మణులకు నిషేధముగా లేదనియు, నాయుధజీవులగు బ్రాహ్మణులు కలరనియు అష్టాధ్యాయియొక్క ౪-౩-౯౧ సూత్రపు ప్రసక్తిచే నూహింపఁబడుచున్నది. తత్పూర్వమున నుండిన “సిధియనుల పారశీకుల”దండయాత్రలచే నాపద్ధర్మముగా బ్రాహ్మణులాయుధజీవకులై యాత్మసంరక్షణమునకుఁ గడంగిరేమో? ఆపస్తంబునినాఁడుమాత్రము బ్రాహ్మణున కాయుధధారణము నిషిద్ధమని యాతఁడు కంఠోక్తిగాఁ జెప్పియున్నాఁడు

## ఆపస్తంబుఁ డాంధ్రుఁడు

ఆపస్తంబుని కల్పసూత్రము ననుసరించి కర్మకలాపముల నాచరించు ద్విజులలో నూటికి డెబ్బదిమంది యాంధ్రజాతిలోనె కలిగియుండుటచేతను, “చరణవ్యూహ” మను నొక ప్రాచీనగ్రంథములో ‘మహార్ణవతంత్రము’నుండి యెత్తివ్రాయఁబడిన యీ క్రిందిశ్లోకముల చేతను ఆపస్తంబుఁ డాంధ్రుఁడనియు, ఆపస్తంబునిచే “సుపబృంహితమైన” యజుర్వేదకారకము, ఆంధ్రపారము ననుసరించియుండుట జాడ (కారకపారము ద్రావిడుల కొకవిధము నాంధ్రులకొకవిధము గలదు) ఆపస్తంబుఁ డాంధ్రుఁడేయని దృఢపఱచుచునదియు యుక్తి ప్రత్యుక్తులచే బుల్హారుదొరగారు వ్రాసినందుల కాంధ్రు లాఁ గృతజ్ఞులు కావలసియున్నది వా రుదాహరించిన చరణములు:—

శ్లో. పృథివ్యా మధ్యరేఖాచ నర్మదా పరికీర్తితా,
దక్షిణోత్తరయో ర్భాగే శాఖాభేదశ్చ ఉచ్యతే.
నర్మదాదక్షిణే భాగే హ్యాపస్తంబాశ్వలాయనీ,
ఆంధ్రాదిదక్షిణాగ్నేయీ గోదాసాగర (పా) వధి,
యజుర్వేదస్తు తైత్తిర్యో హ్యాపస్తంబీ ప్రతిష్ఠితా

పైశ్లోకములలోని స్ఖలితముల నార్షసదృశములను చదువరులు గ్రహింతురుగాక

తా. భూమధ్యరేఖయందు నర్మదానది చెప్పఁబడెను. ఆనదికి దక్షిణోత్తరభాగములలో శాఖాభేదము చెప్పఁబడెను. నర్మదానదికి దక్షిణభాగమున ఆపస్తంబ, ఆశ్వలాయన, శాఖలు కలవు ఆంధ్రమున దక్షిణాగ్నేయదిక్కులలోను గోదావరిమొదలు సాగరమువఱకును యజుర్వేదముయొక్క తైత్తిరీయశాఖ (ఆపస్తంబీయము) ప్రతిష్ఠింపఁబడెను.

పైశ్లోకముల భావము నాలోచింపఁగా నాపస్తంబశాఖ మన యాంధ్రదేశమునఁ బ్రవేశపెట్టఁబడెనని కాన్పించునుగాని యాపస్తంబుఁ డాంధ్రదేశస్థుఁడని కాన్పింపదు అగుఁగాక! క్రీ. పూ వేయిసంవత్సరములనాఁ డీయాంధ్రావనిలో నాపస్తంబునివంటి బ్రహ్మర్షి పుట్టుటకు దగినబ్రాహ్మణజాతి కలదా? ఎక్కడ రాక్షసావృతమగు దండకారణ్యాంతర్భాగమగు నాంధ్రదేశము? ఎక్కడ శస్త్రగ్రహణము,



వైశ్యసేవాసదనము, ఆంధ్రయువతీసంస్కృత కళాశాల, రాజమండ్రి (ఉపాధ్యాయులు, విద్యార్థినులు)



వైశ్యసేవాసదనము, రాజమండ్రి (సంగీతము తరగతి)



హిందీప్రేమీమండలి, రాజమండ్రి



జస్టిస్, సర్. వేపా రామేశం పంతులుగారు



జస్టిస్, సర్. వేపా రామేశం పంతులుగారికి న్యాయవాదుల విందు



మద్రాసు హైకోర్టు



నూతన మద్రాసు న్యాయవాది సంఘము

బ్రాహ్మణున కుండరాదని చెప్పెడి యాపస్తంబుని సాత్విక బ్రాహ్మణ్య ము ? ఖరాసురయుద్ధానంతరమునుండి చంద్రగుప్త చక్రవర్తి పాటలీ పురము నేలువఱకుఁ గల యామహాయుగకాలములో నాంధ్రదేశపుచరి త్రము అందీభూతముగానే యున్నది. అరణ్యానిగల యాంధ్రావనిలో చంద్రగుప్తున కేడువందలయేండ్లకుఁ బూర్వమునుండిన యాపస్తంబుఁ డు ఇపు డాఫ్గనిస్థానములోనిదగు గాంధార దేశవాసియగు పాణిన్యాచా ర్యునకుఁ గాని, మిథిలాపురిలోని యాజ్ఞవల్క్యస్మృతికర్తకుఁ గాని హిమాలయస్థమగు బదరికాశ్రమమునఁ జేయఁబడిన పరాశరస్మృతి కర్తకుఁగాని యెట్లు తెలిసియుండును ? కాన ఆపస్తంబుఁ డాంధ్ర దేశమున జన్మింపలేదు. ఆర్యావర్తమున నర్మదానది కుత్తరభాగమున నెచటనో జన్మించి యచటనే మహర్షియై తన కల్పసూత్రములను రచించి ప్రఖ్యాతి నొందియుండును అందువలననే యార్యావర్త మున నతనికి నతని ధర్మసూత్రములకుఁ బ్రఖ్యాతి కలిగెను కాని యతఁ డెటు లాంధ్రుఁ డగును ? ఆంధ్రులనువా రిప్పటి యాంధ్రదేశస్థులే యనియు, యుగాంతరములనుండి యిచటనే వీరు నివసించియున్నా రనియుఁ దలంపరాదు. విశ్వామిత్రుని సంతతివారే తచ్ఛాపోపహ తులే, యాంధ్రు లగుచెడల రామాయణముయొక్క బాలకాండములోని యఱువదియొకటవసర్గములోని గాథను జదివినయెడల నయోధ్యకుఁ బశ్చిమభాగమున విశ్వామిత్రుఁడు తన తనయులకు శునశ్శేపుని కారణ మున శాప మిచ్చినటులఁ గాన్పించును. ఐతరేయబ్రాహ్మణమునను శునశ్శేపుని కారణముననే విశ్వామిత్రుఁడు తన కుమారులకు శాప మిచ్చినట్లున్నది. ఆశాపోపశాంతి వేయివత్సరముల కగునని శ్రీమద్రా మాయణముననే కలదు చూడుఁడు

శ్లో॥ మునేస్తు వచనం శ్రుత్వా మధుష్యందాదయ స్సుతాః,
కథ మాత్మసుతం హిత్వా త్రాయసేఽన్యసుతం విభో.
అకార్యమివ పశ్యామ శ్వమాంసమివ భోజనే.

తా. (శునశ్శేపునకు బదులు నాతని కొమరులలో నొకని యజ్ఞపశువుగాఁ బొండని విశ్వామిత్రుఁ డనఁగా) తత్సుతులగు మధు ష్యందాదులు విని—ఓమునివర్యా ! ఎట్లు తన కుమారుని విడిచి యన్యుని పుత్రునిఁ గాపాడఁదలంచితివి ? దీనిని భోజనమునందు కుక్క మాంసమువలె గర్హింపుచున్నామని నిరాకరించిరి. అపుడు విశ్వా మిత్రుఁడు కోపముతో నిట్లనుచున్నాఁడు—

శ్లో. శ్వమాంసభోజిన స్సర్వే వాసిష్ఠాఇవ జాతిషు,
పూర్ణం వర్షసహస్రంతు పృథివ్యా మనువత్స్యథ.

తా. ఓపుత్త్రులారా ! మీరు నామాట నతిక్రమించితిరి గాన వసిష్ఠునిపుత్త్రులవలె వేయేండ్లు కుక్కమాంసముం దినుచు భూమి యందు నివసింపుఁడు.

(అంతకుఁబూర్వము వాసిష్ఠులకు శాప మిచ్చియున్నాఁడు.)

పైకారణములచే విశ్వామిత్రుని శాప మాతనిపుత్త్రులగు నాంధ్రు లకు(ఐతిరేయబ్రాహ్మణము ననుసరించి)వేయేండ్లుమాత్రమె భరతఖండ పు పశ్చిమభాగమున నీచత్వ మనుభోక్తవ్యమైయుండును. అందువలననే యాకాలమున నించుమించు బ్రహ్మావర్తదేశమున రచింపఁబడిన మను స్మృతిలో నీచులుగా నుండిన యాంధ్రులను ఆరణ్యపశుహింసకులుగాఁ దత్స్మృతికర్త చెప్పియున్నాఁడేకాని యాపస్తంబునినాఁటి కాంధ్రు లకు నీచత్వము లేదు. శాపమునకుఁ గాలమితి చెప్పఁబడినది. వా రపుడు భరతఖండపు పశ్చిమభాగమున నుండిరి. నాఁటి యాంధ్రుల ప్రాచీనపుభాషాసంప్రదాయము లిపుడు (బ్రాహూయిభాషగా) సింధు దేశములో నొక్కెడ వాడఁబడుచున్నదఁట ! (చూడుఁడు: 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' అను పుస్తకము.) నర్మదానదీతీరమున నిపుడు "హుషంగవాదా" మండలమున నాంధ్రమును మఱచిన యాం ధ్రులు కలరు. "హరికృష్ణశాస్త్రిగా" రనునొక సంస్కృతాంగ్లభాషా పండితులు తా మాంధ్రులమనియు, నాంధ్రమును మరచితిమనియు నాకు వ్రాసియున్నారు. రాజపుత్రస్థానములోని 'కోటా' సంస్థాన మునఁ గొంద రాంధ్రులు కలరఁట ? ఆపస్తంబుఁడును చరణవ్యూహ గ్రంథస్థభావముచే నచ్చటివాఁడే కావచ్చును. ఆతఁ డౌత్తరాహుల యాచారములఁ గొన్నిటిని చేర్కొనియున్నాఁడు. పాంచాలకాశ్మీ రాదిదేశముల యాచారము లాతనికి భిన్నముగాఁ గాన్పించుటచే నటులు వ్రాసియున్నాఁడు. కాన సర్వవిధముల నాపస్తంబుఁ డాంధ్రుఁడే యైయున్నాఁడుకాని, ప్రస్తుతము మన మేదేశము నాంధ్ర మనుచుంటిమో యట్టి యాంధ్రదేశమునమాత్ర మాతఁ డుండ లేదు.

ఆతనికాలమున నీయాంధ్రావని సాత్వికబుధ్యప్రవిష్టప్రదే శమై కిరాతావృతమై యున్నదని నాతలంపు.

## ఆపస్తంబునినాఁటి యాచారములు

ఆపస్తంబునినాఁటి శ్రోత్రియాచారము లీనాఁటి యాంధ్ర దేశములోని శ్రోత్రియులు తలంచుటకైన నిష్టపడనిరీతిగాఁ గొన్ని యున్నవి

౧. శ్రోత్రియుఁ డింటికి వచ్చినయెడల సేవకులగు నిద్దఱు శూద్రులచే కుండలతో నీరు దెప్పించి యాశ్రోత్రియుఁడు స్నానా దికమున కుపయోగించునటులఁ జేయవలెను.

౨. ఆర్యాధిష్ఠితశూద్రులు వంటచేసి తెచ్చిన వంటకమును "అగ్నా వధిశ్రిత్య అద్భిః ప్రోక్ష్య" అని తా నగ్నియం దొకమా రుంచి దింపి నీటిని ప్రోక్షించి యభిమంత్రణఁజేసి దేవపితృకార్యాదుల కుపయోగించుట.

3. అల్లుఁడు, ఆచార్యుఁడు, ఏలిక, ఋత్విక్కు తన యింటికి వచ్చినపుడు మాంసాహారము నిచ్చుట.

౪. పితృశ్రాద్ధములలో ననేకవిధములగు మాంసములను భోక్తల కుపయోగించుట.

ఇట్టివి నేటికాలమున కేవగింపుగానుండునుగాని మఱికొన్ని నేఁటి కాలమ్మున కావశ్యకములు, నపేక్షణీయములు నైయున్నవి. అందు ముఖ్యమైనది వివాహవిధి. పెండ్లికుమారుఁడు కన్యాదాతయింటికి వచ్చి ప్రధానహోమాంతకార్యమె, కన్యాదాతయింట జరిపికొని, పిమ్మట పెండ్లికుమార్తెను వాహనముపై నెక్కించియో, బండిపై నెక్కించియో, తన గృహమునకుఁ దీసికొనిపోయి ప్రవేశహోమస్థాలీపచనాదికములు తనయింటనే చేసికొనుట.

ఈయంశము భారతీయులకు, అందు బ్రాహ్మణవైశ్యజాతుల వారి కవశ్యకర్తవ్యము. శాస్త్రవిరుద్ధముగాని యీ సంస్కరణముచే నాఁడుపిల్లలం గన్నవారు బాగుపడఁగలరు వరునిపక్షమువారు కన్యాదాతను బీడించి యాతని వేధించుబాధ తగ్గును. దేశీయులయొక్క దురదృష్టవశముచే శాస్త్రసిద్ధమగు వైయాచార మడుగంటినది.

మాంసాహారము నే నిచ్చగింపనుగాని, మాంసము భక్ష్యముగాఁ బరిగణింపఁబడుటచే శూద్రుల వంటకముఁ దినుపద్ధతి దూరమై సాంఘికభేదహేతువై జాతివైషమ్యములకుఁ గారణభూతమైనది అది రానురాను ద్విజులలోనే బ్రాహ్మణులలోనే, యొకరు చూచిన వంటకము నింకొకరు తినరాదను స్థితికి వచ్చినది. శుద్ధశ్రోత్రియులగు నిరువురు భిన్ననాడులుగల బ్రాహ్మణు లొకరియింట నొకరు భుజించుట కిచ్చగింపక పృథక్పాకనియమములు కలవారగుచున్నారు. విశిష్టాద్వైతులలో వడగలి, తెంగలిభేదములు నామధారణముచేతనే విరోధహేతువు లగుచున్నవి. ఇది కలికాలము, దురాచారభూయిష్ఠమయినదని, శ్రోత్రియులు నేటికాలమును నిందింపుదురేగాని, ప్రాచీనాచారపద్ధతుల నవలంబించుట కిచ్చగింపకున్నారు

## ఇతరవిశేషములు

ఆపస్తంబుఁడు తన కల్పసూత్రములన్ను ౩౦ ప్రశ్నములుగా రచించెను. అందు శ్రౌతసూత్రములు మొదటి ౨౪ ప్రశ్నములు. ౨౫ వది పరిభాష. ౨౬, ౨౭ ప్రశ్నములు గృహ్యసూత్రములు. ౨౮, ౨౯ ప్రశ్నములు ధర్మసూత్రములు. ౩౦ ప్రశ్నము శుల్బసూత్రములు.

శ్రౌతసూత్రములలో నాపస్తంబునకుఁ బూర్వమున నుండిన బోధాయనాశ్వలాయనులకు నీతనికి భేద మెట్లుండెనో తెలియదు, గాని ధర్మసూత్రములలో బోధాయనాదుల మతమును ఏకాశబ్దముచే నంగీకారానంగీకారములఁ జెప్పియున్నాఁడు. మను,బోధాయన, యాజ్ఞవల్క్యాదు లంగీకరించిన "నియోగ" పద్ధతిని, బహుధా ఖండించి స్వస్త్రీపాతివ్రత్యముఁ గాపాడుకొనఁ బ్రోత్సాహ మిడినాఁడు అంతుల కప్పటి దేశకాలస్థితులే కారణమైయుండును శ్వేతకేతునినాఁడు స్త్రీపురుషసంబంధము నామమాత్రమై వివాహపద్ధతి నిబంధనాసారములేక యథేష్టవిహారముగా నుండినటుల మహాభారతములోని ఆదిపర్వము ౧౨౦ అ. వలనఁ దెలియనగును తనతండ్రి దగ్గఱ నుండఁగా తనతల్లిని యన్యుఁడు సంతానమునిమిత్తము కోరినపుడు ఆ పద్ధతిని శ్వేతకేతువు గర్హింపుచుండఁ, దండ్రి యుద్దాలకుఁ డది శిష్టాచారమేగాన నిందింపరాదన, శ్వేతకేతు వాయాచారమును మార్చినటులు అందుఁ గలదు ఉద్దాలకుఁడు,ముద్గలుని కుమారుఁడగు నాకుఁడు, కుమారహారీతుఁడు ననువార, దీర్ఘకాల బ్రహ్మచర్యము, చేసినవారు, నియమవ్యతిరేకముగా స్త్రీలం గూడినవారు, శుక్లనష్టరోగముచే మృతినొందుచుండుటయు నిర్వీర్యులగుటయు, లోకములోఁ జూచి యీ క్రిందిరీతిని లోకమునకుఁ జాటిరఁట! చూడుఁడు—

"ఏతద్ధస్మవై తద్విద్వా నుద్దాలక ఆరుణి రాహైతద్ధస్మవై తద్విద్వాన్నాకో మౌద్గల్య ఆహైత ద్ధస్మవై తద్విద్వాన్, కుమారహారీత ఆహ బహవో మర్యా బ్రాహ్మణాయనా నిరింద్రియా విసుకృతోస్మా ల్లోకా త్ప్రయంతి య ఇద మవిద్వాగ్ సోఽపహాయ సంచరంతీతి బహువా ఇదగ్ సుప్తస్యవా జాగ్రతోవా రేతస్కన్దతి." బృహదారణ్యకోపనిషత్, ౬-౪-౪

తా. అరుణుని కుమారుఁ డుద్దాలకుఁడు, ముద్గలుని కుమారుఁడగు నాకుఁడు, కుమారహారీతుఁడు ననువా రిట్లు చెప్పుచున్నారు చాలమంది బ్రాహ్మణులు నిరింద్రియులు సుకృతహీనులునై మృతినొందుచున్నారు ఇట్లగుటకు విద్యావిహీనులై సంభోగముఁ జేయుటయు, జాగ్రత్స్వప్నములయందు రేతస్ఖలన మగుటయే కారణము' అని చెప్పిరి.

(అందులకుఁ గొన్ని ప్రాయశ్చిత్తవిధులు చెప్పఁబడినపిమ్మట నిట్లు చెప్పఁబడెను. ఈచెప్పఁబోవు నంశము వైదికమా మఱియేవరో తెలియకు గాని ప్రక్రమముచే వైదికమే యని తోఁచుచు)

మం." శ్రీర్హవా ఏషా స్త్రీణాం యన్మలోద్వాసా స్తస్మా న్మలోద్వాససం యశస్వినీ మభిక్ర మ్యోపమంత్రయేత."

తా. స్త్రీలలో రజస్వలయై సుస్నాతయైన స్త్రీ శ్రేష్ఠురాలు గాన అట్టిస్త్రీని సమీపించి యభిమంత్రణమును జేయవలెను

అనఁగా నట్టియువతికడ కేఁగి నాతో సంభోగమునకు రమ్మని రహస్యముగా కోరవలయును

మ. సాచే దస్మై నదద్యాత్కామ మేనా మవక్రీణీయాత్
సాచే దస్మై నదద్యాత్కామ మేనాం యష్ట్యావా
పాణినా వోపహత్యాతిక్రామే దింద్రియేణ
తే యశసా యశ ఆదద ఇత్యయశావ భవతి

తా. ఆపురుషుఁడు కోరిన స్త్రీ సంభోగమున కంగీకరింపని యెడల నలంకారాదికము నిచ్చి ప్రేమను కలుగఁజేయవలెను. అపుడును ఆమె యాపురుషునితో సంభోగమున కంగీకరింపనిచో నామెను కఱ్ఱ

తోఁగాని చేతితోఁగాని కొట్టి స్వాధీనముచేసికొని వాయశస్సుచే నీయశస్సును స్వీకరించుచున్నానని యామెతోఁ గ్రీడింపవలయును. అట్లు బలాత్కరించిన స్త్రీ యపకీర్తికలదే యగుచున్నది. (పిమ్మటఁబుట్టఁబోవు కుమారభేదంబుం గూర్చి వ్రాయఁబడిన సంగతులు గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు) ఇట్టి యాచార "ముద్దాలకుని" కాలమున నుండుటచేతనే తన భార్య నొకబ్రాహ్మణుఁడు నీయందు పుత్రుని కనెద ననినపుడు శ్వేతకేతుఁడు తన తల్లి నట్లున్యాయమొనర్పుట కంగీకరింపకుండుటం జూచి యుద్దాలకుఁడు, కుమారా! ఇది పశుపక్ష్యాదులకువలె మనుష్యులలోఁగూడ నుండిన శిష్టాచారమే, యనినాఁడు. శునకమార్జాలాదుల దాంపత్యమువంటి గాంపత్యమే మనుజులలో నాఁడుండెనని మైత్రుంశము చెప్పుచున్నది ఆపస్తంబాశ్వలాయనుల గృహ్యసూత్రరచనాకాలము కీపద్ధతి మారినది. కన్యావరణము, వరాన్వేషణము, మధ్యవర్తులు సంబంధములు కుదుర్చుట, సక్రమవివాహపద్ధతి కల్గినది శ్వేతకేతుఁడు గొప్ప మేధాశాలి; కేకయ, పాంచాల, మిథిలదేశముల పండితపరిషత్తులలోఁ బ్రసిద్ధినొందినవాఁడు మఱియు యాజ్ఞవల్క్యుఁడు ఆతనికి సతీర్థ్యుఁడో, సహాధ్యాయుఁడో యై ఉద్దాలకునికడ శుక్లయజుశ్శాఖ నభ్యసించి ప్రత్యేక మాశుక్లయజుస్సు తనవలననే పుట్టిన దను కీర్తి ప్రపంచవ్యాప్తి యగునటులఁ జేయించుకొని కురుగాంధార పాంచాలదేశములనుండి వచ్చిన మహాపండితమండలిని జనకసభలో నోడించి పండితరాజగు జనకునే శిష్యునిగాఁ జేసికొనినవాఁడు. మఱియు వైశంపాయనుని శిష్యుఁడై యాతని కెదురొడ్డి జనమేజయునిగూడ తనకు శిష్యుంగాఁ జేసికొని శుక్లయజుస్సాంప్రదాయము ననుసరించి జనమేజయునిచే దర్శపూర్ణిమాసేష్టులు చేయించినటులు (మత్స్యపురాణము ౫౦ అధ్యాయమున) కలదు. అట్టివైదికసంస్కర్తమతము ననుసరించియే వాజసనేయులు వేఱొకగృహ్యసూత్రము నేర్పఱచిరి. అదియు నాపస్తంబ సూత్రమునందువలె వర, కన్యాన్వేషణాదులతోఁ గూడియున్నది. ఆనాఁటి శ్వేతకేతుయాజ్ఞవల్క్యాదుల ప్రబల ప్రయత్నమే వివాహనిబంధనము నేర్పఱచుటకుఁ గారణమై బోధాయనాదులు గృహ్యసూత్రములు చేయుటకు హేతువై యుండును ఆపస్తంబునకుఁ బూర్వమే "బోధాయన మహర్షి" కల్పసూత్రములను రచించెను ఆసూత్రములలోని యనేకాంశముల నాపస్తంబుఁడు తన కల్పసూత్రములకు సంబంధమగునటులం జేసికొనియున్నాఁడు కాని, బోధాయనుని పేరు తన కల్పసూత్రములలో నెచటను జెప్పలేదు ఆపస్తంబుఁడు బోధాయనుని శిష్యుఁడని కూడ లోకమున వాడుక కలదు. తనగురువు పేరునైన సూచింపనంతటి గురుద్రోహియా ఆపస్తంబుఁడు? కాదు. ప్రాచీనాచారములలో శిష్యుఁడు గురువు పేరును జెప్పరాదనుపద్ధతి కలదు అంగువలననే యాపస్తంబుఁడు బోధాయనుని పేరుఁ జెప్పలేదు బుల్హరుగారు, "నియోగపద్ధతి బోధాయనుఁడు చెప్పఁగా నాపస్తంబుఁడు దానిని ఖండించియున్నాఁడు" అని వ్రాసియున్నారు. శాస్త్రచర్చలలో గురువుమతమును శిష్యుఁడు గ్రహస్థైనపిమ్మట ఖండించుట దోషము కాదు యాజ్ఞవల్క్యుఁడు తన కృష్ణయజుర్వేదాధ్యాపకుఁడగు వైశంపాయనమతమును నిరసించి యాతనిచే శప్తుఁడగు జనమేజయమహారాజున కధ్వర్యుఁడయ్యెను. శుక్లయజుర్వేదాధ్యాపకుఁడగు "సుద్దాలకు"నితో జనకసభలో వాదించి యుద్దాలకుని నిరుత్తరుని జేసెను. శ్వేతకేతుఁడు తండ్రియగు నుద్దాలకుని మతమునకు విరుద్ధముగా వివాహవిధిని నెలకొల్పెను అట్లే శంకరాచార్యులవారు తన గురువగు "పతంజలి"యొక్క యోగదర్శనమునకు విరుద్ధముగా నద్వైతసిద్ధాంతమును నెలకొల్పెను అటే యాపస్తంబుఁడును బోధాయనుని నియోగపద్ధతిని ఖండించియుండును.

## మఱికొన్ని విశేషములు

ఆపస్తంబుని గృహ్యసూత్రములు నేఁటి గృహ్యకర్మముల విషయమై సమగ్రముగావు ఆపస్తంబశాఖీయు లాచరించు గృహ్యకర్మములలోని ౧. గణేశపూజ ౨. పుణ్యాహవాచనము ౩. అంకురారోపణము ౪ పాలాశకర్మము (మేధాజననము, దాటవిల్లి యని యుపనయనపు నాలవనాఁడు చేయు కర్మము) ౫ పితృమేధము ౬ బ్రహ్మమేధము అను కర్మలనుగూర్చి యాపస్తంబగృహ్యసూత్రములలోఁ బ్రసక్తిలేదు. మొదటినలుగు కర్మములను బోధాయనసూత్రముల ననుసరించియు, కడపటి రెండుకర్మములను భారద్వాజసూత్రముల ననుసరించియే ఆంధ్రావనిలోని యాపస్తంబీయులు కర్మకలాపములను నిర్వర్తించుకొనుచున్నారు "పుణ్యాహవాచన" నామ మొకచో నాపస్తంబుఁడు (ఆ ధ ౧-౧౩-౯) స్మరించియున్నాఁడు. "మేధాజననకర్మమును" "కేచిత్పాలాశం కర్మకుర్వంతి" అని కేచిత్పక్షమని చెప్పియున్నాఁడు సర్వశుభాశుభకర్మలకు నారంభమునఁ జేయు "విఘ్నేశ్వరపూజకు" మంత్రలింగముగా "బహ్మణస్పతి" స్తుతితోఁ గూడిన "గణానాం త్వా" మంత్రమె యాధారమైయున్నది బోధాయనుఁడు తన గృహ్యసూత్రములలో నొక్కొక్క కర్మమునకు (గృహ్యకర్మలకు) వేర్వేఱుదేవతల నర్చింపవలయునని చెప్పియున్నాఁడు. అంత్యకర్మయనఁబడు "పితృమేధము"నకు భారద్వాజసూత్రములే యాధారమని చెప్పియున్నాను ఆపస్తంబుఁడు బోధాయనుని శిష్యుఁడైనటులు భారద్వాజుఁ డాపస్తంబుని శిష్యుఁడనియు, అంత్యకర్మముతోఁ గూడిన యాసూత్రములు శిష్యుఁడగు భారద్వాజుని పేర నాపస్తంబుఁడే రచించెననియు నాంధ్రావనిలో వాడుక కలదు. ఇపుడు కాన్పించు "తైత్తిరీయశాఖ"కు (కృష్ణయజుర్వేదమునకు) ఖాండికేయశాఖయనియు, ఈశాఖకు (౧) ఖాండికేయుఁడు (౨) బోధాయనుఁడు (౩) భారద్వాజుఁడు (౪) ఆపస్తంబుఁడు (౫) హిరణ్యకేశి, అనువారలు సూత్రకర్తలనియు వాడుక కలదు. ఖాండికేయుఁడు మిథిలదేశపు రాజులలో సీతాజనకునకు నెనిమిదేతరమునకుఁ బిమ్మటివాఁడని కర్మబ్రహ్మవాదియైనటులు విష్ణుభాగవతపురాణములలో వర్ణింపఁబడి

రయుండెను. ఖాండిక్యునికాలముననే కృష్ణయజుశ్శాఖ యంకురించి యుండును. ఆపస్తంబుని కల్పసూత్రములలోఁ గొన్నియెడల తైత్తిరీయబ్రాహ్మణములలోని మంత్రములనే సూత్రములుగాఁ గూర్చియుండుటచేఁ గొందఱు తైత్తిరీయశాఖను ఆపస్తంబశాఖయే యనిరి కాని యాపస్తంబశాఖతో నేవేదభాగమును గానరాదు. ఆపస్తంబుఁడు వేదర్షులు పుట్టుచుండుటలేదని చెప్పుచు క్వాచిత్కముగా నుప్పచించుచున్నారనుటచే ఐతరేయ, శతపథబ్రాహ్మణముల నావిర్భవింపఁజేసిన ఋషులించుమించుగ నీతనికాలపువారైయుండురు బృహదారణ్యకోపనిషత్తుయొక్క ౩ మొదలు ౮ వఱకు నగు బ్రాహ్మణము లాపస్తంబునితరువాత నావిర్భవించిన నావిర్భవింపవచ్చును. కారణ మేమనఁగా బృహదారణ్యకములో గురుపరంపరలం జెప్పునెడల "పరిక్షిత్తనయుఁడగు జినమేజయుని" యశ్వమేధమున కధ్వర్యుఁడగు "తురుఁడు" అనుఋషికి పదిరెండవతరమువాఁడగు "సాంజీవీపుత్త్రుఁడు"ను, ఆకాలముననేయుండిన "యాజ్ఞవల్క్య"నికి ౩౮ వ తరమువాఁడగు "పౌతిమాషీపుత్త్రుఁడు"ను పేర్కొనఁబడుటచే నట్లు తలంపఁబడెను ఆపస్తంబునినాఁటికే కొన్నివేదభాగము లంతరించినటులు (ఆ ధ ౧-౧౨-౧౦) నఁ జెప్పియున్నాఁడు. వాజసయనేయశాఖను బెక్కుసారు లుదాహరించియున్నాఁడు. భవిష్యత్పురాణశ్లోకముల నుదాహరించినాఁడు. ఈక్రింది మునులమతములు పేర్కొనియున్నాఁడు: ౧ శ్వేతకేతుఁడు, ౨. హారీతుఁడు, ౩. మనువు, ౪. కుశికుఁడు, ౫. కౌత్సుఁడు, ౬. వార్ష్యాయణి, ౭. కణ్వుఁడు, ౮. పుష్కరసాది. పైధర్మశాస్త్రకర్తలలో హారీతుని మతమును బెక్కుసారులు తలపెట్టుటఁ జూడ నాతనిమతమునం దీతని కాదరము మెండుగ నుండెనని తోఁచుచున్నది. "కుణికు"ని నీత్యుపదేశములు భారతమునఁ జెప్పఁబడియున్నవి. కణ్వస్మృతి హారీతస్మృతి యనునవి ముద్రితములైనవి కలవుగాని, అవి యాపస్తంబునినాఁటివి కాక నవీనసృష్టిలోనివిగాఁ గాన్పించును ఆపస్తంబునినాఁటికే కల్పసూత్రములు కల్గినటులు చెప్పఁబడెను. అవి, బోధాయన ఆశ్వలాయనులవి కావచ్చును. ఆశ్వలాయనుఁడాపస్తంబునిమామగారనియు, భిన్నసూత్రములవా రన్యోన్యసంబంధములఁ జేసికొనరా దనునియమముండినను ఋగ్వేదకల్పసూత్రకర్తయగు నాశ్వలాయనుని కుమారితను కృష్ణయజుః కల్పసూత్రకర్తయగు నాపస్తంబుఁ డుద్వాహమగుటచే నాంధ్రులలో ఋగ్యజుర్వేదీయు లన్యోన్యము సంబంధములం జేసికొనుచున్నారని పండితు లిదివఱకుఁ జెప్పుచుండిరి. కాని నేఁడా యాచారము మారినది. యజుస్సామవేదులుకూడ నుత్తరసర్కారులలో శిష్టాచారపరులే సంబంధముల నొనరించుకొనుచున్నారు మీ రాపస్తంబులా? ఆశ్వలాయనులా? అనగాఁ రెండును దెలియక మేము "అక్కావారివారి హార్కారులము" అనెడి ప్రాచీనపు సామెతయే నేఁడును బ్రాహ్మణులలో నూటికితొంబదితొమ్మండుగురియెడ స్థిరమైయున్నది. ఆపస్తంబునినాఁటి రాజకీయవిధానముంగూర్చి రెండుమూఁడు మాటలు మాత్రమె చెప్పి యీవ్యాసము ముగించుచున్నాను.

౧. దేశమున క్షామము లేకుండుటకై భోజ్యపదార్థములు, బంగారము, మణులు, మొదలగువాని నెగుమతిచేయరాదు. ౨. తాము కల్పించిన వస్తువులనే యెగుమతిచేయవలెను. ౩. గ్రామమునకుఁ జుట్టును క్రోశము మేరలోను, పట్టణమునకుఁ జుట్టును యోజనము మేరలోను చోరులచే నెవరిద్రవ్యమైన నపహరింపఁబడినయెడల నాద్రవ్యమును రాజద్రవ్యమునుండి సొత్తుకలవానికిఁ బూర్తిగ నిప్పింపవలెను (ఈగ్రామరక్షణవిషయమును గూర్చి యొకప్పుడు జస్టిస్ శంకరనాయరుగారు 'మోడరన్' రెవ్యూలో ఆపస్తంబుని మతమును బేర్కొనియే విశేషముగా వ్రాసియున్నారు)

సూ. నచాస్య విషయే క్షుధా రోగేణ హిమాతపాభ్యాం వసీదేదభావా ద్బుద్ధిపూర్వంవా కశ్చిత్.

(ఆ, ధ ౨-౧౦-౧౧)

తా. రాజుయొక్క పాలనమున దేశములో నెచటను దారిద్ర్యముచేఁగాని బుద్ధిపూర్వకముగాఁగాని యెవఁడును, అన్నములేకను, రోగముతోడను, చలిచేతను, ఎండచేతను బాధపడుచుండరాదు అనఁగా పైబాధలు లేకుండఁగ రాజు పరిశీలనముఁ జేయుచుండవలెను

ఆపస్తంబుని కల్పసూత్రములలోఁ గడపటివగు శుల్బసూత్రములు రేఖాగణితసంబంధములైనవి. అందు ప్రాగ్దిఙ్నిర్ణయాదికముఁ గూర్చి చేసిన విషయములు—సూక్ష్మదర్శిని, దిక్సూచి లేకుండఁగ నాఁటివారు చేసిన యత్యద్భుతవిషయములు పొగడఁదగియున్నవి. ఆపస్తంబుని కల్పసూత్రములపైఁ గల వ్యాఖ్యానములు వారిపేర్లు—

## శ్రౌతసూత్రములు

౧. రుద్రదత్త—రుద్రదత్తుఁడు
౨. వారాహి
౩. దర్శపూర్ణమాసేష్టిభాష్యము—తిమ్మయజ్వ
౪. ఆణివెళ్ల—అండపెల్లుఁడు

## ధర్మసూత్రములు

౧. ఉజ్వలాభాష్యము-(హరదత్తుఁడు)

## గృహ్యసూత్రములు

౧. అనాకులావృత్తి—హరదత్తుఁడు
౨. తాత్పర్యదర్శనము—సుదర్శనాచార్యుఁడు
౩. సింగాభట్టీయము—సింగాభట్టు
౪. ఆణివెళ్ల—అండపిల్లుఁడు
౫. కపర్దిభాష్యము—కపర్ది

## శుల్బసూత్రములు

౧. కపర్ది—కపర్దిస్వామి
౨. కరవింద—కరవిందస్వామి
౩. సుందర



# పరవస్తుపండితత్రయము

యి. యణ్ణి వేఙ్కట వీరరాఘవాచార్యులు గారు

ప్రాక్కథనము:—

శ్రీమత్సకల మహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుంగారి జీవితసంగ్రహమును, వారి ఛాయాచిత్రముతోఁగూడ ౨౦-వ ఆంధ్రపత్త్రిక సంవత్సరాది (ఉగాది) సంచికలోఁ [శుక్ల ౧౯౨౯ సం ౨౬౦ పుట] ప్రచురించియున్నాను. వీరిది పండితవంశము రంగాచార్యులవారి తాతపాదులు 'సర్వశబ్దసంబోధిని' యను సంస్కృతాంధ్రాకారాది నిఘంటువును నిర్మించి వాసిగాంచిరి. రంగాచార్యులవారి దృఢవ్యుత్పత్తి, సర్వంకషప్రతిభ జీవితము ధారవోసి వారు నిర్మించిన 'లఘుశబ్దార్థ సర్వస్వము' అను విజ్ఞానసర్వస్వమే బహుముఖములఁ జాటుచున్నది వీరి కుమారులు శ్రీనివాస జగన్నాదస్వామిగారు పాండిత్యమున జనకుల మించు పుత్త్రులఁట. నేఁడు రంగాచార్యులవారి పౌత్త్రులలో నిరువురు మాత్రము సజీవులైయున్నారు వీరిలో జ్యేష్ఠులంగూర్చి యీవ్యాసమునఁ గడపటిప్రకరణమున వ్రాయఁబోవుచున్నాను తరువాతివారు ప్రకృతము విజయనగరమున మహారాజావారి సంస్కృతకళాశాలలోఁ ప్రధానాచార్యులు (Principal)గా నున్న శ్రీమదాచార్యపరవస్తు వేంకటరామానుజస్వామి (యమ్. ఏ) వారు. వీరీకళాశాలలోనే ౧౬ వత్సరములనుండి విద్యాదాన మొనరించుచున్నారు వీరు ౧౯౧౬ లో సంస్కృతమున శాస్త్రాచార్య (M. A) పరీక్షయందుత్తీర్ణులైరి ఆంగ్లాంధ్రగీర్వాణభాషావాఙ్మయముల నసాధారణపండితులును, శతావధానచతురులును, విజయనగరమునందలి యాంగ్లగీర్వాణకళాశాలల రెంటికిని ప్రధానాచార్యులును, నాంధ్రభీష్ములు నగు శ్రీ దివాన్, బహదూర్, కిళాంబి రామానుజాచార్యులవారు, (M.A, B.L, ౧౯౨౮ లో D. Litt.,) మన రామానుజస్వామివారి కాచార్యులు. జ్యేష్ఠసోదరులవలెనే శ్రీస్వామివారును ప్రాకృతమున నందెవేసిన చేయి. పూనాలోని 'భండార్కర్ ప్రాచ్యపరిశోధకపరిషత్తు'వారు ('The Bhandarkar Oriental Research Institute' of Poona) ప్రచురింపఁబోవు హేమచంద్రుని 'దేశీనామమాల'యను ప్రాకృతకోశము (ద్వితీయావృత్తి)ను రామానుజస్వామివారిచే[*] యిపుడు పరిష్కరింపించుచున్నారు. వీరు జర్మన్‌భాషయందుఁగూడఁ గృతశ్రములు డాక్టర్ లడ్డు పండితుఁడు (Dr T K Laddu, B A., Ph D) శార్మణ్యభాషలో రచించిన "త్రివిక్రమప్రాకృతవ్యాకరణ ప్రవేశిక[¶]" యనుకృతిని వీరాంగ్లీకరించి 'భండార్కర్ ప్రాచ్యపరిశోధక పరిషత్పత్త్రిక[*]'లోఁ ప్రచురించియున్నారు బహుభాషాజ్ఞానమున నసదృశుఁడగు 'సర్ జార్జిగ్రీర్‌సన్' (Sir George A Grierson)పండితునకు సమర్పింపఁబోవు నభినందనోత్సవ సంచిక (Sir G A Grierson commemoration Volume) కు వీరు రచించిన 'కుందమాలలోని ప్రాకృతము' అను నాంగ్లవ్యాసము ముద్రింపఁబడనున్నది ఇంకను వీరు రచించిన 'సంస్కృతనాటకములయందలి కాలవిచారము,' 'సంస్కృతనాటకములందలి విదూషకుఁడు', మొదలగు ననేకపరిశోధకవ్యాసము లనుసంధాయక విద్వాంసులకుఁ బరిచితపూర్వములే

## ౧. శ్రీపరవస్తు వేఙ్కటరంగనాథస్వామిఅయ్యవారలు గారు! [౧౮౭౫—౧౯౧౮]

వీరు మ మ శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుగారి జ్యేష్ఠపౌత్త్రులు పితామహపాదుల చరణసన్నిధినే వీరు శబ్దశాస్త్రమును సమగ్రముగ నధ్యయన మొనరించిరి ప్రాకృతభాషలలో వీరు సిద్ధహస్తులు మొన్న మొన్న దివంగతులైన నిశితధిషణాధురంధరులు శ్రీ పి టి శ్రీనివాసఅయ్యంగారు (M.A., L T,) ను వీరును గలసి శ్రౌతమును సమగ్రముగ వ్యాసంగ మొనర్చిరి విశాఖపట్టణమున గోడేవారి యాస్థానమున తాతపాదుల యనంతరము వీరే పండితపదము నలంకరించిరి. వీరు 'గ్రంథప్రదర్శిని' యను

¶ "Introduction to Trivikrama's Prakrit Grammer"

* X సంపుటము III, IV సంచికలు. ౧౬౬—౨౧౮ పు. జూలై ౧౯౨౯.

నొకసంస్కృతమాసపత్రికను నెలకొల్పి యం దపూర్వములగు ననేక సంస్కృతప్రాకృతగ్రంథములఁ బ్రచురించియున్నారు. కాశిలోఁ బ్రచురింపఁబడు 'చౌఖాంబాసంస్కృతగ్రంథమాల' లోని కొన్ని



శ్రీ పరవస్తు వేంకటరంగనాథస్వామి అయ్యవారలుగారు

గ్రంథములకు వీరు పరిశోధకులు (Editor) గా నుండిరి. సుప్రసిద్ధమగు 'వంగదేశీయాసియాపరిశోధకపరిషత్తు' వారి పత్రికలోను*, ప్రాచీన భారతీయసారస్వతాదికవిచారకమగు 'ఇండియన్ అంటిక్వరీ' పత్రికలోను వీరి వ్యాసము లనేకములు ప్రకటింపఁబడినవి. 'వంగదేశీయాసియా పరిశోధకపరిషత్తు'లో వీరు సభ్యులుగా నుండెడివారు. వీ రాంధ్రీకరించిన 'తిరుమంత్రార్థము' చెన్నపురిఆనందముద్రాలయమువారిచేఁ బ్రకటింపఁబడినది. సుప్రసిద్ధశబ్దశాస్త్రనిష్ణాతులగు [౧౭-వ శతాబ్ది] శేషవంశీయపండితులఁగూర్చి 'ఇండియన్ అంటిక్వరీ' లోను, 'రసియపయాసణం' [రసికప్రకాశనము] అను ప్రాకృత కావ్యముంగూర్చి 'వంగదేశీయాసియా పరిశోధక పరిషత్పత్రిక' (J A S B) లోను వీరు వ్యాసములఁ బ్రచురించియున్నారు. 'చౌఖాంబాసంస్కృతగ్రంథమాల' కు వీరు 'ఆఖ్యాతచంద్రిక' ను బరిష్కరించియుండిరి 'గ్రంథప్రదర్శిని' లో వీరు "త్రివిక్రమప్రాకృతవ్యాకరణము", "మీమాంసార్థసంగ్రహము" మొదలగువానిం బ్రచురించిరి. వీరి నిలయమున ముద్రితాముద్రితములగు ననేకాపూర్వ సంస్కృత ప్రాకృతాంధ్రగ్రంథములు గలవు లండనునగరమునందలి 'ఇండియా ఆఫీసులైబ్రరీ', శార్మణ్యదేశీయ సంస్కృతగ్రంథాలయములు మొదలగు స్థలములఁగల యపూర్వసంస్కృత మాతృకలకుఁ బుత్రికలను వ్రాయించి వీరు తమ యార్ష గ్రంథాలయాభ్యుదయమున కెంతయుఁ గృషిసల్పియుండిరి పాశ్చాత్యసంస్కృతపండిత ప్రకాండుఁడగు నాచార్య 'మెక్డానెల్' (Dr A. A. Macdonell M A, Ph. D.,) ౧౯౦౭ లో భారతవర్షమున సారస్వతయాత్ర సలుపుచు విశాఖపట్టణమునందలి యీ యార్ష గ్రంథాలయమునుగూడ సందర్శించి యున్నాఁడు. కాశీ 'హిందూవిశ్వవిద్యాలయము' స్థాపింపఁబడినప్పుడు వీరందు సామవేదాచార్యులుగా నియమింపఁబడిరి; కాని వీ రా యుద్యోగమునఁ బ్రవేశింపకపూర్వమే, ౧౯౧౭ లో ననాయాసముగ దివంగతులైరి

## ౨. 'విద్యారత్న' శ్రీపరవస్తు వేంకటభట్టనాథస్వామి అయ్యవారలుగారు:—[౧౮౮౪–౧౯౧౬].

వీరు మ మ పరవస్తు వేంకటరంగాచార్యులవారి ద్వితీయ పౌత్త్రులు. తమ పితామహులయొద్దనే వీరు ౧౫-వ సంవత్సరమువఱకు సంస్కృతవిద్య నభ్యసించి, యలంకారశాస్త్రమున నిరూఢప్రజ్ఞను, దర్కశాస్త్రమునఁ బ్రవేశమును బడసిరి వీరు సంస్కృతకవితా నిర్మాణ దక్షులై, 'ఇందుమతీస్వయంవరము' [అముద్రితము] అను నొక నాటకమును రచించిరి. తాతగారు దివంగతులైనపిదప వీరు కొంతకాలము మైసూరునందలి విఖ్యాతపండితులగు శ్రీకస్తూరి రంగాచార్యులవారి యొద్దను, బిమ్మట [౧౯౦౨-౬] గాశిలో నైయాయికసార్వభౌము



'విద్యారత్న' శ్రీపరవస్తు వేంకటభట్టనాథస్వామి అయ్యవారలుగారు

లనఁదగు శ్రీరాఖాలదాస 'న్యాయరత్న' భట్టాచార్యులవారియొద్దను న్యాయశాస్త్రమును గూలంకషముగ వ్యాసంగ మొనరించి, న్యాయమునఁ బ్రథమమధ్యమ పరీక్షలలో నుత్తీర్ణులైరి ఉత్తమపరీక్షకు వ్యాసంగ మొనరించుచుండ వీరి యగ్రజులకుఁ బ్రాణమిత్రులును, విశాఖపట్టమునందలి యాంగ్లకాలాశాల [Mrs A V. N College]

* 'Journal of the Asiatic Society of Bengal.'

కుఁ బ్రధానాచార్యులు నగు శ్రీ పి టి. శ్రీనివాసఅయ్యంగారు వీరిని దమ కళాశాలలో [౧౯౦౬] నాంధ్రపండితపదము నలంకరింపఁ గోరిరి మొదట వీరాంధ్రపండితులుగాఁ గొంతకాల ముండి, పిమ్మట నాకళాశాలలోనే సంస్కృతపండితులుగా నియుక్తులైరి. శ్రీనివాస అయ్యంగారికి మిత్రులును గుంభకోణమునందలి ప్రభుత్వకళాశాలకుఁ 'ప్రిన్సిపాలు'ను నగు జే యేం యేట్సువొరగారు తమ కళాశాలలో సంస్కృతపండితోద్యోగమునకై వచ్చిన యభ్యర్థులఁ బరీక్షింపించి, యందఱిలోను బ్రథములుగ నుత్తీర్ణులగు భట్టనాథస్వామిగారిని సంస్కృతపండితులుగ నియమించిరి ౧౯౧౮ ప్రాంతములఁ బ్రభుత్వమువారు వీరికి విద్యార్థివేతనము [State Scholarship] నొసంగియున్నఁ విద్యాభ్యాసమునకై ఇంగ్లండుదేశమునకు గంపఁ బ్రయత్నించిరి. కాని, వైద్యసంఘమువారు [Medical Board] వీరు పరిపూర్ణారోగ్యమున నుండిరను పత్త్రము [Certificate] నొసంగఁజాలమి నీ భగీరథప్రయత్నము వమ్మయ్యెను. పిమ్మట ౧౯౧౬ లో వీరు కుంభ కోణములోనే దివంగతులైరి.

'బనారస్ సంస్కృతగ్రంథమాల' (Benares Sanskrit Series) కు వీరు శ్రీభగవద్రామానుజాచార్యులవారి 'వేదాన్తదీపము'ను, సుమారవేదాన్తాచార్య శ్రీవరదగురు నిర్మితమగు 'తత్త్వత్రయచులుక సంగ్రహము' ను బరిష్కరించియుండిరి. ఆగ్రంథమాలకే తమ తాత సోదులగు శ్రీనివాసజగన్నాథస్వామి ఆర్యవరగురువులతోఁ గూడ వీరును 'పాణినీయవ్యాకరణ మితాక్షరము' ను బరిశోధించియుండిరి. ఇంకను వీరు సాంఖ్యన్యాయగ్రంథములఁ గొన్ని పరిశోధించిరఁట. 'స్టెన్‌కోనో' (Prof Sten Konow) మొదలగు పాశ్చాత్య సంస్కృతకోవిదులు పరిష్కరింప నసాధ్యమని వక్కాణించిన మార్కండేయకృత "ప్రాకృతసర్వస్వము" ను వీరు పరిశోధించి 'గ్రంథప్రదర్శిని' లోఁ బ్రచురించి విద్వల్లోకము నాశ్చర్యానందనిమగ్నముం గావించిన నిశితధిషణాసంపన్నులు. వీరు 'ఇండియన్ ఆంటిక్వెరీ' పత్త్రికలో సారస్వతచారిత్ర విచారకములగు ననేకవ్యాసరాజములఁ బ్రచురించియున్నారు సుప్రసిద్ధచారిత్రకవిద్వాంసుఁడగు 'వి.ఏ.స్మిత్' తన 'ప్రాచీనహిందూదేశచరితము'నందలి యొకానొక ప్రకరణమునకు భట్టనాథస్వామిగారు రచించిన 'చోళులు, చాళుక్యులు' ('Cholas and Chalukyas') అను వ్యాసమే పరమప్రమాణ మని యుల్లేఖించియున్నాఁడు భట్టనాథస్వామివారికి ఆంగ్ల, జర్మన్‌భాషలలోఁ బ్రౌఢమగు పాండిత్యము గలదు. వీరి 'యశఃకీర్తిభేదోపన్యాసము' 'అముద్రితగ్రంథచింతామణి' లోను, 'వసువసుచరిత్రరచనావిమర్శ'మను వ్యాసము 'శశిలేఖ'లోను బ్రచురింపఁబడియున్నవి. దిగ్దంతితో సింగపుఁగొదమ పోరాడినట్లు, తమ తాతగారితో సమానస్కంధులును, దత్ప్రతిస్పర్ధులు నగు శ్రీభగవత్కవి ముడుంబై నరసింహాచార్యకవి కోవిదునితో మన భట్టనాథస్వామివారు పత్త్రికాముఖమున సారస్వత విషయకములగు ననేకవాదోపవాదముల నిర్వహించియుండిరి.

### 3. 'ఐతిహాసికకులపతి' శ్రీపరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవారలుగారు : (౧౮౮౭—)

వీరు మ. మ పరవస్తు వేంకటరంగాచార్యులవారి తృతీయ పౌత్త్రులు వారియొద్దనే వీరు సంస్కృతమును గొంతవఱ కభ్యసించిరి. వీరి చిన్నతనముననే పితామహపాదులు స్వర్గతు లగుటంజేసి వీరాంగ్ల విద్యాభ్యాసమునకు మొదలిడి 'ఇంటర్మీడియేటు' పరీక్షయందు త్తీర్ణులైరి.



'ఐతిహాసికకులపతి' శ్రీ పరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవారలుగారు

వీరు పురాణవాఙ్మయమునఁ గుఱింవ్యాసంగ మొనర్చి, యందు దృఢవ్యుత్పన్నులై, యనేకగవేషణాత్మకకృతుల నిర్మించియుండిరి. 'ఇండియన్ ఆంటిక్వెరీ' పత్రికలో 'కలియుగాబ్దము' (యుధిష్ఠిరశకము) అను నుత్తమవ్యాసమును రచించియుండిరి వీరాంగ్లమునఁ 'ప్రాచీన హైందవజాతులు'* [I 'భూతములు', II 'అసురులు'] అను పరిశోధకకృతులను, 'వేదకాలమునందలి పాంచాలచరితము'†ను, నాంధ్రమున 'హైందవభూగోళశాస్త్రము'ను రచించియుండిరి వీరు పురాణ వాఙ్మయమునుండి 'పురాణసంహిత'ను సముద్ధరించియుండిరి 'శ్రీరాముఁడు—రామాయణము' అను వ్యాసమునుగూడ వీరు రచించిరి. పాశ్చాత్యసంస్కృతవిద్వాంసులలో 'పార్గైటర్' (Prof F E Pargiter) ను,ం భారతీయసంస్కృతపండితులలో మన లక్ష్మీనరసింహ

* 'Ancient Indian Tribes'
† 'History of the Panchala' (in the Vedic Period).

స్వామివారొక్కరునుమాత్రమే పురాణసారస్వతమును గూలంకషముగఁ బ్రత్యేకముగ, భిన్నదేశములలోఁ బరిశోధించి యిరువురును సమాన సిద్ధాంతములనే యొసఁగియుండిరి. సనాతన భారతీయులకుఁ దమ దేశచరితము తెలిసియేయున్నదని వీరి సిద్ధాంతము. 'భగవద్గీత' లోఁ గర్మయోగాధ్యాయమున జ్ఞానయోగముంగూర్చిన శ్లోకములును, జ్ఞానయోగమునఁ గర్మయోగముంగూర్చిన శ్లోకములు, నిట్లు 'భగవద్గీత' తాఱుమాఱుగాఁ గలగూరగంపవలెనుండ దానిని వీరు గాఢముగఁ బరిశోధించి, యేశ్లోక మేయధ్యాయమున నేస్థలమున నుండఁదగునో గుర్తించి యాపద్ధతిని వీరు 'గీత' ను నాంధ్రనాగరలిపులలో ముద్రించి యుండిరి. అనర్ఘరత్న నిలయము 'ఆర్ష గ్రంథాలయము' ను, ఆర్ష ముద్రణాలయమును బ్రకృతము విశాఖపట్టణములో వీరి యధీనముననేయున్నవి. పితామహపాదులు జీవితమును ధారవోసి నిర్మించిన 'లఘుశబ్దార్థ సర్వస్వ'మను సంస్కృత విజ్ఞానసర్వస్వమాతృకయు, ముద్రణభాగ్యమునకై నిరీక్షించుచు నీగ్రంథాలయముననే యున్నది

---




దాసరి

చిత్రకారుఁడు: కొత్తపల్లి సుబ్రహ్మణ్యంగారు, కాకినాడ.

---



డా. ముత్తుగారి యారోగ్యాశ్రమము, తాంబ్రము



ఆంధ్ర సారస్వత సమితి, నైజాము కాలేజి



ప్రొఫెసర్ యశ్వంత సింహగారు



గాయకశిరోమణి,
పి. ఆర్. స్వామినాథ అయ్యరుగారు



కనకాద్రిరావుగారు



దొరస్వామిగారు



పోలదాసు రామరావుగారు



పాలుచర్ గారు



# స్వర్గత బ్రహ్మశ్రీ వేదము వేంకటాచలం అయ్యరుగారు

వంగోలు వెంకటరంగయ్యాగారు బి. ఏ., బి. యల్.,



శ్రీ అయ్యరుగారు ౧౮౬౫ ఆగస్టు ౬-వ తేదికి సరియగు క్రోధన శ్రావణశుక్ల చతుర్దశీ * ఆదివారమున గోదావరిమండలములోని నరసాపురముచేరువనుండు పోడూరిలో బుట్టిరి వీరితండ్రిగారు మహో



స్వర్గత బ్రహ్మశ్రీ వేదము వేంకటచలమయ్యగారు

పాధ్యాయ బ్రహ్మశ్రీ వేంకటరామశాస్త్రిలుగారు కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులయి విలసిల్లిన మహోపాధ్యాయ, బ్రహ్మశ్రీ వేంకటరాయ శాస్త్రిలవారు వీరియగ్రజులు. వీరిది గొప్పవిద్వద్వైదికవంశము. వీరు యాజుషులు; నెల్లూరుమండలమున † పుదూరుద్రావిడు లనబడు కండ్ర మాణిక్యబృహచ్చరణశాఖవారు. రాజమహేంద్రవరముకాలేజిలో వీరి తండ్రిగారు బహుకాలము సంస్కృతపండితులుగ నుండిరి. అయ్యరు గారు రాజమహేంద్రముననే యున్నతగౌరవములతో ౧౮౮౫-వ సంవత్సరమున బి. ఏ, పట్టమును బడసిరి. మద్రాసుయూనివర్సిటి లోని సంస్కృతబహుమతు లందిరి. బి. ఏ. అయినతరువాత రాజ మహేంద్రముననే కొంతకాల ముపాధ్యాయులుగ నుండిరి. వీరి యుపాధ్యాయత్వస్మరణభూతులగు శిష్యులు కొందరు మహోన్నతదశ జెందిరి నెల్లూరిలో ౧౯౩౦ సం డిసంబరువరకు డిస్ట్రిక్టు అండు సెషన్సుజడ్జిగనుండిన శ్రీమంతులు పిళ్లారిశెట్టి నారాయణరావు నాయడు బి ఏ, బి.యల్.గా రొకరని తెలియుట కెంతయు సంతస ముగ నున్నది

* అయ్యరుగారి జాతకకోటి

| | | | |
|---|---|---|---|
| | కే | ల | శు |
| | రాశికుండలి | | ర |
| చ | | | |
| | గు | శ-రా | కుజు |

=

| | | | |
|---|---|---|---|
| గు | కే | చ | |
| | అంశకుండలి | | |
| ర-శు | | | |
| | శ | రా | కుజు బుధు |

† కొత్తూరు అనునది యరవమున పుదూరగును. ఇది నెల్లూరునకు నలువదిమైళ్లలో నుండు నాయడిపేట రైలుస్టేషనుకు మూడు మైళ్లలో నుండు అగ్రహారము.

ఆయుపాధ్యాయపదమును వదలి చెన్నపట్టణమున బి.యల్. పరీక్షకు జదివి దానం గడతేరిరి. ఈలోపల రెండవయంతస్తు మొదటి యంతస్తు నియోగ (ప్లీడరు) పరీక్షల నిచ్చిరి రాజకీయోద్యోగపరీక్షలగు సంక్షేపలేఖనమును (Precis) యున్నతభాషాంతరీకరణము (Translation Higher Grade) ను గూడ నిచ్చిరి. రెండవయంతస్తు నియోగపదవి కర్నూలయినవెంటనే పారంపర్యముగ కుటుంబస్థావర ప్రాంతమగు కావలి డిస్ట్రిక్టుమునసబుకోర్టులో ౧౮౯౦-వ సంవత్సరమునుండి ౧౮౯౮-వ సంవత్సరపు యేప్రిలువరకు వృత్తిని సలుపుచు ఆవల బి.యల్. పరీక్ష నిచ్చి మొదటితరగతి నియుక్తులుగ నెల్లూరులో ౧౮౯౮ సంవత్సరంమొదలు ౧౮౯౯ అక్టోబరువర కుండి అపుడు హైకోర్టువకీలుపట్టమును బొంది నాటనుండియు నెల్లూరులో సుప్రసిద్ధులగు హైకోర్టువకీలుగ నుండి హైకోర్టువకీళ్లు అడ్వొకేట్లగుటకు కవకాశము గల్గినకాలమున అడ్వొకేటుపదమును సంపాదించి దేహపాతమగుదనుక ఆవృత్తియందే యర్హతములయి వర్తించుచుండిరి.

ఉపాధ్యాయపదవియందును, వకీలుధర్మమునను వీరిసౌశీల్యాది సంపద లతిశ్లాఘ్యములుగ నుండినవి. "మన స్యన్యత్ వచ స్యన్యత్ కర్మ ణ్యన్యత్" అనుదోష మెవరును వీరిగూర్చి చెప్పజాలరు. ఇచ్చకపుమాటల జెప్పువారు కారు లోకవిరోధ మపేక్షించువారు గాకున్నను యథార్థవాదులుగ నుండిరి కేసు రికార్డులో "నిచట యిటులున్నది" యని వీరుబలికిన యెదుటివారుగాని, యధికారిగాని సంశయించి దృఢము జేసికొనవలసిన యక్కర లేకుండ ప్రవర్తించిరి. ఒకపరి యొకసబుజడ్జిగారు మహమ్మదీయ - లాను గూర్చి యొకవిషయము వీరితో పబ్లికుకోర్టులో ముచ్చటించి తద్విషయకమగు తీర్పులను, ధర్మప్రవచనములను జూచి చెప్పమని వీరిని గోరిరి మరునాడు తిరుగ కోర్టులో సమావేశమయినపు డీప్రస్తావము జేయగ అయ్యగుగారన్నిటిని పరికించి చెప్పిరి. అంతట సబుజడ్జిగారు "ఇట్టితీర్పు ఒకటి యుండవలయును జూచితిరా" యని ఆశంక జేయగ "నేను జెప్పునది తప్ప వేరువిధముగ లేదు. నామాటగ గ్రహింపవచ్చును" అని అయ్యరుగారు జెప్పగ వారు వల్లెయని యంగీకరించి తృప్తులయిరి వీరు చేపట్టిన విషయములో వీరిప్రమాణబుద్ధి యిట్టిదిగ నుండెను.

ఋజుప్రవర్తనమునం దాసక్తిగలవారగుటచే వీరు సత్యవీరులుగ నుండి యెంతటి విషయమునైనను డీకొని నిలువబడుచుండిరి వీరి ధైర్యము, అక్రమమును సాధువనిపించి సాధించుకొనుట కుపయుక్తమయినది గాదు. పట్టుదలగలవారయ్యును హఠము చేయువారుకారు. ఒకమారు డిస్ట్రిక్టుకోర్టులో వీరి కొకకేసులో వాయిదా కావలసి యుండినది. ప్రథమప్రార్థనమీద జడ్జిగా రనుకూలింపలేదు తుదకు బిల్లువేసి వాయిదామోషన్ దాఖలుచేసినయెడల వాయిదా యిచ్చునట్లయినది. "ఈమహోన్నత-కోర్టులో వాయిగా ప్రస్తావములకు వ్రాత అర్జీలు బిళ్లలు కావలయునని నిర్బంధింపదగినది కాదు. క్రిందకోర్టులలో యుక్తాయుక్తమెరుగక వూరక వాయిదాలిచ్చుట నాపుటకై, ఆకోర్టులవారు వాయిదామోషనులకు బిళ్లలువేసి తెమ్మనవచ్చునుగాని ఈకోర్టువారి యంతస్తునుబట్టి వాయిదా యిచ్చినటుల రికార్డులో వ్రాయుటయే వాయిదా యిచ్చుటకు తగినంత కారణ మున్నటులు తెలుపగలదు" అనిరి అందుమీద జడ్జిగా రామోదించి వాయిదా నిచ్చిరి.

అయ్యరుగారికి సమయస్ఫూర్తియు, వాక్చాతుర్యమును మెండుగ నుండినవి. ఒక అప్పీలులో "ఈ విషయమున మీకక్షిదారుడేల యుదాసీనుడై యుండెను." అని జడ్జిగా రడుగగ తటాలున

"What care I for whom she be
If she is not for me"

యని యొక ప్రాత ఇంగిలీషువాక్యమున ప్రత్యుత్తర మిచ్చిరి జడ్జిగా రామోదించిరి. అప్పీలును వీరిపక్షమయినది ఇం కొక అప్పీలులో "విచారణపూర్తి అయిన యొకసంవత్సర ముదనుక క్రిందికోర్టువారు తీర్పు జెప్పక కాలయాపన జేసినందున, గ్రంథమును క్రిందికోర్టువారు మరచి పొరపాటున మాకక్షిదారునికి విరోధము చేసినారు" అని అప్పిల్యాంటు వకీలుగారు వాదింపగ, రెస్పాండెంటు వకీలుగారుగ నుండిన అయ్యరుగారు ఇంగ్లాండులో ప్రముఖులుగ నుండిన ఇద్దరు జడ్జీలనుగూర్చి నానుడిలో నుండిన ఈ క్రింది పద్యము చమత్కారముగ బనులు జెప్పిరి:

"His Lordships' Judgments never begin
"And his Honor's Judgments never end"

అనుచు "ఇంగ్లాండులో గొప్పజడ్జీలనుగూర్చి చెప్పకొనుటచే జడ్జిమెంటు ఆలస్యముగ చెప్పుట క్రిందికోర్టుతీర్పును రద్దుచేయుటకు చాలిన కారణము కాదు" అనిరి. ఈవినోదవాక్య మయ్యరుగారిపక్షమున కనుకూలమయినది.

ధర్మసూక్ష్మపరిశీలనయందు వీరు కష్టపరిశ్రమ చేయువారు. ఒకఉత్తరవార్సు దావా (suit by a reversioner) లో చేయబడు తీర్పు ఏకదేశముగ ఆదావావాదినిమాత్రమే బద్ధపరచు ననుభావ మొకపుడు స్థిరపడి యుండినది ఒకానొకదావాలో శ్రీ అయ్యరుగారి కీసిద్ధాంతము ప్రసక్తమై అట్టిదావాతీర్పు ఆవాదినేగాక సిద్ధులును సాధ్యులునగు (actual and possible) ఉత్తరవార్సుగణమునకంతయు నిది యాపాదింపబడి తదానీంతనగణమును భావిగణమునుగూడ బాధింపగలదని అయ్యరుగారు న్యాయసంచారముజేసి వాదించిరి. ఆకాలమున వీరివాదము ఇక్కడికోర్టులోనను, హైకోర్టులోనను చెల్లినది గాదు. అయినను తమవాదమే న్యాయ్యమనునిశ్చయజ్ఞానముతో నిజాంతఃకరణప్రవృత్తినే ప్రమాణముగ గొని ఈవిషయము నధికరించి ఇంగ్లీషున ౧౯౦౨-వ సంవత్సరమున నొకపెద్ద గ్రంథమును వ్రాసి

యచ్చువేయించి తమసిద్ధాంతమును ప్రకటించిరి. తరువాత కొంతకాలమునకు వీరిసిద్ధాంతమె హైకోర్టులలోనను ఊర్జితమైనది. వీరి మనోదార్ఢ్యమును, నిశ్చయజ్ఞానమును, సూక్ష్మదృష్టియు నిట్టివిగ నుండినవి.

అయ్యరుగారివృత్తియు దుర్వ్యవహారముగ నుండినదిగాను గుణభారము మాలోపమున కినుమడిగ నుండినది. "అక్షరాణి పరీక్ష్యంతాం అంబరాడంబరేణ కిం" మితాక్షరాదులవలె యక్షరప్రత్యక్షరముల విమర్శించి సంకల్పితార్థమును సమర్థించుకొనుచుండిరి. కక్షిదారుడు రాగనె వాని ప్రత్యుత్థానముజేసి మెత్తవేసిన కుర్చీపై కూర్చుండబెట్టి కుశలప్రశ్న జేసి యోగక్షేమముల విచారించి కాఫీ నిచ్చి బండిలో కూర్చుండబెట్టుకొని కోర్టుకు బోవువారు కారు. అయ్యెవ్యవహారమునకు కావలయు సంజాయిషి బుచ్చుకొని తరువాత వానితో తిరుగ సల్లాపములు చేయవలసిన యక్కర యుంచుకొనినవారు కారు. ఈవృత్తియందు పలుమరు "నాయక" శబ్దము వినబడుచుండును. అయ్యరుగారి సౌశీల్యాదిసంపదయు, వృత్తిపారిశుద్ధ్యమును, పాండిత్యాతిశయమును, మేధా, శ్రద్ధా, ప్రతిభలును గలవారివర్తనలుగదా మార్గోపదేశకములయి పరాకాష్ఠలుగ ప్రకాశింపవలెను! అట్టి ప్రశస్తగుణగణసంపద మృగ్యమగు "గణనాయక'త్వము మిథ్యాకీర్తిగదా!

"నిక్కమయిన మంచి నీల మొక్కటిచాలు
తళుకుబెళుకురాలు తట్టెడేల"

"ప్రయివేట్లు" అనబడు లాటొట్లకవకాశమిచ్చువారు కారు. ఒకపరి యొకప్రయివేటు ఒకకక్షీదారునివెంట వీరిఆఫీసునకు బోయి, వ్యాజ్యగాని బయట నిలిపి తాను అయ్యరుగారికడ కేగి తనమరియాద దెలుపుకొని "విదియా?[౧] తదియా?[౨]" యని సంకేతగర్భితముగ మందలింప అయ్యరుగారు మహామేధావంతు లగుటచే సంకేతితార్థమును దెలిసికొని "ఏకాదశి"[3] యని ప్రత్యుత్తరమిచ్చిరి. ఆప్రయివేటు భగ్నాశుడై వెలుపలకు వచ్చి "డాం! ఇక్కడ మనపనులు నెరవేరజాలవు. అల్లక్కడికి పోదామురా" యని కక్షిదారుని వెంటదీసికొనిపోయెను.

విద్యాప్రపంచమున నయ్యరుగా రసాధారణ ప్రజ్ఞగలవారు. దాదాపు ఏనూరేండ్లుగ పుర్వాచారద్రావిడులు తెలుగుమండలముల స్థావరము గొని యచటిజానపదులైయున్నను 'ద్రావిడత్వం న ముచ్యతే' యన్నటుల అయ్యరుగారిశాఖవారు కోనసీమద్రావిళ్లు ఆరామద్రావిళ్లు తుమ్మగుంటద్రావిళ్లు లోనగువారివలె మాతృభాషను యింకను వదలినవారు కారు. అందుచేత యరవభాషాపరిచయ మయ్యరుగారికి జన్మతో గలిగినది. దాని నీవల వృద్ధిజేసికొనిరి. తెలుగు "సర్వ మావృత్య తిష్ఠతి" యగుటచేతను దేశభాషయు వ్యవహారభాషయు నగుటచేతను మీదు మిక్కిలి యద్దాని యవ్యాజమనోహరత్వముచేతను నైసర్గిక మాధుర్యముచేతను అయ్యరుగారు తెలుగున గొప్పసాహిత్యమును గడించిరి. భారతమునుండియు, మనుచరిత్రాదులనుండియు యవలీలగ పద్యముల నుదాహరింప గలిగియుండిరి. వీరననేల? అప్పయ్యదీక్షితులంతటివారు "ఆంధ్రత్వ మాంధ్రభాషాచ నాల్పస్య తపసః ఫలం" అని తెలుగును శ్లాఘించియున్నటుల పెద్దలు చెప్పుదురు. ఇక అయ్యరుగారి యన్నగారగు కీర్తిమూర్తి బ్రహ్మశ్రీ వేంకటరాయశాస్త్రిగారి తెలుగు పాండిత్య మసదృశమని ఖ్యాతి గాంచినదిగదా!

దొరతనమువారి బాసయగు నింగిలీషున పట్టభద్రులగుటయేగాక విశేషగ్రంథశోధన జేసియున్నారు. ఆభాషాశబ్దజాలమునందును, సంప్రదాయములందును వీరికిగల పాండిత్యము వీరు ఇంగ్లీషున రచించిన గ్రంథములవలనను, వ్యాసములవలనను చక్కగ తెలియగలదు.

కన్నడ మలయాళములందును అన్యూనమగు ప్రవేశముగలిగి యుండిరి. ఉర్దు, పార్షి భాషలను క్రమముగ గురుముఖముగ నభ్యసించి ఆభాషలలోని ప్రౌఢకావ్యముల నన్నింటిని సమగ్రముగ జదివిరి. షానామా, యూసుప్‌జులైఖా మస్నవి లోనగు ఉద్గ్రంథములలోనుంచి యప్రయత్నముగ పద్యముల వరుసలుగ నొప్పగించుచుండిరి. హాఫెజ్-సాదీ (పారసీకవులు) గార్ల మహాకావ్యములు కంఠస్థములుగా నుండినవి. అరబీ ప్రారంభించునంతటికి నలువదిపైబడి దానియొక్క విశేషపరిశ్రమ కవకాశము లేకపోయినది. ఫ్రెంచిభాషయందు మంచి ప్రవేశ ముండినది. లాటినునందును సాహిత్యముగలదు. గ్రీకును జదువ యత్నించిరి. చాలదూరము సాగలేదు. జర్మన్‌భాషయు కొంతసాధించిరి. అనుక్తముగ నిలిచినది సంస్కృతము. ఇది వారికి వంశపరంపరాగత "కులధనము" సహజపాండిత్యమో చదివినపాండిత్యమోగాని వీరికాభాషయందు గొప్పప్రవేశ ముండినది. నాటకాంతము పారముచెప్పగలిగియుండిరి. వ్యాకరణపరిచయము చక్కగనుండెను. మహాభారతమునంతయు స్వతంత్రపరీక్ష జేసి యందలి యనార్షభాగములను ప్రక్షిప్తములను పౌర్వాపర్యవిరోధములను విపులముగ బరిశీలించి ఇంగ్లీషున గొప్పగ్రంథమును వ్రాసి ప్రకటించిరి. ప్రతాపచంద్రరాయిగారి కలకత్తాప్రతిని, కుంభఘోణముప్రతిని, బొంబాయిప్రతిని, తెలుగు అక్షరములతో పూర్వమెవ్వరో యచ్చొత్తించిన సంస్కృతభారతమును నన్నయతిక్కనాదుల యాంధ్రమహాభారత ప్రతులను యెదుట నుంచుకొని కంటవత్తివేసికొని శ్లోకప్రతిశ్లోకముగను అధ్యాయప్రత్యధ్యాయముగను అంతఃపర్వప్రత్యంతఃపర్వముగను పర్వప్రతిపర్వముగను అనుక్రమణికాధ్యాయమును పర్వసంగ్రహాధ్యాయమును సంప్రతించుకొనుచు భారతమునంతయు పరిశీలించిరి. ఈగ్రంథము ౧౯౨౨-లో

౧ విదియ= రెండవభాగము అనగా ఫీజుకట్నములో సగము.

౨ తదియ= మూడవభాగము.

3 ఏకాదశి= ఉపవాసము, భోజనశూన్యము, ఏమియు లేదనుట.

ప్రచురింపబడినది. ఈవల కొంద రీమార్గ మవలంబించి గ్రంథముల సిరిగాని, అయ్యారుగారు చేసినంతటి గాఢప్రచారము వానియందు కలదా యని సంశయింప నలవియగుచున్నది. వెంకటాచలమయ్యారుగారీగ్రంథాదిని మురారివాక్యమును శపథముగ గొనియున్నారు.

"అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతాం
ఆపాతాళనిమగ్నపీవరతను ర్జానాతి మంథాచలః"

పైన జెప్పినటుల రివర్షి నరి దావాలవిషయమై యొక గ్రంథమును వ్రాసియున్నారు.

మరియు మత చారిత్రక భూగోళాద్యనేక విషయములపై గొప్పవ్యాసముల నింగిలీషున వ్రాసియున్నారు వానిజూచిన వీరిగ్రంథ పరిచయని స్తృతి దెలియగలదు. వీరివ్యాసముల గొన్నిటినిమాత్ర మీ క్రిందిపట్టికయందు జూడనగు—

| | వ్యాసనామము | ప్రచురించిన పత్రిక | ప్రకటన కాలము | వ్యాస విషయములు |
|---|---|---|---|---|
| 1 | Year Measurements in Ancient Times | Journal of the Bombay Branch of the Royal Asiatic Society | 1917 | జె యఫ్. హ్యూలిట్టుగారు వ్రాసిన History and Chronology of the mith making age అను గ్రంథముయొక్క యనువాదము — ప్రాచీన కాలము సంవత్సర పరిగణన విధానముల గూర్చినది |
| 2 | Sraosha of the Joroastrian system | Do | 1918 | పార్సిమతస్థుల గ్రంథములలో నుండు శ్రీయోష యను దేవతను గూర్చినది — ఈదేవత మనవైదిక మతమున అగ్ని కావచ్చును. |
| 3 | Aryavarta - an Essay | Mysore University Magazine | 1925 సెప్టెంబరు | ఆర్యావర్తమును గూర్చినది. |
| 4 | Sapta Dwipas | Mythic Journal of Bangalore | 1924 అక్టోబరు 1925 జనవరి యేప్రేలు అక్టోబరు 1926 యేప్రేలు జూలై అక్టోబరు భాగములు | జంబూప్లక్షాది సప్తద్వీపముల గూర్చినది. |
| 5 | Bharata Varsha | Mysore University Magazine | 1925 డిసంబరు | భారతవర్షమును గూర్చినది. |
| 6 | Sanatana Dharma of Hindu marriage | Do | 1926 మార్చి | హిందూవివాహములందలి సనాతనధర్మమును గూర్చినది |
| 7 | Tamils Three Thousand years ago | Do. | 1926 డిసంబరు 1927 మార్చి | మూడువేల సంవత్సరముల క్రింద తమిళజాతులను గూర్చినది (ద్రావిడజాతులు) |
| 8 | Bhishma Panchaka | Mythic Journal of Bangalore | 1930 జనవరి | భీష్మపంచక మను వ్రతమును గూర్చియు, దద్గత జ్యోతిషవిషయములం గూర్చియు భీష్మునికి ఈ భీష్మపంచకమునకు గల సంబంధమును గూర్చియు వ్రాయబడినది |

పైని బేర్కొనబడిన వన్నియు ఇంగిలీషున వ్రాయబడినవి. ఇవన్నియు గలసి మెగజైన్ సైజున దాదాపు 329 పుటలగుచున్నవి. ఇవిగాక ఇటీవల "కతిపయశబ్దార్థ శబ్దస్వరూపవిచారము" అను పేర దేశోద్ధారక నాగేశ్వరరావుగారి విచిత్ర సచిత్రభారతియందు ౧౯౩౧ సంవత్సరపు మే, జూలై, సెప్టెంబరు, నవంబరు సంచికల లోను ౧౯౩౨ మార్చిసంచికలోను అయిదు వ్యాసమ్ములు తెలుగున వ్రాసిరి. వీనిలో జర్చింపబడిన శబ్దేతిహాసములు ప్రౌఢములుగను, అభినవములుగను ఉన్నవి.

ఇవన్నియుగాక శ్రీవాల్మీకిరామాయణవిమర్శకును శ్రీలలితా సహస్రనామవిమర్శకును కావలయుసంభారసంగ్రహము జేసిరి. రామాయణవిమర్శ, మహాభారతవిమర్శ ననుకరించును. శ్రీలలితాసహస్రనామవిమర్శ బహుచిత్రముగ నుండగలదు. శ్రీలలితాదేవి సహస్రనామములలో ఆదేవి కరచరణాద్యవయవవర్ణనలు కేవలస్తోత్రభాగములుగాక పర్యాయనామములుగ నుండువానినెల్ల గొని వీని భాషాంతరదేశాంతర దేవివ్యక్తులతో సమన్వయము జేయుచువచ్చిరి. ఉదాహరణము—జ్ఞానా = ధ్యానా = Diana—ఇత్యాదు లనేకముల జూప నగును.

మొదటిమాట· "లలితా" శబ్దము అల్లాశబ్దముతో సాజాత్యమై యుండుననియు యూహింపనగును. కొన్ని భాషలసంప్రదాయముల బట్టి పుంవాచకశబ్దములకు తకారసంయోగమువలన స్త్రీత్వ మేర్పడు చున్నది. ఇట్టిది అరబ్బీభాషయందును గలదు. ఉదాహరణము— బిన్ = కుమారుడు, బిన్త్ = కుమారిత—

తెలుగునను, అరవమునను ఇట్టిరూపములు గలవు —

కుమారుడు—కుమారిత, అరవ—అరవతె, మాల—మాలెత, కొరవ—కొరతి, ఎఱుక—ఎఱుకత ఇత్యాదులు.

ఈశబ్దాధికారసిద్ధాన్తము గ్రాహ్యమగునెడ మన లలితాంబయు "త"కారసంయోగమున కుదాహరణము గావలసియుండును. ఇంత మాత్రమున నామహాదేవి మహిమాన్నత్యముల కేమియు కొదువ గాజాలదు శబ్దనిష్పత్తిచే వ్యక్తిప్రాభవము తగ్గజాలదు. "కృష్ణ" శబ్దమునకు "నల్లనివాడు" అని యర్థము జెప్పగనె గీతాచార్యత్వమునకు, ధర్మసంస్థాపనమునకు, జగత్కల్యాణసంధాయకత్వమునకును లోపము వాటిల్ల లేదు. శబ్దార్థవిచారమువలన మతమున కపచారము కాజాలదు. రామకృష్ణాదిశబ్దార్థముల మనగ్రంథములలో విచారించినటులనే మతాంతరులును "మహమ్మద్" "క్రీస్తు" "జెహోవా" అహురమజ్ద లోనగు పరమపవిత్రనామముల యర్థవిచారమును జేసియున్నారు ఇందు మతమున కపచార మేమియు లేదు.

అయ్యరుగారు కనుమూసినందున వారియముద్రితగ్రంథసంచయము యెటులు బయలువెడలగలదో యని కొంత విచారమగుచున్నది.

వారి పుస్తకభాండాగారమున నమూల్యగ్రంథము లనేకములు గలవు. లండనులో నానాదేశములప్రాచీనగ్రంథములనమ్ము "లూజక్ అండు కంపెని" (Luzac & Co) అను యంగడి యొకటి కలదు అయ్యరుగా రనవరతము అచటినుండి ప్రాచీనగ్రంథముల దెప్పించుచుండిరి. ఆంధ్రయూనివర్సిటివారు విద్యావిషయకోపన్యాసముల నియ్యమని కోరిరి గాని వ్యవధి చాలమి నాయామంత్రమును వీరు గ్రహింపలేదు. ప్రసంగవిధానమున వాఙ్మిత్వమును స్ఫూర్తియు గలిగిన వక్తలుగ నుండిరి.

లోకయాత్రాప్రకరణమున నయ్యరుగారు పెత్తనమున కేవల విరతులుగ జూపట్టినను, స్వభావముచే మితభాషులును, సంగృహీత స్వభావులును (reserved) అయినను పూర్వవయసునం దత్యుత్సాహపూరితులయి లోకవృత్తముల పాల్గొనుచుండిరి. వకీళ్లు అపుడపుడు జరిగించుచుండిన వనభోజనములలో జేరుచుండిరి. నాకు దెలసి కుంభఘోణములో జరిగిన మద్రాసు ప్రోవిన్షియల్ కాన్ఫరెన్సుకు నెల్లూరునుండి పోయిరి. వేసవికాలపు శలవులలో కొందరు స్నేహితులతో గలసి దేశపర్యటనము జేసిరి. అట్టిపర్యటనములలో నొకమారు మళయాళదేశమునకు బోవుట తటస్థించినది మళయాళభాష నభ్యసించుటకు హేతువైనది

అత్రత్య నాగరసంస్థలలో పాల్గొనుచుండెరి (Local institutions) హిందూహైస్కూలు (ఇప్పుడు వెంకటగిరిరాజాకాలేజి) సభలో చాలకాలము సభ్యులుగానుండిరి. నెల్లూరు మునిసిపల్ కౌన్సిలులోను, నెల్లూరుపర్మెనెంటుఫండులోను సభ్యులుగ నుండిరి శ్రీమూలస్థానేశ్వరదేవస్థాన ట్రస్టిగ చాలకాలము దాని నుద్ధరించి మంచిస్థితిలో కుదురుబాటు జేసిరి. ఏడుసంవత్సరములు నెల్లూరువకీళ్ల అసోసియేషన్ సెక్రెటెరిగ నుండిరి. ఆకాలములో జరుగుచుండిన ఐరోపియ మహాసంగ్రామమునకు వకీళ్లయొద్ద చందాలు వసూలుచేసి పంపుచుండిరి.— ఇత్యాద్యనేకనాగరసంవిధానముల వర్తింపుచుండిరి. ఈ వలికాలమున వారి యీడుజోడువారు లేనందున ఈ విషయములయందు బాహ్యప్రసక్తి నుపసంహరించిరి

అయ్యరుగారి చరమస్థితిలో ఒకమారు స్మృతిగలిగి "నేను వ్రాయ దలపెట్టుకొనినవిషయము లనేకము లసంపూర్ణములుగ నున్నవి. ఈజన్మ కింతియకాబోలు. అంతయు భగవదాయత్తము" అనిరి. అటుపై వాగ్యతులై మౌనముద్ర వహించి బాహ్యవ్యాపారముల నుపరతి జెంది ౧౨-౧౧-౩౧ తేది రాత్రి ౮ ఘంటలకు సరియగు ప్రజాపతినామసంవత్సర కార్తికశుక్ల తృతీయా గురువాసరమున బ్రహ్మైక్యము నందిరి. దేహము శుష్కించినను విశాలఫాలమును, అత్యున్నత నాసికయు వీరి మనోబుద్ధిప్రతిభల నాచైత్యము ప్రకటించినవి.

పరమసాధ్వీమణియగు భార్యయు ఇద్దరు, కుమారులును, ఒక్క కుమారితయు, తమ్ము లొకరును పౌత్రదౌహిత్రాదికమగు సంతానమును దుఃఖశేషులయిరి. వీరికుమారు లిద్దరును బి. ఏ., బి యల్. పరీక్షల నిచ్చి నెల్లూరిలో వకీళ్లుగ నున్నారు. అయ్యరుగారి యాత్మకు శాంతి గలిగి వీరిస్మరణము చిరకాలము వెలయుగాత.

జన్మచేత ద్రావిడులయినను వీరి వాఙ్మనఃకాయముల ప్రాభవము లన్నియు తెలుగుదేశమున వెలసినవి తరతరములుగ తెలుగుదేశమున నుండినవారు వీరాంధ్రులన జెల్లును. ఆంధ్రులే. ఇట్టివారి యాకస్మిక మరణముచే నాంధ్రమండలమునకు తీరనికొదువ కలిగినది.

---



# శ్రీ త్రిపురాన - వేంకట సూర్యప్రసాదరాయకవి

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

వంశధారానదీపరిసరంబున నొప్పు మధుకేశ్వరక్షేత్రమండలమున
సిరుల సంపదలఁ బొంపిరివోవు దొరలకు నిరవైన సిద్ధార్థపురమునందు
అత్తకోడండ్ర యన్యోన్యసౌహార్దంబు చెలువారు త్రిపురానకులములోన
ఇచ్చిపుచ్చుకొనంగ నెఱిఁగి, కృతిద్యుఁడౌ తమ్మరాట్కవితపోధనమువలన
అమ్మయిరుచన్నఁబాలు నెయ్యమున నొకఁడ-త్రావఁగల నేర్పు తోడివారలకుఁజూప
నవనిఁ బుట్టిన నిన్నెన్న నలవియగునె - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ!

కనుఁగొన్నయంతనే గారవింపఁగఁజేయునాకారమునకుఁ దోడైన ప్రజ్ఞ,
దుర్ఘటకార్యముల్ తుదిముట్టఁగాఁ జేయు ప్రజ్ఞకుఁ దోడౌచుఁ బరగు విద్య,
పరమనోభావముల్ పరికింపఁగాఁజేయు విద్యకుఁ దోడైన వినయలక్ష్మి,
బుధులతో భాషించి మోద మొందఁగఁజేయు వినయలక్ష్మికిఁ దోడు గనిన ధనము,
ధనమునకుఁ దోడు లోపమొందని గొనమ్ము-గొనమునకుఁ దోడు కలఁకఁ జెందనిమనమ్ము,
గనము నీయందుఁదక్క నింక నొకయిక్క - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ!

పలుకుఁబల్కనఁ దేనె లొలుకఁ గల్కి బెడంగుఁగులుకు నీకబ్బంపుఁ గొమరుఁ జూచి,
కబ్బంపుఁ గొమరున కబ్బురంబగు నింపు నింపుగాత్రంపుఁ బొందికలఁ జూచి,
గాత్రంపుఁ బొందికల్ కళలఁ దేరఁగఁజేయు సంగీతవిజ్ఞానసరణిఁ జూచి,
సంగీతవిజ్ఞానసరణి కందముఁ గూర్చు ప్రతిపదార్థవిభాగపటిమఁ జూచి,
కవులు, విబుధులు, గాయకుల్ వివిధవిధుల - నిన్ను విడనాడలేమంచు నెన్నుచుండ్రు
నీదు మైత్రిని గాంక్షించి నెగడుచుండ్రు - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ!

ప్రాచీనకవితాప్రభావంబు మాయందె కలదంచు గర్వంబు గాంచువారు,
ప్రబలాశుకవితాప్రభావంబు మాయందె కలదంచు గర్వంబు గాంచువారు,
అభినవకవితావిహారంబు మాయందె కలదంచు గర్వంబు గాంచువారు,
చాటుప్రబంధవిస్తరణంబు మాయందె కలదంచు గర్వంబు గాంచువారు,
నిన్నుఁ గనుఁగొన్న, నీపల్కు-నీటు విన్న - నీదుకవనంబునందున్న నెనరుఁ గన్న
భయము నొందెదరన్న! సందియము సున్న! - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ!

భాషాపటుత్వంబు పాటింపఁగా నెంచి యన్వయసారళ్య మణఁగఁ ద్రొక్కి,
అన్వయసారళ్య మనుసరింపఁగ నెంచి సార్థపదంబుల నవలఁబుచ్చి,
సార్థపదంబుల నలరింపఁగా నెంచి ధారకు నొకనీళ్ల ధారపోసి,
ధారాప్రవాహంబు దనరింపఁగా నెంచి రసభావములను దూరముగ నుంచి,
యాంధ్రమను పేరఁ బుప్పి కావ్యములఁ జెప్పి-క్రిందుమీఁదును జూడక కెరలు నేఁటి
కబ్బపుం గూర్పరుల్ పోలఁగలరె నిన్ను - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ !

రసభావములకు దూరముగాఁ దొలంగని ధారాప్రవాహంబుఁ దనరఁజేసి,
ధారాప్రవాహవైదగ్ధి మాన్పఁగలేని సార్థపదంబుల నలరఁగూర్చి,
సార్థపదంబుల యనుస్మృతి విడువని యన్వయసారళ్య మనుగమించి,
యన్వయసారళ్య మణఁగఁద్రొక్కఁగఁబోని భాషాపటుత్వంబు పాలుపఱచి,
తేటతేటగఁ గబ్బముల్ తెనుఁగునందు - మాటిమాటికిఁ గూర్చు నీబోటిమేటి
నేఁటికాలాన లేఁడయ్యొ నూఁటికొకఁడు-సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ !

రససుధావార్ధిపారముముట్ట నీఁదినకైతలం గూర్చు తిక్కన యొకండె,
అవధానములఁ బ్రబంధాళిఁ గూర్పఁగనేర్పు గను మాడభూషి వేంకన యొకండె,
అత్యసాధ్యప్రబంధాంధ్రీకృతిం జేసి వరలిన పార్వతీశ్వరుఁ డొకండె,
అధునాతనవిధాన మమరింపఁజాలిన యొనమంద్రనారాయణేంద్రుఁ డొకఁడె,
సాటిచెప్పంగఁ దగురీతి చతురరచన - నీకు నొక్కనికే యబ్బె నేఁడుగాన,
నిలిచె నీయందె నాదగు నెమ్మనంబు - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ !

భవ్యవాగ్విభవమై, భాగవతాఖ్యమై పరగు సోదరిని గాపాడుమయ్య !
అందమ్ము చందమ్ము నందు బిడ్డలఁ గాంచి జనని కామోదం బొసంగుమయ్య !
తేనియల్ చిప్పిల్లు తీయనిపల్కులు నేర్పి బిడ్డల కింపుఁగూర్పుమయ్య !
కన్నబిడ్డలకుఁ జక్కని జోడు సమకూర్చి యారామపదమందు నలరుమయ్య?
తజ్ఞులగువారి సత్కృతిం దమినిబొంది - తజ్ఞులగువారి సత్కృతిం దనరఁజేసి
శయ్యరకు మాకు సంతృప్తి నింపుమయ్య - సరసకవిగేయ, సూర్యప్రసాదరాయ !

కవితచెప్పి యుభయకవిమిత్రు మెప్పింప-నరిది బ్రహ్మకైన ననియె దండి;
కవితచెప్పి యుభయకవిమిత్రునకు నీకు-మెప్పుఁ గూర్పఁగలుగు మేటి యెవఁడు ?

---



ప్రపంచములో అన్నిటికన్న గొప్పదగు విద్యుజ్జలయానము



ఆర్. శేషశాయిగారి విమానము




పెద్ద జెర్మను ఆకాశయానము



 గొప్ప బ్రిటిషు ఆకాశయానము



విద్యుద్ఘటికా యంత్రము



# విషణ్ణజలదము

ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావుగారు బి. ఏ.

[అస్తంగతుఁ డగుచున్న సూర్యుని నిజగర్భమందు గలిగి రజతాంచలవిరాజియయిన యొక శారదనీరదమును గాంచి]

కలవిహంగారవాదుల వికాసము నొందవు, ఱెప్పవాల్పులో
పల బహుభంగులన్ జపలభావమునన్ బరిణామ మంది ది
క్కులఁ గలయంగఁ జూతు, వెటకో పఱువెత్తఁగ నెంచుచుందు, వో
జలదమ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

వెలిజలతారుపాగఁ దలఁబెట్టి, కడానిమెఱుంగువ్రాఁతదు
వ్వలువను వల్లెవాటు విడి, పైఁడిచెఱంగుల లేఁతమబ్బువ
న్నెల జిలుఁగుల్ బిగించి, హావణిల్లెదు సంజను నల్వురట్లు, లో
జలదమ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

సలలితసభ్యవర్తన విశారదచిత్తుఁడవౌటఁ జూచువా
రలకు రచించుచుందువు దరస్మితకాంతి మొగాన; డెందమం
దలి ప్రళయానలాభపరితాపవిధం బదియెట్లు దాఁచె దో
జలదమ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

అల హృదయాంతరాళమున నాక్షత మెట్టులఁ గల్గె? రక్తధా
రలె యవి? మిన్ను మన్ను రుధిరంబున ముంచుచు నెత్తుచున్న; వా

వల నదియేమి ? తాపభరభగ్నహృదామిషఖండమేమొ, హా !
జలదమ ! నీకునావలె విషాదము గల్గినదేమొ పల్కవే.

కలగొను స్వీయదుఃఖపరికల్పితవేదన సానుభూతినిన్
గలుగఁగఁజేసె నాయెడఁదఁ, గావున నీహృదయంబులోనిబా
ధల గ్రహియింపఁజాలినవిధం బూకయించుక తోఁచుచున్న, దో
జలదమ ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

కలిగినవేళ జీవన మఖండగతిన్ సుజనాళికిచ్చి, ని
చ్చలు ఘనవృత్తి సర్వబుధసంస్తుతిఁ గాంచి, యనర్ఘకాలసం
కలన సహాయునిం గనక గాసిలి చిక్కెదు, వెళ్లఁబోయె, దో
జలదమ ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

పలుచన మైత్రి; వార్త్రి యొకస్వల్పమెమైన వితాకుఁజెంది సం
చలనముగాంతు, వాపదల సఖ్యమె కోరినయట్లు మ్రింగె దు
జ్జ్వలదతిభీషణాగ్నికణసంహతులన్; వెలివేయ వేమియున్
జలదమ ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

అల ఘనవృత్తి పోయె, సమయంబున కొక్కరుఁ గారు, కాఱుమ
బ్బులె గనవచ్చు ముంగలను, బూర్వపురీతిని జీవనంబులో
మెలఁగుట యెట్టులో.. యిఁక శమించుట యెట్టులొ తాపమంచునో
జలదమ ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

తెలియకయేమొ యిట్లరుగుదెంచితి, వీయపరాశనుండఁగాఁ
దలమగునట్టె నీకు ? పరితప్త మయోమయకందుకంబు గుం
డెలు దిగ మ్రింగి కిమ్మనని నేర్పు గలారికె చెల్లుఁగాక, యో
జలదమ ! నీకు నావలె విషాదము గల్గిన దేమొ పల్కవే.

బలమగు తాపముల్ హృదయభాండము వ్రయ్యలుసేయ, దానిలో
పలి యనురాగపూరము గుబాలునఁ జింది యసృక్ప్రవాహమ
ట్టులఁ బ్రవహించుచున్నది కనుంగొను; మద్దియె నిన్నుఁగాచు నో
జలదమ ! నీకు నావలె విషాదము గల్గినదేమొ పల్కవే.

---

# భగవద్గీత — దానినర్థము చేసికొను విధానము

పొక్కులూరి లక్ష్మీనారాయణగారు

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః" (భ. గీ)

శ్రీ భగవద్గీతలు నుపనిషత్తులును బ్రహ్మసూత్రములు నను మూఁడును వేదాంతశాస్త్రమునఁ బ్రస్థానత్రయ మని ప్రసిద్ధి నొందినవి. ప్రస్థానమను పదమునకుఁ బ్రమాణమనియు శాస్త్రమనియు నర్థములు. భగవద్గీతలకు గీతా శాస్త్రమని ప్రసిద్ధి కలదు. మొదటి యధ్యాయమున నర్జునుఁడు "శాధి మాం త్వాం ప్రపన్నం" అని శ్రీకృష్ణునిఁ బ్రార్థించెను. పదునేనవయధ్యాయము తుదను "ఇతి గుహ్యతమం శాస్త్రం" అనియు, గద్యయందు "యోగశాస్త్రే" యనియు నున్నది. గీతలు సర్వోపనిషత్సార మని చెప్పఁబడెను. భగవంతుఁడగు శ్రీకృష్ణునిచేఁ జెప్పఁబడినదగుట భగవద్గీతయని పిలువఁబడుచున్నది. బ్రహ్మముంగూర్చి తెలుపునదిగావున బ్రహ్మవిద్య యనఁబడుచున్నది.

ఇది దివ్యజ్ఞానియగు వ్యాసునిచే రచియింపఁబడిన పంచమవేదమనఁబడు మహాభారతమునందలి భీష్మపర్వము లోనిది; ౭౦౦ శ్లోకములు గలిగి ౧౮ యధ్యాయములుగ విభజింపఁ బడియున్నది. ఈగ్రంథము హిందువుల ముఖ్య మతగ్రంథముగ నెన్నఁబడుచున్నది. కురుపాండవులు కురుక్షేత్రమున యుద్ధసన్నద్ధులై సపు డర్జునుఁ డుభయ సేనలయందలి ముఖ్యుల సన్నిహితమృత్యువునకు నజ్ఞానముచే విలపింప నాతనికిఁ బార్థసారథియగు శ్రీకృష్ణుఁ డొనర్చిన వేదాంతధర్మబోధన యిందలి విషయము.

హిందూతత్త్వశాస్త్రమున, న్యాయము, వైశేషికము, సాంఖ్యము, యోగము, మీమాంస, వేదాంతము, నని యాఱుసిద్ధాంతములు గలవు. స్వల్పభేదములతో నీయాఱును భిన్నభిన్నమార్గములచే పరమార్థమునే ప్రతిపాదించుచున్నవి. వీనిని షడ్దర్శనము లని పిలుచుచున్నారు.

అందు కడపటిదగు వేదాంతశాస్త్రమునను అనేకాంతర్భేదములు గలవు. వానియందు ద్వైతాద్వైత విశిష్టాద్వైతసిద్ధాంతములు ముఖ్యములు. వీనినే మతత్రయమని చెప్పుచున్నారు. ఈవిభేదము గీతల యనంతర కాలమునఁ బ్రస్ఫుటమైన ట్లాయామతాచార్యుల కాలములను బట్టి మనము తెలిసికొనవచ్చును. ముప్వురు మతాచార్యులును ప్రస్థానత్రయమునకును తమతమ సిద్ధాంతానుసారముగ భాష్యములను వ్రాసియున్నారు.

అందద్వైత మతప్రతిష్ఠాతలలో శ్రీశంకరాచార్యులవారు ముఖ్యులు. వీరు శా. శ. ౭౧౨-౭౪౨ సంవత్సరములలో నున్నట్లు చారిత్రకులు దెలుపుచున్నారు. జ్యోతిష్కులు ౨౦౧౩ సంవత్సరముల క్రిందట శంకరాచార్యులవతరించెననుచున్నారు. వీరిసిద్ధాంతమున, ఈశ్వరుఁడు ఆత్మ లేక బ్రహ్మ, నిత్యము. ఈశ్వరమాయాశక్తియే ప్రకృతి. కాన్పించునదియు, మార్పుచెందునదియు నెల్ల మిథ్య. ఆత్మ మాయావృతమగుటయే సంసారము. ఆత్మ స్వస్వరూపజ్ఞానము బొందుట, లేక బ్రహ్మమగుటయే ఆనందము; ముక్తి. దీనినే సాయుజ్య మందురు. 'ఈదేహమందలి ఆత్మస్వరూపుఁడనగు నేనే బ్రహ్మమును.' 'సోహం', 'తత్త్వమసి' యనునదియే యీసిద్ధాంత సారాంశము. వీరి సిద్ధాంతమున బ్రహ్మకంటె వేఱగు పురుషుఁడు లేఁడు. అతఁడు నిర్గుణుఁడు. రెండవవాఁడు

లేనిదిగావున నద్వైత మనఁబడుచున్నది. జీవాత్మపరమాత్మ లనుభేద మిందు లేదు.

శ్రీరామానుజాచార్యులవారు విశిష్టాద్వైతప్రతిపాదకులలో నగ్రగణ్యులు. వీరు శా. శ. ౯౩౭ సంవత్సరప్రాంతమున నున్నట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. జ్యోతిష్కులు ౯౧౭ సంవత్సరముల క్రిందట నవతరించెననుచున్నారు. వీరి సిద్ధాంతమున ప్రకృతి, పురుషుఁడు, ఈశ్వరుఁడు నను మూఁడుతత్త్వములు గలవు. అవి యనాది. ప్రకృతిపురుషు లీశ్వరునికి శరీరమనియు, నీశ్వరుఁడు వానికెల్ల నాత్మయనియు, నీమూఁడిటికిని శరీరాత్మసంబంధముగలదనియుఁ జెప్పఁబడినది. భక్తిప్రపత్తులు మోక్షసాధనములు. వానిచే నీశ్వరస్వరూపము నొందుట-పరమకళ్యాణగుణపరిపూర్ణుఁడును, వైకుంఠవాసుఁడును, శంఖచక్రధారియు, చతుర్భుజుఁడును నగు శ్రీమహావిష్ణుస్వరూపమును, కౌస్తుభమాణిక్యము, లక్ష్మియునినాగాఁ బొంది, శాశ్వతవైకుంఠనివాసమున, భోగమును బొందుటయే వీరి ముక్తి. దీనిని సారూప్యమందురు. చిదచిద్విశిష్టమగు నీశ్వరునివలె నగునదిగావున విశిష్టాద్వైత మనఁబడుచున్నది.

శ్రీమధ్వాచార్యులవారు ద్వైతమతప్రతిష్ఠాతలు. వీరు శా. శ. ౧౧౧౯-౧౧౯౭ సంవత్సరముల మధ్య నున్నట్లు చారిత్రకులు దెలుపుచున్నారు. జ్యోతిష్కులు ౭౧౩ సంవత్సరముల క్రిందట నవతరించె ననుచున్నారు. ప్రకృతిపురుషులును, ఈశ్వరుఁడును వీరి సిద్ధాంతమునందును నిత్యులును, అనాదియు నయియున్నారు. పరమకల్యాణగుణపరిపూర్ణుఁడును, నిఖిలహేయప్రత్యనీకుఁడును నగు నీశ్వరునితో ప్రకృతిపురుషులకు శరీరాత్మసంబంధము గలుగదనియు, పురుషుఁడు ప్రభుసేవకన్యాయమున శాశ్వతముగ శ్రీహరిసాన్నిధ్యమును బొందుటయే సాధారణముక్తియనియు వీరిసిద్ధాంతము. ద్వైతముక్తి నాలుగువిధములు. సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము. సాలోక్యమన విష్ణులోకమున నివసించుట. సామీప్య మన విష్ణుసాన్నిధ్యమున వర్తించుట. సారూప్య మన విష్ణువువలె శంఖచక్రాదిచిహ్నములతో నుండుట ఈమూఁడును మానవజాతికి లభ్యమగు ముక్తిభేదములు. ఇందు మొదటిదానికంటె రెండవదియు, దానికంటె మూఁడవదియు శ్రేష్ఠతరములు. నాల్గవదగు సాయుజ్యము—సర్వేశ్వరునియందుఁ జేరుట, సాధారణులకు లభ్యము కాదు. ఇంద్రియాధిష్ఠానదేవతలు మున్నగువారుమాత్రమే తమ స్వస్థానమగు సాయుజ్యముక్తి కర్హులు. భక్తిధ్యానములు మోక్షసాధనములు. ఈశ్వరుఁడును పురుషుఁడును రెండుగ నుండుటచే ద్వైత మనఁబడుచున్నది. భగవద్గీతపై నీముగ్వురు మతాచార్యులును వ్యాఖ్యానములను రచించియున్నారు. వారివారి మతసిద్ధాంతముల ననుసరించి వారివారి వ్యాఖ్యానములును భిన్నమార్గములు గలిగియున్నవి. వానిని స్థాలీపులాకన్యాయముగఁ దెలియుట భగవద్గీతాజిజ్ఞాసువులకు లాభకరము గాక పోదు. గీతలందలి శ్లోకములు గొన్ని ద్వైతమునకును, గొన్ని యద్వైతమునకును, మఱికొన్ని విశిష్టాద్వైతమునకును ననుకూలముగ నున్నట్లు గాన్పించును. ఆభేదములను విమర్శించుటకైనను సిద్ధాంతజ్ఞాన మావశ్యకము.

శ్రీశంకరాచార్యులు భగవద్గీతలనుగూర్చి తమ వ్యాఖ్యానపీఠికయం దిట్లు దెల్పియున్నారు. "ప్రవృత్తి యనియు నివృత్తి యనియు ధర్మము రెండువిధములు. ప్రవృత్తియందున్న యర్జునాదులకు 'కర్మ' మార్గ మాచరణీయము. స్వవర్ణోచితకర్మ చిత్తశుద్ధిద్వారమున నాత్మజ్ఞాననిష్ఠ కలిగించును. జ్ఞానమే కేవలమోక్షసాధనము. కర్మ, జ్ఞాననిష్ఠకు సహాయకారి. (వీరిసిద్ధాంతమున భక్తి జ్ఞానస్వరూపమేకాని వేఱుమార్గముగాదు. జనకాదులు ప్రవృత్తికొఱకును సనకాదులు నివృత్తికొఱకును సృజింపఁబడి రని వీరి యభిప్రాయము.)

జ్ఞానియైనపిదప శరీరధారణోచితమగు భిక్షాటనాది కర్మకుపరమగు కర్మయనవసరము. జ్ఞానము సన్న్యాసలక్షణము. గీతాశాస్త్ర మభ్యుదయనిశ్శ్రేయస సాధనము.

నిశ్శ్రేయసము సర్వకర్మసన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠాద్వారమునఁ బొందఁదగినది."—వీరి సిద్ధాంతము, ప్రవృత్తినివృత్తిరూపమగు రెండుధర్మములు అర్జునుని నిమిత్తముగఁ జేసికొని శ్రీకృష్ణుఁడు భగవద్గీతామూలమున వైదికధర్మరక్షణద్వారమున సర్వధర్మరక్షణము గావించుటకు బోధింపఁబడె నని చెప్పుచున్నది. జ్ఞాననిష్ఠాపరులకు సర్వకర్మ(ఆశ్రమ) సన్న్యాసమును వీరు నియమించియున్నారు. శ్రీశంకరాచార్యులవారు బాల్యసన్న్యాసులు.

శ్రీరామానుజులు కర్మజ్ఞానములు భక్తిప్రపత్తులకు సాధనములనియు భక్తిప్రపత్తులే మోక్షసాధనములనియు సిద్ధాంతీకరించిరి. శ్రీమధ్వాచార్యులు నీసాధనసముచ్చయము నంగీకరించిరిగాని భక్తిధ్యానములు మోక్షసాధన మని సిద్ధాంతముఁ జేసిరి. వీరిరువురును సన్న్యాసమును శాసించనులేదు; నిషేధించనులేదు. కాని యిరువురును సన్న్యాసాశ్రమమును స్వీకరించినవారే. వీరి యుభయుల సిద్ధాంతములందును 'భక్తి' ప్రత్యేకమోక్షమార్గము. త్రిమతాచార్యులును గీతలయందలి శ్లోకములను తమతమ సిద్ధాంతముల కనుకూలించునట్లెట్లర్థములను జెప్పియున్నారో, కొన్ని ముఖ్యోదాహరణములను జూడుఁడు.

'నత్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః,
నచైవ నభవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్" ౨—౧౨.

'నేనుగాని నీవుగాని యీరాజులుగాని మున్నెన్నఁడును లేనివారము గాము. మన మందరమును నికముం దుండనివారము గాము.'

శంకరుని తత్త్వప్రకార మాత్మపదార్థ మొక్కటియే. రామానుజమధ్వాచార్యుల తత్త్వప్రకార మాత్మ లనేకము. ఆయాభావము లీశ్లోకవ్యాఖ్యానములందు వార లిట్లు వివరించిరి:—

"ఆత్మస్వరూపముచే నేనును నీవును ఈరాజులును మూఁడుకాలములయందు నిత్యులము. బహువచనము దేహభేదముచేఁగాని, యాత్మభేదముచేతఁ గాదు." (శం.) "సర్వేశ్వరుఁడనగు నే నెట్లు నిత్యుఁడనో జీవాత్మలగు మీ రందరు నట్లు నిత్యులే" (రా) (మధ్వ).

'నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టో౽న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః." ౨—౧౬.

ఈశ్లోకమున మొదటిపంక్తిలో 'సత్', 'అసత్' అను రెండుపదములు వాడఁబడియున్నవి.

న + అసతః + విద్యతే + భావః, న + అభావః + విద్యతే + సతః, యని శంకరరామానుజులును, న + అసతః + విద్యతే + అభావః,—పైవలెనే యని మధ్వాచార్యులును పదవిభాగములు చేసి పైరెండుపదములకు నిట్లర్థముల నిచ్చిరి—

| | | |
|---|---|---|
| ౧. సత్ = ఆత్మ (నిత్యము) | అసత్ = శీతోష్ణాదులు (కల్పితములు) | (శం) |
| ౨. సత్ = ఆత్మలు (నిత్యములు) | అసత్ = దేహములు (అనిత్యములు) | (రా) |
| 3. సత్ = ఆత్మ (నిత్యము) | అసత్ = కారణమైనప్రకృతి ఇదియునాత్మవలెనేనిత్యము. | (మధ్వ) |

"అచ్ఛేద్యో౽య మదాహ్యో౽య మక్లేద్యో౽శోష్య ఏవచ,
నిత్య స్సర్వగతః స్థాణు రచలో౽యం సనాతనః" ౨—౨౪.

ఇందలి రెండవపంక్తి కీశ్వరసంబంధము లేకనే 'ఆత్మ నిత్యుఁడు, సర్వవ్యాపకుఁడు; స్థిరస్వభావము గలవాఁడు; అచంచలుఁడు; సనాతనుఁడు;'నని శంకరరామానుజులు వ్యాఖ్యానమును జేసిరి. మధ్వాచార్యులు 'నిత్యముగా సర్వవ్యాపకుఁడును, నైమిత్తికమైన యన్యథాభావము గూడ లేనివాఁడును, లౌకికక్రియలేనివాఁడును, సనాతనుఁడును నగునీశ్వరుని ప్రతిబింబమే యయినవాఁడు'అని వ్యాఖ్యానముఁ జేసియున్నారు.

ఇట్లే వందలకొలఁదిచోటుల సంప్రదాయభేదము ననుసరించి యర్థభేదము గ్రంథమం దంతటను గానవగును. అట్టిభేదములు గ్రంథవిస్తరభీతిచే స్థాలీపులాకన్యాయముగ మాత్ర మిట నుదాహరింపఁబడెను.

ఇంతవఱకుఁ బ్రాచీనవ్యాఖ్యాతలనుగూర్చియు గీతలపై వారి యభిప్రాయములనుగూర్చియు సంక్షేపముగఁ దెలిపియుంటిని. అవి ఆయామతాచార్యులయందు గౌరవమును, భక్తియుఁ గలవారికొఱకు నుద్దేశింపఁబడినవి.

కాని గీతలను వ్యాఖ్యానములతో నిమిత్తము లేకయే యర్థముఁ జేసికొను నవీనులగు స్వతంత్రులు గొందఱున్నారు. అట్లు చేయుట సాధారణులకు సాధ్యము కాదు. నవీనవ్యాఖ్యాతలలో మహామేధాశాలియు, విద్వాంసుఁడును నగు కీర్తిశేషుఁడైన బాలగంగాధరతిలకుగా రగ్రేసరులు. వారు పూర్వవ్యాఖ్యాతలు రచించిన వ్యాఖ్యానములకంటె పెద్దదగు భాష్యమును గీతలపై విశేషపరిశ్రమచేసి రచించియున్నారు. వారికిఁబిమ్మటను, అరవిందఘోషు, భగవాన్‌దాసు, బిసాంటు, వి. జి. రీల్; వ్రజేంద్రనాథశీలు, ధీరేంద్రనాథపాలు, గాంధీజీ మున్నగు ప్రముఖు లనేకులు గీతలపై స్వతంత్రాభిప్రాయములను బ్రకటించియున్నారు. ప్రొఫెసరు M. రంగాచారి, S D బుద్ధిరాజుగారలు తిలకుగారివలె గీతలపై స్వతంత్రవిపుల వ్యాఖ్యానములనే వ్రాసియున్నారు. ఆంధ్రాధునికగీతా వ్యాఖ్యాతలలో నగ్రగణ్యులును కర్మయోగమతాచార్యులును నగు శ్రీతిలకుగారి గీతారహస్యమును మనదేశమున విశేషప్రచారము గాంచియున్నది.

ఈసందర్భమున సంక్షేపముగ వారి యభిప్రాయములను దెలియుటయు నవసరము. "సాంసారికకర్మలు గౌణములని, లేక త్యాజ్యములని నిశ్చయించి, బ్రహ్మజ్ఞానము, భక్తి మొదలగు కేవలనివృత్తిపరమగు మోక్షమార్గమే గీతలయందు నిరూపింపఁబడినదను మతము నాకు సమ్మతముగాకున్నను, మోక్షప్రాప్తికిఁ గల మార్గము బొత్తిగ వివేచింపఁబడలేదని నే ననను." "జ్ఞానమూలకమును భక్తిప్రధానము నగు కర్మయోగమే గీతలయందు భగవంతుఁడు ప్రతిపాదించెనని నాయభిప్రాయము"

వీరి యభిప్రాయములు గ్రంథముయొక్క ఉపక్రమోపసంహారములపై నాధారపడియున్నవి. అర్జునునిచే యుద్ధము చేయించుటయే (కర్మయోగము) గీతల ప్రధానోద్దేశమని వీరు తెలుపుచున్నారు. వీరు శంకరులవలె కర్మ మున్నగునవి జ్ఞానమునకు సాధనములుగను, జ్ఞానమునే కడపటి మోక్షసాధనముగను, నంగీకరింతురు. వీరి భక్తి శంకరులభక్తివలెఁ గేవలాత్మవిచారరూపమగు నిర్గుణభక్తి గాని, రామానుజమధ్వాచార్యుల భక్తివలె సగుణభక్తి గాదు. జనకాదులవలె జ్ఞానులైనపిమ్మటను, ఆమరణాంతము లోకసంగ్రహముకొఱకు నిష్కామకర్మ మొనర్చుటయే గీతాసిద్ధాంతము కాని సన్న్యాసము గీతాసిద్ధాంతము కాదని వీరి యభిప్రాయము. స్వధర్మ మన స్వవర్ణధర్మమేకాక, తాత్కాలికమైనికాది ధర్మముగూడ నని వీరి యభిప్రాయము. గీతలందు 'యోగ'మనుపదమునకు 'కర్మయోగమే' ముఖ్యార్థమని వీరివాదము.

అరవిందఘోషు తన గీతోపన్యాసములలో గీతలపై నిట్లభిప్రాయమిచ్చియున్నాఁడు. "భగవద్గీతలు చదువుటలో నందలి భాషావిచారణ సేయుటగాని, సిద్ధాంతపూర్వపక్షములు సేయుటగాని, యందలి తత్త్వశాస్త్రమున కాధ్యాత్మికవిజ్ఞానచారిత్రమున స్థాననిర్ణయ మొనరించుటగాని, పూర్వాపరసందర్భశూన్యముగ నేముక్కకాముక్క గ్రహించుటగాని మనయుద్దేశము గాదు. మన తరణోపాయముకొఱకు దాని నాశ్రయించుచున్నాము. కావున నందలి మానవత్వసంపూర్ణతాసాధనమును, పరమనిశ్శ్రేయససాధనమును నగు ప్రధానసజీవసందేశమును గుర్తించుటయే మన యుద్దేశమైయుండవలెను." "గీతోపదేశమును కేవలాధ్యాత్మిక తత్త్వశాస్త్రమాత్రముగను, నైతికసిద్ధాంతమాత్రముగను మన మెంచరాదు. నైతికధర్మాచరణమునకును, మానవాధ్యాత్మికజీవనమునకును గలిగిన దృశ్యమానపరస్పరవైషమ్యస్థితికి సంబంధించినదని మనము తెలిసికొనవలెను."

ప్రొఫెసరు యం. రంగాచార్యులుగారు తమ గీతావ్యాఖ్యానపీఠికయం దిట్లభిప్రాయము నిచ్చియున్నారు.— "గీతలు మానవజీవితతత్త్వమునేకాక, ఆత్మసందర్శన

మును, తద్ద్వారమునఁ బరమేశ్వరసందర్శనమును గూడఁ బ్రతిపాదించుచు, సర్వభూతసమత్వమను నైతికసిద్ధాంతమే మానవ జీవితమున కత్యుచితాదర్శమని చెప్పుచున్నవి."

ఇంచుమించుగ నవీనవ్యాఖ్యాత లెల్లరును స్వల్ప భేదములతో నాశ్రమసన్న్యాసప్రతికూలముగను, యావజ్జీవకర్మయోగానుకూలముగనే యభిప్రాయముల నిచ్చియున్నారని చెప్పవచ్చును. గీతలు జీవయాత్రావిధానము నుత్తమమార్గమున నడపుకొనుచు పరమార్థమును సంపాదించుట కుద్దేశింపఁబడిన వనునది యాధునికుల ప్రబలాభిప్రాయము.

ఇఁక వేదాంతవిషయమున గీతలు కేవలకర్మమును ప్రతిపాదించునా? జ్ఞానము ను ప్రతిపాదించునా? భక్తిని ప్రతిపాదించునా? లేక మూఁడిటినిగాని, యే రెండిటినిగాని ముక్తిసాధనములుగ నిరూపించునా? అనువిషయ మాలోచనీయము. ఈవిషయమై యసంఖ్యాకములగు భిన్నాభిప్రాయములు గలవు. అద్వైతమతస్థులు కేవలజ్ఞానమే ముఖ్యసాధన మని యెంచుచున్నారు. చైతన్యమతస్థులు కేవలభక్తియే మోక్షసాధన మని యెంచుచున్నారు. మీమాంసకులు కేవలవైదికకర్మాచరణమే మోక్షసాధన మనుచున్నారు. ద్వైతవిశిష్టాద్వైతమతస్థులు మూఁడిటి సముచ్చయము నంగీకరించుచున్నారు. సమన్వయవాదులు జ్ఞానకర్మరహితమగు భక్తియు, భక్తికర్మరహితమగు జ్ఞానమును, జ్ఞానభక్తిరహితమగు కర్మయు నుండ వనియు, నందేదేని ప్రాముఖ్యమును వహించి, తక్కిన రెండును సాధారణముగ నుండు ననియు, నట్టి త్రివిధతత్త్వములు గలవారునుగూడ మోక్షమును బొందెదరనియు చెప్పుచున్నారు. కొందరు గీతలు షడ్దర్శనసమన్వయమని తెలుపుచున్నారు.

పైయభిప్రాయములలో నెద్దానితో నేకీభవించువారైనను మోక్షపరాయణులే యనువిషయము నిర్వివాదము. ఆస్తికుఁడైన ప్రతివాఁడును నేఁడో రేపో ముక్తిని గాంచవలసినదే. ఈవిషయము గీతలందు శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పియున్నాఁడు:—

"అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః."

కావున రుచిభేదమునుబట్టియు, తత్త్వభేదమును బట్టియు, వ్యక్తుల పరిణామస్థానమునుబట్టియు నెల్లవారును గీతలందలి సిద్ధాంతముల నాశ్రయించి తరింపవచ్చును. గీతలందు సర్వవిషయములును సర్వసిద్ధాంతములును గలవు. సర్వార్థసంపన్నమగుటచేతనే గీత లుపనిషత్తనఁ బడుచున్నవి. గీతాప్రవాహమున నజ్ఞానులగు శిశువుల కందు మెరకప్రదేశమును, జ్ఞానులగు పెద్దల కందరాని నిమ్నప్రదేశములునుగూడఁ గలవు. సర్వమతములు నందిమిడియున్నవి. వానిఁ దెలియుట మన జీవితకర్తవ్యము. నైతిక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, భౌతిక, మానసిక విజ్ఞానము లెల్ల నందుఁ గలవు. వేయేల? నీచప్రవృత్తియగు నాసురసంపద మొదలు పరమపవిత్రమగు పురుషోత్తమప్రాప్తివరకు గీతలయందు లేనిది లేదు.

వ్యాసము ముగింపకముందు గీతల బహిరంగవిమర్శనమును గొంతచేయుట పాఠకుల సౌకర్యమునకుఁ దోడ్పడునని యెంచి, భగవద్గీతలయందలి భాషనుగూర్చియు, నధ్యాయవిభజనమును, తన్నామములనుగూర్చియుఁ గొంత తెలుపుచున్నాను.

ఇందలి భాష మృదులమును, సులభమునై స్వల్పసంస్కృతభాషాపరిచయము గలవారలకును సుబోధకమని చెప్పఁదగియున్నది. అక్కడక్కడ ౧౧, ౧౫ అధ్యాయములలోఁ గొన్ని వృత్తములు గలవుగాని, తక్కిన వెల్ల సులభముగ బాలబాలికలుసైతముఁ జదువగల యనుష్టుప్ శ్లోకములైయున్నవి. కాని, భాషయుఁ గవిత్వము నెంతసులభములో యంత సంశ్లేషవిశ్లేషములకు వీలుగలిగియుండుటమాత్రము దైవోద్దేశమేమోయని తోఁచును. దురవగాహమగు వేదాంతగ్రంథమునకు లెక్కలేని వ్యాఖ్యానములకు తావొసఁగు భాషను బ్రసాదించిన పరమేశ్వరుని మహిమ కచ్చెరు వందవలసినదేకాని, వ్యాఖ్యాతలను, వారి సిద్ధాంతములను, భాషా

పాండిత్యమును దూరిన లాభము లేదు. ఒక్కశ్లోకమునకే, ఒక్కపదమునకే, వివిధవ్యాఖ్యాతలు వివిధార్థముల నిచ్చుచుండ, సాధారణబుద్ధిమంతుఁడు గీత లర్థముచేసికొనుట కెట్లు ప్రయత్నింపఁగలఁడు? భిన్నసంప్రదాయముల ననుసరించి భిన్నవ్యాఖ్యానములు బయలు వెడలినవి. ఆయాసంప్రదాయములందలివా రాయావ్యాఖ్యానములే సరియైన వనియు, తక్కిన వ్యాఖ్యానములు తప్పనియుఁ జెప్పుచున్నారు. ఏసంప్రదాయమునకును జెందని స్వతంత్రులు, వ్యాఖ్యాతలు, భాషాపాండిత్యము నాధారముచేసికొని తమతమ సిద్ధాంతములను బలపర్చుకొనుటకు శ్లోకములకు వికృతాన్వయ మొనర్చిరనియు, పదములను విఱిచి ముక్కలుచేసిరనియుఁ జెప్పుచున్నారు.

ఈప్రాచీనాధునికసంఘర్షణమునను, గీతలు తమ ప్రాముఖ్యమును గోలుపోలేదు. విశాలదృక్పథమునఁ బరికించిన, గీతలు సర్వతోముఖత్వముగల యద్భుతగ్రంథ మని తోఁచును. హిందూమతస్థులేకాక యితరమతస్థులును నీగ్రంథమునకు తమమతానుకూల వ్యాఖ్యానములను రచించినట్లు దెలియుచున్నది.

భాషావిషయమునందువలెనే, యధ్యాయవిభజనమునందును పెక్కు భిన్నాభిప్రాయములు గలవు. మహాభారతమునందలి మూలగ్రంథమున నధ్యాయవిభజనము మాత్ర ముండి వానిపేరులు లే వనియు, నధ్యాయనామములు నవీనకల్పనయనియుఁ గొందరనుచున్నారు. ఇంతియె కాక, కర్మయోగాధ్యాయమున జ్ఞానయోగప్రశంసయు, నట్లే జ్ఞానయోగాధ్యాయమునఁ గర్మయోగప్రశంసయు, భక్తియోగమున జ్ఞానకర్మప్రశంసయును గానుపించుటచేతను అర్జునవిషాదము, విభూతి, పురుషోత్తమప్రాప్తి, మున్నగునవి కొన్ని దక్క తక్కినపేరు లుచితముగ లేవని కొందరు శంకించుచున్నారు. గోభిలుఁ డీయధ్యాయవిభజనమే సరికా దని, వేఱురీతిగ ౧౮ కంటె నెక్కుడుగ నధ్యాయములను విభజించి నామకరణములను జేసియున్నాఁడు. ధీరేంద్రనాథపాలు ౧౦ యధ్యాయములక్రింద విభజించి చూపి యిట్లుండిన మే లనుచున్నాఁడు.

ఇఁక నేయధ్యాయము లేవిషయములను బ్రతిపాదించు ననువిషయమునను పెక్కు భిన్నాభిప్రాయములు గలవు. శాంకరీయులు మొదటిషట్కము 'త్వం' పదవాచ్యుఁడగు ప్రత్యగాత్మను, రెండవషట్కము 'తత్' పదవాచ్యుఁడగు బ్రహ్మమును, మూఁడవషట్కము 'అసి' యను పైరెండిటి నైక్యమును నిరూపించుచున్నదనియు, కొందరు మొదటిషట్కము కర్మను, రెండవషట్కము భక్తిని, మూఁడవషట్కము జ్ఞానమును బ్రతిపాదించుచున్నదనియు, మధుసూదనసరస్వతి మొదటిరెం డధ్యాయములే మూలగ్రంథ మనియు తక్కిన ౧౬ అధ్యాయములును రెండవయధ్యాయముయొక్క వ్యాఖ్యానరూపములైన వనియు, కేవలసాంఖ్యప్రతిపాదనమే గీతోద్దేశమనియు, శ్రీతిలకుగారు గ్రంథమంతయుఁ గర్మయోగప్రతిపాదన మొనర్చుచున్నదనియు వ్రాసియున్నారు.

అట్టినిర్ణయములు గీతాపాఠకులకు సహాయకారులైనఁ గావచ్చును, లేక సంశయకారులైనఁ గావచ్చును. అది పాఠకులతత్త్వము ననుసరించియుండును.

ఉపనిషత్తులు దెల్పు బ్రహ్మవిషయమును బ్రతిపాదించుటలో, గీతలు కొంచెమేనియు భేదములేకనే యుపనిషద్వాక్యములను శ్లోకభాగములుగఁ గైకొనుచున్నవి. స్వల్పభేదములతో గీతలందు పెక్కుచోటుల నుపనిషద్వాక్యములు గాన్పించుచున్నవి.

ఇక్కాలంబున భిన్నభిన్నదృక్పథములుగల చదువరుల కనుకూలించునట్లు పూర్వాధునికవ్యాఖ్యానవిశేషములతో సులభశైలిని హిందూసమాజమువారు ప్రకటించిన భగవద్గీత లోకోపకారక మని యెంచుచున్నాఁడను.

---

# (క్రికెట్టు ఆటగాండ్రు)



జె. జి. నావలెగారు


మార్షలుగారు



పాలయ్యాగారు



బి ఇ కపాడియాగారు


యస్ ఆర్ గో ంబేగారు



దలీపసింగుగారు



వింబిల్డన్ టెన్నిసు కోర్టులు



ఇలీనర్ పర్త్ కన్య



ఆంధ్ర జింఖానా టెన్నిస్ ఆటకాండ్రు
సి రామస్వామి, జె వి కె సుబ్బారావుగార్లు గెలిచిరి
(ఎదిరి) బి బాలగోపాల్, ఆర్ వి యస్ ప్రసాదుగార్లు



ఆర్. మైకీ, జిరోపతోగార్లు
( టెన్నిస్ ఆటకాండ్రు )



సిడ్నీవుడ్డు, టెన్నిస్ ఆటలో



# మధుర గోష్ఠి

కవితావినోద, అల్లంశెట్టి అప్పయ్యగారు

పవనుఁడు సువాసనలను దుర్వాసనలను
గైకొనుచు రెంటితోడను గలియనట్లు
సిద్ధుఁడు ప్రపంచమందు వసించుచున్న
నంటియుండఁడు దాని రవ్వంతయైన.

ఎఱిఁగియే నెఱుఁగకేనియు నెవ్వఁడేని
యమృతపుం దొట్టిలోఁ బడ్డ నమృతుఁడగును
ఇష్టపడియైన లేకున్న నెప్పుడైన
నొక్కసారి యీశు భజింప నొదవు ముక్తి.

మధురతరశర్కర భుజించు మానవునకు
పట్టిబెల్లంబు రుచ్యమై యెట్లు లుండుఁ?
ప్రాజ్ఞుఁడైన బ్రహ్మానందపరవశునకుఁ
గలుగునే వాంఛ యన్యసౌఖ్యములపైని?

కొలిమిలోఁ బెట్టి కాల్చెడుకొలఁది మిగుల
నెఱ్ఱనై యగ్నివలెఁ దోఁచు నినుపముక్క
సాధువులచెంతఁ గూర్చుండు సమయమందె
ధర్మసూత్రంబులం బల్కు దాంభికుండు.

ప్రభుని దర్శించుటకు మంత్రివర్గములను
ద్వారపాలకులను వశపఱచినట్టు
లీశ్వరుని సన్నిధిం జేర నెంచువాఁడు
చెలఁగి సత్పురుషులఁ గూడి మెలఁగవలయు.

మట్టిలో మేకు సుళువుగాఁ గొట్టవచ్చుఁ
గఠినపాషాణమున దింపఁగలమె దాని?
పుణ్యపురుషప్రబోధంబు పూర్ణభక్తి
పరుని చెవి సోకినట్లు లంపటుని కగునె?

చేయవచ్చు మెత్తని మట్టిచేతఁ బాత్ర
లట్టు తగియున్నె కాలిన గట్టిమన్ను?
అహహా! ప్రాపంచికపు వాంఛ లలముకొనెడు
హృదయ మున్నతఫణితి గ్రహించునొక్కొ?

పాదరసమును బూయు దర్పణమునందు
స్వీయమగు ప్రతిబింబ మీక్షించినట్లు
విమలవైరాగ్యతత్పరు హృదయవీథిఁ
బ్రతిఫలించుచునుండు నీశ్వరుని చాయ.

బరువుగల్లు తక్కెడసిబ్బె పైకి లేవ
దట్టె లేచు భారములేనియది నిజంబు
అధికతర సంసరణబాధ లందునరుఁడు
క్రుంగిపోవు; నన్యుం డీశుఁగూర్చి చనును.

పారుదలగల్గు నీరు శుభ్రమయియుండు
చెడును నానాఁట నిలిచిన చెఱువునీరు
ధనము నిస్సంగులగువారిఁ దప్పిపోయి
కాలగతి నన్యమార్గసంగతిఁ జరించు.

పంచదారతో నిసుక కల్పఁబడియున్న
నిసుకఁ ద్రోసి శర్కరఁ దా గ్రహించుఁ జీమ
లోకసంసర్గదుష్క్రియల్ పోకడంచి
మంచినే గ్రహియించు సన్మార్గుఁ డెపుడు.

భానుఁ డుత్తేజలీలఁ బ్రపంచమందు
వెలుఁగు; మేఘాళిలోఁ గానిపింపఁగలఁడె?
గాఢతర దుర్మదాక్రాంతకలుషితమగు
హృదయమందు వెలుంగునే యీశ్వరుండు?

పాదరస మది సీససంభరితమైన
నేక మైపోవు రెండును బ్రాకటముగ
నట్లె; జీవాత్మ పరమాత్మయందుఁ జేర్పఁ
దనదు వ్యక్తి దొలంగి సత్పథముఁ గనును.

సూదిలో దారమును గూర్పఁ జూచువాఁడు
చేరుకొన సన్నమగునట్లు చేయవలయు
హృదయ మీశ్వరుపై నిల్ప నెంచువాఁడు
కోరిక లడంచుకొని శాంతిఁ గుదురవలయు.

సాగరంబున ముత్తెముల్ చాలఁ గలవు
వాని యత్నింపఁ బడయంగవచ్చు, నటులె
దృశ్యమానజగంబున దేవుఁ డొకఁడు
కలఁడు; యత్నించిన నతండె కానిపించు.

పడవ నీటిలోపలనుంట పాడియగును
గాని, పడవలో నీ రుండఁ గార్యమగునె?
ఈశ్వరాన్వేషులు జగాన నిముడవచ్చు
జగము వారిలో నిముడుట తగదు తగదు.

[ శ్రీ రామకృష్ణపరమహంసవాక్యావళినుండి అనువాదము



పూరి జగన్నాథస్వామి దేవాలయము (దక్షిణపువైపునుంచి)

చిత్రకారుడు: కే. విశ్వనాథముగారు, తాతానగర్.

# ౫. జ్యోతిషము




విద్వాన్, గరిమెళ్ల సోమన్నగారు, యమ్. ఏ., యల్. టి.

అక్షయదీప్తుల ననిశము వ్రేలెడి లక్షలు కోటులు నక్షత్రంబులు దేవుని మహిమను దెలుపుచు ఆకాశమునం దెల్ల దెసలను నిండియున్నవి. ఈయనంతకోటినక్షత్రములలో సూర్యుం డొకనక్షత్రము, ఒక సామాన్యనక్షత్రము ఈసూర్యనక్షత్రమునకు సంబంధించిన గ్రహములలో నొకటియగు ఈభూగోళము సృష్టిలో అత్యంతస్వల్పభాగ మయియున్నది. వేయిమైళ్ల ఎత్తును, వేయిమైళ్ల వెడల్పును, లక్షమైళ్ల పొడువును గల మహాపర్వతమునకును పరమాణువునకును ఎంత వ్యత్యాస ముండునో అంత వ్యత్యాసము గల దీప్రపంచమునకును భూమికిని. భూమిం గల ప్రాణికోటిలో మానవజాతి లక్షలో నొకవంతయినను కానేరదు. మానవుని ప్రాముఖ్య మింతలో నున్నది. అయినను మానవుఁడు సృష్టిలో నెల్ల తానుత్కృష్టుఁడనియు, తనతోడిదే ప్రపంచమనియు భావించి భ్రమపడుచుండును.

తలయెత్తి చూచినచో వాని యల్పత్వము వానికి వెంటనే స్ఫురించును. అపారమగు నాకాశమును, ఆయాకాశమున నిరాలంబముగ నిరతముగ నిర్బుదకోటిసంఖ్యాకముగ ఖగోళములు—భూగోళమునకన్న కోటికోట్ల మడుంగులు పెద్దవియు, ప్రకాశవంతములును—ఏల సృజింపఁబడెను? ఎవ్వనిచే ఎట్లు సృజింపఁబడెను? ఈ మహాగోళములలో ప్రాణివర్గము కలదా? ఇవి చలించుచున్నవా? వీని గతి యేమి? వీని స్థితి యేమి? వీని సంబంధము లెట్టివి? అపారంబగు అంతరాళమున ఇవి చేయుపను లెవ్వి? ఇవి ఎంతకాలమునుండి యున్నవి? ఎంతకాల ముండును? ఈ నక్షత్రప్రపంచములలో కాంతిభ్రాంతులలోను, ప్రమాణపరిణామములలోను ఏయే భేదములు కలవు? వీనికిని చైతన్యము కలదా? వీని నియామకమేది?—ఇట్టిప్రశ్నలు మతిమంతులకు నిరంతరముగ తోఁచుచుండును. అనేకకోటియుగములనుండి యీఖగోళకోటులు అంతరాళమున తిరుగుచునే యున్నవి. భూమిపై మానవుఁ డుద్భవించినప్పటినుండియు ఖగోళకోటిదర్శనముచే విస్మితుఁడయి, విభ్రాంతుఁడయి, వినమ్రుఁడయి, వినోదభరితుఁడయి, వివేకవర్తనుఁడయి వ్యవహరించుచున్నాఁడు.

ఈ ప్రపంచముల ఉత్పత్తిస్థితిలయములనుగుఱించి మన పూర్వులు-ఆర్యులు-సిద్ధాంతములను చేసియున్నారు సర్వమును ఆత్మ (బ్రహ్మ) స్వరూప మనియు ఆత్మనుండి ఆకాశమును, ఆకాశమునుండి వాయువును, వాయువునుండి అగ్నియు, అగ్నినుండి జలమును, జలమునుండి పృథివియు, పృథివినుండి ఓషధులును, ఓషధులనుండి అన్నమును, అన్నమునుండి పురుషుఁడును కలిగిరని యుపనిషత్తొకటి-తైత్తిరీయము-బోధించును. పంచభూతముల సృష్టిలోనిదియే ఖగోళసృష్టి. ఖగోళములు పాంచభౌతికములు. వివేకింపఁగ సృష్టియంతయు తుదకు ఆత్మమయ మగును. ఆత్మకన్న వేఱు వస్తువు లేదు. దాని వికారములే కనఁబడు ప్రపంచము లన్నియును. మృత్తు

నుండి ఘటశరావాద్యనేకరూపభేదములు కలిగినటుల ఆత్మ నుండియే బ్రహ్మమునుండియే నామరూపలక్షణలక్షిత మగు సర్గము కలుగుచున్నది. మఱియు ఆత్మవలననే ఈసృష్టి స్థితిలయములకు లోనగుచున్నది. ఆత్మయే సత్యము. తదితరము వికారము, వాస్తవభేదము లేదు.

పాశ్చాత్యదేశములలో ఇటీవలి భౌతికపరిశీలనలవలన కూడ ఇంచుమించుగ ఈసిద్ధాంతమే తేలుచున్నది. ఇది ఎలక్ట్రనుసిద్ధాంతము. ఖగోళములనుగుఱించి పాశ్చాత్య సిద్ధాంతములను గొన్ని దిగువ పొందుపఱుచుచున్నాము.

సృష్టిప్రకారమును ప్రథమమున సిద్ధాంతీకరించిన విజ్ఞుఁడు లాప్లసు అను ఫ్రెంచిగణితవిశారదుఁడు. ఇతఁడు ౧౭౯౬-వ సం.లో తన సిద్ధాంతమును ప్రకటించెను. ఆకాశమున నక్షత్రముల మధ్యను అచ్చటచ్చట తెల్లని మబ్బువలె, తెల్లని పొగవలె మచ్చలు — చిన్నవియు, పెద్దవియు—కనఁబడుచుండును. ఇవి నిరంతరముగ నుండును. ఇవి మేఘశకలములు కావు. మేఘములు ఏడెనిమిదిమైళ్ల లోపుగ నుండును. నక్షత్రమధ్యమున కనఁబడు నీమచ్చలకు పాశ్చాత్యులు 'నెబ్యుల' అను పే రిడియున్నారు. నెబ్యుల అనఁగ పొగధూమములని వ్యుత్పత్త్యర్థము. పొగవలె కనఁబడుటచే ఈరూపములకు నెబ్యులఅను పేరు పెట్టఁబడెను. మనకు నెబ్యులలు అనేకకోటిమైళ్ల దూరమున నుండును. ఇవి మనకంటికి చిన్నవిగ కనఁబడినను వాస్తవముగ అవి లక్షలకొలఁదిమైళ్ల విస్తీర్ణము కలిగియుండును. మృగశిరనక్షత్రములలో ఒక నెబ్యుల కలదు. కృత్తికలో ఒకటి గలదు. ఆకాశగంగ అనఁబడు తెల్లనిపెద్దమచ్చ ఒకనెబ్యుల. ఇటులనే ఇంకను ఎన్నియో నెబ్యులలు ఆకాశమునఁ గలవు. ఇవి వేనవేలు.

## నక్షత్రజననము

నెబ్యులలు అతిసూక్ష్మపదార్థములతో విస్తరించియుండును. ఈనెబ్యులలు అనునవియే నక్షత్రసృష్టిని కావించును. నెబ్యుల మరచుట్టుగ చలించుచు అగ్రమున భిన్నము లగుచుండ ఈభిన్నాగ్రములు విడిపోయి నక్షత్రములుగ బయలుదేరును. నెబ్యులల భ్రమణవేగము వీనికిని కలిగినందున వీనికి పుట్టిన నక్షత్రములకును ఆగమనవేగ ముండును.

ఇట్లు నక్షత్రములు పుట్టుటకు కోట్లకొలఁది సంవత్సరములు పట్టును. నక్షత్రము లన్నియు ఇట్లు నెబ్యులలవలననే ఉత్పత్తియయినవి, అగుచున్నవి, కాఁగలవు. సృష్టి యున్నంతకాలము ఇట్లు నక్షత్రముల జననము అగుచునేయుండును. నక్షత్రములు భ్రమణముఁజెందుచు గ్రహములను పుట్టించును. గ్రహములు తిరుగుచు ఉపగ్రహములను పుట్టించును. ఇయ్యది సృష్టిప్రకారము. సూర్యకుటుంబము ఇట్లు పుట్టినదే. మనభూమి ఒకఅణువువలె ఇట్లు జారినదే. నక్షత్రములలో పరిమాణములను బట్టియు, రంగులనుబట్టియు, కాంతులనుబట్టియు భేదములు కనఁబడును. కొన్నినక్షత్రములు — స్వాతి, ఆర్ద్ర మున్నగునవి—ఎఱ్ఱగను, కొన్ని తెల్లగను, కొన్ని నీలిగను నుండును. కొన్నినక్షత్రములు ఎక్కువప్రకాశము గలవియు, కొన్ని స్వల్పకాంతులు కలిగి మిణుకుమిణుకు లాడునవియుగ నుండును సప్తర్షిమండలములోని నక్షత్రములు మున్నగునవి పెద్దవి—అరుంధతి, అశ్విని మున్నగునవి చిన్ననక్షత్రములు. కొన్ని నక్షత్రములు అత్యంత దూరముగ నున్నవి, కొన్ని సమీపముగ నున్నవి.

ఈనక్షత్రభేదములు కంటికగపడునవి. ఇఁక కంటికి కానరాని భేదములు కలవు. ఈనక్షత్రకాంతులను పరిశీలించి నక్షత్రములయొక్క వాస్తవస్థితులను,గమనములను, నైసర్గికములను కనుగొనుటకు 'స్పెక్ట్రాస్కోపు'అనుయంత్రసాధనము ఉపయోగింపఁబడును. దూరదర్శనియను యంత్రసాధనముచేకూడ కేవలనేత్రగోచరముకాని మహావిషయములు కనిపెట్టఁబడుచున్నవి. స్పెక్ట్రాస్కోపును, టెలెస్కోపును (దూరదర్శని) నక్షత్రపరీక్షకు పరమసాధనములు.

నక్షత్రములను పైసాధనములచే పరిశీలించి ఖగోళశాస్త్రజ్ఞులు మహావిషయములను కనుగొనిరి. మచ్చ

నకు దిగువ కొన్ని విషయములను పొందుపఱుచు చున్నాము.—

౧. సహస్రకోటిసంఖ్యాకములగు నక్షత్రములలో సగమునకన్న ఎక్కువగనే మనకు కానరాక తెలియరాక యుండఁబోలును. ఇట్టి అదృశ్యనక్షత్రములు అత్యంత దూరస్థము లగుటచేతనో, కాంతిహీనము లగుటచేతనో మనకు గోచరములు కావు.

౨. మిక్కిలి ప్రకాశవంతములగు నక్షత్రములు మిక్కిలి యుష్ణములు కావు. నక్షత్రముల ప్రకాశము వాని ఉపరితలవిస్తారముకొలఁది వృద్ధిచెందునేకాని వాని యుష్ణతకొలఁది కాదు.

౩. సూర్యగోళముయొక్క ఉపరితలోష్ణత రమారమి ౬౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీలు.

౪. మృగశిరనక్షత్రరాశిలోని పెద్దనక్షత్రము మన సూర్యగోళమునకన్న రెండుకోట్లరెట్లు ఎక్కువప్రమాణముకలది. అయినను అది సూర్యునికన్న రెండుకోట్ల రెట్లు ఎక్కువబరు వుండదు. వైశాల్యమును, ప్రమాణమును హెచ్చినకొలఁది నక్షత్రముగోళము విరళత్వమును చెంది గుల్లగ నుండును.

౫. మిక్కిలి విరళమయి విస్తరించి గుల్లబాఱిన నక్షత్రములు హెచ్చుప్రకాశవంతము లగును. ఇవి వాయుస్థితిలో నుండును. గుల్లబాఱని ఘనకాయములు గల నక్షత్రములకు కాంతి తక్కువ. ఇవి ఘనస్థితిలో నుండును. నడుమవి ద్రవస్థితిలో నుండును.

౬. కాంతిలేని నక్షత్రములకును, కాంతితక్కువ నక్షత్రములకును ఉష్ణతకూడ ప్రాయికముగ తగ్గుగ నుండును.ఇవి మన భూమివలె ఘనస్థితిని దాల్చియుండును. భూమివలెనె మితోష్ణముగ నుండును.

౭. నక్షత్రములు పుట్టినపుడు మహాకాంతులతో ఎక్కువగ విస్తరించి ఎక్కువ విరళత్వమును జెందినవిగ నుండి క్రమముగ కొన్నిమహాయుగములకు గట్టిపడుచు నీలిరంగు కలవియయి పిమ్మట ఎఱ్ఱరంగు కలవియయి సంకోచించురంగుగాని, కాంతికాని లేకుండ అదృశ్యములయి అంతరాళమున ప్రేలాడుచుండును. ఇట్టి అగమ్యగోచరములగు నక్షత్రములు కోట్లకొలఁది ఆకాశమందుఁ గలవు. ఇవి మానవనేత్రములకు కానరావు. సాధనాంతరములతో కొన్నిఁటిని చూచుటకు సాధ్యపడుచుండును.

## నక్షత్రముల శక్తికారణములు

అంతరాళమున నిరాలంబముగ బహుకోటియోజనముల ప్రమాణములు గల నక్షత్రములకు నిరంతరముగ కాంతుల నీనుటకు కారణము లెవ్వి? ఏదీపమయినను క్రొత్తక్రొత్తగ చమురుపోయకుండ మండునా? మరియు నక్షత్రములు నిరంతరముగ భ్రమించుచున్నవి. ఈభ్రమణములకు హేతువు లెవ్వి? ఏగడియారమయినను క్రొత్తక్రొత్తగ మరచుట్టు త్రిప్పుచుండనియెడల తిరుగఁగలుగునా? మహాప్రపంచములగు నక్షత్రములకునుగూడ క్రొత్తక్రొత్తగ కాంతిపోషణమునకు, భ్రమణపోషణమునకు తగిన మార్గములు సమకూడియుండవలయును. లేనిచో నిర్బుదములకొలఁది నక్షత్రములు ప్రజ్వలించుచు ప్రచరించుచును ఉండఁగలవా? ఈప్రశ్నలకు సమాధానములు చాలవఱకు ఉపనిషత్తత్త్వమును పోలియుండును. నక్షత్రముల ప్రజ్వలనప్రచారములు వానిలోని వస్తువులు మండుటచే కొంతవఱకు కలుగును. కాని యిట్టి జ్వాలలవలన పుట్టు శక్తి మిక్కిలి పరిమితముగ నుండునుగాని చిరస్థాయిగ నుండదు.

భౌతికశాస్త్రజ్ఞులు వస్తుప్రపంచ మంతయు సూక్ష్మవిభాగమున విద్యుచ్ఛక్తిక్రింద మాఱునని సిద్ధాంతపఱిచిరి. భౌతికపదార్థములు మండుటవలన బయలువెడలు శక్తికన్న ఆపదార్థములు విద్యుచ్ఛక్తిసఘ్రీకరణముచే స్వరూపనాశనము చెందునపుడు ఎక్కువశక్తి బయలువెడలున్ను పదార్థము లనునవి అత్యంతవిభాగమున రెండు విలక్షణములగు విద్యుచ్ఛక్తుల యాశ్రయముచే ఏర్పడుచున్నవి. ఈశక్తుల వ్యత్యాసములవలననే ప్రాణవాయువు హైడ్ర

జను కార్బను గంధకము బంగారము మున్నగు మూల ద్రవ్యములు (ఎలిమెంటులు) ఏర్పడుచున్నవి. తుదకు ఈ విద్యుచ్ఛక్తులు సమీకరణమగునపుడు ఆద్రవ్యము ధ్వంస మేయగును. కేవలవస్తువు శాశ్వతము కాదు; స్థిరము కాదు. అంత్యపరిణామమున వస్తువు లన్నియు విద్యుద్రూపములు. ఈసిద్ధాంతమున సర్వపదార్థైక్యము స్థిరపడుచున్నది. 'ఆత్మకన్న అన్యము లేదు' అను ఉపనిషన్మహాతత్త్వము నకు ఈయాధునికపాశ్చాత్యసిద్ధాంతము చేరువగుచున్నది. పదార్థముల స్వరూపనాశముచే బయలువెడలు ప్రభూత శక్తులే నక్షత్రముల ప్రకాశప్రచారములకు హేతుభూతము లగుచున్నవి. నక్షత్రముల రంగులు, పరిమాణములు, కాంతులు, భారములు మున్నగునవి మారుచుండుటకు ఈశక్తులే మూలాధారము లగును. నెబ్యులలకు నక్షత్ర ములకునుకూడ ఈవిద్యుచ్ఛక్తియే అంత్యకారణము.

ఖగోళవిషయ మనంగ సృష్టివిషయమే. ఈఖగోళ తత్త్వము నెఱుంగుట ప్రపంచస్వరూపము నెఱుంగుటయే. ఈమహావిషయము గ్రంథశతములలోనయినను పరి సమాప్తికానేరదు. ఈచిన్నవ్యాస మింతటితో ముగించుట యుక్తము. ఇప్పటికే దిగ్భ్రమము అయినది.

"అతియద్దీప్తుల శిఖగ వ్రేలెడి
లతులు కోటులు నక్షత్రంబులు
దేవుని మహిమను దెలిపెడి గనుమా
భావము నవ్విభుపయి నిడి మనుమా."



అలలు

చిత్రకారుడు: డబ్ల్యు. ఎ. ఆర్యదాసుగారు.



# జ్యోతిశ్శాస్త్రము

## సప్తవర్గజ బలసాధనము

సూరి రామసుబ్బరాయ శాస్త్రిగారు



శ్లో. లగ్నం హోరాచ ద్రేక్కాణం సప్తాంశో నవమాంశకః,
ద్వాదశాంశశ్చ త్రింశాంశో విజ్ఞేయా స్సప్తవర్గకాః.

౧ లగ్నము, ౨. హోర, ౩. ద్రేక్కాణము, ౪. సప్తాంశము, ౫. నవమాంశము, ౬. ద్వాదశాంశము, ౭. త్రింశాంశము. ఇవి సప్తవర్గము లనఁబడును. ఏతత్సాధనము ఉత్తరకాలామృతమునందు–

శ్లో. అర్కేందోర్వ్యిష మేఽన్యథాసమగృహే హోరేఽథ ద్రేక్కాణకే
లగ్నే వ్యంకగృహేశ్వరా శ్చరగృహే భాగ్యేశ్వరాత్సుతః స్థిరే
పుత్రేశాచ్చ తపేవతు ద్వితనుభే, సప్తాంశకాస్త్వోజభే
లగ్నేశా త్సమభేతు సప్తమగృహా చ్చాధో నవాంశాః క్రమాత్.

శ్లో. మేషే సింహగృహే ధనుష్యజనవాంశాస్త్వాదిమ స్త్రిక్రమాత్
మీనాంతం భవసాధిపాద్రవిలవేశా స్త్రింశదంశా స్త్వధః
బాణేష్వష్టనగేషవో విషమభే భౌమార్కిసూరీందుజాః
శుక్రోవ్యత్యయత స్తవేవ సమభే స్యా త్సప్తవర్గ స్త్వయం.

౧. సప్తవర్గమునం బ్రథమము లగ్నము లేక రాశి, గ్రహముల స్వక్షే తుంగ నీచ మూల త్రికోణాది క్షేత్రములును, అధిమిత్రాదినిర్ణయమును బృహజ్జాతకాదులందుఁ బ్రసిద్ధములు. ఉచ్చత్రికోణస్వక్షేత్రములలో నేరెండైనను, మూఁడైన నేకరాశిగతము లైనపుడు తద్వ్యవస్థయు "వింశతి రంశా స్సింహే త్రికోణం" ఇత్యాదిసారావళ్యుక్త విధమున గ్రహింపఁదగియున్నది. ముహూర్తదర్పణమునందును నట్లే విభాగము చెప్పఁబడియుండుటచేతను, బృహజ్జాతకటీకయందు భట్టోత్పలునిచేతను నదియే గ్రహింపఁబడియుండుటచేతను సారావళీ వాక్యములే ప్రమాణములుగ స్వీకరింపఁదగియున్నవి. తద్వ్యతిరిక్తముగ "సూర్యారజీవభృగుభానుభువాం నఖాంశకై ర్మూలత్రికోణభవనం" అనెడు గుణాకరాదివాక్యము లనాదరణీయములు. ౨. రాశ్యర్ధమునకు హోరయని సంజ్ఞ. విషమరాశియందు రవిచంద్రులును, సమరాశియందుఁ జంద్రరవులును హోరాధిపతు లగుదురు. ౩. రాశిలో మూఁడవభాగము ద్రేక్కాణము. చరరాశియందు లగ్నపంచమ నవమాధిపతులును, స్థిరరాశియందు నవమలగ్నపంచమాధిపతులును, ద్విస్వభావరాశియందుఁ బంచమనవమలగ్నాధిపతులును ద్రేక్కాణాధిపతు లగుదురు. ౪. రాశిలో సప్తమభాగము సప్తాంశము. ఓజరాశియందుఁ దద్రాశ్యధిపతి మొదలుగను, యుగ్మరాశియందుఁ దత్సప్తమరాశ్యధిపతి మొదలుగను సప్తాంశాధిపతులు. ౫. రాశిలో నవమభాగము నవమాంశము. అనఁగా నక్షత్రపాదమని యర్థము. మేష ప్రథమనవాంశము మొదలుగఁ బండ్రెండురాసులలోని ౧౦౮ నవాంశములకును మేషాదిద్వాదశరాశ్యధిపతులే పునఃపునరావర్తనములచే నధిపతు లగుదురు. ఈక్రమమున మేషసింహధనూరాసులందు మేషమును, తులాకుంభమిథునములందుఁ దులయును, కన్యకామకరవృషభము లందు మకరమును, మీనకటకవృశ్చికములందుఁ గటకమును, ప్రథమ నవాంశాధిపత్యముకలది యగును. ౬. రాశిలోఁ బండ్రెండవభాగము ద్వాదశాంశము. తద్రాశిమొదలుగఁ బండ్రెండురాసుల యధిపతులును ప్రతిరాశియందు ద్వాదశాంశాధిపతు లగుదురు. ౭. రాశిలో ముప్పదియవభాగము త్రింశాంశము. ఇదియే భాగయనియు వ్యవహరింపఁబడుచున్నది. ఓజరాశియందు ౫, ౫, ౮, ౭, ౫ త్రింశాంశలకు కుజ శని గురు బుధ శుక్రులును, సమరాశియందుఁ దద్వ్యత్యయముగ ౫, ౭, ౮, ౫, ౫ త్రింశాంశలకు శుక్ర, బుధ, గురు, శని, కుజులును నధిపతులగుదురు. ఇట్లు సప్తవర్గాధిపతుల నిర్ణయింపవలయును. ఇఁకఁ దద్బలసాధన మెట్లనినః—

సప్తవర్గమునఁ బ్రథమమున గృహబలనిర్ణయము శ్రీపత్యాచార్యులచే—

శ్లో. స్వోచ్చే రూపం చరణరహితం స్వత్రికోణే స్వభేఽర్ధం
నాగాంశానాం త్రయ మధి సుహృద్గేహగే మిత్రభేఽంఘ్రిః,
అంశోఽష్టానాం సమగృహగతే భూపభాగోఽరిగేహే
దంతాంశ శ్చాస్య దధిరిపుగృహే నీచభే శూన్యమేవ.

గ్రహము ఉచ్చరాశియం దున్నయెడల రూపము లేక ౬౦ షష్ట్యంశలు, అనఁగా సంపూర్ణబలము గలది యగును. మూలత్రికోణ

రాశియందుఁ ద్రిచరణము లేక ౪౫ షష్ట్యంశల బలము. స్వక్షేత్రమున నర్ధము లేక ౩౦ విరూపములు. అధిమిత్రక్షేత్రమున మూఁడెనిమిదవవంతులు (౨౨-౩౦). మిత్రక్షేత్రమునఁ బాదము (౧౫). సమక్షేత్రమునఁ నష్టమాంశము (౭-౩౦). శత్రుక్షేత్రమున షోడశాంశము (౩-౪౫). అధిశత్రుక్షేత్రమున ముప్పదిరెండవవంతు (౧-౫౨,౩౦) నీచక్షేత్రమునందు శూన్యము (౦). ఇట్లు గ్రహముయొక్క ఉచ్చాది రాశిస్థితివలన గృహఫలము నిర్ణయింపవలయును. పిమ్మట హోరాది షడ్వర్గఫలసాధనవిధానము, ఉత్తరకాలామృతమునందు—

శ్లో. రూపాద్యం భవనోదితం శుభఫలం ప్రాగ్వ ద్విలిఖ్యాథ త
ద్ధోరాదిష్వపి షట్సు తత్పతివశా ద్గేహోక్తవీర్యార్ధకమ్,
సంలిఖ్యాథ సమస్తవర్గజబలైక్యం సప్తవర్గోద్భవం
రూపాద్యం త్విదమేవ వీర్య ముదితం ఖేటేషు సప్తస్వపి

పూర్వోక్తవిధమున గ్రహముయొక్క రాశి(లగ్న)బలమును నిర్ణయించి, హోరాదిశేషషడ్వర్గమునఁ దద్వర్గాధిపతియగు గ్రహవశమున రాశ్యుక్తబలార్ధమును గ్రహింపవలయును. ఈహోరాదిషడ్వర్గబలమును లగ్నబలమునఁ గలుపఁగా నగు రూపాదియే సప్తవర్గజబలమగుచున్నది ఇట్లు సప్తగ్రహములకు సప్తవర్గజబలము సాధింపఁదగియున్నది ఉచ్చ, నీచ, త్రికోణ, స్వర్క్ష, ధిమిత్ర, మిత్ర, సమ, శత్రు, అధిశత్రుక్షేత్రములని గ్రహసంస్థితి నవవిధ మగుచున్నది. అందు నుచ్చనీచమూలత్రికోణస్వరాసులందున్నయెడల రూప, శూన్య, త్రిచరణార్ధబలము గ్రహింపవలయును. అట్లుచ్చ,నీచ, త్రికోణ, స్వర్క్షములం దుండక తదితరపంచవిధస్థానములం దున్నపుడు తత్పతివశమున బలము గ్రహింపఁదగియున్నది. తత్పతివశ మనఁగా నారాశ్యధిపతియగు గ్రహమునకును నీగ్రహమునకును గలుగు నధిమిత్రత్వాదివశమున ననియర్థము. ఇట్టి యధిమిత్రాదిక్షేత్రములం దున్నపుడు త్ర్యష్టమాంశాది బలము గ్రహింపవలయును అంతియకాని ఉచ్చ, నీచ, త్రికోణములం దున్నపుడును దద్రాశ్యధిపతియగు గ్రహవశమున నధిమిత్రత్వాదికమును నిర్ణయింపఁదగదు ఇట్లే హోరాదిశేషషడ్వర్గమునందును గ్రహింపఁదగియున్నది. అనఁగా గ్రహ ముచ్చ, నీచ, త్రికోణస్వరాసులయొక్క హోరాదివర్గమున నున్నపుడు రూపశూన్యత్రిచరణార్ధ బలములను, నుచ్చాదిరాశివర్గములందు లేనియపుడు తద్గ్రహమునకును, దద్వర్గాధిపతికిని గలుగు నధిమిత్రత్వాదివశమునఁ ద్ర్యష్టమాంశాది బలమును గ్రహింపవలయును. ఇట్లు సాధించిన హోరాదివర్గబలములో నర్ధమునే గ్రహించి లగ్నబలమునఁ గలుపఁగా సప్తైక్యజ మగును. ఏతద్విషయము శ్రీధరాచార్యులచే —

శ్లో. స్వగృహాదిగతానాం య ద్గ్రహాణా ముదితం బలమ్,
తదేవ సప్తవర్గేఽపి తదీశస్య వశా ద్వదేత్.

స్వక్షేత్రాదిస్థితివలన గ్రహములకుఁ జెప్పఁబడిన గృహబలమునే సప్తవర్గమునందును దదధిపతియగు గ్రహవశమున నిర్ణయింపవలయునని భావము.—ఈసందర్భమున (౧) "తదేవ సప్తవర్గేఽపి" అనుటలో లగ్నబలము పూర్వమున నిర్ణయింపఁబడుటచే సప్తవర్గమునం దనఁగా లగ్నవ్యతిరిక్తమగు హోరాదిషడ్వర్గమునందని గ్రహింపవలసియున్నదనియు, (౨) "స్వగృహాదిగతానాం" అని చెప్పఁబడుటచే రాశివ్యతిరిక్తమగు నీహోరాదిషడ్వర్గమునందు స్వగృహాదిబలమే అనఁగా నర్ధత్ర్యష్టమాంశాదిబలమే గ్రాహ్యముగాని యుచ్చనీచత్రికోణబలము గ్రహింపఁబడిలేదనియు, తుంగబలానయనము ప్రత్యేకముగాఁ జెప్పఁబడుటచే లగ్నబలమునం దైనను త్రికోణబలమేగాని యుచ్చబలము గ్రహింపఁదగదనియు శ్రీ దివాకరుల యాశయము. అట్టి కారణముచే (౩) నుచ్చత్రికోణస్వర్క్షములు మూఁడుగాని రెండైన నొకేరాశియందు గల గ్రహమునకు రాశిబలనిర్ణయమునం దుచ్చభాగలందున్నను త్రికోణరాశ్యుక్తమగు త్రిచరణబలమేగాని రూపము గ్రహింపఁదగదనియు, రాశివ్యతిరిక్తహోరాదిషడ్వర్గబలనిర్ణయమున నుచ్చరాశియందున్నను, త్రికోణరాశియందున్నను రూపత్రిచరణములుగాక తద్రాశ్యధిపతికిని నీగ్రహమునకును గలుగు నధిమిత్రత్వాదివశముననే బలము సాధింపవలయు ననియుఁ జెప్పిరి. కాని యది యుక్తియుక్తముగాఁ గాన్పించుట లేదు. (౧) "తదేవ సప్తవర్గేఽపి" అను శ్రీధరాచార్యవాక్యమువలెనే "గృహాధిపవశా త్ఖేటస్య సప్తైక్యజం" అని కేశవాచార్యులచేతను, "ఏవమేవఖలు సప్తవర్గజం స్యాద్బలం నిజపతేర్వశా దిహ" అని శ్రీపత్యాచార్యులచేతను జెప్పఁబడియుండుటచే "సప్తవర్గేఽపి" అనుపదమువలన రాశివ్యతిరిక్తమగు సప్తవర్గమునందు ననఁగా హోరాదిషడ్వర్గమునందుననే "నిజపతివశ"మని యెంచఁదగదు ఇట్టి పతివశనియమము రాశిసహితసప్తవర్గమునందును సమన్వయింపఁదగియున్నది అనఁగా నీగ్రహమునకును దద్వర్గాధిపతులగు గ్రహములకును గలుగు నధిమిత్రత్వాదిసంబంధవశమున బలము లగ్నాదిసప్తవర్గములందును గ్రాహ్యమే యగును ఈయధిమిత్రత్వాదివశమును నుచ్చనీచత్రికోణస్వర్క్ష వ్యతిరిక్తపంచస్థానసంస్థితియందేయనియు నిశ్చయింపఁదగియున్నది. ౨ స్థానబలాంతర్గతముగఁ బ్రత్యేకముగా సాధింపఁబడు తుంగబల మారోహావరోహిశ్య మగుటచే నుచ్చనీచాంతరస్థితినుండి యనుపాతమున సాధింపఁదగియున్నది. అందు గ్రహ ముచ్చనీచరాసులందేగాక తదితరరాసులందున్నను గ్రహనీచాంతరమును బ్రధానముగా గ్రహించి బలము నిర్ణయింపఁబడుచున్నది తత్కారణమున నీసప్తవర్గజబలానయనమున నుచ్చగ్రహణ మనవసరమని యెంచఁదగదు శ్రీధరాచార్యవాక్యమునందలి "స్వగృహాదిగతానాం" అనుపదములోని "ఆది"శబ్దమువలన నుచ్చత్రికోణాదిరాసులు గ్రాహ్యములనియే భావము. కావున లగ్నబలమునందే గాక హోరాదిషడ్వర్గమునందును నుచ్చత్రికోణగ్రహణ మవసరమే యగుచున్నది అట్లుగాక, ఉచ్చరాశివర్గములం దున్న గ్రహమునకుఁ బూర్ణబలము గ్రహింపకయు, నీచరాశివర్గములం దున్న గ్రహమునకు శూన్యబలమని యెంచకయు నీయుచ్చనీచరాశ్యధి



అఖిలభారత-ఒలింపిక్-వ్యాయామక్రీడలు
(మద్రాసు) యందు పోటీ చేసిన జెట్టీలు



ఈ త గు మ్మ ట ము లు



అఖిలభారత ముష్టియుద్ధ ప్రదర్శనము
(హరిసింగు నందసింగుగార్లు)



అఖిలభారత ముష్టియుద్ధ ప్రదర్శనము (రిమయొకటి)
(లలితాప్రసాదుగారు గెలిచిరి)



జ ల ద్వి చ క్రి క లు
( వీని మూలమున నీట వేగముగ, సురక్షితముగ నీదవచ్చును )



టి. బి. బాలగోపాలంగారు



యఫ్ యక్స్ ఫీల్డుగారు



మిస్. బెట్టినటు హాలుగారు
(అమెరికాయంతటను టెన్నిసుపోటీయందు
ప్రథమబహుమతి బడసిన స్త్రీ)



కుమారి హేమలతా శ్రీనివాసరావుగారు
మంగళూరు పోటీలలో రామనాథమువారి
(కప్పను) బహుమతిని బడసెను



కుమారి లీలారావుగారు



44th INDIAN NATIONAL CONGRESS
SWADESHI IS THE FOUNDATION OF SWARAJ
LAHORE
CONGRESS EXHIBITION
1929
MERIT CERTIFICATE
NAME OF CONCERN
COMMODITIES Amrutanjan
PLACE Madras
PRESIDENT
PRESIDENT RECEPTION COMMITTEE
GENERAL SECRETARY
EXHIBITION SECRETARY

పతిపతులగు గ్రహములకును నీగ్రహమునకును నధిమిత్రాదికల్పనం జేయుట యయుక్తికము. జాతకశాస్త్రమున నుచ్చనీచాంశస్థితివలనను ఫలము నిర్ణయింపఁబడుచున్నది. కావున నీసప్తవర్గజబలమునందును నుచ్చనీచాదిగ్రహణ మవసరమని నిర్ణయింపవలసియున్నది. 3. ఏతత్కారణమున నుచ్చత్రికోణస్వర్క్షము, లేక రాశ్యంతర్గతము లైనపుడు గ్రహముచ్చభాగ లందున్నపుడు రూపబలమును, త్రికోణభాగలం దున్నపుడు త్రిచరణబలమును, స్వర్క్ష భాగలం దున్నపు డర్ధబలమును గ్రహింపవలసియే యున్నది. అట్టిరాశియొక్క హోరాదిషడ్వర్గమున నిట్టి విభాగము దుర్లభ మగుటచే నం దధికబలముగల విభాగముయొక్క బలమే గ్రహింపవలసియున్నది.

“తదీశస్య వశా ద్వదేత్” అను వాక్యమున వశమనఁగ స్థితివశమని యెంచి కొందరు సప్తవర్గజబలము సాధింపవలసిన గ్రహమేరాశియందును, నేహోరాదివర్గమునందును నుండునో, తద్రాశిహోరాద్యధిపతులగు గ్రహము లుచ్చాదిరాసులం దున్నయెడల రూపాదిబలము గ్రహింపవలయునని వర్గాధిపతిబలమును వర్గస్థగ్రహమునం దారోపించుచున్నారు. ఇది సకలజాతకశాస్త్రవిరుద్ధము. ఉచ్చాదిబలనిర్ణయము సారావళియందు —

శ్లో. స్వోచ్చస్థిత శ్శుభఫలం ప్రకరోతి పూర్ణం,
నీచార్కగస్తు విఫలంరిపుమందిరేఽల్పమ్,
పాదం ఫలస్య హిత భే స్వగృహేతథాఽర్ధం,
పాదత్రయం గగనగః స్థితవాం స్త్రికోణే.

అనుచు నుచ్చాదిస్థానములందుండు గ్రహమే సంపూర్ణాదిబల మొసఁగునని చెప్పఁబడినదిగాని, గ్రహముండు రాశ్యధిపతి యుచ్చాదిస్థానములం దున్నయెడల నాగ్రహము రూపాదిబలము నిచ్చునని చెప్పఁబడియుండలేదు. పరాశరహోరయందును నిట్లే—

శ్లో. మూలత్రికోణస్వర్క్షాధిమిత్రమిత్ర సమారిషు,
అధిశత్రుగృహేచాఽపి స్థితానాం క్రమశో బలం”—

అని మూలత్రికోణాదిరాశిస్థితగ్రహములకు బలక్రమము చెప్పఁబడినదిగాని మూలత్రికోణాదిరాసులందున్న వర్గాధిపతులగు గ్రహములకు బలము చెప్పఁబడియుండలేదు. కావున నుచ్చత్రికోణాదిరాశివర్గములందున్న గ్రహమే రూపత్రిచరణాదిబల మిచ్చునుగాని తద్గృహహోరాదివర్గాధిపతు లుచ్చాదిస్థానములం దున్నయెడలఁ దద్వర్గస్థగ్రహము రూపాదిబలము నిచ్చునని యెంచఁదగదు.

సప్తవర్గజబలమునందు గృహోక్తబలములో నర్ధము నే హోరాదిషడ్వర్గమున గ్రహింపవలయును. ఇందులకు సప్తవర్గశుభాశుభఫలనిర్ణయమునందు శ్రీపత్యాచార్యులచే, “ఏవం గృహేషు శుభపాపఫలార్ధ మన్యవర్గేషు షట్సు నియతం మునిభిః పురాణైః” అనియు, “తద్దళం భవతి శేషవర్గజం” అని రిష్టభంగమునందును, “హోరాదివర్గగుణకస్తు భవే త్తదర్ధం” అని ఆశ్రయగుణకమునందును జెప్పఁబడినది. ఇట్లే శ్రీధరాద్యాచార్యులచేతను చెప్పఁబడుటచే “హోరాదిష్వపి షట్సు తత్పతివశా ద్గేహోక్తవీర్యార్ధకం” అని ఉత్తరకాలామృతమునందును జెప్పఁబడినది. ఉచ్చత్రికోణాదిస్థితివలనఁ గలుగు రూపాదికము శుభఫల మనఁబడుచున్నది. దానిని రూపమునుండి తీసి వేయఁగా నశుభఫల మగును. ఉచ్చయందున్న గ్రహమురూపము శుభమునే యొసఁగుటచే నశుభఫలము శూన్యము. త్రికోణమునందున్న గ్రహము త్రిచరణము శుభఫలము నిచ్చును. దీనిని రూపమునుండి తీసి వేయఁగా నగు చరణ మశుభఫలము. ఇట్లే తదితరస్థానములందును గ్రహించునది. హోరాదిషడ్వర్గమునందు శుభఫలపూర్ణత్వ మర్ధమే యగుటచే నర్ధమునుండి త్ర్యష్టమాంశాదికముఁ దీసివేయఁగా నగు సప్తమాంశాదికము త్రికోణాదిరాశివర్గమున నున్న గ్రహ మొసంగు నశుభఫల మగుచున్నది.

## పుష్కరాంశము

శ్లో. ఏకవింశో మనుశ్చైవ జినాశ్చ మునయః క్రమాత్,
మేషాదిమీనపర్యంతం పుష్కరాంశాః ప్రకీర్తితాః.

మేషాదిమీనాంతము ద్వాదశరాసులందు ౨౧, ౧౪, ౨౪, ౭ భాగలు క్రమముగఁ బుష్కరాంశము లనఁబడుచున్నవి. అనఁగా మేషసింహధనుస్సులందు ౨౧, వృషభకన్యామకరములందు ౧౪, మిథునతులాకుంభములందు ౨౪, కటకవృశ్చికమీనములందు ౭ భాగలు పుష్కరాంశము లగుచున్నవి. ఇందులకు కాలామృతమునందు—

శ్లో షడ్వర్గ స్త్వయమేవ సోఽపి శుభకృ త్సౌమ్యగ్రహాణాం భవేత్
షడ్వర్గో యది పాపినాం నిధనకృ త్సర్వేషు కర్మస్వపి—

శుభగ్రహషడ్వర్గమైనయెడల సర్వకర్మలందును శుభకరమనియు నశుభగ్రహషడ్వర్గమైనయెడల నశుభకరమనియుఁ జెప్పఁబడినది.

శ్లో. సప్తాంశయోగ షడ్వర్గ స్సప్తవర్గోఽభిధీయతే.

అని చెప్పఁబడుటచే సప్తవర్గమునుండి సప్తమాంశను విడువఁగా మిగిలిన యారువర్గములుగలసి షడ్వర్గ మనఁబడుచున్నది అట్టి షడ్వర్గమునందు నారువర్గములును తుద కైదువర్గములైనను శుభగ్రహవర్గములైనచో నది పుష్కరాంశ మనఁబడును. కావున నీపుష్కరాంశమే సర్వకర్మలందును స్వీకరింపఁదగినది. ఈవిషయమై కాలామృతమునందును —

శ్లో. భూనేత్రేఽబ్ధివిధూజలాక్ష్యగమితో మేషాదితః పుష్కరః
సింహోదేర్ధనురాదికస్యచ తథా మీనాంతతస్స్యాత్క్రమాత్,
షడ్వర్గో యది పంచవర్గ ఇతివా—అని చెప్పఁబడినది.

మేషాదిమీనాంతమ్ముద్వాదశరాసులందును నీచెప్పఁబడిన భాగలందు షడ్వర్గశుభాశుభ మీక్రిందిపథకమునఁ దెలుపఁబడుచున్నది.—

| లగ్నము | హోర | ద్రేక్కాణము | నవాంశము | ద్వాదశాంశము | త్రింశాంశము | పుష్కరము | విశేషములు |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
| ౧ మేషము కుజుఁడు | ద్వితీయము చంద్రుఁడు | తృతీయము ధనుస్సు-గురుఁడు | సప్తమము ౨౦ మొదలు ౨౩-౨౦ వరకు తుల-శుక్రుఁడు | నవమము. ౨౦ మొదలు ౨౨-౩౦ వరకు ధనుస్సు-గురుఁడు | ౧౮ మొ॥ ౨౫ వరకు బుధుఁడు | ౨౧ | ౨౦ మొ॥ ౨౨-౩౦ వరకు పంచవర్గశుభము |
| ౨ వృషభము శుక్రుఁడు | ప్రథమము చంద్రుఁడు | ద్వితీయము వృషభము-శుక్రుఁడు | పంచమము ౧౩-౨౦ మొ॥ ౧౬-౪౦ వరకు వృషభము-శుక్రుఁడు | షష్ఠము ౧౨-౩౦ మొదలు ౧౫ వరకు తుల-శుక్రుఁడు | ౧౩ మొ॥ ౨౦ వరకు గురుఁడు | ౧౪ | ౧౩-౨౦ మొ॥ ౧౫ వరకు షడ్వర్గశుభము |
| ౩ మిథునము బుధుఁడు | ద్వితీయము చంద్రుఁడు | తృతీయము మిథునము-బుధుఁడు | అష్టమము ౨౩-౨౦ మొ॥ ౨౬-౪౦ వరకు వృషభము-శుక్రుఁడు | దశమము ౨౨-౩౦ మొదలు ౨౫ వరకు మీనము-గురుఁడు | ౧౮ మొ॥ ౨౫ వరకు బుధుఁడు | ౨౪ | ౨౩-౨౦ మొ॥ ౨౫ వరకు షడ్వర్గశుభము |
| ౪ కర్కాటకము చంద్రుఁడు | ప్రథమము చంద్రుఁడు | ప్రథమము కటకము-చంద్రుఁడు | తృతీయము ౬-౪౦ మొదలు ౧౦ వరకు కన్య-బుధుఁడు | తృతీయ-చతుర్థములు ౫ మొదలు ౧౦ వరకు కన్యకాతులలు బుధశుక్రులు | ౬ మొ॥ ౧౦ వరకు బుధుఁడు | ౭ | ౬-౪౦ మొ॥ ౧౦ వరకు షడ్వర్గశుభము |
| ౫ సింహము రవి | ద్వితీయము చంద్రుఁడు | తృతీయము ధనుస్సు-గురుఁడు | సప్తమము ౨౦ మొదలు ౨౩-౨౦ వరకు తుల-శుక్రుఁడు | నవమము ౨౦ మొదలు ౨౨-౩౦ వరకు మేషము-కుజుఁడు<br>దశమము ౨౨-౩౦ మొదలు ౨౫ వరకు వృషభము-శుక్రుఁడు | ౧౮ మొ॥ ౨౫ వరకు బుధుఁడు | ౨౧ | ౨౦ మొ॥ ౨౨-౩౦ వరకు చతుర్వర్గశుభము<br>౨౨-౩౦ మొ॥ ౨౫ వరకు పంచవర్గశుభము |
| ౬ కన్య బుధుఁడు | ప్రథమము చంద్రుఁడు | ద్వితీయము వృషభము-శుక్రుఁడు | పంచమము ౧౩-౨౦ మొ॥ ౧౬-౪౦ వరకు వృషభము-శుక్రుఁడు | షష్ఠము ౧౨ - ౩౦ మొ॥ ౧౫ వరకు కుంభము-శని | ౧౩ మొ॥ ౨౦ వరకు గురుఁడు | ౧౪ | ౧౩-౨౦ మొ॥ ౧౫ వరకు పంచవర్గశుభము |
| ౭ తుల శుక్రుఁడు | ద్వితీయము చంద్రుఁడు | తృతీయము మిథునము-బుధుఁడు | అష్టమము ౨౩-౨౦ మొ॥ ౨౬-౪౦ వరకు వృషభము-శుక్రుఁడు | దశమము ౨౨-౩౦ మొదలు ౨౫ వరకు కటకము-చంద్రుఁడు | ౧౮ మొ॥ ౨౫ వరకు బుధుఁడు | ౨౪ | ౨౩-౨౦ మొ॥ ౨౫ వరకు షడ్వర్గశుభము |
| ౮ వృశ్చికము కుజుఁడు | ప్రథమము చంద్రుఁడు | ప్రథమము కటకము-చంద్రుఁడు | తృతీయము ౬-౪౦ మొదలు ౧౦ వరకు కన్య-బుధుఁడు | తృతీయ-చతుర్థములు ౫ మొదలు ౧౦ వరకు మకరకుంభములు-శని | ౬ మొ॥ ౧౦ వరకు బుధుఁడు | ౭ | ౬-౪౦ మొ॥ ౧౦ వరకు చతుర్వర్గశుభము మాత్రమే |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ౯ ధనుస్సు గురుఁడు | ద్వితీయము చంద్రుఁడు | తృతీయము ధనుస్సు-గురుఁడు | సప్తమము ౨౦ మొదలు ౨౩-౨౦ వరకు తుల-శుక్రుఁడు | నవమము ౨౦ మొదలు ౨౩-౨౦ వరకు సింహము-రవి దశమము ౨౩-౨౦ మొదలు ౨౫ వరకు కన్య-బుధుఁడు | ౧౯ మొ॥ ౨౫ వరకు బుధుఁడు | ౨౧ | ౨౦ మొ॥ ౨౨-౩౦ వరకు పంచవర్గశుభము ౨౨-౩౦ మొ॥ ౨౩-౨౦ వరకు షడ్వర్గశుభము |
| ౧౦ మకరము శని | ప్రథమము చంద్రుఁడు | ద్వితీయము వృషభము-శుక్రుఁడు | పంచమము ౧౩-౨౦ మొ॥ ౧౬-౪౦ వరకు వృషభము-శుక్రుఁడు పిమ్మట ౨౦ వరకు బుధుఁడు | షష్ఠము ౧౨-౩౦ మొదలు ౧౫ వరకు మిథునము-బుధుఁడు ౧౮-౩౦ వరకు చంద్రుఁడు | ౧౩ మొ॥ ౨౦ వరకు గురుఁడు | ౧౪ | ౧౩-౨౦ మొ॥ ౧౮-౩౦ వరకు పంచవర్గశుభము |
| ౧౧ కుంభము శని | ద్వితీయము చంద్రుఁడు | తృతీయము మిథునము-బుధుఁడు | అష్టమము ౨౩-౨౦ మొ॥ ౨౬-౪౦ వరకు వృషభము-శుక్రుఁడు | దశమము ౨౨-౩౦ మొదలు ౨౫ వరకు వృశ్చికము-కుజుఁడు ౨౫ మొ॥ ౨౮-౩౦ వరకు ధనుస్సు-గురుఁడు | ౧౯ మొ॥ ౨౫ వరకు బుధుఁడు ౨౫ మొ॥ ౩౦ వరకు శుక్రుఁడు | ౨౪ | ౨౩-౨౦ మొ॥ ౨౫ వరకు చతుర్వర్గశుభము ౨౫ మొ॥ ౨౮-౩౦ వరకు పంచవర్గశుభము |
| ౧౨ మీనము గురుఁడు | ప్రథమము చంద్రుఁడు | ప్రథమము కటకము-చంద్రుఁడు | తృతీయము ౬-౪౦ మొదలు ౧౦ వరకు కన్య-బుధుఁడు | తృతీయచతుర్థములు ౫ మొదలు ౧౦ వరకు వృషభ మిథునములు | ౬ మొ॥ ౧౦ వరకు బుధుఁడు | ౮ | ౬-౪౦ మొ॥ ౧౦ వరకు షడ్వర్గశుభము |

ఇందు చివరికలములోఁ జెప్పఁబడిన విశేషములు గమనింపఁదగియున్నవి. వీనిఁబట్టి మేషాదిరాసులందు ౨౧, ౧౪, ౨౪, ౮ భాగలు పుష్కరాంశము లనుటలో వీనితరువాత భాగయే పుష్కరాంశమనుట సముచితము. ఇంతియగాక సింహరాశియందు ౨౦ మొదలు ౨౨-౩౦ భాగవరకు చతుర్వర్గశుభమే కలుగుటచే పంచవర్గశుభమగు ౨౨-౩౦ మొదలు ౨౩-౨౦ భాగాది ప్రశస్తతరమగుచున్నది. ఇట్లే కుంభమునందును ౨౫ మొదలు-౨౬-౪౦ భాగాది వరకుఁ బంచవర్గశుభము కలుగుచున్నది ధనుస్సునందు ౨౨-౩౦ మొదలు ౨౩-౨౦ వరకు షడ్వర్గశుభము కలుగుచున్నది వృశ్చికమునందు చతుర్వర్గశుభము మాత్రమే కలుగఁగలదు కావునఁ బూర్వోక్తములగు ౨౧, ౧౪, ౨౪, ౮ భాగలకుఁ బరమునసే పుష్కరమని గ్రహింపవలసియున్నది అట్లుగాక పూర్వమున గ్రహించుచో కున వాంశాదిమహాదోషములు సంక్రమించుచున్నవి. కావున శ్రీమాన్ వింజమూరి కృష్ణమాచార్యులవారీవిషయమై చేసిన ప్రశంస మిగులఁ బ్రశంసనీయమైనది. సిద్ధాంతు లందరీవిషయమును బరిశీలించి తాము పంచాంగములందు సుముహూర్తముల వ్రాయునపు డీశుభవర్గసమయములనుగూడ నాయాదినములందుఁ దెలుపుచుందురుగాక యని వేఁడుచున్నాను.



# ముసలమ్మ ముక్తి

సీరిపి, ఆంజనేయులుగారు

౧

ఆది భాద్రపదమాస మయియుండనోపు
నందుఁ గృష్ణార్థమే యది యగునేమొ
యాయర్థభాగమ్మునం దొక్కరేయి
నుదధిమధ్యమ్మున నుడుపంబుకరణి
నతులవిశాల నీలాకాశవీథిఁ
గన్పట్టె నొక్క చిక్కని చిట్టిమబ్బు.
దానితోఁ జేర దిక్తటములనుండి
పలుచిన్ని నీటిమోపరు లెన్నియేని
యుదయించి, యెగసి, యొండొంటఁ గ్రిక్కిరిసి,
మసిగోలెములకోట్లు మలసినయట్లు
ధూమసంస్తోమముల్ తోడైనయట్లు
కఱియేనుఁగులమంద కదిసినయట్లు
తారుతేరుల బారు తనరారినట్లు
కాటుకకొండలు గ్రమ్మినయట్లు
బహుళమ్ముగా వ్యోమపథమునఁ బర్వఁ
గావిరికప్పు చక్కఁగ నొప్పినట్లు
నీలమణులరాశి నెఱపినమాడ్కి
కారుమొయిలు లంటఁగట్టినకరణిఁ
బాపౌఘములఁ గడుఁ బఱచిన తెఱఁగు
మున్నీటఁ బుడమిని ముంచినపోల్కి
నలమె భూతలము గాఢాంధకారంబు.

ఆతమోమయమగు నంతరాళంబు
వ్రచ్చి, యైరావతీ ల్లరీసమితి,
శ్యామవల్మీకసంచయ పార్శ్వతటులఁ
దళతళలాడెడు దర్వీక (?) కోటి
పృథులవేగమునఁ గంపించుచందమున
ఘుమఘుమాత్కారనిర్ఘోషముల్ నిగుడ
కుధరమ్ము లదర, దిక్కులు పిక్కటిల్ల,
గుహలు మాఱుసెలంగఁ, గుంభిని యగల,
ఘనఘనాఘనముల గర్భగోళముల
వెడలె మహోభీలవృత్తి నెల్లెడల.

ఉఱుములు మెఱుము లిట్లొకమొగిఁ జెలఁగ
పెళపెళార్భటులతోఁ బిడుగులు రాలె,
నంతఁ జల్వనివలి యంతట నెసఁగ
నచ్చునగాయల యాకృతిఁ దనరి
బడబడఁ గడువడిఁ బడె వడగండ్లు
కాదమమేఘము లను గున్నయేనుఁగులు
గగనసరోవరాంకమున వసించి
జలకేళిఁ దవిలి విచ్చలవిడి నాత్మ
తుండాగ్రములఁ బీల్చి తోయజాతముల
భువిఁ బయింబయిఁ జిందుపోల్కి వర్షించె
నఖిలప్రపంచ మేకార్ణవరీతి
సల్ప, మహాస్థూలజలధార లిట్లు
లొలసెనోయని దిగులొంద జగంబు.

ఆక్షణమంద ధరావలయమున
వంకలు పొచ్చెఁ బల్వంకలనుండి
యేఱులుపాఱె మిన్నేటిని మీఱి
కుంటలు దెగెఁ; గొలఁకులు నిండి పొరలె;
చేలు నీట మునింగెఁ; జెఱువుల వారి

కట్టలు దిగజాఱి కనుచూపుమేర
నెల్లెడ నీరములే పెంపుఁ గాంచె
ఇది జల, మిది పొల, మిది నెల వనుచు
నిది పుట్ట, యిది మెట్ట, యిది చెట్టటంచు
ననుకొనరాక మహార్ణవమట్లు
కన్పట్టెఁ, బుడమియు గగనతలంబుఁ
దెలియరావయ్యెఁ; రాత్రియుఁ బవలొక్క
కరణిఁ జూపట్టెఁ; జక్కని తమస్సార
గర్భమం దడఁగి లోకము వీఁకయుడిగె.

౨

అత్తఱి, కంబుమహాపర్వతంబు
కడనుండి తెరలి, యఖండప్రవంతి
పాండుహూలంకష ప్రబలవేగమునఁ
దిరుగుడుఁ బొందుచు, దిక్కుల తుదల
నావరించుచు, జగమంతయుఁ దాన
యేకప్రవాహమై యెసఁగెడుమాడ్కి,
నుద్వర్తనమున మహోగ్రరూపమునఁ
జాఁచి తరంగహస్తముల-సర్వంబు
లోఁగొంచుఁ, బొంగుచు, లోకంబు లొకట
మ్రింగ నేతెంచిన మృత్యువుకరణి,
గొఱియల నావులఁ గోళ్ళ నెద్దులను
గడ్డివాముల నిండ్లకప్పుల బండ్లఁ
గొని, నిమేషంబులోఁ గోసులుగడచి,
బుక్కరాయసముద్రపురితటాకంబుఁ
జేరె, నంతయు శాంతిఁ జెందక మీఱె.
అందు ననంతు లనంతకోటులుగఁ
బుట్టి, పడిగలార్చి, బుసకొట్టి, రేఁగి,
కలఁచు తెఱంగునఁ గల్లోలచయము
కడుభీషణాకృతి గట్టుఁ జీల్చు
మాడ్కి నెసంగ, నిమ్నగ విజృంభించి
కలయ ననంతసాగరమున నవల
బుక్కరాయసముద్రమున నిండి పొంగి
యలుఁగులఁ బొరలె మహారావ మెసఁగి.
అచటి కరంగట నాలయమందు
నిద్రించుచుండిన నీర్గట్టువార
లాభీషణధ్వని నాలించి లేచి,
మరవ దొలికె నంచు మది సంతసించి,
యురవడిఁ బరువిడి, యుదధి చందమున
నీటఁ దాండవమాడు నిండుహ్రదమ్ము

నీక్షించి, దరిపయి నీవలనవల
వడిగ నడచి యిరువంకల యొద్దు
పరికించి యలుఁగులు పట్టక జలమ్ము
పొఱలుచుండుటయును, పైనీరు హెచ్చి
వచ్చుచుంటయు, నాప్రవాహవేగంబు
నిమిషనిమేషంబు నెగడుచుండుటయుఁ
గనుఁగొని, మనమునఁ గడు బెగడొంది,
"యేమి చోద్యంబొకో యేనాఁడులేని
యీపెనువాన నేఁ డేల రావలయుఁ
జెఱు వాఁగునో లేదొ చెప్పలే" మనుచు
నటనుండి పఱచి, గ్రామాధికారులను
వెంగళరెడ్డిని వెస బసిరెడ్డి
నిర్వుర మేల్కొల్పి యిట్లని రంత—
"పండమే ఉప్పొంగె; పొఱె మరవలు;
కట్ట నిల్చెడుజాడ కన్పట్టలేదు;
ఊరు మున్గును మీర లూరకయున్న
గర్జించి యెగయు నాగంగమ్మతల్లి
యేమిసేయునో యింక నెఱుఁగము గాన
శాంతికి మార్గంబు సాగింపుఁ" డనిన
నాశ్చర్యమంది పురాధిపు లపుడు
చాటఁబనిచి రల్లె సర్వులు వినగ.

౩

క్షణకు నొక్కింత విశ్రాంతి యొసంగఁ
దలఁచినట్టులు వర్ష ధారలు వెలిసె.
గాఢసుషుప్తిమగ్నంబైన జగతి
కాకరాత్రి సంభవంబైన యమేయ
కార్యకలాపంపుఁ గల్మిఁ దెల్పుటకొ
యనఁగఁ జీఁకట్లు తమంత వెల్విరిసె.
'లెండులెండో యిదె లేఁబగలొప్పెఁ
గడునఱిగడచు మార్గముఁ జూచికొనుఁడు
జనులు మీ' రని మీఱి చాటెడిననఁగఁ
గొలకొలఁ బక్షులు గూసె నెల్లెడల.
'ఆపదలెన్ని తన్నావరించినను
బరహితార్థమె పాటుపడఁబూను బుధుఁడు'
అని తెల్పనెంచి యిట్లడరె ననంగ
నీరంధ్ర నిబిడాభ్ర నిచయంబుఁ గడచి
తూరుపుఁ గొండపైఁ దోఁచె సూర్యుండు.
అంత మేల్కని పౌరు లాలించి వార్త
చిన్నలు పెద్దలు స్త్రీపురుషులును

గుంపులుగుంపులై కుతుకంబు దిగులు
నచ్చెరు వెడఁదల నలమికొనంగ
నాబాలగోపాల మాక్షణమందె
యాయగాండ్ర వెనుక నరుగ నిప్పగిది
గ్రామంబె యచ్చటఁ గదిసెనో యనఁగ
నేయెడఁ జూచిన నెడ మింత లేక
చీమలపిండుల చెలు వెసలారఁ
జెఱువుతీరంబునఁ జేరె జనంబు.

కిటకిడ నందు మూఁగిన పౌరులందుఁ
బూర్ణ సరసిఁ గాంచి పొంగెడువారు
నలలవడిఁ గని యరుదందువారు
నలుఁగులు చెలరేఁగ నదరెడువారు
వఱద హెచ్చుట చూచి వంగుఱువారు
గంగగర్జల కెంతొ కలఁగెడువారు
నా మెశాంతిని మనసారఁ దలంచి
పసపుఁగుంకుమముల భక్తిఁ బూజించి
నారికేళంబుల నల్లపూసల్లను
నాకువక్కలను జెవాకుల నూలి
పోఁగుల జోతుల బోనాల విరులఁ
గ్రొత్త చేటలను నెక్కుడు గంచుకముల
జలదేవతకు నెమ్మి సాగించువారు
వరఁటిఫలావళి నర్పించువారు
పెరుఁగుకుండలఁ గడుఁ జేర్మి నిడువారు
పులఁగంపుఁ జట్ల నప్పాల నుంచువారు
నయి పొల్చి రొక్కట నతివ లందఱును

ఆసమయమ్మున నం దొక్క వనిత
యున్నట్టులుండి తా నున్మత్తచిత్త
వలెఁ దోఁచి, యొకకొంతవడి నూరకుండి
బావురుమని యేడ్చి పక్కన నవ్వి
కనులు జేవుజెంపఁ గటతటు లదుర
వరిటెన మెయిఁదీవ వడవడ వడఁకఁ
బల్మఱుఁ బండులు పటపట గీఁటి
యంతకంతకు భీషణాకృతిఁ దాల్చి
హుంకృతుల్ సెలఁగ మహోగ్రదేవతయ
యీరూపుఁబొందెనో యేమొ యటంచుఁ
దలఁచి, పొలంతులు తలఁకి తొట్రిల్ల
నొగి ముందువెన్కల నూఁగుచు, నదటి
పౌరవర్గముఁ గాంచి పల్కె నిప్పగిది.

“ఏను గంగమతల్లి నెఱుఁగరే మీరు
పొంగిపొరలుచు నుంటఁ బోడఁగట్ట నొక్క
పాపసంతతి నోంప భక్తులఁ బంప
ననయంబుఁ బొల్చు ననంతాత్మఁ గానె?
నన్ను మఱచినారె నాభక్తు లగుచు?

నాపూజకయి యిప్డు నరబలి వలయు
దాని నాకర్పింపఁ దలఁపుఁడు మీర
లాత్మప్రమోద మేపార జీవింత్రు
లేకున్న ముంతు నెల్లిదముగ మిమ్ము”
నంచుఁ బైనిండిన † యాముద్దరాలు
పడిపోయె మూర్ఛిల్లి ప్రజలమధ్యమున

గంగయానతి విని కలఁగి, చిత్తముల
నేమియుఁ దోఁపమి నెవరికివారు
నెట్టనఁ దమతమ నెలవులు సేర
నరిగిరి భయవిహ్వాలాన్వితు లగుచు

ఆవల జీవన మతిశయంబగుచు
గట్టుపైఁ బొరలెడుకరణిఁ జూపట్టె
రాయభారము తూము * ప్రక్కఁ దూరుపునఁ
బదునేనుబారల పరిమితిలోన
గండికపడె; నూర గగ్గోలు పుట్టె;
గుండియల్ ప్రీలఁ బెక్కురు జావపడులు
పశువుల శిశువుల బండారములను
మెలపున సాగించి మెఱకతావులకు
‘మనబ్రతుకున కింక మార్గమె’ ట్లనుచు
నటమటించిరి చేత నసువులఁ బట్టి.

౪.

అట బసిరెడ్డి కేడవకోడ లొప్పు
శైశవముననుండి సౌమ్యవృత్తులకుఁ
గుదురై నయింతి మేల్గొనముల దొంతి
త్యాగసంశీల విద్యల కాలవాల

---

† పైనిండుటయన శివమెత్తుట.

* ఇది యిపుడు ‘కమ్మారివారితూ’ మనఁబడుచున్నది. దీనికిఁ దూర్పునఁ బదునేనుబారల దూరములో, చెఱువు గండికపడియుండె నని విశ్వసించుట కాభాగమునఁ దటాకతీరము క్రుంగియుంటయు, గట్టునకు నెలుపలఁ దొలికట్ట కానికగ మాఱుకట్ట నెలకొనియుంటయు మొదలగు చిహ్నములను నేఁటికిఁ గానవగును.

ముసలమ్మ-తగుకొమ్మ-మురిపెంపు బొమ్మ.
ఆమె సుచారిత్ర మతిరమణీయ
మౌదార్యగర్భితం బనుపమానంబు
తల్లిదండ్రుల యాజ్ఞ దైవాజ్ఞగాఁగఁ
దలఁచి పాటించుఁ; బెద్దల భక్తి నెంచు;
గురుల సేవించు; లోకుల రక్తిఁ గాంచు;
చెలియలఁ బ్రేమించు; సేవకావళిని
నిండారు దయఁగాంచు; నిత్య మీలలిత
యరుణోదయాత్పూర్వమంద మేల్కాంచి,
శుచియయి, గృహపరిశుభ్రతకొఱకుఁ
దల్లికిఁ దోడ్పడి, తనదు చెల్లెండ్ర
కనురక్తిం స్నానపానాదు లమర్చి,
తదుపరిఁ బసుల మందకుఁజేర్చివచ్చి,
చదువుసాగించు నొజ్జలకడఁ బేర్మి
కగురు కవ్వం బాడఁ గఱ వుండదనెడు
నార్యోక్తి గుర్తించి యామృదులాంగి
లేఁగటియావుల లేఁగలఁ బేరిమఁ
జూచి, గానుగపిండి జొన్నవంటకము
ప్రత్తిగింజల తొక్కఁ బరితృప్తి నిడుచుఁ
బసువుల కదనునఁ బాఁడి పెంపొంద
మది ననిశమ్ము సమ్మద మందుచుండు.

జీవులఁ దన మేలిజీవంబు పోల్కి
నాత్మనెంచెడు నా దయామయహృదయ
యాఁకొన్న దూడలు నావులుఁ దనకుఁ
గనఁబడునెడఁ, గనికరము దీపింపఁ
దవుడొ యన్నంబొ మెత్తని పచ్చికయునొ
యిడి, కడితిని బోసి యెంతయుఁ బొంగు.

ఒక్కొకవేళఁ దా నొంటిమై నింట
వసియించుతఱిఁ బెక్కువంటకంబులను
వండి, చిఱుతల బీదవనితలఁ బిలిచి
వారి కేఁకటదీఱ వడ్డించుచుండు.

పడఁతి వేగఁ గపిలెబావులకడకుఁ
జల్లులు కొనిపోవు సమయమ్మునందు
నాఁకటిచిచ్చున నలజడిపడుచు
నెవ్వఁడే నెదుటఁ గాన్పింపఁ, గరంగి
నిలిచి, యాదలనుండు నిండుభారమ్ము
దిగిచి, యంబలి వానిఁ దృప్తుఁగావించి,
చను ననంతరమ ప్రసన్నాత్మయగుచు.

వరిపొలమ్ములకుఁ గావలియుండునెడల
నితరుల పసరమ్ము లెవియేని జొచ్చి
పైరు పాడొనరింప బాధింపఁబోక,
భవ్యాదరమున నుపాయాంతరమున
వెడలిచి వానిని, స్వీయమ్ములైన
పచ్చికబీళ్లలోపలఁ దోలి మేపు.

జొన్నతోఁటలలోనఁ జూడ నెత్తైన
మంచెలపై నిల్చి, మందమారుతము
సలవున ముంగురు లల్లలనాడఁ,
జెఱఁగొడికట్టునఁ జేర్చి బిగించి,
వీరబాలతెఱంగు వెఱఁగొప్పఁ దోఁచి,
కేల నొడిసెలను గిరగిరఁ ద్రిప్పి
'హో'యని యార్చి, యాకోమలధ్వనికి
వాయువేగమ్మునఁ బఱచు పిచ్చుకలఁ
గాంచి, మానసమునఁ గళవళపడుచు,
రాయివిసరలేక జాపడి నిలుచు.

ప్రత్తిచేలఁ గరమ్ము పచ్చికచెక్కి
యలసి, మునిమాపున నాహారవాంఛ
నొకనాఁడు చల్దిచేనూన, నొక్కండు
కొరిచ*బాలుఁడు, గోనెఁ గొడవలి గఱికఁ
గొని, పరువిడుచుంట గుర్తించి, వాని
నరిగొని వీఁపున కంటెడు కడుపు
విన్ననౌ మోమును వీక్షించి, పొగిలి,
కసవుతోఁ దనకైన గ్రాసం బొసంగి
యరిగె నింటికి శూన్యహస్తాబ్జయగుచు.

ఈరీతి ముసలమ్మ యింటికార్యములఁ
బొలముల పనులు నింపునఁ బూర్తిచేసి,
యనుదినంబునను సాయాహ్నకాలముల
ననుఁగుబాలలఁ గూడి యాడెడునపుడు
గుడులు గట్టించును; గోపురా లిడును;
దేవతాప్రతిమలఁ దీర్చియందుంచు;
బోనముల్ వెట్టును; పూజలు సల్పు;
నూరిదేవరల గంగోత్సవాదులను
నతిభక్తి సాగింప నడరు నిత్యంబు.
రాత్రులు వీథిపురాణముల్, కథలు,
భక్తుల చరితముల్, భామినీమణుల
ఖ్యాతివృత్తములు, భారతేతిహాసములు,

* ఎఱుకు (కిరాతుఁడు.)

బ్రీటిషు మంత్రి మండలీ



1 2 3 4 5 6 7 8 9

ఇండియా కేప్ టౌన్ కాన్ఫరెన్సు

# సుందరిసాధి




## స్త్రీలకు శ్రేష్ఠమైన టానిక్

స్త్రీవ్యాధులు, అనగా, రక్తము ఎఱుపు తెలుపుగా స్రవించుట, మర్మస్థానమందుండి మూత్రముతో గలసి పసుపు రంగుగా స్రవించుట, మర్మస్థానమందు మంటలు, కాళ్లు, చేతులు, నడుము మొదలగు అవయవములయందు గలుగు సమస్త బాధలకును, క్షయ, కండ్ల మంటలు, ఎగశ్వాసం, గొడ్డురాలితనము కడుపులో గడ్డ మొదలైన అనేకవిధము లగువ్యాధులు 'సుందరిసాధి' అను ఔషధము వల్ల స్వస్థము కాగలవు.

మద్రాసు స్టాకిస్టులు — దాదా అండు కో., అమర్ చంద్ శోభాచంద్

కె. ఎల్. రే. అండ్ కో., నైనియప్ప నాయక్ వీధి,

ఆఫ్రికన్ షాపు, బెజవాడ, ఆనందఫార్మసి, మచిలీపట్టణము. ధర బుడ్డి 1-కి రు 1-0-0.

**DAVE CHEMICAL WORKS, BOMBAY 2.**

బ్రాంచి — 104, నైనియప్ప నాయక్ వీధి, పి టి మద్రాసు అహమ్మదాబాదు అండు బొంబాయి

# శతకమంజరి - భక్తిసంపుటము

వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్టరఘువీర, నారాయణ, శ్రీకాళహస్తీశ్వర దాశరథి, రంగశాయి, శ్రీరామతారక, రామచంద్రశతకములు పదియుందు గలవు. ఒక్కొక్క శతకమునకు పెక్కు మాతృకలతో సరిచూచి చేర్చిన పాఠభేదములును, ఆయా శతకకర్తల చరిత్రమును, రచనమును, విషయమును విమర్శించిన విపులమగు పీఠికయును గలవు. ముచ్చటలు గూర్చునట్లు మేలి క్యాలికో బైండు వెల రు. ౧-౮-౦. శతకములు విడిగను దొరకును.

విలాసము — ఆంధ్ర గ్రంథమాల, 7, తంబుశెట్టివీథి, మద్రాసు.



## సగముధర విక్రయము

3 రూపాయలు 3 గడియారములు 205 వస్తువులు ఉచితబహుమతి

1 గోల్డుగిల్టు డమీ్మసైజు రిస్టువాచ్, 1 రైల్వే డమీ్మ పాకెట్ వాచ్, 1 బెస్టు "బి" టైంపీసు 5 సంవత్సరముల గ్యారంటీ గలది, 1 సీసా ఓట్టో దిల్ బహార్, 1 ఫౌంటెన్ కలము, 1 గోల్డుగిల్టు రింగు, 144 బ్లూబ్లాక్ సిగరెట్లు, 1 పౌడరుపెట్టె, 1 దువ్వెన, 1 సెంటుసబ్బు, 6 హేర్ పిన్నులు, ఒకజత గిల్టు చేకలు, 1 సిర బుడ్డి, 1 కొయ్య పెన్సిలు, 1 సూల, 1 క్లిప్, 1 కత్తి, 12 బొత్తాములు, 25 సూదులు, 1 పట్టెడగర, 1 పైకప్పు సంచి, 1 టీస్పూన్, రు 3/- పోస్టేజి 14 అణాలు

GREAT NATIONAL STORE, Post Box No 12215, Calcutta

నాత్మరంజకములౌ హరికథావళులు
నాలించి సంప్రీతి, నందందుఁ దొడరుఁ
గరుణారసముపట్లఁ గన్నీరుగార్చు

ఆచాన కేప్రొద్దు సానందమిడెడు
రమ్యవస్తువులలోఁ, రాట్నమొక్కండు
పనిలేనివేళలఁ బ్రతినిమేషమ్ముఁ
జేదోడు వాదోడు సిరిదోడు నగుచు
రాట్నమ్మె తల్లి యారాట్నమ్మె తండ్రి
రాట్నమ్మె చెలికాఁడు రాట్నమ్మె గురుఁడు
రాట్నమ్మె బంధువు రాట్నమ్మె బుధుఁడు
రాట్నమ్మె యఖిలమై రంజించుఁ దన్ను

తన కులమునఁ, బెండ్లితంతు సాగించు
వలనున నొదవఁ బావనకార్యతతికి
నుపకరణముగ నూటొక్క నూలొప్పోఁగు,
కన్నెలు వడుకుటే కర్జమైయుంట,
నేయింటఁ గల్యాణ మెప్పు డేర్పడిన
నప్పుడ ముసలమ్మ యచ్చోటఁ బొల్చు,
రమణీయగతిఁ దన రాట్నమ్ముతోడ

ఇట్టి యుదారగుణోచ్ఛ్రయాకతనఁ
దన మనోవృత్తికిఁ దగినమందిర మె
వొచ్చెఁ, బుట్టినయింటి పొలుపున నందు,
ననయంబుఁ గలకలలాడు నెమ్మోము
చిఱునవ్వువెన్నెలల్ చిందుచునుండఁ,
బిన్నపెద్దలలోన భేదభావమున
మలసె, మాతనువోలె మాతులఁ గొల్చె

"అత్తమాటల కెదురాడని ముగుద
కోడలుగా దది కూరిమిబిడ్డ
తల్లికూఁతులకు భేదమువచ్చుఁగాని
కడు నత్తలోఁ బొత్తుఁగనె ముసలమ్మ"
యని జనమ్ములు మెచ్చ నామె వర్తించె

కోమలి కడగొట్టుకోడలౌకతన,
వయసునఁ దక్కిన వనితలయందు
మిగులఁ జిన్నదియౌట, మేలిగోనాల
మెతు * వగు నడవడి మేటియైయుంట,
మాటమర్యాదల మందలింపులను
మాయమర్మాదులు మందునకైన

నెఱుఁగనిదగుట, నాయెలనాగమిన్న
మాతులుకడఁ గడుమన్నన వడసె

మామను బితృగతి మన్నించి కొలిచి
బావలపై భ్రాతృభావమ్ము నెఱపి
ధవుఁ బరంధాముచందమునఁ బూజించి
పౌరులయెడ బాంధవప్రీతి నించి
తోడికోడండ్ర పొత్తును వీడకుండి
సకియలఁ దనప్రాణసమముగాఁ జూచి
పూసలలోపలఁ బూవులలోన
దారమ్ముపోల్కిఁ జిత్తమ్ము హత్తించె
నెల్లర యెడఁదల నేకాత్మపగిది

౫

అట్టిచో నద్భుతంబైన వర్షంబు
వచ్చుటయును, వాన వఱద హెచ్చుటయు,
నీరు తటాకంబునిండి పొంగుటయు,
గంగాభవాని యంగనఁ గోరుటయును,
గుమ్మడపగుట, గగ్గోలు పుట్టుటయుఁ,
దల్లులు పిల్లలు దద్దఱిల్లుటయు,
గ్రామమ్మె గంగకుఁ గబళమౌననెడు
నలజడి ప్రజలలో నతిశయించుటయు,
వారి కొందలము నెవ్వరుఁ దీర్పకుంట,
నారయ దినగండ మది వందయేండ్ల
యాయువుగాఁగ నూహకుఁ దట్టుటయును,
నేకాంతగతి నున్న యెడ ముసలమ్మ
తలపోసి, యంతఁ గర్తవ్యాంశ మెదియొ
యాత్మ నొక్కటి నిశ్చయం బొనర్చుకొని,
యత్తయు మామయు ననుఁగుబావలును
మగఁడును జింతానిమగ్నులై, యింట
నొక్కెడఁ గూర్చుండియుండ, నచ్చటికిఁ
జని, యెల్లరకు నమస్కారముల్ సల్పి,
యనువొప్ప వారలయందుఁ గూర్చుండి,
యావినీతాంగి యిట్లనె మామఁ గాంచి—
"పితృసదృశులు మీరు, బిడ్డను నేను,
ఆత్మసంశయము మిమ్మడుగవచ్చితిని

ఎవ్వరికృప మన కింతకాలంబు
హాయిగ మనుమంటి మాజగదంబ
యానతి నేఁ డొక యాపద పుట్టె

* మృదువు

నిప్పుడో యెప్పుడో యేక్షణమునవో
కట్టతెగెడు, నవల గడియలోపలనె
యూరు మున్గిపోవు, నొకమొగి నిన్ని
యాత్మలు గంగ కాహారమైపోవు,
నిద్దానిఁగూర్చి యోజింప రొక్కరును

ఇది యల్పవిషయమ్మె? యిటు లుంటతగునె?
యుక్తమ్మె మన కింక నొప్పరికింప?
నీయుపద్రవముఁ దప్పింతు రెవ్వారు?
మన పురజనులకు మనుగడ యెద్ది?"

బసిరెడ్డికోడలి పల్కులలోని
కడుసూక్ష్మభావమ్ము గ్రహియించి, మిగుల
నచ్చెరువంది, మాటాడకయుండె,
నవల నాయబల యిట్లని పల్కె మరల

"మనము పాలకులము మనప్రజల్ వారు
వారలఁ గాపాడు భారము మనది
మనప్రాపు నమ్మి నెమ్మది నుండు జనుల
కొకకీడు రానుండ నొప్పరికించి
మన మూరకుండుట మాన్యమ్ముగాదు
వారి సౌఖ్యముగోరు వారల మగుట,
మన సాహసమె వారి మనుగడ యగుట,
నెదియేని యోజింప నిదితరుణమ్ము"

రమణివాక్యముల మర్మము లోనెఱింగి,
యామెధర్మోక్తికి నాత్మ నుప్పొంగి,
దాని సాగించు సాధనమును గూర్చి
బసిరెడ్డి చింతింపఁ బడఁతి యిట్లనియె —

"కోడండ్రు మీకు నేడ్గురు వారిలోనఁ
గడగొట్టుదానను, గడుఁ బసిదానఁ
గాఁపురంబును దిద్దఁగా లేనిదాన
జనులయంగదఁ జూడఁజాలనిదాన
గంగమ్మతల్లికిఁ గడుఁ గూర్చుదాన
ఘనభక్తి మీయాజ్ఞఁ గాంక్షించుదాన
ననురక్తి ననుఁబంప నర్థించుదాన"

ఈనుడుల్ వినినంతనే బసిరెడ్డి
కొడలు జలదరించె, నోడె జీవములు,
గుండియ వ్రేఁగయ్యె, ఘూర్ణిల్లె మనము,
దిటవుదప్పెను బుద్ధి, దీమస మెడలె;
నామెసాధుచరిత్ర మంతయు నెదుట

సాక్షాత్కరింప నాసౌమ్యశీలునకుఁ
గెరలి కన్నులనీరు గిఱ్ఱునం దిరిగె,
నది గాంచి ముసలమ్మ యనియె నిప్పగిది

"ఇట ధర్మములఁ జెప్ప నే నెంతదానఁ
గాని నాలోని యాకాంక్షఁ దెల్పెదను
ఈ చిన్నిప్రాణికై యిట్లు వెతగూర
మేరయే దీవర్య! మేలగు పనము
చింతింపఁదగుఁ, బురశ్రేయోభివృద్ధి
గాంక్షించు మీకు నీకన్న యేపాటి?
వందలవేల జీవముల రక్షింప
నలఁతిజీవిని మాత కర్పింపలేరె?
ఈ జగత్కల్యాణ మెంచియకాదె
యెల్లలోకాధిపుఁ డిచ్చె నీతనువు
నతని యీకాయంబు నాతని కొసఁగు
భాగ్యంబు చేకుఱఁ బరితృప్తిఁబొందఁ
దగుఁగాని, తగని యీతగులం బదేల?
పాలకులకు నీవి పరిపాటికాదె?
స్వార్థమ్ము విడనాడఁజనదె రక్షకులు?

"స్వార్థపరత్వమ్మె సంపదగాఁగఁ
దిరముగ మనఁగను దేహ మదెంత?
పరహితభావమ్ము పాటింపఁబోక
చిరసౌఖ్యములఁ గోరు జీవమదెంత?
యీయెల్లదేహుల యిష్టార్థసిద్ధి
కెలమిఁ దోడ్పడు దేహమే దేహమయ్య!
యీసర్వజీవుల యింపుఁ బెంపునకు
నెందుఁ బ్రాసగు జీవమే జీవమయ్య!
యీదేహ మదియెంత? యీజీవ మెంత?
యీమహాజనుల కర్పించెదనయ్య!

అదె నాకు జగము నయ్యదె నాకు ధనము
నదె నాకు మంత్ర మయ్యదె నాకు యజ్ఞ
మదె నాకు దైవ మయ్యదె నాకు ముక్తి
కాన నీయజ్ఞంబుఁ గడుఁ బ్రీతితోడ
సాగింపనిండు, నాసంతుష్టిఁ గనుఁగ"

మెలఁతిపల్కులఁ దాల్మిమెయి నాలకించి,
యామెసాహసబుద్ధి కబ్బురంబంది,
బసిరెడ్డి పరితృప్తభావుఁడై మిగుల
నామోదమును బొందె, నతని దుఃఖాశ్రు
లపుడ యానందబాష్పాళిగా మాఱె

## ౬

పురనాయకులు సల్పు భూరాజ్యధర్మమున
మసలెడు వృజినకర్మంబు సైరింప
నోపక జలదేవి యుఱిమి మాచెడినో
యనుతెఱంగునను, బశ్చిమాకాశవీథి
నంతటఁ జెంజాయ లలమె సాంద్రముగ
స్త్రీహింస కెవ్వారుఁ జేయిచ్చిరనెడు
నల్కఁ నా ప్రజను జెండాడెదుకో యను
గంగపూనిన పెనుగైదు వనంగఁ
బ్రాగ్దిశఁ గొరడు మాపట్టెఁ జిత్రముగ
పుణ్యాంగన యొకర్త భూగర్భమందు
నెమ్మెయి నడఁగు, నే నికఁ జూడఁజాల
నంచుఁ జాఱెడినో లోకాళికి ననఁగఁ,
బూషుండు పశ్చిమాంబుధిఁ గ్రుంకె—నంత
నత్తమామల యాజ్ఞ నంది, రత్నాల
రాశిఁ బొందినయట్లు రమణి యుప్పొంగి,
యాత్మేశు నానతి ననువునఁ బడసి,
తలదిగబాఱ నెంతయుఁ దానమాడి,
ధవళవస్త్రమ్ముల ధరియించి వేగ,
మెయినిండఁ దొడవులు మెలపునఁ దాల్చి,
పసపుఁ గపోలంపు బార్శ్వభాగముల
హస్తపాదమ్ముల నలఁది, నెన్నుదుటఁ
గుంకుమమును దిద్ది, కురులఁ గీలించి,
కీల్ముడి వైచి, మిక్కిలి విరుల్ ముడిచి,
కనులఁ గాటుక రాచి, కరయుగళమున
నిమ్మఫలమ్ముల నిల్పి, సద్భక్తి
భర్తపాదములకుఁ బ్రణమిల్లి తొల్త,
నత్తకు మామకు నవలఁ జేమోడ్చి,
బావల కొగి మ్రొక్కి, బంధుల కరఁగి,
తోడికోడండ్ర మద్దులు గొని, చెలుల
వీడ్కొని, సంభ్రమాన్వితచిత్తి యగుచుఁ,
గడలెఁ దటాకమార్గమున నాగరిత
జనము లగాధవిషాదపయోధిఁ
దోఁగుచు వీఁగుచుఁ దోడ్తోడ నడువ

వడివడి ముసలమ్మ వరిపొలములను
గాల్వల గుంటలఁ గడచుచు నరిగి,
విశ్వేశునకు నయవినతు లర్పించి,
శక్తిఁ బుష్కరిణిఁ దీర్థమ్ము సేవించి,
గణనాథునకు నమస్కారముల్ సేసి,
చౌడేశ్వరికిని నంజలుల ఘటించి,
విహగకూజితములు వెలయ నేపారు
వివిధవృక్షంబుల విలసిల్లుచున్న
తటము దాపునఁ జని, తన్మధ్యమందు
గండికపడిన భాగముఁ జేరఁబోయి,
యట నాఁగి, పౌరుల నందఱఁ గాంచి,
"యోధర్మనిధులార! యోతండ్రులార!
యోదయాన్వితలార! యోతల్లులార!
మీప్రాపుకతమున మీకందువోలె
నెల్లర నెనరున నేఁ బేర్మిఁ గంటి
నిపు మీయాన నర్థించెదు దాన
మిముఁ బాయుదు నటంచు మీ రెంచవలదు
చెడునది దేహంబె జీవంబు కాదు
ఈతన్వు లేకున్న నేకాత్మవెలయ
మీయూరు నింపును మీపెంపుసొంపు
మీశిశుపశువుల మీపొలములను
మీయోగుబాగుల మేల్మిఁ గన్గొంచు
మీమధ్యముననె నెమ్మిని నుండుదానఁ
గాన మోదమున నన్నని సెలవిండు
నే నిబిలంబున నిల్చుటతోన
దరిఁ బెనుశిలల భద్రము సేయుఁ డంతఁ
బ్రజల కందఱకు భద్రమ్ము నేకురెడు
నిదె నా ప్రణామంబు లెల్లర" కనుచు
నాయింతి, గంగ హృదంతరసీమ
నిల్పి, కేల్మోడ్చి మానితభక్తి నిగుడ
"నిఖిల జీవములకు నిండుజీవంబ
వైన యోగంగమ్మ! యారయుమమ్మ
యేహానిలేక మే మింతకాలంబు
నీదయాశ్రీకల్మి నెగడుచుండితిమి;
ఇపుడు నీయాగ్రహం బెనసినకతన
నీయానఁ దలఁదాల్చి నీకోర్కిఁ దీర్పఁ
నేను వచ్చితిని, నన్నేలమిఁ జేకొనుము;
అల్కఁ దొఱంగి సమాదరగరిమఁ
బైరుపచ్చల నెల్ల పక్షిసంతతులఁ
బసువుల శిశువులఁ బ్రజల పాలకుల
నందఱ నెప్డుఁ గాపాడు మోదేవి"
యని మది భావించి యాముద్దుగుమ్మ
నేత్రాబ్జయుగళి వెన్నెలలు చెల్వారఁ
గండభాగమ్ముల కాంతు లుప్పొంగఁ

గెమ్మోవిరంగు మిక్కిలి మిక్కుటంగఁ,
జిఱునగవు న్దళ్కు చిందులుగుల్కఁ
దుదఁగాంచి ప్రజ, నొక్క త్రుటికాలమందె
నెఱియఁ బ్రవేశించి, నిల్చె గర్భమున *
అంత గొబ్బున జను లందఱు నందుఁ
బెక్కుతాలను మంటిబెడ్డలఁ బేర్చి
పూడ్చిరి బోరియ ; నెప్పుడు వ్రీలకుంజె
నొడ్డు పదిలమయ్యె ; నొనరె భావుకము ,
బుక్కరాయసముద్రపుర భాగమందు
సావులు చెలఁగి నిరంతరధార
లేప్రొద్దుఁ గురిసె పాలేఱులుగాఁగఁ ;
బంట లెంతయు మించెఁ ; బ్రజ యేపుఁగాంచె ;
నెలకొనె నింటింట నిత్యోత్సవంబుఁ
బచ్చతోరణము ; సంపద లొప్పుమీఱె

ముసలమ్మ యిమ్మయి ముదము పెంపార
కర్మయోగమునఁ జొక్కపుఁదేట యనఁగ
రాజయోగమున నిర్మలసార మనఁగ
భక్తియోగమున నభ్రపుఁ జేవయనఁగఁ
దనరు నహింసాపథంబు పాటించి
పరహితాచరణవిభావంబు నెఱపి
వెలలేని తుష్టి జీవితము సాగించి
దివ్యయోగులకు నతీతమా సరణి
శాంతవృత్తిని ననాసక్తిభావమున
నార్తజనులఁ గావ నాత్మార్పణంబుఁ
బొనరించె ; నట్టి సంపూజ్యచరిత్ర
మాచంద్రతారార్కమై విలసిల్ల
నామోచమతి సీర్పియాంజనేయుండు
మంజరీవృత్తసంపద యొప్ప వ్రాసె.

---

* తటాకతీరగర్భమున నిల్చునప్పటి కీమె యింకను నీడేరనిచిన్నది యని స్థానికచరిత్రలు నుడువుచున్నవి 'నాఁటి కామె యత్తరి యింటఁ బెనిమిటితోడఁ గాపురమొనర్చుచు, నింటుమూలులగనుండె' ననుట, యీప్రాంతమునఁ బారంపర్యముగ వినవయ్యెడు జనశ్రుతి

## అనంతపుర బుక్కరాయ సముద్ర ప్రాంతముల ననంతపురమునకుఁ దూర్పున నొకమైలు దూరమునఁ గల్గు శిథిలములు



౧ శ్రీ కాశీ విశ్వేశ్వరాలయము
(నల్లగుట్టకుఁ దూర్పుటోరఁ బూర్వాభిముఖముగ బుక్కరాయ సముద్రమునకు నెడలు కాలిజాడకు నెడమచేతివైపునఁ గలది)



౨ శ్రీ కాశీ విశ్వేశ్వరాలయములోని నందీశ్వరుఁడు



౪ గవిమరమునం గల కల్యాణమండపభాగము
(ఇది చెఱువుకట్టదగ్గఱగా, నల్లగుట్టకుఁ బాఁమటియోర, ననంతపురమునకు వెళు బండిబాటకుఁ గుడిచేతివైపున, విశ్వేశ్వరాలయమునకు వెనుక దక్షిణాభిముఖముగ నున్నది)



౬ దేవరకొండయు, బుక్కరాయసముద్ర తటాకభాగమును



3 శ్రీ కాశీ విశ్వేశ్వరాలయమునకు నెదుటఁ దూర్పునఁ గొలఁదిమేరలో నుండు పుష్కరిణి



౫ ముసలమ్మ కట్ట
(ఇది ముసలమ్మ స్మృతిచిహ్నముగా పదునాల్గవశతాబ్దమున నెలకొల్పఁబడినది




# పట్టుపరిశ్రమ

చింతా గంగా రామయ్యగారు

పట్టును యింగ్లీషున సిల్కు (Silk) అని అనెదరు ఇది గొంగళి పురుగువలె నుండెడి పురుగువలన పుట్టును పట్టులో రెండు రకములు గలవు:—౧ మలబరీపట్టు, ౨ అడవిపట్టు అని

౧ మలబరీకోరాపట్టు:—మన ముపయోగించెడి క్షీరాబ్ధిపట్టు పంచెలు, తాపుతాపంచెలు, చీరలు ఈమలబరీపట్టుతో తయారైనవే. మలబరీయాకులవలన పెంచబడిన పురుగులనుండి గలిగిన పట్టుకు మలబరీ పట్టు (Mulbery silk) అని పేరు ఈమల్బరీపట్టుపురుగులు చిరకాలమునుండి హిందూ, చీనా, జపాన్‌దేశములలో పెంచబడుచుండినవి ఇప్పుడు యూరపుఖండమందు ఇటలీ, ఫ్రాంసుదేశములలోకూడా పట్టుపురుగులను పెంచి పట్టును విస్తారముగా తీయుచున్నారు. మన దేశములో ఇప్పుడు బెంగాలురాజధానియందును, మైసూరు, కాశ్మీర రాజ్యములందును పట్టు విస్తారముగా నుత్పత్తియగుచున్నది. చీనా దేశము అన్నిదేశములకన్నను యెక్కుడుపట్టును విరివిగ నుత్పత్తిచేసి ప్రపంచము నంతకును పంపుచున్నది ఈమలబరీకోరాపట్టు తెలుపు, పసుపు అను రెండురంగులలో నుండును

మలబరీమొక్కలు:—వీటినే తెలుగున పూతికచెట్లనెదరు. ఇది చెట్టుమలబరీ, మొక్కమలబరీ అని రెండువిధములు మలబరీ తోటలను వేసి చెట్లను పెంచెదరు మొక్కమలబరీ యేటేటా వ్యవసాయము చేయుదురు వ్యవసాయముచేసిన మలబరీ మొక్కలవలన యెక్కువ ఆకు లభించును అందుచేత సంవత్సరముపొడవునను పట్టుపురుగులను పెంచుటకు వీలుగల్గును మన గోదావరి, కృష్ణా, విశాఖపట్టణం జిల్లాలలో నుండెడి గరువులు, మెరకనేలలు ఈమలబరీవ్యవసాయమునకు మంచి అనుకూలమైనతావులు.

పట్టుపురుగులు (Silk-worms):— ఇవి గొంగళీపురుగును బోలియుండును ఈపట్టుపురుగు దానిజీవితకాలములో నాల్గుమార్పులు చెందును (౧) గ్రుడ్డు (egg) (౨) ప్రాకెడుకీటకము (catterpillar). (౩) మార్పునుచెందెడి అవస్థ (Pupa stage) (౪) ఎగిరెడిపురుగు (butterfly).

గ్రుడ్లు:—పట్టుపురుగులు మనదేశములో జనవరినెలమొదలు జూలైనెలవరకు గ్రుడ్లను పెట్టును. ఈగ్రుడ్లను వ్యాధులు వగైరాలు తగులకుండ జాగ్రత్తగా కాపాడవలెను తరుచు ఈగ్రుడ్లకు వ్యాధి తగులుటచేత గ్రుడ్లను పెంచెడివారు భూతదర్శిని అనెడియంత్రముతో వ్యాధి తగిలినగ్రుడ్లను వేరుచేసి మంచివాటిని కాపాడెదరు. వ్యాధితగులని మంచిగ్రుడ్లు కొల్లేగాల్ గవర్నమెంటు సిరికల్చరల్ ఫారములో పట్టుపురుగులను పెంచెడివారికి ఉచితముగాగాని స్వల్ప ఖరీదుకుగాని లభింపగలవు గ్రుడ్లు వారంరోజులలో పిల్లలగును. కొందరు గ్రుడ్లు త్వరగా పిల్లలుకాకుండ తగినశీతోష్ణస్థితిని కలుగచేసి కొన్నినెలలు ఉంచెదరు ఈగ్రుడ్లు ఆవగింజలంత యుండును.

కీటకము:—గ్రుడ్లు పగిలి సన్ననినూలుదారములవంటిపురుగులు బయటికి వచ్చును ఒక నెలదినములలో ఈపురుగులు పూర్తిగా ఎదుగును. పూర్తిగా ఎదిగినపురుగు ౨ అంగుళములపొడ వుండును. ఈనెలదినములు ఈపురుగులు విస్తారముగా మలబరీఆకులను తినును. ఈ పురుగులను పెంచుటయే 'silk worm rearing' అని అనెదరు.

వ్యాధులు, ప్లేగు మొదలైనజబ్బులుతగులకుండ జాగ్రత్తగా ఈ పురుగులను పెంచవలెను పురుగులు పెంచబడెడియిండ్లు సమశీతోష్ణస్థితి కలిగియుండవలెను వేడిగానుండెడితావులందు పురుగులను పెంచిన యెడల వాట్లకొరకు కృత్రిమశీతోష్ణస్థితి (artificial climate) గల యిండ్లను నిర్మించి మరీ పెంచవలెను! ఇటలీ, ఫ్రాన్సు మొదలగు దేశములలో మిక్కిలి చలిగా ఉండును, కనుక పురుగులను పెంచుటకు సమశీతోష్ణము కలుగచేసెడియిండ్లను నిర్మించెదరు. సాధారణముగా మనదేశమందు బెంగాలు, మైసూరు ప్రాంతములలో పట్టుపురుగులను పెంచెడివారు తమయిండ్లవద్దనే జాగ్రత్తగా పెంచెదరు.

మార్పుచెందెడు అవస్థ:— నెలదినములు అయినతరువాత యీ పురుగు మేతతినుట మానివేసి పట్టుగూడును అల్లుట యారంభించును. గూడు బయటనుంచి అల్లుట ఆరంభించి లోపల ముగించును. ఇట్లు గూడు మూడురోజులలో అల్లుట పూర్తిచేయును. సాధారణముగా అన్నిపురుగులు గూళ్లు పూర్తిగా అల్లుటకొరకు ౭ రోజులు చూచెదరు. ఈగూండ్లను కకూన్సు (cocoons) అని పిలిచెదరు. ౭ రోజులఅనంతరము గూడులోనున్న పురుగును ఆవిరి పెట్టిగాని, వేడిగాలిపెట్టిగాని చంపివేయుదురు. అట్లుచేయనియెడల ౭ రోజుల

అనంతరము శీతాకోకచిలుకవలె పట్టుపురుగు రెక్కలతో గూడు (cocoon) ను భిద్దలుచేసుకొని బయటికి వచ్చును. పైవిధముగా పగిలిపోయిన కకూన్‌లలోనిదారము ముక్కలుముక్కలుగా తెగిపోవును అందుచేత పగిలినకకూన్‌లు పట్టుదారము తీయుటకు పనికిరావు ఆకారణముచేతనే పురుగు కకూనును భిద్దలుచేసి బయటకువచ్చులోపలనే చంపివేయుదురు.

ఎగిరెడిపురుగు — పురుగులను పెంచెడివారు విత్తనముకొరకు కొన్నికకూన్‌లను ఆవిరిచేయక విడిచిపెట్టెదరు వాట్లనుంచి పట్టుపురుగు రెక్కలతో బయటికివచ్చి మరల గ్రుడ్లను పొదుగును.

కకూన్‌లు — ఈకకూన్‌లలోని పట్టుదారము పట్టుపురుగు నోటిలోనుంచి వచ్చిన యొక జిగురుపదార్థము. అది దాని నోటినుండి బయటకు వెలువడిన వెంటనే గాలితగిలి గట్టిపడి దారముగా మారుచున్నది ఒకకకూనులో ౫౦౦ మొదలు ౧౩౦౦ గజముల మిక్కిలిసన్ననిపట్టుదారము లభించును. దారములావు అంగుళములో ౧౩౦౦ వ భాగము ఉండును ఈదారమును మనము పరీక్షించిన యెడల అదిరెండుభాగములుగా ఉండును మనము ఉపయోగించెడి రాగికడ్డీమీద బంగారము రేకుగా అమర్చబడి మురుగులు మొదలైన ఆభరణములు ఎట్లు ఉండునో అట్లే అసలుపట్టుదారముపైన రంగుతో కలసిన యొకజిగురుండును. ఆజిగురును మనము తీసివేయగానే అసలు పట్టు తళతళలాడుచు మిక్కిలి ప్రకాశమానముగా కనుపడును. దానికే 'net silk' అని అనెదరు. జిగురు నూటికి ౩౦ వంతు లుండును.

పట్టుయొక్కగుణములు (Properties of silk) — పట్టు బలమైన ఆల్కలీసు (alkalies) అనగా చాకలిసోడా, కాస్టికు సోడా లోను ఉడుకబెట్టిన దానిబలము తగ్గిపోవును. అందుచేత సబ్బుమాత్రమే సిల్కును ఉతుకుటకు మనము ఉపయోగించవలెను. మన ముపయోగించుపట్టువస్త్రములను ఎన్నడు సోడాలోపెట్టి ఉడకపెట్టగూడదు. మురికిపోవుటకు సబ్బునుమాత్రమే మన ముపయోగించవలెను. బలమైన ఆమ్లములు (acids) పట్టును పొడుచేయును. పట్టు రబ్బరువలె కొంతవరకు సాగును మిక్కిలిమృదువుగాను తళుకుగాను ఉండును గాలినుంచి పట్టు నూటికి ౩౦ వంతులు తేమను లాగుకొనును. అట్లు 30% తేమను లాగుకొనినప్పటికి తేమగాఉన్నట్లు మనకు కనపడదు

కోరాపట్టు (Raw silk) — పై విధముగా పురుగులను చంపివేసిన కకూన్‌లను ౨ గాని ౯ గాని (లేక కావలసిన పట్టుదారముయొక్క లావునుపట్టి యెక్కువగాని తక్కువగాని) యొకవేడినీటిబానలోవేసి ఒకపుల్లతోకదిపినందున పైగూళ్లే దారము పుల్లకొనలకుతగులుకొనును. అట్లు అంటుకొనిన యెనిమిది దారములు ఒక దారముగా కలిపివేసి యొకనూలు తోడెడి పంకెవంటిచక్రముమీద తోడెదరు. ఈ చక్రములను ఇంగ్లీషున 'domestic filatures' అనెదరు. ఈ మిషనులమీద తయారు అయిన కోరాపట్టు సమానమైనలావు కలిగి యేకాండదారముగా ఉండదు ఫ్రాంసులోను, ఇటలీలోను మంచినవీనములైన మిషనుల సాహాయ్యమున కకూనులనుండి దారముతీసెదరు వాట్లకు 'steam filatures' అనిపేరు 'Steam filatures' వల్ల తీయబడిన పట్టుదారము సమానమైన లావు గలిగి ముక్కలులేక యుండును. ఇప్పుడు చీనాదేశములోను మనదేశములోనుకూడా స్టీముఫిలేచర్సు ఉపయోగించుచున్నారు కోరాపట్టు సన్నం ముదుగు తెలియచేసే నెంబర్లకు డేనియర్సు (deniers) అనెదరు ప్రత్తినూలుకు కౌంట్సు (counts) అనెదరు కోరాపట్టు పిల్లిగాచేసి కట్టలు కట్టి అమ్మెదరు విశేషముగా కోరాపట్టు మనదేశమందు మైసూరు, బెంగాలు, కాశ్మీరదేశములందు దొరుకును మనదేశపు పట్టుకన్న చీనాదేశపుపట్టు చౌక అగుటచేత చీనానుంచి విశేషముగా మనదేశమున పట్టు దిగుమతిఅగుచున్నది. అందుచేత మనదేశపు పట్టుపరిశ్రమకు కొంత నష్టము కలుగుచున్నది. కాని మనదేశము కాస్త కొంచెము శ్రద్ధవహించి పట్టుపురుగులను పెంచుట, పట్టుతీయుట వృద్ధిచేసినయెడల చీనాపోటీకి మనదేశము నిలువబడగలదు. మైసూరు గవర్నమెంటువారు, కాశ్మీరగవర్నమెంటువారు ఈపరిశ్రమను ఎక్కువగా ప్రోత్సాహించుచున్నారు తరువాత బెంగాలు, మదరాసుగవర్నమెంటువారుకూడ కొంతవరకు ప్రోత్సహించుచున్నారు

తోడుట (Winding) — పైనచెప్పిన కోరాపట్టు పిల్లను (hanks) రాటిలమీద వేసి పంకెలమీదకు తోడెదరు. ఇట్లు తోడెడి మిషనులకు తోడెడి మిషను (raw silk winding machines) లనెదరు. ఈ మిషనుల కుపయోగించే పంకెలకు బాబిన్‌సు (bobbins) అనిపేరు.

శుభ్రముచేయుట (Cleaning) — పైవిధముగా బాబినులమీద తోడినపట్టుదారమును ఈ క్లీనింగుమిషను సాహాయ్యమున దానిలోనుండే గొగ్గి, ముళ్లు పోవునట్లు చేసి శుభ్రము చేయుదురు దారము సాపుగా ఉండును.

జోడించుట (Doubling) — ఇట్లు సాపుచేసినపట్టుదారములను రెండుగాని అంతకు ఎక్కువగా గాని చేర్చి ఒకబాబినుమీద జోడించి తోడెదరు. ఇట్లు తోడునప్పుడు ఒకదారముతెగిపోయిననూ బాబిను ఆగిపోవును అందుచేత సమానమైనయేకదారమువచ్చును. ఈ మిషనుకు 'doubling machine' అనిపేరు.

పురియంత్రము (Twisting or Spinning machine) — పైవిధముగా రెండుగాని అంతకు ఎక్కువగాగాని జోడించిన దారమును ఈపురిమిషను (twisting machine) సాహాయ్యమువల్ల పేకపట్టుగా వేయుటకొరకు కొద్దిగా పురిపెట్టెదరు, లేక వడికెదరు.

పడుగు (Warp) నిమిత్తమయినయెడల శుభ్రముచేసిన ఒంటిదారమును ఈమిషనుమీద వడికి అట్లువడికినదారములు రెండు

గాని అంత కెక్కువగా గాని కలిపి జోడించి మరల ఈ మిషనుల మీద పురిపెట్టెదరు

దళ్లగాచేయుట Hank making ·— ఈవిధముగా పురిపెట్టిన పట్టును మరల దళ్లక్రింద పోయుదురు ఇట్లు దళ్లక్రింద పట్టుపోసే మిషనుకు 'hank making machine' దళ్లమిష నని పేరు.

జిగురును తీసివేయుట (Degumming)·—దళ్లగాపోసిన పట్టు దారమును 3 గంటలు మంచిమెత్తని సబ్బుద్రవములో ఉడుకబెట్టెదరు అట్లుడుక పెట్టినందున పట్టుదారమునకు అంటిపెట్టుకొనియున్న జిగురు, గంగు పోయి పట్టుతెలుపుగా వచ్చును ఈప్రకారము చేసినందున 30% జిగురుపోవును తరువాత నీటిలోజాడించి మరల పట్టు ఒకగంటవరకు క్రొత్తసబ్బుద్రవములో ఉడుకబెట్టెదరు. ఈవిధముగా చేసినందున పట్టుకు అంటియున్న మిగత జిగురు, రంగు అంతయు పూర్తిగా పోయి అసలుపట్టు తళతళలాడుచు కనపడును. పైన చెప్పినవిధము పచ్చసిల్కుకు, పట్టుకు, తెలుపుపట్టుకుకూడ ఉపయోగించవలెను రెండును కూడ ఈవిధముగా చేసినందున తెల్లగా అవును.

తెలుపుచేయుట(Bleaching) — జిగురును తీసివేసినపట్టును హైడ్రజన్ పెర్ ఆక్సయిడు (hydrogen per oxide) ద్రవములో నానబెట్టి తెలుపువచ్చునట్లు చేయుదురు. కొందరు జిగురును తీసిన పట్టు (అనగా ఇంగ్లీషున boiled off silk) ను నీటిలో తడిపి పచ్చ గడ్డిమీద ౨౦ రోజులు ఆరవేసినందున తెలుపు వచ్చును.

రంగువేయుట(Dyeing)·— పైవిధముగా తెలుపుచేసినపట్టుకు రంగులువేయుదురు. ముదరరంగులు వేసేయెడల తెలుపుచేయనక్కర లేదు. పట్టు మిక్కిలి విలువగలపదార్థ మగుటచేతను దానికి వేసెడి రంగులు బహుజాగ్రత్తగా వేయవలెను. తీక్ష్ణమైన కెమికల్సు (chemicals) ను రంగువేయునప్పు డుపయోగించకూడదు. అట్లుపయోగించిన పట్టుబలము, తళుకు తగ్గును. పట్టుకు, వూలు (wool) కు ఉపయోగించే acid colours అన్నియూ ఉపయోగించును. రంగు వేయునప్పుడు పట్టు తళుకు ఎంతమాత్రము తగ్గకుండ చూడవలెను.

పడుగులు చేయుట, నేయుట(Warping & Weaving):— రంగువేసినపట్టును పడుగులుగా విసిరి నేతనేయుట కుపయోగించెదరు.

౨. అడవిపట్టు(Wild silk) — ఈపట్టుకూడా మలబరీ పట్టును పోలియుండును. దీనికి తుస్సాపట్టు (tussa silk) అనిపేరు. ఇది విస్తారము అస్సాములో దొరకును. దీనినే మనవారు పొత్తు అనెదరు. దీనికినీ మలబరీపట్టుకునూ ముఖ్యమైన తేడా ఏమనగా ఇది సబ్బులో ఉడకపెట్టినప్పుడు జిగురుమాత్రమే పోయి, రంగు పోదు. మలబరీ పట్టు సబ్బులో ఉడకబెట్టినప్పుడు కోరాపట్టురంగు, జిగురుపోయి తెలుపు అగును.



చైనా జపానుయుద్ధ చిత్రములు




౧. చైనా జపానుల పటము



౨ జపానువారు టీ౯ట్సినుమూకను చెదరగొట్టుట



3 జపాను సేనలు ఉత్తరమునకు సాగుట

## జయభేరి

ప్రపంచములో మహాశాపగ మెరుగని కాలమందు వైద్యులు తమ కోరిక ఫలించినదని వేయబడిన గొప్ప ధరలకు కొన నలవాటుబడ్డ ప్రాచీన మందమతు లింకను అరుగుగగలరు ఆసేతుహిమాచలము జయభేరి మ్రోగుచున్న మా వసంత కుసుమాకరం తు 1కి రూ 10. శిద్ధమకరధ్వజము రూ 12 పూర్ణ చంద్రోదయం రూ 8. కుసుమరోగములు నివారణ కానియెడల రూ 116 లు బహుమానము చేయగల స్త్రీజనమందారు, రూ 4 క్షీరసముద్రం పాలుచాలని తల్లులకు పాలు సమృద్ధిచేయు రసాయనము సీసా 1కి రూ 1-4-0 దేహబంధుమాత్రలు సాయం కాలము భోజనముకాక పూర్వము వకమాత్ర అనుపానమక్కర లేకుండా మింగిన తెల్లవారుసరికి ఏవిధమైన వికారము లేక కాలవిరేచనము బ్రష్‌తో కడిగివేసినట్లు జారీచేయును. దీని యోగ్యతాపత్రికలు వేనవేలు. 100 మాత్రలు సీసా రూ 1-0-0. గుణములోను చౌకలోను పోటీ చాయగలవి. ఇండియాలో లేనట్టి 550 ఔషధముల కేటలాగు వుచితము,

## క్షీరసముద్రం ఆయుర్వేదఫార్మసీ

గుమ్మలూరు, (వయా) పాలకొల్లు,

పశ్చిమగోదావరి.

డాక్టరు

## వామన్ గోపాల్స



## ఐయోడైజ్డ్ సరసపరిల్లా.

రక్తమును చక్కగా శుభ్రపరచును.

మానవజీవితమునకు స్వచ్ఛమైన రక్తమే ముఖ్యాధారము అందుకు తగినది సరసపరిల్లా ఒక్కటియే ఏకారణము వలనగాని చెడిపోయిన నెత్తురును శుభ్రపఱచును టార్పిడ్ లీవర్ డెబిలిటీ, ఎరప్షన్సు, సిఫిలిస్, వాతనొప్పులు, చర్మవ్యాధులు, దుర్బలత్వము, కృశించుట, మున్నగువ్యాధులందిది అమూల్యమైనది వెల రూ 1-4-0

### డాక్టరు గౌతమరావు కేశర్యాస్
### ఫాస్ఫొరస్ మాత్రలు

మెదడికి అలసట కద్భుతమైన టానిక్ సామాన్యపు నరముల బలహీనత, పుష్టితగ్గుట, పుంస్త్వము నశించుట మున్నగువాటికి అద్వితీయమైనది వెల రూ 1-0-0 దిగువవిలాసమున కూడ దొరకును —

## దామోదర్ & కో,

చైనాబజారు, మద్రాసు.

## Dr. KOTAH'S MEDICINE CHEST

### డాక్టరు కోటాస్ మందులు పెట్టె

| | | |
|---|---|---|
| సీసా 1-కి 50 మాత్రలు గల 12 సీసాలు గల పెట్టె | రూ | 7-0 0 |
| 12 మందులు సీసా 1-కి 25 మాత్రలుగల పెట్టె 1-కి క్రయం | | 4-8-0 |
| 6 డిటో | | 2-8-0 |

ఇందున ముఖ్యమయిన విలువగల (1) అకార కరబాదిమాత్ర, (2) అగ్నితుండి రసవటి, (3) ఆనందభైరవి రసవటి, (4) బాలసంజీవి మాత్ర, (5) గోరోజనమాత్ర, (6) కస్తూరిమాత్ర, (7) కర్పూరాది రసవటి, (8) లవంగాది మాత్ర, (9) శీతాంశు రసవటి, (10) సంజీవి మాత్ర, (11) తాంబూల భైరవివటి, (12) వాత గజాంకుశ రసవటి యీ ముఖ్యమగు గృహచికిత్సకు తగిన ఔషధములన్నియు ఉపయోగించు పద్ధతులతో యిందులోగలవు.

ఈ ఔషధములు యింటనుండిన వైద్యుని సహాయము లేకనే యింటగలుగు జాడ్యముల నివర్తిచేసుకోవచ్చును.



ప్రతియింట నుండతగినది ప్రయాణీకులు యెక్కడను భయపడ నక్కఱలేదు
వైద్యసలహా కేటలాగు ఇనాము.

డా. కోటా-జయరామ నాయుడు,

వైద్యభూపతి.,

ఆంధ్రఆయుర్వేద వైద్యశాల (బ్రాంచి)

159 బ్రాడ్వే, మద్రాసు.

డాక్టరు కోటాస్ మెడిసిన్ చెస్టును, కోటాస్ హెర్బల్ గ్లిసరిన్‌ను, డాక్టరు కోటాస్ హేజల్ స్నో, మున్నగు పేటెంటు ఔషధములను విక్రయించుటకు ఏజెంట్లు కావలెను. వివరములకు వ్రాయుడు,

## ది మెరిడియన్ ప్రావిడెంటు ఇన్‌ష్యూరెన్సు కంపెని లిమిటెడ్.

## The Meridian Provident Insurance Co.,Ltd

హెడ్ ఆఫీసు 24 చర్చిగేట్ వీధి, కోట-బొంబాయి

Head Office —24 Church Gate Street,Fort, Bombay

జీవితభీమా రూ. 100,000 మించినది.

ఏప్రిల్, మే, జూన్ మాసములలో 10 సంవత్సరములు గడచిన పాలిసీదారులకు యీయబడినటువంటి బోనసు రు 20000 లు మించియున్నది

చెల్లింపబడిన చందామొత్తమునకు నూటికి ఏబదిపైగ కలిపియిచ్చునట్టి ప్రావిడెంటు ఇన్సూరెన్సుకంపెని యిదియేను నెలచందా రూ 2-0-0 లును, రు 1 యును,

సమర్థులును పలుకుబడిగల ఏజెంట్లు కావలయును. ధారాళమైన కమీషను యీయబడును

మేనేజింగు డైరెక్టరుకు వ్రాసికొనుడు.




మలయపర్వతపరీమళములు కొనితెచ్చు గాలి జీతములేని కమతకాఁడు
వజ్రాలసారమ్ము వంటఁబట్టినకృష్ణవేణమ్మ మాయింటి పెరటిబుగ్గ
కఱవుకాలము నాక తఱిపి వెన్నెలఁ బిండు కమలారి మాదొడ్డి కట్టిగోవు
అవిరళకావ్యరసాస్వాదనప్రియం భావుకమూర్తి అభ్యాగతుండు
రసికజనపేయకావ్యసారములు పోసి - లేఁతిముదురు లెఱింగి వండినమనోజ్ఞ
పాయసము నెల్లవేళలఁ బంచిపెట్టి - సుకము వొందెడు చిట్టిగేస్తులము మేము.

తెలుఁగుపాటలఁ గ్రొత్తతీరులు ద్రొక్కిన నన్నయ్యభట్టు మానాయకుండు
తెలుఁగుజాతీయంబు లలవోకఁ బూరించు దిక్కనమంత్రి మాతిత్తిగాఁడు
సకలకళాసారచాతురీమర్మజ్ఞుఁ డాంధ్రనైషధకర్త హంగుకాఁడు
ప్రతిపదపరిహాసభాషావిభూషణుం డగురామలింగఁడు హాస్యకాఁడు
నవరసాలంక్రియాభావనామనోజ్ఞ-రసికజనచిత్తసీమ మారంగభూమి
అన్ని దేశాల తెలువుల నలముకొన్న - జిలిబిలితెలుంగుభాగవతులము మేము.

వినపుకోఁఅల సుధారసము జాల్వారించు గానంబు మా కభిమానవిద్య
ప్రతిఫలాపేక్షావిరాగదీక్షాబద్ధ కోకిలార్భకుఁడు మాగురువరుండు
ప్రతిబాధ్యతాదూరప్రణయసాధకబుద్ధిఁ బాడుబుల్బులి సహపాఠకుండు
నిత్యగీతిస్రవంతీవీచికాముగ్ధుఁ డళిపతి మాకు విద్యాధికారి
సరససంగీతమాధురీసారపూరి - తోత్తరంగితహృదయులౌ యువకజనము
పోషకులు మాకు జగతి నపూర్వగీతి-నలమి మ్రోఁగించు నవ్యగాయకుల మేము.

విశ్వప్రపంచంబు వెలయించి వలపించు ప్రణయంబు మాచేరు పరమపదము
వ్రేల నంటక నాత్మవీణ మ్రోయించు నారదమౌని మాకు సూత్రప్రవక్త
తనపేరుఁ జెప్ప చిత్తము దోఁచికొనిపోవు వాసుదేవుండు మాభాష్యకర్త
వ్రజకామినీపదాంబుజపాంసుధారణోద్ధతుఁ డుద్ధవుండు మాతబిసిరాజు

లలితనవమల్లికలును గులాబిపూలు - సౌరభము చిమ్ము ప్రాకృతోత్సంగసీమ
ఆశ్రమము మాకు నందు దేహములు చంపి - వెలుఁగులత. నాఁడో ప్రేమయోగులము మేము.

నిడువాలుచూపు లానెడువట్టు నీజగ త్తంతయు మాదురాజ్యంపుటెల్ల
హరిణశాబాంకనీహారాంశుబింబంబు చదలంటి మెగురు మాజయపతాక
వివిధానుబంధ దీపితజగద్వ్యాపారమే మేము పాలించు స్మృతిచయంబు
ఆత్మీయపాపపుణ్యఫలానుభవములం బడయు బాష్పమ్ము లుపాయనములు
విమలరమణీయయువమనఃపీఠి నిలిచి - స్థూలబుద్ధుల కెఱుఁగను చూడరాని
సరణి పాలించి జగము నిష్కామరాజ - సుఖములం దేలు సుకవిరాజులము మేము.

---

# ముద్దుకృష్ణ!

కల్వాల పార్వతమ్మగారు

గానరసమును గ్రోలి గోగణములెల్ల
పారవశ్యంపుసొంపు నింపార నిన్ను
గోపికలవోలె కూర్మిమై గూడియుండ
నింపు మీరగ మురళి వాయింపు కృష్ణ!

ముద్దులొల్కెడు నీలంపు ముంగురులను
జిక్కు దీరిచి నిద్దంపుచెక్కులందు
పరిమళంబగు పద్మంపుపాంసుపాళి
నుదిరి వర్ణముమీర పూయుదున కృష్ణ!

కుండలంబుల కాంతులు గూడియాడ
వాలుగలుబోలి సొంపగువాలుగనుల
ప్రణయవార్నిధి యుప్పొంగి పారుచుండ
జూడగానైన రావో, యశోదకృష్ణ!

పాలతరగల మున్నీటిపాన్పు వీడి
జ్ఞానపాశంబునందు సంధానమైన
హృద్యమగునట్టి సౌవర్ణహృదయపీఠి
డోలికాకేలి సలుపు గోపాలకృష్ణ!

ఎంత వేడిన నీ విసుమంతయైన
నాదరంబును మనమున నానకుంట
యుక్తమా భక్తులను బ్రోవనున్న నీకు?
ముదమునను బ్రోవవయ్య నన్ ముద్దుకృష్ణ!



# విషూచీ (Cholera) రోగచికిత్సాక్రమము

భిషగాచార్య, దంతులూరు శ్రీరామచంద్రరాజుగారు

ఆధునికపాశ్చాత్యచికిత్సకులలో గొందరాయుర్వేద విజ్ఞానము నెరుగక, కలరాయను రోగమున కార్య చికిత్సాశాస్త్రములయం దెచ్చటను నిదానచికిత్సాదులు వ్రాయబడియుండలేదనియు, తా మారోగమును నూతనముగ గనిపెట్టి చికిత్సాక్రమము నేర్పరచితిమనియు దెలుపుచువచ్చిరి. కాని ఆయుర్వేదవేత్త లావిషయముల ఖండించుచు కలరాయను రోగము భారతవర్షమునకు మున్ను క్రొత్తగాదనియు, ఆర్యచికిత్సాశాస్త్రమునం దారోగము విషూచియను నామమున వ్యవహరింపబడినదనియు దానికినిదానచికిత్సాదులును దెలుపబడియున్నవనియు, సప్రమాణముగ విశదీకరించి, ఆయుర్వేదోత్కృష్టతను లోకమున వెల్లడించిరి. బహుజనవ్యాపియగు నీ విషూచి, సాంక్రామికరోగములలో నొకటియై యుండెననియు, ఉత్కృష్టమగు నాయుర్వేదచికిత్సలచే నది సాధ్యమయియుండె ననియు శాస్త్రానుభవపద్ధతులచే దేశీయ వైద్యులు ప్రత్యక్షపరచియుండిరి.

అట్టియీవిషూచిరోగముయొక్క చికిత్సాక్రమము ఆయుర్వేదశాస్త్రమున నాకుగల స్వల్పజ్ఞానమును బురస్కరించుకొని అనుభవపద్ధతులలోని నిదానచికిత్సాక్రమమును వైద్యసోదరులకు దెలుప నుత్సహించుచున్నాను. అట్టి ఈచికిత్సాపద్ధతిపై నాధారపడి చికిత్స నొనరించువో, నెందరెందరియో ప్రాణముల గాపాడగలుగుదు మను టకు సందియము లేదు.

ఈ ఘోరవిషూచికారోగమున అతిసారికావస్థ, శీతలాంగ, లేక నాడీక్షీణావస్థ, స్వాభావికప్రతిక్రియావస్థ అను త్రివిధావస్థలు గలవు.

### అతిసారికావస్థ

తొలుత ఈరోగము, అతిసారముతో ప్రారంభమై వాంతులనుసహితము గలిగియుండి, మిక్కుటమగు దాహము, నోటియం దసహ్యత, కడుపునొప్పి, తాపము, వేదన, శిరోవేదన గలిగియుండును. అతిసార మారంభమున ద్రవయుక్తమగు మలముతో మూడు నాలుగుమారులుమాత్రము పీతవర్ణముగ వెడలుచు, తదుపరి తక్రసదృశముగ తెల్లనై ఆమయుక్తముగ వెడలుచుండును. అట్టి ఈప్రథమావస్థ అతిసారికావస్థయని చెప్పవచ్చును.

### శీతలాంగ, లేక నాడీక్షీణావస్థ

ద్వితీయావస్థయం దీరోగమున అతిసార మెక్కుడై మలము వేగముగ మాటిమాటికిని బియ్యపుకడుగువలె కొంచెము శ్వేతవర్ణమై వెడలుచుండును. అట్టి యీ యవస్థయందు వాంతులు సహితము విరేచనములతోపాటు అంతయు అధికమై తొలుత ఆమాశయగతాన్నాదిపదార్థములును, తదుపరి తండులోదకసదృశముగను, వమనములు వెడలుచు వమనాధిక్యము ననుసరించి, పిపాస ఎక్కుడై వేధించుచు, గర్భస్థపేశములు పీడాసహితమై, ఆక్షేపకావస్థను పొంది సంకోచమగుచుండును. రోగియొక్కయాకృతి భయజనకమై, నేత్రములు గుంటలువడి, శరీరము శిథిలమై శ్యామవర్ణము గలిగి చెమటలు పట్టుచుండును. మరియు ఈరోగమున శరీరోష్ణత తగ్గుకొలది నాడి సూక్ష్మమై దుర్బలగతి నొందుచు, జిహ్వ హిమసదృశముగ చల్లనై స్వరము క్షీణించి, కడుపుబ్బుగలిగి, మూత్రము న్యూనమై వెడలుచుండును.

స్వాభావికప్రతిక్రియావస్థ

తృతీయావస్థయందీరోగమున సర్వాంగశీతల మెక్కుడై, ఆధ్మానావస్థ (మలమూత్రబంధము)ను బొందుచు మరణింపవచ్చును, లేదా రోగికి శరీరోష్ణత క్రమముగ గలిగి నాడిబలము నొందుచు, ముఖమువికాసము జెందుచు, క్రమగతిని అతిసారము న్యూనమై మలాంశ మెక్కుడగుచు వాంతులు శాంతినొందుచు పిపాస నశించి, మూత్రము స్వభావముగ వెడలుచు, క్రమముగ ఆరోగ్యమును గలిగించును. కొందరి కీయవస్థయందు సన్నిపాత జ్వరలక్షణములుగూడ గలిగియుండును. అట్టిరోగమున ఆరోగ్యము నందునప్పటి కించుక యాలస్య మగుచుండును. ఇదియే స్వాభావికప్రతిక్రియాలక్షణమని చెప్ప వచ్చును.

చికిత్సాక్రమము

శీఘ్రముగ నభివృద్ధినందు భయానకరోగ మగుటచే నీవిషూచికారోగమున అతిసారికావస్థయం దెక్కుడు జాగ్రత్త వహించి చికిత్స యొనరింపవలసియుండును. లేనిచో రోగము కష్టసాధ్యమై యుండవచ్చును. తొలుత లంఘన ముంచుటయే ఈరోగమున ప్రధానచికిత్సయై యుండును. రోగికి ఒకటిరెండుమారులు, అతిసారసదృశముగ మలము వెడలుచుండు నవస్థయందు సుధానిధి రసమును (యోగరత్నాకరమును చూడుడు) మూడు రతుల ప్రమాణముగ రెండుమారులు, గంటకొకతూరి జలానుపానమున ఇచ్చుచు తదుపరి మోతాదును తగ్గించి రతిచొప్పున రెండుగంటల కొకతూరి ఇచ్చుచుండవలెను, లేదా కర్పూరాసవము (భైషజ్యరత్నావళి) అయిదులగాయతు ఇరువదిబిందువులవరకు ప్రతియరగంటకు నొకతూరి ఇచ్చుచుండవలయును. ఇట్టిచికిత్సవలన రోగతీవ్రత నాపవచ్చును. కర్పూరాద్యరిష్టము (భైషజ్యరత్నావళి) గూడ నీతరుణమం దెంతేనియు గుణకారి కాగలదు. మరియు ప్రథమావస్థయందీరోగమును మలనిరోధముకై నల్లమందు గలియుమందుల నెన్నడును నివ్వరాదు. ద్వితీయావస్థయందీరోగమున అహిఫేనాసవమే (భైషజ్యరత్నావళి)౧౦ చుక్కలు,సజలగంధకామ్లము (సల్ఫ్యూరిక్ ఆసిడ్)ను ౧౦ చుక్కలును గలిపి రెండుగంటల కొకతూరి ఇచ్చుచుండవలయును. అహిఫేనాసవము సిద్ధముగ లేనప్పుడు కర్పూరరసము (బృహత్ రసరాజసుందర) లేక అమరాక్షసరసమును (భై. ర.)గాని యివ్వవచ్చును; లేదా నృపతివల్లభరసమును (రసేంద్రసారసంగ్రహ) ఒక్కొక్కమాత్ర రెండుగంటల కొకతూరి కర్పూరమిశ్రిత జలము (కర్పూరము ౧ భాగము, జలము ౭౦౦ భాగములు)అనుపానమున నిచ్చుచుండవచ్చును. ఇందు మూలమున రోగోపద్రవములగు ఆధ్మానాదులు రాకుండ గాపాడగలుగుదుము. మరియు ఆయుర్వేదోక్తమగు నీక్రింది ఔషధయోగముగూడ నెంతయోలాభకారిగా నున్నది.

ఇంగువ ౨ భాగములు
నల్లమందు ౨ భాగములు
పచ్చకర్పూరము ౨ భాగములు
మిరియము ౨ భాగములు
తామ్రభస్మము ౧ భాగము

జలముచే మర్దించి, రెండురతుల ప్రమాణముగ మాత్రల జేసి, జలానుపానమున మూడుగంటల కొకమాత్ర నిచ్చుట.

రోగి పిపాసనివృత్తికొరకు పూర్వోక్తకర్పూరజలమును, మాటిమాటికిని స్వల్పముగ నిచ్చుచుండవలయును కడుపునొప్పి యుండినపుడు శ్రీవాసతైలము (టర్పెంటైన్) ఒకభాగము, తిలతైలము ౪ భాగములు కలిపి కడుపునకు వ్రాయుచు ఉష్ణజలముచే కాచుటవలన ఉపశమించును, లేదా సార, నువ్వులనూనె, శొంఠి, సైంధవలవణము ఇవి కలిపి వెచ్చజేసి మర్దించుచు స్వేదన క్రియ లాచరించుటవలన నెంతయు ఉపయుక్తమై యుండును.

శరీరము చల్లనగుట, నాడి క్షీణించుట ఈగుణములయందు మృతసంజీవినీసుర (భై. ర.)ను గాని బృహత్

చంద్రోదయమకరధ్వజమునుగాని (ర. సారము) బృహత్ కస్తూరిభైరవినిగాని (భై. ర.) ప్రయోగింపవలసియుండును. మరియు కస్తూరి ౬ రతులు, మృతసంజీవినీసుర ౫ తులములు కలిపియుంచి ౩౦ నుండి ౬౦ చుక్కలవరకు శరీరావస్థ ననుసరించి ౹ గంట మొదలు ౨ గంటల కొక్కొక మోతాదుచొప్పున నిచ్చుటవలన ఎంతయు లాభముండును. లేదా మృగమదాసవము (భై.ర.)ను ౨౦ లగాయతు ౪౦ చుక్కలవరకు అవస్థానుసార మిచ్చుచుండవచ్చును. ఈపైనిజెప్పిన యౌషధములచే శరీరోష్ణత గలుగక నాడి మందగతి జెందినపుడు మల్లచంద్రోదయమును (రసాయనసారము)గాని బృహత్ సూచికాభరణరసమునుగాని ప్రయోగింపవలసియుండును. అందు మల్లచంద్రోదయమును మృతసంజీవినీసురతో నిచ్చుటవలన నాలుగైదునిమిషములకే శరీరోష్ణ మేర్పడును. విషముష్టిఆసవమునుగూడ ఈఅవస్థయందు వాడుటవలన ఎంతయు గుణము గాంచవచ్చును.

విరేచనములు తగ్గుదల నంది వమనాధిక్యముకలిగియుండినపుడు అశ్వత్థక్షారము (రావిబెరడుయొక్క క్షారము)ను రెండుమూడురతుల ప్రమాణమును అర్ధశేరుజలమునందు గలిపి మాటిమాటికి త్రాగించుచుండుట లేదా ఛర్ద్యంతకరసము (యోగరత్నాకరము)ను నొకరతి ప్రమాణమును పైనవ్రాసినజలముతోగాని, మామూలు జలముతోగాని ఇచ్చుచుండుటవలన అతికష్టసాధ్యములగు వాంతులుసహితము నశించును.

స్వేదాధిక్యమునందు ప్రవాళభస్మము ౨ రతుల ప్రమాణముగా నొకమాషప్రమాణముగల మధువుతో సేవించుటయు, శొంఠిచూర్ణముతో గాని, ఉలవలచూర్ణముతోగాని శరీరమును మర్దించుటచే ఎంతయు నుపయోగమైయుండును.

మూత్రావరోధము గలిగినపుడు సూరేకారపు నీళ్లయందు గుడ్డను దడిపి పొత్తికడుపుపై వేయుటచే మూత్రనిరోధము తొలగును.

కాలుచేతులు శీతలమై యీడ్పుగలిగియున్నప్పుడు శొంఠిచూర్ణమును, శ్రీవాసతైలమును గలిపి కరపాదములకు వ్రాయుచు సీసాలయందు వేడినీళ్లుంచి కాచుటవలన లాభకరమైయుండును.

ఇక తృతీయావస్థయగు ప్రతిక్రియావస్థయందు రోగము శమనమునొంది దుర్గుణము లంతరించి ఆకలిగొనిన వో ఆపుపాలను, సున్నముపై తేరిన నీటిని లేదా యవమండము ఈమొదలగు ద్రవపదార్థములనే యాహారముగ నిచ్చుచుండవలయును. రోగము సంపూర్ణముగ నశించి జఠరాగ్ని దీప్తమగునప్పటివరకు ఎట్టి కఠినాహారముల నివ్వరాదు.

పథ్యము నిచ్చినవెనుక దుర్బలత్వమును బోగొట్టుటకై రక్తవృద్ధికరములగు నౌషధముల నివ్వవలసియుండును. లోహభస్మము, లోహాసవము మొదలగునౌషధము లీరోగాంతమున గలుగు దుర్బలత్వమును బోగొట్ట గలుగును.





# హరనాథస్తుతి

మంగిపూడి వేంకటశర్మగారు

శ్రీగల నీదుపాదములు చిత్తసరోరుహమందు నిల్పుదన్
యోగదముల్ భవత్కథల నుల్లము చల్లవడన్ బఠింతు నీ
వ్రేగగు ప్రేమతత్త్వమును వీనులవిందుగ విందు పొందుగా
పాగల శ్రీహరా పతితపావన శ్రీహర పాహి శ్రీహరా!

శ్రీగల భాగ్యశాలివఁట చిత్తము మెత్తనివాఁడవంట బల్
తేగము గల్గువాఁడవఁట తియ్యనిమాటల గారవించు మేల్
నాగరకుండవంట అయినన్ నినుఁ గోరను గొప్పకోర్కులన్, పాగల...

రాగభరంబు మీఱఁగ బిరాన తటిల్లతలీలఁ దోఁచి నీ
క్రీఁగనుదోయిచూపుల నొకించుక నాపయిఁ బర్వఁజేసినన్
భోగగనాధిపత్య మిడి ప్రోచినరీతిని సంతసించెదన్, పాగల...

పాగధినాథ ముఖ్యసురవంద్యము నాగమవేద్యమున్ శుభో
ద్యోగము నీదు పాదయుగ మొప్పుగఁ బూజలొనర్చుభాగ్య మే
లాగు లభించు నీవు మము లాలనసేయుచుఁ జూపకున్న నో, పాగల...

ఓగుణగణ్య! సంతతమహోన్నతపుణ్య! జగచ్ఛరణ్య! యో
యోగివరేణ్య! నన్ను దయ నోమఁదలంచిన నీదుప్రేమలోఁ
దోఁగుచు హర్షవీచికలఁ దూఁగుచు ధన్యత నందఁజేయవే, పాగల...

మే గరుపారి కన్నులు నిమీలనసంగతిఁ గాంచి హర్ష ము
ద్వేగత నొంది తన్మయత వ్రేఁగయి డెందమె డింది యోగసం
యోగతఁ గన్నయోగివలె నొప్పుగ నిన్ గనులాగు మప్పవే, పాగల...

ఏగతిలేని దీనులకు నేడ్తుగడైన ఘనుండవంచు ని
న్నే గతిగాఁగ నామతిని నమ్మితి సమ్మతి నేలుకోఁగదే
రాఁగదె నాదుడెంద మలరారఁగ దర్శన మిచ్చి పోఁగదే, పాగల...

భోగవిలాసలాలసులు మోహవిముగ్ధులు కామసక్తులున్
త్యాగదయావిహీనులు నుదాత్తము నీదగు ప్రేమతత్వమున్
లోఁగొనలేరు శాంతశుచిలోలురు లోఁగొని ధన్యులైనటుల్, పాగల...

మూఁగవు గావు మౌనపు సుముద్ర వహించితివేమొ కాని బల్
ఱాగవు గావు నీదు ననురాగము దాఁచితివేమొ గాని బై
రాగివి గావు సంస్కృతికి రంజిలువాఁడవు గాని పల్కవే, పాగల...

వేగిన దాదిగా వెతల వేఁగుటె గాని ఫలంబు లేదు మో
హాగతభోగవాగురులయందు లవంబు సుఖంబు లేదు ఏ
భాగున నాజవంజవహలాహలమందున మన్కి లేదు హా!, పాగల...

బాగగు గౌరరూపమున భాసిలి ప్రేమదయార్ద్రదృష్టులన్
జాగయ మాదయాదిఖలజన్ముల మాన్యులఁ జేసి భూనభో
భాగములన్ యశోలతలు ప్రాఁకఁగఁజేసిన పుణ్యమూర్తి యో, పాగల...

నీగుఱు తారయంగలమె నిత్యనియంశ జనించి గౌరు నీ
లోఁ గలయంగ మేనిరుచి లోకము విభ్రమమందు ముంచి బల్
పాగలుఁడై చరించితివి బాగురె ప్రేమసుధామయుండవై, పాగల...

పాగలుఁడంచు నిన్నుఁ బరిపాటిగ నందురు లోకులందఱున్
పాగలు లెవ్వరో యెఱుఁగుపాటివివేకము గల్గియున్నవో
పాగలుఁ డందురే భువనబంధు దయామృతసింధువున్ నినున్, పాగల...

మూఁగినపాపపుంజములు ముప్పులపాలయి పోవు నిల్వ ను
ద్యోగముచేసి పుణ్యములు తోరణగట్టుచు వచ్చి వాలు కా
లాఁగక శత్రువర్గము పలాయనమౌను నినున్ భజించువో, పాగల...

వాగమృతప్రవాహమున పాపులతాపము రూపుమాపుచున్
రాగరసప్రశాంతముల రంజిలు చల్లనిచూపుకోపులన్
రాగులఁ జేయుచున్ జగతి రంజిలుచుందువు ప్రేమమూర్తివై, పాగల...

తూఁగవు నీదు సేవనముతో నిగమాగమధర్మకర్మముల్
తూఁగవు నీదు నామమణితో నిఖిలామరకోటినామముల్
తూఁగవు నీదు ప్రేమసుధతో రుచిమించుసుధారసాదులున్, పాగల...

యాగము లెన్ని చేసిన మహత్తరమైన తపస్సుచేసినన్
యోగము లభ్యసించినను నుత్తదె చిత్తవిశుద్ధియున్ మహా
త్యాగసమృద్ధి సర్వసమతాంచితబుద్ధియు నబ్బకున్నవో, పాగల...

జేగుఱుఁ జూసి గుడ్డలకు జీబురువెండ్రుక లొప్ప గొప్ప బై
రాగులలాగు దోఁచెడు సరాగుల కబ్బునె స్వర్గమోక్షముల్
వీఁగక యింద్రియోద్ధతిని వీసరపుచ్చి వెలుంగకున్న వో, పాగల..

నాగురునాథుఁడున్ హృదయనాథుఁడు జీవననాథుఁడున్ దయా
సాగర నీవెయంచు మనసారఁగ నమ్మి భజించుచుండినన్
దాఁగురుమూఁత లాడెదవు దాసులతోడ సరాగమ్మా బలా, పాగల...

నీగతి గాననేరక మనీషులె నివ్వెర నొందుచుండఁగా
దాఁగిలి వేల యబ్బురపు దాఁగుడుమూఁతలివేల క్రొత్తప
న్నాగపు నాటకంబునకు నాంది వెసన్ వినిపింప రావయా, పాగల...

---

# ప్రణయోత్కంఠ

నాదెళ్ల వెంకటరావుగారు

వీసెఁడు కష్టమూల్యమును బెట్టినఁ గాని తులంబుసౌఖ్యమే
దోసిలి కబ్బనట్టి బహుదుఃఖమయంబగు లోకమందు నా
యాసముఁ జెంద నేల ? ప్రియుఁడా ! మన దేహములన్ ద్యజించి సం
తోసముతోడ నాకపురిత్రోవలఁ బోదము రాఁగదే వెసన్ ?

నవ్యములై పరిస్థితులు సంకటపెట్టెడు నర్థహీనులన్
నవ్యసుఖంబు లేదిచట, నశ్వరలోకము దీని వీడుచున్
ద్రవ్యము లేకయున్నను ముదంబునఁ గాలముఁ బుచ్చునట్టి యే
యవ్యయదివ్యలోకమున కైనను బోదము రమ్ము నెచ్చెలీ !

తావకబాహుబంధ మురిత్రాడుగ నామెడఁ జుట్టి కౌఁగిటన్
జీవముఁ బాపి, నాకుదులఁ జేకొని కంఠము నొక్కి వైచి కొ
మ్మావు; నొకేనిమేషమున నీగతి మాంసపు 'జైళ్లు' వీడి స్వే
చ్ఛావిహృతుల్ పొనర్చుదము చల్లని నందనవృక్షవాటులన్.

---

* ఆంగ్లకవి 'రాబర్టు బ్రౌనింగు' నకు ఋణపడితిని.

# విగ్రహారాధనము

వల్లూరి సూర్యనారాయణరావుగారు, బి.ఏ., బి.యల్.

సర్వాంతర్యామియైన ఒకపరబ్రహ్మ మున్నాడని విశ్వసించువారు, ఆయననిరామయుడనియు, నిర్వికల్పుడనియు, నిరంజనుడనియు, నిరాకారుడనియు స్పష్టముగా చెప్పుచున్నారు. మనహిందూ శాస్త్రములుకూడ అట్లే ఘోషించుచున్నవి. అయినను జనులందరు సర్వసాధారణముగా తమ మనోవీథియందు ఏదియో యొకవిధమగు దేవదేవుని విగ్రహమును ముందిడుకొని,రూపోపాసన చేయుచున్నారు. లేనియెడల ప్రార్థన కర్థమే లేదు ఈ ప్రపంచములో నున్న ముఖ్య మతములవారిలో మన హిందువులు, బహిరంగముగ విగ్రహముల నుంచుకొని, వానిని పూజించెదరు కేవలము నిర్గుణోపాసనయందును, మంత్రధ్యానములందును వారికి తృప్తి జనించదు. అది కష్టసాధ్యమని యెంచెదరు నిగూఢమైనట్టి వేదాంతజ్ఞానము సామాన్యమానవులకు సరిపడదు మూర్తులు, అవతారములు ప్రతీకములు మానవరూపములుగా మనస్సునం దుంచుకొనిగాని, నేత్రములతో చూచిగాని, భక్తితో ప్రార్థనచేయుట అలవాటై పోయినది.

విగ్రహారాధనమును ముస్లిములు, క్రైస్తవులు నిరసించుట న్యాయముకాదని మనహిందువులు ఒకహేతువును కనుపరచెదరు ఉపనిషత్తులలో నున్న వేదాంతజ్ఞానమును బట్టియైనను, ప్రకృతియంతయు పరబ్రహ్మముతో నిండినప్పుడు అన్నివిధములైన ప్రతీకములలోను పరబ్రహ్మమునావాహనించి ప్రతిష్ఠ చేసివానిని నేలపరబ్రహ్మమునుగా పూజించకూడదని యడిగెదరు. సృష్టియొక్క పుట్టుక గాని, దానికర్తనుగురించిగాని మనము తెలిసికొనజాలమని ఒప్పుకొన్నప్పుడు ఈయుభయవాదులు ఒండొరులను విమర్శించుకొనుటవలన లాభమేమి? హృదయావేదన కష్టసమయములలో తీరునని, యిట్టి పూజలు, ప్రార్థనలు, ప్రతిమతములోను చూప్పించబడియేయున్నవి ముప్పదివేల సంవత్సరములనుండి, హిందువులు, చాల్డియనులు, బాబిలోనియనులు, అస్సీరియనులు, ఈజిప్టువారు ఈవిగ్రహారాధనసంప్రదాయము కలిగియున్నట్లు భూగర్భపరిశోధకులు అభిప్రాయపడుచున్నారు.

ఈవిగ్రహారాధనములో అనేకములైన మూఢవిశ్వాసములు, లేని పోనితంతులు, ఆచారములు, కర్మలు మొదలగునవి కలసి నిజమైన ప్రశాంతమైన దైవభక్తి నశించి, మిక్కిలి చోద్యమైనట్టియు, విపరీతమైనట్టియు, నవ్వుపుట్టించునట్టియు, హేయమైనట్టియు వక్రమార్గమున మనహిందువులు నడచుచుండుటచేత నీవిగ్రహారాధనను నిరసించుట ఆచారమైనది. ముస్లిముల మశీదులు, క్రైస్తవుల చర్చిలు, బౌద్ధుల గుళ్లు, ఆరామములు మనదేవాలయములలోని యాడంబరము లేమియు లేక, ప్రశాంతస్థలములై దైవప్రార్థన కుచితములైయున్నవి. వానిలో నేవిగ్రహము లేకపోయినను, వారిలో చిన్నలు, పెద్దలు మనలో వలెనే భక్తిపరులుగా నుండలేదా? కాబట్టి మొదట ఈవిగ్రహారాధన యనునది యేలపుట్టినది, యెప్పుడు పుట్టినది, విచారించుట మనకవసరము దీనిపరిణామము కొంతవరకైనను మనము తెలిసికొన్నగాని దీనిలో మిక్కిలి అవసరమైన సవరణలను చూపించజాలము.

ప్రపంచములో అన్నిమతగ్రంథములకంటెను, అనేక - వేల సంవత్సరములకుపూర్వము పుట్టిన ఋగ్వేదములో ఇట్టివిగ్రహారాధన గురించి గాని, దేవాలయములగురించిగాని యెట్టి ప్రశంస యున్నట్లు కనుపడదు ప్రకృతిలో మానవునికి గోచరించెడు అపరూపపదార్థములన్నియు దేవతలనియే మొదట భావించబడుచుండెను. మనమతములన్నియు, ప్రకృతినిచూచి మనవారికుండినభయముమీదనే ఆధారపడి తరువాత, చిలవలుపలవలువేసి వృద్ధియైనవిగాని వీనిలోనేదియు సత్యమనియు, దేవుడు ఏర్పరచినదనియు ఎన్నడు నమ్మరాదు మన ఆర్యులు, ఆవేదకాలములో వర్షములు కురిపించువాడు ఇంద్రుడనియు, తేజస్సు నొసంగువాడు సూర్యుడనియు, ఉదకముల నిచ్చువాడు వరుణుడనియు, అన్నము నిచ్చువాడు అగ్నియనియు, రాత్రిని పోగొట్టునది ఉషోదేవతయనియు, ఇట్లు ఏమేమో ఊహలు చేసికొని, ఆయాదేవతలను గురించి ప్రార్థనలను జరిగించుచు, వానినే యీఋగ్వేదములో ఉదాహరించిరి ఉరుములు, మెఱుములు, గ్రహణములు, భూకంపములు, తుపానులు, ఉప్పెనలు మొదలగువానికి మనుష్యమాత్రుడు భయపడుట సహజము కాబట్టి వాని కధిష్ఠానదేవతలున్నట్లు మనవారెంచి ఋగ్వేదములో వీరి స్తుతిగీతముల ననేకములు పాడియుండిరి కాలక్రమముగ నీప్రకృతిలో నున్న సూర్యచంద్రాదులు, ఋతువులు, రాత్రింబవళ్లు మొదలగునవి నియమము తప్పక సర్వకాలసర్వావస్థలయందును ఒకటేవిధముగ నడచుచుండుటచేత నీదేవతలనన్నింటిని నడపించుటకు ఒకమహాదేవుడు వేరుగ నున్నాడనియు, ఆయనను ఈదేవతలగుండానే పూజించవలెననియు

ఊహించి అట్టిమంత్రముల నేర్పాటుచేసికొనిరి. తుదకు వేదములు మంత్రములు బ్రాహ్మణములు మొదలగునవి అతిక్లిష్టరూపముగ చేసి వైదికకర్మలను హెచ్చించుటచే ఉపనిషత్తులలో ఆదిదేవుడే ప్రకృతి నంతయు నిండియేయున్నాడనియు, ప్రకృతియంతయు అతనిలోనే యున్నదనియు, కాబట్టి మనలోనున్నదికూడ ఆదేవుడే, లేక ఆయన కళయే యనియు, వ్రాయబడినది. కాని యిదియంతయు వేదాంతము గాని, హైందవమతముకాదు; బ్రాహ్మణమత మంతకంటెను కాదు.

కొంతకాలమైనతరువాత (ఎప్పుడో ప్రస్తుతము నేను నిర్ధారణ చేయలేను) బ్రాహ్మణశాఖవారు ఈవిగ్రహారాధనను అనేకకర్మలతో సంపుటీకరణము చేసి మానవప్రకృతిని కనిపెట్టి, అన్ని అంతస్తులలో నున్న ప్రజలకు ఉపయోగించునట్లు రాళ్లు రప్పలు చెట్లు పుట్టలు పాములు కోతులు మొదలగు వాని నన్నిటిని పూజించుట కంగీకరించిరి ఇట్లు అనాగరికులైన అడవిమనుష్యులపూజలను,దురాచారములను,బలులను అంగీకరించి, హైందవమతములోనున్న చాతుర్వర్ణ్య వ్యవస్థలో వారినికూడ క్రమక్రమముగా చేర్చదొడంగిరి. పైవాని యన్నిటిలోను దేవుడున్నాడు గనుక వానిని స్త్రీరూపములుగాను, పురుషరూపములుగాను ఉపాసింపవచ్చుననిరి పోలేరమ్మ పైడమ్మ నూకాలమ్మ కాళి శ్యామలమ్మ మరిడమ్మ విఘ్నేశ్వరుడు మొదలగు వికృతరూపములన్నియు దేవస్వరూపములే యనియు, తులసిమొక్క కందపెలక రావిచెట్టు మొదలగువానినికూడ పూజించుట మంచిదేయనియు, అదివరకు ఆయా ప్రజలలోనున్న మూఢవిశ్వాసములను మరింత పురికొల్పి తాము ఆశ్వర్యవమువహించి, తమపలుకుబడిని వ్యాపింపజేసుకొనిరి పాపము! తమస్వలాభమునకు గాక నైతికప్రవర్తనకు, భగవద్భక్తియే ప్రధానమనుకొని, సదుద్దేశ్యముతోనే మనబ్రాహ్మణులు నానావిధములైన భగవదారాధనలను ప్రవేశపెట్టుటయేగాక ప్రతిప్రతిమను గురించియు కథల నల్లిరి స్త్రీలకు వ్రతముల నేర్పాటు చేసిరి పూర్వ మవతరించిన మహాపురుషులను దైవసంభూతులుగ నెంచి, వారిని అవతారములుగ చేసి వారు చేసిన ఘనకార్యములన్నియు అమానుషమైనవిగ వర్ణించి, వారిచరిత్రలలో ధర్మసూత్రబోధనల నిమిడ్చి, ప్రజలలో దైవభక్తిని, నీతిమార్గమును పెంపొందించుటకే అనేక-పుక్కిటిపురాణములను, స్థలపురాణములను వ్రాసిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సృష్టిస్థితిలయకారునియొక్క వేరువేరు రూపాంతరములుగ నొనర్చి వారికి మానవులకువలెనే జరయు మృత్యువును కల్పించి, భార్యలను అంటగట్టి, వారికి కల్యాణోత్సవములు, భోజనములు, పవళింపు సేవలు, ఊరేగింపులు, గృహములు, గోపురములు, చందనతాంబూలాదులు మొదలైనవి యెన్నెన్నియో సృష్టించిరి వీరిద్యారాధనలకు ఆగమసూత్రములను లెక్కలేనన్ని కల్పించిరి బౌద్ధమతమును రాజుల చేత అడగద్రొక్కించినపుడు వారిభిక్షుకుల ఆరామములను, గుహలను, మఠములను దేవాలయములుగ మార్చి అక్కడ జరుగవలసిన కర్మకలాపమునకు ప్రభువులచేత మాన్యముల నిప్పించిరి. చిత్రవిచిత్రమైన రూపములను ఈ శిలాలోహదారుప్రతిమల కొసంగిరి. వానికి ప్రాణప్రతిష్ఠ అనేకమంత్రములతో చేసిరి. ఆయా యవతారములకును, వారి భార్యలకును నానావిధరూపముల నిచ్చిరి. పంది, సింహము, ఏనుగు, పక్షి, కోతి, గుఱ్ఱము మొదలగు జంతువుల మూతులుగలవానిని, మూడు నాలుగుతలలు, ఏడెనిమిదిచేతులు గలవానిని, ఇంకను ననేకవికృతరూపములను ఈదేవాలయములలో ప్రవేశపెట్టిరి భగవంతుడు తమవలెనే కాళ్లుచేతులు మొదలగు అవయవములు కలిగియున్నట్లు కల్పించుకొనుటయేగాక, యీప్రతిమలను మానవునికంటె భిన్నరూప మున్నగాని మూఢులకు భక్తి కుదురదని తమయూహలకొలది చిత్రవిచిత్రరూపములను ఈప్రతిమల కొసంగిరి వీరి వర్ణనలకును, అతిశయోక్తులకును మేర లేదు మొదట మనుష్యులు, తరువాత గుఱ్ఱములు, దున్నపోతులు, ఆవులు, మేకలు, కోళ్లు, పందులు మొదలగు జంతువులను దేవుళ్లకు బలియిచ్చి, వారిని తృప్తిపరచుచుండిరి. ప్రశాంతముగ నుండవలసిన దేవాలయములను ఆడంబరములతో బీభత్సమొనర్చి వెర్రిమొర్రి విధానములతో నింపివేసిరి నిజమైన భగవంతునిమీది భక్తి యిప్పుడు దేవాలయములలో నశించినదనియే చెప్పవచ్చును అక్కడ భక్తులకు ప్రసాదము లిచ్చి రావించుటలేదు సరికదా, పొట్టకోసినను అక్షరజ్ఞానములేని అర్చకు లనేకమంది మేనేజిమెంటులో నీదేవాలయము లుండుటచే, అవి మసీదులవలె శూన్యగృహములై యున్నవి బాజాలు, భోగమువారు, సంతర్పణలు, రథోత్సవములు, బాణసంచాలు, నాటకములక్రింద దేవాదాయము అర్చకులు తినగా మిగిలినది యున్నయెడల వినియోగింపబడుచున్నది

మనలో ప్రాజ్ఞులు జ్ఞానులైనవారుకూడ, ఈ విగ్రహారాధనను తమ కవసరములేదని చెప్పును, లోకసంగ్రహార్థము తాముకూడ నీప్రతిమలను పూజించుటకు వెళ్లుచున్నామని చెప్పుదురు. వీరీ విగ్రహారాధనను సమర్థించుకొనుటకు మరియొకకథ నల్లెదరు అక్షరములు ముందుగా నేర్చుకొని, తరువాత పెద్ద పుస్తకములను చదువగలిగినట్లు పామరులకు వారివారి యోగ్యతలనుబట్టి తాము వారిని నడిపించవలసియుండుమని చెప్పుదురు కాని తాముకూడా ప్రతిదినము అక్షరములు వ్రాసికొనుట తమ బాలురకొరకే యని చెప్పిన నెంత హాస్యాస్పదముగ నుండునో, ఆలాగుననే విగ్రహారాధనకు కారణముల నరసి, యీ మార్గము తమ కక్కర లేకపోగా తోడిమానవులను పైమెట్టుకు తీసికొనిరావలసిన యీపెద్దలు, మూఢులతో కలసి రొంపిలోనే ఆడుకొనుచుండుట లోకసంగ్రహమా? ఇది వెర్రిపని కాదా? ప్రజలచేత నీపిచ్చి నమ్మకములను, నీ యాడంబరములను పోద్రోలించి, తక్కినజాతులలో వలె వీరును నిర్గుణోపాసననే అలవరుచుకొనునట్లు చేయకూడదా? మూఢభక్తిని త్యజింపజేసి, నిర్మలమైన దైవభక్తిని, జ్ఞానమును ఉపదేశించుట వీరిధర్మము కాదా?

సంఘాభివృద్ధికి కొన్ని నీతులు ప్రధానము-ఈనీతులకు పునాది, మతములు కావని నా యభిప్రాయము. ఆయా కాలపు దేశ పరిస్థితులను బట్టి మన నీతిసూత్రములు పరిణామమును పొందినవి వానిని స్థిరపరచుటకు ఈమతములు బయలుదేరినవి కాని, యీ మతములవలననే మూఢవిశ్వాసములు పెరిగి మనుష్యులను బానిసలుగా చేసినవి పూర్వకాలమందు భయముచేత నీమతసంప్రదాయములను బట్టి నరకశిక్షలను తప్పించుకొనుటకు జనులు నడచుకొనుచుండినను నాగరికత, యింగితజ్ఞానము ప్రబలినకొలది రాజకీయశిక్షలకును, సాంఘికాపవాదములకును భయపడినట్లు, మతకారుల బెదరింపులకు జడియువారు లేరు నీతినియమములు సంఘాభివృద్ధికి అత్యవసరమని గ్రహించినవానికి దైవప్రార్థనయే అనగత్యము చిన్నతనమునుండియు నేర్చుకొన్న అలవాటులనుబట్టి, అనేక-మంది తమకష్టసమయములలో మాత్రము పరాత్పరునిమీద భారమునంతయు మోపి, తమ యోదార్పునకును, మనోదార్ఢ్యమునకును, దేవుని ప్రార్థించుచుందురు మహాత్మగాంధి గారి దైవప్రార్థనలకుకూడ నింతే విలువనిత్తును గుండ్రబల్లకాన్ఫరెన్సు జయప్రదము కావలెననియు, హిందూముస్లీములకు ఐకమత్యముండవలెననియు, మహాత్ముడు నూరుసంవత్సరములు జీవించవలెననియు, మనకు సంపూర్ణస్వరాజ్యము రావలెననియు భగవంతుని పెద్దలందరు ప్రార్థించుట వీరిమనస్సుయొక్క బానిసతనమునే వెల్లడించుచుండును. ప్రకృతి తనమామూలుధోరణిని మానవుల యిష్టానిష్టములతో సంబంధము లేకుండ మానవులు మొదలగు జీవరాసులమీద సెట్టిజాలియు, ద్వేషము లేకుండ తనదారిని తానుపోవుచుండగా, వర్షము కురిపించుమనియు, మనుష్యుని బ్రతికించుమనియు, తిండిపెట్టుమనియు, రోగము కుదుర్చుమనియు దేవునిప్రార్థించినయెడల ఆయన తనసృష్టి వ్యాపారములో మధ్యమధ్య మనకొరకు తాను వ్రేలుపెట్టుచు, ప్రకృతి పరిణామమునకు అడ్డుతగులుచుండునా? మంత్రములకు చింతకాయలు రాలునా? యజ్ఞములచేత వర్షములు కురియునా? ఏటిమాట! మతగ్రంథములలో ఇట్టివిచిత్రము లుదాహరింపబడినవని చెప్పువారికి ఒకటే జవాబు ఈగ్రంథములు మూఢవిశ్వాసములను వృద్ధిపొందించుటకే యేర్పడినవి

ప్రార్థనల యుపయోగము నటుంచుడు. ఈ రూపోపాసన అగత్యము కావని తెలుపుటకు ఒక్కనిదర్శనము చాలును. బౌద్ధుల, క్రైస్తవుల, ముస్లీముల పసిబాలురు సహితము ముక్కు, చెవులు, కాళ్లు గలిగినప్రతిమలను పూజింపక యెట్లు భగవద్భక్తిని కలిగించుకొనుచున్నారు? ప్రకృతి యంతయు చూచి దేవుని కల్యాణగుణములను కీర్తించకూడదా? వారందరును భగవద్భక్తి గలిగి సత్పథమును త్రొక్కుచుండుట లేదా? భగవంతుడు లేడని వాదించు బౌద్ధులు, చార్వాకులు మొదలగు నిరీశ్వర వాదులు మనవారికంటె నీతిబాహ్యులా? మనచిన్నతనమునుండి పుక్కిటిపురాణకథలన్నియు వేదవాక్యములనియు బ్రహ్మ, విష్ణు, శివాదులుగను మరి యింక ననేకావతారములుగను. పరబ్రహ్మమెత్తెననియు, వీనిలో ఎవరియిష్టముచొప్పున నేదేవతను ప్రార్థించినను దేవదేవునికే చెందుననియు, బోధించుటకు మొదలు పెట్టగానే స్వీయాలోచనశక్తి మనస్స్వాతంత్ర్యము హేతువాదన మొదలగునవి నశించి మనము మూఢవిశ్వాసములకు లోనై పూర్వగ్రంథములలో వ్రాసిన ప్రతివిషయము నమ్మితీరవలెననియు, నమ్మనియెడల ముప్పువాటిల్లి నరకమున బడుదుమనియు అధమాధమజన్మముల నెత్తుచుందుమనియు భయపడి బానిసలముగ, మతకర్తలుగ చేయబడితిమి. మనము పెద్దవారమై విద్యావంతులమైనను చిన్నతనములో ఉగ్గుపాలతో, అమ్మఒడిలోనుండియే నేర్చుకొనిన యీపచ్చిపుక్కిటిపురాణములలో అతిశయోక్తులేవో, నిజమైనచరిత్రాంశము లేవో గ్రహించజాలక స్వచ్ఛందసులగు మూఢవిశ్వాసపరు లగుటయో, లేక వీనియన్నిటియందును అపనమ్మకము కలిగి వీనిని బొత్తిగా త్యజించుటయో సంభవించుచున్నది మన నిజమైన ఆర్యమతమేమో యిప్పటికి మనకు తెలియదు గ్రుడ్డెద్దు చేనబడ్డట్లు విమర్శనజ్ఞానమును చంపుకొని, మూఢమతవిశ్వాసము లన్నిటికిని దాసులమై పోతిమి

చిన్నపిల్లలకైనను సత్యము మరుగుపరచి పిట్టకథలను, దయ్యపుకథలను బోధచేయుట వారిభవిష్యజ్జీవనమునకు మిక్కిలి భంగకరము. రామకృష్ణాద్యవతారములు ఆయాకాలములయందు గొప్పప్రతిభావంతులైన మనుష్యులనియు, వారిలో కొన్నిలోపము లున్నను, మొత్తముమీద ఆదర్శప్రాయమగు నడతను కలవారని గ్రహించి, వారికథలను చదువుకొనవచ్చునుగాని, వారే పరబ్రహ్మమని యెంచకూడదని బోధించవలెను ఈపిచ్చిపిచ్చి మానవవిగ్రహపూజను త్యజింప జేయవలెను ఈనాయభిప్రాయములకు పూర్వాచారపరాయణులేగాక కొందరు నవనాగరికులమని విర్రవీగు విద్యాధికులుకూడ నన్ను దూషింతురని నెరుగుదును కాని వీరి కోపప్రసాదములకును, దూషణభూషణలకును నేను వెరువక, నామనస్వాతంత్ర్యమును విడువక నాకు సత్యమని తోచినదానిని నిర్భయముగ వెల్లడించుచున్నాను ఈయవతారములకు చావుపుట్టుక లున్నవిగనుక వీరు పరబ్రహ్మము కానేరరు

"కల్పేకల్పే క్షయోత్పత్త్యా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః,
శ్రుతిస్మృతిసమాచార నిర్ణేతారశ్చ సర్వదా"—పరాశరస్మృతి

భావము:—త్రిమూర్తులు ప్రతికల్పాంతమున నశించి మరల పుట్టుచుందురు.

ఈ యవతారపురుషు లందరు మనవలెనే పాపములు చేసిన మనుష్యమాత్రులేకాని వేరుకారు

"ఇంద్రో నారాయణో బ్రహ్మ వృస్వభూయ అతిశుయమ్,
తేపి దోషా దుపహతాః పదభ్రష్టా విచేతనాః,

కాలేన మహతా చైతే పాపాత్ స్థానం ప్రపేదిరే. ”

—స్కాందపురాణము.

భావము ·—ఇంద్రుడు, నారాయణుడు, బ్రహ్మ—వీరుకూడ పాపము చేసి తమ ఉన్నతపదవులు గోలుపోయి దీర్ఘకాలము పాపఫల మనుభవించి చిట్టచివరకు స్వస్థానముల చేరిరి.

త్రిమూర్తులనుగాని, వారి యవతారములనుగాని ఆరాధింపుమని వేదములు విధించుట లేదు. వానిని కొల్చువారు నరకముంగో పడుదురనికూడ దేవీభాగవతములో నున్నది.—

“నవిష్ణూపాసనా నిత్యా వేదే నోక్తాం న కుత్రచిత్,
నవిష్ణుదీక్షా నిత్యాస్తి శివస్యాపి తథైవచ

గాయత్రీమంత్రనిపాతో ద్విజో మోక్ష మవాప్నుయాత్,
విహాయ తాంతు గాయత్రీం విష్ణూపాస్తిపరాయణః,
శివోపాస్తిరతో విప్రో నరకం యాతి సర్వదా

భావము —వేదములు గాయత్రి నుపాసింపుమని విధించుచున్నవి విష్ణువునుగాని, శివునిగాని ఉపాసింపుమని యెచ్చటను చెప్పుటలేదు. గాయత్రి నుపాసింపక విష్ణువునుగాని, శివునిగాని ఉపాసించువారు నరకమున బడుదురు

ఇట్లు భాగవత భారతపురాణములలోనే భేదాభిప్రాయములు కనుపడుచుండగా వీనిలో వేనిని నమ్మవచ్చును? వీనినన్నిటిని సమన్వయముచేసి, శ్రుతిస్మృతిపురాణేతిహాసములన్నియు వేదవాక్యములుగ నమ్మవలసినదే యని సమర్థించుటకు మనపూర్వాచారపరాయణులకు పెట్టినది పేరు వీరు అపార్థములు, నూతనార్థములు, విపరీతార్థములు, ఎన్నియైనను తమవాదనను బలపరుచుటకు చేయగల సమర్థులు. సంస్కృతభాషకూడ వీరికి తోడై, యెట్లు విరిచిన నట్లు లగుచుండును సరళార్థము వీరికి గిట్టదు. తమతమ సంప్రదాయానుసారముగ మాటల కర్థములను లాగెదరు

విగ్రహారాధనము ఉపయోగములేనియెడల మనమేల ఈ దేవాదాయ సంరక్షణకు పాటుపడవలెనని కొందర డుగవచ్చును. ఇప్పటి విగ్రహారాధనయు, ఆడంబరములు సోమరులకు సంతర్పణలు, మూఢార్చకుల అధ్వర్యము దేవాలయములలో అమాంగళ్యపుపనులు, మొదలగువానిని, పోగొట్టి, మనదేవాలయములు ప్రశాంతమైనవిగను, పవిత్రస్థలములుగను, పైచెత్తనంతయు త్రోసివేసి అడుగున నార్యమతములో నున్న మణులు మాణిక్యమువలె నుండు మన జ్ఞానవిజ్ఞానసంపదను పరిశోధనలవలన బయటకు తెచ్చుటకు ఈదేవాదాయము ఉపయోగపడునసెడి ఆశతోనే ప్రస్తుతోద్యమము ప్రారంభింపబడినది. దీని పర్యవసాన మెట్లుండునో యెవరు చెప్పగలరు?

---



# వర్ణాశ్రమధర్మపరిణామక్రమము

కపిస్థలము కృష్ణమాచార్యులుగారు, బి. ఏ., యల్. టి.

ఆదిని మృగములవలె మనుష్యుడును కుటుంబమను నది యెరుగక కేవలము వన్యవృత్తినై యుండెననియు, శిశుసంరక్షణాదులు మాత్రధీనములైయుండెననియు, పితయనునాతనికిని మాతకు నప్పుడప్పుడు శారీరకసంయోగముమాత్రము కలుగుచుండెననియు, నదియును ఒకద్వంద్వమునకే యని నియమము లేకుండెననియు, మానుషకుటుంబధర్మపరిణామవేత్తలు చెప్పుదురు. ప్రకృతము భూమండలమున నచ్చటచ్చట కాననగు మానుషకుటుంబస్వరూపముల బరిశీలించి యీశాస్త్రవేత్తలు సామాన్యముగ మానుషకుటుంబపరిణామక్రమముల నియమింపగలిగియున్నారు. అనేకశతసంవత్సరకాలము పరిశీలించినగాని యీక్రమము నిర్దుష్టమని చెప్ప నలవికాదు. ఆర్యులమను మనముకూడ నీయవస్థలను దాటి వచ్చియున్నారమని తెలియుట కాధారము లంతగ లేవు. మనచరిత్రములయొక్క ప్రాథమికావస్థలు దెలియుటకు ఋగ్వేదమునకంటె ప్రాచీనతరములగు నాధారములు లేవు. అయిన నచ్చటచ్చట గాననగు గొన్నివాక్యములచే దత్పూర్వావస్థలు కొంత దెలియనగును. మనకు దెలిసినంతవరకు నార్యుల కుటుంబములు పిత్రధికారాధీనములనియే చెప్పదగును. మాతకుగూడ గొన్నియధికారములు నియమితములై యుండినవి. బాహ్యాభ్యంతరభేదమున కుటుంబాధికారము మాతాపితరులకు విభజింపబడెను. ఇట్లు పరస్పరము ధర్మభేదము లేర్పడినవి. ధర్మభేదవాసనావశమున కాలక్రమమున శక్త్యాదిగుణభేదములుగూడ చూపట్టెను. ఈగుణభేదములు వంశానుక్రమమున స్త్రీపుంప్రజలయందు సంక్రమించుచువచ్చెను. ఏతాదృశసంక్రామము మన పూర్వీకులలోని నియంతలదృష్టికి దెలియుచునే వచ్చెను. అందుచే వారు మనుష్యునకు వ్యష్టిత్వమనియు, సమష్ట్యంగత్వమనియు ద్వంద్వధర్మములు గలవని యతిప్రాచీనకాలముననే కనుగొనిరి. వ్యష్టిధర్మమునకు మూలకారణము మాతృగుణములు, సమష్టిధర్మమునకు పితృగుణములనియు నూహింపనగును. ఈ ధర్మములనే పాశ్చాత్యభాషలో individual and social aspects of man అని వాడెదరు. ఈ ధర్మద్వంద్వమునకు బరస్పరము స్పర్ధలేక పరమానుకూల్యముతో బర్వక్రమమున నభివృద్ధిగలిగింప వర్ణాశ్రమధర్మములు నియమింపబడెను. అందు వర్ణధర్మము సామష్టికము, ఆశ్రమధర్మము వైయష్టికము.

ఇక నీధర్మద్వయపరిణామక్రమమును విచారించెదము. వేదము లనాదియనియు, వేదములలోనే చాతుర్వర్ణ్యము కాననగుటచే సృష్ట్యాదినుండియు చాతుర్వర్ణ్యము సిద్ధించెననియు మనలో ననేకుల యాశయము. ప్రళయము లనేకములనియు, వాని ననుసరించి సృష్టులు గూడ ననేకములనియు చెప్పుచుండుటయు వాడుక. ఈ సృష్ట్యాదిని చాతుర్వర్ణ్య ముండుటకు గారణము దత్పూర్వసృష్టిలో జీవరాసుల కర్మభేదములనియు, కర్మ మనాది యనియు, నన్నింటికి నీశ్వరేచ్ఛయే మూలకారణమనియు జెప్పుచుండుటయు మనలో గలదు. కాని యివీయన్నియు నిక్కాలపు పరిశీలనపద్ధతులకు దోడ్పడవు.

“అనాది”శబ్దమునకు “నవిద్యతే ఆది ర్యస్య” అని వ్యుత్పత్తి చెప్పుట వాడుక. “విద్యతే” అనగా నున్నది

యని భావము. అందుచే ననాదిశబ్దమునకు నాది లేనిది యని యర్థము చెప్పెదరు. 'విద-సత్తాయాం' అను ధాతువును బట్టి యీ యర్థము. 'విద్ ౡ-లాభే' అను ధాతువునుబట్టియు నీవ్యుత్పత్తి చెప్పనగును. అప్పుడు "అనాది" శబ్దమున కాదిదొరకనిది యనియర్థము. ఈయర్థమునగూడ ననాదిశబ్దము వ్యవహరింపబడుచునే యున్నది. వ్యవహారమునుబట్టి శబ్దమున కర్థము కల్పింపబడును. వేదము లనాది యనియుం ఛాతుర్వర్ణ్య మనాదియనియు చెప్పుటచే మన కిప్పుడు వానియాది తెలియకున్నదని చెప్పుట న్యాయ్యము. సుతరాం ఆదియే లేనిదని చెప్పుట కొంతవిశ్వాసానర్హము.

మహాభారతమున నొక్కచోట చాతుర్వర్ణ్యపరిణామక్రమము చెప్పబడియున్నది. పూర్వ మందరు నొక్కజాతిగనే యుండిరి, వారలకు బ్రాహ్మణు లనిపేరు, వారిలో ననేకులు తమధర్మములను నిష్కృష్టముగ నాచరింప శక్తిలేక కాలక్రమమున క్షత్రియులని భిన్నజాతులుగ నేర్పడిరి. (ఇట్లు ద్వైవర్ణ్యము కొంతకాల ముండినది.) క్షత్రియులలో ననేకులు ధర్మవిచ్యుతులై వైశ్యు లనబడిరి. (అప్పుడు త్రైవర్ణ్యము.) వైశ్యులలో ననేకులు మరల ధర్మవిచ్యుతులై శూద్రు లనబడిరి. ఇట్లు చాతుర్వర్ణ్య మేర్పడెనని యచ్చోట నున్నది. పర్వక్రమావరోహణమువలననో, యారోహణమువలననో కానిమ్ము, చాతుర్వర్ణ్యముమాత్ర మైకవర్ణ్యమునుండియే కాలక్రమమున సిద్ధించెనను తత్త్వము నీ మహాభారతములోని వాక్యములు సూచించుచున్నవని నమ్మవచ్చును.

ఇక త్రైవర్ణ్యచాతుర్వర్ణ్యభావముల గొంత విచారించెదము. తురీయవర్ణ్యులు త్రైవర్ణ్యులకంటె భిన్నమగు మానవవర్ణ్యులుగ నొకవేళ నుండవచ్చునా యని సందేహము కలుగుచున్నది. అందుకు గారణము వీరలకును వారలకును సమానముగ సమష్టివ్యష్టిధర్మములలో నొక్కటియు లేకుండుటయే. త్రైవర్ణ్యులలో బరస్పరభేదము లుండినను వారలకు యజనాధ్యయనదానములును, బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయమ్ములును సమానధర్మములు. తురీయవర్ణీయులకు త్రైవర్ణ్యశుశ్రూషమాత్రమే విధించియున్నది. మరియు వారలకు 'స్వ'మ్మనునదియు లేదు. అట్లుండిన నవి వారి స్వామ్యధీనములు కావలయుననియు విధించియున్నది. కావున వీర లొకవేళ రణజితులై యార్యులకు కింకరత్వము కొంతకాలము వహించి యధికారాంశము లెవ్వియు లేక విజేతల తెగలలో జేర్చబడియుండురు కాబోలు.

త్రైవర్ణ్యు లొక్కతెగవారు, తురీయవర్ణ్యులు మరియొకతెగవా రనుటకు నార్యశబ్దముకూడ తోడ్పడునట్లున్నది. "అర్య"శబ్దమునకు వైశ్యుడని యర్థము కలదు. "ఆర్య"శబ్దము తద్ధితాంతము, అర్యులనుండి వచ్చినవారని భావము. మహాభారతములో గనిన ట్లవరోహణక్రమమున గాక యారోహణక్రమమున నర్యులనుండి కాలక్రమమున క్షత్రియ బ్రాహ్మణాదిభేదములు గల్గి త్రైవర్ణ్య మొకవేళ సిద్ధించియుండవచ్చునని యీయార్యశబ్దము చూపున ట్లున్నది. "ఆర్య" శబ్దము పూర్వము త్రైవర్ణ్యులకే గాని, చాతుర్వర్ణ్యుల కెప్పుడు నుపయోగింపబడినట్లు తెలియదు. తురీయవర్ణ్యులు ద్రవిడశాఖవారని మనలో నిప్పు డనేకులు చెప్పుచున్నారు. పైవివరించిన విషయములుకూడ నట్లే సూచించున ట్లున్నది.

ఏతెగవారైనను, తురీయవర్ణ్యుల కార్యుల సంఘములో బ్రవేశము ఋగ్వేదకాలమునకు బూర్వమే గలిగి యుండవలెనని మన యనాదిగ్రంథములలో దెలియుచున్నది. ఆర్యులతో వివాహాద్యాచారములచే వారలకు బరస్పరము రక్తసాంకర్యము గలిగి వారు నార్యులలో నొకశాఖకు జేరినవారైరి. అందుచే త్రైవర్ణ్యావస్థానంతర మార్యులకు జాతుర్వర్ణ్యావస్థ సిద్ధించినదని మన మూహింపవచ్చును.

సమష్టిశరీరము (Society) వృద్ధియగుటకై దాని యంగభూతములగు నాల్గువర్ణములకును గొన్నిధర్మము లేర్పడినవి. బుద్ధ్యధీనసాహ్యము బ్రాహ్మణునిదనియు, దేహబలాధీనసాహ్యము క్షత్రియునిదనియు, ద్రవ్యబలా

హీనసాహ్యము వైశ్యునిదనియు, త్రైవర్ణ్యశుశ్రూషాదులు శూద్రునివనియు విభజింపబడినది. యాజనాధ్యాపనప్రతిగ్రహాదులు బ్రాహ్మణకృత్యములు, రాజతంత్రవ్యవహారాదులు క్షత్రియకృత్యములు; కృషివాణిజ్యపాశుపాల్యాదులు వైశ్యకృత్యములని త్రైవర్ణ్యుల కృత్యవిభాగము. ఈ ధర్మములు ప్రాయేణ గృహస్థాశ్రమముననే యనుష్ఠేయములు. ఇట్లు సామష్టికధర్మములు నియమింపబడి వర్ణధర్మము లనుపేర విఖ్యాతిగాంచెను.

పురుషుడు కేవలము సామష్టికధర్మములనే యనుష్ఠించుచుండినయెడల నాతని వ్యష్టిత్వమునకే లోపము గలుగవచ్చునని యెంచి యాతనికి వైయష్టికధర్మములు కూడ నియమింపబడినవి. ఇవియే యాశ్రమధర్మములు. అందు బ్రహ్మచర్యాశ్రమము కేవలము జ్ఞానశక్తిసంగ్రహణార్థము నియమింపబడి, తదనంతరము రానున్న యాశ్రమత్రితయములోను నియమింపబడిన ధర్మాచరణమునకు యోగ్యతాసిద్ధిని గలిగించుచుండినది. ఇచ్చట సామష్టిక ధర్మాచరణ మంతగ లేదు.

గృహస్థాశ్రమమున ప్రాధాన్యముగ సామష్టిక ధర్మాచరణము. ప్రథమతురీయాశ్రమములో నున్నవారలకు సాహ్యమొనర్చుటయు నీయాశ్రమధర్మము. వైయష్టికధర్మములును విస్మృతములు కాలేదు. ద్రవ్యార్జనము పాత్రవినియోగార్థము. అసంస్కృత ధర్మాద్యాచరణమునకు దోడ్పడవలయును. సంసృతిభారము వహింపనెనుకటివారు సంసిద్ధులు కాగా, నిష్కళంకముగ నధికారముల వారల యధీనము చేసి విరమింపవలయు.

వానప్రస్థాశ్రమము వైరాగ్యాచరణమునకు సోపానపరంపర. ఇచ్చట వైయష్టికధర్మమునకు ప్రాముఖ్యము. భార్యకు కాయికశుశ్రూషమాత్రమే ధర్మము. కామార్థసంయోగాదులు దూరీకృతములు. రానున్నసన్న్యాసాశ్రమమున కిది పూర్వావస్థ.

సన్న్యాసాశ్రమమున సామష్టికవైయష్టిక ధర్మములకు సామరస్యము. ఉద్బుద్ధుడై గ్రామైకరాత్రముగ దేశమున సంచరించుచు, యదృచ్ఛాగతాహారమును స్వీకరించుచు, దనజ్ఞానదృష్టి నన్యుల కుపయోగించునట్లు వినియోగపరచుచు, నాత్మారాముడై శాశ్వతికబ్రహ్మానందానుభవమును నిరీక్షించుచు పురుషు డీయాశ్రమ ధర్మములను జేయుచుండవలయును.

ఈయాశ్రమధర్మపరిపాలనము సాంఘికధర్మమని తెలుపుటకై కాబోలు ప్రతివ్యక్తికిని నూతనాశ్రమప్రవేశము ససాక్ష్యముగ నుండవలయునని గురుమూలముగనే నియమింపబడినది. ఆశ్రమస్వరూపసూచనార్థము వస్త్రాదులలోగూడ భేదము లేర్పరుపబడినవి.

ఇట్లు వర్ణధర్మములకును, ఆశ్రమధర్మములకును పరస్పరమైత్రి సిద్ధించుటకై కాబోలు ఈధర్మద్వయమునకును వర్ణాశ్రమధర్మమని నామైక్యము కలిగింపబడియున్నది.

వర్ణములలో బరస్పరము వివాహాదిసంబంధములు అభ్యవహారాదులు నుండినవని పూర్వస్మృతులబట్టి తెలియుచున్నది. వివాహవిషయమున ననులోమవిధిమాత్ర మంగీకరింపబడినది. బహుభార్యత్వము పురుషున కుండెనను, స్త్రీకిమాత్ర మేకభర్తృత్వమే యంగీకరింపబడెను. బ్రహ్మక్షత్రియ వైశ్యాదులకు నియమింపబడిన సామష్టిక వైయష్టికధర్మాచరణమునుబట్టి యక్కాలమున వారివారికిగల ధారణశక్త్యు ననుసరించి యన్యజాతీయభార్యలు నియమింపబడిరి. బహుభర్తృత్వముచే నొకస్త్రీకి వంధ్యాత్వము కలుగునంత బహుపత్నీకత్వముచే పురుషునకు వీర్యలోపము కలుగనేరదని యక్కాలమునగూడ నేతచ్ఛాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఒక యుత్తమపురుషు ననేకభార్యలలో నొక్కతెగానైన నొకస్త్రీ యుండ నోపునేగాని యొకయధమపురుషునికి భార్యగా నుండనోపదని యక్కాలముననుండు మానుషతత్త్వపరిణామ శాస్త్రజ్ఞులలో నగ్రగణ్యులైన యొక్కరి యాశయము. ఈసూక్ష్మధర్మములు దెలిసియే కాబోలు మనపూర్వీకులట్లు నియమించిరి.

సామష్టికధర్మస్వరూపములగు వర్ణవృత్తులు నుగూడ పితృపుత్రపారంపర్యక్రమమున నియమితములాయెను. అందుచే వృత్తులలో బరస్పరస్పర్ధాదులు లేక సంఘము జరుగుచుండెను.

అప్పుడప్పుడు భిన్న దేశకాలాద్యనుగుణముగ సంఘములో మార్పులు జరుగుచుండి, కాలక్రమమున వర్ణములకు పరస్పరముండిన వైవాహికాదిసంబంధములు వీడి, వర్ణములలో నవాంతరభేదము లుద్భవించినవి.

ఇట్లనేకశతాబ్దముల కాలముననుండి వచ్చుచుండు వర్ణాశ్రమధర్మములలో చాల చోట్ల మాలిన్యము చేరి యుండవచ్చును. దానిని పరిష్కరించి శుద్ధములగు ధర్మములమాత్రము నెలకొల్పుట ధీమంతుల లక్షణముకాని, యీధర్మము లన్నియు నామూలాగ్రము నిరసించుట న్యాయవిదూరము.




ఏకాంత సమాలోచన — చిత్రకారుడు పి. వి. రామారావుగారు



౪. చైనా సేనా నాయకుడు కాల్బలముల ఉపదళమును పరీక్షించుచుండుట




౫ షాంగై ఊరివాకిలివద్ద చైన సేనలకాపు



౬ జపాను సేనాధినాయకులు దండెత్తుటకుముందు సంప్రతించుకొనుట
కుడివైపున జనరల్ కసయి (ఎడమ) మూటో




౭. షాంగైవద్ద కట్టలోపాతిన తుపాకులు




౮. చైనాగేటుకు విద్యుచ్ఛక్తి తీగెలనుకట్టి జపానువీరుడొకడు కాపుండుట



బందీలయిన సైనికుల మొదటిజట్టును జపానువారు మోటారులారీలో కొనిపోవుట



౧౦. మంచూరియాలో జపానువారి ప్రయాణము రైలుబండి



# పార్థసారథి పలుకులు

పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు

అర్జునా! ఇట్టి విషమసమయమునందు, నిట్టి కసుమాల మయయొ! నీ కెట్లు పుట్టె?
దీన నపకీర్తియును స్వర్గహాని కలుగు, నార్యు లిట్టి యధైర్యమ్ము నందరు సుమ!

పార్థా! ఇట్టి యధైర్యము, వ్యర్థము నీచమును నీకు నయయో! తగునే?
సార్థకనాముఁడ వయి ప్రత్యర్థుల వధియింప లెమ్ము దండిమగఁడ వై.

శోకింపఁ దగనివారికి, శోకించెదు పలికెదవును సూరుల పలుకుల్
శోకింపరు సూ! పండితు, లీకరణి మృతులకొఱ కమృతులగుటకొచియున్.

మునుపును నే నుంటిని నీవు నుంటి వీయెల్ల బంధువులు నుండిర యీ
మన మందఱమును నిటుపయి,ని నిత్యముగ నెపుడు నుండ నేయుండెదమున్.

ఆత్మఁ డీదేహమందు బాల్యమును యౌవ,నమును ముదిమిని బొందుచందమునఁ జూవె
యొండుదేహమ్ములను పొందుచుండుఁ గాన, పండితుం డిందులకు మోహపడఁడు పార్థ!

మాత్రాస్పర్శలు కుంతీపుత్ర! అనిత్యములు శాకహోకలు గల వై
పాత్రముగాఁ జేయును తా,పత్రయమున కవును సైఁపవలయును వానిన్.

మఱచియుఁ జెడ్డయు సమముగ, నెంచెడి యేధీరచిత్తు నివి చాలహో వే
ధించుట; కవు నుండెడి సా,సంచితపుణ్యుండ మోక్షసామ్రాజ్యమునన్.

సద్వస్తువునకు లేమి య,సద్వస్తున కునికియును పొసంగదు పార్థా!
ఈద్వయమునిర్ణయము త,ద్విద్వాంసులు చూచియున్న విషయము చూవే!

ఈసర్వమునను నిండిన,యాసద్వస్తువు నశింప దని యెఱుఁగుము పా
ర్థా! స త్తవ్యయ మగుటం,జేసి తగఁ డోకఁడును ద్దానిఁ జే టొందింపన్.

ఆత్మ శాశ్వతుండు నప్రమేయుండు వి,నాశరహితుఁ డతనియీశరీర
ములు నశించున వని తెలిపిరి తద్జ్ఞులు, కాన లెమ్ము పార్థ! కల నొనర్ప.

ఎవఁడు ఘాతుకునిగ నెంచు నీయాత్మని, హాతునిగాఁగ నెవఁడు మఱిఁ దలంచు
నట్టివార లిద్ద ఱాత్మ నెఱుంగ రొఁ, జంపఁబోవఁ డాత్మ చంపఁబడఁడు.

మనుజుండు జీర్ణవస్త్రము,లను విడుచుచుఁ గ్రొత్తబట్టలను గట్టెడురీ
తిన యాత్మ జీర్ణదేహము,లను విడుచుచుఁ గ్రొత్తతనువులకుఁ బోచుండున్.

ఈయాత్మ నాయుధమ్ములు, కోయుటకును దగవు పావకుఁడు కాల్చుటకున్
వాయువు వడియించుటకును, తోయము తడుపుటకుఁ దగవు దురపిల్లకుమా!

అట్టులు గా కాత్మ సదా, పుట్టెడి దెల్లపుడుఁ జచ్చిపోయెడి దని నీ
మట్టునకుం దలఁచెదవే, నట్టు లయిన నిట్టు శోక మందుట తగునే?

భావియ పుట్టినజనులకుఁ, జావును గిట్టినజనులకు సఖ! పుట్టుకయున్
కావునఁ దప్పనిదానికి, నీ వీగతి శోక మందె దేటికిఁ జెపుమా?

పుట్టకమును పెవ్వియుఁ గను,పట్టవు జనియించి కానఁబడిపడి మరలన్
గిట్టినమఱి కనుపట్టవ, యిట్టిశరీరములగుఱిచి యేడ్చు ట దేలా?

దేహము లెన్నో యన్నిటి వధించినయేనియు విన్ము పార్థ! త
ద్దేహములందు నున్నయలదేహి వధింపఁబడండు నిక్క మీ
యాహవరంగమందలి మదాప్తులఁ జంపఁగఁజాల నంచు దుర్
మోహము నొంది యీపగిది ముచ్చిరుచుండుట నీకుఁ బాడియే?

రాజులధర్మము నయినను, యోజించి చలింప కుండు టొప్పును నీకున్
రాజులకున్ ధర్మ్యం బగు,నాజిని మించినది శ్రేయ మది యే ముంహన్?

తనయంతన ద్వారము తెఱ,చినస్వర్గము పోరు నీకుఁ జేకుఱె నీదృ
క్కని యెంతయుఁ బున్నెము చే,సినరాజన్యులక కాని చేకూరదు సూ!

ఈ ధర్మము తప్పని యా,యోధన మొనరింపవేనియును విను పార్థా!
నీధర్మము నీకీర్తియుఁ, బాధోనిధిఁ జొచ్చు నీకుఁ బాపము వచ్చున్.

అర్జునా! వినుము నీయపకీర్తి యాచంద్రతారార్క ముండు భూతముల నోట
గొప్పవాఁ డనిపించుకొని చెడ్డపేరుతో సుఖియించుకంటెఁ జచ్చుటయె బాట
కర్ణభయమ్ముచేఁ గలనఁ బాసె న టంచు రథసాత్ము లీమహారథులు చాట
గౌరవమ్ముగఁ గన్నవారె లాఘవముగా నినుఁ జూతు రనుట కీనేనె పూఁట
నీవిరోధులు తొల్లింటినీదుపనుల - నిందసేయుచు సతతమ్ము నిన్నుగుఱిచి
నోట వచియింపఁగారాని మాట లందు, - రింతకంటెను కష్ట మిం కేమి కలదు?

చచ్చిన స్వర్గము వైరుల, గ్రెవచ్చిన రాజ్యమును పొంద వచ్చును జూ! వి
వ్వచూ్ఛ! కావున లె మ్మిఁకఁ, బుచ్చుకొనుము గాండివమ్ముఁ బో రొనరింపన్.

లాభనష్టమ్ములు జయపలాయనములు - కష్టసుఖములు సమముగాఁ గాంచి పిదప
యుద్ధ మొనరించుటకు నీవు సిద్ధపడుము - అప్పు డే మైన నినుఁ బాప మంటుకొనదు.

ఆదృతకాము లై ఫలము నందుతలంపున నేవొయేవొ వే
దోదితకర్మముల్ సలుపునోగుల కౌ భవభీతి; కాన నీ
వాదెసఁ బోక ద్వంద్వముల నాఁగుచు నేమఱ కాత్మ సాత్త్విక
శ్రీ దయివాఱి యోగమున నేమమునం జొర కుండు మర్జునా!

కర్మము లాచరించుటకె కాని యొకానొకవేళ నేనిఁ దత్
కర్మఫలమ్ముఁ గోర నధికారము గూడదు నీకుఁ గావునన్
కర్మఫలాప్తికారణము కాకుము నే నిటు లంటి నంచు నీ
కర్మములన్ త్యజించుటకుఁగా మది యోజన సేయ కర్జునా!

సమతాబుద్ధిని గోర్కె వీడి భగవత్సంతుష్టికై చేయు క
ర్మముకంటెన్ ఫలకామ్యచేఁ జలుపుకర్మ మ్మెంత యేనిన్ నికృ
ష్ట మగుం గావున నాశ్రయింపు మెపుడున్ జ్ఞానమ్మునే కామ్యక
ర్మములన్ చేసెడివారు దీను లని యాత్మన్ లెస్స యోజింపుచున్.

సమతాబుద్ధియుతుఁడు క,ర్మములవలని ఫలము విడిచి ప్రాజ్ఞుఁ డగుచు జ
న్మ మనెడిబంధము తొలఁగి భ,యము సుంతయు లేనిపదము నందు బ్రదికియో.

నీటను నిండుచుండియును నిశ్చలతాస్థితిఁ బాయ కుండు ము
న్నీట న దేప్రకారముగ నీళులు వచ్చుచుఁ జొచ్చుచుండు నా
పాటిగనే సమస్త మగు వాంఛలు నెవ్వనిఁ జొచ్చు వానికే
పాటిలు శాంతి; ఔ విషయవాంఛ నశింపక శాంతి యబ్బునే?

నేనే బ్రహ్మము నన్నపద్ధతి సుమా నీ కిప్డు నేఁ జెప్పితిన్
దీనిన్ బూనినవాఁ డొకప్పుడును సుంతేన్ మోహముం జెందఁ డీ
ద్దానన్ ముప్పున నైనఁ జిత్త మనుసంధానించువో లబ్ధతద్
జ్ఞానుం డప్పుడ పొందు ముక్తివనితాసామ్రాజ్యసౌఖ్యమ్ములన్.

న న్నొకని నమ్ముకొని నీ, వన్నియు ధర్మములు విడువు మప్పుడు నేనే
ని న్నంటుకొన్న పాపము, లన్ని తొలఁచివైతు శోక మందకు పార్థా!

---




శ్రీ మిథిలానాథుఁ జేరిన పుణ్యఫలంబు వామాంక మలంకరింప
నంజనాదేవి మున్నార్జించిన తపఃఫలంబు మెల్లనఁ జరణంబు లొత్తఁ
గైకేయి గడియింపఁ గలిగిన నోముఫలంబు చేయెత్తి ఛత్రంబుఁబట్ట
సునసుమిత్రా భాగ్యకల్పకార్జితతపః ఫలములు వింజామరలను వేయ
ఫలములకు నెల్ల ఫలమయి భవ్యయోగి-హృదయభద్రాసనంబుల నొదిగి నిండు
సభను రాణించునట్టి కౌసల్యనోము-ఫలముఁ దలఁచెద నాతపఃఫలముగాఁగ

నీదాపునకుఁ జేరి నిలచి మంతనమాడఁ గలదు కోరిక, చేతఁగాదు రామ!
నీరూపు మనసులో నిలిపి ధ్యానింపఁగాఁగలదు కోరిక, చేతఁగాదు రామ!
నీమూర్తి కనులలో నిలిపి బొమ్మలు వ్రాయఁగలదు కోరిక; చేతఁగాదు రామ!
నీసూక్తి వీనుల నింపి హర్షింపఁగాఁగలదు కోరిక; చేతఁగాదు రామ!
చేతఁగానివానిఁ జేపట్టుటయును నీ-చేతఁగాని యొరుల చేతఁ గాదు
రామ! చేతలెడలి రామ! రామా!-యన,నొడలు మఱచు భాగ్యమొసఁగుమయ్య!

ఎన్ని రూపములు నీ యెడలఁ గల్పించినఁ దనివి లేదయ్యా, తత్త్వస్వరూప!
ఎన్ని భావములు నీయెడలఁ గల్పించిన నంతు లేదయ్యా, వేదాంతవేద్య!
ఎన్ని వేషములు నీ యెడలఁ గూర్చిన మేఱ గనుపట్ట దయ్యా, యశంతేజ!
ఎన్ని రాగములు నీ యెడలఁ బాడినఁ దృప్తిగలుగ దోయీ, సామగానలోల!
ఎన్ని విద్యలు నేర్చిన నెఱుఁగరావు-పారమంటని యీభక్తి భారమయ్యెఁ
బారవశ్యంపు మత్తు మందీరరామ!-రామ! రఘువంశసోమ! శ్రీరామ! రామ!

ప్రణవార్థగోచర! పరమాత్మ! నాలోనఁ బ్రణవమంత్రము పాటఁబాడునాఁడు
గురుమంత్రరాజగోచరరామ! నాలోన గురుమంత్రబోధ జాల్కొన్న నాఁడు
విశ్వమోహనకళావిఖ్యాత! నాలోన విశ్వమోహనకళ వెల్గునాఁడు
దివ్యతేజోమూర్తి! తెలివొంది నాలోని తేజమే నేనని తేలునాఁడు
తన్మయానందదివ్యసౌధాంగణమునఁ-గ్రీడసల్పెడివేళ నీవేడ నాఁడు
నీవు నే నెవ్వరము మఱి కోటి తగుల-మంతఁదనుకనె భక్తిభిక్షార్థినయ్య!

ఎ వి రామారావ్ ౧౯౩౧

## ౬. సంగీతము

# భారతీయ రాగపద్ధతి

వింజమూరి వరాహ నరసింహాచార్యులుగారు

ఇంతదనుక ఆంధ్రపత్రికఉగాదిసంచికలందు భారతీయవాగ్గేయకారుల యభిమతము ననుసరించి ద్వావింశతిశ్రుతులగూర్చియు, వీణాయందివి కలుగు స్థానములగూర్చియు, స్పందనములగూర్చియు, నివి స్ఫురింపబడు విధముగూర్చియు, వీనిపేర్లగూర్చియు, ఇవి ప్రకృతమందలి రాగములలో నెచ్చట గోచరించునదియు, నందులకు కారణములును మున్నగు పెక్కుసంగతులు తెలుపబడెను కరము వివాదహేతువగు నీశ్రుతులగూర్చి చెప్పునప్పుడు వీని సంఖ్య యిరువదిరెండుమాత్రము మనవారెంచుటకు గల కారణములు, పెక్కుశ్రుతులుగలస్థాయి కూడదనుటకు కారణములు, మరి ద్వావింశతిశ్రుతిపద్ధతిగూర్చియు జెప్పబడెను ప్రజోత్పత్తిసంవత్సరాదిసంచికయందును భరతునియొక్క ప్రమాణశ్రుతిగూర్చియు, నిట్టి 'పృథక్'ధ్వనులు రాగములందు పూర్వమునను ప్రకృతమునను వాడబడుతెఱగునియమముకూడ విస్తరింపబడెను. ఇట్టి 'పృథక్'ధ్వనులు రాగములందు పొడసూపునప్పటి వివిధవాగ్గేయులు ముఖ్యముగ భరతుడు శార్ఙ్గదేవుడు, రామామాత్యుడు, సోమనార్యుడు, వేంకటమఖి, వీరలమతములు, పద్ధతులు ఎంచియు, పారసీకులు గ్రీకులు మున్నగు ఇతరదేశస్థుల శ్రుతుల పద్ధతితో పోల్చియు జర్చింపబడెను కాని శ్రుతులు, గ్రామములు, మూర్ఛనలు మున్నగు అంశములును, వీని చేరికగల రాగలక్షణమును పెక్కువత్సరములనుండి వివాదహేతు వగుటకు కారణము భరత, మతంగ, దత్తిల, కోహల, శార్ఙ్గదేవాద్యానునికవాగ్గేయులును రామామాత్యుడు సోమనార్యుడు, వేంకటమఖి మున్నగు తరువాతిసంగీతలాక్షణికులును, మరి యిటీవలి సంగీతవేత్తలును భిన్నభిన్నపద్ధతులతో వారివారి కాలములందలి లక్ష్యసంగీతము ననుసరించి పైయంశములను చేర్చి సంగీతలక్షణము చెప్పుటే.

ఆయాకాలము ననుసరించి దేశమునందలి వారివారి భావముల కనుగుణముగ ప్రతిశాస్త్రము—లలితకళయు—ఈ దేశమందేమి, పాశ్చాత్యదేశమందేమి మార్పుచెందుచుంట విదితము. అప్పుడెల్ల ఆయా మార్పులు కళాభాసమని యెంచతగదు. భగవంతుని యాజ్ఞచొప్పున ప్రాతపద్ధతులు మార్పుచెందుట దేశకల్యాణమునకు హేతువనుట విదితము ఒకానొక పాశ్చాత్యకవిశిఖామణి టెన్నిసను ఇట్లు చెప్పెనాడు—"భగవంతుడు ఒకప్పుడు నవ్యములని యెంచబడు తన యాశయములు కొంతకాలమువెనుకటివారికి ఒకింత వెగటుగ దోప వానిని ఆయాకాలములకు దగినట్లుగ నవీనపద్ధతులతో దేశమందు నెలకొల్పుచుండు ననుట తథ్యము" మన శ్రుతులు, గ్రామములు, మూర్ఛనలు మున్నగు అంశములు ఆయాకాలమునకనుగుణముగ మార్పుచెందుటయు, నప్పుడెల్ల మన వాగ్గేయులు లక్ష్యమందలి సంగీతమునే యాధారముగా గొనుటయు విదితము. సంగీతమునకు లక్ష్యలక్షణములందు భిన్నత్వము సిద్ధించునేని లక్ష్యమే ప్రధానముగ ఎంచబడెను రామామాత్యుడు,

శ్లో॥ "యద్వా లక్ష్యప్రధానాని శాస్త్రాణ్యేతాని మన్వతే,
తస్మాల్లక్ష్యవిరుద్ధం య త్తచ్ఛాస్త్రం నేయ మన్యథా."

అని చెప్పినాడు అందుచే తాత్కాలికములయిన యంశములను గ్రహించి లక్షణముతో పోల్చిచెప్పుట ప్రకృతమందావశ్యక మగుచున్నది. ఈకార్యమును కడుసమర్థతతో నీయాంధ్రదేశమున సంగీతసభలందు ఏకారణముననో నెరవేర్చకపోయినను మద్రాసునందలి సంగీతపరిషత్తువారు గాయకసభల నేర్పాటుగావించి కొనసాగించుచున్నారు వీరిపని సంగీతలోకమునకు మార్గదర్శకము కాకపోదు.

ఇట్లు పైసంగీతపరిషత్తువారు కడచిన డిసంబరుమాసమున గొప్పగాయకమహాసభను గూర్చి బహువివాదహేతువులగు సంగీతాంశములపై సాంగముగ చర్చగావించి కొన్నితీర్మానములు చేసియుండిరి. వానినే యాంధ్రదేశమునందలి గాయకులును పాటించుట్లకు హెచ్చరింపబడుచున్నారు శ్రుతులగూర్చిన తీర్మానము లిట్లున్నవి.—

(౧) శ్రుతులు ౨౨ మాత్రము గానమున చాలును.

(౨) శ్రుతులపేర్లు వరుసగా షడ్జము, ఏకశ్రుతిఋషభము, ద్విశ్రుతిఋషభము, త్రిశ్రుతిఋషభము, చతుశ్రుతిఋషభము, శుద్ధ

గాంధారము; సాధారణగాంధారము, అంతరగాంధారము, తీవ్రగాంధారము లేక చ్యుతమధ్యమగాంధారము, శుద్ధమధ్యమము, తీవ్రమధ్యమము, ప్రతిమధ్యమము, చ్యుతపంచమ మధ్యమము లేక వరాళిమధ్యమము; పంచమము, ఏకశ్రుతిధైవతము, ద్విశ్రుతిధైవతము, త్రిశ్రుతిధైవతము, చతుశ్శ్రుతిధైవతము, శుద్ధనిషాదము, కైశికనిషాదము, కాకలీనిషాదము, తీవ్రనిషాదము లేక చ్యుతషడ్జనిషాదము

(3) పై శ్రుతులు వరుసగా గౌళ, మాయామాళవగౌళ, కాంభోజి, భైరవిరాగములు; కల్యాణి, భైరవి, తోడిరాగములు; ఖరహరప్రియ, కాంభోజి, శంకరాభరణ, కల్యాణిరాగములు; సకల శుద్ధమధ్యమరాగములు; బేగడ, పూర్వకల్యాణి, వరాళి, రామప్రియరాగములు, పంచమవర్జములేని రాగములు; సావేరి, మాయామాళవగౌళ, తోడి, కాంభోజిరాగములు; కల్యాణి, కాంభోజి, భైరవి, ఖరహరప్రియరాగములు, శంకరాభరణ, మాయామాళవగౌళ, కల్యాణి లేక కురంజిరాగములు—వీనియందు స్పష్టమగుచున్నవి

## గ్రామమూర్ఛనలు

ఇక ఈవ్యాసమున భారతీయసంగీతమున కాధారములగు రాగములు, వాని నేర్పఱచు గ్రామములు, మూర్ఛనలు, తానములు, జాతులు – వీని గూర్చియు కొంత తెలియవలసియున్నది. గ్రామములగూర్చి భరతముని మున్నగువారు ఎట్లు అభిప్రాయపడినదియు నందులకు కారణములును, షడ్జగ్రామముగూర్చి మనము నేర్వవలసిన సంగతులు, పద్ధతి — వీనిగూర్చి ఎట్లు మనవారు, మరి పాశ్చాత్యశాస్త్రవేత్తలు సర్ విల్లియం జోన్సు, పాటర్సన్, బ్లెసరినా, హెల్ముహోల్ట్సు, రాజా సర్ సౌరేంద్రమోహన్ టాగూరు మున్నగువారు తప్పుగ భావించినదియు, వారివారి యీతప్పు అభిప్రాయములు, షడ్జగ్రామమునుండి మధ్యమగ్రామము నెట్లు మన భరతాదివాగ్గేయులు ఎంచిచెప్పినదియు, నందులకు కారణములును, గాంధారగ్రామ మెట్లు ఈప్రపంచము వీడి యూర్ధ్వలోకమునకు వెడలెనో ఎంచి చెప్పునప్పటి మనవారి మతము, శార్‌ఙ్గదేవుడు, రామామాత్యుడు ఇత్యాగులు తమ షడ్జగ్రామముచే నేర్పడిన శుద్ధస్వరావళిగూర్చియు మున్నగు గ్రామములగూర్చిన పెక్కు అంశములు కొంతవిపులిముగ నేను రచించిన "శ్రుతులు-స్వరావళి" అనుగ్రంథమున చూడనగును ఆసంగతు లిట తిరిగి వివరించుట యనావశ్యక మగును. కాని ప్రకృతమందలి రాగాంగభాషాంగోపాంగ రాగముల కాధారము షడ్జగ్రామమనియు, భరతుఁడు, శార్ఙ్గదేవుఁడు ఇత్యాదుల మతము ననుసరించి మధ్యమగ్రామమును షడ్జగ్రామమునుండి వేరుసేయు ౧౨ శ్రుతులు పైగల మధ్యమము ప్రకృతమున వరాళిమధ్యమముగ వ్యవహరించుకొనుచున్నామనియు, షడ్జగ్రామాస్పదములగు రాగములు వెంకటమఖి యభిమతము ననుసరించి శుద్ధమధ్యమయుతములు ౩౬ను, మధ్యమగ్రామమూలకమగు ౧౨ శ్రుతులుగల మనపై వరాళిమధ్యమముననుసరించునవి ౩౬ ను, మొత్తము ౭౨ రాగాంగము లిప్పుడు గ్రహింపబడుచున్నవనియు గ్రహింతుము. సకలరాగము లిప్పుడు షడ్జగ్రామాశ్రితములుగ వెంకటమఖి మున్నగువారు ఎంచియుండిరి.

> "షడ్జగ్రామాశ్రితా న్రాగాన్ సర్వేఽగాయంతి గాయకాః,
> తస్మా న్మధ్యమః షడ్జగ్రామోఽసౌ నైవ మధ్యమః."
>
> — సంగీతసారామృతము

## మూర్ఛనలు

ఇట్లు సోమనార్యుడు, వెంకటమఖి మొదలగు వాగ్గేయకారుల మతము ననుసరించి మధ్యకాలమున అనగా కల్లినాథునికాలము క్రీ. వె. ౧౪౫౦ మొదలు తులజేంద్రుల కాలము క్రీ. వె ౧౬౫౦ వరకు రాగాంగరాగములు షడ్జగ్రామమునుండియే నిర్మింపబడినవని తెలిసికొందుము ప్రకృతివికృతిస్వరముల చేరికలవలన పైగ్రామము ననుసరించియే వారివారి యభిమతములగు రాగాంగరాగములు, వాని జన్యములు పేర్కొనబడినవి శార్‌ఙ్గదేవుని కాలమువరకు (క్రీ. వె. ౧౨౪౭) పూర్వపుగ్రామరాగపద్ధతి యమలునం దుండె ననుటకు నిదర్శనములు కలవు. భరతుని మతము ననుసరించిన షడ్జమధ్యమ గ్రామములందలి సప్తస్వర సమూహముయొక్క ప్రతిస్వరముతోను ప్రారంభించునట్టి సప్తస్వరయుతమూర్ఛనలు ప్రకృతమందలి మన రాగాంగరాగములను బోలుచున్నవని యెంచబడుచున్నది ప్రాచీనకాలమున పైవిధమున ప్రతిగ్రామమునందలి ఒక్కొక్క స్వరముతోను ప్రారంభింపబడు మూర్ఛనలు సప్తస్వరములకు ఏడేసి కలుగుచున్నవని భరత, మతంగ, దత్తిల, కోహల, నాన్యదేవ, భట్టనాయక, మాతృగుప్త, శార్‌ఙ్గదేవాదులు వచించుచుండిరి. ఈ మూర్ఛనల కాస్పదమగు సప్తస్వరములయొక్క మార్పునకే పాశ్చాత్యసంగీతశాస్త్రవేత్తలు 'రాగ-మెట్టు మార్పు' (Change of key) అని వాకొనియెదరు. అందుచే భరతుని కాలమున నుండిన మూర్ఛనలు మూలముగాగల రాగాంగములు కలుగు పద్ధతి ఇప్పటి పాశ్చాత్యులు క్రమముగ గ్రహించుచున్నా రనవచ్చును. ఈసంగతి కొంతస్ఫుటముసేయుకొరకు ప్రస్తుతము అన్యాయముగ మనసంగీతమున జొచ్చి అనర్థము కలుగజేయుచున్న హార్మోనియము నందు పైవిధ మెట్లో చెప్పబడును. శంకరాభరణ మేళమును పలుకు హార్మోనియము మెట్లయందు మొదటిమెట్టు వదలి రెండవమెట్టుతో ప్రారంభించి పైవిధమగు తెల్ల మెట్లనే పలికించిన నిప్పటి రాగము మొదటిదానికి భిన్నమగుట విదితము ఇట్లు మూఁడవ మెట్టుతో ప్రారంభించి పైవిధముననే తెల్లమెట్లు పలికించిన మరియొకరాగము కలుగును. ఇట్లు ఏడు మెట్లకును ఏడువిధముల రాగములు కలుగుచుండును. ఇట్లే భరతుడు ఇప్పటివలె సారికలులేని తన వీణెయందలి తంత్రులను షడ్జగ్రామము పలుకునట్లు చేసి, అనగా తన షడ్జగ్రామిక వీణయందలి తంత్రులను ఒకటి విడిచి క్రిందికి యితడు చెప్పినవిధము నుసరించి మొదలిడి సప్తస్వరములు పలికించిన నది రెండవమూర్ఛనయు మూడు, నాలుగు మరి ఏడుమూర్ఛనలు — ఇట్లు కలుగున

రూపించియుండెను. ఇట్లు మధ్యమగ్రామిక వీణయందును. ఏడుమూర్ఛనలు కలిగింపవచ్చునని యీతడు చెప్పెను. ఇందుచే రెండుగ్రామము లందు పదునాలుగు మూర్ఛనలను భరతుడు ఎంచిచెప్పెను. అనంతరము శార్ఙ్గదేవుడు గాంధారగ్రామమునకును ఏడుమూర్ఛనలు కలవని వర్ణించెనుకాని యీగ్రామము స్వర్గలోకముననే యుంటచే నీమూర్ఛనలును లక్ష్యమున లేవని చెప్పెను ఇతడు మొత్తము ౨౧ మూర్ఛనలను చెప్పినాడు. భరతుడు గాంధారగ్రామమును పేర్కొననందున ఇతనికి ౧౪ మూర్ఛనలు కలుగుతరి శార్ఙ్గదేవుడుమూడు గ్రామములను పేర్కొనియుంటచే నితడు ౨౧ మూర్ఛనలను చెప్పుట భావ్యమే. శార్ఙ్గదేవుడు గాంధారగ్రామముగూర్చి ఇట్లు చెప్పినాడు:—

"గాంధారగ్రామ మాచష్టే తదా తం నారదో మునిః,
ప్రవర్తతే స్వర్గలోకే గ్రామోఽసౌ న మహీతలే".

భరతుడు షడ్జమధ్యమగ్రామములందలి పదునాలుగుమూర్ఛనలను ఇట్లు చెప్పినాడు —

"ఆదావుత్తరమంద్రాస్యా ద్రజనీ చోత్తరాయతా,
చతుర్థా శుద్ధషడ్జాచ పంచమీ మత్సరీకృతా
అశ్వక్రాన్తా తథా షష్ఠీ సప్తమీ చాభిరుద్గతా,
షడ్జగ్రామాశ్రితా హ్యేతా విజ్ఞేయాః సప్తమూర్ఛనాః

అథ మధ్యమగ్రామే—
సౌవీరీ హారిణాశ్వాథా స్యాత్కలోపనతా తథా,
శుద్ధమధ్యా తథాచైవ మార్గీ స్యాత్పౌరవీ తథా.
హృష్యకాచేతి విజ్ఞేయా సప్తమీ ద్విజసత్తమాః,
మధ్యమగ్రామజా హ్యేతా విజ్ఞేయాః సప్త మూర్ఛనాః"

శార్ఙ్గదేవుడును ఈ మూర్ఛనలగూర్చి ఇట్లు చెప్పినాడు —

"క్రమాత్స్వరాణాం సప్తానా మారోహ శ్చావరోహణమ్,
మూర్ఛనే త్యుచ్యతే గ్రామద్వయే తాః సప్తసప్తచ
షడ్జేతూత్తరమన్ద్రాదౌ రజనీ చోత్తరాయతా,
శుద్ధషడ్జా మత్సరీకృ దశ్వక్రాన్తాభిరుద్గతా
మధ్యమేస్యాత్తు సౌవీరీ హారిణాశ్వాతతఃపరమ్,
స్యాత్కలోపనతా శుద్ధమధ్యా మార్గీచ పౌరవీ.
హృష్యకేత్యథ తాసాంతు లక్షణం ప్రతిపాద్యతే,
మధ్యస్థానస్థషడ్జేన మూర్ఛనా రభ్యతేఽగ్రిమా."

అనంతరము శార్ఙ్గదేవుడు చెప్పిన విధముగ ఇతని మూర్ఛనలు శ్రుతుల సంఖ్యతో నిట్లు పోల్చవచ్చును :—

షడ్జమధ్యమగ్రామమూర్ఛనలు
పథకము ౧

| మూర్ఛనల పేర్లు | స్వరస్థానములపై గల వరుసశ్రుతుల సంఖ్య | షరా |
|---|---|---|
| ఉత్తరమంద్ర | ౦ - - - ౪ - - ౭ - ౯ - - - ౧౩ - - - ౧౭ - - ౨౦ - ౨౨ | షడ్జగ్రామమూర్ఛనలు |
| రజని | ౦ - ౨ - - - ౬ - - ౯ - ౧౧ - - - ౧౫ - - - ౧౯ - - ౨౨ | |
| ఉత్తరాయత | ౦ - - ౩ - ౫ - - - - ౯ - - ౧౨ - ౧౪ - - - ౧౮ - - - ౨౨ | |
| శుద్ధషడ్జ | ౦ - - - ౪ - - ౭ - ౯ - - - ౧౩ - - ౧౬ - ౧౮ - - - ౨౨ | |
| మత్సరీకృత | ౦ - - - ౪ - - - ౮ - - ౧౧ - ౧౩ - - - ౧౭ - - ౨౦ - ౨౨ | |
| అశ్వక్రాంత | ౦ - ౨ - - - ౬ - - - ౧౦ - - ౧౩ - ౧౫ - - - ౧౯ - - ౨౨ | |
| అభిరుద్గత | ౦ - - ౩ - ౫ - - - ౯ - - - ౧౩ - - ౧౬ - ౧౮ - - - ౨౨ | |
| | స రి గ మ ప ద ని (స) | |
| సౌవీరి | ౦ - - - ౪ - - ౭ - - - ౧౧ - ౧౩ - - - ౧౭ - - ౨౦ - ౨౨ | మధ్యమగ్రామమూర్ఛనలు |
| హరిణాశ్వ | ౦ - ౨ - - - ౬ - - - ౯ - - - ౧౩ - ౧౫ - - - ౧౯ - - ౨౨ | |
| కళోపనత | ౦ - - ౩ - ౫ - - - ౯ - - ౧౨ - - - ౧౬ - ౧౮ - - - ౨౨ | |
| శుద్ధమధ్యమ | ౦ - - - ౪ - - ౭ - ౯ - - - ౧౩ - - ౧౬ - - - ౨౦ - ౨౨ | |
| మార్గీ | ౦ - ౨ - - - ౬ - - ౯ - ౧౧ - - - ౧౫ - - ౧౮ - - - ౨౨ | |
| పౌరవీ | ౦ - - - ౪ - ౬ - - - ౧౦ - - ౧౩ - ౧౫ - - - ౧౯ - - ౨౨ | |
| హృష్యక | ౦ - - ౩ - - - ౭ - ౯ - - - ౧౩ - - ౧౬ - ౧౮ - - - ౨౨ | |

## తానములు

భరతుని మతము ననుసరించి మూర్ఛనలు నాలుగు విధములుగ నున్నవి. ౧. సంపూర్ణములు అనగా సప్తస్వరయుతములు ౨. షాడవౌడవములు ౩. వక్రములు ౪. సాధారణస్వరమును స్వీకరించునవి అనగా వికృతిస్వరయుతములు. సాధారణ స్వరయుతములు తిరిగి కాకలిసాధారణ అంతరసాధారణ అని రెండువిధములు. కాని శార్‌ఙ్గదేవునిమతము ననుసరించి నాలుగువిధములగు మూర్ఛనలు ఇట్లున్నవి.— ౧ శుద్ధస్వరయుతిములు ౨ కాకలి ని స్వీకరించునవి ౩ అంతర గ పొందునవి ౪ కాకలిని అంతర గ రెండును పొందునవి. ఇట్లు నాల్గు విధములచే నీ ౧౪ మూర్ఛనలు మొత్తము ౫౬ అగుచున్నవి. ఈ వివరము రత్నాకరగ్రంథమున ౧౭-౨౭ శ్లోకములలో తెలియనగును. ఈ భేదములను తానములని పూర్వపు వాగ్గేయకారులు వచించిరి. వీని సంఖ్య మేరువు మున్నగు ప్రస్తారక్రమమున ప్రతివారును చెప్పుచుండిరి. శార్‌ఙ్గదేవుడును ఈతానములగూర్చి విపులముగ చెప్పినాడు.* వీనినెల్ల యీ వ్యాసమున జెప్పబూనుట గ్రంథవిస్తరమునకు కారణ మగును. కాని ప్రస్తారక్రమ మనుసరించి తానము లసంఖ్యాకములను గ్రహించుటకు ప్రతిభారతీయసంగీతశాస్త్రజ్ఞుడు కుతూహలము మాపుచుండె ననునది మరువకూడదు. శుద్ధమూర్ఛనలు షాడవౌడవములుగ జేయునప్పుడవి శుద్ధతానము లనబడుననియు, కూటతానములును కలవనియు జెప్పిచెప్పి శార్‌ఙ్గదేవుడు స్వరప్రస్తారముచే తానములను గ్రహించు విధము, వాని సంఖ్య మున్నగు సంగతులు విపులముగ వర్ణించినాడు. ఇతని మతము ననుసరించి ౫౦౨౫౪౦ తానములు కలుగుచున్నవి. భరతుడును తానముల గూర్చియు, వీని ప్రస్తారక్రమమును గూర్చియు జెప్పియేయున్నాడు. దామోదరుడు, రఘునాథుడు మున్నగు ఇటీవలి శాస్త్రజ్ఞులును వీనిగూర్చి ముఖ్యముగా విపులపరచియుండిరి. వీనినెల్ల వివరించుట ఇట అనావశ్యకము.

## "సాధారణ"

భరతుడు షడ్జగ్రామ మధ్యమగ్రామస్వరములు కాక మరికొన్ని వికృతస్వరములు స్వరసాధారణ యను పేర తనరాగములం దుపయోగించియుండెను. ఈసంగతులుకూడ "శ్రుతులు - స్వరావళి" గ్రంథమున చెప్పియున్నాము. భరతుని మతము ననుసరించి ఇయ్యవి "స్వరసాధారణ", "జాతిసాధారణ" అని రెండువిధములు. "స్వరసాధారణ" తిరిగి కాకలి యంతర యని ద్వివిధము. కాకలి సాధారణ ని, స, ల మధ్యను, అంతరసాధారణ గ, మ, ల మధ్యను కలుగుననియు, వీనిని వాడుటకు నియమములు కలవనియు వచించి వానినెల్ల భరతుడు వివరించియుండెను.— §

"స్వరసాధారణం జాతిసాధారణంచేతి, స్వరసాధారణం కాల్యన్తరస్వరౌ—తత్ర..."

వీనిని అనంతరముండిన వాగ్గేయులు విరివిగ రాగములందు వాడినుటకు నిదర్శనములు కలవు. శార్‌ఙ్గదేవుడు వీనిని మరియొకవిధముగ జేర్చెను కాని వీనిమూలమున గ్రహించిన వికృతస్వరములనే ముఖ్యముగా రాగములందు చెప్పియుంట కందుము. శార్‌ఙ్గదేవుడు చెప్పిన నాలుగువిధములగు స్వరసాధారణ లిట్లున్నవి.—౧. కాకలిసాధారణ, ౨ అంతరసాధారణ, ౩. షడ్జసాధారణ, ౪. మధ్యమసాధారణ. రాగములం దియ్యవి కలుగువిధముకూడ ఇతడు చెప్పియుండెను.§ షడ్జమధ్యమసాధారణలు కైశికియని వచింపబడుననియు, వీనినే గ్రామసాధారణ లందురనియు జెప్పియుండెను. ఇక గ్రామముయొక్క రెండు జాతులందును ఒక్క అంశస్వరము కలదియే జాతిసాధారణ యందురనియు నీమొదలగు సంగతులు రత్నాకరగ్రంథమున జూడనగును.

## గ్రహస్వరము

ఇట్లు భారతీయసంగీతమునందలి మూర్ఛనలగూర్చియు, తానములగూర్చియు, సాధారణగూర్చియు, జాతులగూర్చియు భరతశార్‌ఙ్గదేవుల మతము కొంత గమనించియుంటిమి. ఈ కాలమునందలి దత్తిల, కోహల, మతంగ, మాతృగుప్త, భట్టనాయక, అభినవగుప్త మున్నగు శాస్త్రవేత్తలును ఈయంశములగూర్చి చెప్పియుండిరి. కాని వీనియందు కొన్ని కొన్ని భిన్నమతములును, పద్ధతులును వీరివీరి దేశకాలపరిస్థితుల ననుసరించియుంటగందుము. ఇట్లయ్యు ఈక్రిందిసంగతులపై వీరు ఏకాభిప్రాయులైయుంట మనము గమనింపవలసియున్నది. మూర్ఛనలును అందుచే రాగములు ప్రారంభించు స్వరభేదములవలన కలుగుచున్నవనియు, నివి పేరునకు గొప్పగ గన్పట్టినను పైవారి కాలమున అనగా గ్రామరాగకాలమున మూర్ఛనలచే నేర్పడునట్టి జాతులే రాగములను స్పష్టము సేయుటకు అవసరమగుచున్నవనియు, కావుననే భరతాదులు జాతుల గూర్చియే విశేషముగ జెప్పిరనియు, తానములు వారివారి మతముల ననుసరించి స్వరప్రస్తారక్రమమున తేలిన స్వరసమూహములనియు, వీనిచేతను రాగభేదము కలుగగలదనియు, సాధారణమను పేర మరికొన్ని స్వరములు-ఇప్పటి మన వికృతస్వరములను బోలునట్టివి—రాగములం దుపయోగింపబడుచుండెననియు, నిట్లు సేయుటకును కొన్ని నియమములు కలవనియు మున్నగు సంగతులు తెలిసికొనియుంటిమి. ఈ కాలమున రాగము షాడవలయుననిన అది ప్రారంభించు స్వరము, అందుచే మూర్ఛన తెలియవలసియుండెను రాగము ప్రారంభించు స్వరమే గ్రహస్వరమని వచింపబడెను కాని ఇప్పటికాలమున రాగము తెలిసిన మేళకర్త తెలియునుకావున మూర్ఛన తెలియ నవసరము లేకున్నది. అట్లయ్యు సోమనార్యుడు వెంకటమఖి మున్నగు ఇటీవలి వాగ్గేయ

* చూడు ౩౩-౩౫ శ్లోకములు.

§ చూడు. "సంగీతరత్నాకరము" శ్లో ౨౨-౪౧ ఇ ౯౫.




౧౧. చాంగ్‌ట్సువద్ద చైనాబార్కసులు కాలి పోవుటను జపానుసేనలు కనిపెట్టి యుండుట




౧౨. కాలిపోయిన చైనా బర్కాసులు

లును గ్రహస్వరమును పేర్కొనుటకు కారణ మూహ్యము. కాని వీరెల్లరు ప్రతిరాగము ఒక్క గ్రహస్వరము అనగా షడ్జమునే యాధారముజేసికొనినట్లు జెప్పియుంటచే బూర్వపు గ్రామరాగకాలమున రాగమున కాస్పదమగు గ్రహస్వరము ఇప్పటివలెకాక మారుచుండె నన వలయును. ఏలయన ఆయారాగము ఆయా ప్రారంభస్వరము ననుసరించిన మూర్ఛనవలన నేర్పడుచుండెను.

## జాతులు - గ్రామరాగములు

పైవిధమున రాగముల నెరుగుటకు మూర్ఛనలు చాలియుండినను అందుచే రాగములు స్పష్టము కాగలవని యెంచతగదు మూర్ఛన రాగములందలి స్వరములు, మరి శ్రుతులు — వీని యన్యోన్యత లేక సంబంధమును తెలియజేయగలుగుచున్నదికాని రాగమును పోషింపలేకుంట గమనింపవలసియున్నది. అందుచే రాగమును మరింత స్పష్టముసేయుటకును, పోషించి పుష్టిని కలుగజేయుటకును మరికొన్ని స్వరనియమములు ఆవశ్యకము లగుచున్నవని భరతాదివాగ్గేయకారులు గ్రహించి వానిని చెప్పియుండిరి. కావుననే వీరెల్లరు రాగమును మరింత గుర్తింపనగు అంశస్వరము, న్యాసస్వరము, అల్పస్వరము, బహుళస్వరము మున్నగు వానినికూడ పేర్కొని వానిగూర్చి చెప్పియుండిరి వీని వివరము ముందు చేయబడును.

మూర్ఛనలు, తానము లిట్లు రాగమును విపులపరచుటకు చాలియుండకపోవుటచే రాగకళను పోషించునట్టి మరికొన్ని యిట్టిస్వరములు చేర్చవలసియుండినందున మన వాగ్గేయకారులు అట్లు తక్కినముఖ్య స్వరములను చేర్చి యట్టివానిని జాతులుగ భావించుచుండిరి. గ్రామముల గూర్చి మనవారు చెప్పునప్పుడెల్ల మూర్ఛనలు, తానములు వీనిగూర్చివచించుచుండినను అవి రాగకళను పోషింపజాలియుండకపోవుటచేకాబోలు, జాతులనే ప్రధానముగచేసి వీనిని వర్ణించి చెప్పుచుండిరి మూర్ఛనలందు, తానములందు అంశస్వరము మొదలగునవి చేర్చబడుటచే నవి జాతులగుచున్నవని వీరి మతము. కావున మూర్ఛనలు, జాతులు తుదకు ఒక్కటే యగుచున్న వనవలసియున్నది. జాతులు ఇంకను రంజకత్వము దాల్చుటకు వీనియందలి స్వరావళి, యన్యోన్యత, వాది సంవాదిపద్ధతి ననుసరించియుండవలెనని చెప్పి వీనిగూర్చియు విపులపరచి మనవారెల్లరు కృతకృత్యులగుట గమనీయము. వివిధస్వరముల యారంభముగల మూర్ఛనలు అంశస్వరము మున్నగువానితో జేర్చి చెప్పబడునప్పటి జాతులు వివిధగ్రహస్వరయుతము లనునది మరువకూడదు. ఈ జాతులు అనంతరము రామామాత్యుని కాలమునాటికి మేళకర్తలుగ మారి యవన్నియు ఒక్కగ్రహస్వరము షడ్జముతోనే యారంభించునవిగ నాయె ననునదే మన మిచ్చట నేర్వవలసినది. సాధారణస్వరములు పూర్వపువాగ్గేయకారులు భరతాదులు రాగములందు చేర్చుచుండినట్లు రామామాత్యుడు మొదలగువారు గమకములను చేర్చుచుంట విదితము. ఈసంగతులను ముందు చర్చింతుము

## శుద్ధ జాతులు

ఇట్లు గ్రామరాగకాలము అనగా క్రీ. వె. ౧౨౪౭ వరకు భారతీయవాగ్గేయకారులు ఏడుజాతులుమాత్రము షడ్జమధ్యమ గ్రామముల నుండి ఎంచి చెప్పుచుండిరి. వీరికి షడ్జగ్రామమున నాలుగుజాతులును, మధ్యమగ్రామమున మూడుజాతులును మొత్తము ఏడుజాతు లగుచున్నవి. ఉభయగ్రామములందును మరి పదునాల్గు మూర్ఛనలయందును గల ద్వావింశతిశ్రుతులు ఈ జాతులందును కల వనునది మరువకూడదు. అనగా షడ్జమధ్యమ గ్రామమందలి స్వరావళియందుగల మూడువిధములగు శ్రుత్యంతరములు-చతుఃశ్రుతికము, త్రిశ్రుతికము, ద్విశ్రుతికములు-జాతులందును ఇమిడియుండవలయు ననునది గ్రాహ్యమే. భరతుడు రెండుగ్రామములందును గ్రహించిచెప్పిన ఏడు శుద్ధజాతులు ఇట్లున్నవి:—

షడ్జగ్రామము ననుసరించునవి

౧. అర్షభి ౨. దయావతి ౩. నిషాదిని ౪. షడ్జి:—వీని మూర్ఛనలు వరుసగా అభిరుద్గత, ఉత్తరాయత, రజని, ఉత్తరమంద్ర.

మధ్యమగ్రామము ననుసరించునవి

౧. గాంధార ౨. మధ్యమ ౩. పంచమ:—వీని మూర్ఛనలు వరుసగా హరిణాశ్వ, సౌవీరి, హృష్యక—

ఇట్లు వీని పేర్ల ననుసరించి మనను ఆయాజాతిపేరు వానిగ్రహస్వరము ననుసరించియున్నదని గ్రహింతుము. శార్ఙ్గదేవుడును జాతుల గూర్చి విపులముగ వర్ణించిచెప్పెను. ఆయాసంగతులు "సంగీతరత్నాకరము"న చూడనగును కావున ముఖ్యములగు సంగతులు క్లుప్తముగ నిచ్చట చెప్పబడును. శార్ఙ్గదేవుని జాతులు పైమూడువిధములగు శ్రుత్యంతరములతో నిట్లున్నవి.—

షడ్జగ్రామజాతులు *

పధకము ౨

| | స–రి | రి–గ | గ–మ | మ–ప | ప–ధ | ధ–ని | ని–(స) | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (౧) దయావతి:— | ౨ | ౪ | ౩ | ౨ | ౪ | ౪ | ౩ | = | ౨౨ |
| (౨) నిషాది:— | ౪ | ౩ | ౨ | ౪ | ౪ | ౩ | ౨ | = | ౨౨ |
| (౩) షడ్జి:— | ౩ | ౨ | ౪ | ౪ | ౩ | ౨ | ౪ | = | ౨౨ |
| (౪) అర్షభి:— | ౨ | ౪ | ౪ | ౩ | ౨ | ౪ | ౩ | = | ౨౨ |

* ఇందలి యంకెలు శ్రుతులను దెల్పును.

## మధ్యమగ్రామజాతులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (౫) | గాంధారి — ౪ | ౩ | ౪ | ౨ | ౪ | ౩ | ౨ | = | ౨౨ |
| (౬) | మధ్యమ — ౩ | ౪ | ౨ | ౪ | ౩ | ౨ | ౪ | = | ౨౨ |
| (౭) | పంచమ — ౪ | ౨ | ౪ | ౩ | ౨ | ౪ | ౩ | = | ౨౨ |

ఈపథకమును మరి ఈవ్యాసము కడపట ఇవ్వబడు పథకమును మనము జాగ్రత్తగా గమనించినయెడల భరతుడు, శార్ఙ్గదేవుడుమున్న గువారు షడ్జమధ్యమగ్రామ మూర్ఛనలనుండి ఏడుజాతులు శుద్ధజాతుల పేర చెప్పుటకు గల కారణము గోచరింపకపోదు. బహుప్రాచీనకాలమున నుండిన మూర్ఛనలు భరతునికాలమునాటికి ఎట్లు మార్పుచెంది జాతులకు తావు కలుగజేసినదియు గొంత చెప్పియుంటిమి. పైన తెలుపబడిన మూర్ఛనల పథకమును† గమనించునప్పుడు పదునాలుగు మూర్ఛనలు నంతభిన్నములుగ గన్పట్టుటలేదు కొన్ని వానియందలి స్వరావళి సంబంధములేక యంతర మించుమించు ఒక్కటే యగుచున్నది. షడ్జగ్రామమందలి కొన్ని మూర్ఛనలకును, మధ్యమగ్రామమందలి వానికిని వ్యత్యాస మంతగా లేదనికాని, కొలదిగ నున్నను అది గ్రహింపతగినట్లుగ లేదనికాని యెంచవలసి యున్నది. ఈ సంగతి గ్రహించికాబోలు భరతుడు రెండుగ్రామములందును ఏడుశుద్ధజాతులు మాత్రము పేర్కొనినాడు. ఇటీవలి రఘునాథరాయలును తన మేటి సంగీతగ్రంథము "సంగీతసుధ" యందు పై సంగతి చెప్పియుండెను. షడ్జగ్రామమున మూడవదియగు 'ఉత్తరాయత' మూర్ఛన మధ్యమగ్రామమున అయిదవ 'పౌరవీ' మూర్ఛనకు తుల్యమే యని ఇతడు చెప్పినాడు.—

"షడ్జే తృతీయాఖలు మూర్ఛనా యోత్తరాయతో ధైవత పూర్వికా సా, స్యాన్మధ్యమగ్రామగ పౌరవీచ స్యాత్పంచమీ ధైవత పూర్వికాచ." —సంగీతసుధ, శ్లో ౨౩౭.

షడ్జగ్రామమందు నాలుగును, మధ్యమగ్రామమందు మూడును మొత్తము ఏడుజాతులు పైవిధమున భరతాదులు చెప్పియుంటచే సంవాదిపద్ధతి ననుసరించు మూర్ఛనలు రెండుగ్రామములందు సువ్యక్తము లగునవి ఇవియేయని యెంచబడుచుండెను కావుననే మూర్ఛనలు పేరునకుమాత్రము భరతునికాలము నుండియు పేర్కొనబడుటయు, సువ్యక్తములును సుస్థిరములు నగు సప్తజాతులుమాత్రము వాడబడుటయు గ్రహింతుము. అందుచే గొంతకాలమునకు పైన మేము చెప్పినట్లు మూర్ఛన లనినను జాతులనినను ఒక్కయర్థముగనే ఎంచబడుటకు వీలాయెను. ఇందుకు నిదర్శనముగ రఘునాథరాయలు తన "సంగీత సుధ" యందు షడ్జమధ్యమగ్రామములందు పదునాలుగుజాతులు కలవనియు, వీనియందు రెండు వికృతి గ లు రెండువికృతి ని లు చేర్పబడుటచే నివి ౧౮ అగుచున్నవనియు జెప్పియుండెను.

† పథకము IV. మరియు I.

శార్ఙ్గదేవుడు జాతులనుగూర్చి చెప్పుచు వాని నిట్లు వర్ణించెను. ఆయాసంగతులు విపులముగ "సంగీతరత్నాకరము" న చూడనగును. ముఖ్యములగు సంగతులు క్లుప్తముగ నిట చెప్పబడును —

౧ షడ్జి.—ఈ జాతిరాగము షడ్జగ్రామమందలి 'ధ' తో ప్రారంభించును. న్యాసస్వరము స యు అపన్యాసస్వరములు గ, ప లును కలిగియుండును. వాదిస్వరములు స, గ, మ, ప, ధలు. స, గ, స, ధలు జంటగా వచ్చుచుండును. ఉదాహరణము వరాటిరాగము.

ఈషడ్జజాతిరాగమును రాగవిబోధ, స్వరమేళకళానిధి, సంగీతసారామృతము ఈగ్రంథములందు ఇప్పుడు ఉత్తరహిందూస్థానపు తోడిమేళముగ జెప్పబడినట్లు విదితమగుచున్నది. అందుచే నిది మన ఇప్పటి పంతువరాళిరాగమునకు తుల్యమగుచున్నది.

౨. ఆర్షభి —ఈజాతిరాగము షడ్జగ్రామమందలి ప తో ప్రారంభించును. న్యాసస్వరము రి అపన్యాసస్వరములు వాదిస్వరములే. వాదిస్వరములు ని, రి, ధలు. ఇందు గ, ని లు తక్కిన స్వరములతో బాగుగ జేరియుండును. ఉదాహరణము దేశి మధుకరిరాగములు.

రాగవిబోధ గ్రంథమున నిది ఇప్పటి హిందూస్థానపు పూర్వి మేళముగ నెంచబడుచున్నది అందుచే నిది ఇప్పటి మన కామవర్ధని యగును 'స్వరమేళకళానిధి' గ్రంథమునగూడ నిది 'ఆర్ద్రదేశి' అగునని వచింపబడుటచే నాగ్రంథమునను ఇది మన కామవర్ధనిరాగముగ నెంచబడె నందుము కాని "సారామృతము" గ్రంథమున 'ఆర్ద్రదేశి' రాగము 'భైరవ' అను ఉత్తరహిందూదేశపు రాగమునకు తుల్యముగ జెప్పబడుటచే నిది మన మాయామాళవగౌళగ నెంచవలసియుండును. శార్ఙ్గదేవుడు ఈజాతిరాగజన్యముగా చెప్పిన గ్రామరాగములను ముఖ్యముగ నితని ౨౨ వ పంచమషాడవగ్రామరాగములను మనము గ్రహించిన నిది గుర్జరిగ రాగవిబోధ, చతుర్దండి ప్రకాశిక, స్వరమేళకళానిధిగ్రంథములందు కందుము. కావున దీని జనకరాగము 'ఆర్షభి' మన మాయామాళవగౌళమేళముగ నెంచవలసియున్నది. శార్ఙ్గదేవుని పై ఆర్షభిజాతిజన్యమగు ౨౬ వ రేవగుప్తగ్రామరాగముగూడ పై గ్రంథముల ననుసరించి మన మాయామాళవగౌళమేళమందలి జన్యమగు నదిగ నెంచవలసియుంటచే ఆర్షభిజాతిరాగము మన మాయామాళవగౌళయే అగును

౩. గాంధారి —ఈజాతిరాగము మధ్యమగ్రామమందలి మ తో ప్రారంభించును, న్యాస, అపన్యాస స్వరములు వరుసగ గ, స,

పలుగ నున్నవి. వాదిస్వరములు రి, ధలు తప్ప తక్కినవన్నియు నగును ఉదాహరణము గాంధారపంచమ; దేశి, వేళావళి.

వేళావళిరాగమును సంగీతసారామృతగ్రంథమున మన యిప్పటి గౌరీమనోహరి లేక ఖరహరప్రియ మేళమున చూతుము శార్ఙ్గదేవుడు ఈజాతిరాగజన్యమగు తన ౧౭ వ మధ్యమగ్రామరాగమువలన మధ్యమాది కలుగునని చెప్పుటచేతను, మధ్యమాది మన ఖరహరప్రియ యందు జన్యమగుటచేతను గాంధారి ఖరహరప్రియకు తుల్యమగుటను గ్రహింతుము.

౪. మధ్యమ:—ఇయ్యది మధ్యమగ్రామమందలి రి తో ప్రారంభించును ఇందు న్యాస-అపన్యాసస్వరములు వరుసగా మయు, వాది స్వరములును అని చెప్పబడెను. వాదిస్వరములు గ, నిలు తప్ప తక్కిన వన్నియు నగుచున్నవి. ఇందు స, మలు విస్తారముగను, గ తక్కువగను వాడబడునట. ఉ. శుద్ధషాడవము; దేశి; ఆంధోళి.

౫. పంచమి — ఇయ్యదియు మధ్యమగ్రామమందలి రి తో ప్రారంభించునదిగ జెప్పబడెను. న్యాసస్వరము ప. అపన్యాస స్వరములు రి, ప, నిలు. రి, పలు వాదిస్వరములు—ఇందు స, గ, మలు విస్తారముగ వచ్చును. ఉ. శుద్ధపంచమ, దేశి, ఆంధోళి శార్ఙ్గదేవుని ౩౦ వ శుద్ధపంచమ గ్రామరాగము మధ్యమ, పంచమజాతుల నుండి కలిగినదని యెంచబడెను దేశవాళీగౌడ, తురుష్కగౌడ, ద్రావిడగౌడరాగములుకూడ ఇతడు ఈ గ్రామరాగమందే చెప్పెను. మరియు దేశవాళీగౌడను కేదారగౌడగకూడ నితడెంచెను.

౬. దయావతి —ఇయ్యది షడ్జగ్రామ రి తో ప్రారంభించునదియు, న్యాసస్వరము ధ అనియు, అపన్యాసస్వరములు రి, మ, ధలనియు, రి, ధలు వాదిస్వరములనియు నిట్లు ఈజాతిలక్షణమును శార్ఙ్గదేవుడు చెప్పెను. ఉ. శుద్ధకైశికి; దేశి ౩౧-వ గ్రామరాగము ఒక్క కైశికి ఈజాతిజన్యముగ శార్ఙ్గదేవుడు చెప్పెను

౭. నిషాది:—ఈజాతిరాగము షడ్జగ్రామ గ తో ప్రారంభించును. న్యాసస్వరము ని అపన్యాసస్వరములు వాదిస్వరములే. వాదిస్వరములు ని, రి, గలు. ఇవియే బహులముగ వచ్చును ఇయ్యది షాడవ మగునప్పుడు పంచమస్వరవర్జితముగను, ఔడవమగునప్పుడు షడ్జపంచమస్వరములు వర్జితములుగను వర్ణింపబడెను. ఉ. శుద్ధసాధారిత; దేశి; వేళావళి.

మరియు శార్ఙ్గదేవుడు మిశ్రమజాతులగూర్చి చెప్పుచు నివి ౧౧ అగుచున్నవని వచించెను. * వీని నిట్లు చూడనగును.—

పథకము 3

| రత్నాకరము వరుస నెంబరు | జాతిపేరు | ఇందలి మిశ్రజాతులు |
|---|---|---|
| ౮ | షడ్జకైశికి | షడ్జి, గాంధారి |
| ౧౦ | షడ్జమధ్యమ | షడ్జి, మధ్యమ |
| ౧౬ | గాంధారపంచమి | గాంధారి, పంచమి |
| ౧౭ | ఆంధ్రి | గాంధారి, ఆర్షభి |
| ౯ | షడ్జోదీచ్యవా | షడ్జి, గాంధారి, ధైవతి |
| ౧౫ | కార్మారవీ | నిషాది, పంచమి, ఆర్షభి |
| ౧౮ | నన్దయన్తీ | గాంధారి, పంచమి, ఆర్షభి |
| ౧౧ | గాన్ధారోదీచ్యవా | గాంధారి, ధైవతి, షడ్జి, మధ్యమ |
| ౧౪ | మధ్యమోదీచ్యవా | గాంధారి, ధైవతి, పంచమి, మధ్యమ |
| ౧౨ | రక్తగాంధారీ | గాంధారి, నిషాది, పంచమి, మధ్యమ |
| ౧౩ | కైశికీ | షడ్జి, గాంధారి, పంచమి, మధ్యమ, నిషాది |

ఇందువలన శార్ఙ్గదేవుడు శుద్ధజాతులు పైన చెప్పబడినట్లు ఏడును, మిశ్రమజాతులు ఈపథకము నందువలె ౧౧ ను చేరసి పదునెనిమిదిజాతులు చెప్పెను. వీనిని తన సప్తమప్రకరణమున విపులముగ వర్ణించినాడు:

మూర్ఛనలు షాడవౌడవవక్రభేదములచే నెట్లు తానములకు ప్రస్తారక్రమము ననుసరించి కారణమాయెనో, అట్లే పైజాతులును పై భేదముల ననుసరించి పెక్కు శుద్ధవికృతజాతులకు కారణము కాక పోవు. ఇట్లు గ్రహించియే భరతుడు జాతులందు సాధారణ స్వరము

* చూడు: జాతులగూర్చిన శ్లోకములు, ౯-౧౬ (సంగీతరత్నాకరము).

లను మరి యంశస్వరములను చేర్చి రెండువిధములగు జాతులు — ౧. సాధారణవికృతి ౨. సంసర్గజవికృతి నామములతో పేర్కొనినాడు. ఈయన మరి యీకాలపు శాస్త్రజ్ఞులు చెప్పిన సంగతులు ఇట్లు క్రమముగ సామరస్యముచేసి చెప్పగలిగినయెడల మన సంగీతము కడుఘనత జెందగలదని మానమ్మకము. ఇటీవలి గ్రంథకర్తలు భరతాదుల మతమును సాకల్యముగను, సక్రమముగను, ఎఱిగియుండకయు నీ యీ సంగతులు తప్పులదొంతరలతోనైనను తమ గ్రంథముల జొప్పించుటకు జంకుగొంకులు లేకుండుట శోచనీయ మగుటయేకాక అట్టిసంగతులిపుడు వివాదహేతువు లగుచున్నవి. తాము తప్పుత్రోవల సంచరించి ప్రాచీనవాగ్గేయకారు లుగ్గడించిన గ్రామములు, మూర్ఛనలు, జాతులు, సంవాదిత్వము మున్నగు పెక్కు అంశములు క్రమముగ గ్రహింపకయు, గ్రహించుట కిష్టపడకయు సంగీతమును వ్యర్థపరుపజూచుట విషాదకరమగు సంగతి. ఇందుకు పూర్వపువాగ్గేయకారుల చరిత్ర యావశ్యక మగుచున్నది. వీరిగూర్చియు, వీరి గ్రంథములగూర్చియు నింత కాలమువెనుక వ్రాయబూనుట సులభమగు ప్రయత్నము కాదు కాని ఈ చరిత్రాంశములు కొంతవరకు మేము సంగీత పరిషత్పత్రికయందు ఆంగ్లమున వ్రాయుచుంటిమి ఆంధ్రమునను వేరు గ్రంథము వ్రాయబూనితిమి.

పైవిధమున భరతుడు చెప్పిన జాతులు లేక గ్రామరాగములు ౧౩-వ శతాబ్దమువరకు అమలునం దుండెననుటకు నిదర్శనములు కలవు. కావుననే ఈకాలమును గ్రామరాగకాలముగ పేర్కొనియుంటిమి. ప్రాచీనశాస్త్రవేత్తలు దత్తిల, కోహల, అశ్వతార, మతంగ, మాతృగుప్త, అభినవభట్టు మున్నగువా రెల్లరు ఈకాలముననే పైగ్రామరాగపద్ధతిని చెప్పుచు తమతమ కాలములకనువగు కొద్దిమార్పులతో వానిని సామరస్యముచేసి లక్షణ మేర్పఱచుచుండి రనునదే మనము వీరి గ్రంథములనుండి నేర్వవలసినది శార్ఙ్గదేవునికాలమునాటికి (క్రీ.వె ౧౨౪౭) పూర్వపు గ్రామరాగపద్ధతిగూర్చి కూడ చెప్పుకొనబడుచుండినను, రాగాంగభాషాంగోపాంగ రాగములే వాడబడుచుండినట్లు విదితము. ఇందుకు నిదర్శనము శార్ఙ్గదేవుడు విభజించిన రెండువిధములు రాగములు, ౧. పూర్వోక్తములు ౨. దేశప్రసిద్ధములు అనునవి. ఇతడు పేర్కొనిన ౨౬౪ రాగములు ఈరెండువిధముల ననుసరించినవే ఇందు గ్రామరాగములు లేక జాతిరాగములు ముప్పదియు, మరికొన్ని పూర్వప్రసిద్ధములును చేరియున్నవి. గ్రామరాగములను తిరిగి భాషావిభాషాంతర భాషారాగములుగగూడ నితడు విభజించి వర్ణించియుండెను ఈ విభజనకు కారణము స్త్రీపురుషరాగములను తెలియజేయుటకని యెంచబడును. జనకరాగములు పురుషరాగములుగను, భాషావిభాషాంతర భాషారాగములు స్త్రీరాగములుగను చెప్పబడుట విదితము. శార్ఙ్గదేవుడుచెప్పిన ఉపరాగములు గ్రామరాగములు లేక జనకరాగములే. పూర్వ ప్రసిద్ధరాగములందు భాషారాగములు ౧౨౦ కలవు. మరియు ఇతడు తన కాలమున ప్రసిద్ధరాగములు ౫౨ కలవని చెప్పి వాని పేర్లు ఇట్లు తెల్పినాడు.—

రాగాంగములు —మధ్యమాది, మాళవశ్రీ, తోడి, బంగాళా, భైరవ, వరాటీ, గుర్జరీ, గౌడ, కోలాహల, వసంత, ధన్యాశ్రీ, దేశీ, దేశాఖ్య (౧౩).

భాషాంగములు—డోంబక్రీ, ప్రథమమంజరి, శుద్ధవరాటిక, అసావేరీ, ఆదికామోద, నాగధ్వని, వేళావళి, నట్ట, కర్నాటబంగాళ (౯)

ఉపాంగములు—కుంతలవరాటి, ద్రావిడవరాటి, సైంధవీ వరాటి, స్థానవరాటి, హతస్వరవరాటి, ప్రతాపవరాటి, ఛాయతోడి, తురుష్కతోడి, మహారాష్ట్రగుర్జరీ, సౌరాష్ట్రగుర్జరీ, దక్షిణగుర్జరీ, ద్రావిడగుర్జరీ, భుంఛ్చిక, స్తంభతీర్థిక, ఛాయవేళావళి, ప్రతాపవేళావళి, భైరవీ, సింహళీకామోద, ఛాయనాట, రామకృతి, వల్లాతిక, మలహారీ, మలహార, కర్నాటగౌడ, దేశవాలగౌడ, తురుష్కగౌడ, ద్రవిడగౌడ (౨౭).

## రాగరాగిణీపద్ధతి

ఇట్లు శార్ఙ్గదేవుడు పేర్కొనిన గ్రామరాగములయొక్క భాషావిభాషాంతరభాషారాగవిభజనపద్ధతి అనంతరమువారికి రాగరాగిణిపరివార మనుపద్ధతికి చోటిచ్చెనని యనదగును. ఇయ్యది శాస్త్రపాండిత్యము అంతగా లేక పొట్టపోసికొను గాయకుల కుపయుక్తముగ నుంటచేకాబోలు వారు దీని ననువదించుచుండిరి. ఇయ్యది హిందూదేశమున క్రీ. వె. ౧౫౫౦ వరకు (అనగా రామామాత్యుడు తన మేళకర్తలను పేర్కొనువరకు) అమలునందుండెననుట చెల్లు తమపద్ధతి సుస్థిరముగావించుటకు కాబోలు అప్పటి కొందరు కొన్ని పౌరాణికగాథలుకూడ వింతగ తమకనువగువిధమున చెప్పుచుండిరి అం దొక కథ రాగములసంఖ్యను తెలియపరచుటకునై యున్నది. సదాశివునకు గల పంచముఖములనుండియు నైదురాగము లుద్భవించెననియు, నారదేవుని భార్య పార్వతివలన మరియొక రాగముకూడ కలిగెననియు, నందుచే నారుపురుషరాగములు సంభవించెననియు జెప్పుదురు. ఒక్కొకపురుషరాగమునకు ఆరు స్త్రీరాగములు లేక రాగిణి లుంటచే మొత్తము ముప్పదియారు రాగములాయెను. ఒక్కొక్క స్త్రీరాగమువలన అయిదేసి పుత్రులు (రాగములు) కలుగుటచే నూటయేబది రాగములు సంభవములనియు నిట్లు చెప్పబడెను. ఇట్టి కథలు నమ్మ అమాయకపు గాయకు లిప్పుడు లేకపోలేదు వీనిపై నమ్మక మంత లేనివారి కవి మేళములయొక్కయు, రాగములయొక్కయు నన్యోన్యసంబంధమును తెలియజేయగలుగుననుట యొప్పు. ఈపద్ధతిని ఉత్తర హిందూదేశమున నుండిన అహోబలుడు, దామోదరుడు మున్నగువారు అనువదించుచుచుండిరి. కాని దక్షిణమున రామామాత్యుడు, సోమ

నార్యుడు, వెంకటమఖి ఇత్యాదులు పైవానియందు విలీనులుగ నుండక కొంత నూతనము జన్యజనకరాగపద్ధతి లేక రాగపద్ధతిని లేక రాగాంగోపాంగభాషాంగరాగపద్ధతిని గ్రహించి చెప్పియుంట విదితము. కావుననే ఉత్తరహిందూదేశమున నిప్పటికిని కొంతవరకు రాగరాగిణీ పద్ధతి యనుసరింపబడుచుండ దక్షిణమున ఘనమగు మేళకర్తల పద్ధతి విస్తరింపజేయబడుచుండెను. దక్షిణపుమేళకర్తల పద్ధతి నవ్యమగు నదియని తలంచికాబోలు ఆయావిధమున శ్రీయుతులు ఎస్. ఎం బాత్కండే మరి యితరులు నేడు తమ హిందూస్థానీరాగములను మేళకర్తలకు తుల్యములగు "థట్" నామమున జన్యజనకపద్ధతిని చెప్పుచున్నారు.

## నారదహనుమన్మతములు

మరియొక సంగతి. పూర్వమునుండియు నీదేశమున నారదమతము హనుమన్మతము అను రెండుపద్ధతులు కలవనుటకు నిదర్శనములు కలవు భరతుని కాలమునకు పూర్వమునను వెనుకను నుండిన వాగ్గేయకారులు ఈ రెండుపద్ధతులకు లోనగుచుండిరనుట విదితము ప్రాచీనవాగ్గేయకారుల గూర్చియు,వారిగ్రంథములగూర్చియు నిప్పుడంతగ తెలియకున్ననుమనకు లభ్యమగు కొలదిగ్రంథములు ఈసంగతిని గ్రహించుటకు తోడ్పడుచునే యున్నవి. ఆకాలమునందలి కోహల, దత్తిల, మతంగ, కశ్యప, నంది, ఉద్భట, లోల్లట, శంకుక, అభినవగుప్త, కీర్తిధర, మాతృగుప్త, నాన్యదేవ, భోజదేవ, శార్ఙ్గదేవ ఇత్యాది ప్రాచీనవాగ్గేయుల గ్రంథములను తెలిసికొని విచారించిన వీరి పైరెండు పద్ధతులలో నేదైన ఒకటిమాత్ర మాచరించుచుండిరనునది ధ్రువమగుటయేకాక పైసంగీత విషయములు పెక్కు బోధపడకపోవు ఇందుచే నీ కాలమునందలి శాస్త్రవేత్తలగూర్చి యారయుటయు వారి గ్రంథములను కనుగొని వానిని సామరస్యముచేసి వారి సంగీతమందుగల యభిప్రాయములను చక్కగ నెరిగియుంటయు, మనకు కర్తవ్యమగుచున్నది ఈ విషయమును నేను సంగీతపరిషత్పత్రికలలో కొంత వివరించియుంటిని. ఆంజనేయ నారదమతములు తుదకు ఉత్తరమునను, దక్షిణమునను ఎట్లో పొడుకొనుట సంభవించెను. కావుననే హిందూస్థానీసంగీతము ఆంజనేయమతము ననుసరించునదియనియు, కర్ణాటకగానము నారదమతానుసరణమనియు నెంచబడుచున్నది.

ఉత్తరమున నుండిన రాగరాగిణీ పరివారపద్ధతి చాలమార్పులు చెందుచుండె ననుటకు చరిత్రాంశములు కలవు ప్రథమమునుండియు. ౧౩-వ శతాబ్దమునుండి ఉత్తర హిందూదేశము పారశీకులు, ఆఫ్గనులు, మహమ్మదీయులు, మున్నగువారి దండయాత్రలకు లోనగుచుండెననియు, వారివారి ఏలుబడి అట స్థిరమగుచుండెననియు, నట్లు రాజ్యములు సంపాదించుకొనిన రాజులు చక్రవర్తులు మొదలగువారు తమతమ దేశములనుండి తమమతములవారిని ఆస్థానములం దుంచుకొని వారిచే వాఙ్మయము శాస్త్రములు ర్మించుకొనుచుండిరనియుని, నందుచే హిందూధర్మములు, శాస్త్రములు, లలితకళలు, మరి వాఙ్మయము మార్పుచెందుచుండెననియు నప్పటి చరిత్రలు చెప్పుచున్నవి. సంగీతముకూడ పైవిధమగు అన్యదేశీయుల సంపర్క దోషమునకు గురియైయుంట విదితము భారతీయగాయకులును రాజుల మెప్పులకై తమ యాశయములను విడనాడి వారి దేశపుపద్ధతినికూడ కొంత నేర్వవలసినవారైరి కాని దక్షిణాపథమున నిట్లు పెక్కుమార్పులకు సంగీతవిద్య చోటిచ్చినట్లు కానము. ఇందుకు రామామాత్యుడు, సోమనార్యుడు, వెంకటమఖి, రఘునాథరాయలు మున్నగువారు కారకులు కాకపోరు

## మేళముల పద్ధతి

ముఖ్యముగ (క్రీస్తు వెనుక ౧౫౫౦) పదునాఱవ శతాబ్దము మధ్యనుండియు దక్షిణదేశమున మేళముల పద్ధతి క్రమక్రమముగ నాచరణకు వచ్చుచుండెను. పూర్వముండిన శార్ఙ్గదేవుని సంగీత శాస్త్రము ఈకాలమునాటికి సుబోధము కాకపోవుట గూర్చియు, నందుచే నాచరించుటకు దుస్తరమగుటగూర్చియు రామామాత్యుడు చెప్పుకొనినాడు. తమకాలమునందలి ప్రజల భావముల ననుసరించి సంగీతము మార్పుచెందునప్పుడు లక్ష్యలక్షణములకు విరోధము సంభవించుతరి లక్ష్యమే ప్రధాన మగుచున్నదని చెప్పి యీతడు తన "స్వరమేళకళానిధి" గ్రంథమును ఆవిధముననే నిర్మించి స్థిరపరిచితుడాయెను. సంగీతమున పెక్కు నూతనవిషయములను అనగా తన కాలమునందు ఆచరింపబడువానిని చేర్చి ప్రకటించిన యీతని గ్రంథము మరియొక నూతనశకారంభమును చూపుచున్నది. ఇంతటినుంచి గ్రామరాగపద్ధతి పూర్తిగ అంతరించుటకు మొదలిడెను. షడ్జమధ్యమగ్రామములు రెండును సంపుటిచేయబడుటయు, వీని మూర్ఛనలు, జాతులు లేక గ్రామరాగములు నామావశిష్టములై గ్రంథములందు మాత్రము కావవచ్చుటయు, నిందుచే మేళములు నూతనఫక్కిగ వెలయుటయు నిప్పుడు చూతుము ఈకాలమున నెట్లు భరతుని స్వరసాధారణ యంతరించి వికృతిస్వరములకును,మరి గమకములకును తావు కలిగినదియు నిదివరలో గమనించియుంటిమి శ్రుతులు, స్వరములు—వీని స్థానములు గూర్చి చెప్పినప్పుడు ఈకాలమందలి వివిధశాస్త్రజ్ఞుల యభిప్రాయములను చెప్పియుంటిమి తుదకు రామామాత్యుని కాలమునుండి పూర్వపుపద్ధతి మిక్కిలి మారినదని తెలిసికొనుట భావ్యము. తన ప్రకృతి వికృతిస్వర భేదముచే నితడు ఇరువది మేళములను, వీని జన్యములు ౬౦ రాగములను పేర్కొనుటచే శార్ఙ్గదేవుని ౨౬౦ రాగములందును దేశప్రసిద్ధములగువానినే చెప్పెననుట చెల్లు. కాని ఇతని ౨౦ మేళములందును ౧౫ మాత్రము స్వతంత్రములు. తక్కిన ౫ మేళములు పై ౧౫ మేళములనుండి యంత భిన్నములు కావు ఇందుకు కారణము చ్యుతమధ్యమగాంధారచ్యుతషడ్జనిషాదములతో గల మేళములు అంతరగాంధార కాకలీనిషాదయుత మేళములతో గ్రహింపబడని వ్యత్యాసమున నుంటయే యందుకు.

## భరతముని మూర్ఛనలు - జాతులు

౦ పథకము ౪

| ౦ | నంబరు | మూర్ఛనల పేర్లు | ఆంగ్లేయ రాగము (Mod-) | తుల్యమగు కర్నాటకరాగము | శ్రుతులు ౦ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ | ౧౬ | ౧౭ | ౧౮ | ౧౯ | ౨౦ | ౨౧ | ౨౨ | జాతులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| షడ్జ గ్రామము | ౧ | అభిరుద్గత | D | ఖరహరప్రియ ? | | | | ౩ | | ౫ | | | | ౯ | | | | ౧౩ | | | ౧౬ | | ౧౮ | | | | ౨౨ | అర్షభి |
| | ౨ | అశ్వక్రాంత | E* | హనుమతోడి | | | ౨ | | | | ౬ | | | | ౧౦ | | | ౧౩ | | ౧౫ | | | | ౧౯ | | | ౨౨ | |
| | ౩ | మత్సరికృత | F* | కళ్యాణి | | | | | ౪ | | | | ౮ | | | ౧౧ | | ౧౩ | | | | ౧౭ | | | ౨౦ | | ౨౨ | |
| | ౪ | శుద్ధషడ్జ | G* | కాంభోజి | | | | | ౪ | | | ౭ | | ౯ | | | | ౧౩ | | | ౧౬ | | ౧౮ | | | | ౨౨ | |
| | ౫ | ఉత్తరాయత | A | మణ్యుఖప్రియ ? | | | | ౩ | | ౫ | | | | ౯ | | | ౧౨ | | ౧౪ | | | | ౧౮ | | | | ౨౨ | దయావతి |
| | ౬ | రజని | B | కామవర్ధని | | | ౨ | | | | ౬ | | | ౯ | | ౧౧ | | | | ౧౫ | | | | ౧౯ | | | ౨౨ | నిషాదిని |
| | ౭ | ఉత్తరమంద్ర | C | శంకరాభరణము | | | | | ౪ | | | ౭ | | ౯ | | | | ౧౩ | | | | ౧౭ | | | ౨౦ | | ౨౨ | షడ్జి |
| | | | | | స | | | | రి | | | గ | | మ | | | | ప | | | | ధ | | | ని | | (సా) | |
| మధ్యమగ్రామము | ౧ | శుద్ధమధ్యమ | C* | శంకరాభరణము | | | | | ౪ | | | ౭ | | ౯ | | | | ౧౩ | | | ౧౬ | | | | ౨౦ | | ౨౨ | |
| | ౨ | కలోపన్నత | D* | హేమవతి ? | | | | ౩ | - । | ౫ | | | | ౯ | | | ౧౨ | | | | ౧౬ | | ౧౮ | | | | ౨౨ | |
| | ౩ | హరిణాశ్వ | E | హనుమతోడి | | | ౨ | | | | ౬ | | | ౯ | | | | ౧౩ | | ౧౫ | | | | ౧౯ | | | ౨౨ | గాంధారి |
| | ౪ | సౌవీరీ | F | కళ్యాణి | | | | | ౪ | | | ౭ | | | | ౧౧ | | ౧౩ | | | | ౧౭ | | | ౨౦ | | ౨౨ | మధ్యమ |
| | ౫ | హృష్యక | G | కాంభోజి | | | | ౩ | | | । | ౭ | | ౯ | | | | ౧౩ | | | ౧౬ | | ౧౮ | | | | ౨౨ | పంచమి |
| | ౬ | పౌరవీ | A* | నటభైరవి | | | | | ౪ - । | | ౬ | | | | ౧౦ | | | ౧౩ | | ౧౫ | | | | ౧౯ | | | ౨౨ | |
| | ౭ | మార్గీ | B* | కామవర్ధని | | | ౨ | | | | ౬ | | | ౯ | | ౧౧ | | | | ౧౫ | | | ౧౮ | | | | ౨౨ | |

* ఇయ్యవి మనగానమున సులభగ్రాహ్యములు. ।తక్కినవి వీనికి కొంచెము సమములగుచున్నవి.

## మేళప్రస్తారపద్ధతి

రామామాత్యుడు పూర్వపుపద్ధతికి కొంత భిన్నముగ తనదేశకాల పరిస్థితుల ననుసరించి లక్ష్యమందు గల సంగీతశాస్త్రమును నిర్మింప యత్నించుచుండినను పూర్వపుపద్ధతిని సాధ్యమగునంతవరకు సామరస్య ముచేసియు, పోల్చియు ననుసరించుచుంట గమనించుచునేయున్నాము అనంతరముండిన సోమనార్యుడు, రఘునాథరాయలు, వేంకటమఖి, తులజేంద్రులు మున్నగువాగ్గేయులును ఇట్లే పూర్వపు సంప్రదాయ మును సాధ్యమగునంతవరకు అనుకరించుచుండి రనుటయు చెల్లు. కాని రఘునాథరాయలు, వెంకటమఖి, తులజేంద్రుడు ఇత్యాదులు పూర్వపు రామామాత్యుని మేళపద్ధతి అంత సంపూర్ణమగునదిగ లేని కారణముననే నూతనముగ తమ మేళప్రస్తారపద్ధతితో సంగీతమును లోకమునకు వెల్లడించి కృతకృత్యులైరి ఇప్పుడు జనబాహుల్యము నొందిన డెబ్బదిరెండు మేళకర్తలు అప్పటినుండియు దేశమున పెంపొందుచుండెను. ఈపద్ధతిని తెలిపిన వెంకటమఖి, రఘునాథరాయలు సంగీత లోకమునకు సంస్మరణీయులు కాకపోరు. మేళప్రస్తారపద్ధతి యంత నవ్యమగునగి యని యెంచియే ప్రతివారును అనుసరించుచున్నారు. వెంకటమఖి తానే మేళప్రస్తారమును గ్రహించినట్లు అతిశయముగ జెప్పుకొనినాడుకాని ఈయనకు పూర్వముండిన రఘునాథరాయలు కాని వెంకటమఖితండ్రి గోవిందదీక్షితులుకానియద్దానిచెప్పియుండినట్లు "సంగీతసుధ" అను గ్రంథమువలన తెల్లమగుచున్నది మన మిప్పుడు వెంకటమఖి సంప్రదాయమే చెప్పుకొనుచున్నా మందుముకాని మన మేళకర్తల పేర్లకును వెంకటమఖి మేళకర్తల పేర్లకును కడువ్యత్యాస ముంటచే నట్లు చెప్పుకొనుట యెట్లు పొసగు ననునది యాలోచింప దగు విషయము. కావున వెంకటమఖి తిన మేళప్రస్తారక్రమమున నెట్లు డెబ్బదిరెండు మేళకర్తలను చెప్పినదియు సహేతుకముగ వేరువ్యాస మునందు పొందుపరతుము

---



# చీట్లపేక

జి. జాషువగారు

నాలుగుకన్నుల వాలుచూపుల సాని, అతికాలభుక్తికి నాటపట్టు
గెలిపించి యోడించు కులుకునవ్వాల, పిల్ల కలహమ్మునకు నిండు కారణంబు
వ్యసనవల్లికలకు బలమైన చేయూఁత, తొలఁగించుకొనరాని జలగపట్టు
ప్రొద్దెఱుంగని మోహమునకుఁ జింతామణి, నలు నిల్లు గూల్చిన నంగనాచి
నెత్తి గొఱిగి పంపు నెల్లూరి నెఱజాణ-కితవజాండములకు బ్రతుకుదెరువు
త్రాగుడునకుఁ గొంత దగ్గరచుట్టము-చేతిడబ్బుపోక చీట్లపేక.

జోకరుగానిఁ దోడుకొని చుక్కల చక్కఁదనంబు మీఱ మూఁ
డాకుల యాట, యెత్తిళులు, నడ్డు, పరత్తని మ్రోయుచున్న యో
పేకపిశాచి! నన్ను వలపింపకు మింతట బుద్ధి వచ్చె, నీ
యాకులపాటులోఁ గలుగు నాకులపాటుఁ దలంప సిగ్గగున్.

అంగీకారనినాదముల్, పటుతరవ్యాహారముల్, భ్రూకుటీ
భంగాక్షేపణముల్, పరస్పరజయవ్యామోహవాదధ్వనుల్
సంగీతంబులు, కూనరాగములు, నీలల్, దీర్ఘనిశ్వాసముల్
నింగిన్ దాఁటుచునుండు నీదురితకేళీరంగమధ్యంబునన్.

నిరుపేద న్గరుణించి, పాప మని కానీ ధర్మ మీయంగఁ జి
ల్లర లేదంచుఁ దొలంగు లుబ్ధుఁడు, సముల్లాసంబుతో, మేటితెం
పరియై, నూటికినూఱు లొడ్డి విరమింపం డక్కటా! పేకసుం
దరి! నీముక్కలు మోహనాస్త్రములు, చింతాసౌధసోపానముల్.

"అనుఁగుంబిడ్డఁడు బావిలోఁ బడియె నయ్యా! లేచి ర" మ్మన్నఁ "దె
చ్చున దీమార్గమె కా"యటంచు వచియించున్ జూదగాఁ డందు, రిం
జున సందేహము లేదు, కేవలము నుందుండై, విపద్గ్రస్తుఁడై,
తనరున్ రంగ మలంకరించిన మహాతత్త్వజ్ఞుఁడున్ బ్రేల్మికిన్.

గెలుపా? యూయెలసంశయంబునకు మ్రొగ్గన్; బేస్తులా? రెండు రూ
కల పైచిల్కు; కుదేళు లిచ్చుకొన నింకన్ బావులా కాని గా
వలె, నీఘోరవిపత్తు మస్తమున సంప్రాప్తించెనా? వాఁడు "వి
హ్వాలనాగేంద్రము పాహి పాహి" వఱకై యబ్జాక్షుఁడున్ రావలెన్.

పేకయాటలోని పింఛనీదారుఁడు-చుట్ట ద్రావుకొనుచుఁ జూడ వచ్చి
చెఱచె ననుచు ముక్కుఁ జిట్లించికొని పోవు-పేకయాట గుండెపీఁకులాట.

---



# ఆర్యపురము

(Aihole)

(చాళుక్యుల పురాతననగరము)

కొ. నరసింహాచారిగారు

కాలప్రవాహముయొక్క నిరాఘాటవేగమునకు లోగని దెద్దియు లేదు. దీనిప్రవాహమున నెట్టిదైనను వృద్ధిబొందను వచ్చును, నశింపను వచ్చును. అనేకరాజ్యములు కాలప్రవాహమున నశించినవి. అనేకము లుత్పన్నము లయినవి. అట్లు ఈప్రవాహవేగమున బడి నశించిన పురాతనరాజ్యములలో చాళుక్యరాజ్య మొకటి.

చాళుక్యులు సుమారు క్రీ. శ. ౫-వ శతాబ్దము మొదలు ౧౨-వ శతాబ్దమువఱకును కడుప్రబలులై యుండిరి. వారు ప్రథమమున అయోధ్యనుండి దక్షిణమునకు వచ్చియుందురని చరిత్రకారుల నిర్ణయము చాళుక్యులు దక్షిణముననుండి వచ్చినపుడు ప్రథమమున ఆర్యపురమున జేరియుండి, తర్వాత ఒకటవ పులకేశికాలమున వాతాపి (Badami) నగరమును రాజధానిగ జేసికొనిరి. చాళుక్యరాజ్యము ప్రస్తుతము బొంబాయిరాజధానియందు దక్షిణభాగమును, మైసూరున ఉత్తరభాగమును, ఈరెండుభాగములనంటియుండు చెన్నరాజ్యనిజామురాజ్యభాగములును అయియుండెను.

ఆర్యపురమునందలి దేవాలయములను తొలుదొలుత ఒకటవపులకేశియో, లేక అతనితనయుడు ఒకటవకీర్తివర్మయో కట్టియుండవచ్చును. ఇచ్చట ఒకటవ పులకేశి "సత్యాశ్రయ శ్రీపులకేశి వల్లభమహారాజ" అనుబిరుదుతో అశ్వమేధయాగమును చేసియుండెనని ప్రతీతి. ఒకటవకీర్తివర్మ కుమారుడగు రెండవపులకేశి చాళుక్యరాజులలో ప్రసిద్ధిజెందినవాడు. ఇతనికాలమున విదేశసాంగత్యముకూడ నేర్పడియుండెను. రెండవపులకేశియు పారసీకదేశాధిపతియగు రెండవఖుస్రూను పరస్పరము రాయబారములు జరిపినట్లు అజంతాగుహాలయములందుగల చిత్రములు నిదర్శనములు. రెండవపులకేశికాలమున, ఆర్యపురమునందలి 'మేగూతి' దేవాలయమునందు నెలకొల్పబడిన శిలాశాసనముగూడ కలదు. ఇతనికాలముననే చాళుక్యవంశము భిన్నమై ఒకభాగము గోదావరీ కృష్ణానదుల ముఖదేశమును జేరి తూర్పుచాళుక్యులన బరగిరి.

## ఆర్యపురము (Aihole)

ఆర్యపురము ఇప్పటి భీజపూరుజిల్లాలో బాదామి తాలూకాయందలి బాదామిరైలుస్టేషనునకు ఈశాన్యమున సుమారు ౧౫ మైళ్లదూరమున నున్నది. పశ్చిమ చాళుక్యరాజ్యమున, బాదామి (Vatapi), ఆర్యపురము (Aihole), పట్టడకల్ అను మూడునగరములు మిక్కిలి ప్రసిద్ధములై యుండిన వనుటకు ప్రస్తుతముగల నిదర్శనములు వానియందుగల అసంఖ్యాకములగు పురాతనదేవాలయములే. ఇందు ఆర్యపురము ప్రస్తుతము సుమా రొక

ఫర్లాంగుమాత్రము నిడివిగలిగి పెద్దఆవరణకుడ్యమును యము” (పటము ౧ చిత్రము ౨). దీని కీపేరు ఇందు గలిగియున్నది (పటము ౧, చిత్రము ౧). వైశాల్యమున వసించుచుండిన యొక మహమ్మదీయునివలన గలిగినది.

ఇదేరీతిని తక్కిన దేవాలయములకు ఇప్పటికాలమున గలిగిన పేరులు, తొలుతటివి కాక మధ్యమధ్య కారణాంతరములనుబట్టి గలిగినవై యున్నవి.

ఆర్యపుర దేవాలయములలో తొలుత గట్టబడినవి విశేషశిల్పరచనాబాహుళ్యము లేక శిఖరరహితములగు గుహాలయములబోలియున్నవి. ఇందుకు నిదర్శనములు లాడ్‌ఖాన్ దేవాలయమును, కొంటగుడియు (పటము ౧, చిత్రము ౨, ౩). తర్వాతికాల


1 గ్రామాపగేరాము


2 లాడ్‌ఖాన్ ఆలయము


3 కొంటగుడి


4 దుర్గాలయము


6 శిఖరము


5 హుచ్చిమల్లిగుడి

పటము I

చిన్నదిగాదోచినను ఇందు ప్రాకారమునకు లోపల ముప్పదింటికెక్కువ దేవాలయములును, ప్రాకారమునకు వెలుపల నలువది దేవాలయములును కాన్పించుచున్నవి. ఈదేవాలయములు ప్రస్తుతకాలమున జననివేశనములుగను, పశువుల కొట్టములుగను ఉపయోగింపబడుచు, కొన్నికొన్ని గబ్బిలములు మొదలగుజంతువుల నివాసములయియున్నవి.

ఆర్యపుర దేవాలయము లన్నింటియందును మిక్కిలి పురాతనమయినది “లాడ్‌ఖాన్ దేవాల


1 నంది


2 లాడ్‌ఖాన్ ఆలయ ముఖము


3


4


5

పటము II

ములందు గట్టబడిన ఆలయములయందు శిల్పరచన వృద్ధిజెందినందున కడుసుందరములగు చెక్కడపు బనులు గలవు(పటము ౨,చిత్రములు 3, ౪, ౫). ఇందు శిఖరములుగూడ గలవు (పటము ౧, చిత్రము ౬). లాడ్ ఖాన్ దేవాలయమునందు కుడ్యములు సాధారణకుడ్యములవలె కట్టబడక, మొదట కొన్ని స్తంభములను వరుసగా నిలువబెట్టి పిమ్మట నా స్తంభముల మధ్యభాగములను మూయుటవలన నేర్పడుచున్నవి. ఇట్లు మూయబడిన



౧ ఒక ఆలయ ముఖద్వార శిల్పము



పటము III

౨ ఒక ద్వార బంధము నందలి యొక ప్రక్క శిల్పము (మేగూతి ఆలయము)

భాగములందు చిత్రవిచిత్రముగ జెక్కబడిన శిలా గవాక్షము లమర్చబడియున్నవి (పటము ౪—పటము ౨, చిత్రము ౨). లాడ్ ఖాన్ ఆలయము యొక్క శిల్పరచనావిధానమును జూడ నిది క్రీ. శ. ౪౫౦ ప్రాంతముల గట్టబడియుండవలెనని తోచుచున్నది. ఈ దేవాలయము ముఖమంటపము (Portico) నందు రెండు చక్రాకృతులగు శిలాగవాక్షము లున్నవి. చక్రములయొక్క ఆకులు (Spokes) మత్స్యములవలె నున్నవి. ఇందలి స్తంభములు పెద్దవై ఒక్కొక్కటియు ఒంటిరాతితో జేయబడియున్నవి. స్తంభశిరముమాత్రము వేఱురాయి.

పశ్చిమచాళుక్యులు వైష్ణవులైనందున ఆర్యపురములోని ఆలయము లన్నియు విష్ణ్వాలయములయి యుండినవి. కాలక్రమమున వానిలో ననేకములు లింగాయతుల స్వాధీనమయి వాటియందు నంది, లింగము స్థాపింపబడి శివాలయములుగను, దుర్గాలయములుగను మార్చబడినవి.



1



2



3



4

6



5



పటము IV శిలాగవాక్షములు

## కొంటగుడి

ప్రతిసంవత్సరము నవరాత్రోత్సవములలో త్రిశూలము, లేక కొంటను గ్రామసరిహద్దులకు గొనిపోవు నధికారముగల యొకడిందు నివసించుచుండినందున నీయాలయమునకు కొంటగుడి యనుపేరు గలిగెను. ఈ గుడిపై చాళుక్యుల శిల్పరచనయందు, శిఖరరచనయొక్క శైశవదశను దెలియజేయునట్టి శిఖరము, ఎత్తులేనిది కలదు. ఈశిఖరము తొలుదొలుత ఆలయముతో గట్టబడక కొన్నిశతాబ్దములవెనుక కట్టబడినదై యున్నది.

ఈదేవాలయపు కప్పు లోపలివైపు (Ceiling) తొమ్మిదిగడులుగలిగి అందు మధ్యగడియందు బ్రహ్మయు తక్కిన ఎనిమిదిగడులయందు అష్టదిక్పతులును చెక్కబడి యున్నారు. కొంటగుడికి ఆనుకొనియుండు మఱియొక ఆలయమున అందములగు త్రిమూర్తుల శిల్పములు గలవు (పటము ౫). ఇంతవరకును పేర్కొనబడిన ఆలయములు శిఖరరహితములు. చాళుక్యశిల్పకౌశలము వృద్ధిజెందిన వెనుక కట్టబడిన శిఖరయుతములగు ఆలయములలో దుర్గాలయము, హుచ్చిమల్లిగుడి, మేగిలాతిగుడి (పటము ౧, చిత్రములు ౪, ౫) అనునవి ముఖ్యములు. ఇందు మేగిలాతిగుడియందలి శిఖరము శిథిలమైనది. దీనియందు రెండవపులకేశికాలమునకుజేరిన శకవర్షము ౫౫౬ నకు సరియగు క్రీ. శ. ౬౩౪ సంవత్సరమునాటి శాసనమొకటి కలదు.

ఇవికాక ఆర్యపురమున నింక ననేకదేవాలయములు, వాటి ప్రతిష్ఠాతలి కీర్తిని ఆచంద్రార్కము చాటగలవి కలవు. ఇట్టి పురాతనదేవాలయాదికములు హైందవశిల్పకళాబోధకములుకాన నివి కల పూర్వప్రసిద్ధనగరములనుగుఱించి తెలిసికొనుట సంతోషదాయకము.



విష్ణువు



బ్రహ్మ



మహేశ్వరుడు    పటము V



# షిలాంగు నగరము

బి. సుబ్రహ్మణ్యంగారు

షిలాంగు ఆసామునకు రాజధాని. ఈనగరము సుందరోద్యానములచేతను, రమణీయప్రకృతి విలాసములచేతను, హృదయాకర్షకములగు జలపాతములచేతను ఒప్పుచుండును. ఆసాముప్రభుత్వమువా రచ్చట నివసింతురు. ఆసాము-బంగాళము రైలుపదారియందలి గౌహతికి సుమారరువదినాలుగు మైళ్లదూరములో నీనగరముకలదు. గౌహతినుండి యిచ్చటకు చదునయిన రోడ్డొకటున్నది. ఆరోడ్డు కొంతవడి ఎక్కుడుగను, కొంతమేరదిగుడుగను



'నాంగ్‌పో' (స్టేషను) గౌహతి షిలాంగుల మధ్యోమార్గమున నున్నది



షిలాంగు నగరము

నుండి రెండుప్రక్కల చక్కని నీడనిచ్చు వృక్షములును, గుబురుకొనిన పొదరులును, నిమ్నోన్నతములగు పర్వతపార్శ్వములును గలిగి కన్నులపండువుగా నుండును. ఆ బాటపయి మోటారుబండ్లలో ప్రయాణించువారు చల్లనిగాలికి సొక్కుచు పరమానందమును జెందుదురు. గౌహతిషిలాంగులకు నడుమ 'నాంగ్‌పో' అనుచోట రాకపోకలు గావించు బండ్లు సంధించును. అక్కడనుండి అటు పోవుబండ్లు అటు, ఇటు పోవుబండ్లు ఇటు సాగును. ఒకేమారు రాకపోకలుజరుపు మోటారుబండ్లు ఒండొంటని డీకొని విరుచు అపాయములపాలు కాకుండుటకై యీయేరుపాటు చేయబడెను.



నాంగ్‌పోవద్ద మోటారుదృశ్యము



నాంగ్‌పో ... 

'నాంగ్ పో'వద్దనుండి రోడ్డు కొండపై కెక్కును. అచట విశ్రాంతిభవనము (Rest House)ను, పండ్లు, తినుబండములూ మొదలయినవి లభించు దుకాణములును గలవు



శాసన భా భవనము

షిలాంగు సముద్రముమట్టమునకన్న ౫౦౦౦ అడుగుల ఎత్తుననున్నది ఆసాముప్రభుత్వమువారు వేసవి కాలమునను, వానకాలమునను ఇచ్చట నివసింతురు ఏడాదిపొడుగునను శీతోష్ణస్థితి (Climate) పరిమితముగ నుండును నగరమే 'షిలాంగు'శిఖరమునకు ఐదుమైళ్లి



సర్ స వి ర మనుగారి భవనము

దూరమున యోడో (Yeodo) మైదానమున నున్నది షిలాంగుశిఖరము ఎత్తు ౬౪౫౦ అడుగులు నగరము గుట్టలపైన కట్టబడెను అచటి జనులసంఖ్య ౨౧౦౦౦ దానినిండుగ మంచిరోడ్లు, అందములయిన తోటలు నున్నవి విద్యుద్దీపములు విరివిగ గలవు. ప్రభుత్వకార్యాలయమునకు చేరువ 'వార్డ్సు' అనుసరస్సు (Wards lake) గలదు అది చాల మనోహరముగ నుండును నగరవాసులెల్లరు విహారమునకయి సాయంసమయమున



'వార్డ్సు' సరస్సు ఒకచివర

నచ్చటకు బోవుదురు నగరమున దేవదారువృక్షములు విస్తారము అవి స్నిగ్ధచ్ఛాయములు, ఉన్నతములు నయి పెక్కుతావుల గుంపులుగుంపులుగా నుండును నగరప్రాం



'వార్డ్సు' సరస్సువెనుక ప్రభుత్వభవనము

తముల జలపాతము లనేకము లున్నవి వానిలో 'బీడను' జలపాతమునుండి విద్యుచ్ఛక్తి యుత్పత్తి కావింపబడుచున్నది గుఱ్ఱపుపందెముల మైదానములు, బంతిఆటలతోటలు మొదలయిన వ్యాయామరంగములు చాలగా నుండును

షిలాంగుప్రజలు 'ఖాసీ'లనబడుదురు వారువీరులు, ఇండో-చైనీయుల సంతతివారు వీరు౧౮౩౩-వసంవత్సరము



స్వీట్ జలపాతము



ఖాసీ స్త్రీలు



'వార్డ్సు' లేకుపై వంతెన

ప్రాంతములకు ఆంగ్లేయుల అధీనమునకు వచ్చిరి షిలాంగు ప్రాంతము చిన్నచిన్న స్వతంత్రరాజ్యములు కొన్ని గలవు రాజులకు 'సైయము'లని పేరు అట్టివిప్పటికి సుమారు ఇరువదియైదు గలవు వారికింకను నొక్కమాదిరి స్వాతంత్ర్యమునుగలదు ఈరాజ్యములలో పెద్దదానియందు నలువదివేలు జనులు గలరు దాని సంవత్సరాదాయము ఇరువదియైదువేల రూపాయలు చిన్నదాని జనసంఖ్య వేయి, ఆదాయము ౧౨౫౦ రూపాయలు



చిరాపుంజి మసుమ్మయిపాతము



చిరాపుంజి త్రాటబాట (Rope way) స్టేషను

'ఖాసీ'లు పొట్టివారు, దిట్టముగ, అందముగ, మంచి ఆరోగ్యము గలిగియుండురు క్రమముగ వీరిజాతి సంకరమును జెంది నశింపు దిక్కు తిరిగినది మలయాళమునందు వలె ఇచ్చట స్త్రీలు వారసులు కావున కుటుంబనిర్వాహణాధికము స్త్రీలయధీనము స్త్రీలు జీవయాత్రకయి ఎక్కువ పాటుపడుదురు పురుషులు సోమరులు వీరిమతము కడుప్రాచీనము సర్పములు, శక్తులు వీరికి ఆరాధ్యదైవ

ము. పురుషులకంటె ఆడువారు చాలమంది చదవరు. వీరికి 'పరదా' లేదు. రజస్వలానంతరవివాహములకు, విధవావివాహములకు చెల్లుబడి గలదు. ఇచ్చట భర్తలత్తవారింట భార్యతో కాపురము చేయబోవుదురు.

[illegible] జలపాతము

షిలాంగునకు ముప్పది మైళ్లదూరమున నున్న 'చరాపుంజి' అను ప్రదేశమున వాన అత్యధికముగ కురియును. ఇండియాలో నింక ఎక్కడను ఇంత ఎక్కువగ వానకురియదు. పూర్వమిదియే ప్రభుత్వనివాసస్థానముగ నుండెను. వాన యధికమగుటచే జనులు అచట నివసించజాలని కారణమున షిలాంగు ప్రభుత్వనివాసస్థానమయ్యెను. ఇచట రెండు జలపాతములున్నవి. వానిలో 'ముస్మయి' జలపాతము చాల ఎత్తయిన కొండనుండిపడును. ఈ కొండ ప్రపంచములో ఎత్తయినవానిలో నాలవది కాదగును. వేయిన్నెనమన్నూరు అడుగులు ఎత్తుగల కొండకొమ్మపయినుండి జలము బహుధారలుగా పడుచుండును. ఇది 'చరాపుంజి'కి రెండు మైళ్ల దూరమున నున్నది. ఖాసీ కొండలిచ్చట నాగిపోవును. కొన్ని ఎండవేళల నీ జలపాతమంతయు మిలమిల మెరయుచు ఆపాతరమణీయముగ కాన్పించును. అట్టివేళల క్రింది 'సల్హాట్' మైదానమును పెక్కుమైళ్లమేర జలమయముగ-తరళతరళముగ కాన్పించుచుండును. అచటివరకు రోడ్డుకలదు. తరువాత క్రిందికిపోవుటకు కాలిత్రోవ యున్నది. సామానులు మోయుటకు, మనుష్యులను మోయుటకు కూలీలచ్చట దొరకుదురు. గుట్టలపైనుండి గుట్టలపైకి, క్రింది లోయలలోనికి సరకులు వగైరాలను (ఉక్కు) త్రాళ్లబాటల (rope ways) సాహాయ్యమున కొనిపోవుటకేర్పాటు గలదు. ఇది ప్రయాణికులకు మంచి యుపకారమును చేయుచున్నది.



[illegible] జలపాతము



[illegible]



స్ప్రెడ్ ఈగల్ జలపాతము

# ఉపదేశము

తి. వ నారాయణస్వామిగారు

జననం బందితి హేయమాహిషకరీషవ్యాప్తమౌ పెంటప
ట్టున, మే న్వొంచితి నీచసత్త్వమృగయాటోపంబుచే; నిప్డు భూ
పనిశాంతంబుల నుందు నే ననుచు గర్వం బందె దౌరా భవ
జ్జననాదుల్మది నెంచి గర్వపడుటల్ చాలింపుమా కుర్కురా!

ధనమును రక్షసేయుదు ముదంబున నేన యటంచు నెమ్మదిన్
దనియుదువో? నిరంతరము ద్వత్పరిరక్ష్యములైన విత్తముల్
విను మితరాశ్రయంబు లవివేకి! నిజమ్ము ధనమ్ముపట్ల నీ
యనుభవ మభ్రతామరస మానని యెంచుము కుర్కురాధమా!

ఎ వ్వొకఁ డబ్బినంతనె మహేంద్రునిప్రాభవ మబ్బినట్లు లో
నమ్ముచు నీదుపోషకునినైనఁ గనుంగొన వబ్బకున్న వా
లమ్ముఁ జలింపఁజేయుచు నిలం బడి పొర్లుచుఁ గుక్షిఁ జూపి స్వా
నమ్ములఁ జేసి యన్యజనునైనను జేరుదు గుర్కురాధమా!

నిశల సమస్తరక్షణము నేన యొనర్తు నటందు గర్వివై
శశి మొకఁ డొంటి మార్కొనినఁ జయ్యనఁ బౌరుష మేది చూడ్కులన్
విశదముగాఁగ దైన్యము స్రవింపఁగ బాష్పము లింటఁ జేరి నీ
వశనము మాని కూయిదు దహో! వరపౌరుష మన్న నీదియే.

బిరబిర వాలముఁ ద్రిప్పుచుఁ - బరువెత్తుదు విండ్లకును బ్రదపాగుణ మత్తి నీ
వరిగెడుకార్యం బెదియో - యెఱుఁగఁబడదు నిజము తెల్ప నింద్రాదులకున్.

విశ్వాసంబునఁ జేర నేఁగుదువు సేవింపంగ నెవ్వారినే
న్బశ్వాదుల్దరిఁ జేర నోర్చుకొను నాభవ్యాత్ము లేతెంచు ని
న్నో శ్వానంబ! శిలాప్రహారములచే నోడింతు రెవ్వారు ని
న్నాశ్వాసింపరు తావకీనమగు పుణ్యాదేశ మేరీతిదో!

అవసర మెంచి యెట్టివ్యసనావిలచిత్తుఁడో నిన్నువంటి జం
తువులను జేరఁదీసె నని తోడనె గర్వము నందఁబోకుమా
సవనములం దనర్హతను జాటుచు నిన్ను మహీసురవ్వులా
సవిధమహిం గనుంగొనిన సల్పెడుకార్యము లెద్ద నెంచుమా.

మన మితరార్థవంచనసమర్థము ; గాత్రమొ పూతిగంధిశా
దనిరతరూషితంబు; శ్రుతికర్కశమౌ నినదంబు; చెయ్వులో
తనుతరసత్త్వమారణవిధానచణంబులు ; హీనజాతివౌ
నినుఁ గని రోఁతఁ జెందకను నేర్చునె యాదృతిఁ గాంచ నెట్టిఁడున్ ?
పని నాస్తి, తీరుబడియో - కనుపింపదు ; నిలువఁబడ వొకక్షణమైనన్
పనిమాని నిను సృజించిన - వనజభవున కుచితమైన పని లేదొక్కో !

---

# సదుపదేశము

కావ్యకలానిధి, పిసుపాటి చిదంబరశాస్త్రిగారు

గౌరవంబు ధనముఁ గావు శాశ్వతములు - శాశ్వతంబు జ్ఞానసౌరభంబ
కాన దాని నొందఁ గలుగుట కనువైన - పదవి నేను చెప్ప చదువు వత్స !

నీవుగాని మఱియు నీసంతతియుఁగాని - మాతృభాష నెపుడు మఱవవలదు
కన్నతల్లి నెట్టి కఠినకర్ముండేని - మఱచిపోవునొక్కొ ? మహిని వత్స !

మాతృభాష మూలమంత్రంబుగాఁ జేసి - కొని గ్రహింపఁజూచికొనుము గౌణ
ముగను దేశభాష తగ దన్యభాషల - పైని వాంఛ యెన్నఁడేని వత్స !

ధర్మమార్గమునుండి సుంతయును బుద్ధి - తొలఁగనీదు దురాశచేఁ గలఁగనీదు
కావుననె మాతృభాషావికాసమునకు - సమము గానేర దెట్టిభాషయును వత్స

స్మృతిలోన నుంచికొను మిది - మతి గలఁగినయపుడుగూడ మఱవకుమీ సం
స్కృత మొకటియె మన కులదై - వత మయ్యది లేని బ్రదుకు వ్యర్థము వత్సా !

కలవు వేదశాస్త్రములు పురాణంబులు - గలవు స్మృతులు గలవు కావ్యములును
నెల్లవిద్య లున్న వివి యాని యన నేల - మాతృభాషలోన నోతనూజ !

సకలభాషలకును బ్రకృతి యటంచను - సుప్రతిష్ఠ గనిన సుస్వరూప
కాన సర్వశక్తికారణ మితరంబు - గలదె మాతృభాషకంటె వత్స !

మనమునుండు సంశయము మాన్చు, వివేకము గల్గఁజేయు, నెం
దును వ్యవహారకౌశలము నూల్కొలుపున్, నిజమైన మార్గమున్
గనుఁగొనుశక్తి నిచ్చు నధికంబుగ నిట్టి స్వమాతృభాషయున్
ధనమును గోలుపోయినయతండె దరిద్రుఁడు ధాత్రి నాత్మజా !

ప్రాణ మొకవైపునను మాతృభాష యొక్క - దిక్కునను నుంచి తూఁపఁగాఁ దేలఁగలదు
ప్రాణ, మిదెచూవె పరమార్థమైన మాట - దీని భావంబు తెలిసి వర్తిలుము వత్స !

---



# వరప్రసాది

అవ్వల వీరవెంకట జోగయ్యశాస్త్రిగారు

శ్రీల శివరాత్రి భక్తపురుషౌఘవనాంతదవాగ్నిహోత్రమై
విలసితముక్తిదంబునయి విస్తృతదుఃఖలతాలవిత్రమై
తలఁపఁగ దుర్మదాంధులకుఁ దద్దయు భీకరకాళరాత్రమై
లలి జనుదెంచె సాధుజన రంజితమోక్షపథానులక్ష్యమై.

జనముల్ సప్తనదీమహోదకములన్ స్నానంబుఁ గావించుచున్
జనుచున్ పత్రఫలాదులం గొనుచు ద్రాక్షారామభీమేశ్వరున్
గని యర్చించి, భజించి, సంతసమునన్ గానుకల్ నివేదించుచున్
ఘననీరాజన మిచ్చియేఁగ నట వేడ్కన్ భక్తియుక్తంబుగన్.

పుత్రకాంక్షతోడఁ బురుహూతవందితుఁ - జేరి మ్రొక్కి నొక్క వారిజాక్షిఁ
గాంచి, తన యవస్థఁ గానని విశ్వస్త - భీమవిభుని పుత్రభిక్షఁ గోరె.

గోలతనమున నన్యంబుఁ గోరికొనక - కొమరుఁ గోరిన నా బాలకోర్కెఁ దీర్ప
విమలకరుణార్ద్రహృదయుఁడై భీమవిభుఁడు - చూలుధరియింపఁగాఁ జేసెఁ జోద్యమలర.

* * * * *

బాగుగ గర్భచిహ్నములు పైకొనినన్ గ్రహియించి, దుష్టురా
లీగతిఁ బాపకృత్య మొనరించెఁ గులంబున కగ్ని పెట్టె నిం
కేగతి దీని నింక భరియింతు మటంచు భజింపఁ, గట్టఁగా,
ద్రొఁగఁగనీక నెల్లరు యథావిధిగా వెలివెట్టి రెంతయున్.

అంతఁ గొన్ని నాళ్ల కంచితశుభలగ్న - మందుఁ గనియె నొక్క సుందరాంగు
నరయ దుఃఖజలధి దరిఁ జేర్పఁగలవాని - భీమనాహ్వయమున వెలయువాని.

వరుసగ శుక్లపక్షపు క్షపాకరురీతి దినాభివృద్ధిగాఁ
బెరుఁగుచుఁ దోడిబాలకుల వేడుక నాటల నోడఁబుచ్చుచున్
బురమున నెల్లరున్ విధవపుత్రున కింతటి చాకచక్య మే
వరుస జనించె నంచుఁ దలఁపన్ జరియింపుచునుండ నిచ్చలున్.

కలితమహానురాగపరికల్పితసౌధఘనాభ్రసంతతుల్
సలలితరీతిచిత్తజలజంబుల ముంపఁగ హర్షబాష్పముల్

కొలుకులనుండి జాఱు జనకుల్ దమ పుత్రుల నంకసీమల
న్నిలిపి వినోదమందుచు వినిర్మలవృత్తిఁ జరింప నెంతయున్.

కాంచి యొకనాఁడు సమ్మోదకలితమైన - చిత్త ముత్తలపడఁ దల్లిఁ జేరి—"జనని!
యేఁడి మాతండ్రి, చూపు మిం దెందుఁ గలఁడొ - చని రయంబున నంకసీమను వసింతు.

ఏలొకొ రాఁడు మజ్జనకుఁ, డేక్రియ నంకముఁ జేర్చి ప్రేమతో
లాలనసేయఁ డంచితకరద్వయిఁ జల్లగఁ గౌఁగిలింపఁ డి
బ్బాలురకెల్లఁ గల్గు పితృభాగ్యము నా కొనగూర్పఁ డేల?—జా
గేల—అదేల తల్లి! వచియింపవు, నామది తల్లడిల్లెడిన్."

అనుచును బాలుఁ డాడ హృదయాబ్జము జల్లుమనంగ బాష్పముల్
కనుఁగవనుండి డిగ్గి పెనుకాలువలై ప్రవహింపఁ "బుత్ర! యే
మని వచియింతు నీకు ననుమానము వీడఁగ దక్షవాటికిన్
జను మల భీమనాయకుఁడె సత్యము నీజనకుండు—పొ" మ్మనన్.

మనమున నానందం బది - పెనఁగొన జనయిత్రి వీడి విమలాత్ముం డౌ
చును ద్రాక్షారామము నే - చని భీమేశ్వరుని పాదసన్నిధి నంతన్.

నిలిచి యిట్లను—"మా తల్లి నీవె నాదు - తండ్రివని పల్క - వచ్చితి దయ మదీయ
నేత్రపర్వంబుఁ గావింప నేఁగుదెంచి - విమలమతిఁ గాంచుమయ్య శ్రీభీమలింగ!
ఈవు నిజముగ వచ్చి నన్నేలకున్న - నీదు కౌఁగిట ననుఁ జేర్చి నిమురకున్న
నేనె నీతండ్రివని వచియింపకున్న - నిజము నీచెంతనే మరణింతు" ననిన—

రక్షోవీరవిభంజనుండు హరుఁ డారాజార్ధజూటుండు ఫా
లాక్షుం డీశ్వరుఁ డంగజారి యభవుం డారాజరాజేశుఁ డా
ద్రాక్షారామపురీనివాసుఁ డగజాప్రాణేశుఁ డేతెంచి ప్ర
త్యక్షం బయ్యె ననంతదివ్యకరుణాధాముండు సోముం డొగిన్.

అంత సద్భక్తి హస్తద్వయంబు మోడ్చి - సాగిలంబడి దివ్యసుజ్ఞాన మలర
స్తుతి యొనర్పఁగ నర్భకుఁ జూచియీశుఁ - డమలకరుణార్ద్రహృదయుఁడై యనియె నిట్లు:
"తనయ! లెమ్ము నాదు దర్శన మైనంతఁ - గలిగె నీకు జ్ఞానగరిమ, యింక
నాడినట్టి దాట పాడినయది పాట - యౌను పొ" మ్మనంగ నరిగె నతఁడు!

*    *    *    *    *    *

అప్పంబు లన్నింటిఁ గప్పలుగాఁ జేసె నన్నరాశిని సున్నముటులు చేసె,
పోతవిభుని మృతిం బొందించె బ్రతికించె నిల ప్రోడునకు చిగురెత్తఁ జేసె,
లీల నారాజకళింగగంగును దిట్టి ఖిన్నుఁడౌ వీధిఫకీరుఁ జేసె,
తెలుఁగురాజేంద్రుల తేజంబు హరియించి స్థిరముగా తనబానిసీలఁ జేసె,
తిమ్మి బ్రహ్మిని, బ్రహ్మిని తిమ్మిఁ జేసెఁ - దిట్టి దీవించె నెంతటిదిట్ట యౌర
దక్షవాటికభీమేశతనయుఁడైన - భీమకవినాథుఁ డాతనిఁ బ్రీతిఁ దలఁతు!

---



# విభీషణశరణాగతి

మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు

నమ స్తస్మై కస్మై చన భవతు నిష్కించనజన
స్వయంరక్షాదీక్షాసమధికసమిద్ధానయశసే,
సునాశీరస్వైరక్షణకుపితశాపాయుగవధూ
దృష త్తాదుర్జ్ఞాత ప్రశమన పదామ్భోజరజసే.

"అజో౽పిస న్నవ్యయాత్మా భూతానా మీశ్వరో౽పి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే"

(పుట్టుకలేనివాఁడనైనను, నిర్వికారుఁడనైనను, సర్వభూతేశ్వరుఁడనైనను నాప్రకృతిని నే నవలంబించి నామాయచేఁ బుట్టుచున్నాఁడను. సాధుజనరక్షణముకొఱకు, పాపాచరణరతులను నశింపజేయుటకు, ధర్మమును లోకమందు నెలకొల్పుటకుఁ బ్రతియుగమందు నే నవతరించుచున్నాఁడను) అని సర్వేశ్వరుండగు శ్రీకృష్ణుఁడు గీతలలోఁ జెప్పియున్నాఁడు. ఇదియే భగవదవతార ప్రయోజనము; ఇదియే భగవదవతారరహస్యము.

"జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సో౽ర్జున!"

అని భగవదవతార రహస్యజ్ఞానము మోక్షహేతువని గీతలలోఁ జెప్పఁబడియున్నది భగవదవతారములు పెక్కులున్నవి అవియన్నియు పండితైకవేద్యములు. జనసామాన్యమునకుఁ దెలిసినవి పదియవతారములే.

వానిలో మత్స్యకూర్మవరాహనారసింహాద్యవతారము లెనిమిది ప్రయోజనమాత్రపర్యవసితములు. జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్య తేజః ప్రభృతిషడ్గుణములు పూర్ణముగా నుండుటవలనను, మనుష్యసజాతీయములై యీలోకమం దవతరించి సకలమనుజనయనగోచరములై సేతునిర్మాణ జటాయుమోక్షప్రదాన కాళియమర్దన గోవర్ధనోద్ధరణ దుష్టరాక్షససంహరణాద్యమానుషచేష్టావిరాజితము లగుటవలనను, భూమిపై చిరకాలస్థాయులగుటచేతను రామకృష్ణావతారములు సకలముముక్షుజనోపాస్యములై ప్రసిద్ధి నొందినవి ఈ యవతారద్వయములో శ్రీరామావతారము సౌశీల్యము, సౌలభ్యము, ఆశ్రితవాత్సల్యము, స్వప్రతిజ్ఞా నిర్వహణము, పితృమాతృభక్తి, ఏకపత్నీవ్రతము, శరణాగతపరిత్రాణము, పరదుఃఖాసహిష్ణుత, క్షాంతిమొదలగు సకలకళ్యాణగుణములకాటపట్టు ఇందుకు వాల్మీకిరచించిన శ్రీ రామాయణమే పెద్ద ప్రమాణము

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"

(వేదవేద్యుఁడగు పరమపురుషుఁడు దశరథపుత్రుఁడై జనింపఁగా నావేదము వాల్మీకిద్వారా రామాయణరూపముగాఁ బరిణమించెను) ఈరామాయాణము ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదోపపత్తి అను షడ్విధతాత్పర్యలింగములచే శ్రీరామచంద్రుఁడు సాక్షాత్పరబ్రహ్మ మని స్థాపించుచున్నది

ఈ శ్రీరామాయణమునకు దీర్ఘశరణాగతియని పేరు. దీనిలో నాదిమొదలుకొని యంతమువరకు శరణాగతిపరంపర లున్నవి. వానిలో ముఖ్యములైనవి యెవ్వియనఁగా,

౧ దశరథునియజ్ఞమందు హవిర్భాగమును స్వీకరించుట కేతెంచిన శ్రీమహావిష్ణువును రావణవధార్థమై దేవతలందరు ప్రార్థించుట—

"ఏతస్మిన్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః,
శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః.

తమబ్రువ న్సురా స్సర్వే సమభిష్టూయ సన్నతాః,
త్వాం నియోక్ష్యామహే విష్ణో లోకానాం హితకామ్యయా.

రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాధిపతేః ప్రభో,
విష్ణో! పుత్రత్వ మాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్.

తత్ర త్వం మానుషో భూత్వా ప్రవృద్ధం లోకకంటకమ్,
అవధ్యం దైవతై ర్విష్ణో సమరే జహి రావణమ్"(బా. కా.౧౫స.)

౨. వసిష్ఠశాపోపహతుఁడైన త్రిశంకువు తన్ను రక్షింపుమని విశ్వామిత్రుని వేఁడుకొనుట

"త్వామేవ పరమార్తస్య ప్రసాద మభికాంక్షతః,
కర్తుమర్హసి భద్రం తే దైవోపహతకర్మణః.
నాన్యాం గతిం గమిష్యామి నాన్య శ్శరణ మస్తి మే,
దైవం పురుషకారేణ నివర్తయితు మర్హసి"

(బా. కా. ౫౮ స.)

౩ శునశ్శేపుఁడు తనతండ్రియగు ఋచీకునిచే యాగపశువుగా విక్రయింపఁబడి తన కీయపాయమును తొలఁగింపుమని విశ్వామిత్రుని కాళ్లపైఁ బడుట —

"వివర్ణవదనో దీన స్తృష్ణయాచ శ్రమేణ చ,
పపాతాంకే మునే రాశు వాక్యం చేద మువాచహ
న మేఽస్తి మాతా నపితా జ్ఞాతయో బాంధవాః కుతః,
త్రాతు మర్హసి మా సౌమ్య ధర్మేణ మునిపుంగవ!
త్వం మే నాథో హ్యనాథస్య భవ భవ్యేన చేతసా,
పితేవ పుత్రం ధర్మాత్మన్ త్రాతు మర్హసి కిల్బిషాత్."

(బా. కా ౬౨ స)

౪. వనప్రస్థానసమయమందు లక్ష్మణుఁడు తన్నుఁగూడ సేవకునిఁగా నరణ్యమునకుఁ గొనిపొమ్మని శ్రీరామచంద్రుని సన్నిధిలో శరణాగతి నొనర్చుట —

"స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః,
సీతా మువా చాతియశా రాఘవం చ మహావ్రతమ్
యది గంతుం కృతా బుద్ధి ర్వనం మృగగజాకులమ్,
అహం త్వానుగమిష్యామి వన మగ్రే ధనుర్ధరః.
కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే,
కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే.
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే,
భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యసే"

(అయో. కా. ౩౧ స)

౫. చిత్రకూటమందు స్వామి యుండఁగాఁ బట్టాభిషేకార్థమై అయోధ్యకు విచ్చేయుఁడని భరతుఁడు శరణ మొనర్చెను —

"ఏభిశ్చ సచివై స్సార్ధం శిరసా యాచితో మయా,
భ్రాతు శ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తుమర్హసి,
రాజ్యం ప్రాప్నుహి ధర్మేణ సకామా న్సుహృదః కురు,
ఏవముక్త్వా మహాబాహు స్సబాష్పః కైకయీసుతః"

(అయో. ౧౦౮ స)

కాని బ్రహ్మాస్త్రమువలె నమోఘమైన భరతుని శరణాగతి విఫలమగుటకు హేతు వేమియని మాపాఠకు లిచట శంకింపవచ్చును కాని మొట్టమొదట దేవతలందరు రావణవధకొరకు చేసినప్రపత్తిని సఫలము చేయవలసియున్నది గావున రాజ్యప్రతినిధియగు పాదుకల నిచ్చి భరతుని ప్రార్థనను మన్నించి రావణవధానంతరము రాజ్యాభిషిక్తుఁ డగుటచే భరతుని శరణాగతి వ్యర్థము కాలేదు.

౬. స్వామి దండకారణ్యమునకుఁ బోయినపు డచ్చటి ఋషులు రాక్షసబాధ కోరువ లేక రాక్షసబాధానివారణార్థమై శరణాగతిఁ జేసిరి.—

"ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనామ్,
హతానాం రాక్షసై ర్ఘోరై ర్బహూనాం బహుధా వనే.
పంపానదీనివాసానా మనుమందాకినీ మపి,
చిత్రకూటాలయానాంచ క్రియతే కదనం మహత్.
ఏవం వయం నమృష్యామో విప్రకారం తపస్వినామ్,
క్రియమాణం వనే ఘోరే రక్షోభి ర్భీమవిక్రమైః
తత స్త్వాం శరణార్థంచ శరణ్యం సముపస్థితాః,
పరిపాలయ నో రామ వధ్యమానా న్నిశాచరైః"

(అరణ్య. కాం. ౬ స)

౭. సుగ్రీవుఁడు లక్ష్మణకోపోపశాంతికొరకు శరణాగతి, జేయుట.—

"కృతాపరాధస్య హి తే నాన్య త్పశ్యా మ్యహం క్షమమ్,
అంతరేణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్"

(కిష్కిం-౩౨ స)

౮. అమ్మవారివిషయమై మహాపరాధ మొనర్చిన కాకాసురుఁ డిషీకాస్త్రముచేఁ దఱుమఁబడినవాఁడై ప్రాణభీతినొంది ముల్లోకములు తిరిగి రక్షకునిఁ గానక మరలి వచ్చి స్వామిపాదములపైఁ బడి రక్షించుమని వేఁడుకొనుట.—

"స పిత్రాచ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః,
త్రీన్ లోకా న్సంపరిక్రమ్య తమేవ శరణం గతః.
స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్,
వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"

(సుం కా. ౩౮ స.)

౯. విభీషణు శరణాగతి ముందు ప్రతిపాదింపఁబడును.

## శరణాగతి నిరూపణము

స్వరక్షణమందు స్వప్రయత్నమును మానుకొని సర్వేశ్వరుఁడే సర్వవిధములఁ దనకు రక్షకుఁడని నమ్మియుండుట శరణాగతి యనం

బడును దీనికి శరణవరణము, ప్రపదనము, ప్రపత్తి, భరన్యాసము, న్యాసము మొదలగు నామాంతరములు గలవు. ఇది వేదమందు, ఉపనిషత్తులయందు, భగవన్ముఖోదితమగు శ్రీపాంచరాత్రమందు, శ్రీమహాభారతమందు సహస్రముఖములుగాఁ బ్రతిపాదింపఁబడియున్నది. ఇందుకుఁ బ్రమాణములను చూపెదను — శ్రుతులు.— "యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్, యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, త మహ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే", "బ్రహ్మణే త్వా మహస ఓ మి త్యాత్మానం యుంజీత, ప్రయతపాణి శ్శరణ మహం ప్రపద్యే, సత్యం ప్రపద్యే, ఋతం ప్రపద్యే, అనార్తాం దేవతాం ప్రపద్యే". మనుస్మృతి మొదలగువానిలో,

"సర్వోపాధివినిర్ముక్తం క్షేత్రజ్ఞం బ్రహ్మణి న్యసేత్,
ఏతత్ జ్ఞానంచ జ్ఞేయంచ శేషోఽన్యో గ్రంథవిస్తరః.
సర్వేషామేవ లోకానాం పితా మాతాచ మాధవః,
గచ్ఛధ్వ మేనం శరణం శరణ్యం పురుషర్షభాః."

ఇత్యాదిప్రమాణసహస్రములు కలవు ఈప్రపత్త్యుపాయమునకే చరమోపాయమని పేరు శ్రీకృష్ణభగవానులు యుద్ధమందు స్వజనవధవిముఖుఁడై మనఃకాలుష్యము నొందిన యర్జునునికి గీత లుపదేశించుటలో మొట్టమొదట దేహేంద్రియమనోబుద్ధ్యాదులకంటె నాత్మ విలక్షణమైనదనియు, శాశ్వతమనియు, నిత్యమనియు, సర్వేశ్వరునికి శేషభూతమనియుఁ జెప్పి, కర్మ, వైరాగ్యసహకృతజ్ఞానము, భక్తి మోక్షప్రాప్తికి సాధనములనియు బోధించెను. కాని యర్జునుఁడు వీని నెల్ల విని మనోనిగ్రహము కుదిరినఁగాని యీ యుపాయము లలవడవనియు, వాయువును మూటగట్టుటవలె మనోజయము బహుదుర్లభమనియు, తానందు కధికారి గాననియు మొఱ్ఱపెట్టెను. అందుపై శ్రీకృష్ణుఁడు పదునెనిమిదవ యధ్యాయమందు,

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.
సర్వగుహ్యతమం భూయః శ్రుణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢ ఇతి తతో వక్ష్యామి తే హితమ్."

అని ౬౫. ౬౪ శ్లోకములలోఁ జెప్పి కొనకు—

"సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః."

(ధర్మముల నన్నింటిని అనఁగా నేవి రక్షకములని నీవు భ్రమఁ జెంది యాచరించుచుంటివో వాని నన్నింటిని విడిచిపెట్టి నన్నొకనినే శరణముగ నాశ్రయింపుము. నేను నిన్ను సకలపాపముల నుండి విడిపించుచున్నాను దుఃఖింపకుము) అని చెప్పెను దీనితరువాత మరికొన్ని శ్లోకము లున్నను మోక్షోపాయములగు కర్మజ్ఞానభక్తులలో కొసదియగు ప్రపత్త్యుపాయమును విధించుచున్నది గావున విశిష్టాద్వైతమతసంప్రదాయానుసారముగా నీయుపాయమునకు చరమోపాయమనియు నీశ్లోకమునకుఁ జరమశ్లోకమనియు వ్యవహారము. ఇతరోపాయములు ప్రవృత్తి ప్రధానములు. ఇది నివృత్తిప్రధానము. నివృత్తియనఁగా స్వయత్నమును మాని సర్వేశ్వరుఁడే రక్షకుఁడని నమ్మియుండుట. మన మెంతకాలము స్వరక్షణమునందు స్వప్రయత్నమును మానమో అంతకాలము మనల నీశ్వరుఁడు రక్ష్యకోటిలోఁ జేర్చుకొనఁడు ఈ విషయమందు గజేంద్రుఁడే మనకు నిదర్శనము "మన మీనీటిపురుగును జయింపలేమా" యని సాహంకారుఁడై వెయ్యిదివ్యసంవత్సరములు మొసలితోఁ బోరాడి క్షీణబలుఁడై నిస్సత్త్వుఁడై కొనకుఁ జేయునదేమియు లేక గజేంద్రుఁడు "రావే యీశ్వర కావవే" అని శరణాగతిఁ జేయఁగాఁగదా "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడు" అని భగవద్రక్షణశీలమును బాగుగా నెఱింగిన మహాభక్తుఁడు పోతనామాత్యుఁడు వర్ణించినట్లు భగవంతుఁ డతిత్వరతో మడుగుకడ కేతెంచి నిర్వక్రమగు చక్రముతో నక్రమునుబరిమార్చి మాతంగమును రక్షించినది? జ్వరార్తుఁడై లంఘనములఁ జేయుచున్న కుమారుఁడు జ్వరవిముక్తినొంది క్షుధితుఁడై "అమ్మా నాకాఁకలియగుచున్నది నేఁడైనా నాకింతయన్నముఁ బెట్టవా" అని యడిగినచోఁ దల్లి కీట్లామాట హృదయానందకర మగునో అట్లనే "సర్వజ్ఞోఽపిహి సర్వేశః రక్షాపేక్షా మపేక్షతే" అన్నట్లాతఁడు సర్వజ్ఞుఁడైనను "తండ్రీ! అనన్యగతికుఁడనైన నను రక్షింపు"మని మనము పలుకు ప్రార్థనావాక్యముచే సంతసిల్లి మనలఁ దప్పక రక్షించును అట్లు కానిచో సర్వముక్తిప్రసంగము తటస్థించును "స్వత్వ మాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్" అన్నట్లు సర్వేశ్వరుఁడు స్వామి; చేతను లందఱు నాయన సొత్తు ఈ యుభయులకు స్వస్వామిభావసంబంధము శాస్త్రసిద్ధము సొత్తు చెడుటఁ జూచి స్వామి యుపేక్షించునా?

## శరణాగతిస్వరూపము

ఈశరణాగతి మాహాత్మ్యము పాంచరాత్రసంహితలలో నొకటియగు నహిర్బుధ్న్యసంహితలో నిట్లుపపాదింపఁబడినది —

"అహ మస్మ్యపరాధానా మాలయో ఽకించనో ఽగతిః,
త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనా మతిః.
శరణాగతి రిత్యుక్తా సా దేవేఽస్మి న్ప్రయుజ్యతామ్"

(సర్వాపరాధములకు నేను నివాసభూతుఁడను. అకించనుఁడను; అనన్యగతికుఁడను. నీప్రాప్తికి నీవే నాకుపాయభూతుఁడవు కమ్ము దీనికే శరణాగతియని పేరు ఇది సర్వేశ్వరునియందుఁ బ్రయోగింపఁబడవలెను)

"అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకమ్,
తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః"

(తనవాంఛిత మితరోపాయములచేతను సిద్ధింపనపుడు మహావిశ్వాసపూర్వకముగా నీశ్వరునే యుపాయముగాఁ గోరుట శరణాగతి

యనంబడును. ఆగ్రంథమందే యీ ప్రపత్తిమాహాత్మ్య మిట్లు వర్ణింపఁబడినది.—

"అనేనైవం ప్రపన్నస్య భగవంతం సనాతనమ్,
తస్యానుబంధాః పాప్మానః సర్వే నశ్యంతి తత్క్షణాత్.
కృతాన్యనేన సర్వాణి తపాంసి తపతాంవర!
సర్వతీర్థాస్సర్వయజ్ఞాస్సర్వదానాని తత్క్షణాత్"

(ఈయుపాయముచే భగవంతుని బొందినవానియొక్క సకల పాపములు క్షణములో నశించును తపమొనరించినవారిలో శ్రేష్ఠుఁడా! భగవత్ప్రపన్నుఁడు సకలతపశ్చర్యాఫలమును, సకలతీర్థాటనఫలమును, సర్వయజ్ఞఫలమును బొందును)

ఈప్రపత్తి కంగము లెవ్వియన;
"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్,
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః."

(౧ భగవంతునికనుకూలముగా నడచుకొనుట, ౨. ప్రతికూలమైనవానిని విడుచుట, ౩. ఈశ్వరుఁడు తప్పక రక్షించునని నమ్ముట, ౪ ఈశ్వరుని రక్షకునిగా వరించుట ౫. ఆత్మసమర్పణము, ౬ ఈశ్వరునికిఁ దనదైన్యమును దెలియఁజేయుట.)

ఈప్రపత్తికి దేశకాలప్రకారనియమములు, అధికారిఫలనియమములు లేవు. అనఁగా నీప్రపత్తిని కాశీకురుక్షేత్రాదిపుణ్యస్థలములలోనే చేయవలయుననియు, నితరప్రదేశములయందుఁ జేయఁగూడదనియు జ్యోతిష్టోమాది కర్మలకువలె "వసంతే వసంతే జ్యోతిషా యజేత" అన్నటుల వసంతాదికాలములయందే చేయవలయుననియు, నన్యకాలములలోఁ జేయఁగూడదనియు, స్నానాచమన పవిత్రధారణాది నియమములతో నాచరింపవలయుననియుఁ, దాదృశనియమరహితముగా నాచరింపఁగూడదనియు బ్రహ్మక్షత్రియవైశ్యులే దీని కధికారు లనియుఁ జేతనుఁ డపేక్షించు ఫలములలో నొకానొకఫలమునే యిచ్చుననియు, నన్యఫలముల నీయ దనియు నియమము లేదు. ఈనియమములన్నియుఁ గర్మోపాయమునకే యావశ్యకములు.

ఈప్రపత్తికి విషయనియమమమాత్రమే కలదు. అనఁగా జ్ఞానశక్త్యాదిసకలగుణ పరిపూర్ణుని విషయముననే ప్రపత్తిఁ జేయవలెను గాని తద్వ్యతిరిక్తుల విషయమునఁ జేయఁగూడ దను నియమమమాత్రము కలదు. అశక్తునివిషయమునఁ జేయుప్రపత్తి విఫలమగును. శ్రీరామచంద్రుఁడు గుణహీనుఁడు నశక్తుఁడునగు సముద్రునివిషయమునఁ జేసిన ప్రపత్తి విఫలము కాలేదా?

ఈప్రపత్తికిఁ బ్రకారనియమ మక్కఱలే దనెడునంశము భగవత్ప్రపన్నులైనవారియెడలను జూడవచ్చును. ఎట్లన—ద్రౌపది యేకవస్త్రయై యుండఁగాఁ బ్రపత్తి చేసెను. అర్జునుఁడు యుద్ధరంగమందు నీచులనడుమఁ జరమశ్లోకార్థమును వినెను కావునఁ జేతనునికిఁ బ్రపత్తిఁ జేయుట కుద్దేశము పుట్టినసమయమందు యథావస్థితుఁడై ప్రపత్తిఁ జేయవచ్చును.

క్షత్రియులైన ధర్మరాజాదులు, స్త్రీయైన ద్రౌపదిఁ, దేవరూపమును దాచుకొని పక్షిరూపము ధరించి అమ్మవారివిషయమై మహాపరాధముచేసిన కాకాసురుఁడు, క్రూరసర్పజాతియందుఁ బుట్టి ప్రతికూలుఁడైన కాళీయుఁడు, తిర్యగ్జాతి యయ్యు ననుకూలుఁడైన సుగ్రీవుఁడు, నిత్యవిభూతినుండి భగవత్కైంకర్యార్థమై స్వామితో నవతరించిన యనంతాంశసంభూతుఁడగు లక్ష్మణస్వామి మొదలైనవారందరు జాత్యాదినియమములు లేకుండఁ బ్రపత్తి నవలంబించుటచే నీయుపాయమున కధికారినియమము లేదనునంశము స్పష్టమగుచున్నది. జ్ఞానశక్తి సౌలభ్యసౌశీల్యాదికల్యాణగుణపూర్తి యెవనియందుండునో వానివిషయమందే ప్రపత్తిఁ జేయవలయును. ఇదియే విషయనియమమని చెప్పఁబడును. సముద్రుఁడు గుణపూర్తిలేనివాఁ డగుటచేతనేకదా యతనియెడల శ్రీరామచంద్రుఁ డొనరించిన శరణాగతి ఫలింపక వ్యర్థమయ్యెను.

## విభీషణశరణాగతి

రావణుఁ డొకదినంబునఁ దననివాసస్థానంబైన లంకలో మిత్రామాత్యపురోహితకుమారవర్గపరివేష్టితుండై పేరోలగంబునసుండి మంత్రాలోచన మొనరించుచుండఁగా విభీషణుఁ డాసభ కేతెంచి సోదరుఁడగు రావణుని క్షేమమును గోరినవాఁ డగుటచే నిట్లు పలికెను.

"యావన్న లంకాం సమభిద్రవంతి వలీముఖాః పర్వతకూటమాత్రాః,
దంష్ట్రాయుధాశ్చైవ నఖాయుధాశ్చ ప్రదీయతాం దాశరథాయ మైథిలీ.
యావన్న గృహ్ణంతి శిరాంసి బాణా రామేరితా రాక్షసపుంగవానామ్,
వజ్రోపమా వాయుసమానవేగాః ప్రదీయతాం దాశరథాయ మైథిలీ.
కో బ్రహ్మదండప్రతిమప్రకాశా నర్చిష్మతః కాలనికాశరూపాన్
సహేత బాణాన్ యమదండకల్పాన్ సమక్షముక్తాన్ యుధిరాఘవేణ."

ఇట్లు విభీషణుఁ డెన్నఁ హితోపదేశము చేసి వానిచేఁ బరుషితుఁడై —

"ఉత్పపాత గదాపాణిశ్చతుర్భిస్సహ రాక్షసైః,
అబ్రవీచ్చ తదా వాక్యం జాతక్రోధో విభీషణః.
అంతరిక్షగతశ్శ్రీమాన్ భ్రాతరం రాక్షసాధిపమ్,
స త్వం భ్రాతాసి (భ్రాంతోఽసి) మే రాజన్ బ్రూహి మాం యద్యదిచ్ఛసి.
జ్యేష్ఠో మాన్యః పితృసమః నచ ధర్మపథే స్థితః,
సునీతం హితకామేన వాక్యముక్తం దశానన
నగృహ్ణంత్యకృతాత్మానః కాలస్య వశమాగతాః,
సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః.



కర్నాటక నవాబుల నగళ్లలో నొకభాగము (ఉత్తరపువైపు), చేపాకము, చెన్నపురి
(ప్రకృతే మిందు రెవిన్యూబోర్డు కార్యాలయ మున్నది)



విశ్రాంతిదినములో కూలిజ్ అధ్యక్షుని కాలక్షేపము



స్వాతంత్ర్యదినోత్సవసందర్భమున వాషింగ్టనులో
విలసించు పతాకలు




ఇండియాలో 'బైఇండియన్' ప్రచారము కంటెను, ఇంగ్లాండులో 'బై బ్రిటిషు' ప్రచారము



లండనులో నిరుద్యోగుల పోలీసుస్టేషనుపై దండెత్తుట
(అరెస్టుఅయిన ఇరువురుస్త్రీలు పోలీసులతో పెనగులాడుచుండుట).



కీ శే నిడుదవోలు సుందరం పంతులుగారు



కీ శే కారంశెట్టి సుబ్బయ్యశ్రేష్ఠిగారు



కీ శే కల్లేపల్లి శివరామయ్యగారు



కీ. శే. నాథావ్యక్షుల నాగభూషణముగారు

అప్రియస్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభౌ,
బద్ధం కాలస్య పాశేన సర్వభూతాపహారిణా.
న నశ్యంత ముపేక్షేఽయం ప్రదీప్తం శరణం యథా."

ఇట్లు విభీషణుఁ డన్నకు "నామాట విననిచో నీకు వినాశము తప్పదు. దహింపఁబడుచున్న గృహమునువలె వినాశోన్ముఖుఁడవైన నిన్నుపేక్షింపఁజాలను" అని అనేకవిధముల హితబుద్ధిఁ గరపి శీఘ్రముగా రామలక్ష్మణు లున్నచోటికిఁ జనుదెంచెను.

"శం మేరుశిఖరాకారం దీప్తా మివ శతహ్రదామ్,
గగనస్థం మహీస్థా స్తే దదృశు ర్వానరోత్తమాః
యే చాప్యనుచరా స్తస్య చత్వారో భీమవిక్రమాః,
తే ఽపి సర్వాయుధోపేతా భూషణై శ్చాపి భూషితాః.
త మాత్మపంచమం దృష్ట్వా సుగ్రీవో వానరాధిపః,
వానరై స్సహ దుర్ధర్ష శ్చింతయామాస బుద్ధిమాన్.
చింతయిత్వా ముహూర్తంతు వానరాం స్తా నువాచ హ"

(అప్పు డంబరమార్గంబున సముద్రంబు దాఁటి చనుదెంచుచుండ నమ్మహోదధి యుత్తర తీరంబున నున్న వానరాధిపుండగు సుగ్రీవుండు గగనమార్గంబున నత్యున్నతత్వ పీవరత్వ రత్నబహుళత్వంబులచే మేరుశిఖరాకారుండై, తేజిష్ఠత్వగగనసంచారంబులచే విద్యుత్సదృశుండై మంత్రిచతుష్టయసమేతుండై చనుదెంచుచున్న విభీషణుని దూరంబున నవలోకించి చింతించి హనుమదంగదాదివానర వీరులతో నిట్లనియె —)

"ఏష సర్వాయుధోపేత శ్చతుర్భి స్సహ రాక్షసైః,
రాక్షసో ఽభ్యేతి పశ్యధ్వ మస్మాన్ హంతుం నసంశయః"

(వానర పుంగవులారా, చూచితిరా ఈదానవుఁడు సర్వాయుధధారియై నలుగురురాక్షసులతోఁగూడి మనలవధించుటకువచ్చుచున్నాఁడు.) అని సుగ్రీవుఁడు పలుకఁగా వానరులందరు సాలశిలాహస్తులై 'ప్లవగేశ్వర! మమ్ములఁ బనుపుము ఈరాక్షసులఁబరిమార్చివత్తుము.' అని పలికిరి. ఇట్లు వానరులు సంభాషించుచుండ నంతలో నవ్విభీషణుఁడు సముద్రోత్తరతీరంబు డాయంజనుదెంచి బ్రహ్మదత్తవరప్రభావంబున రాముని సకలజగద్రక్షణార్థం బిక్ష్వాకువంశంబునం దవతీర్ణుండైన శ్రీమన్నారాయణునిగా నెఱింగి సర్వజ్ఞుండును పరమకారుణికుండును సర్వలోకశరణ్యుండును నగు రామభద్రుం డవశ్యంబు తన్ను రక్షించుననెడు మహావిశ్వాసంబున వానరుల పరస్పరసంభాషణం బాదరింపక వారు ప్రహరణోద్యుక్తులైనను శంకింపక వారలకభిముఖముగాఁ జని నిర్భయంబున నిష్కంపావస్థానుండై యాకపులు మదీయాభిప్రాయం బెఱుంగక రావణసంబంధి నగుటం జేసి నన్నుఁ బ్రహరింప నిశ్చయించియున్నవారు; రామసమాశ్రయణంబు వీరికెఱింగించి యీపురుషకారముఖంబున రామలక్ష్మణుల • నాశ్రయించెదను. ఈవానరుల కుదయించిన సంరంభంబు మద్ద్వేషకృతంబు గాదు. శ్రీరామభక్తిప్రకర్షపారవశ్యకారితంబుగావున గుణంబుగాఁ బరిగ్రహింపఁ దగినయది యనియును, కృపాళుండైన నృపుండు పురుషకారంబుననే శరణంబు నొందఁదగినవాఁడనియును, నేనంతరంగభక్తుండ, నన్నేల పరిత్యజించుననియు నీరామపరిచారకులు నన్నిప్పు డంగీకరింపకున్నవా రైననేమి? రామాంగీకారంబువలన వీరల యంగీకారంబు సిద్ధించును. అదియే నాకుఁ బురుషార్థంబనియును, సోపాధికసంబంధిపరిత్యాగపూర్వకనిరుపాధికరామసమాశ్రయణంబు ముఖ్యకార్యంబనియును నిశ్చయించి పురుషకారభూతులైన వారికి సర్వలోకశరణ్యునకార్తరవంబు వినఁబడుటకు మహాస్వరప్రయోగంబు కర్తవ్యంబుగావున నుచ్చైర్నాదంబున వానరుల నవలోకించి యిట్లనియె.—

"రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః,
త స్యాహ మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః,
తేన సీతా జనస్థానా ద్ధృతా హత్వా జటాయుషమ్,
రుద్ధాచ వివశా దీనా రాక్షసీభి స్సురక్షితా,
త మహం హేతుభి ర్వాక్యై ర్వివిధైశ్చ న్యదర్శయమ్
సాధు నిర్యాత్యతాం సీతా రామా యేతి పునఃపునః,
సచ నప్రతిజగ్రాహ రావణః కాలచోదితః,
ఉచ్యమానం హితం వాక్యం విపరీత ఇవౌషధమ్,
సోఽహం పరుషిత స్తేన దాసవ చ్చావమానితః.
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణంగతః,
సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే,
నివేదయత మాంక్షిప్రం విభీషణ ముపస్థితమ్."

(ఖలుఁడగు రావణుండను నొకరాక్షసాధిపతి గలఁడు నేను వాని యనుజుఁడను. మాయన్న గృధ్రరాజైన జటాయువును వధించి జనస్థానమునుండి సీతను ముచ్చిలి లంకకుఁ దెచ్చె ఆమె యిపుడు తర్జనభర్త్సనాదుల సలుపు రాక్షసస్త్రీలచేఁ బరివృతయై విలపించుచున్నయది అట్టి యవస్థలో నున్న యామెను గాంచి దుఃఖమునొంది యమ్మహీసుతను రాఘవుని కొసంగుమని మాయన్నకనేకవిధముల బోధించితిని. కాని యద్దురాత్ముండు కాలచోదితుఁడై యాసన్నమైన మృత్యువు గలవాఁడు దివ్యౌషధంబునుంబోలె హితవాదినగు నావచనంబుఁ గైకొనక నన్నుఁ దిరస్కరించె. నే నిట్లు వానిచేఁ బరుషితుండును, దాసునిపగిది నవమానితుండును నై పుత్రదారాదులం బరిత్యజించి రాఘవుని శరణంబు నొందితి. మీరు సర్వలోకశరణ్యుండును, మహాత్ముండును నగు రాఘవునితోడ విభీషణుండు సముపస్థితుం డయ్యెనని శీఘ్రంబుగా నన్నెఱింగింపుఁడు.) అని పలుకు విభీషణుని వచనంబు లాలకించి సుగ్రీవుండు లక్ష్మణసమన్వితుండైన రామునియొద్దకుఁ జని సంరబ్ధపరుషంబుగా నిట్లనియె.—

"రావణస్యానుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః,
చతుర్భి స్సహరక్షోభి ర్భవంతం శరణంగతః
మంత్రే వ్యూహే నయే చారే యుక్తో భవితు మర్హసి
• వానరాణాంచ భద్రంతే పరేషాంచ పరంతప,
అంతర్ధానగతా హ్యేతే రాక్షసాః కామరూపిణః,
శూరాశ్చ నికృతిజ్ఞాశ్చ తేషు జాతు నవిశ్వసేత్,
ప్రణిధీ రాక్షసేంద్రస్య రావణస్య భవే దయమ్,
అనుప్రవిశ్య సోఽస్మాసు భేదం కుర్యా న్నసంశయః,
అథవా స్వయమే వైష ఛ్ఛిద్రమాసాద్య బుద్ధిమాన్,
అనుప్రవిశ్య విశ్వస్తే కదాచి త్ప్రహరేదపి,
మిత్రాటవీ బలంచైవ మూలం భృత్యబలం తథా,
సర్వ మేతద్బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలమ్,
ప్రకృత్యా రాక్షసేంద్రస్య భ్రాతాఽమిత్రస్య తే ప్రభో,
ఆగతశ్చ రిపోః పక్షా త్కథ మస్మిన్ హి విశ్వసేత్,
రావణేన ప్రణిహితం త మవేహి విభీషణమ్,
త స్యాహం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాంవర,
రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సందిష్టోఽయ ముపాగతః,
ప్రహర్తుం మాయయా చ్ఛన్నో విశ్వస్తే త్వయి రాఘవ,
ప్రవిష్ట శ్శత్రుసైన్యం హి ప్రాజ్ఞ శ్శత్రు రతర్కితః,
నిహన్యా దంతరం లబ్ధ్వా ఉలూక ఇవ వాయసాన్,
వధ్యతా మేష దండేన తీవ్రేణ సచివై స్సహ,
రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః"

(భూవల్లభా! వీఁడు రావణుని తమ్ముఁడు వీనిపేరు విభీషణుఁడు. వీఁ డన్నచే నిరస్తుఁడై సర్వలోకశరణ్యుండవగు నీశరణంబు కోరి రాక్షసచతుష్టయసమన్వితుండై వచ్చియున్నవాఁడు వీనిచంద మెట్టిదో తెలిసికొనవలయును. మనకు, వానరసైన్యమునకు సేగిలేకుండ చారులవలన వానినిశ్చయస్థితి నెఱుంగవలయును మహాత్మా! నీవు వానరులతోడ మంత్రంబుఁ గావించి సేనా సన్నివేశంబుం జేసి విచారనిశ్చితసామాద్యుపాయంబులఁ బ్రయోగించి గూఢ పురుషప్రేషణంబు గావించి పరుల మరిత్రవ్యూహనయచారప్రేషణంబు లిమ్ముగా నెఱుంగుము అట్లయిన వానరులకును, నీకును భద్రంబగు. రాక్షసు లదృశ్యసంచారస్వభావులు, కామరూపులు, శూరులు, గూఢవిప్రియకరణనిపుణులు. కావున నెన్నఁటికి వీరిని విశ్వసింపఁదగదు వీఁడు రావణునిచారుఁడు ఉపాయంబున మనయందుఁ బ్రవేశించి భేదంబుఁ బుట్టించును. అట్లు కాదేని ఛిద్రాన్వేషణంబుం జేసి మనల నందఱ వధించును శత్రుకులంబున నుండి సమాగతుండైన వీనిం బరిగ్రహించిన శత్రువునకు బలక్షయంబును, మనకు బలవృద్ధియుఁ గలుగునని తలంపవలదు. మిత్రబలంబు, అటవీజనబలంబు, మూలబలంబు, భృతకోపజీవిబలంబుం బరిగ్రహింపవచ్చుంగాని శత్రుబలంబుఁ బరిగ్రహింపం దగదు. వీనియందు శత్రుబలత్వమాత్రంబె కాదు, అపరిగ్రాహ్యత్వహేతువులు మరికొన్ని గలవు వీఁడు భవదమిత్రుండగు రావణునితమ్ముఁడు. వీనియందు మేలిగుణం బెట్లు కలుగును? యుక్తవ్యాపారవంతులలో శ్రేష్ఠుండవైన నీకు శరణాగతశబ్దోచ్చారియైన నీరాక్షసుని నిగ్రహించుట యుక్తంబని తోఁచుచున్నది శరణాగతుం డెట్లు పరిత్యాజ్యుం డని సందేహింపఁ దగదు వీఁడు రావణునిచే సందిష్టుండై కపటబుద్ధిచేత స్వనివాసంబుననుండి శత్రునివాసంబునకేతెంచినవాఁడు. కావున మీఁరు వీనిని విశ్వసించితిరేని మనసైన్యంబుఁ జొచ్చి యేమఱించి యంతరంబు వెదకి యులూకంబు వాయసంబులం బోలె వానరుల నందఱ సంహరించును. విశ్వాసకృత నిశ్చయంబులగు కపటవాక్యంబుల నుపన్యసించుచున్న వీనినొక్కనిం గాదు, అనుచరసహితంబుగా వ్యాపాదింపవలయును.) అని పలికి యూరకున్న వాక్యజ్ఞుండగు రామభద్రుండు వాక్యకోవిదుండైన సుగ్రీవునిపలుకు లాలకించి సమీపస్థులైన హనుమదంగదజాంబవత్ప్రముఖనిఖిలహరిశ్రేష్ఠుల నవలోకించి సుగ్రీవవచనోపలాలనపూర్వకంబుగా నిట్లనియె.—

"యదుక్తం కపిరాజేన రావణావరజం ప్రతి.
వాక్యం హేతుమ దర్థ్యంచ భవద్భి రపి తచ్ఛ్రుతమ్
సుహృదా మర్థకృచ్ఛ్రేషు యుక్తం బుద్ధిమతా సదా,
సమర్థేనోపసందేష్టుం శాశ్వతీం భూతి మిచ్ఛతా"

(కపులారా! ఇపుడు సుగ్రీవుఁడు విభీషునిగురించి పలికినపలుకులు మీరందఱు వినియున్నారు కదా. ఈమాట లర్థవంతములు; ఉపపత్తితోఁ గూడినవి. మీరందఱు భూతికాములు; అప్రాకృతబుద్ధులు; ఇతరులమనోభావములఁ గనిపెట్టుటకుఁ దగినవారలు కావున విభీషణుని రాకవిషయమై మీకుఁ దోఁచిన దంతయుఁ దెల్పుఁడు అర్థనిశ్చయసమర్థులగు భృత్యులు ప్రభుహితాహితములు విచారించి సమయమందు మేలుగలుగునట్లు నిశ్చయించి బోధించుట నీతి) అని రఘునాథుండడిగిన నవ్వనచరులందరు తమతమమతముల నిట్లు తెలియఁజేసిరి.—

"అజ్ఞాతం నాస్తి తే కించి త్త్రిషు లోకేషు రాఘవ,
ఆత్మానం సూచయన్ జానన్ పృచ్ఛస్యస్మాన్సుహృత్తయా.
త్వంహి సత్యవ్రత శ్శూరో ధార్మికో దృఢవిక్రమః,
పరీక్ష్య కారీ స్మృతిమాన్ నిసృష్టాత్మా సుహృత్సుచ
తస్మా దేకైకశ స్తావ ద్బ్రువంతు సచివా స్తవ,
హేతుతో మతిసంపన్నా స్సమర్థాశ్చ పునఃపునః."

(దేవా! ముల్లోకములయందు దేవర యెఱుంగనియర్థ మొకింతయు లేదు మీ మహిమంబు సూచింపఁదలంచి యిట్లు మమ్మడిగితిరి. మహాత్మా! నీవు శరణాగతరక్షణనిష్ఠాపరుండవు, శూరుండవు, ధార్మికుండవు, దృఢవిక్రముండవు, సర్వజ్ఞుండవు, సుహృన్నివేశితాన్తఃకరణుండవు మాయందుఁ బెద్దతికం బారోపించి యడిగిన నూరక్షుం

డుట విహితంబు గాదు. నీసచివులందరు బుద్ధిసంపన్నులు, సమర్థులు గావున వేర్వేఱ స్వమతంబు లెఱింగించెదము. అని పలికిరి. అపుడు మతిమంతుండైన అంగదుండు విభీషణపరీక్షార్థం శ్రీరఘువల్లభున కిట్లనియె.—

"శత్రో స్సకాశా త్సంప్రాప్త స్సర్వథా శంక్య ఏవహి,
విశ్వాసయోగ్య స్సహసా న కర్తవ్యో విభీషణః
ఛాదయిత్వాత్మభావం హి చరంతి శఠబుద్ధయః,
ప్రహరంతి చ రంధ్రేషు సోఽనర్థ స్సుమహా న్భవేత్.
అర్థానర్థౌ వినిశ్చిత్య వ్యవసాయం భజేత హ,
గుణత స్సంగ్రహం కుర్యా ద్దోషత స్తు వివర్జయేత్
యది దోషో మహాం స్తస్మిం స్త్యజ్యతా మవిశంకితమ్,
గుణా న్వాపి బహూన్ జ్ఞాత్వా సంగ్రహః క్రియతాం నృప".

(దేవా! ఈవిభీషణుఁడు శత్రుసకాశమునుండి వచ్చినవాఁడు. వీని యభిప్రాయము నెఱుంగక రక్షింపుమని పలికినంతనే వీనిని విశ్వసింపఁదగదు. క్రూరచిత్తుఁడగువాఁడు తనభావము మాటుపరిచి తగిన యుపాయంబున శత్రువులం జేరి సమయము వేచి వారిని సమయించును. ఇది గొప్ప యనర్థము. కావున వీనినొకానొక కర్మంబునందు నియోగించి గుణదోషంబులు పరీక్షించి గుణంబు గలిగినఁ బరిగ్రహంబును దోషంబు గలిగినఁ బరిత్యాగంబును గావింపందగు. గుణదోషంబులు రెండును గలిగిన నెట్లు సేయవలయు నంటివేని గుణం బధికంబును, దోషం బల్పంబును గలిగినఁ బరిగ్రహింపవచ్చును అవి విపరీతంబులైన పరిత్యాగంబు కార్యంబు)

అంత నర్థనిశ్చయపరుండైన శరభుండు రాముని కిట్లనియె.—

"క్షిప్ర మస్మి న్నరవ్యాఘ్ర చారః ప్రతివిధీయతామ్.
ప్రణిధాయతు చారేణ యథావ త్సూక్ష్మబుద్ధినా,
పరీక్ష్య చ యథా కార్యో యథా న్యాయం పరిగ్రహః"

(భూవల్లభా! కపటోక్తులచేఁ బరుల భావమును గనుంగొని హాని చేయుట రాక్షసులకృత్యము. వీనిమాటల నమ్మవలదు సూక్ష్మబుద్ధి యగు చారునిచే వీనినిఁ బరీక్షించి విరోధము లేనియెడలఁ బరిగ్రహింపవచ్చును)

జాంబవంతుఁ డిట్లనియె—

"బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేంద్రా ద్విభీషణః,
అదేశకాలే సంప్రాప్త స్సర్వథా శంక్యతా మయమ్."

(క్రూరుఁడు, పాపకర్ముఁడు, బద్ధవైరుఁడు నగు దశకంఠునివద్ద నుండి యీదానవుఁడు వచ్చినవాఁడగుటవలన శంకింపఁదగినవాఁడు)

పదవడి మైందుఁడిట్లనియె—

"వచనం నామ త స్యైష రావణస్య విభీషణః,
పృచ్ఛ్యతాం మధురే ణాయం శనై ర్నరవరేశ్వర,
భావమస్యతు విజ్ఞాయ తత స్తత్త్వం కరిష్యసి,
యది దుష్టో నదుష్టో వా బుద్ధిపూర్వం నరర్షభ."

(నరనాథా! యీవిభీషణుఁడు దుష్టుఁడో, అదుష్టుఁడో తెలుసుకొనుట కితని భావమును మంచిమాటలతో నెఱింగి పిదప మీమాంసంబునఁ దోఁచినయట్లు చేయుఁడు. గుణదోషంబుల నరయ కెట్లు రక్షింపఁదగును? శరణార్థిని నిరాకరించిన దోషమగును. యుక్తియుక్తంబగు మధురవాక్యంబున గూఢపురుషముఖంబుచేత రావణుని వృత్తాంతం బితని నడిగి మెల్లన యథార్థంబైన యితని యభిప్రాయం బెఱింగి పరీక్షాపూర్వకంబుగా దుష్టత్వాదుష్టత్వంబులు దెలిసికొని యెయ్యది కర్తవ్యంబో దానినిఁ జేయుండు.) అని యిట్లందరు వానరపుంగవులు తమతమమతంబులఁ బెక్కుతెఱంగుల నెఱింగినంత యయ్యం బలికిన సుగ్రీవునిచేతఁ బ్రతిపాదితంబైన వధ్యత్వంబును, అంగదాదులచేత సమర్థితంబులైన గుణదోషపరీక్షాపూర్వకపరిగ్రహపరిత్యాగంబులును విని సుగ్రీవునిమతంబు రాజమతంబగుటవలనను, మిక్కిలి యవిచారమూలం బగుటవలనను నుపేక్షించి, యంగదాదుల మతంబు నేకైకానువాదపూర్వకంబుగా దూషించి శీఘ్రంబున విభీషణపరిగ్రహంబు యుక్తంబని స్వసిద్ధాంతంబు తేటపరుపం దలంచి వారి నందఱ నివారించి సచివోత్తముండును, సకలశాస్త్రాభ్యాసజనితసంస్కారజనితసంపన్నుండును నగు హనుమంతుండు రఘునందనుని ముఖారవిందం బవలోకించి వివక్షితార్థప్రతిపాదనశక్తంబును, స్నిగ్ధంబును, నర్థగౌరవయుక్తంబును, మితాక్షరంబును నగు వాక్యంబున నిట్లనియె.—

"నభవంతం మతిశ్రేష్ఠం సమర్థం వదతాం వరమ్,
అతిశాయయితుం శక్తో బృహస్పతి రపి బ్రువన్.
న వాదా న్నాపి సంఘర్షా న్నాధిక్యా న్న చ కామతః,
వక్ష్యామి వచనం రాజన్ యథార్థం రామగౌరవాత్
అర్థానర్థనిమిత్తం వా యదుక్తం సచివై స్తవ,
తత్ర దోషం నపశ్యామి క్రియా న హ్యుపపద్యతే.
ఋతే నియోగా త్సామర్థ్య మవబోద్ధుం నశక్యతే,
సహసా వినియోగోఽపి దోషవా న్ప్రతిభాతి మే"

శరభమతఖండనమ్—

"చారప్రణిహితం యుక్తం యదుక్తం సచివై స్తవ,
అర్థస్యాసంభవా త్తత్ర కారణం నోపపద్యతే."

జాంబవన్మతఖండనమ్—

"అదేశకాలే సంప్రాప్త ఇత్యయం యద్విభీషణః,
వివక్షా తత్ర మేఽస్తీయం తాం నిబోధ యథామతి.

స ఏష దేశః కాలశ్చ భవతీతి యథాతథా,
పురుషా త్పురుషం ప్రాప్య తథా దోషగుణా వపి.
దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమంచ తథా త్వయి,
యుక్త మాగమనం తస్య సదృశం తస్య బుద్ధితః ”

మైంవమతఖండనమ్—

“అజ్ఞాతరూపైః పురుషై స్స రాజన్ పృచ్ఛ్యతా మితి,
య దుక్త మత్ర మే ప్రేక్షా కాచి దస్తి సమీక్షితా.
పృచ్ఛ్యమానోంవిశంకేత సహసా బుద్ధిమా న్వచః,
తత్ర మిత్రం ప్రదుష్యేత మిథ్యా పృష్టం సుఖాగతమ్,
అశక్య స్సహసా రాజన్ భావో వేత్తుం పరస్యవై
అంతస్స్వభావై ర్గీతై స్తైరై ర్నైపుణ్యం పశ్యతా భృశమ్,
న త్వస్య బ్రువతో జాతు లక్ష్యతే దుష్టభావతా.
ప్రసన్నం వదనం చాపి తస్మా న్మే నాస్తి సంశయః,
అశంకితమతి స్స్వస్థో నశఠః పరిసర్పతి
న చాస్య దుష్టావా క్చాపి తస్మా న్నాస్తీ హ సంశయః,
ఆకారశ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్,
బలా ద్ధి వివృణో త్యేవ భావ మంతర్గతం నృణామ్
దేశకాలోపపన్నం చ కార్యం కార్యవిదాం వర,
స్వఫలం కురుతే క్షిప్రం ప్రయోగా దభిసంహితమ్,
ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రావణమ్
వాలినశ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్,
రాజ్యం ప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వ మిహాగతః
ఏతావత్తు పుర స్కృత్య యుజ్యతే తత్ర సంగ్రహః,
యథాశక్తి మయో క్తంతు రాక్షస స్యార్జవం ప్రతి,
త్వం ప్రమాణంతు శేషస్య శ్రుత్వా బుద్ధిమతాం వర.”

(దేవా! నీసన్నిధిలో నే నీసంభాషణముఁజేయుట తర్కకౌశలముచేఁ గాదు; నీమంత్రులయందు స్పర్థచేఁ గాదు; నేను బుద్ధిమంతుఁడను, మాటనేర్పరిని అను దురభిమానముచేఁ గాదు; స్వైరభాషణమందుఁ గోరికచేఁ గాదు, విభీషణునియందు నాకున్న పక్షపాతముచేఁ గాదు, మరేమన నాయందుఁ దమరు కనుపర్చిన సంమానమువలన భవత్సచివుండగు నంగదునిచే గుణదోషనిశ్చయనిమిత్తం బెయ్యది పలుకంబడియె నయ్యర్థంబునందు దోషంబు గలదు. పరీక్షారూపకార్యం బిప్పుడు యుక్తంబు గాదు ‘ఎద్దియేనియు నొకానొక కార్యంబు నెంటంబనిచి గుణదోషంబులు పరీక్షించి గుణంబులు గలిగినఁ బరిగ్రహింపం దగు. దోషంబులు గలిగినఁ బరిత్యజింపందగు’ నని యతఁడు పలికెను అట్లు కర్మనియోగంబువలన గుణిత్వంబు దెలియుట యశక్యంబై యుండు. గుణదోషంబు పరీక్షింపకమున్నె నునకార్యం నందు నియోగంబు దోషంబై తోఁచుచున్నయది.

శరభమతఖండనము

నీసచివుండగు శరభుండు చారప్రణిధాన ముచితమని పలికెను. అది ప్రయోజనకారి కాదు. కావున దానికిఁ గారణము కానరాదు చారప్రేషణము దూరతిరోహితవిషయం బగుటవలనఁ బ్రత్యక్షంబుగాఁ గానవచ్చు విభీషణునియందు యుక్తంబు కాదు.—

జాంబవన్మతఖండనము—

రఘునాయకా! ఈవిభీషణుం డదేశకాలసంప్రాప్తుం డని జాంబవంతుండు నొడివె అయిన నేమి? ఇతఁ డిచ్చటికి వచ్చుట కిదియే కాలము ఇదియే దేశము. ఇతం డధముండైన రావణుని కడనుండి యుత్తమపురుషుండవైన నిన్ను శరణంబు నొంది మీయిరువురదోషగుణంబులు విమర్శించి రావణునియందు సీతాప్రత్యర్పణాభావాది లక్షణదౌరాత్మ్యంబును, నీయందు విరాధకబంధఖరదూషణప్రముఖ రాక్షసవధాదికంబును విలోకించి దురంతబలపరాక్రమవాలివధపూర్వకసుగ్రీవరాజ్యస్థాపనంబును, అతిదుస్తరసముద్రతరణోద్యోగంబును నెఱింగి నిన్నాశ్రయింపవచ్చె. ఇతనిరాక యుక్తంబు.

మైందమతఖండనము—

దేవా! అజ్ఞాతరూపులైనవారి నతనికడకుఁ బంపి యడిగింపుఁడని మైందుఁ డనెను అదియు నాదరణీయంబు గాదు బుద్ధిమంతుఁ డగువాఁ డపరిచితస్వరూపస్వభావు లగువారిచే నడుగంబడినవాఁడై యవిశ్వాసంబువలన “వీరు నన్నడుగుచున్నవారు వీరితో నేమనిన నేమి యనర్థంబు వాటిల్లునో” యని ప్రతివచనంబు నుద్దేశించి మనంబున బహుప్రకారంబుల శంకించును. అట్లగుటవలన నప్రయత్నలబ్ధుండును, సుఖాగతుండును నగు మిత్రుండు మిథ్యాపృష్టుండగుచు దూషింపంబడు దానంజేసి మిత్రహాని వాటిల్లు. మిక్కిలి నిపుణుండగు వానిచేతనేనియుఁ గూఢాభిప్రాయంబులైన ప్రశ్నప్రతిభాషితంబులచేతఁ బరునియభిప్రాయంబు శీఘ్రంబున నెఱుంగుటకు శక్యంబుగాదు

హనుమంతుండు స్వమతం బెఱింగించుట—

ఇతఁ డెంతసేపు సంభాషించినను దుష్టభావము గానరాదు. ముఖము ప్రసన్నమై కనుపట్టుచున్నయది. ఇతని వాక్కునం దించుకయైన దుష్టత్వము గానరాదు. కపటకంచుకాచ్ఛాద్యమానంబయ్యు నాకారము దాఁచ శక్యము కాదు. నేర్పుతో నది యెంత దాఁచినను నిలువక హృదయస్థగతభావము వెల్లడియగును. మహాత్మా! వీనియంతర్గతంబైన భావంబు, పరిశుద్ధత్వంబును దృఙ్ముఖంబులు సూచింపుచున్నవి. ఇట్టి లక్షణంబులు కపటమానవునికిఁ గలుగనేరవు నీవును బరభావవిశేషజ్ఞుండవు; నీకుఁ జెప్పనేల? మిథ్యావృత్తుండైన రావణుని విడిచి నిన్ను సత్యప్రతిజ్ఞునిగా నెఱింగి వాలివధంబును, సుగ్రీవరాజ్యాభిషేకంబును విని రాజ్యార్థియై బుద్ధిపూర్వకంబుగా భవత్సన్నిధానంబునకుఁ జనుదెంచె, నీపూర్వోక్తధర్మజాతంబుం బురస్కరించుకొని యీయర్థం

బునందు సంగ్రహంబుం బ్రయోగింపంబడుఁగాక. నానేర్చినవిధంబున నిర్దుష్టత్వంబు నుద్దేశించి నాచేత నెయ్యది పలుకంబడియె దానిని విమర్శించి యెయ్యది కర్తవ్యంబు తత్సర్వంబునకు మీరే ప్రమాణంబు.)
అని పలికిన నతనిపలుకులు విని సామాన్యవిశేషశాస్త్రజ్ఞుండగు శ్రీరామచంద్రుండు సుగ్రీవాంగదజాంబవదాదివాక్యజనితంబగు మనఃకాలుష్యంబు హనుమద్వాక్యంబుల నొక్కింత ప్రశమితంబగుచుండఁ బ్రసన్నచిత్తుండై సర్వమతప్రతిక్షేపరూపంబగు వాక్యంబున స్వమతసిద్ధాంతంబు సేయం దలంచి సుగ్రీవాదులు వైమనస్యంబు నొందకుండ నుపలాలనంబు సేయుచు నిట్లనియె. —

"మమాపితు వివక్షాస్తి కాచి త్ప్రతి విభీషణమ్,
శ్రోతు మిచ్ఛామి తత్సర్వం భవద్భి శ్శ్రియసి స్థితైః."
మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన,
దోషో యద్యపి తస్య స్యా త్సతా మేత దగర్హితమ్."

(కపులారా! నాకును మీవలె నీవిభీషణుని గురించి చెప్పవలసినది కొంతకలదు. దాని నంతయును నా క్షేమమందు నిరతులైన మీరందఱు ప్రీతితో వినుఁడు జాంబవదంగదాదిమతములయందు 'విభీషణుఁడు దోషముగలవాఁడుగావునఁ బరిగ్రాహ్యుఁడుకాఁ'డని చెప్పుటచే హేతుసాధ్యములు రెండును దుష్టములు. హనుమన్మతమందు పరిగ్రాహ్యత్వరూపసాధ్యము సమీచీనమైయున్నను దోషశూన్యుఁడను హేతు వసమీచీనము. 'నేను శరణాగతుఁడను' అనువాక్యము ప్రయోగించువాఁడై యుండుటయే ముఖ్యహేతువను నభిప్రాయముచే "మిత్రభావేన" అనుదానిచే హేతువు నిర్దేశించఁబడినది.

మిత్రభావేన = వాస్తవమిత్రత్వము లేకపోయినను, మిత్రత్వాభినయమాత్రముచే ననియర్థము. మిత్రభావమనఁగా శరణాగతత్వము. "రాఘవం శరణంగతః", "శరణ్యం శరణంగతః"అని మొదటను కొసను చెప్పఁబడియుండుటచేతను, మఱియొకస్థలమందుఁగూడ "విదిత స్సహి ధర్మజ్ఞ శ్శరణాగతవత్సలః" అని యుపక్రమించి "తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి" అని మైత్రీశబ్దముచే నంతపుచ్చుటవలననుగాని లేకమిత్రశబ్ద మిచట శ్రీరామాభిప్రాయముచే శరణాగతునియందు గౌరవారోపమువలనఁ దగి యున్నది.

న త్యజేయమ్ = విడుచుటకు శక్తిలేనివాఁడను. నేను సర్వశక్తుఁడైనను శరణాగతుని విడుచుటకు నాకు శక్తి లేదు.

కథంచన = శరణాగతునిఁ బరిగ్రహించుటలో దృష్టాదృష్టానర్థశతము లున్నను, నామిత్రుల కనభిమతమైనను, నాప్రాణపరిత్యాగము ప్రస్తుతమైనను శరణాగతుని విడువఁజాలను.

దోషో యద్యపి తస్య స్యాత్ = సుగ్రీవాదులచేఁ జెప్పఁబడిన దోషము లితనియందు లేనే లేవు. ఒకవేళ నంతకంటె హెచ్చు దోషము లున్నను అశక్యమైనపని (శరణాగతుని విడుచుట) నే నెట్లు చేయఁగలను?

స్యాత్ = దుష్టుఁడైనను శరణాగతశబ్దమును బ్రయోగించినవాఁడు నాచేఁ బరిగ్రహింపఁబడెనని నాకు గొప్పకీర్తి కలుగును. దుష్టుఁడుకానివానినిఁ బరిగ్రహించినచో నా కంతగొప్ప లేదు. దుష్టునిఁ జేపట్టినయెడల నాశరణాగతరక్షణ ధర్మము మిక్కిలి ప్రకాశించును.

'అయ్యా! మీరు కరుణచే దుష్టుని స్వీకరించినయెడల శిష్టులవలన మీకు నిందరాదా?' అని పలుకుదు రేమో? దానికిఁ జెప్పుచున్నాను, వినుఁడు —

"సతా మేత దగర్హితమ్" శిష్టుల కిది అగర్హితము. అనగాఁ బూజితము.

ఏతత్ = దుష్టుఁడైనను శరణాగతుని సంగ్రహించుట. పూజితత్వము కపోతోపాఖ్యానాదులచే విస్తరింపఁజేయఁబడుచున్నది.

ఈరీతిగా శాస్త్రములయందు దోషములు పరిత్యాగహేతువని చెప్పుట శరణాగతవ్యతిరిక్తవిషయమని వ్యవస్థ యేర్పాటుచేయఁబడినది. అందుచేతనే దోషాధిక్యముచే వధార్హుఁడైనను శరణాగతు నవశ్యము రక్షింపవలసినదని శ్రుతినిఁ జూపుచున్నాఁడు. — "తస్మాదపి వధ్యం ప్రపన్నం న ప్రతిప్రయచ్ఛన్తి"

వనచరోత్తములారా! మిత్రభావముతో వచ్చినవానినిఁ బరిత్యజించుట తగదు. శరణాగతునియం దొకదోష మున్నను దానిని గుణముగాఁ గైకొనవలయును. ఇతండు దుష్టజనుండైనఁగానిమ్ము. అవశ్యంబు పరిగ్రాహ్యుండు దుష్టజనపరిత్యాజ్యత్వప్రతిపాదకంబైన శాస్త్రంబు సామాన్యవిషయము. విశేషశాస్త్రోక్తప్రకారంబున శరణాగతుండైన వీనినిఁ బరిగ్రహించెదను. శరణాగతదుష్టజనపరిగ్రహణంబు సామాన్యవిశేషశాస్త్రవిదులగు సత్పురుషులకు గర్హణీయంబు గాదు; పూజనీయంబై యుండు.)

శ్రీరామచంద్రుండు పలికినపలుకు లాలించి విమర్శించి సుగ్రీవుండు శుభతరమైన వాక్యంబున నిట్లనియె —

"సుదుష్టో వాప్యదుష్టో వా కిమేష రజనీచరః,
ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్,
కో నామ స భవే త్తస్య యమేష న పరిత్యజేత్."

(దేవా! ఈ విభీషణుం డవశ్యంబు గ్రాహ్యుండని పలికితిరి. ఇతండు పూర్వోక్తచ్ఛద్రహంతృత్వాది దోషయుక్తుండైనను, దోషరహితుండైనను నిక్కంబుగాఁ గృతఘ్నుండగును. వీనియం దేల విశ్వసించెదరు? ఈనిశాటుండు జ్యేష్ఠభ్రాతృత్వప్రయుక్తగౌరవంబు మాని యీదృశంబైన వ్యసనంబు నొందియున్నవాని రావణుని విడిచి

మనకడకుం జనుదెంచెను. ఇట్టి వాఁడిట్టివారిసైన వ్యసనంబునందు విడువంగలండు ఇద్దురాత్ముని నెవ్వండేని విశ్వసించునే?)

అని పలికిన వానరాధిపతివచనంబు విని రఘుపుంగవుండు సర్వ వానరసంఘంబుఁ గలయ నీక్షించి మదీయంబైన శరణాగతసంరక్షణవ్ర త్తంబును, మత్పరమశక్తియు నెఱుంగక యీసుగ్రీవుం డజ్ఞానంబునఁ బలుకుచున్నవాఁడని మందహాసంబు సేయుచుఁ బుణ్యలక్షణుండైన లక్ష్మణు నవలోకించి యిట్లనియె.—

"అనధీత్యచ శాస్త్రాణి వృద్ధా ననుపసేవ్యచ,
నశక్య మీదృశం వక్తుం యదువాచ హరీశ్వరః.
అస్తి సూక్ష్మతరం కించి ద్యదత్ర ప్రతిభాతి మే,
ప్రత్యక్షం లౌకికం వాపి విద్యతే సర్వరాజసు
అమిత్రా స్తత్కులీనాశ్చ ప్రాతిదేశ్యాశ్చ కీర్తితాః,
వ్యసనేషు ప్రహర్తార స్తస్మా దయ మిహాగతః
అపాపా స్తత్కులీనా శ్చ మానయంతి స్వకాన్ హితాన్,
ఏష ప్రాయో నరేంద్రాణాం శంకనీయస్తు శోభనః
యస్తు దోష స్త్వయా ప్రోక్తో ఽ హ్యాదానే ఽ రిబలస్యవ,
తత్ర తే కీర్తయిష్యామి యథా శాస్త్ర మిహ శ్రుణు.
న వయం తత్కులీనాశ్చ రాజ్యకాంక్షీచ రాక్షసః,
పండితాహి భవిష్యంతి తస్మా ద్గ్రాహ్యో విభీషణః.
అవ్యగ్రాశ్చ ప్రహృష్టాశ్చ నభవిష్యంతి సంగతాః,
ప్రవాదశ్చ మహా నేష తతోఽస్య భయ మాగతమ్
ఇతి భేదం గమిష్యంతి తస్మా ద్గ్రాహ్యో విభీషణః,
న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమాః
మద్విధా వా పితుః పుత్రా స్సుహృదో వా భవద్విధాః,
ఏవ ముక్తస్తు రామేణ సుగ్రీవ స్సహ లక్ష్మణః,
ఉత్థా యేదం మహాప్రాజ్ఞః ప్రణతో వాక్య మబ్రవీత్"

(లక్ష్మణా! వృద్ధులను సేవింపక శాస్త్రములఁ జదువక యీ సుగ్రీవుఁడు పలికినరీతిగా నెవ్వఁడైనఁ బలుకఁగలఁడా? ఈవిభీష ణాగమనరూప కార్యంబునందుఁ బరిదృశ్యమానంబును, లోకవ్యవ హారసిద్ధంబును నగు నెయ్యది సర్వరాజులయందు సన్నివిష్టంబై నాకు గోచరించి యుండునో అట్టి సూక్ష్మతరంబైన కించిదర్థ రూపంబు గల దది యెట్లనిన; జ్ఞాతులును, సమనంతరదేశ కర్తలగు రాజులును వ్యసనంబు లుపస్థితంబు లగుచుండఁ బ్రహ ర్తలై శత్రువులనం గీర్తితు లగుదురు కావున వ్యసనప్రహర్త జ్ఞాతిత్వంబువలన వ్యసనియగు రావణుం బ్రహరించుటకు నీ విభీష ణుం డిచ్చటికిఁ జనుదెంచె. మఱియు నేనరేంద్రులు నిష్పాపులై సత్కులీనులై పరిపాలింతు రట్టివారికైనను ప్రజ్ఞాశౌర్యాద్యనేకగుణ శాలియైన జ్ఞాతి మిక్కిలి శంకనీయుండై యుండు పాపకర్ముండైన రాజునకుఁ దాదృశుండైన జ్ఞాతి శంకనీయుం డగుట కేమి యరిది? దురాత్ముండగు రావణునిచేఁ బీడితుండై యీవిభీషణుం డిచ్చటికిఁ జనుదెంచె, నీయర్థంబునందు సందియంబు లేదు విభీషణునకు రావణ పరిత్యాగంబునందు వ్యసనిజ్ఞాతి ప్రహర్తృత్వంబును, శోభనజ్ఞాతిత్వం బునుం గారణద్వయంబు గలదు కావున నీసుగ్రీవుని వచనంబు యుక్తి యుక్తంబుగా) దని పలికి సుగ్రీవు నవలోకించి శత్రుసంబంధత్వమా త్రంబు నవలంబించి యీ విభీషణునియందు నేదోషంబు నీచే గణితం బయ్యె నద్దోషంబు లేదు గావున విభీషణుండు పరిగ్రాహ్యుండను తాత్పర్యంబు గూఢంబు సేయువాఁడై యిట్లనియె.—

"కపిరాజా! శత్రుసంబంధియగు నీవిభీషణుని రాకవిషయమై నీవు చెప్పినదోషమందు నీతిశాస్త్రమునకు హాని లేకుండఁ బరిహారముఁ జెప్పెద, వినుము మన మీతనికి జ్ఞాతులము కాము ప్రాతిదేశ్యులము గాము. రావణుని వధించి నే నీలంకారాజ్యమును దన కిప్పించెదనని యాశతో విభీషణుఁ డిచటికివచ్చెను. కాని స్వకార్యవిఘాతభయంబున రంధ్రంబరసి మన కపకారంబు గావింపఁ జాలఁడు 'మూర్ఖులైన రాక్షసుల కింతబుద్ధిగలదా' యని పలుకవలదు దైత్యులందునుఁ బండితులుగలరు ఈదానవునిఁ బరిగ్రహించుటకు నామనంబున లేశమునుసందియము లేదు. మఱియు నట్టిపండితులగు జ్ఞాతులపర్యా కులులును బ్రహృష్టులునగుచు నొకానొకప్పుడైనఁ బరస్పరసంగ తులు గారు అక్కారణంబున జ్ఞాతు లవసరభేదంబు నొందుదురు. వీని కంఠనాదంబు ధీరుని కంఠనాదంబుభంగి సముచ్ఛ్రితంబై వినంబడియెడుఁ గావున నితండుఁ బలవంతుండగు రావణునిభ యంబువలన నాత్మపరిత్రాణంబుకొఱకు మనయొద్దకుం జనుదెం చెను ఇతనిం బరిగ్రహించుటకు నాకేమియు సంశయంబు లేదు. జ్ఞాతులవలని భయాగమనంబునందు హస్తిగీతాదిరూప మహాప్రవాదంబు లోకప్రసిద్ధంబుగా వినఁబడుచుండు. జ్ఞాతిత్వప్రయుక్తదోషంబునకును, రాజత్వదోషంబునకును సార్వత్రికత్వంబు శంకింపవలదు. పితృదత్తం బైన రాజ్యంబు కరగతం బగుచుండ దాని నంగీకరింపక జ్ఞాతిత్వ ప్రయుక్తదోషంబుం బరిహరించెఁ గావున భరతునికి సమానులైన భ్రాత లెవ్వరును లేరు లక్ష్మణుం డెంతచెప్పినను వినక జ్యేష్ఠత్వంబున రాజ్యార్హుండ నయ్యును బితృవచనగౌరవంబునఁ గనిష్ఠుండగు భరతునియందు రాజ్యభారం బుంచుటకు సహించుటంజేసి తండ్రికి నాయట్టిపుత్రులు లేరు. మిత్రునకు హానిలేకుండ సముచితప్రకారం బున నీతిబోధంబు గావించుటవలన నీవంటి మిత్రులు లే"రని పలికిన నా సుగ్రీవుండు నీతిముఖంబున శరణాగతుండగు విభీషణుని పరిత్యాగంబు ప్రతిపాదించుట కశక్తుండై పరిగృహీతుండగు విభీషణుండు మనకేమి యపాయంబు గావించునో యనుభయంబున నొక్క విభీషణుని

శరణాగతికంటెఁ దనచేత, లక్ష్మణునిచేతఁ గ్రియమాణంబగు శరణాగతిద్వయంబు ప్రబలంబని తలంచి లక్ష్మణసహితుండై శీఘ్రంబున లేచి రామునకుం బ్రణతుండై శరణాగతిపూర్వకంబుగా విభీషణనిగ్రహంబుం బ్రార్థించుచు నిట్లనియె.—"నరనాథా! ఖలుఁడగు రావణుఁడు మనల హింసింప వీని నిచటకుఁ బంపెను. వీఁడు సచివసమేతంబుగా వధ్యుండు. వీనిమాటలు మనము విశ్వసింపఁదగదు!" అని పలికి యూరకున్న తత్వనిర్ణయజ్ఞుండగు శ్రీరాముండు యుక్తిచే మనంబున విమర్శించి ప్రథమకృతవిభీషణశరణాగత్యపేక్షచేత పశ్చాత్కృతసుగ్రీవలక్ష్మణశరణాగతి దుర్బలంబనియును, శరణాగతుండైనవాఁడు వధ్యుండైనను రక్షితవ్యుండనియును నాలోచించి యీరాక్షసుండు మనయందుఁ బ్రవేశించి రంధ్ర మన్వేషించి మనల వధించు ననియెడు సుగ్రీవోక్తదోషంబున కవకాశము లేదని నిశ్చయించి సుగ్రీవు నవలోకించి యిట్లనియె.—"కపినాథా! ఈ విభీషణుఁడు వంచకుఁడు హింసకుఁడు నని యేల వచించెదవు? వీఁడు మన కేమియెగ్గుఁ జేయంజాలినవాఁడు? పిశాచములు దానవులు సిద్ధులు సాధ్యులు మొదలగువారెల్ల నంగుళ్యగ్రముచేఁ దృణతుల్యముగాఁ జిమ్మసమర్థుఁడనైన నాకేదానవుండేపాటివాఁడు?"అని యిట్లు రాఘవుండు విభీషణపరిగ్రాహ్యత్వంబునందు నీతిశాస్త్రంబును, లోకవ్యవహారంబును, స్వశక్తియుఁ గనఁబరిచియశక్తపురుషునిచేతనైనను బ్రాణంబు లర్పించియైన శరణాగతుండు రక్షణీయుండనుటకు నితిహాసంబుఁ బ్రమాణంబు సేయుచు నిట్లనియె —"అనఘా! తొల్లి యొకకపోతంబు వీఁడు మదీయభార్యాసంహర్త యని పగగొని పొమ్మనక శరణార్థిగాఁ గైకొని స్వమాంసంబులచేఁ దృప్తుంజేసె నను కథ వినియుండలేదా? పక్షిమాత్రంబు శరణాగతసంరక్షణజనితమహాకీర్తిని బడయంగా మావంటివారు ద్రుపేక్షింపఁ దగునే? అదియునుం గాక, పూర్వము కణ్వపుత్రుండైన కండుమహర్షి కొన్ని ధర్మగాథలను జెప్పియున్నాఁడు. వానిని నీకు వివరించెద వినుము శరణాగతుఁడై వచ్చి శిరంబునఁ గరంబులు ముకుళించి నన్నుఁ గావు మనుచుఁ నార్తరవంబునఁ బలికినవాఁడు శత్రువైనను నరపతికి రక్షణీయుండు. ఆర్తుఁడైనఁ గానిమ్ము దృప్తుఁడైనఁ గానిమ్ము శత్రువైనఁ గానిమ్ము. నన్నుఁ గావు మన్నంతలో రాజు స్వజీవితమైన నర్పించి శరణాగతుని రక్షింపవలయును. ప్రీతిచేనైన, మోహముచేనైన వచ్చి తనమఱుఁగుఁ జొచ్చినవానిని బ్రోవకున్న రాజుధర్మకాశాలము లోకనింద్యము. శరణాగతుఁడు తన్ను నేరాజు పరుషోక్తులచే నిరసించునో వానిపుణ్యము నంతయుం గొని స్వర్గమునకుఁ బోవును. శరణాగతుని పాపము రక్షింపనిరాజుపా లగును." అనిపలికెఁ గావున నేను ధర్మపరంబును, అబాధితార్థప్రతిపాదకంబును, పాపనివర్తకధర్మ హేతుకంబును, కీర్తికరంబునునగు కండుమహామునివచనంబులు నమోఘంబులు గావించెదను. అది ఫలప్రదానకాలంబు సముపస్థితంబగుచుండ రక్షితకు స్వర్గప్రదం బగునని యిట్లు ధర్మశాస్త్రప్రసిద్ధంబైన శరణాగతరక్షణరూపధర్మం బవశ్యం బనుష్ఠించెద" నని పలికి సర్వలోకశరణ్యత్వ సర్వశక్తిత్వ సర్వజ్ఞత్వ పరమకారుణికత్వ పరమసత్త్వాదిగుణవిశిష్టుండైన నాకనాదిసిద్ధంబైన సహజవ్రతవిశేషంబును గల దనుతాత్పర్యంబు తేటపడ వెండియు నిట్లనియె —"మహాత్మా! నీమఱుఁగుఁ జొచ్చితి కృపతో నన్ను రక్షింపుమని దీనస్వరముతో నొక్కమాఱు నన్ను వేఁడుకొనినవాఁడు శత్రువైనను వాని కభయ మొసంగుట నాకు వ్రతము కావున నీవిభీషణుని కభయం బిచ్చితి. శీఘ్రంబుగ దోడ్కొని రమ్ము. ఇఁక సందియంబు వలదు. వీనిని బ్రోచు టేకాదు, మహాపరాధియగు రావణుఁడైనను వచ్చి నాయపరాధంబు సైరింపుము. నన్నుఁ గావు మని శరణుఁ జొచ్చినఁ గరుణతో రక్షించెద. మరియు నితండు విభీషణుఁడైనను విభీషణవేషధారియైనను మహాపరాధం బొనరించిన రావణుండైన నితనికి శరణాగతరక్షణవ్రతైకదీక్షాదక్షుండనైన నాచేత నభయంబు దత్తంబయ్యె. ఇంక నీ వితనిఁ దోడ్కొనిర" మ్మనిపలికిన సుగ్రీవుండు రాముని శరణాగతరక్షణదీక్షయును, తనయందలి సౌహార్దాతిశయంబును విచారించి విస్మయపరవశుఁడై, "దేవా! నీవు శరణాగతరక్షణధర్మరహస్యజ్ఞుండవు, సర్వజనానందకరుండవు, సత్త్వగుణైక నిష్ఠుండవు ధర్మసంస్థాపనార్థం బవతీర్ణుండవైన నీకు శరణాగత రక్షారూపవిశేషధర్మానుష్ఠానంబు చిత్రంబు గాదు. నా చిత్తంబు విభీషణునిఁ బరిశుద్ధునిఁగా నెఱింగినది. భవదుక్త యుక్తి సమూహంబువలన నభిప్రాయబోధక ముఖప్రసాదాది చిహ్నంబులవలనను బహిరంతరంగంబులను బరీక్షితుండై పరిశుద్ధత్వంబున సమ్యఙ్నిశ్చితుం డయ్యెఁ గావున మహాప్రాజ్ఞుండగు విభీషణుండు మాతోడఁ దుల్యుం డయ్యె నితనితోడ సాచివ్యంబు గావించి రక్షింపు"డనిన నా సుగ్రీవుని పలుకుల కలరి రాముండు పురందరుండు పతత్రిస్వామితోడం బోలె విభీషణునితోడ సంగమంబు నొందె. ఇట్లు రామునిచేత నభయదానంబు గొని రావణానుజుండగు విభీషణుండు భయంబు విడిచి స్వామిసన్నిధియందుఁ బాదపురస్సరా(వ)రోహణం బనుచితంబని తలంచి ప్రహ్వీభూత శిరస్కుండై యానయనోద్యుక్తులైన సుగ్రీవాదులచేత నిర్దిష్టంబైన భూతలంబు నవలోకించుచు గగనంబుననుండి డిగ్గి యభిమతవస్తులాభజనిత ప్రీతి యుక్తుండై స్తనంధయునకు మాతృస్తనంబుంబోలె శరణాగతునకు శరణ్యుని పాదారవిందద్వయంబే పరమప్రాప్యంబు గావున ననురక్తులగు మంత్రులతోడంగూడ ధర్మాత్ముండగు రాముని చరణాంబుజంబులకు గాఢభక్తిం బ్రణమిల్లి లేచి కరంబులు మోడ్చి శరణ్యురామ ప్రీతివర్ధకంబులగు వాక్యంబుల నిట్లనియె.—"అనఘా, నేను రావణుని సోదరుండను అతనిచే నవమానితుండనై సర్వముం బరిత్యజించి సర్వలోక శరణ్యుండవైన నిన్ను శరణంబు నొందితి. నీభృత్యునిఁగాఁ జేసికొని నన్ను రక్షింపుము." విభీషణుఁ డిట్లు విన్నవించినమాటలను విని శ్రీరామచంద్రుం డాతని నత్యాదరముతోఁ గటాక్షించుచు నిట్లనియె.—

"ఓయి విభీషణా! రాక్షసులబలాబలములను యథార్థముగ నాకుఁ జెప్పుము"

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్,

# చూడదగ్గవారు


ఫీజువద్దన్న వకీలు—


బట్టలు చింపక తెచ్చిన చాకలి—


గడువు తప్పక నగయిచ్చిన కంసాలి—
తలిశెట్టి రామారావు


రక్తము రాకుండా క్షౌరముచేసిన మంగలి—
తలిశెట్టి రామారావు

ఇండియా రౌండుటేబిలు మహాసభ-ద్వితీయ సమావేశము
(మాక్డనాల్డుగారు ఉపన్యసించుచున్నారు)





ఇండియా రౌండుటేబిలు మహాసభ-ద్వితీయ సమావేశము

# రెండవ రౌండుటేబిలు మహాసభ ప్రతినిధులు



౧ రైట్ ఆనరబుల్ వి యస్ శ్రీనివాసశాస్త్రిగారు



౨ సర్ ఆలీ ఇమాంగారు, కుడివైపున వారిసతి



3 పురుషోత్తమదాసు ఠాకూరుదాసుగారు



౪ జి డి బిర్లాగారు



౫ మాంగ్ మాంగ్ జిగారు

# సవరణచట్టములో గ్రామపంచాయతీలు

దద్దనాల లక్ష్మీ సత్యానారాయణయ్యగారు

౧౯౩౦-వ సంవత్సరపు స్థానికసంస్థలసవరణ చట్టమునందు "గ్రామపంచాయతీ"లకు గల స్థానము చర్చించుటయే నాయీవ్యాసముయొక్క ముఖ్యాశయమై యున్నది.

## ౧. పూర్వచరిత్ర

మహనీయులగు అ. రంగనాథ మొదలియారు బి. యె., బి. యల్. మొదలగువారు గ్రామపునర్నిర్మాణాభివృద్ధికై చేయబడిన కృషియొక్క ఫలితముగ, గ్రామములను పునరుద్ధరించువిషయమై పూర్వకాలమునాటి గ్రామపంచాయతీసంస్థ లమలులోనికి దేబడి, కోరికగల ప్రతిగ్రామమునందును పంచాయతీ యేర్పాటుగావించునటుల ౧౯౨౦-వ సంవత్సరములో నొకప్రత్యేకచట్టము- "నెం ౧౫ రు మద్రాసు గ్రామపంచాయతీలచట్టము" గావింపబడెను. ఈచట్టము "రిజస్ట్రారుజనరల్" అను నొకరాష్ట్రియోద్యోగి పరిపాలనదృష్టియందుంచబడెను. పంచాయతీలు నిర్మించుటయు, విరాళము లొసంగి వాటిని పనులుజేయ ప్రోత్సహించుటయు నీరాష్ట్రియాధికారి విధియై యుండెను. తనకు సహాయభూతులుగ "గౌరవ నిర్మాతల" నేర్పరుచుటయు గలదు.

## ౨. ప్రస్తుతచరిత్ర

అయితే గతశాసనసభవారిచే నీప్రత్యేకపంచాయతీలచట్టము రద్దుచేయబడి, ౧౯౩౦-వ సంవత్సరమున స్థానిక సంస్థలసవరణచట్టమున నీపంచాయతీలు జేర్పబడియెను. ఇందుల కప్పటిరాజ్యాంగప్రధానమంత్రియగు డాక్టరు సుబ్బరాయన్‌గారే ముఖ్యకారకులు. ఇట్లు గావించుటకై యోజించుటకుగాను శాసనసభవారొక ౪౭గురు సభ్యులుగల యుపసంఘము నేర్పరచియుండిరి. ఇట్టిసందర్భమున పశ్చిమగోదావరిజిల్లాప్రతినిధియగు శ్రీదండు నారాయణరాజు బి. యే., బి. యల్ గారు, గ్రామపంచాయతుల స్థానికసంస్థలచట్టమునందు జేర్చరాదనుచు గంభీరోపన్యాస మొసంగియుండిరి. తదాదిగ నీగ్రామపంచాయతీలు స్థానికసంస్థలయినవి. ప్రాత స్థానికసంస్థలక్రిందగల యూనియనులన్నియు గ్రామపంచాయతీలుగనే పరిగణింపబడుచున్నవి.

ఈస్థానికసంస్థలచట్టమున "పంచాయతీల" జేర్చుట గ్రామపంచాయతీలయొక్క యధికారాదిగౌరవము లిబ్బడియయ్యెననుటయం దెంతమాత్రమును సందియములేదు. అయితే మద్రాసు గ్రామపంచాయతీల చట్టముప్రకారము గాక, ప్రస్తుతస్థితియందీ పంచాయతీలు యెక్కువ వ్యయప్రయాసలకు లోనుగావలయుననుట నిర్వివాదాంశము. ఏలననగా? తమయొక్క 'పరిపాలనానివేదిక' తయారుజేయుటయందును, 'వ్యయసూచన నివేదిక' యేర్పరుచుటయందును ప్రత్యేకప్రయాసలకు లోనుగావలసియున్నది. విస్తారముగ విద్యావ్యాప్తిలేని గ్రామపంచాయతీ కార్యనిర్వాహకులకు పంచాయతీయధ్యక్షు లనుశ్రుతముగ వేరొకరిసహాయ మభిలషింపవలసివచ్చుట తథ్యము. చట్ట-పరిశీలన ప్రజ్ఞావంతుని పంచాయతీయొక్క లేఖనకార్యనిర్వహణమునకై యేర్పరుచుకొందమన్న, పంచాయతీలకు వచ్చు ఆదాయ మంతటితో సరిపోవును. గనుక ముఖ్యముగ గ్రామపంచాయతులు నూతనచట్టమున నీయాటంక మెదురుకోవలసియున్నది. మరియు, కేవలము ౪౮ సెక్షనులు

గల చట్టముతో, నొకప్రత్యేకోద్యోగిదృష్టిలో పనిజేయు నిట్టిగ్రామపంచాయితీలు ౨౮౦ సెక్షనులుగల పెద్దచట్టము ననుసరింపవలసి వచ్చుచున్నది. అప్పటిపంచాయతీల రిజస్ట్రారుజినరలువారే, యిప్పటిస్థానికసంస్థల పరిశీలనాధికారిగ నున్నను, ఈపంచాయతీలు తాలూకాబోర్డులకును, జిల్లాబోర్డులకును పైగ స్థానికప్రభుత్వకమువారికిని జవాబుదారీ వహింపవలసివచ్చుచున్నయది. గనుక యిన్ని యిడుమలపాల్గా వలసిన గ్రామపంచాయతీలు వృద్ధిగాంచుట బహుకష్ట సాధ్యము.

### ౩. గ్రామ పునర్నిర్మాణనిధి

కాని నూతనస్థానికసంస్థలచట్టమునం దిముడ్చుట వలన నీపంచాయతీల కాయాగ్రామపక్షమున ప్రభుత్వమువారికి చెల్లించు "భూమిశిస్తు" అగు ప్రతిరూపాయియొక్కింటికిని ఒకకాని (మూడుపైసలు) యాదాయమేర్పర్చుటవలన, ముఖ్యముగ నీపంచాయతీలకు కొంత నికరాదాయము గల్గుచుండుట శుభసూచకము. మరి యొకకాని యీరీతిగ వచ్చిన, ఆదాయము జిల్లాబోర్డువారి యాదాయమునకు జేర్పబడి "గ్రామపునర్నిర్మాణనిధి" యని వ్యవహరింపబడును. ఈపునరుద్ధారణనిధి ముఖ్యముగ గ్రామపంచాయతీల యభివృద్ధికై వినియోగించుట కేర్పరుపబడియున్నది. గ్రామపంచాయతీ లేని గ్రామమున వసూలుపరచబడిన గ్రామపునర్నిర్మాణనిధి జిల్లాబోర్డునకును, యింతకుసమమగు 'పంచాయతీనిధి' తాలూకాబోర్డునకును, అర్పితమగును. కావున ప్రతి గ్రామమునకు నొకపంచాయతీ యేర్పరుపబడియుండుట మిగుల శ్రేయోదాయక మయియున్నది.

### ౪. గ్రామ పునర్నిర్మాణసంఘము

ఈగ్రామపునర్నిర్మాణనిధి యిందులకై యేర్పరుపబడిన యొకసంఘమువారి సూచనలకు లోబడియుండును. ఈసంఘము జిల్లాబోర్డు అధ్యక్షుడును, ఆజిల్లాయందుగల యన్ని తాలూకాబోర్డుల యధ్యక్షులును గలదిగా నుండును. ఇందులకు జిల్లాబోర్డుఅధ్యక్షుడే యధ్యక్షుడై యుండును. కావున, గ్రామపంచాయతీలయొక్కయు, గ్రామములయొక్కయు (పంచాయతీలు లేనివి) యభివృద్ధి ఈసంఘమువారిపై కొద్దిగ ఆధారపడియుండునని విశదమే కదా! మరియు జిల్లాబోర్డువారు ప్రభుత్వమువారి యంగీకారాదులగుసలహాలపై తమజిల్లాకొరకు "జిల్లాపంచాయతీ యుద్యోగి" నేర్పరుపవచ్చును. కాని యీయుద్యోగ నిర్వహణమున కగుఖర్చుమాత్ర మీపునర్నిర్మాణనిధి నుండి గాదని తెలిసికొనుట కెంతయు సంతసము.

### ౫. నిర్మాణము

ఈ గ్రామపంచాయతీలయొక్క హక్కుదారులు (వోటర్లు) ఇదివరకువలె గాక ౨౧ సంవత్సరములుగల యేపురుషుడుగాని స్త్రీగాని గ్రామములో ౧౨౧ దినములు నివసించినట్టియు, ప్రభుత్వమునకుగాని యేస్థానికసంస్థకుగాని, రయితునకుగాని, రయిత్వారీపట్టాదారుకుగాని యేకొద్దిమొత్తమునయినను చెల్లించునట్టివారుగ నుండవలయును. ఇట్టివారలే తాలూకాబోర్డునకును, జిల్లాబోర్డునకును వోటర్లుగ పరిగణింపబడుదురు. పంచాయతీల నిర్మాణము, గ్రామమును కొన్ని వార్డులుగ విభజించి, వార్డున కొక్కరినిగమాత్రమే ప్రత్యేకపరుపబడిన యదనపుస్థానముగాక, యెన్నుకొనబడుటచే యేర్పడును. మరియు నూతనచట్టప్రకారముగ పంచాయతీకి కనీససంఖ్య ౫ గురు సభ్యులుగను, గరిష్టసంఖ్య ౧౫ గురు సభ్యులుగను నిర్ణయింపబడినవి. వీరందరును యెన్నుకొనబడవలయును. అయితే పంచాయతీయొక్క మొత్తపుసంఖ్యలో నాల్గవవంతుగల ప్రాతినిధ్యము తక్కువజాతివారగు ఆదిమాంధ్రుల కేర్పరుపబడవలయును. ఈప్రత్యేకనియోజకవర్గసంఖ్య నాల్గవవంతుకన్న మించ నవసరము లేదు.

### ౬. నిర్వాహకము

ఇట్టి యెన్నికసభ్యులచే నిర్మింపబడిన గ్రామపంచాయతీయొక్క ప్రథమసమావేశమున పంచాయతీయొక్క తద్ఇతర కార్యము ప్రారంభించుటకుముందు సభ్యులెల్లరు ముఖ్యముగ "రాజభక్తిప్రమాణము" జ్ఞాపక,

రించిన నేతప్ప తమయొక్క సభ్యత్వమునకు స్థిరత్వ మేర్పడక పోవుటయే గాక, యట్టిప్రమాణ మాచరింపని సభ్యుని వ్యవహారమంగీకరింపబడదు. గ్రామపంచాయతీసభ్యులు తమలో నొకని తమ కధ్యక్షునిగను, మరియొకని నుపాధ్యక్షునిగను ఎన్నుకొనవలెను. ఈ యుపాధ్యక్షుని స్థానము సవరణచట్టము మూలముగనే పంచాయతీలకు తటస్థించినది కాని యిదివరలో పంచాయతీలకు లేదు. పంచాయతీల యధ్యక్షుడు పంచాయతీసరిహద్దులను దాటి పోయియున్న సమయమున, తనకు గల యధికారమంతయు నుపాధ్యక్షుడు చలాయింపవచ్చునుగాని ఇట్లు స్థిరముగ జరుగుట దుర్లభము. అయితే పంచాయతీయధ్యక్షుడు కొన్ని యధికారములు తనయందే యుంచుకొని యుండగలడు.

## ౭. విశ్వాసరాహిత్యతీర్మానము

ఈపంచాయతీయధ్యక్షునిపైగాని, ఉపాధ్యక్షుని పైగాని, తగునవకాశ మొసంగి సభ్యులు విశ్వాసమును గాని, యవిశ్వాసమునుగాని ప్రకటింపవచ్చును. పంచాయతీమొత్తములోగల మూడువంతులలో రెండువంతుల వారిచే యవిశ్వాసము ప్రకటింపబడినయెడల, నట్లుప్రకటింపబడిన యధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని తనయొక్కస్థానము తప్పక కోల్పోయినవా డగును. ఇప్పటికిని తనయొక్కస్థాన మతడు విడువకున్నచో నతడు వేయిరూపాయిల జరిమానాకు పాత్రుడు కాగలడు. గ్రామపంచాయతీలను సవరణచట్టమునం దుంచుటవలన పంచాయతీల కిట్టియవకాశము గల్గెనుగాని యిదివరలో నిట్టిది పంచాయతీలకు లేదు. ఇట్టియవకాశము పంచాయతీలకు గల్గజేయుట యెంతయు శుభదాయకము.

## ౮. ఆదాయమూలములు

సవరణచట్టమున గ్రామపంచాయతీలు చేర్చబడినదాదిగ ప్రభుత్వము వారికి సంబంధించిన రివిన్యూపోరంబోకులు, పుంతలు, తోపులు వగైరా పంచాయతీకి సంక్రమించవలయునని యుండినను, ఇంతవరకు అట్లు గావింపబడకుండు టెంతయు శోచనీయము.

ఇదివరలో చెప్పబడినరూపాయి ౧ కి.కానీవంతు గల నికరాదాయముగాక, పంచాయతీలు గ్రామములో, వృత్తిపన్నుగాని, యింటిపన్నుగాని మరొకి యితరప్రత్యేకపన్ను విధించియైనను ఆదాయము బొందవచ్చును.' అయితే, మొట్టమొదటి రెండుపన్నులు జిల్లాబోర్డువారి యనుమతి పైనను, ప్రత్యేకమగు యెట్టిపన్నునైనను ప్రభుత్వము వారి యనుమతిబడసియు వసూలు చేయవచ్చును. ప్రాతచట్టము ప్రకారముగ, గ్రామపంచాయతీలు తమయొక్క పన్నులు రివిన్యూవారిసహాయమున వసూలుచేయించుకొనుటగాక (వారికి కొంతపరిహార మిచ్చి) ఈసవరణ చట్టముప్రకారము తామే స్వయముగ తగునంతయవకాశ మొసంగి, జప్తుచర్యలనైనను జరిపి, తమకు రావలయు పన్ను వసూలుపరచవచ్చును. ఇట్టిసమయమున ప్రభుత్వమువారిని కోరి పోలీసువారలసహాయము పొందవచ్చును. అయితే ఈపోలీసులకయ్యే ఖర్చు పంచాయతీయే భరించవలెను. ఇవ్విధానము పంచాయతీలకు మిగుల శుభదాయకము.

## ౯. సభాచర్యలు

గ్రామపంచాయతీలు తమయొక్క సభాచర్యలను మూడుదినములలోగా తాలూకాబోర్డు అధ్యక్షునకును, జిల్లాకలెక్టరునకును బంపవలయునేకాని, యిదివరలోవలె జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారికిని, స్థానికసంస్థల ఇన్‌స్పెక్టరు వారికి గాని పంప నవసరములేదు. ఇయ్యది పంచాయతీలవారు ముఖ్యముగ గుర్తించెదరుగాత! ఇదివరలోవలె గ్రామపంచాయతీలు ఋణములు చేయరాదు. అవసరమైనచో ప్రభుత్వమువారినుండిగాని, తాలూకా జిల్లా బోర్డులనుండిగాని యప్పులు గైకొనవచ్చును. ఇచ్చునట్టి వారు పంచాయతీలయొక్క శక్తిసామర్థ్యాతిశయాదాయముల ననుసరించియే యప్పు లొసంగెదరు. ఈగ్రామ పంచాయతీలు తాలూకాబోర్డువారి యనుమతిప్రకారము గాక తామే స్వయముగ చట్టముయొక్క ౯౩-వ సెక్షనుప్రకార మపాయకరములగు పనులు తమయను




సింగంపల్లి వెంకటాద్రిగారు

మాతృభూమియగు భరతఖండముయొక్క స్థితిస్వరూపాదులను ఈక్రిందిప్రకరణములలో స్థూలముగ పారకమహాశయులకు నివేదించెద.

### విస్తీర్ణము

హిందూదేశముయొక్క మొత్తమువిస్తీర్ణము ౧౮ లక్షల చ. మైళ్లు. దీనిలో ౧౦౦ కి ౬౧ భాగములు అనగా ౧౧ లక్షల చ. మైళ్లు ప్రదేశము బ్రిటిష్‌వారి సంపూర్ణాధీనమునను, మిగిలిన దనగా ౭ లక్షల చ. మైళ్లు ప్రదేశము స్వదేశసంస్థానాధీశుల పరిపాలనమునను గలదు.

### జనసంఖ్య

మొత్తముజనసంఖ్య యించుమించుగా ౩౬ కోట్లు. వీరిలో ౧౦౦ కి ౭౭ వంతున అనగా ౨౭ కోట్ల జనులు బ్రిటిష్‌రాజ్యభాగములందును, మిగిలినవారు అనగా ౯ కోట్ల జనులు స్వదేశరాజ్యభాగములందును నివసించుచున్నారు.

### గ్రామములు—పట్టణములు

మనదేశమునంగల పల్లెలు, పట్టణముల మొత్తము సంఖ్య ౬,౮౮,౦౦౧. వీనిలో బ్రిటిష్‌రాజ్యభాగములందు ౫,౦౧,౦౦౦ ను, స్వదేశరాజ్యములందు ౧,౮౮,౦౦౦ ను గలవు. హిందూదేశమునంగల మొత్తముగ్రామముల లోను, పట్టణములలోను ౬,౮౫,౭౦౦ గ్రామములుగను, ౨,౩౦౦ పట్టణములుగ నున్నవి. ఈపట్టణములలో ౧,౫౬౦ బ్రిటిష్‌యిండియాలోను, ౭౪౦ స్వదేశరాజ్యములందును గలవు. హిందూదేశమునంగల మొత్తముగృహముల సంఖ్య ౬౬౦ లక్షలు.

మనదేశస్థులలో ౩౧ కోట్లు పల్లెలందును ౨౫ కోట్ల జనులు పట్టణములలోను నివసించుచున్నారు. మొత్తము జనసంఖ్యలో నించుమించుగా ౧౮ కోట్ల ౫౦ లక్షలు పురుషులుగను, ౧౭ కోట్ల ౫౦ లక్షలు స్త్రీలుగను నున్నారు. హిందూదేశములో చ. మైలుకి సగటున ౨౦౦ జనులచొప్పున నివసింపగల్గుచున్నారు. ౧౮౭౨-వ సంవత్సరమున హిందూదేశమునందలి జనసంఖ్య ౨౧ కోట్లు, ౧౯౨౧ లో ౩౨ కోట్లు; ౧౯౩౧ లో ౩౬ కోట్లు. ఈరేటుప్రకారము జనసంఖ్య యభివృద్ధిగాంచుచుండిన ౨౦౦ సంవత్సరములలో మనదేశమునందలి జనసంఖ్య ద్విగుణము కాగలదు.

౧౯౩౧ సంవత్సరమున వెలువడిన జనాభాలెక్కల సనుసరించి హిందూదేశమున ౫ వేలు మొదలు ౧౦ వేలలోపల జనులు నివసించుచున్న పట్టణములు ౯౯౦ యును, ౧౦ వేలు మొదలు ౨౦ వేలలోపల జనులు గల పట్టణములు ౪౬౦ యును, ౨౦—౫౦ వేలలోపల జనసంఖ్యగల పట్టణములు ౨౦౦ లును, ౫౦ వేలు మొదలు ౧౦౦ వేలవరకు జనసంఖ్య గల పట్టణములు ౫౫ యును, ౧ లక్షకంటె ఎక్కువ జనసంఖ్య గల పట్టణములు ౩౬ ను గలవు. పట్టణములలో కలకత్తా, బొంబాయి, మదరాసు, హైదరాబాదు, రంగూను, ఢిల్లీ, లాహోరు, అహమ్మదాబాదు, లక్నో, బెంగుళూరు, కరాచి,

కాన్పూరు, పునహా, వారణాసి, ఆగ్రా, అమృతసరము, ప్రయాగ, నాగపురము, శ్రీనగరము, మధుర, మొదలగునవి ఒకదానికంటె నొకటి జనపరిగణనము ననుసరించి చిన్నదని చెప్పనగును.

### వలసవచ్చుట—వలసపోవుట

మన దేశమున ౭ లక్షల జనులు విదేశములనుండి వచ్చి నివసించుచున్నారు. ఈవలసవచ్చినవారిలో ౧౦౦ కి ౮౦ ఆసియాఖండమునంగల యితర దేశములు, అందు ముఖ్యముగా ఆఫ్గనిస్థానము, చీనా, సయాం, సింహాళము, అరేబియా ప్రాంతములనుండి వచ్చినవారుగా నున్నారు. హిందూ దేశమునుండి అన్య దేశములకు వలసపోయిన మొత్తముజనులు ౧౭ లక్షలు. వీరిలో సింహాళమునకు ౪౬౦ వేలును, మలయా, పెనాంగ్, సింగపూరులకు ౪౧౦ వేలును, నేటాలునకు ౫౦ వేలును, ట్రినిడాడునకు ౪౦ వేలును, ఫిజీద్వీపమునకు ౩౫ వేలును వలసపోయిరి. ఇంకను ఎన్నియో ప్రాంతములకు వెళ్లి జీవించుచున్నారు. వలసపోయిన జనులలో ౧౦౦ కి ౮౦ మంది చెన్న రాష్ట్రమునకు జెందినవారుగ నున్నారు. వలసపోయిన భారతీయులలో ౧౦౦ కి ౬౬ పురుషులుగను, ౩౪ గురు మాత్రము స్త్రీలుగను నున్నారు. అట్టిచో యెట్టి విపరీతపరిస్థితు లేర్పడునో యూహింపవచ్చును. వలసపోయిన భారతీయులలో ౧౦౦ కి ౮౦ మంది హిందువులుగను, ౧౦ మంది ముసల్మానులుగను, ౧౦ మంది తదితరులుగను నున్నారు.

### మతములు

హిందూ దేశమునంగల జనులలో రమారమి ౨౫ కోట్లు హిందువులుగను, ౭ కోట్లు ముసల్మానులుగను, ౫౦ లక్షలు క్రైస్తవులుగను, ౩౩ లక్షలు సిక్కులుగను, ౧౨ లక్షలు బౌద్ధులుగను, ౧౨ లక్షలు జైనులుగను, ౧ లక్ష ౨౦ వేలు పారశీకులుగను నున్నారు. ఇంకను మరికొందఱు గలరు.

### జనన మరణములు

౧౦౦౦ జనులుగల చోట ప్రతియేట నించుమించుగా ౩౫ గురు చొప్పున జననమొందుటయు, ౨౮ గురు చొప్పున మరణించుటయు సంభవించుచున్నది. జనన మరణముల లెక్కల పరిశీలించిన మొత్తముమీద జననములలోకంటె మరణములలో అభివృద్ధి కాలముగడచిన కొలది ఎక్కువగా నున్నది. శిశుమరణములగూర్చి విచారించిన ౧౯౨౯ లో ౧౦౦౦ కి ౧౭౫ గురు మరణించిన, ౧౯౩౦ లో ౧౦౦౦ కి ౧౯౯ గురు చొప్పున మరణించుట సంభవించెను. దీనినిబట్టి చూడగా శిశుమరణములలో కాలక్రమమున అభివృద్ధి ఎక్కువగా గలదని తోచుట స్పష్టము.

౧౯౨౯ సంవత్సరమున శిశుమరణముల సంఖ్య ఇంగ్లండు & వేల్సులో ౧౦౧౦ కి ౭౦ చొప్పునను, జపానులో ౧౨౬ చొప్పునను, కనడాలో ౧౦౨ చొప్పునను, యునైటెడ్ స్టేట్సులో ౭౩ చొప్పునను నుండగా మన దేశములో ౧౭౫ చొప్పున మరణము లుండుట సంభవించెను. అనగా నితర దేశములలోకంటె మన దేశములోశిశుమరణము లెక్కువగా నున్నవని నిర్ధారణమగుచున్నది. మన దేశమునందలి శిశుమరణములలో ౧౦౦ కి ౨౫ ఏడాదిలోపల వయస్సుగలవారివిగా నుండును. ఇంగ్లండులో ఏడాదిలోపల వయస్సుగలవారిలో ౧౦౦ కి ౧౧ చొప్పునమాత్రమే మరణింతురు. మన దేశమున శిశుమరణము లెక్కువగా నుండుటకు అతిబాల్యవివాహములు, బాల్యపునస్సంధానములు, దుస్సహమగు దారిద్ర్యములే ముఖ్యకారణములు.

### వితంతువులు

పురుషులలో భార్యావిహీనులు ౧౦౦ కి ౬.౫గురు స్త్రీలలో భర్తృవియోగానలముచే కృశించువారు ౧౦౦కి ౧౮ గురు. ఇంగ్లండులో గల స్త్రీలలో ౧౦౦౦ కి ౭౫గురు వితంతువులుగ నుండిన, మన దేశమునంగల స్త్రీలలో

౧౦౦౦ కి ౧౭౫ గురు వితంతువులుగ నున్నారనిన భారతాంగనల దౌర్భాగ్యస్థితి యెట్టిదో పాఠకులే గ్రహింపగలరు.

## భాషలు

హిందూ సామ్రాజ్యమందంతట ౨౨౨ భాషలు మాట్లాడబడుచున్నవి. వీనిలో హిందీ మాట్లాడువారి సంఖ్య ౧౦ కోట్లును, వంగభాష ౫ కోట్లును, ఆంధ్రము ౨ కోట్ల ౫౦ లక్షలును, మహారాష్ట్రము ౨ కోట్లును, అరవము ౧౯౮ లక్షలును, పంజాబీ ౧౯౭ లక్షలును, రాజస్థానీ ౧౪౦ లక్షలును, కన్నడము ౧౨౦ లక్షలును, ఓఢ్రము ౧౨౦ లక్షలును, గుజరాతీ ౧౦౦ లక్షలును, మళయాళము ౮౦ లక్షలును మాట్లాడుచున్నారు. హిందీ, బంగాళీభాషలతర్వాత ఆంధ్రమే యధికసంఖ్యాకులచే మాట్లాడబడుచున్నది. అట్లయ్యును ఆంధ్రు లింతవఱకు ప్రత్యేకరాష్ట్రనిర్మాణము గావించుకొనజాలకపోవుట దురదృష్టము.

## విద్యావ్యాప్తి

హిందూదేశములో చదువను వ్రాయను శక్తిగలవారు ౨౩౫ లక్షలుమాత్రమే! చూచితిరా! విద్యావ్యాప్తి ఎంత యత్యల్పముగా నున్నదో! పురుషులలో ౧౦౦౦ కి ౧౪౪ గురును, స్త్రీలలో ౧౦౦౦ కి ౨౫ గురును చదువను, వ్రాయను గలరు. హిందువులలో ప్రతి పంద్రెండుగురలో ఒకరుమాత్రము చదువను, వ్రాయను గలరు. ముసల్మానులలో ప్రతి పదునెనిమిదిగురలో ఒకరుమాత్రము చదువను, వ్రాయను గలరు. హిందూపురుషులలో ౮ మందికి ౧ రును, హిందూస్త్రీలలో ౬౦ మందికి ౧ రును, ముసల్మానులలో మగవారిలో ౧౦ మందికి ౧ రును, ముసల్మానుస్త్రీలలో ౧౮౦ మందికి ౧ రును చదువను, వ్రాయను గలరు. హిందూదేశమునం గల సకల జాతి మత పురుషస్త్రీలలో ౨౯ లక్షలు మాత్రమే ఆంగ్లభాషాపరిచయము కలిగియున్నారు.

## వృత్తులు

మన దేశమునంగల జనులలో ౧౦౦ కి ౭౫ గురు కేవలము వ్యవసాయముపై నాధారపడియున్నారు. ౧౦౦కి ౧౦ మంది పరిశ్రమల మూలమున, ౮ మంది వర్తకవ్యాపారమూలమునను, మిగిలినవారు తదితరమార్గముల వలనను జీవనము చేయుచున్నారు. ప్రభుత్వోద్యోగముల వలనగాని, ప్రభుత్వసంరక్షణమునగాని జీవనము చేయువారు ౧౦౦ కి ౧ ౫ గురు అనగా వెయ్యింటికి పదునైదుగురుచొప్పున గలరు.

## రాజ్యవిభాగములు

బ్రిటిష్ ప్రభుత్వమువారిచే స్వయముగా పాలింపబడుచున్న రాజ్యభాగములు ౧౩. వాని పేర్లను, అందలి జిల్లాల సంఖ్యను, విస్తీర్ణమును, జనసంఖ్యయును స్థూలముగా నెఱుకపఱచెద—

౧ అజ్మీర్-మేర్వారా ఇందలి జిల్లాలు ౨ విస్తీర్ణము ౧౩ వేల చ మైళ్లు జనసంఖ్య ౫ లక్షలు ౨ అస్సాము జిల్లాలు ౧౨ విస్తీర్ణము ౫౩ వేల చ మైళ్లు జనసంఖ్య ౮౫ లక్షలు ౩ బెంగాల్ జిల్లాలు ౨౮ విస్తీర్ణము ౭౯ వేల చ మై జనసంఖ్య ౫ కోట్లు ౪ బీహార్ అండ్ ఒరిస్సాజిల్లాలు ౨౧ వి—౮౩ వేల చ మై జనులు ౩౫౦ లక్షలు ౫ బొంబాయి జిల్లాలు ౨౬ వి—౧౨౩ వేల చ మై జనులు ౨ కోట్లు ౬ మధ్య పరగణాలు. జిల్లాలు ౨౨ వి—౧ లక్ష చ మై జనులు ౧౫౧ లక్షలు ౭ బర్మా జిల్లాలు ౪౧ విస్తీ ౨౩౭ వేల చ. మైళ్లు ౮ కొడగు ౧ జిల్లా ౧౬౦౦ చ మైళ్లు ౧౮౦ వేల జనులు ౯. ఢిల్లీ జనసంఖ్య ౪౯౦ వేలు ౧౦ మద్రాసుప్రెసిడెన్సీ జిల్లాలు ౨౪ విస్తీర్ణము ౧౪౨ వే. చ మై జనసంఖ్య ౪౫౦ లక్షలు ౧౧ పశ్చిమోత్తరసరహద్దు రాష్ట్రము జిల్లాలు ౫ విస్తీర్ణము ౧౬ వేల చ మై జనసంఖ్య ౨౪ లక్షలు ౧౨ పంజాబు జిల్లాలు ౨౯ విస్తీర్ణము ౯౭ వేల చ మై జనులు ౨౪౦ లక్షలు ౧౩. ఐక్యమాగాణములు. జిల్లాలు ౪౮ విస్తీర్ణము ౧౦౭

వేల చ. మై. జనసంఖ్య ౪౮౦ లక్షలు. మొత్తముమీద బ్రిటిష్ రాజ్యభాగములు ౧౩. అందలి జిల్లాలు ౨౫౯. పై నుదాహరించిన రాష్ట్రములలో అజ్మీర్-మేర్వారా, కొడగు, ఢిల్లీప్రాంతములుతప్ప మిగిలిన వన్నియు గవర్నరులచేతను, వారికి సలహాయిచ్చు మంత్రాంగముచేతను పాలింపబడుచున్నవి.

## స్వదేశరాజ్యములు

హింద్ూదేశమున స్వరాజ్యము లనునవి యించుమించుగా ౬౦౦ కలవు. వీనిలో మిగులగొప్పది నిజాం రాష్ట్రము. మిగుల చిన్నది లావా. దీని విస్తీర్ణము ౧౦ చ. మైళ్లు. రాబడి ౧౦,౦౦౦ రూపాయలు. ఈక్రింద కొన్ని స్వదేశరాజ్యముల పేర్లను, వాని విస్తీర్ణమును, ఆదాయమును స్థూలముగా దెల్పెద—

| | చ. మై. | | లక్షలు | | లక్షలు |
|---|---|---|---|---|---|
| హైద్రాబాదు | ౮౩ వే. | ఆదాయము | ౭౫౦ | జనసం. | ౧౪౦ |
| జమ్ము-కాశ్మీరము | ౮౪ వే. | ఆదాయము | ౨౨౫ | జనసం. | ౩౫ |
| మైసూరు | ౨౯ వే. | రాబడి | ౩౫౬ | జనసం. | ౬౨ |
| బరోడా... | ౮ వే. | రాబడి | ౨౪౬ | | |
| బికనీరు | ౨౪ వే. | రాబడి | ౯౦ | | |
| జోధ్పూరు | ౩౫ వే. | ఆదాయము | ౧౨౦ | | |
| జయపూర్ | ౧౬ వే. | రాబడి | ౧౨౫ | | |
| ఆళ్వార్ | ౩ వే. | రాబడి | ౫౫ | | |
| ఇండోరు | ౧౦ వే. | ఆదాయము | ౧౨౪ | | |
| భూపాల్ | ౭ వే. | ఆదాయము | ౬౨ | | |
| తిరువాన్కూరు | ౮ వే. | రాబడి | ౨౫౦ | | |
| కొచ్చిన్ | ౧౫ వం. | రాబడి | ౭౭ | | |
| కొల్హాపురం | ౩౨ వం. | రాబడి | ౧౧౩ | | |
| సావంతవాడి | ౯౨౫ | రాబడి | ౬౮ | | |
| కూచిబిహార్ | ౧౩౦౦ | రాబడి | ౪౨ | | |
| పాటియాలా | ౬ వేల | ఆదాయము | ౧౩౫ | | |

మిగిలినవానిగూర్చి విషయవిస్తరభీతిచే వదలివేసితివి. ఈ ౬౦౦ స్వదేశరాజ్యములు గాక నేపాల్, భూటాన్ అనునవి రెండు స్వతంత్రరాజ్యములు హిమవత్పర్వతప్రాంతములం గలవు. వీనిలో నేపాళము సర్వస్వతంత్రరాజ్యము. దీని విస్తీర్ణము ౫౬ వేల చ. మై. జనసంఖ్య ౬౦ లక్షలు. ఆదాయము ౨ కోట్ల రూపాయలు. ఈప్రభుత్వాధీనమున ౪౫,౦౦౦ సైనికులు గలరు. ప్రభునామము మహారాజాచంద్రషంషర్ జంగ్ రాణా. పై జెప్పిన వివిధభాగములుగాక ఫ్రెంచివారికిని పోర్చుగీసువారికిని చెందిన ప్రాంతములు కొన్నిగలవు. వీని విస్తీర్ణము బహుస్వల్పము—

## రాష్ట్రీయప్రభుత్వములు—ఆదాయము

రాష్ట్రీయప్రభుత్వములకు లాండ్ రెవిన్యూ, ఎక్సైజ్, స్టాంపులు, అడవులు, రెజిస్ట్రేషన్, ఇరిగేషన్, నావిగేషన్, సివిల్ అడ్మినిస్ట్రేషన్, అనగా కోర్టులు జయిళ్లు మొదలగువాని మూలమున విశేషాదాయము వచ్చుచుండును. ఈక్రింద ఆయారాష్ట్రములకు సగటున వచ్చు సాంవత్సరికాదాయములును వివరింపబడును.

౧. బొంబాయిరాష్ట్రము:—ఆదాయము ౧౬ కోట్లు. విద్యాశాఖకు సగటున వెచ్చించునది ౨ కోట్ల ౭౫ లక్షలు. పోలీసుశాఖకై వ్యయపఱచునది ౧౯౦ లక్షలు.

౨. మదరాసు:—సగటున అనగా దరహమీద వచ్చు ఆదాయము ౧౭ కోట్లు. విద్యాశాఖకు వెచ్చించునది ౨ కోట్ల ౫౦ లక్షలు. పోలీసుశాఖకు వెచ్చించునది ౨ కోట్లు.

3. బెంగాలు:—ఆదాయము ౧౩ కోట్లు. విద్యాశాఖకు ఖర్చుపెట్టునది ౧౪౦ లక్షలు. రక్షకభటశాఖకు వెచ్చించునది ౨౦౦ లక్షలు.

౪. ఐక్యమాగాణములు. ఆదాయము ౧౬ కోట్లు. విద్యాశాఖకు ౨ కోట్లుఖర్చు. పోలీసుసిబ్బందికి ౧ కోటి ౮౦ లక్షలు.

౫. పంజాబు:—ఆదాయము ౧౫ కోట్లు. విద్యాశాఖకు ౨ కోట్లు ఖర్చు. పోలీసుసిబ్బందికి ౧౪౦ లక్షలు.

౬. బర్మా:—ఆదాయము ౧౩ కోట్లు. విద్యాశాఖకు ౧ కోటి ౩౦ లక్షలుకర్చు. రక్షకభటవర్గమునకు ౧ కోటి ౬౦ లక్షలు.



న్యాపతి రామారావుగారు




షా మహమ్మద్ సులేమానుగారు
అలహాబాదు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి



టి. యస్. రామస్వామయ్యర్ గారు
చెన్నపురి పురపాలక సంఘాధ్యక్షులు



మూడవ రేడియాలజీ అంతర్జాతీయమహాసభ, ప్యారిసు



బర్మాకాన్ఫరెన్సు, లండను మే. అంగ్ శన్ ఉపన్యసించుచున్నది.



అఖిల భారత శాసనసభాధ్యక్ష మహాసభ, ఢిల్లీ



అఖిల భారతమహిళామహాసభ, చెన్నపురి

౭. బిహార్ అండ్ ఒరిస్సా:—ఆదాయము ౭౫౦ లక్షలు. విద్యాశాఖకు ౮౦ లక్షలు. పోలీసుశాఖకు ౬౦ లక్షలు.

౮. మధ్యపరగణాలు:—ఆదాయము ౮౦౦ లక్షలు విద్యాశాఖకు ౬౫ లక్షలు. పోలీసుకు ౬౪ లక్షలు. ఇట్లే మిగిలిన రాష్ట్రములకును నిశేషాదాయము వచ్చుచుండును.

కేంద్రప్రభుత్వాదాయము

కేంద్రప్రభుత్వమునకు ముఖ్యముగా కష్టమ్సు, రాబడిపన్ను, ఉప్పుపన్ను, నల్లమందుపై పన్ను మొదలగు వాని మూలమున సగటున సంవత్సర మొకటింటికి ౧౩౦ కోట్ల రూపాయల యాదాయము వచ్చును. ఒకటఉప్పు పన్నుమూలముననే ౭ కోట్ల రూపాయలును, నల్లమందుపై 3 కోట్ల ౫౦ లక్షల రూప్యములును వచ్చును.

కేంద్రప్రభుత్వాంగము

ఇండియా యంతటికి వైస్‌రాయి అండ్ గవర్నర్ జెనరలు ముఖ్యాధికారి. ఈయనకు దోడ్పడునట్టి కార్యనిర్వాహకసంఘము నందలి సభ్యులు ఏడ్గురు. వీరిలో నలుగురు యూరోపియనులు. సైనిక, ఆర్థిక, రైల్వే, వర్తక, దేశీయాంగము మొదలగు ప్రధానశాఖలను యూరోపియన్ మెంబర్లు పాలించుచుందురు. గవర్నరు జనరలుకు సలహాయిచ్చునట్టి సంఘములు రెండు వేఱుగ గలవు. ఒకటి లెజిస్లేటివ్ అసంబ్లీ, రెండు కౌన్సిల్ అఫ్ స్టేటు. అసెంబ్లీసభ్యుల సంఖ్య ౧౪౯, వీరిలో ౧౦౪ మంది ప్రజాప్రతినిధులు. ౨౫ గురు ప్రభుత్వోద్యోగులు. ౨౦ మంది ప్రభుత్వనియమిత ఉద్యోగేతరసభ్యులు. ఈ ౧౪౯ గురు సభ్యుల్లలో ౧౬ గురు చెన్నరాష్ట్రపక్షమున సభ్యులుగ నున్నారు.

కౌన్సిల్ఆఫ్ స్టేటులో 33 మంది ఎన్నికసభ్యులును, ౧౬ గురు ప్రభుత్వోద్యోగులుగను, ౯ మంది ప్రభుత్వనియోజితోద్యోగేతరసభ్యులుగను నున్నారు.

దేశసంరక్షణము

కేంద్రప్రభుత్వమునకు వచ్చు ౧౩౦ కోట్ల రూపాయల యాదాయములో దేశసంరక్షణార్థము స్థాపింపబడిన సైనికశాఖనిమిత్తము ఏటేట నించుమించుగా ౫౦ కోట్ల రూపాయలును, మిలిటరీవర్క్సునిమిత్తము ౪ కోట్లును, నౌకాదళశాఖకు ౯౦ లక్షలును వ్యయమగుచున్నది. దీనిలో నిండియాయందలి సైనికశాఖనిమిత్తము ౪౦ కోట్లును, ఇంగ్లండునందలి సైనికదళనిమిత్తము ౧౫ కోట్లును వ్యయమొనర్పబడుచున్నది. ఇండియాలోని సైనికుల సంఖ్య ౧౯౦ లక్షలు. వీరిలో బ్రిటిష్‌ట్రూప్సు అనగా సోల్జర్సు ౬౦ లక్షలు. మన సిపాయీలు ౧౩౦ లక్షలు.

పోలీసుశాఖ

బ్రిటిష్‌యిండియాలో గల మొత్తము పోలీసు ఉద్యోగుల సంఖ్య ౨ లక్షలు. వీరిలో రక్షకభటులు ౧౫౦ వేలు సబ్‌యినస్పెక్టరులు ౯౩౦౦ మంది. ఇనస్పెక్టరులు ౨౧౦౦. జిల్లాసూపరింటెండెంట్లు 33౦ మంది. ఇన్‌స్పెక్టర్‌జనరలులు ౫౦ మంది. మొత్తము యీపోలీసు సిబ్బంది యంతటికి నేటేట ౧౦ కోట్ల రూపాయలు వ్యయమగుచున్నది.

విద్యాసంస్థలు

ఇండియాలో ప్రభుత్వాంగీకారము పొంది ప్రభుత్వధనసహాయము నొందుచున్న విశ్వవిద్యాలయములు ౧౮ గలవు. ౧. కలకత్తా, ౨. మదరాసు, 3. బొంబాయి, ౪. పంజాబ్, ౫. అల్లాహాబాదు, ౬. హిందూ యూనివర్సిటీ, ౭. మైసూరు, ౮. పాట్నా, ౯. ఉస్మానియా, ౧౦. డక్కా, ౧౧. అలీఘర్, ౧౨. రంగూన్, ౧3. లక్నో, ౧౪. ఢిల్లీ, ౧౫. నాగపురము, ౧౬. ఆంధ్ర, ౧౭. ఆగ్రా, ౧౮. అన్నామలైయనునామములు గల విశ్వవిద్యాలయములు క్రమముగా నొకదానితర్వాత నొకటి నెలకొల్పబడెను.

ఇవిగాక స్వతంత్రముగ నిర్వహింపబడుచున్న విశ్వవిద్యాలయములు కొన్ని గలవు. పునహానగరమునందలి మహిళావిశ్వవిద్యాలయము ప్రొఫెసర్ కార్వే మహాశయుని నిరంతరకృషివలనను, హరిద్వారమునందలి గురుకులమును, బోల్పూరునందలి విశ్వభారతిఅను అంతర్జాతీయవిశ్వవిద్యాలయము కవీంద్రుడగు రవీంద్రుని చేతను, అడయారునందలి దివ్యజ్ఞానసమాజమువారి సర్వకళాశాలయును, గుజరాతునందలి జాతీయవిశ్వవిద్యాలయము మహాత్ముని ప్రాపునను వర్ధిల్లుచున్నవి. ఇక విద్యాలయవ్యాప్తినిగూర్చి యొకింత విచారింతము మొత్తముమీద హిందూసామ్రాజ్యమందంతట ౨౧౩ పురుషుల కళాశాలలును, ౧౯ స్త్రీకళాశాలలును, ౪౪౫౦ బాలుర యున్నతవిద్యాలయములును, ౨౪౫ బాలికల యున్నతవిద్యాలయములును, ౧౭౦ వేల బాలుర ప్రాథమికవిద్యాలయములును, ౨౭ వేలు బాలికల ప్రాథమిక విద్యాలయములును గలవు.

## వ్యవసాయపరిస్థితులు

హిందూదేశమందంతట సర్వేకొలతల ననుసరించి ౭౫ కోట్ల ఎకరముల భూమి కలదు. ఈభూమిలో ౩౦ కోట్ల ఎకరములు సాగుబడిక్రింద నున్నవి దేశమునంగల అరణ్యముల విస్తీర్ణము ౮౭౦ లక్షల ఎకరములు బ్రిటిష్ యిండియాలో దరహంమీద ఏటేట ౮ కోట్ల ఎకరములలో వరిపంటయును, ౨౪౦ లక్షల ఎకరములలో గోధుమలును, ౭ లక్షల ఎకరములలో బార్లీగింజలును, ౨ కోట్ల ఎకరములలో జొన్నలును, ౫౬ లక్షల ఎకరములలో మొక్కజొన్నలును, ౧౩౫ లక్షల ఎకరములలో అపరధాన్యమును, ౮౦ లక్షల ఎకరములలో పండ్లు, కాయలు, సుగంధద్రవ్యములును, ౩౦ లక్షల ఎకరములలో చెఱకును, ౧ లక్ష ఎకరములలో కాఫీగింజలును, ౭ లక్షల ఎకరములలో తేయాకును, ౧౫౦ లక్షల ఎకరములలో చమురుగింజలును, ౧౮౦ లక్షల ఎకరములలో ప్రత్తియును, ౩౦ లక్షల ఎకరములలో జనపనారయును, ౧౧ లక్షల ఎకరములలో పొగాకును పండింపబడుచున్నది. లోగడలెక్కలతో పోల్చిచూచిన వరి, తేయాకు, చమురుగింజలు, ప్రత్తి, పొగాకుపంటలు నానాట యభివృద్ధిగాంచుచున్నట్లు తెలియగలదు. తేయాకు, కాఫీపంటలు చాలవఱకు విదేశీయుల హస్తగతమైయున్నవి.

## ఖనిజసంపద

ఇండియాలో దరహంమీద యేటేట ౧౦ కోట్ల రూపాయల విలువగల రాతిసిబొగ్గును, ౮ లక్షల టన్నుల యినుమును, ౧౨ లక్షల టన్నుల మాంగనీసును, ౨ కోట్ల రూపాయలవిలువజేయు బంగారమును, ౫ కోట్ల రూపాయల విలువచేయు పెట్రోలు బర్మాయందును, ౯౫ లక్షల రూపాయల విలువచేయు అభ్రకమును, యిట్లే మరికొన్ని ఖనిజములును లభింపగలవు ఖనిజసంపద విశేషముగ గలదుగాని తగినప్రోత్సాహము శూన్యము.

## ఎగుమతి—దిగుమతులు

సగటువ ఏటేట ౯౦ కోట్ల రూపాయల విలువచేయు కిత్తనారగోతములు, కిత్తనారయును, ౫౬ కోట్ల విలువచేయు ప్రత్తియును, ౪౫ కోట్లు విలువచేయు ధాన్యమును, ౩౦ కోట్ల విలువచేయు తేయాకును, ౪౫ కోట్ల విలువచేయు చమురుగింజలును ౭ కోట్ల విలువచేయు లక్కయును, ౨ కోట్ల విలువచేయు సుగంధద్రవ్యములును, ౧౩౦ లక్షల విలువచేయు కొబ్బెరపీచు, కొబ్బెరయును యిట్లే మరికొన్ని వస్తువులు మొత్తముమీద ౩౨౦ కోట్ల రూపాయల విలువచేయునవి విదేశముల కెగుమతియగును. కాని కిత్తనారగోతముల వ్యాపారమును, తేయాకు వ్యాపారమును ముప్పాతికవంతు యూరోపియన్ వర్తకుల, వ్యావసాయకుల స్వాధీనమున నున్నది.

దిగుమతిసరకులు:—ఏటేట సగటున ౭౦ కోట్ల రూపాయల విలువచేయు నూలు, నూలువస్త్రములును, ౩౦ కోట్లు విలువచేయు లోహములు, లోహసామగ్రులును, ౧౬ కోట్ల విలువచేయు యంత్రములు, యంత్రపరికరములును, ౧౬ కోట్ల విలువచేయు శర్కరయును, ౧౨

కోట్ల విలువచేయు కాగితములు, అట్టలును, ౨౫౦ లక్షల విలువచేయు గాజుపరికరములును, ౧౬౦ లక్షల విలువచేయు సబ్బులును, ౯౦ లక్షల విలువచేయు కలములు, పెన్సిళ్లువగైరాలును, ౭౦ లక్షల విలువచేయు బూట్సులు వగైరాయును, ౬౦ లక్షల విలువచేయు ఆటవస్తువులును, ౩౦ లక్షల విలువచేయు గడియారములు, ౪౦ లక్షల విలువచేయు అగ్గిపెట్టెలును యిట్టి తదితర వస్తువులును మొత్తముమీద ౨౫౦ కోట్ల రూపాయల విలువచేయు సరుకులు దిగుమతియగుచున్నవి. ఎగుమతి వ్యాపారమువలెనే దిగుమతివ్యాపారమును ముప్పాతిక వంతు యూరోపియనువర్తకుల యధీనమున నున్నది.

## రైలుమార్గములు

మనదేశమునం గల రైలుమార్గముల మొత్తము నిడివి ౪౦ వేల మైళ్లు. ఈమార్గములు నిర్మించుటకు ౮౦౦ కోట్ల రూపాయలు ఖర్చు ఆయెను. రైల్వేల మూలమున నేటేట ౧౨౦ కోట్ల రూపాయల ఆదాయము వచ్చును. కాని వ్యయము ౭౦ కోట్లుండును.

## సివిల్ కోర్టులు

ఇండియాలో ఉన్నతన్యాయస్థానము లనునవి మద్రాసు, బొంబాయి, కలకత్తా, రంగూను, పాట్నా, లాహోరు, అల్హాబాద్ నగరములలో నొక్కొకటిచొప్పున గలవు. ఇవిగాక అయోధ్యలో చీఫ్ కోర్టును, సింధు, అస్సామ్, నాగపురము, పెషావర్ ప్రాంతములలో జ్యూడిషల్ కమీషనరుకోర్టు లనునవి యొక్కొక్కటి చొప్పునను గలవు. ఇవిగాక జిల్లాకోర్టులు, సబ్ కోర్టులు, మునసబుకోర్టులు లెక్కకు మిక్కిలిగా గలవు. ఏటేట ౨౫ లక్షల వ్యాజ్యెములు దాఖలుకాగలవు. లెక్కలను పరిశీలించిచూచిన కాలము గడచుకొలది వ్యాజ్యెముల సంఖ్య ఎక్కువగుచున్నది. గడచిన రెండేండ్లనుండి వ్యాజ్యెములు పడిపోయినవి.

## కారాగృహములు

నిరంతరము ౧ లక్షమంది కారాగారములం దుందురు. ఏటేట ౫ లక్షల జనులు కారాగారములకు వచ్చుచు విడుదలయయి పోవుచునుందురు. యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష ననుభవించువారు ౧౭౦౦ ఉందురు. నిర్ణీతకాలము ద్వీపాంతర మనుభవించువారు ౫౦ మంది గలరు. ఏటేట మరణదండన విధింపబడువారు ౧౦౦౦ మంది యుందురు.

## నేతపరిశ్రమ

ఇండియాలో ౧౮౭౨-వ సంవత్సరమున ౫౧ నూలుమిల్లులును, ౧౨ లక్షల కదుళ్లును, ౧౦ వేల మగ్గములు నుండెను. ౧౯౦౦ సంవత్సరములో ౧౯౩ నూలుమరలును, ౫౦ లక్షల కదుళ్లును, ౪౦ వేల మగ్గములు నుండెను. ౧౯౨౭ ఆగస్టు ౩౧-వ తేదనాటికి ౩౩౬ నూలుమరలును, ౮౭ లక్షల కదుళ్లును, ౧౬౦ వేల మగ్గములు నుండెను. నేతపరిశ్రమ నానాట నభివృద్ధి గాంచుచున్నది.

## ప్రధానసంస్థలు — సంఘములు

హిందూదేశమున ప్రసిద్ధికెక్కిన సంఘములలో (౧) బ్రిటిష్ ఇండియన్ పీపుల్సు ఎసోసియేషన్, (౨) సర్వెంట్సు ఆఫ్ ఇండియాసొసైటీ, (౩) పూనాసేవాసదనము, (౪) భారతనారీమణులసంఘము, (౫) యువజన భారతక్రైస్తవసంఘము, (౬) ఇండియన్ సొసైటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్టు, (౭) ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పొలిటికల్ అండు సోషల్ సైన్సు, (౮) నేషనల్ ఇండియన్ అసోసియేషన్ అనునవి ప్రధానమైనవి.

## రాజకీయసంస్థలు—సాంఘికసంస్థలు

౧. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్—దీనికే అఖిల భారతమహాజనసభ యందురు. ఇయ్యది ౧౮౮౫-వ సంవత్సరమున 'హ్యూమ్' అను నాంగ్లప్రముఖుని చేతను, భారతపితామహుడని వాసిగాంచిన శ్రీదాదాభాయి

నౌరోజీమహాశయునిచేతను ప్రప్రథమమున స్థాపింపబడెను

౨ నేషనల్ లిబరల్ ఫెడరేషన్ — ఇయ్యదియే మితవాదసంఘము ౧౯౧౮-వ సంవత్సరమున సురేంద్రనాథబెనర్జీగారి యాజమాన్యమున ప్రప్రథమమున సమావేశమయ్యెను. శాస్త్రి, సప్రూ, జయకర్, చింతామణి, సేత్నా, సేతల్వాడ్ ప్రభృతుల ప్రాపున వర్ధిల్లుచున్నది

ముస్లిమ్ లీగ్ — ముసల్మానులు తమ రాజకీయ, ఆర్థికాదిహక్కులను కాపాడుకొనుటకై ఏర్పఱచుకొనిరి స్థాపితము ౧౯౦౬ న

కిలాఫత్ కమిటి — ఇయ్యది ౧౯౨౦-వ సంవత్సరమున కాంగ్రెస్‌పక్షాభిమానులగు ముసల్మాన్ ప్రముఖులచేత గాంధీమహాత్ముని ప్రోత్సాహాశీర్వాదబలమువలన స్థాపింపబడెను కాని యిప్పటి వీరి యాశయములు కాంగ్రెసునకు ప్రతికూలములుగ నున్నవి

౫ నేషనల్ ముస్లిమ్ పార్టీ — మహమ్మదీయసంఘము లన్నిటిలో యీసంఘమునకు ఎక్కువ ప్రాబల్యము, వ్యాప్తి కలదు

౬ హిందూమహాజనసభ — ఇయ్యది హిందువుల క్షేమాభివృద్ధినిమిత్తము పూజ్యులగు మాలవ్యా, శ్రద్ధానందస్వామి, దర్భాంగమహారాజాగార్లచే స్థాపింపబడెను

---

# బసవపురాణము వెల 2-8-0

గ్రంథకర్త — పాల్కురికి సోమనాథకవి పరిష్కర్త — వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

పండ్రెండవ శతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము ఇందు శైవమతోద్ధారకు డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు, తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసుకరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగు పలుకుల జాలువార్చి రచనమున ముద్దులు గురిపించినాడు. గ్రంథము భిన్నభిన్నమండలములకు జెందిన పెక్కు తాళపత్రమాతృకలతో సరిచూచి పరిష్కరింపబడినది పాఠాంతరములు సూచింపబడినవి పరిష్కర్త రచియించిన అమూల్యమగు పీఠిక (129 పుటలు) ఇందుగలదు ఆకాలపు టపూర్వసారస్వతచారిత్రకవిశేషముల లెక్కకు మిక్కిలిగ నందు పరిష్కర్త యేర్చికూర్చినారు విద్యార్థిలోకమునకు, ఆధునిక కవికుమారులకు నిది యత్యంతోపకారకము

మేనేజరు ఆంధ్రగ్రంథమాల, 6-7, తంబుశెట్టివీధి, జార్జిటవున్, చెన్నపురి.




అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు

కన్నతలిదండ్రులు పెంచినపెద్దలు తమయీడువారు తనుకన్న పిల్లలు చుట్టపక్కములు లిరుగుపొరుగులు తమయూరివారు తమ నాటివారలుం బెట్టుపోఁతల నెమ్మితో మఱియుం దమ్ముఁ జేరఁదీయు నెవ్వరైనన్గాని తమకుఁ జేసినమేలు మఱవఁబోక యటువంటి మంచి వారియెడల మిక్కిలి యడఁకువతో నెల్లపుడుంట తనువారలకు గుఱుతు. తాఁగూర్చినసొమ్ము తనపుట్టినయూరిలోనే వెచ్చించుట తన కెంతో మేలు చేకూర్చును

కూడుగుడ్డ లిండ్లు వాకిళ్లు పాఁడిపంట లొడలు వంచి పాటు పడి నొసటిచెమ్మట నూడ్చి తమంతటఁ దామే సమకూర్చుకొను నేర్పరులు వన్నెవాసుల కెక్కెదరు. ఇరుగుపొరుగులవా రెల్లరు తమ్ముఁ జూచి మిగుల మెచ్చుకొనులాగున నడచుకొను తనువా రల్లెడల న్మంచి పేరు మాఱఁగొనియెదరు. తమతోటిపాటి వారందఱు దమ పెంపు గోరునట్లు వంగి లొంగి తిరుగుటకన్న నెవ్వరికైన న్నేర్చుకొనఁ దగిన చదు వింకెద్దియు న్నానేకాదు ఒరులకు మేలుచేసినదప్పఁ దనకు మే లొనఁగూరదు కనుకఁ దనతోటిపాటివారిమంచికై తనయొడ లప్పగించువానికన్న గొప్పనేర్పరి చదువరి మిన్న మఱెవ్వఁడు న్నానేరఁడు తనతల్లిదండ్రులు దనకంటెఁ బెద్దలు న్మఱవరైనప్పటికి న్నా నడఁకువతో నున్నప్పుడు తప్పక తనకు మేల్కావించు తగినవడవడి న్దమం తట న్దాము కోరి మప్పక మానరు నిక్కముగాఁ దనుఁ గనిపెంచిన తల్లిదండ్రులకన్నఁ దాఁ గొల్వఁదగిన వేల్పులు మఱెవ్వరు న్మమ్మాటికి న్లేరు.

బాపఁడుకానీ, దొరకానీ, బేరికానీ, కాపైననానీ, మఱెవ్వఁడైన న్మఱెతెగలోఁ జేరినవాఁడైనప్పటికి న్దన పెద్దలు మప్పినచొప్పునఁ బనిపాట్లు చేయుచుఁ దనయూరికిఁ బదా ఱామడలచుట్టుకొలత దవ్వున వాడుకొనఁబడుచున్న నాటుమాటలఁ జదువుకొని వ్రాయఁగలనేర్పు కుదుర్చుకొనుటకుఁ గొంతప్రొద్దు గడపుచుండుట మేలు. చెట్లెక్కుట, యీఁతాడుట, యెంతో మీఁదికెగఁ బ్రాఁకుట, క్రిందికి జాఱుట, వడిగాఁ బరుగెత్తుట, దాఁటుట, యెగురుట, తూనికతప్పక సన్నపు పట్టలపైనుండి కాల్వగట్టుల కిరుపైపుల వేటిదవ్వు సులువుగా నడచి వెళ్లుట, తలపైఁ గాని మూపుమీఁదఁగాని చేతులతోఁగాని తగిన కొలంది బరువు మోయుట, యైదాఱు నిలువుల లోఁతు నీట మునిఁగి యడుగంటిన నల్లపూసనైన నూపిరి బిగియంబట్టి పైకిఁదీయుట, పలుతీరుల జెట్టిపట్లు పట్టుట, హెచ్చుతగ్గరవళ్ల న్గొండెలు మ్రోఁగునట్లు పెక్కందముల న్దమంతఁ దాము పన్నుకొనిన వింతవింత దరువులు పాడుట, మూపులకుఁ దీపులొదవించునాడిక్కఁ గ్రొంగ్రొత్త చెలువులఁ జిందులు ద్రొక్కుట, పలుతీరుల యొడలికదలికల న్దనలోని తలంపుల న్సొగసుగా నెల్లడించుట, మువ్వడిఅవళుల నెల్లమీటవాద్దెముల నారితీరుట, యెంత చిన్నగాటున నైనఁ గాని నక్కియుండుట, యొక్కసారి వినినంతనే యెంతపెద్దపద్దెమైన నచ్చుగ్రుద్దిన ట్లప్పచెప్పుట, మాటకారు లౌరాయనునట్లు తెల్వితేటలతో నెల్లరివీనుల కింపుగాఁ గమ్మచ్చునఁదీసినతీరుగాఁ గడువడి నెంతక్రొత్తపాత్తమైనఁ జదువుట, ఒరులు త్రొక్కని త్రోవ నబ్బురమైన కబ్బము లల్లి నెల్లడించుట, మిక్కిలిచులుకుగా నందముగా వ్రాయుట, గుఱితప్పక కొట్టుట, యన్నిపనుల న్దోడివారలకుఁ దోడ్పడుట, తానే పనిచేసిన్నరే మఱెట్టినడవడిచేతనయినఁగాని తనతోటిపాటివారల న్మెప్పించుటకొఱకే యెల్లపుడున్ దొరకొనుట, యొరుల న్గొంచెమైన నొప్పింపక కల్లలాడక మ్రుచ్చిలింపక మోసపుచ్చక ప్రొద్దువేల్పు వ్రేఁబవళ్లు తన్గాపాడుటకై పిట్టకైన న్దెలియనీక తనయుల్లములోనే వేఁడుకొనుచు మంచిపిల్లవాఁ డీడుముదిరినకొలఁది న్మేల్మిబంగరువలెఁ దఱుగుబెఱుగులేక వన్నెవాసుల న్మించుచుండును. మరియాపగల తలిదండ్రులకు న్పుట్టినవారెల్లపుడు న్దమతోటిపాటివారలమేలే కోరుచుఁ గామువాటుపడి కూర్చుకొన్నకలిమి నిరుగుపొరుగులకెల్లం బంచియిచ్చి యందఱితోఁ బొందిపొసఁగి పొత్తుమిగులఁ దమబ్రతుకు హాయిగాఁ గొనసాగించుకొనఁ గలుగుదురు. మంచివారు తమతోటిపాటివారి నందఱి న్దమకన్న నెక్కువగాఁ జూచుకొనుచుందురు కాని యెవ్వరినైనం జులకనాడనొల్లరు. మఱియు నొరు లెంతపిన్నలయినఁగానీ యెవ్వరినయిన న్జుల్కనఁ జూడనొల్లరు. మంచివా రెద్దియైన న్దమకుఁ గీడువాటిల్లినపు డొరులపై నిసుమంతయు న్నేరము మోపక తమ పొరపాటునఁగాని చెప్పనలవికాని మఱెందుచేతనోకాని యట్టియిడుమ పొందవలసివచ్చెనని యెంచుకొని మిక్కిలి యోర్పుతోఁ దమ యిబ్బంది వెలిపుచ్చక తమ్ము నొగు లొక్కింతయు న్వెల్లడించక చేతనైనంతవ ట్టూపిరి యున్నంతవఱ కెల్లరికి న్మేలే చేయుటకై పనివడుచుందురు. ఏయుసురులనయినన్ జంప నొల్లక మఱెట్టినంజుడునయిన న్గాని కలనైన న్దినఁబోక యెల్లపుడున్ బ్రొద్దువేలుపునకు మ్రొక్కుకొనుచు, మిఱ్ఱుపల్లములనే

లందమంతఁ దమచేతిపాటుతో సాగుచేసికొని యెడ్లు దున్న లాంకెలు గుజ్జములు మొదలగు నాలుగుకాళ్ల మైతాల్పుల కెవ్వానికైన నెట్టి యిబ్బంది యున్నలు గఁజేయ కెల్ల పైరులన్ బండింపుకొనుచుఁ గూరగాయలన్ బెంచుకొనుచు నన్ని తెఱంగుల తినుబడి దినుసుల న్వలసినంత కూర్చుకొని యిరుగుపొరుగులతోఁ బంచుకొని హాయిగా నొండొరులపొత్తున మనుచుఁ బల్లెల న్వలసలఁ బూరి యిండ్ల న్గాఁపురము సేయుచు, నగలు నాణెములు మఱియు లేనిపోని డంబము చూపక సోమరిపోతులై యిఱుకుముఱికిపట్నముల నిఱిసికొని యొడళ్లం గాని, యెడఁదలం గాని బింకము చెఱచుకొనక తమపెద్ద లేగినత్రోవన్ • రవంతేనియు న్దప్పక యేనెపంబునఁ గాని యెవ్వరిని నిసుమంతయు న్నొగులు దగిలింపఁబోక కలకాలందిన్ దన్వియెర్పులతో బ్రతుకుచు, సుండియ బిగిన్ జెఱచుచెడునలవాటుల కెడమయి చీఁకటితప్పు తాసికమాసిక తబ్బిబ్బు టకటొంకుఁ గలనైనన్ జేయనొల్లక యిలువేల్పులవలె నెల్లరికి న్మేలే చేయు తెల్వితేటలు గలవారే బాపండ్రు. మఱి యైదేండ్లయీడు మొదలుకొని నేలనేలిన తొల్లింటి గొప్పదొరల నడవడిం గూర్చిన ముచ్చటలు వినుచుఁ దమపెద్దలవలెఁ దాముగూడఁ దమయింటిపరువు నిలఁబెట్టుకొనఁగోరి గిదువుసాముల నారితీరి యీడుముదిరినకొలంది నెల్లతీరుల దొంగదొసఁగుల నడఁచుచుఁ గసవుమేసవు నాల్గుకాళ్లమైతాలుపుల నెల్లన్ దమలొంగుబడికిఁ దెచ్చుకొని తనకోరినపనిపాటులన్ ద్రిప్పుకొని కంటికి ఱెప్పవలె వాని నెల్లప్పుడు న్గాపాడుచుఁ బంటచేలం బాడిగొడ్లం బట్టి తిను పులి మొదలగు క్రుక్కుడుమెకములం జక్కడంచుచు నెల్లపుడు న్దమ • తోటిపాటి యిరుగుపొరుగు మంచివారల న్గాపాడుచుఁ దమయేలుబడి నేల నెట్టిపగవారైనఁ జొర నలవికానితీరున నడ్డుకట్టించి కాపునెట్టి కేఁబవ ల్లేమఱక యెట్టియిక్కట్టుల కొడిగట్టియైనఁ దమప్రాపు నమ్మికొన్నవారి నెల్లఁ దమకన్న నెక్కువచేసి హాయి న్గాపాడుచు వేల్పులచేత న్గూడ నౌరాయనిపించుకొనఁజాలినకల్మిబల్మి పేరుపెంపులవాసి కెక్కినవారే దొరలు కలనైనన్ సోమరులుగాక యెల్లవారి నెట్టినెత్తియు న్రానీక పొదుపుగాఁ గాఁపురము చేయుచు బ్రతుకునకు వలయు పాఁడిపంటలన్ దమతోటిపాటివారల కందఱికిన్ బదేండ్లవఱకున్ సరిపడునట్లు నిలువచేయును రాఁబడి వెచ్చముల నొకింతయున్ బొరవడ కెల్లరితో సరిగా వంతుఁబంచుకొని పాటువడి కూడుగుడుచువారే బేరులు మఱియు నీమూఁడుతెగలవారిన్ దమ యిలువేలుపులవలె నెల్లతీరుల నేలోపైన నెన్నఁడున్గాని పొందనీక న్నితెఱఁగుల పనిపాట్లన్ దోడుపడి కొలుచుచు మిగుల నోర్మియొడలు దాల్చినకైవడి న్నడచుకొనఁగల యొప్పులకుప్పలే కాపులు దాఁపల మంచుఁగొండయు న్దక్కినమూఁడువైపులఁ గడలియు నెల్లలుగా నొప్పారుచుఁ బూర్వపడమరల కొలతలో నొకవం తెక్కువగా డాఁపలి మేర నలరారు చెల్లపంటల వెల్లివిరియుపాడవుకొండల న్గాని కారడవుల న్గాని మిట్టపల్లముల న్గాని-తీయనీళ్లవలయు చోట్ల-నెల్ల వెదచల్లు నేటికాల్వలం గాని-కలువతమ్మిపూఁదావులంజిమ్ముచు వండలకొలంది పెద్దే నుంగుమంద లీఁతాడఁ జాలినయడవిమడుఁగులఁ గాని, కడువిరివిగల మెరకలం గాని పలురకముల పైరుల నెరువెఱుఁగక యొకపదునువానయైనఁ గురిసినప్పటికిం గావలసినంత యెల్ల పంటలన్ బండు పొలముల న్గాని-యన్ని తెన్నులం బనికివచ్చిన పెక్కుతీరుల తీఁగె పొద పూఁ గాయ పండు చెట్టుచేమలవలరారు పెన్దోఁటలం గాని వేయేల? — కోరుకొన్న దినుసుల నెల్ల నెల్లి గురియుచుఁ జిచ్చుకొండల క్రచ్చు గాని, మున్నీటి ముప్పు గాని, కొలఁదిమీఱిన చలియెండవానలతాఁకు గాని, యెడతెగని యొఱపు గాని మిద్దెటిండ్లం బడఁగూల్చు నేలవడఁకు గాని మఱియెంటు తెవుళ్లయినం గాని కొఱతవేయుట, కాలు సేతులు తెగఁగొట్టుట-తల నఱకుట మొదలగు నుసుఱుపు నెట్టికట్టిఁడికటికపడికట్టుల న్గాని వేల్పులకు వేఁటవేయుట ప్రేవులుదీసి చిచ్చున వ్రేల్చుట నంజుడుదినుట దొట్టిమఱెట్టిగొడగరిపనుల న్గాని రవంతయైన నొకప్పుడేనిఁ దలపెట్టక పసిపాపపు న్నెమ్మదుపు వెలచేడె యుంపుడుకత్తె బసవమ్మ మాఱటితల్లి సొదకత్తె తొత్తుసివము తలమొలబోడి సోమరిపోతు తిరిపెపుబిందు గుడిముడుపు పూఁటకూళ్లకుడుపు బండతిట్లు మొండియొట్లు-డబ్బర దొంగతనము వెలిచవి మేలోర్వమి యొంటెత్తుతనము కోఁతిపిడికిలి మొండిపట్టుదల తెగనీల్గు తలకుమించినపరుగు బండతనము పెడసరము మేలుమఱపు వెకలిన వీసడింపు నాలిముచ్చుతనము వదలుఁబోతుతనము తెలియనలవికాని వేల్పుంగూర్చి తెలిసికొన్నట్లు డాబుచేయుట మొదలగుకొఱగానియలవాటులకు లోఁబడక పైవివరించిన బాపన, దొర, కోమటి, కాపులను నాల్గుతెగలయీమూఁడువారు న్మగవారలందఱు న్గూడఁ దమతమపడెక ట్లిసుమంతయు న్దప్పక పిన్న పెద్ద వావి వరుస లొకింతయు న్మఱక యొండొరుపొత్తున మెలఁగుచుఁ దమమంచికోర్కులఁ గొనసాగించి కావలసినన్నాళ్లు తమ్ము హాయిగఁ గాపాడుటకై ప్రొద్దు వేఁపున్ లోలోపలనే యెల్లపుడు న్వేఁడుకొనుచుంట కన్న మేలి తెరువు లింకెవ్వియు న్మమ్ముటికి న్గానేరవు వెలిచవి నంజుడుతిండి యొరుల మేలోర్వమి మొదలగు చెడ్డయలవాటులు గల చెడుగులు రచ్చకూటముల న్దగవరులుగా నుండఁదగరు.

బ్రతుకునకుఁ గావలసినపాఁడిపంటలు కూడుగుడ్డ లిండ్లువాకిళ్లు తోఁటలుదొడ్లు సరిగా సమకూర్చుకొనుటకై యీమూఁడుమగలన కీనాల్గుతెగలవారందఱు న్గూడఁ దమచేతనైనపనిపాట్ల సరిగా వంతులువేసికొని పంచుకొని పాటుపడక తీరదు. మఱియు నెల్ల పను లొనరింపఁగల నేర్పు మప్పుటకొఱకె యెక్కువపనివడువారు పాఱులు. పరు వొడలుదాల్చిన తీరునఁగలనైన మాటపడనొల్ల కెట్టియిడుముల౦బడియైన న్నడవడిం దడఁబడి పెడదారిఁ ద్రొక్కక తక్కినమూఁడు తెగలవారల నెల్ల నెట్టినెపమున నైన నిసుమంతయు న్గసుగందనీక మునుముట్టఁ బగఱ నడంచిన న్గాని యనిమొన న్వెనుదిరుగక కలనైన న్దామొనర్చిన మేలు చాటిచెప్పుకొనక తమతోటిపాటివారల నెల్లఁ గాపాడుటకై తమయుసురులఁగూడ నప్పగించుకోర్కె నెఱవేర్చుకొనఁగల యొక్కటిమగఁటిమి నెల్లప్పుడు న్దివురు

వారు దొరలు. కూడుగుడ్డలు పాడిపంటలు వలసినంత సమకూర్చుకొని నిలువచేసి గాలి యెండ వానల యొరపిడి నడ్డుకొనఁదగిన గొడుగులు జోళ్లు చాపలు మొదలుగ కావలసిన యెల్ల సరకులు కీల్బండ్ల నోడలం బెరుగుచు నూరూరఁ దిరిగి యెవ్వరికైన సెట్టికొలంతయు స్లేని తెన్నున సరిగా రేఁబవళ్లు తమయాలుబిడ్డల స్వంట నిడుకొని యెల్లవారికి న్నోరి నదినుసు లందించుటయందే పనివడువారు కోమటులు. పైమూఁడు తెగల వారి న్నంటికి తెప్పవలె సెల్లపుస న్నార్మి మైఁగొల్చుటయందే పని వడు నొప్పులకుప్పలైనవారు కాపులు. ఏనోముపట్టియైన బిడ్డలఁగన్న యాఁడుదియు, సెట్టి పాటుపడియైన నొరులకు మేల్కావించు మగవాఁడుం దగ్గవరులు గానోపుదురు. మొత్తముపై నీనాల్గుతెగలవారందఱున్ బెద్దప్రొద్దీనాఁటి తొలిపుట్టువు లేనాఁటినుండియో యిప్పటివఱకొక్క తీరుగా మంచినడవడి న్నడుపోయిగాఁ బ్రొద్దువేల్పు న్వేఁడుకొను చెందైన న్వెలితిగొన కెన్నఁటికిన్ జెడని గొప్పపేరు గడించుకొనుచు వచ్చిరి. తొల్లింటి వాడుకన్ బట్టి యీనాఁటివారలు పేరునకే నాల్గు తెగలవారుగాని నిక్కముగా నాయాయియదనులకొలంది సెల్లవారును మంచి తెరువు నేర్పునపుడు గాపంద్రడే పగఱఁ జక్కాడునపుడు దొరలే. కూడుగుడ్డలందించుపట్ల కోమటులే మఱియు సెల్లతీరుల న్దొడ్పడుతఱి న్గాపులే సాముచదువులన్నింట నారితేరి హాయిగా బ్రతుకునకు వలయు సెల్లపనిపాట్ల న్నైపుణ్యముఁగలిగి తమతోటివారికెల్లఁ బనికి వచ్చినపుడే యెవరైన న్దమపుట్టు వీడేర్చుకొనఁగలరు. దాఁపలిచలికొండ తూర్పుపడమటి కొసలనుండి తూర్పుపడమ రవలవైపుల మూఁడింటికి న్మున్నీరే యెల్లగాఁ గడలిచెలియలిగట్టవఱకుఁ గల నేలయందలి యడవులు కొండలు చెఱువులు బావులు మెరక లెడార్లు మొదలగు కాఁపురముచేయ ననువుకానిచోట్లను బైరు పొలములు తోఁటలు పచ్చికబయళ్లు న్విడిచిపెట్టి నీటిలేమిగాని నీటిముంపుగాని కలుగనిచదరము తావులం దీనాలుగు తెగలవారి లామ పయెడముగా నొండొరు తెగలు రెట్టింపుగా నొక్కొక్క తెగ కొక్కొక్క వాడచొప్పున నెడమెడముగాఁ బదమంది తెఱపిగా నిఱుకులేకయుండఁ దగిన ట్లొక్కపోల్కి కొలతల వాకిలి పెరళ్ల నొప్పారు లోగిళ్ల నెలకొనఁదగును వెంకికొండకు వలతట్టు న్గడలివఱకు న్గల నేలయందు మొత్తముపై ముప్పదిరెండు వేలయూళ్లకు మించియుండరాదు. మఱి యొక్కొక్కయూరియందుఁ బదివేవురకు మించి నెలకొనరారు మీఁద నెంతవానకురిసినప్పటికిఁ గాని మఱియు న్గ్రిందనెంతయెత్తుగా నీరుపాఱినప్పటికైనఁగాని యొక్కింతయు న్గరఁగక నానిపోకే నాఁటికైనం జెక్కు చెదరక తఱుఁగు నిఱుగు లేని గట్టిజిగటమంటిగోడలతో దట్టముగాఁ గ్రిందుమీఁదులం బంకమన్ను మెత్తినపండువెదుళ్ల నమర్చిన మట్టిమిద్దెల నాలుగిండ్ల లోగిళ్లు నిలువులోఁతు మూఁడుమూళ్లు వెడల్పుగల పునాదిపై వెడల్పున నొకమూరయుం బొడవునఁ బన్నెండుమూరలు మించనితీరున వెనురుమఱిఁగిన మంటిమదుళ్లు మూఁడుమూళ్లు వెడల్పుగల గుమ్మములు నడువ లరుగులు పంచలు కిటికీ లటకలు కొట్లు పడకగదులు వంటిల్లు సామ్ములచావడి పెరడువాకిలిదొడ్లు కావలసినంత విరివిగా వేయియిండ్ల కొకయూరుచొప్పున నుండఁదగును. మన్ను రాయి పండువెదుళ్లతోఁ దప్ప మఱేదినుసులైన న్గట్టడములకు బొత్తిగాఁ బనికిరావు. మేడలు పనికిరావు మరనూతు లింటి కుండకతీరదు నాల్గుతెగలవారికి నాల్గు వేఱువేఱువాడలు నున్ననివెడల్పు తిన్ననిరచ్చలు సందుగొందులుండ నొప్పును మఱియు నూరికినడుమ వేయిమంది కొల్వుచేయఁగగిన రచ్చచావడి యొక్కటి నెలకొల్పఁదగును పదునెన్మిదేండ్లలోపున మగవానికిం బన్నెండేండ్ల యీడులోపున నాఁడుదానికిం బెండ్లి తగదు. పెండ్లికూఁతుకన్నఁ బెండ్లికొడుకు కైదేండ్లకన్న నీడున మించి యుండఁగూడదు ఏ తెగలకుఁ జెందనీకాని యాల్మగలొండొరుల నెంచికొని నెల్లడిగా నొప్పుకొన్నఁగాని పెండ్లిచేయరాదు. ఒక తెగ కింకొక తెగతోఁ బుట్టుజికము పనికిరాదు తల్లిగావి తగదు. తోఁబుట్టువావి దొసఁగు ఆటపాటమాటమీటలెల్ల న్దోటిపాటివారి మేలునకే సమకూర్పవలయును తొలిసమర్తాడినపడుచు వెంటనే రచ్చకూటమునఁ బెద్దలెల్లరు న్దను మెచ్చుకొనునట్లు తనయూరిలో నెలకొని తనతెగలోఁ బుట్టి తావలచి వలపించిన పదునెన్మిదేండ్ల యీడు గలిగి యదివఱకుఁ బెండ్లి లేకున్నవానిచేతఁ జేయికేలించి పూదండవేసి వేయించుకొని యానాఁడే మంతనమున్ గూటమి వేడ్కనోలలాడుట యే మొదటి పెండ్లిగుఱుతు. అరిగెడుతిండి వలచివలపించినకూటమి యొడలెఱుంగనినిద్దుర యీమూఁడువేడ్కల నోలలాడుటకన్న వేల్పు న్గొలువఁగలవెర వింకొద్దియున్లేదు. బల్మి న్గవగూడుటయే చీఁకటితప్పనం బఱును విడాకులు కూడదు. ఆలుపోయినమగఁడు, మగఁడుపోయిన యిల్లాలుం బయిపివరించినయీడుం బట్టి రెండవపెండ్లి యిరువుర కోరిక న్రచ్చలో వెల్లడించుకొని యాడుకొనఁదగును. ఆలులేని మగవాఁడుకాని మగఁడులేని యాఁడుదికాని నాల్గుతెగలవారిలో నేయూరనయిన నొంటి న్మనఁదగదు సమర్తాడకమునుపు కన్నియలు తొలిపెండ్లి గ్గాని తమతమ తెగలపడుచువాండ్రతోఁ గోరినబెల్ల చెల్మిచేసికొని విచ్చలవిడిగా వావివరుసపడికట్ల న్దప్పక తిరిగి పెండ్లియైనపిమ్మటఁ జీకటితప్పెన్నఁడు న్గావింపక తమతమ తెగలపడికట్లకెల్ల సరిగా లోనై కాఁపురమున న్వెన్నెవాసులకెక్కి తగుబిడ్డల న్గనుటకై తమతమయిలువేల్పుల న్వేఁడుకొనుచుండవలయును మాఱుమను వాడనొల్లనియీడు ముదిరినవారల రెండవపెండ్లికై బల్మిపెట్టఁగూడదు మగఁడుచెల్లిన యాఁడుదిగాని యాలుకడతేరిన మగవాఁడుకాని రెండవపెండ్లికొప్ప కొండొరున్ జాటుగఁ గవగూడినపుడు బిడ్డ లొదవిరేని రహబిడ్డల నవ్వారి న్గన్నతలిదండ్రులుగాని మఱెవ్వరయినంగాని పెంచుకొని పెద్దవారలం గావించి తమతమ తెగలలోఁ గల్పుకొనవలయును మఱి యట్టి బిడ్డలన్గాని యవ్వారల న్గన్నవారలన్గాని యెన్నఁడు నెవ్వర న్గూడఁ జులకనఁజేయరాదు. అంద్రదు చెల్లినమగవారలకుఁగాని, మగలుపోయిన యాఁడువారలకుఁగాని వారిలోవారి కేఁబదియేండ్ల యీడుమించిన పిమ్మటఁ జీఁకటితప్పు పట్టరాదు. తొలిపెండ్లాడినయాలుమగలకే వెలిచవుల

కెకొన్న వలయునుగాని మార్మనువాడినయాఁడువారికిఁగాని మగవాండ్ర కుఁగాని వాగిలోవారికిఁ గూటమితప్పు లేనేలేదు, మఱెట్లయినఁ బుట్టినీ బిడ్డలందఱేయే తెగలలోనైన నొక్కపోల్కి పరువురువులుకలవారే యైనప్పటికి న్దొలిపెండ్లికొదవిన బిడ్డలే యెల్లతీరులం దప్పక పనికివచ్చె దరు మఱిపెండ్లియైనవారుగాని రెండవపెండ్లికానివారుగాని యొం డొరులకోర్కిపైఁ గవగూడుట తప్పు కానేకాదు. వేయేలా సమ ర్థుడనికన్నెకుఁగాని తెంపికిఁగాని యాలుచెల్లిన మగవానికిఁగాని యొండొరులతో ముచ్చటించుకొనుట యవంతయు న్దప్పు కానేకాదు తొలిపెండ్లాడిన వారలకుఁగాని మాఱుపెండ్లికాని వారికిఁగాని పుట్టిన బిడ్డలందఱు న్సరిగాఁ బెంచుకొనఁదగినవారే నలువురిలో నెల్లడిగాఁ దొలిపెండ్లి కావింపఁబడిన యాల్మగలకుఁ దప్ప మఱెవ్వరికి న్దమతమ తెగలవారితో నొండొరు కోర్కెపైఁ గవకూడి పిల్లల న్గనుట కసింతయున్ జీఁకటితప్పు కానే రదు. ఆఁడుదానికిఁగాని మగవానికిఁగాని తొలిపెండ్లికే యూఁడుదాని కన్న మగవాఁ డైదేండ్లయీడునకు మించియుండరాదను పక్షికట్టు తప్పదుగాని రెండవపెండ్లి చేసికొన్న యాల్మగలయీడు వారువా రెంచుకొన్నచొప్పున నుండవచ్చును మఱియును రెండవపెండ్లాడిన వారలకు విడాకు లొకతప్పుకానేరదు మొత్తముపైఁ దొలిపెండ్లి యొక్కటియే పెండ్లి యననొప్పును మాఱుమనువు మంచిముహూర్తని పించుకొనునుగాని పెండ్లియనుపేరున కొకింతయు న్దగదు కనుక మార్మనువాడినయాఁడువారికిఁగాని మగవారికిఁగాని తమతమ తెగల వారితో నెట్లయినఁ గవగూడుట చీఁకటితప్పు కానేరదు. మఱియు నాల్గుతెగలవారు న్గలసి తినుఁ దేపాటియు న్దప్పు కానేరదు నాల్గు తెగలవారందఱున్ బిన్నపెద్దలు తమకుఁగావలసిన పాఁడిపంటల న్గూడు గుడ్డ లిండ్లువాకిళ్లు మఱియు నెల్లతీరులబ్రతుకునకుఁ గావలసిన కల్మి నంతయు న్సరిగాఁ బంచుకొని కుడువవలయును మఱియు నెల్ల తెవు ళులనాఁగ్నచ్చు మందుమాఁకుల న్గూర్చియు నెండ వాన చలి కారుమార్పు కావించుమింటిదినుసులం గూర్చియుం బాఁడిపంటలు న్గూడుగుడ్డ లిండ్లు వాకిళ్లు సమకూర్చుకొనం దగువెరవులంగూర్చియుఁ డమ్మెదురొక్కను కాళ్ళమైతాల్పుల నడంచు సుళువులం గూర్చియుఁ దమునెల్లపుడు న్గాపాడుప్రొద్దువేల్పున్ గూర్చియు న్దప్ప నేతెగలవారైనఁ దక్కిన చదువులజోలికేపోరాదు నలుపైపులన్ బదియామడలకు మించనిమేర గల నేల యొకనాడుగా నుండవలయును ఈయిరువదినాడులవారంద ఱికి న్మొగిమొత్తముగా నొండొరులతలంపు లెఱిఁగికొనుట కెద్దియో యొకమాటయు నొకవ్రాఁతయు నేర్పాటుచేసికొని వాడుకొనవలయును. మఱి యీయిరువదినాడులకు మించి దాఁపలిమంచుఁగొండకు న్దక్కిన నైపులకడలిమీఁదుగా వెళ్లవలసినచోట్ల కొకవందయామడలమేర వఱకుఁ జట్టున్న నేల నెలకొన్నవారలతో నీయిరువదినాళ్లయందలి వారు చెల్మిచేసికొని యాయాచోటిపలుకువ్రాఁతలు నేర్చికొని యాయాచోట్లకు రాకపోకలు సల్పుచు దినుసు లిచ్చిపుచ్చుకొను చుండవలయునుగాని లాఁతిచోట్లఁ గాఁపురముండరాదు. పైనివివరించిన నాల్గుతెగల యేర్పాటు లేనిచోట నీనాలుగుతెగలవారెనెపమునైన రెండుమూఁడునెలలకు మించి నెలకొనరాదు ఈయిరువదినాడులం గల నాలుగుతెగలవారి కెవరెవరియిల్లే వారివారికిఁ గుడిగా బడిగానుండవలసిన దదిగాని యింటికన్న వేఱుగా వేల్పుఁ గొల్చుకొనుటకై మఱొకట్టడము న్గుడిగాఁగాని బడిగాఁగాని యేర్పాటుచేయఁగూడదు వెలుఁగులఱేనికన్న మ్రొక్కి వేఁడుకొనఁదగువేల్పు మఱెందున లేఁడా ప్రొద్దువేల్పే యెవ రెవ రెట్టినడవడికలవారో వారివారినడతకుఁ దగునట్లు మాఱొనర్చు చుండును గనుక నొరులకు మేలుచేయువారికి మేలును మఱి కీడుసల్పు వారికిఁ గీడును రాకతప్పదు మంచివారల నాపగటివేల్పు తనలోఁ జేర్చికొని చెడ్డవారలకుఁ దగునట్లు మాఱుసలుపుచుండును చెడుగొట్లకు, జావుపుట్టువులయిడుమ లెన్నటికిం దప్పవు ఏమతోటిపాటివారికిఁ జేటుగోరుతుంటరులకుఁ జేటు రాకమానదు ఒరులకుఁ గీడుతలంచు తుంటరులమొఱ నావేఁడివేల్పు దవ్వంతయు నాలింపనొల్లఁడు వేల్పు లోఁజేరి యెప్పటి కొక్కలాగునిండుతన్వితో హాయిగా నుండఁదలంచిన వారు తమయిబ్బంగు లెంతయోర్చుకొనియైనఁ దమతోటిపాటివారలకు మేలే సమకూర్చుటకొఱకై పాటుపడుచుండవలయును! ఎంతచలికానీ నూలుతప్పఁ గప్పుకొనుటకై జొచ్చువాడుకొనఁగూడదు. చలికాఁచు కొనుటకుఁ దప్పమఱెందునకైనం జిచ్చు రగిలించుకొనఁబనికిరాదు పచ్చివితప్పఁ బాలుగాని యేహరగాయలైనఁగాని మఱిగించికొనికాని వండుకొనికాని యంతగాఁ దినఁగూడదు గోళ్లుగాని నెఱులుగాని యెన్నఁడు న్మొదలంటఁ దీసివేయరాదు చలితఱి న్దప్ప నొడళ్లనిండ నుడుపులు దాల్చఁదగదు పెండ్లికాకమునుం దీఁగవచ్చినయాఁడువారల న్గాని మగవారల న్గాని పెద్దలతోడులేక కలసితిరుగనీరాదు. అన్నినాడు లవారెల్ల నేతెగవారాతెగవారితోఁ దమతమపెద్దలమాటచొప్పునఁ జుట్టఱికము గావించుకొని యొకరియింటికొకరు రాకపోకలు సల్పు చుండవలయును. తమతమ తెగలవారందఱు నెందైన నొండొరుల పొత్తున మనవలయును మఱొకరినొకరు గుఱుతించవలయును అక్కఱ మాలినమడిమైలలు బల్మితలముక్కలు కట్టుబొట్టుజట్టుపడికట్లు, నుసుఱు పోయినవారలంగూర్చి లేనిపోనితలంపులఁ బడరానిపనిపాట్లు-ప్రాఁజదు వులఁ బిక్కపెట్టుకొనుట మిరియాలపండుగ, వెనుక నెన్నఁడో చెల్లి పోయినవారలన్గూర్చి తెలిసీతెలియని కవిలకట్టవ్రాఁతలు, వేయేలా? కూడుగుడ్డలు సమకూర్చుకొనుట కడ్డపడు నెట్టియొక్కట్టులైన న్గోరి తగుల్చుకొనఁగూడదు. కావలసినపాఁడిపంటలుకూర్చుకొని తమలోఁ దాము తగునట్లు వంతుపంచుకొని హాయిగఁ గుడిచి బ్రతుకుపొడి గించుకొనుటకొఱకే యందఱు న్మప్పొద్దుల న్మిగులఁ బాటుపడక తప్పదు. ఎవ్వరికైన న్దమతోటిపాటి తమనాటువారలలం దఱితోఁ బొందిపొసంగి హాయిగా బ్రతుకుగడుపుకొనుటకంటెఁ జేయఁదగినపని వేఱెద్దియు న్మమ్మోటికిఁ గొఱకాదు తమయిరుగుపొరు గుల కెల్లపుడు న్మేలే తలంచుటకన్న నెవ్వరికైనం బట్టఁదగిన నో



గొప్ప క్లియరెన్సు విక్రయము

## 650 ఉచిత బహుమతులు

## రు. 3 కు మాత్రమే



2 సీసాలు ఓటో దిల్ బహార్, 1 గోల్డుగిల్టు డమ్మీరిస్టువాచ్, 1 గాంన్ (వస్త్రు) 1 చేతిరుమాలు, 244 బ్లూబ్లాక్ సిరాబిళ్లలు, 1 ఫౌంటెన్‌కలము, 1 డ్రేపరు, 1 క్లిప్, 1 చూపుటద్దము, 1 దువ్వెన, 1 అత్తరుసబ్బు, 12 పాళీలు, 1 కలముపుల్ల, 1 ఈల, 1 కప్పుతాళము, (చెవితో) 1 చీట్లపేక, 200 టిప్, 1 జత పార్సిచెవికమ్మలు, 1 గోల్డుగిల్టురింగు, 1 జతచెవికమ్మలు. 1 టీస్పూన్, 1 కొయ్యపెన్సలు, 1 ఎరేజరు, 6 హెయిర్ పిన్నులు, 12 సేఫ్టిపిన్నులు, 1 సిరాబుడ్డి, 1 కత్తి, 1 కత్తెర, 1 పట్టెదారము, 4 షర్టు గుండీలు, 1 పిస్తోలు, 1 పెట్టెక్యాపులు, 1 పైకపుసంచి, 1 జత సులోచనము, 100 సూదులు, 1 జత జీన్‌పాదరక్షలు. మీకాలికొలతను పంపుడు.

పోస్టేజి 10 అణాలు.

**Great National Store,**

Post Box No 12215, CALCUTTA



AIR GUN

## అమెరికన్ గాలితుపాకులు

ప్రతితుపాకితోను 500 గుండ్లు ఉచితముగా పంపబడును. ఈఅమెరికన్ గాలి తుపాకులు ఆకారములోను, బలములోను, డిజైన్‌లోను పెద్దతుపాకులను బోలి యుండును. పేల్చినపుడు ఉఱుమువంటి శబ్దమునిచ్చును. ఎంత ధైర్యముగల దొంగల నైనను సులభముగ భయపెట్టును. మిగుల కచ్చితముగా చేయబడిన యీగాలి తుపాకి 200 గజములదూరము పారును. దీని నుంచుటకు గవర్నమెంటు లైసెన్సు అవసరము లేదు. గృహస్థు లందరికిని తమ్ము తాము రక్షించుకొనుటకు తమధనమును కాపాడుకొనుటకు నిది ముఖ్యముగా నుండవలెను.

ధరలు:—

| | | | |
|---|---|---|---|
| ఒక్కొకతఫా ఒకేగుండు పారునది | రు. 6 | ఒకతఫా 350 గుండ్లు ఒకటివెంబడి ఒకటి పారునది | రు 8 |
| తఫాకు 500 గుండ్లు పారునది | రు 10. | తఫాకు 1000 గుండ్లు | రు 14. |
| శ్రేష్ఠమైన రకము | రు. 25. | ప్యాకింగు, పోస్టేజి ప్రత్యేకము | |

(ఉపయోగించెడివిధము వ్రాయబడిన కార్డు ప్రతితుపాకితోను పంపబడును.)

విలాసము.—

**Bharat Union Trading Co.,**

P B. No. 2394, Calcutta (Sec A. P)




చిత్రం వటతరోర్మూలే వృద్ధా శిష్యా గురుర్యువా,
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః

మింకెద్దియు న్గానేకాదు ప్రొద్దువేళ్ళనుండి యేయేయుసులున్లైన న్గానీ లేకింకేదినుసులైనన్గానీ పుట్టి పెరిఁగి యావేళ్ళకంటెఁ గొంత దనుక వేశైన ట్లగపట్టియు న్దవ కావేళ్ళనందే డిందక తప్పదు కనుక నీలోపుగాఁ దినుతోటిపాటివారితోఁ బొందున మెలఁగినన్గాని యెవరైన న్దమబ్రతుకు హాయిగాఁ గొనసాగించుకొన వీలుపడదు కావున మంచిబ్రతుకు కావలసినయందఱ ఱొండొరులతోఁ జెల్మికొను తెన్నున నడమకొనక తప్పదు హదుగుడ్డలు సరిగా వంతుపంచుకొని కుడిచినంతవఱకు కెచ్చొటివారుకానీ, మతేయే తెగలవారుకనీ యొండొరుచెలిమితో నెమ్మదిగాఁ దమబ్రతుకు పొడిగించుకొనుచుఁ దమకోరినట్లు ప్రొద్దువేళ్ళతో నొక్కటిరైు యెల్లపు డొకతీరుగాఁ దఱుఁగు విఱుగులేని నిండుతనిని కల్మి నెప్పటికి న్దూఁగాడుచుందురు బిడ్డల న్గన్న యేయాఁడుదికానీ తోటిపాటివారిమేలునకై పాటుపడు నేమగవాఁడైన న్గానీ తప్పక తనపుట్టు వీడేర్చుకొనఁ గలుగును తగువారి హెచ్చరికంబట్టి నాతోఁచిన ట్లెమోగొలికిన నాయి వ్రాఁతతెప్పులు చదువరులు మన్నింతురుగాక నిచ్చ లొండొరులపొత్తుతో నేలనెల్లెడల న్నెలకొనునందఱు న్దెల్వితేటల న్దమతమబ్రతుకులు హాయిగాఁ గొనసాగించుకొందురుగాక ప్రొద్దువేలు పందతి కొండొరుమిక న్నెగడించి కోరికన్నాళ్లు హాయి న్గాపొడుఁగాక

---

## భారత శ్రీమంతుని కాలక్షేపము





# భారత రైతు ఋణము

సుంకర సూర్యనారాయణ గారు, బి. ఏ.



భారతదేశపు రైతులు దుర్భరఋణములో మునిగియున్న విషయము జగద్విదితము ఈ క్రింది పరిస్థితులనుబట్టి రైతుల ఋణబాహుళ్య మెట్టిదని కైనను గోచరింపగలదు —

౧ పైరులు అతివృష్టి, అనావృష్టిదోషములచే ఒక సంవత్సరము ఫలింపకపోయినను రైతులు బ్రతుకుశక్తి లేకుండుట

౨ తాటియాకులతోను, రెల్లుతోను, గడ్డితోను కప్పబడిన అనారోగ్యకరములగు ఇండ్లలో నివసించుట

౩ శీతకాలములో చలి నాపుటకైనను వలయునన్ని బట్టలు ధరింపలేకుండుట

౪ నేయి, పాలు, పెరుగు మొదలగు సామాన్యభోజనవస్తువులనైనను నుపయోగించు ఆర్థికశక్తి లేకుండుటచే మిగులహీనమైన ఆహారమునే భుజించుచుండుట

౫ బాలురకు ప్రాథమికవిద్య గరపించుటకైనను శక్తి లేకుండుట

౬ ఋణముల తీర్చుటకుగాను రైతులు తమపొలములను ధనవంతులైన ఋణదాతలకు అమ్ముచుండుట

## ౧ ఋణబాహుళ్యము

హిందూదేశమంతట గల రైతుఋణమును అంచనా వేయు ప్రయత్న మేమియు జరుగనప్పటికి అక్కడక్కడ అప్పుడప్పుడు చేసిన విచారణలనుబట్టి యీసమస్య యెంత విచారకరమైనదో గ్రహింపగలము ౧౮౭౫-వ సంవత్సరములో "డక్కన్ అల్లరుల విచారణసంఘము". (The Deccan Riots Commission) వారు అహమదునగరుజిల్లా (బొంబాయిరాజధాని) యందలి ౧౨ గ్రామముల ఆర్థికపరిస్థితులు పరిశీలించి, గవర్నమెంటుభూస్వాములలో మూడవవంతు మంది ఋణగ్రస్తులై యున్నారనియు, ఈఋణములు వారిశిస్తులకు ౧౮ రెట్లుండినవనియు, ఈ ఋణములో మూడింట రెండువంతులు భూమి తనఖాఋణమనియు, సగటున ఒక్కొక్క భూస్వామికి ౩౮౧ రూపాయల వంతున ఋణముండినట్లును నివేదించియున్నారు

౧౮౮౦-వ సంవత్సరములో క్షామ విచారణ సంఘము (The Famine Commission) వారు హిందూదేశమంతటనుండి చేరిన సాక్ష్యమునుబట్టి భూస్వాములలో సగమువంతుమంది తీర్చలేని ఋణములచే బాధనందుచున్నారనియు, యింకనెంతమంది తీర్పగలిగిన ఋణములతో నున్నారనియు వ్రాసియున్నారు ౧౮౯౫-వ సంవత్సరములో మద్రాసు రాజధాని గ్రామములలో ౪౫ కోట్ల ఋణమున్నట్లు సర్ ఫ్రెడరిక్ నికల్సను గారు (Sir Frederick Nicholson) అంచనా వేసియున్నారు ఇటీవల గతసంవత్సరము విచారణ చేసిన మద్రాసు 'బ్యాంకింగు విచారణ సంఘము' వారు (The Madras Banking Enquiry Committee) ఈ రాజధానియందు ౧౫౦ కోట్లరూప్యముల ఋణ మున్నట్లు వ్రాయుచున్నారు దీనినిబట్టి ౧౮౯౫ వ సంవత్సరమునుండి ౧౯౩౦-వ సంవత్సరమువరకును ౧౦౫ కోట్లరూప్యములఋణము చేరినదన్నమాట ముప్పదియైదేండ్లలో మూడున్నర రెట్లుకు పెరిగినది ఇప్పటికి మూడేండ్ల క్రితము విచారణచేసిన కృష్ణా ఉభయగోదావరి, రైతు ఆర్థికవిచారణ సంఘమువారు ఈమూడు జిల్లలలో ౨౫ కోట్ల ఋణ మున్నట్లు అంచనావేసియున్నారు దీనినిబట్టి మనమద్రాసురాజధానిలో కనీసము ౨౦౦ కోట్ల ఋణమైన నుండునని తలంచవచ్చును

౧౯౦౧-వ సంవత్సరపు క్షామవిచారణసంఘమువారు (The Famine Commission) బొంబాయిరయితులలో నాల్గవవంతుమంది భూముల గోల్పోయినారనియు, అయిదవవంతుకులోపు రయితులు ఋణము లేకుండ నుండిరనియు, మిగిలినవారు కొద్దిగనో, గొప్పగనో ఋణగ్రస్తులై యుండిరనియు తెల్పియున్నారు నికల్సనుగారి మదరాసు అంచనా ననుసరించి ౧౯౧౧-వ సంవత్సరములో సర్ యెడ్వర్డు మేక్లిగన్ (Sir Edward Maclagan) గారు హిందూదేశరయితుల ఋణము ౩౦౦ కోట్లు రూప్యములుగా అంచనావేసినారు డార్లింగు

(Mr. Darling) గారు ౧౯౨౮-౨౯వ సంవత్సరపు పంజాబుఋణమును (౯౦కోట్లరూప్యములు) బట్టి బ్రిటిషుఇండియాలో ౬౦౦ కోట్లరూపాయలు రయితుఋణమున్నట్లు తేల్చియున్నారు ఆయన యిట్లు వ్రాయుచున్నారు — "పంజాబుఅంకె (౯౦ కోట్లరూప్యములు) ఆ రాష్ట్రభూమిశిస్తుకు ౧౯ రెట్లు ఈదామాషాను బ్రిటిషుయిండియాలో భూమిశిస్తుకు ౧౯రెట్లు-౬౮౪ కోట్ల రూపాయలఋణముండవలెను కాని యితరరాష్ట్రములలోకన్న పంజాబులో పల్లెటూళ్లఋణములు హెచ్చుగానున్నట్లు ఈక్రిందిపరిస్థితులబట్టి గ్రహింపవచ్చును జనసంఖ్యల దామాషానుగూడ చిన, పంజాబులో మిగత బ్రిటిషుఇండియాలోనున్న వడ్డీవ్యాపారులకు మూడురెట్లున్నట్లు తెలియుచున్నది అదియును గాక రైతులను వడ్డీవ్యాపారులబారినుండి రక్షించుటకు పంజాబులో ప్రత్యేక మొకశాసన మేర్పరుపవలసివచ్చినది. కనుక భూమిశిస్తుకు ౧౯ రెట్లకుమారు ౧౬½ రెట్లవంతున ఋణమును గణించిన బ్రిటిషు ఇండియాలో ౬౦౩ కోట్లరూప్యములఋణ మున్నట్లు తేలును భూమిశిస్తుఖాయపునిర్ణయ మున్నచోట్ల (Permanent Settlement) ఇతరచోట్లకన్న శిస్తు తక్కువగా ఉండుటచేతను, జమీందారులచే అనుభవింపబడుచున్న భూమిపన్ను పంజాబులెక్కలో చేర్చి ఇతరరాజధానులభూమిపన్ను లెక్కలో చేర్చక పోవుటచేతను ఋణపుమొత్తము ౬౦౩ కోట్ల రూప్యములకన్న నెక్కుడే యుండవచ్చును. జనసంఖ్యనుబట్టి చూచిన పంజాబుజనసంఖ్య బ్రిటిషుఇండియాజనసంఖ్యలో ౧౨-వ వంతు కాబట్టి బ్రిటిషుఇండియాఋణము మొత్తము పంజాబుఋణమునకు ౧౨ రెట్లు అనగా ౧౦౮౦ కోట్లరూప్యము లుండవలెను కాని తాత్కాలికముగా బ్రిటిషుఇండియాలోని ౨౫ కోట్లజనులకు ౬౦౦ కోట్ల ఋణమున్నట్లు చెప్పవచ్చును."

ఈఋణములో అత్యధికభాగము ప్రతిఫలశూన్యకార్యములకై వెచ్చించిన దగుటచేతనే యింతదుర్భరమైనది కాని జనసంఖ్య దామాషాను ఇంతకన్న హెచ్చుఋణము గల దేశములు లేకపోలేదు. పంజాబుఋణములో యిరువదియవవంతుమాత్రము ప్రతిఫలప్రదములైన భూముల బాగుచేయుటకై వినియోగింపబడినట్లు డార్లింగుగారనుచున్నారు ప్రతిఫలశూన్యములైన పనులకై వెచ్చించిన ఋణము తనంతట తానే పెరిగిపోవును. ప్రతిఫలప్రదమైన ఋణము భూబలమును వృద్ధిచేసి హెచ్చుఫల మొసంగి ఆహెచ్చుఫలముచే ఆఋణము తీరిపోవును. కాన రైతులు ఋణములు చేయునపుడు కడ జాగ్రతతో మెలగవలయును. ఋణము తెచ్చినధనము ఆఋణమును కొద్దికాలములో తీర్చుటయేగాక, తెచ్చుకొన్నవాని ఆర్థికస్థితినిగూడ బాగుపరచుకార్యమునకై వెచ్చింపబడిన గాని ప్రయోజనము లేదు.

## ౨. ఋణకారణములు

రైతులబీదతనమునకు ఋణము కారణమైనట్లే, రైతులఋణమునకును వారిబీదతనముకూడ కారణమే. కనుక రైతుఋణమునకు గలకారణములే చాలభాగము రైతుబీదతనమునుగూడ స్పష్టపరచును.

౧ భూమిమీద జీవించుజనసంఖ్య అత్యధికముగానుండుట. మనదేశమున యంత్రపరిశ్రమ లేవియు బాగుగా వృద్ధినొందకపోవుటచే అత్యధికజనులు భూమిసేద్యముచేతనే బ్రతుకుచున్నారు అందుచే భూమినుండి ఒక్కొక్కరైతు పొందుఫలము తగ్గినది. జనసంఖ్య వృద్ధియగుచున్నను దానితోపాటు భూఫలసాయము వృద్ధికాకపోవుటచే భారతకర్షకుడు నానాటికి బీద యగుచున్నాడు.

౨. పొలములు ఖండఖండములయి ఒక్కచోటనే ఉండకపోవుట. అట్లుండుటచే—కంచెలు వేయుట కగుఖర్చు, గట్లకుగాను చాలభూమి వృథాయగుట, వ్యవసాయయంత్రములు మొదలగునవి చిన్నపొలములమీద నుపయోగింప వీలులేకుండుటచే వ్యవసాయపు ఖర్చు లెక్కువయగుట, ఒకపొలమునుండి మరియొకపొలమున కేగుట కగుకాలయాపనము మొదలుగాగల అనేకనష్టములచే రైతుపెట్టుబడికి తగినఆదాయము రానందున వృథాయై పెట్టుబడి ఋణము వృద్ధియగుచున్నది.

౩. రైతు ఉపవృత్తులం దేమియు శ్రద్ధ లేకుండుట సంవత్సరమున కారుమాసములు వ్యవసాయపుపను లుండవు ఆతీరికకాలములో గృహపరిశ్రమ లేవైన నడపుకొని రైతు తన ఆర్థికస్థితిని చక్కబరచుకొనకపోవుటచే ఋణము తగ్గక హెచ్చుచునే యున్నది

౪ రైతుయొక్క అనారోగ్యము. కొన్ని ఋతువులలో శీతజ్వరము మొదలగువ్యాధులచే రయితు వ్యవసాయపుపనులు చేయలేకపోవుటచే కూలియిచ్చి చేయించుచున్నాడు ఆరోగ్యము కలిగిన పిమ్మటగూడ ఆరోగియొక్క దేహబలము చాలవరకు తగ్గియుండుటచే అతని ఆర్జనశక్తి తగ్గుచున్నది.

౫ అతివృష్టి, అనావృష్టి మొదలగుదోషములు భారతదేశ వ్యవసాయము చాలవరకు శీతోష్ణపరిస్థితులపై నాధారపడి అతివృష్టి అనావృష్టిదోషములకు విస్తారముగా గురియగుచున్నది అయిదు సంవత్సరములలో ఒకసంవత్సరము మంచిపంటలు పండుటయు, ఒకసంవత్సరము బొత్తుగా పండకపోవుటయు, మిగిలిన మూడుసంవత్సరములు సామాన్యపంటలు పండుటయు మనదేశమున తటస్థించుచున్నట్లు అంచనావేయబడినది. అయిదుసంవత్సరములలో బాగుగా పండిన ఒక్కసంవత్సరమే రైతు ఋణముబారినుండి తప్పించుకొనుచున్నాడు. తక్కిన నాలుగుసంవత్సరములు రైతు ఋణముచేయవలసినదే. ఫలము

స్థిరము లేకపోవుటచే హిందూదేశవ్యవసాయము జూదమువంటిదని లోకోక్తి

౬. క్షామములవలనను వ్యాధులవలనను పశుమరణములు. మన దేశమున్న వ్యవసాయమునకు పశువులే యాధారము. దొమ్మ, చీడపాఱు మొదలగువ్యాధులచే పశువు లపరిమితముగా మరణమొందుచున్నట్లు పశువుల కొనుగోలుకై సహకారసంఘములనుండి తీయు ఋణములబట్టి గ్రహింపనగును. వరదలచే పాడైనప్రదేశములలో పశువులకు మేత దొరకకపోవుటచే నవి విశేషముగా మరణించును. గతవత్సరము వరదలచే నష్టమైన బెంగాలురాజధానిలో మేత దొరకక పశువులు మరణించినవి పశురోగములు, మరణములు హెచ్చినచో రైతు మరల పశువుల కొనుటకై హెచ్చుధనమును వెచ్చించి ఋణగ్రస్తు డగుచున్నాడు.

౭. వ్యాజ్యములు. ప్రస్తుతకాలమున మనరైతులు వ్యాజ్యములకొరకై చాలధనమును వెచ్చించుచున్నారు. జనులు విద్యావంతులైనకొలదిని క్రమక్రమముగా నీవ్యాజ్యములు తగ్గుట కవకాశమున్నది.

౮. రైతుల అజ్ఞానము, దూరదృష్టిలేమి, అతివ్యయము రైతు అజ్ఞానముచే వ్యవసాయమున కుపయోగపడు నవీనపరికరముల వాడుట లేదు వ్యవసాయము ఆధునిక నాగరికపద్ధతులపై సాగించి యెక్కువలాభమును పొందవచ్చును.

భారతకర్షకుడు దూరదృష్టి లేక మెలగుచుండునని లోకవిదితము. బాగుగా పండిన సంవత్సరపుపంటను పంటలులేనిసంవత్సరమునకు దాచిపెట్టుకొన జాలడు తనఆదాయవ్యయపట్టికలను జాగ్రతతో వ్రాసికొనడు. ప్రతిఫలప్రదములైనట్టియు, ప్రతిఫలశూన్యములైనట్టియు వ్యయములను జాగ్రతగా పరిశీలించి మెలగడు. కులాచారముల వదలలేక శుభాశుభకార్యములకు అమితవ్యయ మొనర్చును ఇట్లు ధనమును ప్రతిఫలశూన్యములైన వివాహములు మొదలగు కార్యములకు వెచ్చించుటచేతనే యింత ఋణబాధ హెచ్చిన దనువాదమునకు 'డక్కనుఅల్లరులవిచారణసంఘమువారు' (The Deccan Riots Commission) ఒప్పుకొనలేదు. కాని యీకార్యములకై చేసినఅప్పులవల్లకూడ రైతులలో చాలమంది ఋణగ్రస్తులై పోవుచున్నట్లు మనము చూచుచున్నాము. కాన శుభాశుభకార్యములకు జేయు అమితవ్యయముకూడ ఋణకారణములలో చాల ముఖ్యమైనదియే యగును

౯. పూర్వికులఋణము. తండ్రినుండి కుమారునకు తరములవారి సంక్రమించుఋణమే యిప్పటి మితిమీరినఋణమున కొకముఖ్యకారణమని 'డక్కను అల్లరుల విచారణసంఘమువారు' (The Deccan Riots Commission) వ్రాసియున్నారు. న్యాయశాస్త్రప్రకారము కుమారుడు తండ్రి జేసిన ఋణమునకు తండ్రివలనపొందినఆస్తియొక్క విలువవరకే జవాబుదారిగాని, తండ్రినుండి పొందిన ఆస్తికన్న ఋణమెక్కువగా నుండినచో కుమారుడు స్వార్జితధనముతో ఆమిగిలిన తండ్రిఋణమును తీర్చనక్కరలేదు. సామాన్యముగా మనరయితులు తండ్రి జేసిన ఋణమును ఆస్తియున్నను లేకపోయినను సరే తీర్చుట పవిత్రధర్మముగా నెంచి, దుర్భరఋణముచే క్రుంగిపోవుచున్నారు. రయితులకు న్యాయశాస్త్రధర్మములను నచ్చజెప్పి తండ్రియొసగిన ఆస్తికన్న ఋణమెక్కుడున్నచో ఆ ఋణశేషమును తీర్చవలసిన బాధ్యత కుమారునకు లేదను న్యాయమును ఆచరణలో బెట్టునట్లు బోధింపవలెను. ప్రస్తుతపరిస్థితులలో రయితు ఋణముతోనే పుట్టి, ఋణముతోనే పెరిగి, ఋణముతోనే మరణించుచున్నాడు ఇట్టిపరిస్థితు లెంతత్వరలో మారిన అంతిమంచిది ఇందుకొరకు రయితుల కొకప్రత్యేకమైన ఇన్‌సాల్వెన్సీచట్టము మండవలెను.

౧౦. కృషీవలుని ఆర్థిక పరివర్తనము. దేశపరిపాలనమున శాంతి యేర్పడుటవలనను భూమిపన్ను నిర్ణయింపబడుటవలనను, మార్గసౌకర్యములు వృద్ధియగుటచేతను, ధాన్యపుధర లీమధ్య కొంతకాలము హెచ్చుటచేతను భూమిధరలుకూడ హెచ్చి రైతు పరపతి హెచ్చినది. అందుచే భూమితనఖాఋణములు, తదితరఋణములు పెరిగినవి ఆర్థికస్థితి బాగుపడుటతోడనే రయితు సుఖజీవనమున కభ్యాసపడును కాని మరల ఆర్థికస్థితి చెడినపుడు జీవితవ్యయమును తగ్గించుకొనలేక ఋణము చేయును.

౧౧ ఋణగ్రాత, వడ్డీవ్యాపారము :— బ్రిటిషుప్రభుత్వమునకుపూర్వము వడ్డీవ్యాపార ముండినను అప్పటివడ్డీ వ్యాపారికి రెండు ఆటంకము లుండెడివి. అవి యేవన (1) ఋణదాత లపరిమితములైన వడ్డీలు వసూలుచేసినచో సంఘముచే దూషింపబడి నీచముగా చూడబడెడివాడు. (11) అప్పటిప్రభుత్వములు ఋణములను వసూలుచేసుకొనుటయందు ఋణదాతల కెక్కువ సహాయముచేసెడివారుకారు. అందుచే ఋణదాతలు పెద్దమనుష్యులు చెప్పినట్లు విని ఋణగ్రహీతలతో రాజీపడెడివారు. ఇప్పుడన్ననో, గ్రామసంఘజీవనమందలి పటుత్వము నశించుటచే ఋణదాత సంఘాభిప్రాయమునకు వెరచుటలేదు అదియునుగాక ఇప్పటిన్యాయస్థానములు పత్రములబట్టి విచారించి ఋణములకు డిక్రీలు సులభముగా ఇచ్చుచున్నారు. అంతేకాని గ్రామపరిస్థితుల విచారించి తమబుద్ధిని వినియోగించి తగురీతిని ఋణపరిష్కారము చేయుట లేదు. ఇప్పటిరైతు మితిమీరిన వడ్డీరేటుచే క్రుంగిపోవుచున్నాడు

౧౨. భూమిపన్ను. భూమిపన్నునిర్ణయము, వసూలుచేయు విధానము రైతుఋణవృద్ధికి తోడ్పడుచున్నట్లు కె. శే. ఆర్. సి. దత్తుగారు వ్రాసియున్నారు క్రిందటియేబదిసంవత్సరములలో పలుచోట్ల వరదలచే పంటలు పండకపోవుటచే రైతులఆదాయము తగ్గినను భూమిపన్నుమాత్రము హెచ్చుచునేయున్నట్లు తెలియుచున్నది. కాని రైతుఋణములో భూమిపన్ను ౧౭-వ వంతుమాత్రమే యగుటచేతను,

భూమిపన్ను పూర్తిగా తీసివేయగలిగినది కానిదగుటచేతను రైతుఋణమున కదియే ముఖ్యకారణముగా నెంచ వీలులేదు. కాని భూమిపన్ను గూడ ఋణగ్రస్తుడైన రయితును బాధించుచునేయున్నది నియమిత కాలమున చెల్లించవలసిన దగుటచే భూమిపన్ను మిగులబాధాకరముగా కన్పట్టుచున్నది

## ౩. ఋణనివారణము

రైతు ఋణనిర్మూలనావశ్యకత ౧౮౭౦-వ సం॥ర ప్రాంతము నుండియు ప్రజానాయకులయొక్కయు, ప్రభుత్వము యొక్కయు దృష్టి నాకర్షించినది ౧౮౭౫-వ సంవత్సరపు 'డక్కను అల్లరులవిచారణ సంఘమువారు' ను (The Deccan Riots Commission) ౧౮౮౦, ౧౯౦౧ సంవత్సరముల 'క్షామవిచారణసంఘములవారు' ను (The Famine Commission) ఈ విషయ మాలోచించిరి ౧౮౭౯ సం॥ రపు డక్కన్ రయితుసహాయమునకైన బిల్లు, (The Deccan Agriculturists Relief Bill), ౧౮౮౨, ౧౮౮౩ సంవత్సరముల 'టక్కావిఋణశాసనములు' (The Takkavi Loans Acts 1882 3), ౧౮౮౪ సం॥ రపు 'వ్యవసాయపు బ్యాంకు యోచన' (The Agricultaral Bank Scheme), ౧౮౯౫ సం॥ రపు నికల్సను నివేదిక (Nicholson's report), ౧౮౯౯ సం॥ రపు 'పంజాబుభూమి అన్యాక్రాంతమును గూర్చినబిల్లు' (The Punjab Land Alienation Bill), ౧౯౦౩ సం॥రపు సహకారసంఘములబిల్లు, వీనిని గురించి జరిగిన ఉత్తరప్రత్యుత్తరములు, లేఖలు, నివేదికలు, ఉపన్యాసములు, చర్చలు మొదలగుసందర్భములలో రైతు ఋణనిర్మూలనము ప్రధానస్థాన మాక్రమించినది

రైతుఋణనివారణమునకై ప్రభుత్వమువా రొనరించిన ప్రయత్నములనుబట్టి వారు ఋణభారమును గ్రహించిరనిమాత్రమే తెలియుచున్నది కాని వారి ప్రయత్నములు ఋణనిర్మూలనమున కెక్కువ తోడ్పడలేదు రైతుఋణమునకు క్షామములు, వరదలుకూడ కారణము లనియే కష్టపరిస్థితులలో 'టక్కావి' ఋణము లొసంగ నేర్పాటు గావించిరి విద్యావిహీనుడైన రయితు ఋణదాతలబారి నుండి రక్షింపబడుటకు న్యాయాధిపతులకు లిఖితపత్రములమీరికూడ విచారించగల యధికార మొసగిరి కాని ప్రస్తుతకాలమున న్యాయాధికారు లాయధికారమును వినియోగింపకుండు టెంతయు విచారకరము రయితుయొక్క పరపతి వృద్ధియగుటకూడ ఋణకారణమే యని భూమిని అన్యాక్రాంతమొనర్చుటకు (పంజాబులో) గలవీలును సంకుచితపరచిరి. భూమిపన్నువిధానముకూడ చాలకఠినముగా నున్నదని గ్రహించి కష్టపరిస్థితులలో పన్నుల నిలుపుదలకు, మాఫుదలకు వీలు కలుగజేసిరి. కశమార్గములేవియు ఋణపుబాధని కదల్చలేకపోయినవని గ్రహించి 'సహకారపరపతి'ని కల్పించిరి. సాధారణ సహకారపరపతియు ఋణనిర్మూలనమునకు తలచినంత తోడ్పడనందున 'భూమి తనఖాసహకారపరపతి' నేర్పరచిరి ఈభూమితనఖాపరపతి రైతులోకమునకు తోడ్పడవలెనన్న ఇంక చాలావృద్ధికావలెను.

సర్ యెడ్వర్డు మాక్లిగన్‌గారు (Sir Edward Maclagan) రైతుఋణమునుగూర్చి వ్రాయుచు ప్రభుత్వమువారు ఋణనిర్మూలనమునకై కావించినప్రయత్నముల నాలుగువిధములుగా భాగించిరి అవి యేవన :—

౧ అనవసరఋణములను చేయకుండ నాపుప్రయత్నము

౨. వ్యవసాయఋణములగూర్చి న్యాయశాస్త్రసంస్కరణము.

౩. భూమిని అన్యాక్రాంతముచేయుటను సంకుచితపరచు ప్రయత్నములు.

౪ పరపతిని కల్పించుటకును, పోషించుటకును, ఋణముల తగ్గించుటకును గావించినప్రయత్నములు.

### 1. అనవసరఋణములను చేయకుండ నాపుప్రయత్నము

రైతులు ఋణముచేయుటయందు జాగ్రతగా వ్యాపారదృష్టితో మెలగి ప్రతిఫలశూన్యఋణములు చేయకుండుటకును, ఋణదాతల మోసములలోబడి వారి అన్యాయములకు, అధర్మములకు గురిగాకుండ వారితో సమానావకాశాధారముల గల్గి వ్యవహరించుటకును, మితవ్యయము, స్వయంకృషి మొదలుగాగల యార్థికసూత్రముల నాచరణలో బెట్టుటయందు తోడ్పడుటకును, సామాన్యలోకజ్ఞానమును, వ్యవహారదక్షతను సంపాదించుటకును, ఇతరదేశములలో సోదర రైతు లేవిధముగ వర్తించుచున్నది తెలిసికొనుటకును ప్రభుత్వమువారు గ్రామములయందు విద్యాశాలల నేర్పరచిరి కాని ప్రస్తుతవిద్యావిధానము, పరిమాణమును గూడ ప్రజాసమూహమున కెంచదగినంత శ్రేయోదాయకముగ లేదని విద్యాశాస్త్రవేత్తల, ప్రజాశ్రేయోభిలాషుల ఏకగ్రీవాభిప్రాయము

తక్కువఖర్చుతో స్వల్పకాలములో వ్యవసాయపుపనులను పూర్తి చేయుట కుపయోగించు నవీనపరికరములను యంత్రములను నిర్మించియు, వ్యాపింపజేసియు, చిన్నతునుకలుతునుకలుగా పలుచోట్లనున్న భూశకలములను పంజాబులోవలె నొకటిగా జేర్చి పెద్దభూములుగా చేయుటయు,వ్యవసాయపశువుల దృఢమైనవానినివ్యాపింపజేయుచును, ప్రభుత్వపువ్యవసాయశాఖవారు రయితుయొక్క వ్యవసాయపుఖర్చులను తగ్గించుటకు జేయుప్రయత్నములు అమెరికా, డెన్మార్కు, జపాను మొదలగు ఇతరనాగరికదేశములతో పోల్చిచూచిన నత్యల్పములు. కాని కొంతవరకైనను ప్రభుత్వమువా రీవిషయమును గుర్తించి ప్రయత్నించుచుండుట శుభచిహ్నము.

నియమబద్ధములయిన విక్రయస్థలములను (Regulated Markets) స్థాపించి రైతు తనపంట నమ్ముకొనుటలో అనవసరమైన ఖర్చులను తగ్గించుటకు మన ప్రభుత్వమువారెక్కువ శ్రద్ధవహించినట్లు తోచదు. దూద్దివిషయమై మాత్రమే బొంబాయి, బెంగాలు, బీహారురాష్ట్రముల వారు రెండుమూడుశాసనముల గావించిరి మద్రాసురాజధానిలో ఈవిషయమై ప్రభుత్వమువారొకచట్టమును ప్రతిపాదింపదలచినట్లు ప్రకటించినారు కాని ఆశాసనము వ్యాపారపుపంటలకు అనగా ప్రత్తి, మిర్చి, పొగాకు, వేరుసెనగ వగయిరా పంటలకే సంబంధించినది. వడ్లు మొదలయిన ఆహారధాన్యములకు గూడ నిట్టి సక్రమవిక్రయస్థలముల నేర్పరచు నవసర మెంతేని కలదు మద్రాసురాజధానిలో వడ్లపంట యొక్కువ వడ్లవిక్రయ సందర్భములందు రైతు లనుభవించు అన్యాయము సంతాపకరముగాన ప్రభుత్వమువారీవిషయమై తగుశాసన మేర్పరుపవలయును

భూమిపన్ను ఆర్థికక్లిష్టపరిస్థితులందు తగ్గించుటకు, తీసివేయుటకు గలయవకాశమును ప్రభుత్వమువారుపయోగించుట లేదు

స్వల్పవ్యయముతో సమాచారముల నడపుటకు వీలగునట్లు గ్రామములలో పోస్టాఫీసులను, స్వల్పాదాయములను వృద్ధిపరచుటకు పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకీలును ఉన్నవి. కాని ప్రస్తుతమున రైతులలో కొలదిమందిమాత్రమే యీసౌకర్యముల ననుభవించుచున్నారు ఇప్పటికన్న తపాలసౌకర్యములు నాలుగైదురెట్లు వృద్ధియైనగాని రైతుజనసమూహమున కుపయోగము లేదు ఇప్పుడు పోస్టాఫీసు ౧౫, ౨౦ మైళ్లదూరమున గలగ్రామము లనేకము లున్నవి. ప్రభుత్వమువారి తపాలశాఖ సంఘప్రయోజనసంస్థగా నుండవలెనుగాని ప్రస్తుతము మనప్రభుత్వమువారు దానినొకవ్యాపారసంస్థగా జూచుట చిత్రము కార్డు కాని, కవరు అర్ధణానుండి, కార్డుఅర్ధణా, కవరుఅణాకు హెచ్చించినపుడే బీదలకు చాలమందికి కష్ట మేర్పడగా యిప్పుడింకను తపాలరేట్లను హెచ్చించుట భావ్యము కాదు. రైతులలో మితవ్యయమును ప్రోత్సహించు నిట్టిసదుపాయములు ప్రభుత్వమువారు విరివిగా బీదల కుపయోగించునట్లుండజేయుట శ్రేయస్కరము.

## 11 వ్యవసాయఋణముల గూర్చి న్యాయశాస్త్ర సంస్కరణము

ఒకశతాబ్దమునకు పూర్వము ఋణపత్రములబట్టియే న్యాయస్థానమువారు ఋణగ్రహీతలపై డిక్రీలు అమలుజరుపవలసియుండెను. ఇందుచే ఋణదాతలు రైతులయవసరమునుబట్టి ఋణపత్రముల నతికఠినపద్ధతులపై వ్రాయించుచు తమకొసగబడిన సౌకర్యములను రైతుల నేధించుటకై దుర్వినియోగపరచుటను ప్రభుత్వమువారు శీఘ్రముగనే గ్రహించి ఋణదాతల కొసగిన యాయుధములను తిరిగి లాగికొన మొదలిడిరి. నిర్దాక్షిణ్యమును, నిష్పక్షపాతమును కఠినమును నైన ఆధునికన్యాయశాస్త్రములకు మారు సామాన్యమానవధర్మదృష్టితో వివేకమైన న్యాయము నొసగవలసిన యావశ్యకత గ్రహింపబడెను. ఇందుచే ఋణదాతలకు ధర్మసమ్మతముగా రావలసినధనమును కోల్పోవ జేసిన రైతులకు పరపతి పుట్టదు అది ధర్మముకూడ గాదు కాన నీవిషయమున న్యాయాధికారులు కడుసూక్ష్మదృష్టితో మెలగవలెయును రైతులు ఋణదాతల నిరంకుశకఠినవిధానములనుండి రక్షింపబడవలెను. కాని వారు ఋణదాతలకు ధర్మముగా నివ్వవలసిన, యివ్వగలిగినవరకు ఋణము తీర్చునట్లు చేయవలెను.

రైతురక్షణార్థమై సివిల్ ప్రొసీజరుకోడు (Civil Procedure Code) రైతులపై డిక్రీల నమలుజరుపుసందర్భములందు కొన్ని మార్పుల గావింపబడెను అందుచే వ్యవసాయోపకరణములను, సేద్యమునకు వలయు పశువులను, కర్షకుని గృహసామగ్రి ఋణమును తీర్చుటకై కోర్టువారు జప్తుచేయుటగాని విక్రయించుటగాని న్యాయశాస్త్రసమ్మతము కాదు అదియునుగాక ఋణగ్రస్తుడైన రైతు తనఋణమును వాయిదాలపద్ధతులలో తీర్చుకొను సౌకర్యమును పొందు నవకాశము కలదు ౧౮౭౫-వ సంవత్సరములో డక్కనులోని కొన్ని గ్రామములలో ఋణదాతలపై ఋణగ్రహీతలు తిరుగబడుట మొదలగు అల్లరుల విచారణకై నియమింపబడిన సంఘమువారి (The Deccan Riots Commission) సలహా ననుసరించి ౧౮౭౯-వ సంవత్సరములో 'డక్కనుకొరయితుసాహాయ్యకశాసనము' (The Deccan Agriculturists' Relief Act) గావింపబడినది. ఈశాసనముప్రకారము న్యాయాధిపతులకు ఋణపత్రములమీరి రైతుల కుపయోగమగునటుల దుర్భరమైన వడ్డీరేటును తగ్గించుటకును, స్పష్టముగా తనఖాయీయబడినగాని భూమి ఋణదాతకు సంక్రమింపకుండ జేయుటకును, కొన్ని సందర్భములలో క్రయపత్రమున్న భూమినైనను ఋణదాతలనుండి రైతుకు తిరిగి యిప్పించుటకును అధికార మొసగబడెను

ఈశాసనమువల్లనే ఋణదాతలు క్రమమైన ఖాతాలను వ్రాసి ఋణగ్రహీతల కగుపరచుటకును, ఋణగ్రహీతలు చెల్లించినమొత్తములకు సొమ్ము ముట్టినట్లు రశీదు లిచ్చుటకును నియమము లేర్పడెను. రైతులభూమితనఖా లిఖితపూర్వకముగా నుండవలసినట్లు శాసింపబడెను ౧౮౫౯ సం॥ నుండి మూడుసంవత్సరములుగా నుండిన 'ఋణపత్రజీవితకాలము' (Period of Limitation) రిజిష్టరయిన పత్రములకు ౧౨ సంవత్సరములవరకును, రిజిష్టరు కానివాటికి ౬ సంవత్సరములవరకును పొడిగింపబడెను ఈశాసనము సదుద్దేశ్యముతో గావింపబడినప్పటికిని, ఆచరణయందది నిష్ప్రయోజనమై హానికరముగగూడ పరిణమించినది. దీనివలన వ్యాజ్యము లెక్కువయైనవి; రైతులు సాహుకార్ల మధ్య పరస్పరసందేహములును, అస్థిరత్వమును వృద్ధియై సామాన్యపరపతికి భంగము కలిగినది. ఈశాసనముద్వారా రైతుల కొసగబడిన సదుపాయములను వారు దుర్వినియోగపరచుటవలనసాహుకార్లు తమవడ్డీవ్యాపారములో మిగుల జాగ్రతగాను, కట్టుదిట్టముగాను మెలగుటచే అప్పుదొరకుట కష్టమయినది. 'వ్యవసా

యకుడు' అనుపదమున కొసగిన విశాలార్థమువలన న్యాయముగా నీశాసనపుసౌకర్యముల బడయదగనివారు కూడ ఈశాసనమును దుర్వినియోగపరచుచు నిష్కపటులైన ఋణదాతలను న్యాయస్థానముల కీడ్చి వారి నోడింప నవకాశము కలిగినది ౧౯౦౧ సం॥రపు 'క్షామ విచారణసంఘము' వారి యభిప్రాయ మట్లుగా ఈశాసనానంతరము తనఖామూలమునను, విక్రయమూలమునను భూమి అన్యాక్రాంత మగుట హెచ్చినదని నమ్ముట కవకాశ మున్నది. కాలదికాలము క్రితమే ఒక బొంబాయిప్రభుత్వసంఘమువా రీశాసనమునకు కొన్ని ముఖ్యమైన సంస్కరణములను సూచించిరి శ్రీయుత కె. యస్. గుప్తగారు (Mr K. S Gupta) 'ప్రభుత్వవ్యవసాయవిచారణ సంఘమువారి కొసగిన వ్రాతమూలకపు అభిప్రాయములోగూడ నీశాసనసంస్కరణ విషయమై తెల్పియున్నారు. చాలమంది తెల్పిన యభిప్రాయమును బట్టి 'బొంబాయిరాష్ట్రీ బ్యాంకింగు విచారణసంఘము' (The Bombay Provincial Banking Enquiry Committee) కూడ నీశాసన సంస్కరణావశ్యకతను సూచించిరి. న్యాయస్థానమువారికి దుర్భర ఋణపరతులనుండి రైతును కాపాడుటకు స్వతస్సిద్ధమైన యధికార ముండుటచేతను, ౧౯౧౮ సం॥ రమున వడ్డీవ్యాపారమునుగూర్చి గావింపబడిన యొక శాసనము (The Usurious Loans Act) ఉండుటవలనను, ఈ 'డక్కను రయితు సాహాయ్యక శాసనము' (The Deccan Agriculturists' Relief Act) అనవసరమని పలువు రభిప్రాయ మొసగిరి.

'కంట్రాక్టు ఆక్టు' కు ౧౮౭౭ సం॥ రములో నొకముఖ్యమైన సవరణ గావింపబడెను ఎట్లన, ఋణదాతలు తమకుగల ప్రత్యేక సౌకర్యములు, పలుకుబడిని వినియోగించి ఋణగ్రహీతల కేవిధమైన కఠినషరతులు నియమింపకుండినట్లు ఋజువుచేయవలసినబాధ్యత ఋణదాతపైననే మోపబడెను.

౧౯౧౮ సం॥ రమున సవరింపబడినప్రకారము, 'వడ్డీవ్యాపార శాసనము' (The Usurious Loans Act) ఒక్కసారిగా ఋణదాత ఋణగ్రహీతనుండి పొందదగిన వడ్డీమొత్తపు పరిమితిని, న్యాయశాస్త్రరీత్యా విధింపతగిన వడ్డీరేటు పరిమితిని నిర్ణయించుచున్నది 'ప్రభుత్వ విచారణసంఘమువారు' (The Royal Agricultural Commission, ౧౯౨౮) తమ నివేదికలో (౩౬౫-వ పేరాలో) నీశాసనమునుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు — "ఈ శాసనపుముఖ్యలక్షణ మొకటి యేమనగా, ఒకసారి న్యాయస్థానమువా రొకవ్యాజ్యమును చేపట్టినపుడు, ఇంక వారు దానికి సంబంధించిన యావత్తు ప్రాతలావాదేవీలను, పత్రములను, దస్తావేజులను, యెవరును కోరక పోయినను తమయుద్దేశ్యముప్రకారము తెప్పించి యీఋణమునకుసంబంధించిన ధర్మాధర్మములను విచారింపవచ్చును. తనఖాపత్రపు ఇరుకక్షులలో నెవరైనను న్యాయస్థానసాహాయ్యమ పేక్షించితెచ్చిన వ్యాజ్యములకుకూడ నీశాసనము వర్తించుచున్నట్లి ది ౧౯౨౬ సం॥రమున సవరింపబడినది. ఋణము తనఖాఆధారములేనిదైనను, ఋణగ్రహీత కాలదోషముపట్టనున్న ఋణమునకు తిరుగ పత్రము వ్రాయ తిరస్కరించిన మాత్రముననే, ఋణదాతను న్యాయస్థానమునకు రప్పించి తద్ద్వారా ఈశాసనమును వర్తింపజేయవచ్చును." ఆసంఘమువా రీశాసన మేరాజధానిలోను ఆచరణయందు లేదనియు, అందుకు కారణముల కనిపెట్టి యికముందు ధారణయందుంచుటకు వలయు ప్రయత్నముల ఋణదాత జేయవలెననియు ననిరి. వారు "పంజాబు ఋణదాతలబిల్లు"ను (The Punjab Money lenders' Bill), "బ్రిటిషుఋణదాతల శాసనము"ను (The British Money lenders' Act 1927) గూడ రాష్ట్ర ప్రభుత్వములకు ఆచరణయోగ్యముగ సూచించిరి పంజాబు బిల్లుఉద్దేశ్యము ఋణదాతలు సక్రమమైన ఖాతాలు వ్రాయుటయును, ఋణగ్రహీతలకు ప్రతియారుమాసములకును వారివారిఖాతాల ఋణస్థితి నకళ్ల నొసగుటయును, బ్రిటిషుశాసనోద్దేశము ఋణదాతలు తమవ్యాపారమునకు 'లైసెన్సు' పొందుట, సాలుసరివడ్డీనిషేధము, ఋణగ్రహీతకోరినపుడు వానిఋణసంబంధమైన సమస్త విషయములను, పత్రముల నకళ్లను ఋణదాత లొసగుట, సహకారపరపతి వ్యాపించుచుండుటచేతను, ప్రస్తుతము ఋణమొసగుటకై ఉపయోగింపబడుచున్న ధనమెట్లయిన వినియోగింపబడవలసియుండుటచేతను, ఇట్టిశాసనములవల్ల పరపతి తగ్గిపోవునవకాశము లేదని 'వ్యవసాయ విచారణసంఘము'వారి (The Royal Agricultural Commission 1928) యభిప్రాయముకాని డార్లింగుగా రిట్టిశాసనము లమలు జరుపుట కష్టమనియు, మరియు నవి ప్రస్తుతకాలమున అనవసరములనియు భావించిరి

### 111. భూమిని అన్యాక్రాంత మొనరించుట సంకుచితపరచు యత్నములు

౧౯ శతాబ్దపు కడపటినలుబదేబది సంవత్సరములలో భూములధర లధికముగా హెచ్చినవి. అందుచే రైతులు అవివేకముగా ప్రతిఫలశూన్యఋణములు చేసి తన్నివారణార్థమై భూముల గోల్పోవ నొచ్చిరి ఋణగ్రస్తులయిన రయితు లిట్లు భూముల ఋణదాతలకు విక్రయించుటచే భూములు ధనవంతులకు సంక్రమించుననియు, వారు ధనమును వెచ్చించి భూములఫలకతను వృద్ధిపరచెదరనియు తలచి ప్రభుత్వమువా రిట్టిఅన్యాక్రాంతములను నిరోధింపక ప్రోత్సహించుచుండెడివారు. కాలముజరిగినకొలదిని క్రమముగా ప్రభుత్వమువారు భూమిని కర్షకేతరులకు అన్యాక్రాంత మొనర్పజూచుట ఆర్థికముగాను, రాజకీయముగను కూడ అపాయకరమనియు, కాన 'భూస్వేచ్ఛాన్యాక్రాంతమును' (Free Alienation of Land) నిరోధించుసమయమాసన్నమైనదనియు గ్రహించిరి అందుచే కర్షకేతరులకు భూమి అన్యాక్రాంతము గాకుండ శాసనముద్వారా నిరోధింపదలచినవారు తత్కారణమున పరపతితగ్గినను రైతు ఋణముచేయుటకూడ తగ్గునుకాన నదియును మేలే యని భావించిరి అందుచే పలుచోట్ల నీవిషయమై విచారణలు, ఆలోచనలు జరిగి కొన్నిచోట్ల శాసనములు వెలువడినవి.

ఇట్టిశాసనములలో పంజాబు శాసనము మిగుల గమనింపదగినది. ౧౯౦౧ సం॥రమున గావింపబడిన 'పంజాబుభూమ్యన్యాక్రాంతశాసనము' (The Punjab Land Alienation Act) కర్షకేతరజాతులవారు కర్షకజాతులభూమిని కొనుటకుగాని, ఇరువదిసంవత్సరములకు మించినకాలమునకు తనఖాపై తీసికొనుటగాని వల్లపడదు ఋణగ్రహీతల భూమి క్రమముగా ఋణదాతలకు సంక్రమింపకుండ జేయుటలో నీశాసనమునకు సంపూర్ణవిజయము గల్గినమాట నిక్కువము. కాని పాంతీకములో పుడకలరీతి లోట్లు లేకపోలేదు. విద్యావంతులైన పట్టణవాస్తవ్యులు తమతెలివితేటలను, కృషిని, ధనమును వ్యవసాయాభివృద్ధికై వినియోగించుటకీశాసనము ప్రతిబంధకమైనది అట్టి వివేకసాహసవంతులైన విద్యాధికులే ఆంగ్లవ్యవసాయాభివృద్ధికి కారకులు. ఈశాసనమున మరియొకలోటు యేమనగా, కర్షకేతరులకుమారు, కర్షకఋణదాత లెక్కువయైరి వారలకిపుడు బీదరయితులభూమియు సంక్రమింపజొచ్చెను ఈశాసనమందలి నియమములు వ్యవసాయకులకు వర్తించవు కాన పూర్వము సాహుకార్లు రైతుల నెట్లు బాధించిరో, అట్లే శాసనానంతరము కర్షకఋణదాతలు బీదరయితుల నతినిర్దాక్షిణ్యముగా జూచుచున్నారు. కర్షకజాతులనుండి భూమి పోకుండ చాపినను, ఈశాసనము రైతుజనుల ఋణబాధలను తగ్గించుట కెంచదగినంత తోడ్పడలేదు ౧౯౦౩ సం॥రమున 'బుందేల్ఖండు'న (Bundelkhand) కిట్టిశాసన మొకటి గావింపబడినది అబోరిజనుల తెగలనుండి అన్యాక్రాంతము నాపుటకు మధ్యరాష్ట్రములోను, బొంబాయిలోను శాసనములుగలవు.

i పరపతిని కల్పించుటకును, పోషించుటకును, ఋణముల తగ్గించుటకును గావించినయత్నములు

మనదేశమున రైతుల కొసగు ప్రభుత్వసహాయమార్గములో టక్కావిఋణములు బహుపురాతనములైనవి. బ్రిటిషుప్రభుత్వమువారు వరుసగా ౧౮౭౧, ౧౮౭౬, ౧౮౭౯ సంవత్సరములలో టక్కావిఋణశాసనముల గావించిరి. కాని ౧౮౮౦ సంవత్సరపు 'క్షామవిచారణసంఘము' వారి సలహాననుసరించి ౧౮౮౩ సంవత్సరమున 'భూవృద్ధిఋణశాసనము'ను (The Land Improvement Loans Act), ౧౮౮౪ సంవత్సరమున 'కర్షకఋణశాసనము'ను (The Agriculturists Loans Act) గావించువరకును రైతులకు సరియైన మానాయ్యము జరుగలేదు. 'భూవృద్ధి ఋణశాసన' ప్రకారము పొలముమీద శాశ్వతములగు మరమ్మతులకు అనగా షెట్టుపల్లములు సరిచేయుట, బావులుకట్టించుట, నీటియంత్రముల నెలకొల్పుట మొదలగువానికి వలయుధనము దీర్ఘకాలఋణము (Long Term Loans) గా ఇచ్చుచున్నారు. 'కర్షకఋణశాసన' ప్రకారము తాత్కాలికవ్యవసాయావసరములగు పశువులు, విత్తనములు, ఎరువులు, వ్యవసాయపరికరములు మొదలగువానికొనుగోలుకు స్వల్పకాలఋణము (Short-term Loans) లిచ్చుచున్నారు. ఈఋణములు రయితులకు అవసరసమయములందు చాల ఉపయోగకరములుగా నుండి గ్రామములలోని హెచ్చువడ్డీశెట్లబారినుండి రయితుల రక్షించుచున్నవి.

టక్కావిఋణములుమాత్ర మెప్పుడును రయితుల నాకర్షింపలేదు. ౧౯౦౧-౦౩ సం॥రము 'సస్యజలాధారవిచారణసంఘము' వారు (The Irrigation Commission) ఇట్టి ఋణములు భారతదేశమంతటను సుమా రారుకోట్లరూప్యములున్నట్లు అంచనావేసినారు. భారతవర్షకర్షకసంఘ మేడ? ఆరుకోట్లరూప్యము లేడ? అంబుధియేడ? అంబుకణ మేడ! ఈటక్కావిఋణములు ఏవైన ప్రత్యేక సందర్భములందు మాత్రమే యొసగబడును అట్టిసందర్భములలో నీఋణముల గొని, అనుదినముఋణదాతలవిశ్వాసము గోల్పోవ రయితు లిచ్చగింపక గత్యంతరము లేకపోయిననేగాని, యీఋణముల కైకొనరు. ప్రభుత్వపు ఏఋణవిధానమునైనను రయితులకు గ్రామఋణదాత లంతసుముఖముగుట దుస్సాధ్యము ప్రభుత్వపుటక్కావిఋణముల వసూలుచేయుటలోగల కాఠిన్యమును వానియుపయోగమును నిరోధించుటకు తోడ్పడుచున్నవి మరియు నాఋణమును రెవిన్యూశాఖద్వారా బసగబడుటచే, ఋణప్రదానవిధానమున నత్యాలస్యమగుటయు, నీఋణములు జనాకర్షణీయములు గాకుండుటకు కారణములు. ఈ టక్కావిఋణములు రైతులకు ఋణముల ఆర్థికతత్వమును గోచరింపజేయజాలనందున ధనదుర్వినియోగము నరికట్టజాలవు అదియునుగాక ప్రభుత్వమువారికి రైతులకు విరివిగా ఋణసహాయము చేయుదగినంత ధనము లేదు వ్రేళ్లపై లెక్కించదగిన కొన్ని క్షామముల సమయమందును, కొన్ని వెనుకబడియున్న ప్రాంతములందును గాక, రైతుజనసామాన్యమున కీటక్కావిఋణము లెక్కువ ఉపయోగకరములుగా లేదు ఈ ఋణము లిచ్చువిధానమును మార్చవలసిన యావశ్యకతను ప్రభుత్వమువారిపుడే గ్రహించుచున్నారు ఈ ఋణవిధాన కాఠిన్యమును తగ్గించుటకు సూచించుచు ఇండియా ప్రభుత్వమువారు కొలదికాలము క్రింద గావించిన తీర్మానమే యిందుకు తార్కాణము. ౧౯౧౭ సం॥రమున బొంబాయి వ్యవసాయపు బోర్డువారు (The Bombay Board of Agriculture) రైతులకు వ్యవసాయశాఖవారిచే శిఫార్సుచేయబడిన ఆధునికవ్యవసాయపరికరములు, ఎరువులు, విత్తనముల కొనుగోలుకై టక్కావిఋణముల విరివిగా నిచ్చుచుండవలెనని సలహా నొసగిరి. కొలదికాలమునుండియు బొంబాయి ప్రభుత్వమువారు సహకారశాఖద్వారా భూముల శాశ్వతాభివృద్ధికై యీ దీర్ఘకాలఋణముల నొసగుచున్నారు.

ఈశాసనములన్నియుగాక, ప్రత్యేకముగా ప్రభుత్వమువారు కొన్ని కీర్తివహించిన నాగోరువంశముబోలు వంశములను ఋణబాధలచే పడిపోకుండ ప్రత్యేకఋణసదుపాయము లొసగుచుండిరి. అమితవ్యయులై ధనమును దుర్వినియోగపరచుచున్న జమీం

లండను ఇండియా కార్యాలయమున|భారతీయ చిత్రకారుల భిత్తిచిత్రరచన



వర్మగారు 'అనునయము' అను చిత్రమును చిత్రించుచుండుట



సేనుగారు 'బుద్ధుడు—అతనిశిష్యులు' అను చిత్రమును చిత్రించుచుండుట

దారులనుండియు, మహారాజాలనుండియు, భూస్వాములనుండియు, సరియైనసంరక్షకులు లేని మైనర్లయొక్కయు యెస్టేట్లనుకాపాడుటకును సరియైనవాని కప్పగించుటకును రెండుసంరక్షకశాసనములు గలవు.—
1 కోర్టు ఆఫ్ వార్డ్సు ఆక్టు (Court of Wards Act, 11,) ఎంకంబర్డు యెస్టేట్సు ఆక్టు(Encumbered Estates Act).

ఈప్రయత్నములన్నియు ముఖ్యఋణసమస్యను పరిష్కరింప జాలని వగుటచే, ధనవంతులయిన ప్రజలధనమును సహకారపద్ధతులపై కూర్చి బీదరయితుల ఋణనివారణమునకు వీలగునట్లు చేయుటయే ఋణనివారణసాధనమని సర్ విలియం వెడ్డర్‌బరన్ (Sir William Wedderburn), న్యాయమూర్తి రెనడే మొదలగు మహనీయు లూహించి కావించినయత్నములు మొదట ఇంగ్లండులో ఇండియాకార్యదర్శి గారి అనుమతిని బడయనప్పటికిని, క్రమముగా ప్రభుత్వమునా రద్దాని యుపయోగమును గ్రహించి ౧౯౦౪ సం॥రమున సహకారపరపతిచట్టమును గావించిరి. సహకారపరపతిచరిత్రనుగూర్చి వ్రాయుట కీవ్యాస ముద్దేశింపబడలేదు. కాని యీఉద్యమము రైతుజనమున కపారసేవ చేయుచున్న సంగతి గమనింపవలసినది. దీర్ఘకాలఋణము లొసగుటకు సామాన్యసహకారపరపతి తగినంత ఉపయోగించనందున భూమితనఖాసహకారసంఘము లేర్పడ ప్రారంభమైనవి. ప్రభుత్వసహాయమునను, ధార్మికదృష్టిగలిగిన 'బ్యాంకు'లు ఇతర మహాశయుల ప్రోత్సాహమున అచిరకాలము రైతు కుత్కృష్టసేవ చేయగలవని యాశించెదము.

## ముగింపు

ఋణగ్రస్తులైన రయితులుగూడ తమ ఆర్థికస్థితిని చక్కబరచుకొనుటకు ప్రయత్నింపవలెను. ప్రతిఫలశూన్యఋణములు చేయుట మానవలెను సాధ్యమైనంతవరకు కూలిఖర్చు లేకుండగనే వ్యవసాయము చేసికొనవలెను. ఆధునికపాశ్చాత్యనాగరికసంబంధము కలవారు వ్యవసాయమన్నను, కాయకష్టమన్నను చులకనగా జూచుట కడుసంతాపకరము. అట్టివారు పాశ్చాత్యుల కట్టిదురూహలు లేవని గ్రహించుట మేలు. రైతులు వ్యవసాయపుపనులులేని కాలములో సోమరులై యుండక యేవైన గృహపరిశ్రమల నేర్పరచుకొని తమ ఆదాయమును వృద్ధిచేసికొనవలెను. రయితుకు తీర్చలేని ఋణములో మునిగిపోవుగు నసుభయము కల్గినతోడనే ఋణదాతలకడ కేగి వారి మంచితనముచే తమస్థితిని బాగుపరచుకొన యత్నింపవలెను. ప్రజానాయకులు రయితుసంస్థలు ఈఋణసమస్యను చేపట్టి ఋణదాతలకును, ఋణగ్రహీతలకును మధ్యగల దురభిప్రాయముల చక్కబరచి ఋణములను సక్రమముగా ధర్మదృష్టితో పరిష్కరించి రైతులోకమున శాంతిని నెలకొల్పి దేశకల్యాణమునకు తోడ్పడుదురుగాక. సకల ప్రకృతిసంపదల కాలవాలమైన భారతవర్ష కర్షకులు శాంతిసుఖముల బడయుదురుగాక.



## పట్టణములలో రోడ్డుదాటు సాహసకార్యము




---

# మాతృపూజ

చింతలపూడి శేషగిరిరావుగారు

గౌతమీకృష్ణాదిపూతప్రవాహినీ సలిలప్రభావప్రశస్తిఁ గాంచి
శ్రీశైలభద్రగిరిప్రభృతిక్షేత్ర మాహాత్మ్యకలన సన్మానమంది
పరిపంథినృపవీరబహుశతఘ్నులకైన సందీని దుర్గసంచయము గలిగి
బీఱువోవకయె ముక్కారునుం బండు సస్యసమృద్ధి నిద్ధసౌష్ఠవముఁ బడసి
అల్ల పితృవాక్యపరిపాలనార్థ మటవి-కరుగు శ్రీరాము పాదవిన్యాసమంది
సద్యశోభాసిమైన నాజన్మభూమి-యాంధ్రమాతకుఁ గేల్మోడ్తు నహరహంబు.

సల్పినారలుగదా, సర్వదిగ్విజయంబు వైరిరాజుల కన్నుకోరగింపఁ
జేసినారలుగదా, సీమసీమల కేఁగి యోడవర్తకము మహోన్నతముగ
వ్రాసినారలుగదా, బంధురతరహృద్య పద్యమండితసుప్రబంధచయము
నిల్పినారలుగదా, శిల్పనైపుణి మీఱ దీపితప్రాకారగోపురాళి
సాంఖ్యకాధ్యాత్మనైతికచర్చలందుఁ-బూని పాల్గొని సిద్ధాంతపూర్వపక్ష
దక్షులై సారముం గ్రోలఁదగిరిగాదె-యఖిలశాస్త్రజ్ఞులు మదీయు లాంధ్రజనులు.

రాజమహేంద్రదుర్గ పురవరంబును రాజపదంబొనర్చి నా
నాజనరంజకంబుగ ననంతమహీవలయంబు నేలి వి
భ్రాజితభంగి నాంధ్రమున భారతసంహిత నిల్పినట్టి యా
రాజనరేంద్రుఁడుర్వ దెలుఁగురాజగు టారయ మాదు భాగ్యమే.

వెలయు శిల్పాదివిద్యల వృద్ధిఁజేసి - వైరిరాజుల ప్రక్కలో బల్లెమగుచు
సార్థకాహ్వయుఁ డనఁగఁ బ్రశస్తిఁగన్న-యల్ప్రతాపరుద్రుఁడుగూడ నాంధ్రరాజె.

కృతు లందుకొని బహూకృతికినై కవులకు నగ్రహారము లిచ్చు త్యాగశీలి
పల్యంకికారోహభాగ్యోదయముఁగూడఁ గవులకుఁ జవిచూపు ఘనయశుండు
ప్రబలపరాక్రమప్రాభవోపేతుల క్షణములోపల గెల్చు శౌర్యమూర్తి
'దేశభాషలయందుఁ దెలుఁగు లెస్సఁగఁ' జేసి బహ్వలంకృతిఁ జేయు పండితకవి
శత్రురక్తంబుతో జయశాసనములు - పెక్కు లిఖియింపనేర్చిన మొక్కలుండు
'మూరురాయరగండండు' మొదలుగాఁగ - బిరుదములెన్నియో పొందిన వీరవరుఁడు
కృష్ణరాయ లాంధ్రుం డనుకీర్తి మాదె.

పగఱకును వెన్నునిచ్చిన నగుదురనుచు - స్నానవిధి స్త్రీలకుంబలె సంతరించి
పాఱివచ్చిన భర్తలఁ బోరికంపు - మానవతు లుండి రీయాంధ్రమండలమున.

భద్రగుణాకరయుఁ, ని - ర్నిద్రపరాక్రమఖనియు, వినీతయు, స్వచ్ఛా
త్మోద్రయశోనిధియగు మా-రుద్రమదేవియుఁ దెలుంగుప్రోడయకాదే!

ముద్దుపళనియు, వేంకమ, మొల్ల, మోహ-నాంగి మొదలగు కవయిత్రు లాంధ్రమాతృ
గర్భశుక్తిముక్తాత్వముఁ గాంచు టాంధ్ర - జనులు సల్పిన సుకృతాతిశయముగాదె!

బొబ్బిలివారల పౌరుష - మబ్బురముం గలుగఁజేయ నట్టె పరాసుల్
సిబ్బితిచెడి పిఱుదివియరె! - దెబ్బకుఁ దాళంగలేక దీనత దోఁపన్.

ఔర! పల్నాటివీరుల పౌరుషంబు - రెడ్డిరాజుల శౌర్యధురీణతయును
బోరఁజాలక కాలికి బుద్ధిఁజెప్పు - వైరులకుఁ గాక యన్యుల కేరికెఱుక

మంత్రాంగవిశారదుఁడు, స్వ - తంత్రుండు, సమస్తరాజ్యతంత్రజ్ఞుఁడు, దు
స్తంత్రవిభేదనచణుఁడౌ - మంత్రియుగంధరుఁడు తెల్గుమంత్రియకాదే!

పలుకునుడికారమున సొంపుగులుకునట్టు-లరఁటిపం డొల్చి చేతికి నందఁజేయు
రీతి భారత మాంధ్రీకరించినట్టి-యల కవిత్రయ మస్మదీయాంధ్రమాత
కడుపుచల్లఁగఁ గాంచిన కాన్పుగాదె!

స్వర్ణాభిషేకమందెను - స్వర్ణపుఁ బాత్రల భుజించెఁ బ్రభువుల పంక్తిన్
నిర్ణేతయయ్యెఁ గవితకు - వర్ణింతు మెటు కవిసార్వభౌముని ప్రజ్ఞల్?

'మందారమకరందమాధుర్య'గరిమతోఁ గవనంబు సెప్పెడి కవివరుండు
'కుప్పించి యెగసిన కుండలంబుల కాంతిఁ' గనులఁగట్టఁగఁజేయఁ గలుగు శిల్పి
'హంసలీలానిద్రలందును'హరిఁ గూడి యన్యంబు మఱచినయట్టి యోగి
'కోమల'యా కావ్యకోమలిం బ్రభువుల కమ్మఁజాలనియట్టి హాలికుండు
'చేతులారంగ శివునిఁ బూజించు'ఘనుఁడు-'నోగు నొవ్వంగ హరికీర్తి నుడువు'భక్తుఁ
డిచ్చమెయి లేమిఁ గైకొని నొచ్చుకొనని-పోతనంబోలు కవు లన్యజాతిఁ గలరె?

ధరణిపుఁ డొక్కనాఁడు ప్రథితంబగు పద్యము నల్లఁగోరఁగా
నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతికవీడ్య, మాదియౌ
షరతులు పెక్కుగోరి తుది సద్రసవత్పదపద్యమల్లు సు
స్థిరకవితాపితామహుఁడు తెల్గువనంబున సంచరింపఁడే!

గ్రథితమౌ కథాకల్పనాగౌరవమున - నందెవేసిన చెయ్యియై యలరినట్టి
యల్ల పింగళిసూరన, యాంధ్రమాత - 'బహుళతపఃఫల'మని చెప్పవలసినట్టి
పుత్రరత్న; మేతన్మాత్రపురుషుఁడొక్కొ!

ఇట్టి లోకైకమాన్యులే యిపుడుఁగూడఁ - గలరు కుప్పతెప్పలుగాఁగ; ఫలము గలదె?
లేడి చిక్కె నన గాళ్లులేక కాదు - కాలవైపరీత్యమె దాని కారణంబు.

---




# స్మృతికణాలు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

(వడ్డాదే విరటరాజు ఏలిన రాజ్యానికి రాజధాని అంటారు. పెద్దపెద్ద మంటిదిబ్బలే అతని కోటలని, బలుసుతుప్పలు పెరిగిపోయిన బయలు ఆయనసభావేదిఅని, దానికి దగ్గరగా ఉన్న కంకరగుట్టలే సింహబలుని మేడలని ఇక్కడి ఇప్పటివారి నమ్మకం.)

౧

ఇదియఁట మాత్స్యభూమీశుని పెనుఁగోట మంటిదిబ్బలుగ మాకంటి కమరె
ఇదియఁట మత్స్యరాజ్యేందిరపీఠంబు బలుసుతుప్పల బరాబరులు నేఁడు
ఇదియఁట యుత్తరాసుదతినాట్యపుశాల నక్కత్రొక్కుడులు మానాఁటి మాట
ఇదియఁట కీచకోర్వీశు పాపపుజాడ ఎఱ్ఱకంకరగుట్టపఱ్ఱ లిపుడు
ఇదియఁట దురంతకౌరవుల్ చెదరి మేయుఁగోవులనుబట్టి యానికి డీకొనిన తావు
కఱకుముండుల తుమ్మవృక్షములతోడఁ గ్రాలె నొక్కబయలుగ మాకాలమునకు.

౨

ఎన్నఁడు మావిరాటధరణీశ్వరు ప్రోలిని ధర్మదీక్షితుల్
బన్నము లంది, క్షాత్రవిభవంబున నొక్కొకయప్డు తేనిచే
మన్నన లంది, దివ్యమహిమంబునఁ గ్రాలినవారో? యేకడ
న్నన్నులమిన్న యుత్తరబృహన్నల నాట్యము చిందులాడెనో?

౩

ఉత్తరకుమారునితో —

కట! కట! రాచపుట్టువవుగావె యెటుంబలె నాఁడువారిలో
దిటవున డాబుగొట్టుచు నదీను బృహన్నలఁ దూలనాడి యు
త్కటరభసంబుఁ జూపి, యిటు కౌరవనాథమహావరూథినీ
చటులభటార్భటీతతికి జంకితి బొంకితి ఔత్త నుత్తరా!

౪

కీచకునితో—

పాపము పాపమయ్యె పెఱభామల నవ్యవయోవిలాసనం
దీపితరూపముం గని, మదిన్ భ్రమగూరిచి తుచ్ఛవైషయే
చ్ఛాపరుఁడౌట; తప్పుసుమి సాధ్వి, తపస్విని, ధర్మమూర్తియౌ
ద్రౌపది చెట్టబట్టగఁ దలంచుట నిక్కము నమ్ము కీచకా!

౫

కీచకవధ—

అరరరే!!! యెంతపనియయ్యె ననిలసుతుఁడు - పాపచింతల భ్రమసి పైఁబడిన కీచ
కావనిపు గుండెపై ముష్టిఘాతవృష్టిఁ - బఱపి రక్తంబు గ్రక్క నిబర్హణించె.

౬

విరాటుని కోపం—

ఆ! విరాటధరాధీశ ఆఁగు మాఁగు - మేయఁబోకుము కనలి ధర్మేశు నుదుట
అయ్యయో! యెంతలోఁ దొందరయ్య నీకు - సారెతోఁ గొట్టితివి రక్తధార లురుల.

౭

ద్రౌపదీ!—

రమ్మర మ్మిటు లో ద్రౌపదమ్మ వేగ - హస్తమునఁ బట్టికొనుము యీ యస్రధార
చెదరి యారక్త మిటఁ గొంత చిందెనేని - ధ్వంసమైపోవు మా రాజధాని యెల్ల.
"మాడెములు పేల్చె నొడ్డాది మసియొనర్చె"

౮

ఆతపస్విని చేమెటో యదరిపోవ-తొలకినది యేమొ రక్తబిందుపుకణంబు
అట్టి పాపపు మంటయే కట్టికుడిపె-నేమొ శ్రీకృష్ణరాయులు నేచివచ్చి
పసచెడంగ మా వడ్డాది మసియొనర్చె.

---

# ఎట్టిదోబోటికన్నీటిబొట్టుమహిమ!

వెల్లంకి సత్యనారాయణమూర్తిగారు

ఆది నిశాసమయంబు—నీలాంబరమున
భూరిసుందరతరకళా స్ఫూర్తితోడ
ప్రకటితాపారలావణ్య భరితు డగుచు
తారకానాయకుండు చెన్నారుచుండె.

స్వచ్ఛజలపూరితములైన సరసులందు
ప్రాణనాథసందర్శన ప్రాప్తహర్ష
జనితసురుచిరమందహాసములతోడ
రహి వహించె నుత్ఫుల్లకైరవగణంబు.

అట్టితఱియందు ద్వారకాపట్టణమున
తప్తకాంచనమహితసౌధంబులోన
విమలమాణిక్యరత్నదీపములతోడ
డంబుమీరిన రతిమందిరంబు జేరి
సరససల్లాపకేళికానిరతు లగుచు
రాధికాపంకజాక్షియు మాధవుండు
హర్షవారాశిలో నోల లాడుచుండ.

నవ్వుపై నవ్వు లెన్నియో నివ్వటిల్లె
ముద్దుపై ముద్దులకు వేరె హద్దు లేదు
యుక్తిపై యుక్తు లెంతయు రక్తిగట్టె
సరససల్లాపముల జొక్కు సమయమందు
మధ్యమధ్యను రాధికా మాధవులకు.

చెప్పగాలేని తమకంబుచేత రాధ
చేరి ముద్దీయ నధరంబు చూరగొనును
అధర మానిన మొనపంటనట్టె నొక్కు
కడగి మొనపంట నొక్కిన గౌగిలించు
గౌగిలించిన గుచముల గరము లుంచు

చతురమతియైన దేవకీసుతుడు భళిర!
వలచి వలపింపజేయు నేర్పరి యతండు
అట్లు సంతోషపరవశాయత్తచిత్తు
లగుచు వా రున్నయట్టి యయ్యవసరమున
నంతలో నేమి జరిగెనో యద్భుతంబు
ఏమి చేసెనో రాధ—ఊహింపలేము
కాని యొక్కనిమేషంబులోన నౌర!

అట్టి యానందపారవశ్యంబునందు
అట్టి స్వేచ్ఛావిహారసౌఖ్యంబునందు
అట్టి నిష్కపటంపు మోహంబునందు
నేలనో యొక్కపెట్టున నినుమడించె
ప్రబలకోపంబు గోపాలబాలకునకు.

పాప మేమియు రాధికాపంకజాక్షి
కాంతు నెగ్గాడగా లేదు కాన, నంద
సుతుడు తా జగన్నాటకసూత్రధారు
డౌటచే నొక్కనాటక మాడగోరి
యందులో రాధమానస మరయగోరి
యభినయించిన కోపమంచనగవల్దయు.

నవ్వు లేమాయె? సొగసైన చిన్నె లేవి?
కులుకు లేమాయె? జిలిబిలిపలుకు లేవి?
ముద్దు లేమాయె? హాస్యంపుసుద్దు లేవి?
ఇన్నియునుగూడ నొకసారి యెగిరిపోయె.
పిలిచిననుగాని తా మారు పలుకబోడు
సొంపుదళుకొత్త మోమెత్తి చూడబోడు
ప్రాణసఖిచెంతనైన నిల్వంగబోడు

గోపికాకృష్ణు డెదలోనికోపమునను.
అలుకవిడనాడు మని రాధ పలుకరించు
గోపికావల్లభుడు చాల కోపగించు
వద్ద కేతెంచి రాధ తా ముద్దుబెట్టు
కమలనేత్రుడు మారుమొగంబుబెట్టు.

రంగమం దిట్లు కడురసభంగ మాయె
సరస మంతయు పూర్తిగా విరసమాయె
కులుకు లన్నియు చివరకు ములుకు లాయె
ఇంపు లన్నియు దుద కదలింపు లాయె.

అంతకంతకు పతికోప మతిశయింప
ప్రబలమైనట్టి తత్తరపాటుతోడ
కరగి దిగజారు తిలకంపుసరణితోడ
పాలుగారెడి చెక్కుటద్దాలతోడ
తల్లడిల్లినయట్టి డెందంబుతోడ
నమితమై వెల్లివిరియు మోహంబుతోడ
రాధ తన ప్రాణనాథుకరంబు బట్టి
మానుమా కోప మింక నాయాన యనుచు
మరలమరలను తా బతిమాలదొడగె.

తప్పు నేనేమి చేసితి జెప్పు మనుచు
చెనటికోపంబు నీ కింత చెల్ల దనుచు
ధవుని దరిజేరి రాధికాతరళనయన
వినయభయసంభ్రమంబులు విస్తరిల్ల.

కాని కృష్ణుడు కోపంబు మానకున్న
చేయునది లేక తన పైటచెఱగుతోడ
మోముపై నొత్తి యొక్కింత మొగము వాంచి
బోటి యంతట కన్నీటిబొట్టు విడిచె.

రాధనేత్రాబ్జములనుండి రాలిపడిన
యట్టి కన్నీటిబొట్టు మాహాత్మ్య మేమొ!
దానితో నింతదనుకను దనరుచున్న
మాధవుని కోప మంతయు మాయమయ్యె.

గోపికాకృష్ణు డెదలోని కోప ముడిగి
రాధదుఃఖము జూచి యోర్వంగలేక
తత్తరంబంది మితిలేని తమిని జెంది
రాధ నంతట దరికి జేరంగదీసి
యలకలను దువ్వి కౌగిటియందు జేర్చి
మోహమున బుగ్గపై నొక్కముద్దు బెట్టి
మానవే దుఃఖమును వెఱ్ఱిదాన యనుచు
మోద మనునట్టి మున్నీట ముంచివైచె.

ప్రాణసఖినేత్రములనుండి రాలినట్టి
చిన్నకన్నీటిబిందువుచేత పతికి
సతియెడ జనించు తీవ్రప్రచండకోప
పావకజ్వాల క్షణములోపల శమించు
నౌర! ప్రకృతి యదెంత మాయాత్మకంబొ!

అడ్డుపెట్టుట కేమి శక్యంబుకాక
కరము తీవ్రత జెంది ప్రజ్వరిలుచున్న
యనల మొక నీటిబొట్టుచే నారిపోయె
నెట్టిదో, బోటికన్నీటిబొట్టుమహిమ!



కొచ్చి ఓడరేవు మహాసభ, మదరాసు.





సూర్యనమస్కారములు

సింహాగారు మదరాసులో స్త్రీలను తరిఫీదు చేయుచుండుట.



మదరాసు 'యంగుమెన్సు క్రెసెంటు సొసైటీ'వారు ప్రాఫెట్ జన్మదినోత్సవమును జరుపుట
అధ్యక్షులు వి రామదాసుపంతులుగారు



ఉత్తరాది మఠస్వామి శ్రీసత్యధ్యాన తీర్థులువారు
(చెన్నపురిలో)



రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు

# *మాయని ముత్యములు

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు, ఎమ్. ఏ.

రాళ్లపల్లియందు-రాళ్లెన్నొ పుట్టెను
రాలలోన వజ్ర-రాలు పుట్టె
వజ్రరాలలోన-వల పెట్లు పుట్టెరా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

నవ్వి కడుపు పగుల-నవ్వించుమాటల
పలుకవలయు ముద్దు-లొలుకునట్లు
మొగము చిటులఁజేసి-మ్రోఁగించునుడు లేల
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

నొవ్వఁజేసియుండి-నవ్వఁ బుట్టించిన
మనసునకును బాధ-కనఁగరాదు,
చెవులు తూట్లుపొడిచి-చెవిపోగు లిడినట్లు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

కఱకునుడులముండ్ల-కంప లీడ్చుట లేల
కఱకుఁదనము మెచ్చఁ-గఱపవచ్చు
వలచు గేదఁగులను-ప్రబలుముండులరీతి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

మాటయందు తీపి-మరగియుండుట లెస్స
భావమందు తీపిఁ-బడయ లెస్స
మాటభావములును-మఱి తీపికయా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

మాట మెఱిఁగియుండి-మాటాడు టొక్కటి
భావ మెఱిఁగియుండి-పలుకు టొకటి
మాట భావములును-మఱి యెంచి పలుకుదు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

అలఁతియలఁతితునియ-లతికి కాహలఁగూర్తు
రలఁతియలఁతి పదము-లతుకు దీవు
గానమందు, గాన-భావంబులును నిందు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

చెప్పఁబోవుదానిఁ-జప్పిమాటలచేతఁ
జెప్పవచ్చుఁ దాన-మెప్పు లేదు,
చెప్పవలయు రసము-చిప్పిల నీయట్లు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

వినఁగవినఁగ వెఱ్ఱి-వేమనపద్యాల
వెఱ్ఱివలపు పుట్ట-విప్పి చెప్ప
వీనులకును విందు-వెలయింపఁ జేసితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

వెదకి యేర్చి, యోగి-వేమన్న చెప్పిన
మాట పసలకొక్క-నీటుఁ గూర్చి,
వానిలోని రుచుల-వాచవి చూపితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

ఆటవెలఁదిఁ గూడి-యాటలాడిన యోగి
ఆటవెలఁదిలోన-నాత్మఁ దెలిపె
తెలిసి తెలిపినట్టి-తెలివిఁ జాటితి వీవు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

* ఈ పద్యములు ఆంధ్రవిశ్వవిద్యాలయ పక్షమున శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చేసిన వేమనోపన్యాసములయిన తరువాత వారిని గౌరవించుటకు అనంతపుర పౌరులు చేసినసభలో చదువబడినవి — చి. నా.

పండితులకు పెద్ద-పద్యాలపైఁ బ్రీతి
వాదమందు శాస్త్ర-వాదులకును
ఆటవెలఁదులంచు-నందఱికిని బ్రీతి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

పెద్దపులులతోడ-విద్దెలాడెడువారు
మత్త గజమునెత్తి-మొత్తువారు
ఆటవెలఁది యాట-పాటల మెత్తురా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

తెలియరాని దానిఁ-దెలుపఁగవచ్చును
తెలిసి తెలియకున్నఁ-దెలుపవచ్చు
తెలిసియున్న వానిఁ-దెలుపుటయే నేర్పు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

తెలియలేదటన్నఁ-దెలిసినవాఁడగు
తెలిసెనన్నవాఁడు-తెలియలేఁడు
దీని భావమేమొ-తెలియంగఁ జాటరా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

కలిపె వేమయోగి-కర్ణాట సర్వజ్ఞ
మూర్తి కలిపె, ఎవరు-ముందో కాని
ఇరువురందుఁగలుగు-నింపులు దెలిపితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

వేమయోగి హృదయ-వీథిఁ బుట్టెను భావ
మాంధ్రులందు నదియు-నావరించె
నావరించినట్టి-యర్థంబుఁ దెలిపితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

తేనె నిండియుండు-తెనుఁగువారలయెద
యమవసందువలెనె-యూర్చుకొనియె
నార్చుకొన్నయెదను-జేర్చినావా తేనె
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

తమ్ముఁ దామెఱుంగఁ-దలపోయనేరక
యాంధ్రజాతి వార-లంధులైరి
అంజనంబువారి-కరయఁగా నీమాట
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

గుప్పుచప్పుమనక-గుటకరింపఁగఁజలు
వెన్నమీఁగడలను-వదలిపెట్టి
చక్కిలముల నమల-జను లేల తల్లఁకురో
కీర్తనీయచరిత-కృష్ణశర్మ.

జల్లటంచు వలచు-మల్లెపూ లుండఁగ
ముండ్ల గేదఁగులను-ముట్ట నేల?
వేమనార్యుమ్రోల-పెరకవు లేలయా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

అందమైనకూర్పు-అమఁభావముపేర్పు
చెప్పఁగలుగు నేర్పు-చేరియుండ
పర్చి, పేర్చి, కూర్చి-యింపొనర్చెద వీవు
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

చందమామలోన జలజల నమృతంబు
రాలుననుచు దెలుపు-వ్రాలు మిథ్య
జాలువారు నీదు-సరసంపువచనాలఁ
గీర్తనీయచరిత-కృష్ణశర్మ

చెప్పుటకును పెద్ద-గొప్పేమి యున్నది
వెఱ్ఱి వేమనయ్య-మొఱ్ఱినుమల
వెఱ్ఱిమొఱ్ఱిలోనె-జుఱ్ఱఁజేసితి తీపి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

పుట్టగోఁచి పెట్టి-మెట్టవేదాంతులై
గుట్టు తెలియలేని-కట్టిడులకు
చెట్టవేము నోటఁ-బెట్టి తిట్టించితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

పెట్టి పొయ్యలేని-పెద్దయ్య డంబము
కట్టి కుడువలేని-కష్టుబ్రదుకు
గుట్టు తీసి బయటఁ-బెట్టితి వొకసారి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

కమ్మవలచునట్టి-కర్ణాటకస్తూరి
తెనుఁగుఁ దేటతోడఁ-దీటు గొలిపి
తెనుఁగుఁ కన్నడముల-చనవులఁ జాటరా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

గుట్టు లరవమందు-పుట్టువు తెనుఁగందు
మెట్టు గన్నడమునఁ-బట్టినావు
మూఁడు వాక్కులందు-ముచ్చటల్ దీర్పఁగా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

పుట్టినింట కొంత-ప్రొద్దుపుచ్చితి వీవు
అత్త పిలుచుచున్న-దరుగుమింక
బిడ్డపాపలఁ గని-వృద్ధికి రమ్మయా
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

ఆసగొన్నయట్టి-యయ్యలపాటలు
మోసగాండ్రకూట-మోహములును
ఎక్కఁబెట్టి వరుస-లెక్కింపఁ జేసితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

మాటలకును బాట-మనసునకును దేఁట
భావములకుఁ దీట-ప్రబలఁ జేసి
వేమనార్య పద్య-విన్యాస మెంచితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

మాట చల్లఁదనము-మనసు మెత్తఁదనంబు
భావసౌరభంబు-వరలఁ జేసి
సూక్తి సుమచయంబు-శోభిల్లఁ జేసితి
కీర్తనీయచరిత-కృష్ణశర్మ

---

## జన్మసాఫల్యము

వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.

క్షణికమౌ తనమాట సతము నీశతవేదజిహ్వాల పాటయై చెల్లదేని,
దురితమౌ తనశ్వాస నిరతంబు నమలమౌ నీప్రాణవాయువై నెగడదేని,
చలమైన తనచూపఖిలలోకములఁ జూచు నీదివ్యదృష్టియై నిలువదేని,
పరుషంపు తననడల్, బంగారు పండించు నీపదగతులపెం పూనదేని,
మృతిఁగూర్చు తనతమోవృతమతి, నీసుధాకరలసజ్జ్యోతియై పరఁగదేని,
పాపఁడై భవత్పదములన్ బ్రాఁకిప్రాఁకి - నీహృదబ్ధి నుయ్యాలలూఁగ నేర్వఁడేని,
నుర్వి నరుఁ డున్న నేమి? లేకున్న నేమి? - దివ్యసుఖధామ! శ్రీప్రకృతిలలామ!

---

# రాసక్రీడ

అష్టావధాని, చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు

కనియెన్ ముందట మందమారుతచలత్కాసార విస్తార సం
జనితాంభోజ సుగంధబంధుర మవిశ్రాంత ప్రశాంతస్వర
స్వనితోన్మత్తపికాంగనా నికరమున్ జంచద్ద్విరేఫమ్ము స
ద్వినతానేకఫలద్రుమాకలితమున్ బృందావనప్రాంతమున్

ఇట్లు కని, సముచితస్థలం బేర్పఱచి శ్రీకృష్ణుండు పదంపడి,

తన కిరుప్రక్కలందు వనితల్ సెలఁగంగ విచిత్రలీలఁ దా
నును గసుప్రేమ నొక్కొక్కయనుంగుపడంతికి రెండువైపులం
దునఁ దగ నిల్చి మాలగతిఁ దోరపుబాహుమృణాలజాల మ
ల్లన గళసీమలం దిడి చెలంగెను మండలమధ్యవర్తియై

ఉరమునఁ గౌస్తుభం బగణితోజ్జ్వలదీప్తి వెలుంగ మోమునన్
జిఱునగ వొప్పు మీఱఁ దనచేరువ దక్షిణభాగమందు దు
ర్భరతరరాగయుక్తి నిలువంబడు రాధికబాహువల్లరిన్
గర మిడి యొక్కటన్ మురళిఁ గైకొని గానమొనర్పఁ జెచ్చెరన్

జలదాకారమటంచు నెంచె నహిభుగ్జాలంబు, రాగంబు న
జ్జలజాతేక్షణు మేనిసోయగము గాంచన్ రాజహంసాళి, య
న్నళినీనూతి యనుంగుమేల్పడఁతి వీణాగానమం చెంచి, స
ల్లలితస్వాంతముతోడ నొప్పె, హరి పిల్లంగ్రోవిఁ బూరింపఁగన్

తరువులుఁ బల్లవించెఁ దొలుతన్, ఫణిసంతతు లుల్లసిల్లెఁ, గి
న్నరులకు సంతసం బొదవె, నవ్యవిలాసినులైన వల్లవీ
గురుకుచపాళికిన్ మెఱుఁగు గుబ్బడచెన్ గిలకంఠపంచమ
స్వరమున మేళవించి హరి సన్మురళీనినదం బొనర్పఁగన్

ఒకచిగురాకుఁబోఁడి తమి నూని విపంచి ధరించి కేల, నిం
చుక సరిళస్వరంబుల విశుద్ధములై తగుజాణ్కు లొప్పుపొ
లికఁ బచరించి శౌరి మురళీనినదంబున మేళవించి, పా
యక వనులం గదించి, భవుఁ డౌననఁ బాడెను దంత్రి మీఁటుచున్

కరచంచన్మణికంకణప్రకరనిక్వాణంబు వీణారవ
స్ఫురణిన్ మించ మొగమ్ము చెమ్మగిల వక్షోజద్వయాలంకృతో
త్తరముక్తావళిపాళి సిక్కువడ గాత్రశ్రీభ మేపార, ముం
గురు లల్లాడఁగ లాస్యమున్ సలిపి రాగోపాంగనల్ శౌరితోన్

అంతఁ గొంతవడికి—

సడలిన క్రొమ్ముడులన్, మఱి - సడలిన నెన్నడుముల, వడి సడలిననడలన్
వడలిన మెయిదీవలఁ, గడు-బడలినకుచకుట్మలముల వఱలిరి పడఁతుల్

మోమున మోముఁ జేర్చి యొకముద్దియకున్ గపురంపువీడె మెం
తే ముదమారఁ బెట్టి, యొకతెన్ బిగిఁగౌఁగిటఁ జేర్చి, మక్కువన్
లేమ నొకర్తుఁ జన్గవని లేపనమున్ గిడెవోవఁ జెమ్మటల్
ప్రామిచు నాదరించి, యిటు వారిపరిశ్రమఁ బాపె నేపునన్

కెరలి యొక్కతె రాసకేళిపరిశ్రమ నొరఁగి పైత్రావఁ జేయఁ దానిడియెఁ
గలకంఠకంఠి నిహ్వాలచిత్తయై యొర్త పాడెనఁ దన్నాపఫణితిఁ బాడె
ననఁబోఁడియొకర్తు క్రొన్ననరీతిఁ బడలికఁగంద, నా తెఱపానకంబొసంగెఁ
దెలిముత్తెముల చాలువలెఁ దోఁచు నొకయింతి కుచములర్మ బిందువుల్ [గోట మీఁటె

లీల నొకలేమ రాగము నాలపించి - మేటిమురళీరవంబున మేళవించి
పాడు నెడ మోము మోమునఁ బఱపి ముద్దు - లాడెఁ గృష్ణుండు [రాసకేళ్యంతరమున

---

# ఆత్మోపదేశము

శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

ధనధాన్యంబులు సౌధవాససుఖముల్ దాంపత్యరాగంబులున్
తనుజన్మల్ వరభృత్యవర్గమును మిత్రశ్రేణియున్ బందుగుల్
తనువున్ బాసిన వెన్క వత్తురొకొ? వే తథ్యంబుగాఁ జెప్పుమా
మనమా! యేటికి జీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్

కనులన్ జూడఁగ శక్తి తగ్గి శ్రుతివిజ్ఞానమ్ము శూన్యమ్మునై
చనవార్ధక్యముచేత జర్జరితమై గాత్రమ్ము సుక్కంగ లే
మిని సంసారము భారమైనకతనన్ బీడింపఁగా రోగముల్
మనమా! యేటికి జీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్

జననం బాదిగ మోహపాశమున విజ్ఞానమ్ముఁ గోల్పోయి త
జ్జనితంబైన భవాబ్ధిలో మునిఁగి సత్సాంగత్య మారుండవై
తి నిజం బెన్నఁగ నంత్యకాలమునకున్ దీనత్వమున్ జెందెదో
మనమా! యేటికి జీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్

మనుజుండై భువి జన్మమెత్తుటన సామాన్యంబె? పూర్వంబు చే
సిన పుణ్యంబున గాదె యట్టులయి సచ్చిత్తుల్ వివేకించి రెం
డని వేర్వేర నెఱుంగలేక యొడఁ దా నార్తిం గృశించున్ గదా
మనమా! యేటికి జీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్

---

# ఈశ్వరాహ్వానము

## పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రిగారు

ఇల నొక్క యెఱుకుల కొనికిఁ
గలఁడు కుమారుండు సుగుణాఢ్యుని తిన్నం డా
యలఘుపరాక్రముఁ డొకపరి
విలు నమ్ములుఁ గొనుచు నరిగె విపిన స్థలికిన్

ఉఱుము మబ్బుల పైకి నురుకోపభరమున
గర్జిల్లి దుముకు సింగముల గముల
మృగరాజులకు నేని మొగమెత్తరాకుండ
నురువృత్తిఁ బరియించు శరభతతుల
కారుగున్నలఁ బట్టి కంఠనాళమ్ములఁ
గొఱికి నెత్తురుఁ బీల్చు కోలుపులుల
కొమ్ములొక్కటఁ జేరి క్రోధతామ్రాక్షులై
ముప్పుఁ గూర్పఁగ వచ్చు దుప్పిగుంపు
నొక్కొక్కకమ్మునఁ బడనేసె నొకటిరెంటి
మూఁటినాల్గింటెఁగూడ నపూర్వచాప
పాండితీప్రాజ్యగరిమమ్ము పరిఢవిల్ల
వనచరాధీశతనయుఁ డవార్యబలుఁడు

ఇవ్విధమున వేటాడుచు
దవ్వరిగి పథిశ్రమంబు దప్పియుఁ గదురన్
మవ్వపులతానికుంజము
నెవ్వగలం బాయఁజేరి నిద్రించుతఱిన్

అర్థమును శబ్దమును వోలె నసఁగి పెనఁగి
తావి పూవునువలె నేకతను భజించి
భువనజననియు జనకుఁడు నవుచుఁ బోలుచు
నర్ధనారీశ్వరుఁడు ప్రేమ నవతరించి

తిన్నని సాష్టాంగంబున్
మన్ననతో నందుకొని "కుమారక! చను మీ
తెన్నునను కాల కరిగిరి
యున్నది లింగంబ నగుచు నుంటి నచోటున్"

అనుచు నంతర్హితుండయ్యె నద్రిచాపుఁ
డంతఁ దిన్నండు మేల్కొని యాత్మ విస్మ
యాబ్ధిమగ్నాత్ముఁడై కాళహస్తిగిరికిఁ
జేరి యీశానుఁ గనుఁగొని చింత గదుర

ఆలుబిడ్డలఁ బోషింప నటమటించి
ప్రమథులకుఁ బంపువెట్టఁగాఁ బ్రోలుమాలి
యేల యీకానికానలో నెండ నెండి
వానఁ దడియుచునున్నాఁడో వాఁకతాల్పు?

ఇతని విడి యొంటిగా నింటి కేఁగు టింకఁ
దగదు, దేనిని గోరిన దాని నిచ్చి
బద్దులను జెప్పి నెమ్మది బుజ్జగించి
పల్లియకుఁ గొంచుఁబోయి మాపాక నుంతు

అని తలఁచి గూఢభక్తియె
జనులకుఁ గైవల్య లాభసాధనమని మా
వినయాది గురు వనుయశముఁ
గొనఁదలఁచెను నాఁగఁ బలికెఁ గూరిమి శివుకోన్

"అక్కటా యీరీతి నొక్కండ వీబు
కాన నుండఁగ నేమి కార్యమయ్య?
ప్రేమాస్పదంబైన శ్రీశైలమును బాసి
యిటకుఁ జేరఁగ నేమి హేతువయ్య?
నీమాట జవదాఁటనేరని యిల్లాలి
నొంటి నుంచుట కేమి యూహమయ్య?
గారాబుబిడ్డల గణనాథషణ్ముఖ
స్వాముల విడ నేమి భావమయ్య?
ప్రమథనాథుఁడవయి యొక్క ప్రమథుఁడేని
వెంట లేకుండ నిటు లేల యొంటి నుంట?
శరభశార్దూల వార్యక్షు శల్యభల్ల
గండకాది మృగాకుల గహనమందు

ఇక్కడ నిను వైచి యెక్కడి కేఁగనో
ముదిగిబ్బ వచియింపు వెదకి తెత్తు
తలదాఁప కేయూరి తమ్మళ్లపై నీవు
కినిసి వచ్చితి చెప్పు కినుకఁ దీర్తు
సోమేను గైకొన్న సతి యెడ నున్నదో
తెలుపుము వేవేగ పిలిచి వత్తు
గొరగ లుమ్మెత్తపత్తిరిఁ బూజసేయంగ
మరులెత్తెనే పల్కు మందు లిత్తు
ఇచటి కీవు వచ్చి యెన్నినాళ్లాయెనో
యిన్నినాళ్లనుండి యెవరు నీకు
అన్నపానము లిడి యాఁకలిదప్పులఁ
బాపువార లిచటఁ బాఁపతోడవ!

ఆంధ్రపోరాటంబు నడఁగింపఁగాలేక
విసువెత్తి వచ్చితే విశ్వనాథ!
చనుదెంచు భక్తుల సమ్మర్దమున కోడి
యిలు వీడి వచ్చితివే మహేశ!

ఒడయనంబికి నెప్డు బడిపనుల్ సేయంగ
    నేరక వచ్చితే నీలకంఠ!
జంగాలకొంపలఁ జరియింతు వని జనుల్
    వెలివేయ వచ్చితే విషమనేత్ర!
గోఁచిపాఁతయు దొంగలు దోఁచుకొనఁగ
దిస్సమొలతోడవచ్చితే దివ్యలింగ!
ఇన్నిమాటలతోఁ బని యేమి యింక
నన్ను బ్రోవంగఁ జనుదెంచినావె? శర్వ!

కొండలలో నీ విటు లో
కొండవు నుండంగ భయము గమరదె? క్రూరుల్
మెండుకొని యుందు రీశా!
తండములై నీవు నిచటఁ దగదు వసింపన్.

ఏతెమ్ము మాపల్లె నిప్పుడేని యు
    కోరినంతయు నిత్తు కొసరి కొసరి
చనుదెమ్ము మాపల్లె సవరపుమేకపుల
    క్షీరమ్ము లిచ్చెదఁ జీరిచీరి
పఱతెమ్ము మాపల్లె వరగబియ్యపుఁగూడు
    కడుపారఁ బెట్టెదఁ దడవితడవి
అరుదెమ్ము మాపల్లె నారెవెలఁగపండు
    లారగింప నిడెద నడిగియడిగి
దొరగాఁ గాల్చి యందింతు దుప్పమాంస
ముభవ! తిన్నంత నీకేమి యచట లోటు

ఇవ్వియే కాదు నీ వెవ్వియేని వలయు
నన్ను నర్పించెదను వత్తునన్నఁ జాలు
బూడిద మై నేల పూసెగు పఱతెమ్ము
    శ్రీగంధ మలఁదింతు నాగభూష!
తలనిండ జడ లేల తల్బెగు చనుదెమ్ము
    చిక్కు దీయించెదఁ జిత్స్వరూప!
విసము నీ వేటికి మెసవెదవే తెమ్ము
    కలకండఁ బెట్టింతుఁ గాలకంఠ!
ఏనికతోల్గట్టనేటికి రారమ్ము
    జిలుగు లిప్పించెద శ్రీమహేశ!
రూపరేఖా విలాస నిరూఢి నీదు
మదికి నెక్కిన కామినీమణుల దాస్య
కృత్య మొనరింప నియమింతుఁ గృత్తివాస!
కాలు పెట్టిన యంతి మా గడపలోన

ఇన్నిమాటల కొకమాటయేని బదులు
పల్కవిది నీకు నిర్లక్ష్యభావమొక్కొ?
కాక దృఢభక్తి గలవాఁడఁ గానొ? తెల్ప
మన్య హేతువు కలదొ? చంద్రార్ధచూడ!

రమ్మని కేక వేసినఁ గరమ్మనురాగముతోడ వచ్చుటో
గమ్మనరాకపోవుటయొ కాదిటు లేటికి మౌనమూని నా
నెమ్మనమున్ గలంచెదు? గణింపఁదలంచిన నాదుభక్తి భ
వమ్ముమ గాంతుగా కపుడవారితరీతి భుజంగభూషణా!

---

# కవి, తనలో

‘విధురుఁడు’

ఏల జన్మించితినో
  ఈపరుషకలుష జగతి
      ఆవిశాల మధురతర, వి
      హాయసంపుపాలబాట
      సుషుమనుండి కారుమొయిలు
      టెక్కుకొనలనుండి జారి, ఏ

మాత గౌతమీస్రవంతి
పూతపూరవీచికలలో
తరళమధురబిందువునై
సాంధ్యరుచులఁ జూరఁగొనక, ఏ

      మానవత్వ మన గనేమొ
      మహిత తత్వ మనుకొంటిని
      సతతమ్ము పాసంవళితము
      కలుషహృదయ దుర్బలమ్ము, ఏ

వేదకనుల నీరు వార
నా దరిద్రతరహృదయము
పదములకడఁ బడవేయఁగ
ప్రాణమిత్రుఁడౌ గురుఁడన్న, ఏ

      ఓ దయామయా! ప్రభూ!
      ఉండలే నీనరులమధ్య
      ఆ యెగిరెడి పావురాయి
      అనఘజీవితము గోరక, ఏ

—“సెలయేరు”

# విరహోత్కంఠము

పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

## ౧

భగవదారాధనాసక్తి పాడువాఱె
సాధుసహవాససంగతి బాధయయ్యె
శమదమాదివివేకంబు సమసిపోయె
స్నానసంధ్యాజపాసక్తి సడలిపోయె
ఆగమాభినివేశంబు నడఁగియుండె
సవనపోషణ శేముషి నవయుచుండె
రుచిరవిషయానురాగంబు రూపుమాసె
సరసభావాభిమానంబు సన్నగిల్లె
వేషభాషాభిలాషంబు వెడలిపోయె
మధురసంభాషణాశక్తి మాయమయ్యె
సకలసుమతసభావంబు ఎకలమయ్యె
తారతమ్యవివేకంబు దగ్ధమయ్యె
పటుతరాయోమయావస్థ ప్రాప్తమయ్యె
నింక నే నేమి సేయుదు నెందుఁబోదు?

## ౨

పుష్పితోద్యానవనమందు బుద్ధి లేదు
కుందనపుమేడలందును గోర్కి లేదు
తూఁగుటుయ్యాలలందున నుత్సుకత లేదు
పట్టుపుట్టములయందు విభ్రాంతి లేదు
పంచభక్ష్యాన్నములయందు వాంఛ లేదు
పరిమళద్రవ్యములయందు మురువు లేదు
లలితశృంగారకలలందు వలపు లేదు
సరససల్లాపములయందు సక్తి లేదు
పెద్దయుద్యోగములయందు పేర్మి లేదు
ధనసమార్జనమందు నాదరము లేదు
కావ్యకల్పనలందు నాకాంక్ష లేదు
దేశసంచారపర్వమందు నాశ లేదు
సత్సభాహ్వానమందు వత్సలత లేదు
వితతబహుమానములయందు వేడ్క లేదు
పటుతరాయోమయావస్థ ప్రాప్తమయ్యె
నింక నే నేమి సేయుదు నెందుఁబోదు?

## ౩

తలఁచుచుందును తలఁచిన తలఁ పెఱుంగ
పలుకుచుందును పలికిన పలు కెఱుంగ
చదువుచుందును చదివిన చదు వెఱుంగ
వ్రాయుచుందును వ్రాసిన వ్రాఁత లెఱుఁగ
చేయుచుందును చేసిన చేఁత లెఱుఁగ
చూచుచుందును చూచిన సొం పెఱుంగ
వినుచునుందును వినుచున్న విషయ మెఱుఁగ
నవ్వుచుందును నవ్వు నిదానం బెఱుంగ
గొణుఁగుచుందును గొణుఁగు కార్య మెఱుంగ
భీతిఁ బొందుదు భీతిలు హేతు వెఱుఁగ
బాధపడుచుందు బాధకు భావ మెఱుఁగ
పూజ సలుపుదు పూజించుపూజ్యు నెఱుఁగ
జపము సేయుదు జపియించుజప మెఱుంగ
కుడుచుచుందును కుడిచినకూ డెఱుంగ
ఆనుచుందును నానినపాన మెఱుఁగ
వేయుచుందును వేసినవేష మెఱుఁగ
పోవుచుందును పోయినత్రోవ లెఱుఁగ
నిలుచుచుందును నిలిచిన నెల వెఱుంగ
పటుతరాయోమయావస్థ ప్రాప్తమయ్యె
నింక నే నేమి సేయుదు నెందుఁ బోదు?

## ౪

పండుకొనియుండి కనుఱెప్ప వాల్చకుండఁ
చూచుచుందును దిగ్గన లేచుచుందు
పలుకుచుండియు నితరులు పలుకరింప
నాలకించుచు మాఱుమాటాడకుందు
మౌనముగనుండియును మాఱుమాట వినిన
కస్సుబుస్సని పరులను గసరుచుందు
వెడలిపోవుచునుండియు నడుమనడుమ
తటుక్కునను నిల్చుచుందును తడయకుందు
ఒంటరిగఁ బోవుచుండియు నూహ లుదయ
మంది నాలోన నేన మాటాడికొందు.

పటుతరామోమయావస్థ ప్రాప్తమయ్యె
నింక నే నేమి సేయుదు నెందుఁ బోదు?

✂

పాడుపడినగృహాంబుదీపంబు పగిది
విపినతలలోని సంజీవి వెలుఁగు పగిది
పట్టపగ లుండు చంద్రబింబంబు పగిది
మామకీనాత్మవికసన మహిమయెల్ల

విరహపరితాపములఁ జిక్కి వితథమగుట
విసుగుకొనుచుంటి తలయెత్తి మసలకుంటి
పటుతరామోమయావస్థ ప్రాప్తమయ్యె
నింక నే నేమి సేయుదు నెందుఁ బోదు?
బడలుపడఁజాల కటకటా! వలదు వలదు
పరమశత్రున కైన నీవిరహబాధ

---

# సృష్టివైచిత్ర్యము

శతావధాని, కిన్నెకంటి ప్రభులింగాచార్యులుగారు

చూడ నాశ్చర్యమగు నీడగట్టెడి శక్తి
కాననుండిన గిజిగాని కిచ్చి
గర్భసూత్రమున మగ్గమునం బొదవ నేయ
నా ప్రౌఢితంతువాయమున కిచ్చి
తనమాడ్కి కీటకంబును సల్పు సంజీవి
నరయు దీ పుష్పంధయమున కిచ్చి
క్షీరోదకంబు వేర్వేరుగా జేయు ది
వ్యజ్ఞానమును రాజహంస కిచ్చి
ఫలము జెడనీక లోపల గలుగుగుజ్జు
దినెడినేర్పును గజరాజమున కొసంగి
క్షితితలంబున వెలయజేసితివి గాదె
దేవ నీసృష్టి మహిమంబు దెలియ వశమె!
కరికుంభములయందు శరంగబ్జకళలఁ బ్ర
కాశిల్లు నవమౌక్తికముల జేర్చి
ఫణిఫణాంతరములఁ బహువిధ ప్రభలచే
తఁ బిరాజిల్లు రత్నముల గూర్చి
నారికేళముల విశ్వారోగ్యమహిమ మై
దనరారు పావనోదకము నింపి
ప్రతిపుష్పమున సుధా ప్రతిమానమై యొప్పు
సూక్ష్మకృతిఁ దేనెసోన నొసగి
అణువునకు గాగి వటబీజమందు బహుళ
వృక్షరాజంబు ప్రభవించువిధి నిమిడ్చి
క్షితితలంబున వెలయజేసితివి గాదె
తెలియ దరమగునె నీసృష్టి దేవదేవ!
శరభృదభ్రోజ్జ్వలత్పరివేషమునఁ గన్న
నీశిల్పమహిమ వర్ణింప వశమె?
నీలకంఠ కలాపలాలిత్యమునఁ గన్న
నీశిల్పమహిమ వర్ణింప వశమె?
సర్పరాజత్యక్తకూర్పాసమునఁ గన్న
నీశిల్పమహిమ వర్ణింప వశమె?
వైక్రాంతశిలల షట్పక్షంబులఁ గన్న
నీశిల్పమహిమ వర్ణింప వశమె?
ప్రసవముల వెల్గు బహువిధప్రభల గన్న
నీమహాశిల్పమహిమ వర్ణింప వశమె?
ధాత్రి కొసగిన వస్తుతత్త్వమును గన్న
దేవ! నీశిల్పమహిమంబు దెలియ వశమె?

---



డా॥ దివి దేశికాచార్యులు గారు,
ఆయుర్వేదాశ్రమాధిపతులు



శ్రీ శ్రీనివాసముగారు,
న్యూఇండియాభీమాకంపెనీ-కార్యద్రష్ట



ఉమ్మిడి పాండురంగశ్రేష్ఠిగారు (క్రింద)
ఉమ్మిడి పార్థసారథిశ్రేష్ఠిగారు (పైన)



డా॥ మద్దూరి నాగభూషణరావుగారు,
ప్రధానచికిత్సకులు, అజీర్ణవాతుపత్రి—డిపో



భిషగ్వర వేటూరి శంకరశాస్త్రి గారు,
ఆర్ష రసాయనశాల, కార్యద్రష్ట



డా॥ జమ్మి వెంకటరమణయ్య గారు,
స్త్రీ బాలకాయ చికిత్సానిపుణులు



మానవాదర్శగ్రంథమండలి భవనము, అంగలూరు



బడి చెంగారెడ్డిగారు



టి వి రెడ్డిగారు, కంట్రాక్టరు, రాజమండ్రి



పి కోదండరామపిళ్లగారు, దారూపకరణ వ్యాపారులు, చెన్నపురి



డాక్టరు అయ్యావారయ్యగారు,
పి పి ఏ అండు కో అధిపతి, పెరిదేపి

# దుర్ణయము

## పంద్యారం వెంకటసుబ్బయ్య గారు

ఆఁకలి దప్పులఁగ కేయంబలియో త్రావఁ
బరమాన్నమును దినఁ బడయఁ డెపుడు
దప్పిక దీఱ నేయుప్పునీరో క్రోలఁ
బానక మానఁగాఁ బడయఁ డెపుడు
బవలిక వాయు నేయెడనైనఁ బడియుండుఁ
బక్కకు మెయిఁజేర్పఁ బడయఁ డెపుడు
నుసుగక చెమ్మట యోడ్చుచుఁ బనిసేయుఁ
బ్రాల్మాలి కూర్చుండఁ బడయఁ డెపుడు
సిగ్గునకు నేదియో యొక చింపి గట్టు
భవ్యవస్త్రంబు ధరియింపఁ బడయఁ డెపుడు
స్వార్థపరతాభిభూత దుర్జాతిలోక
కుటిల తంత్రోపహతుఁడైన కూలివాఁడు

తమబిడ్డలెల్లఁ జెంతకుఁ జేర ముద్దాడు
చుం గూరుచుండఁ బక్షులును నోఁచెఁ
దమ శరీరాస్వస్థతావిధం బెఱిఁగించి
పశువులు విశ్రాంతి వడయ నోఁచె
దమతిండి యోగ్యతం దప్పిన మృగములుఁ
దినక యసమ్మతిఁ దెలుప నోఁచెఁ
దమ భావిజీవనాధారంబుగా నెన్నో
క్షుద్రజీవులును దాఁచుకొన నోఁచె
నతఁడు గూర్చుండి బిడ్డ ముద్దాడఁ గలఁడె
మేను నొచ్చినయేని విశ్రమింపఁగలఁడె
తిండికిష్టమ్ముగానసమ్మతిఁ దెలుపఁగలఁడె
కూర్పఁగలఁడె దమ్మిడియేనిఁ గూలివాఁడు

పిడుగులు రాలుచున్నఁ గడు
వెట్టిదుఁడై రవి యగ్నివర్ష మే
ర్పడఁ గురిపించుచున్నఁ దిమి
రం బతిసాంద్రత మూఁగియున్న నే

బెడఁదనుటల్లియున్నఁ దన
బిడ్డకు భార్యకుఁ జేని కేఁగి యా
తఁడకద నాకునై పలు వి
ధంబులఁ గష్టము లొందు నెప్పుడున్

'పండుగ నేఁ'డని పరమాన్నమును గంర
దన్నంబుగాఁ దిని తనియకుండు
'వెట్ట పైకొనియె నీవేళ నన్న'ని స్వాదు
పానీయముల నాని యానకుండు
మెత్తనిపక్కపై నొత్తిగిల్లియు 'నిద్ర
పట్టదు, సరిలేదు పక్క'యంచుఁ
గడుపులో పలిచల్ల గదలకుండఁగఁ గూరు
చుండియు నూరక 'యుస్సు'రంచుఁ
గొడుకుఁ గుఱ్ఱల ముద్దాడికొంచు, డబ్బు
దాఁచికొందుఁ బరస్వమ్ము నాఁచికొంచు
బిచ్చగానికిఁ బిడికెఁడుఁ బెట్టకుండుఁ
గూలియాతని యెముకలు గొఱుకుచుందు

అవిరళశ్రమము పాలైన యాతఁడు గంజి
ద్రావునో నేఁ బాలు ద్రావుచుంటి
డొక్క వ్రాఁడ కతండు స్రుక్కి దుఃఖించుచోఁ
గొని త్రావి తలపోసికొనుచునుంటిఁ
జలికి నాతనిబిడ్డ లులికి వడఁకుచో
దుప్పటి న్నాబిడ్డఁ గప్పుచుంటి
లేవఁజాలకతండు లేచి పొలం బేఁగు
చో సోమరితనానఁ జొక్కుచుంటి
సుఖమనున దెట్టిదో చవిచూడఁ డతఁడు
నేను దానిన మెక్కి జీర్ణించికొనఁగఁ
జాలకూరక పొరలాడు లీల నుంటిఁ
గోరి యేనిపక్కృతి విధించికొందునొక్కొ!

---

# బడిపంతులు

గుఱ్ఱప్పడియ సత్యనారాయణమూర్తి గారు

హా! జగన్మాత! భారతీ అరయవమ్మ
కన్నబిడ్డల సంతోష కారణముగ
నీపదాంబుజసేవన నిరతుఁడైన
పల్లెబడిపంతు లెడలేక పడెడువెతలు.

చినుఁగులబొంత కట్టుకొనుచేలము, దానికిఁ దోడునీడయౌ
సునపట ముత్తరీయము, చొకాటపుఁ జింకిరితుంగచాఁప యా
సనమును, పొట్ట నింపుటకుఁ జాలనిపిండము భోజనంబుగా
వనరుట కేమి నోము బడిపంతులు నోఁచెనో తొంటిపుట్టుకన్!

"పంతులా! పిల్లోడు బడికి పోనంటాఁడు
పట్టుకెళ్లంచును బలుకు నొకఁడు
"బయము సెప్పవు నీవు పంతులా! మావోణ్ణి
బడికి పంప"నటంచు వదరు నొకఁడు
"సదుగుసందెలు లేవు సావుదెబ్బలె కాని
సాలులే బడి" యని సణుఁగు నొకఁడు
"ఏమయ్య! కుఱ్ఱోని కేఁడాది వచ్చినా
ముక్కైన రా" దని మొఱఁగు నొకఁడు
"ఆట్టెడుపు కాని తెమ్మనినట్టు కాదు
పలక మావాని కి"మ్మని పదరు నొకఁడు
అకట! సర్వాధికారులే యైరి నేఁడు
పంతులకు లోకు లెల్ల కేపాపమొక్కొ!

చచ్చినఁ జావని మ్మనక శ్మానిభు లించుక 'గ్రాంటు' నిచ్చుటన్
వచ్చె నుపద్రవం బిపుడు "పంతుల కేదియొ పెద్దమూట పై
పెచ్చుగ వచ్చు రాబడికి పిల్లలఁ బంపుటచేత" నంచుఁ దా
ర్వచ్చితృణంబు నీయ రల గ్రాంటును జాలదు పొట్టకూటికిన్

ఊరికాఁపుల పోటు లోరిచి, వంగి వం
గి సలాము లనిశమున్ జేయవలయు
బడిమీఁదఁ బడి రప్పపఱచు గయ్యాళియాం
డ్రను మెల్లగా వేఁడుకొనఁగవలయు
ముప్పొద్దు బెదరించు మునసబుకరణాల
కొదిగి విధేయుఁడై యుండవలయు
గ్రాంటుకోఁతను బెట్టఁగాఁజూచు నిన్ స్పెక్ట
రును మంచిమాటలఁ దనుపవలయు
బూటకములాడు కచ్చేరిరైటరులకు
లంచములచేతఁ దృప్తి గావించ వలయు
కడకు నప్పులతో నిల్లు గడపవలయు
కటకటా బడిపంతులకర్మ మేమొ!

మెత్తనివానిఁ జూడఁ గడు మెత్తఁగ మొత్తఁగ బుద్ధి యైనటుల్
జీత్తనకేని జెల్లని యశేషజనంబులు పంతులన్న చోఁ
బెత్తనదారులై తమకు భృత్యునిగాఁ దలపోయుచుందు రా
యుత్తమురీతిఁ గన్గొన రయో యిది యేక్కడిఘోరపాపమో!

గట్టిగా బాలుని గద్దించెనా వాని
తల్లి యేతెంచు రాద్ధాంతమునకు
ముద్దుపలుకులతోడ బుజ్జగించుచునున్న
నదుపు లేదని తాత యాగ్రహించు
ఓనమాల్ దిద్దించుచుండెనా విద్యార్థి
కారి కోఁతనుబెట్టు గ్రాంటునందు
అల, తెల, లారంభమాయెనా మరలించు
కొడుకును జనకుండు క్రొత్తబడికి
వచ్చుబడిసున్న చాకిరిపంతు మిన్న
కనఁగ ముందున గోయి వెనుక నొకనూయి
పల్లెబడిపంతు లిట్టులఁ బడెడువెతలు
వలదు పరమేశ్వరా! పగవానికైన.

నలుగురితోపాటు నగలు లేవని యాలు
గొనఁగుచో మదిలోనఁ గుందికుంది
పాలబుడ్డికి పిన్నపాపఁ డేడ్వఁగఁ జూచి
పైస లేమికి లోన వగవివగచి
కూఁతుపెండిలి సేయఁ జేత రొక్కము లేక
పొలము లమ్మెడువేళఁ బొగిలిపొగిలి
ఏచుట్టమైనను నింటి కేతెంచిన
నతని సన్మానింప నడలియడలి
దినము నొకకల్పముగఁ బుచ్చుకొనుచు నిట్లు
గౌరవము లేక, వేరొకదారిఁ బోక
సౌఖ్యమతి గాక, సముచితార్జనము రాక
బ్రతుకుపంతులు పంతులే బండ గాక.

ప్రారంభవిద్యాంకురాభిమానము లేని
భూసురాదులు గ్రామవాసు లైరి
విద్యావిశేషానభిజ్ఞులౌ విత్తవాం
ఛారతుల్ విద్యాధికారు లైరి
బొజ్జనిండఁగ నింతబువ్వకైనను రాని
గ్రాంటురూకలె జీవగఱ్ఱ యయ్యె
గురుభక్తిశూన్యమౌ కొంటెపిల్లలగుంపు
ప్రౌఢి నించెడు శిష్యవర్గ మయ్యె
కాలవశమున నిట్టిసంఘటన కలిగె
పల్లెబడిపంతులకు లేదు బ్రదుకుఁదెఱువు
తదనుగుణ్యంబుగా నీవుఁ దయ్యమమ్మ!
విన్నఁదన మంబరో! యింక వేయు నేఁ?

# వరద

## అష్టావధాని, గోరుగంతు అచ్యుత సూర్యనారాయణ శర్మగారు

త్రోలతను గార్కొనగిల్లు తగు తోయముగాఁ గురియంగ నెల్లకా
ల్వలు సరసంబులై మిగిలి పాఱఁగఁ గర్షకు లెంతొ యాసతోఁ
బొలముల నీరుఁగట్టి మదిఁ బూనిన శ్రద్ధను దున్ని తేఁతయా
కుల నధికశ్రమంబు మెయిఁ గూరిమి నూడిచి రెల్ల చేలలోన్.

*　　*　　*　　*

నవనవలాడుచున్ దినదినంబునకుం దనువృద్ధిఁ గాంచుచున్
నవనవపత్త్రముల్ దొడిగి నవ్యరుచి న్విలసిల్లుచున్ గనుం
గవ మిఱుమిట్లు గొల్పుచు వికస్వర మారకత ప్రభాంచితం
బవుభువి నాఁగఁ జూపఱకు నబ్బుర మబ్బఁగఁజేసె క్షేత్రముల్.

నీరము గట్లఁ దాఁకుచు వినిశ్చలమై విలసిల్లుచుండఁ గే
దారములన్ వరాకుల, గదస్థితి నల్లనిరొచు లెల్లెడన్
బారఁగ రోజురోజునకు వర్ధిలెఁ గర్షకపాళిమానసాం
భోరుహభాసమాననవమోదముతోఁ గమనీయకాంతితోన్.

*　　*　　*　　*

కొలఁదిగఁ బొట్టలం దాలిచి-కలమసుసస్యములు చెలఁగెఁ గర్షకచేతో
విలసద్వాంఛలతోడనె-కొలఁదిగఁ బొట్టలను బాలుకొనె నింపెసఁగన్

*　　*　　*　　*

వఱలెం గార్కొను లాకసంబునను దీవ్యన్నీలకాంతిచ్ఛటాం
తరసంలీన నసోమణిప్రతిమమై ధాగద్ధగత్క్రాంతిఁ గ్రొ
మ్మెఱుఁగుపుందీవ లెసంగ "ఢాం" నినదగంభీరోద్భటాక్రాంతితో
నుఱుముల్ మీఱఁగఁ జండధారఁ గురిసెన్ "హా[illegible]" ధ్వని న్వర్షముల్.

పవలను రాత్రియందు నిలువం గురియన్ విసు వింత లేక నీ
రవిలసితాబ్దమండలి, కరంబు ధరాధరవార నిర్ఝరీ
ప్రవదురు నీర సింధుగణ జర్ఝరితాకృతియాయె జంతుసం
తతి, విలసమాన సస్యములు తీవ్రగతిం దొరఁగెన్ జలంబునన్.

పొలమా? గట్టుల? పుట్టలా? పశువులా? భూజంబులా? కొంపలా?
బలుసస్యంబుల? చేలకుప్పల? యొకండా? రెండ? సర్వంబులున్
జలమాయెన్ నరులెల్ల వస్తువిగతాశన్ బ్రాణరక్షాక్రియా
చలమార్గంబులఁ బట్టి రార? జలవిస్తారార్తి సంలగ్నులై.

పొలను లవెల్ల నమ్మ్రయతఁ బొంది యుగాంత జలైకలగ్న భూ
తలగతి నొప్పియున్నఁ గదుదారిగతిం గనఁగోరి యెల్లవా
రలు పృథుశైలశేఖరములన్ దగ నిల్చిరి సాద్భుతస్థితుల్
గలుగఁగఁ జింతతో మిగులఁ గన్గొనసాగిరి క్షేత్రదుస్థితిన్.

*　　*　　*　　*

గౌరీమృగాక్షితోఁ గలహించి పుడమికిఁ దిగినట్టి చదలేరు మగువయేమొ?
యర్ణవమేఖల యట్టహాసముఁజేయ నలరారు తెల్లచాయయగునేమొ?
అంబుధితోఁ బ్రణయకలహంబాడి చేరఁగఁబోని యాపగారత్నమేమొ?
అమృత సంస్పర్శచే నలరుట నేపుమైఁ దనరారు గోక్షీరధారయేమొ?
ఎల్లవరిచేలపాలిటిమృత్యువేమొ?-కర్షకులపాలి సిరియక్క-కలికియేమొ?
కటకటా! యట్లుకాకున్న నెటులలిట్లు కలమనాశకనీరంబు గల్గునేర్చు?

జీవనమాధు ప్రాణులకు జీవనమయ్యెద వెల్ల చేకున్
జీవన మాదు వీ వటులఁ జెన్నలరారియు నేల? యిట్ల మా
జీవనహేతు సస్యముల జీవనముం బెకలింపఁ జూతువో
హా? విను! నీరమా? యిది యయో? కరుణాత్మలు పోవు త్రోవయే?

# అక్బరుపాదుశాహా – వీరబలమంత్రి

విద్వాన్, వంగీపురం కృష్ణమాచార్యులుగారు

భావమందుఁ దలఁతు, దేవు, జ్ఞానానంద
మయునిఁ దురగవదను, మహిత భక్తి
నఖిలవిద్యలకును నాధారు, నిర్మల
స్ఫటికసన్నిభాతి భవ్యమూర్తి.

సిరుల నొప్పు ఢిల్లీపురమున నొకనాఁడు
పాదుశాహా, వీరబలుఁడు, మంత్రి
సంఘములును, ప్రజలు, సామంతరాజులు
నోలగమునఁ గూడి యుండు వేళ.

నెమ్మి పాదుశాహా నెమ్మిగద్దియ నుండెఁ
బ్రక్క మంత్రి వీరబలుఁడు నుండెఁ
బొలుపు మిగిలి వెలిఁగెఁ బూపును దావియుఁ
గూడి యున్న కరణి నాఁడు కొలువు.

ఆటకత్తెల యాటల యభినయములు
పాటకుల నీటుపాటల తేటఁదనము
పండితశ్రేష్ఠ కవివర్య వాగ్విభూతి
దేవసభఁ దులకించు మే ల్గెలుపవచ్చు.

అట్టిసభను మిగుల నానందవారాశిఁ
దొప్పదోఁగి, తేఁడు మెప్పుగాను
గాంచి పలికె మేఘగంభీరభాషల
సభను, జేరి మిగుల సరసముగను.

"మే మిచ్చెడు నీప్రశ్నల
కీమహితాస్థానసభ్యు లెవరైన మహా
ధీమంతుఁ లొక్కపదమున
నే మా కుత్తరము సెప్ప నెవరేఁ గలరే.

మును పొకగురుఁ డొకవోటను
దనశిష్యులఁ గలుపుచుండి తగ నీప్రశ్నం
బును వారిఁగూర్చి యడిగెను
వినుఁ డాతనివాక్యసరణి వినిచెద నేనున్.

మాఁడ నేల రొట్టె, మావులు పరుగిడ
నోడ నేల, చదువు కూడ దేల,
తములపాకు లేల కమలంగఁ బారెడు
నొక్కమాటఁ బల్కుఁ డుత్తరంబు."

అని యడిగిన ప్రశ్నంబుల
విని సభ్యులు పలుకరైరి, పెద్దగ మదిలోఁ
దొనఁకిరి, నిట్టూ ర్పార్చిరి
ఘనముగ,నుత్తరము పలుకఁ గాక పొరిఁబొరిన్.

కొందఱు గుటకలు మ్రింగిరి
కొందఱు పైఁ గ్రిందుఁ జూచుకొనుచుండిరి, వే
ఱొందఱు దిక్కులు సూచిరి
కొందఱు భువి గీచుచుండ్రి గోళ్ళఁ గలఁకన్.

కొందఱు గుజగుజవోయిరి
కొందఱు దమలోనఁ దాము గొణఁగిరి, యంతం
గొందఱు శిరములు వాంచిరి
యందఱు నుత్తరము చెప్ప నరయక యుండన్.

ఒక్క వ్యక్తిమాత్ర మొక్కఁడు దరహాస
చంద్రికలను నెల్లఁ జఱచుచుండె,
నంత పాదుశాహా యంతయుఁ దిలకించి
నవ్వె; యుత్తరంబు 'నా' యటంచు.

అంత వీరబలుఁడు నడఁకువతోఁ బల్కె
ముదలయేని యిపుడె యదొ వచింతు
ననఁగ నాజ్ఞ యిచ్చె నక్బరుపాదుశా
యధికమైన ప్రీతి, నంత నతఁడు.

అప్పుడు గురువర్యునితో
నొప్ప మిగుల శిష్యులెల్ల రుత్సాహముతోఁ
"ద్రిప్పక" యని యొక్కుమ్మడిఁ
జెప్పిరి నా నెంచువాఁడఁ జిత్తములోనన్.

అనుడుఁ బాదుశాహా యలరి శెబాసని
యతని కిట్టు లనియె, నార్యవర్య!
యన్నిప్రశ్నములకు నామాట యన్వయం
బెట్టు లగునొ మాకు నెఱుఁగఁ బలుకు.

అనుటయు మంత్రిశిఖామణి
వినయము, చిఱునగవు, భక్తి, ప్రియము లొ
[లుకఁ దా
ననియెఁ బ్రభూత్తమ, వినవే
వినిచెద నావివర మెల్ల విశదముగాఁగన్

పెనములోనఁ బెట్టి కని త్రిప్పకయె యున్న
మాఁడిపోవు రొట్టె! మావుల మఱి
కట్టిపెట్టి యెప్పు డిట్టటు త్రిప్పక
యున్నఁ బరుగువార నోడు గాదె.

చదువు నప్పుడపుడు మదిలోనఁ ద్రిప్పచుఁ
జూడకున్న నదియుఁ గూడకుండు
తములపాకుదొంతి గమలంగఁ బారెడుఁ
ద్రిప్పకున్న గాలి కప్పుడపుడు.

అని విశదముసేసిన రా
జును విని సంతోషమందెఁ, జుట్టుఁ గల ప్రజల్
మనమున నలరిరి, మేల్మే
లనుశబ్దము మిన్నుముట్టె నాస్థానమునన్.

ఇచ్చిరి దీవెన లెల్లగు
మెచ్చి నృపుఁడుఁ గట్టనిచ్చె మేలువలువలున్
హెచ్చుగ బంగరుతొడవులు
నిచ్చెను బహుమతులు, ప్రీతియొసక మెసఁగఁగన్.

మంత్రి గీముఁ జేరి, మది పొంగి తేఁ డిచ్చి
నట్టిబహుమతులను నాలుబిడ్డ
లకును నిచ్చి, మిగుల సుకముగా వారితోఁ
బ్రొద్దు పుచ్చె నాఁడు ముదము మిగుల.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# నారాయణమూర్తికి

వడ్లమాని అప్పారావుగారు

ఏపుడు భువనాలు, తమపునిహాయసాలు,
ఒక్క పెట్టున ప్రార్థించియుండెనేమొ?
వినబరచినావు భవదీయవిమలగాన
నూత్న కల్యాణరాగవినోదగీతి!

అంత నీకోసమే హృదయాలు విచ్చి
యెదురెదురుచూచు మానవు లెందరేని
"ఇరులు చెరచుచు నేడు మాయింట వెలుగు
సూర్యభగవాను డీతడే సుమ్మ" యనుచు
పొంగిపోయిరి మధురరసస్ఫూర్తితోడ;
విశ్వమోహిని ప్రేమపవిత్రమైన
గర్భకుహరాల వెలిగి, వికాస మొంది,
సుప్రభాతాల సృష్టించు, నీప్రశాంత
నవ్యమోహన సుకుమారనయనయుగళి—
మిలమిలని జార్చు నశ్రుల కలకలమ్ము—
రాలె పూవుల మందహాసాల నడుమ
పూవుపైద లంత మధురించిపోయి పిలిచె
మందపవనునికోమలానందగీతి!

అంతమే లేని వలపుసేకాంత మపుడు
యుగయుగమ్ములనుండి రహోనితాంత
నిబిడదరహాసకల్లోలినీస్వనాన
పొంగి పొరలెత్తురీతి నభోంగణాల
విరిసిపోయిన దొకక్రొత్తవెలుగుతోడ.

*    *    *    *    *
*    *    *    *    *

# ఆటపాటలు

వై. వెంకటరామచంద్రరావుగారు

## చందమామ పాట

చందమామ రావె
జాబిల్లి రావె
కొండెక్కి రావె
కొబ్బరికాయలు తేవె
బండెక్కి రావె
బండివేలు తేవె
కోటెక్కి రావె
కోటివేలు తేవె
చెట్టెక్కి రావె
చేమంతిపూవులు తేవె
ఒంటెక్కి రావె
వట్టివేళ్లు తేవె
గుఱ్ఱమెక్కి రావె
గొబ్బిపువ్వులు తేవె
ఏనుగెక్కి రావె
ఎలక్కాయలు తేవె
పడవెక్కి రావె
పనసకాయలు తేవె.

రైలుయెక్కి రావె
రావి ఆకులు తేవె
రథముయెక్కి రావె
రామచిలుకని తేవె
కొండెక్కి రావె
కోటివేలు తేవె
రాత్రులపూట రావె
పండువెన్నెల తేవె
పగటిపూటరాకె
అత్తోరింటికి పోవె
ఇరుగిళ్లకు పోకె
ఈతపళ్లు తేకె
పొరుగిళ్లకు పోకె
పొన్నపళ్లు తేకె
మాయింటికి రావె
మంచిపళ్లు తేవె
మా అబ్బాయి నెత్తుకుపోవె

## పూజపాట

రావే రావే అయ్యమ్మ
దేవునిగుళ్లో కెళ్దాము
దేవుని చక్కగ చూద్దాము
దక్షిణలే యిద్దాము
టెంకాయలే కొడ్దాము
హారతులే యిద్దాము
పూజలే చేద్దాము
తులసీ తీర్థం తాగ్దాము
చక్కగ తిరిగి వద్దాము
రావే రావే అయ్యమ్మ

## సాగనంపు పాట

అత్తవారింటికి
పోయిరా వమ్మ!
చక్కగా కాపురము
చేయవేయమ్మ!
బుద్ధి కలిగి నీవు
వుండవేయమ్మ!
ఎవ రేమన్నను
ఎదురాడకమ్మ!
మామగా రేమన్న
మాటాడబోక!
అత్తగారేమన్న
అలిగుండబోక!
పలుమారు పన్నెత్తి
నవ్వబోకమ్మ!
నవ్వినాచిరునవ్వు
నవ్వవేయమ్మ!
వీధిలో ముడివిప్పి
ముడువబోకమ్మ!
కానివారిని కన్నెత్తి
చూడబోకమ్మ!
అయినవారితో పలుమారు
నవ్వబోకమ్మ!
ఇరుగువారిండ్లకు
వెళ్లకేయమ్మ!
పొరుగువారిండ్లకు
పోవబోకమ్మ!
చక్కగా కాపురము
చేసుకోవమ్మ!
ఇరుగువారితోను
ఏట్లాడబోక!
పొరుగువారితోను
పోట్లాడబోక!

## బొంబొం పాట

చిట్టిచిట్టియీతపళ్లు
చిన్నారియీతపళ్లు
పొన్నారిపనసపళ్లు
చెట్లకిందపోసి
పుట్టమన్ను తెచ్చి
నీళ్లతోని కలిపి
గుజ్జులాగ చేసి
బొమ్మరిల్లుకట్టి
రంగురింగు వేసి
ముగ్గుగిగ్గువేసి
చిన్నిపీటవేసి
చిట్టిబొమ్మలుపెట్టి
కొత్తబట్టలుతెచ్చి
పసుపుకుంకము బెట్టి
చిట్టిపెండ్లిచేసి
నెయ్యిలేకపోతె
మావారింటి కెళ్లగా
మావారికుక్క బొంబొమన్నది.

## ఎందుకూ

పిల్లలుపుట్టేదెందుకూ
పాలుత్రాగేటందుకూ
పాలుత్రాగేదెందుకూ
ఆడుకొనేటందుకూ
ఆడుకొనేదెందుకూ
బలముకల్గేటందుకూ
బలముకల్గేదెందుకూ
పెద్దవారయ్యేటందుకూ
పెద్దవారయ్యేదెందుకూ
బడికివెళ్లేటందుకూ
బడికివెళ్లేదెందుకూ
చదువుకొనేటందుకూ
చదువుకొనేదెందుకూ
జ్ఞానముకల్గేటందుకూ
జ్ఞానముకల్గేదెందుకూ
డబ్బుగడించేటందుకూ
డబ్బుగడించేదెందుకూ
చెరువులు కట్టేటందుకూ
చెరువులుకట్టేదెందుకూ
నీరు పారేటందుకూ
నీరు పారేదెందుకూ
పంటలుపండేటందుకూ
పంటలుపండేదెందుకూ
ప్రజలుబ్రతికేటందుకూ
ప్రజలుబ్రతికేదెందుకూ

దేవునిగొల్చేటందుకూ
దేవునిగొల్చే దెందుకూ
ముక్తిని బొందేటందుకూ
ముక్తిని బొందే దెందుకూ
మృతజీవుడనిపించుకొనేటందుకూ

### సంక్రాంతి పాట

సంక్రాంతి రావడం
స్నానాలు చేయడం
మడిబట్టలు కట్టడం
నెయ్యిఅప్పు చేయడం
పిండివంట చేయడం
చక్కగా తినడం
కొద్దిగా మిగలడం
ముసలిఅవ్వ రావడం
మూతితిప్పు కోవడం
పెద్దపిల్లి రావడం
పాలవుట్టి కెక్కడం
ముసలిఅవ్వ చూడడం
దీర్ఘకోపము రావడం
పెద్దకఱ్ఱ తీయడం
పిల్లికేసి కొట్టడం
దెబ్బతప్పి పోవడం
పిల్లి పారి పోవడం
పాలకుండ పగలడం
తాతగారు చూడడం
కాలుతోని తన్నడం
అవ్వగారు యేడవడం
నేను చూసి నవ్వడం.

---

## కలగూరగంప పాటలు

[illegible]రపోతు కనకరత్నమ్మగారు

### అందము పాట

బీరపాదుకి పిందెలందమ్మ
మావారి ముక్కుకూ కాపలందమ్మ!
కాకరపాదుకి కాయ లందమ్మ
బిడ్డలున్న వారికి ముద్దు లందమ్మ
పొట్లపాదుకి పూవు లందమ్మ
తోటకూరకంబము దొడ్డి కందమ్మ!
మాటాడ నేర్చితే మగువ కందమ్మ
వగలాడి మగువకూ ముసలివా డందమ్మ!
పుట్టింటియునికియే పొలతి కందమ్మ
సీకటిరేతిరే దొంగ కందమ్మ!
మామిడికాయలూ మావారి కందమ్మ
మావారిమాటంటె నాకు అందమ్మ!
కాటుక యుంటేనె కనుల కందమ్మ
వెనుదికుక్క లేకుంటే వెలది కందమ్మ!
పత్రికలు చదువుటే పడతి కందమ్మ
మస్తుగ తింటేనే కడుపు కందమ్మ!

### జోలపాట

జోజో నాతండ్రి! జోజో తండ్రీ
జోడుగుఱ్ఱాలపై వస్తాడు మామ
జోడించి తెస్తాడు జోడుమామిడిపండ్లు
పాలు త్రాగి నీవు పడియుండవయ్యా
ఏడవకు ఏడవకు వెఱ్ఱిపాపాయి
ఏడిస్తె నిన్నెవరు ఎత్తుకుంటారు
పాలు పెరుగు పోసి పడిపెంచినాను
ఏడవకు, ఏడవకు, ఏడవకు, తండ్రీ.

### దాగుడుమూతపాట

దాగుడుమూత దండాకోర్
పిల్లివచ్చె ఎల్లేరుగాయ్
ఎక్కడదొంగల్ అక్కడనే
గంగానమ్మా గప్‌చిప్.

### చాయ పాట

పుట్టేటిభానుడా పుష్యరాగపుచాయ
పుష్యరాగముమీద పొంగుబంగారుచాయ!
జామెక్కిభానుడా జాజిపువ్వులచాయ
జాజిపువ్వులమీద సంపెంగపువుచాయ!
మధ్యాన్నభానుడా మల్లెపూవులచాయ
మల్లెపూవులమీద వజ్రపుచాయ!
మూడ్జాలభానుడా మునగపూవులచాయ
మునగపువ్వులమీద ముత్యాలపాడిచాయ!

క్రుంకేటిభానుడా గుమ్మడిపువుచాయ
గుమ్మడిపువుమీద కుంకుంపువుచాయ!

## నే రే డి పం డు పా ట

చిట్టిపొట్లకాయ
సీమనెల్లి కాయ
గోడపుచ్చకాయ
గొబ్బినెల్లికాయ
అత్తకు పెడితే అల్లం
నే తింటే బెల్లం
కొత్తకుండలోని గోధుమల్లారా
పాలపిడతల్లోని పసిబిడ్డల్లారా
అమ్మఅమ్మ నీపే రేమంటే
నీళ్లల్లో నిమ్మపండు
పాలల్లో పనసపండు
చేతిలో నేరేడిపండు.

## ఎం దు కూ

ఎండలు కాసే దెందుకురా
మబ్బులు పట్టేటందుకురా
మబ్బులు పట్టే దెందుకురా
వానలు గురిసేటందుకురా
వానలు గురిసే దెందుకురా
చెరువులు నిండేటందుకురా
చెరువులు నిండే దెందుకురా
పంటలు పండేటందుకురా
పంటలు పండే దెందుకురా
ప్రజలు బ్రతికేటందుకురా
ప్రజలు బ్రతికే దెందుకురా
స్వామిని గొల్చేటందుకురా
స్వామిని గొల్చే దెందుకురా
ముక్తిని బొందేటందుకురా

## చిట్టిబొమ్మలపెండ్లి

చిట్టిబొమ్మలపెండ్లి చేయవలె ననగా
శృంగారవాకిళ్లు సిరితోరణాలు
గాజుపాలికలతో గాజుకుండలతో
అరటికంబాలతో అమరె పెండ్లరుగు
చిన్నన్న పెట్టెనే వన్నె చీరల్లు
పెద్దన్న పెట్టెనే పెట్టెల్ల సొమ్ము
సూరుడునె బొమ్మ నీకు సూటాకు కొమ్మ
పోతునె బొమ్మ నీకు పొన్నె బునీళ్లు
కడుదునె బొమ్మనీకు కరకంచుచీర
తొడుగుదునె బొమ్మ నీకు తోపంచురవిక
ఒడిబియ్యం పెడుదునె ఒడిగిన్నె పెడుదు
అత్తవారింటికి పోయి రమ్మందు
అత్త చెప్పినమాట వినవె ఓబొమ్మ
మామ చెప్పినపని మానకే బొమ్మ
రావాకు చిలుకమ్మ ఆడవె పాప
రాజుల్లు నీచెయ్యి చూడవచ్చారు
ప్రధానపుంగరం పమిడివత్తుల్లు
గణగణ వాయిస్తు గంట వాయిస్తు
గంజిబంగారయ్యుడూ తల్లి రాగాను
తల్లివచ్చిందిర నిలచి యిట్లన్ని పలికె
అన్న అందల మెక్కె తా గుఱ్ఱ మెక్కె
గుఱ్ఱముమీదను పల్ల మున్నాది
పల్లమ్మమీదను బాలు డున్నాడు
బాలుడి ముందర్ని బాలికను తేరె
బాలికసికలోకి కురువేరు దేరె
నాకొక్క ముత్యాలబొట్టు దేరమ్మ
బొట్టుకు బొమ్మంచు రవిక తేరమ్మ
రవికకు చిలకల్ల చీరె దేరమ్మ
చీరకు చిత్రాలపేరు దేరమ్మ
పేరుకు పెట్టెల్ల సొమ్ము దేరమ్మ
చిన్నన్న తెచ్చాడు చింతాకుచీర
పెద్దన్న తెచ్చాడు పెట్టెలసొమ్ము
రావాకుచిలుకతో ఆడబోకమ్మ
రాజుల్లు నీచెయ్యి చూడవచ్చారు
వీధిలో ముడి విప్పి ముడువబోకమ్మ
పల్లెత్తి గట్టిగా పలుకబోకమ్మ
పొరుగిళ్ల కెప్పుడూ పోవబోకమ్మ
నలుగురి నోళ్లలో నానబోకమ్మా.

# ప్రజోత్పత్తి సంవత్సర విశేషములు

౧౯౩౧

మార్చి ౬. సత్యాగ్రహము ఆపువల ప్రభుత్వమువారు ౧౯౩౦ ఆర్డినెన్సుల నుపసంహరించుకొనిరి

,, ౧౦. అహమ్మదాబాదున మహాత్మునికి డెబ్బదివేల రూపాయిలను, బంగారు తక్లియు, పదిమణుగుల ఖద్దరునూలును సమర్పింపబడెను

,, ౧౪ వెర్నన్ హార్ట్సుహార్న్ గారి మరణము.

,, ౧౭ యావద్భారత మహిళావిద్యానిధిసంఘ సమావేశము ఇర్విన్ ప్రభువుగారి యధ్యక్షతను జరిగెను హైదరాబాదునవాబుగారు ౨ లక్షలును, సర్ విక్టర్ శాసూన్ గారు ౫౦ వేలు, జయపురమహారాజాగారు ౭ వేలు, మరియొక స్త్రీ ౮ వేలును విరాళముల నిధి కొసగినట్లు సభలో ప్రకటన.

,, ౨౩. భగత్ సింగు, రాజగురు, సుఖదేవుగార్లు ఉరితీయబడిరి.

,, ౨౭ అఖిలభారత జాతీయమహాసభల ప్రారంభము, కరాచీ విద్యార్థి మహాసభ—అధ్యక్షులు: పండిత జవహరలాల్ నెహ్రూగారు

,, ౨౮. అఖిలభారత జాతీయమహాసభ కరాచీలో శ్రీ సర్దార్ వల్లభభాయి పటేలుగారి యధ్యక్షతను సమావేశమయ్యెను.

,, ౩౦. గవర్నరు జనరలు సిపార్సు ప్రకారము స్టేటు కౌన్సిలు వారు ఆర్థికశాసనమును అంగీకరించిరి

ఏప్రిలు ౫ అఖిలభారత ముస్లిముమహాసభ ఢిల్లీలో షౌకతాలీగారి యాధ్యక్ష్యమున సమావేశమయ్యెను

,, ౭ మిడ్నపూరు జిల్లామేజస్ట్రేటు జేమ్సుపెడ్డిగారు తుపాకిలో కాల్చబడిరి

,, ౧౮ ఇర్విన్ ప్రభువు ఇండియాను వీడి చనిరి; విల్లింగడను ప్రభువు వైస్రాయిపదవిని స్వీకరించిరి.

,, ౨౫ సర్ వేపా రామేశంగారు ప్రధానన్యాయమూర్తి పదమున నియమింపబడిరి

,, ౨౬. అఖిలభారత వైద్యమహాసభ పూనానుండు జరిగినది. అధ్యక్షులు డా. జీవరాజు మెహతాగారు, బొంబాయి.

మే ౧. అఖిలవంగరాష్ట్రి మహిళాసభాసమావేశము. అధ్యక్షురాలు శ్రీమతి సరళాదేవి చౌధరాణిగారు.

,, ,, రాజప్రతినిధి విల్లింగ్డను ప్రభుదంపతులు సిమ్లా చేరిరి.

,, ౨. ఇర్విన్ ప్రభువు లండను చేరిరి.

,, ౩. బహగరాలో కేరళరాష్ట్రమహిళాసభ శ్రీమతి పద్మావతి అమరుగారి యధ్యక్షతను జరిగెను.

,, ౫ గాంధిమహాత్ముడు భారతదేశపు 'టాకీసిల్ము'న ఎక్కింపబడిరి. ఖద్దరు విషయమై సందేశ మిచ్చిరి

,, ౬. దక్షిణకనరా మహిళాసభ మంగళూరులో శ్రీకృష్ణాబాయి పంజేకర్ గారిచే ప్రారంభింపబడెను

,, ౮. శ్రీ రవీంద్రనాథటాగూరుగారి సప్తతిపూర్తి మహోత్సవము.

,, ౯ భీమవరముతాలూకా మహిళాసభ భీమవరములో శ్రీమతి గుమ్మిడిదలదుర్గాబాయమ్మగారి యాజమాన్యమున జరిగెను

,, ౧౨ రాజమహేంద్రవర స్త్రీ సనాతనవిద్యాలయ తృతీయ వార్షికోత్సవము.

,, ౨౨. జాఫ్నా విద్యార్థుల కాంగ్రెసు శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు అధ్యక్షురాలు.

,, ౨౩ మహమ్మదాబాద్ మహారాజావారు దివంగతులైరి.

,, ,, బర్మా రాష్ట్రీయ హిందూమహాసభా సమావేశము. అధ్యక్షురాలు శ్రీమతి సరళాదేవి చౌధరాణిగారు.

,, ౨౩–౨౪ ఆంధ్రసాహిత్యపరిషత్తుసమావేశము. అధ్యక్షులు: మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారు, విశాఖపట్నము.

,, ౨౪. బారిష్టరు మిథిభాయి అర్దషరుకన్య బొంబాయి లా కాలేజి ప్రొఫెసరుగ నియమింపబడెను.

,, ౨౫. ఇండియన్, స్యాండుహర్స్టు కమిటీ ప్రథమ సమావేశము.

,, ౨౬. ఆంధ్రమహిళాసభ, గుంటూరు. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు అధ్యక్షురాలు.

,, ,, భారత హిందీసాహిత్య సమ్మేళనము కలకత్తా, అధ్యక్షులు పండిత జగన్నాథదశరత్నాకరం కాశీగారు.

,, ౨౭. కర్నాటక మహిళాసభ అయిదవ సమావేశము హుక్కేరియందు శ్రీమతి దుర్గాబాయిజోషీగారి (అకోలా) యధ్యక్షతను జరిగెను

,, ౨౯. గాంధిమహాత్ముడు రాజప్రతినిధికి లేఖ వ్రాసెను— తాను రౌండుటేబిలు సమావేశమునకు పోయి అచట కాంగ్రెసు అభిప్రాయములను వ్యక్తపరచుటమాత్రము కావింతుననియు, అందు పాల్గొనననియు.

,, ౩౦ అఖిలభారత ఖిలాఫతు మహాసభ బొంబాయి. అధ్యక్షులు మౌలానా అబ్దులు మజీదుబౌదానీగారు

,, ౩౧. సర్ చిమన్‌లాల్ సెటల్‌వాడుగారి మాటలకు సమాధానముగా గాంధిగారు తాను రాబోవు రౌండుటేబిలు సమావేశమున పూర్ణముగ పాల్గొందునని తెలిపిరి

జూన్ ౨. కెన్యా లెజస్లేటివ్ కౌన్సిలు ప్రారంభము. కాంగ్రెసు పనుపున భారతీయసభ్యులు అందు హాజరుకాలేదు

,, ,, సార్వభౌముని జన్మదినము.

,, ౩. దక్షిణాఫ్రికా స్వాతంత్ర్యదినము.

,, ౫. ౧౪ వ తమిళనాడు రాష్ట్రీయమహాసభ, కుంభకోణ అధ్యక్షులు శ్రీసత్యమూర్తిగారు

,, ౭. కాన్‌పుర ఎన్‌క్వైరీ కమిటీ నివేదిక ప్రకటితమైనది.

,, ౮. శ్రీరాజా విక్రమదేవవర్మగారు జయపురసంస్థానాధిపత్యమును గవర్నరు ఏజెంటుద్వారా పరిగ్రహించిరి

,, ,, ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు మహారాజావారు భూరివిరాళమును (లక్షరూపాయలు ఏటేట) ఒసగుటకు వాగ్దానము చేసిరి

,, ౧౦. కాంగ్రెసు కార్యసంఘమువారు గాంధిగారు రౌండుటేబిలు సమావేశమునకు పోవలెనని తీర్మానించిరి

,, ౧౧. సర్ అతుల చటర్జీ ఇండియాకౌన్సిలు సభ్యుడుగ నియమింపబడెను.

,, ౧౨–౧౩. ఆంధ్రఅగ్నికుల క్షత్రియ చతుర్థమహాసభ నరసాపురం అధ్యక్షులు కొప్పాడ రాజరత్నంగారు

,, ౧౭. ఆంధ్రదేశపురయితులమహాసభలు బాపట్ల అధ్యక్షులు: శ్రీ దండు నారాయణరాజుగారు

,, ౨౦. ౧౯ వ మదరాసురాష్ట్రీయసహకారసంఘమహాసభ, మదరాసు అధ్యక్షులు శ్రీరావుబహదూర్ టి ఏ. రామలింగచెట్టియారుగారు, బి.ఏ, బి. యల్. యమ్.యల్.ఏ.

౨౦–౨౧. పదియవ రెడ్డిమహాసభ అనంతపురము. అధ్యక్షులు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు.

,, ౨౬. ఆంధ్రమహాసభలు ప్రారంభము గుంటూరు. అధ్యక్షులు శ్రీ ప్రకాశంపంతులుగారు మొదలయినవారు.

,, ౨౭ విల్లింగ్డనుప్రభువు షెమ్స్‌ఫర్డ్ క్లబ్బునందు మొదటి రాజకీయోపన్యాసము కావించిరి.

జూలై ౧ విట్లే కమిషను నివేదిక ప్రకటితమైనది

,, ,, రాజమహేంద్రవరము వైశ్యసేవాసదనమున ఆంధ్రయువతీ సంస్కృతకళాశాల ప్రారంభింపబడెను.

,, ౩. పదునూడవ జాతీయమితవాద మహాసభ సమావేశము- బొంబాయి అధ్యక్షులు శ్రీ సి. వై చింతామణిగారు

,, ౬. మద్రాసు విశ్వవిద్యాలయ పట్టప్రదాన మహోత్సవము శ్రీమతి ఎలినార్ మక్‌డౌగల్ కన్యగారు ఉపదేష్ట్రి.

,, ౭. కర్నల్ సింప్సను హత్యకేసు ముద్దాయి శ్రీ దినేశగుప్తగారు ఆలీపూరు జైలునందు ఉరితీయబడిరి.

,, ౧౧ కాంగ్రెసు కమిటీవారు భారత ఋణముల విషయమైన నివేదిక ప్రకటించినారు

,, ౧౨ రాజప్రతినిధి గాంధిగారికి సంధిషరతుల విషయమై నిశ్చయమును తెలుపుచు తంతినిచ్చిరి, కాంగ్రెసు కార్యసంఘము విరతినొందినది

,, ౧౩ సర్ వేపా రామేశం పంతులుగారు ప్రధానన్యాయమూర్తి పదవిని స్వీకరించిరి.

,, ౧౪. ఇంగ్లాండున ఎర్డ్లి నార్టనుగారి మృతి

,, ౧౫. గాంధిగారు ఎమర్సనుగారితో మూడుగంటలసేపు మాటలాడిరి

,, ౧౬. గాంధిగారు ఢిల్లీ సమాధానమును గూర్చి విల్లింగ్డను ప్రభునితో సంభాషించిరి

,, ౨౦. ఫెడరల్‌స్ట్రక్చరు కమిటీకి అదనపు సభ్యుల పేర్లు, అందు గాంధిగారి పేరును, ప్రకటితము లైనవి.

,, ౨౧. యమ్ యన్. రాయిగారు అను భారతదేశపు కమ్యూనిస్టు, బొంబాయినగరమున అరెస్టుచేయబడిరి

,, ౨౪. లండనున గాంధి సన్మానసంఘము ఏర్పడినది

,, ౨౭. ఆలీపూరుమండల న్యాయమూర్తి న్యాయస్థానమున కాల్పబడెను

,, ౩౦ బుద్ధదేవుని ప్రథమోపదేశముయొక్క ౨౫౨౨ వ వార్షికోత్సవము.-సారనాథమువద్ద

ఆగస్టు ౪. కాశీమహారాజు కాలధర్మము నొందెను.

,, ౭. అఖిలభారత జాతీయమహాసభా కార్యనిర్వాహక సంఘము క్రొత్తజండాను అంగీకరించెను.

,, ౮. పదునూడవ హిందూమహాసభ,అకోలా. అధ్యక్షుడు శ్రీ సి. విజయరాఘవాచారిగారు.

,, ౧౪ డా. సప్రూ, శ్రీ జయకరుగార్లు, మహాత్మునితో సంభాషించుట

,, ౧౫ ఒడంబడిక రద్దుపడుటకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరముల ప్రకటనము

,, ౧౯. మహాత్ముడు తాను రాజప్రతినిధికి వ్రాసిన చివరి ఉత్తరమును ప్రకటించెను.

,, ౨౧ మహాత్ముని ఉత్తరమునకు రాజప్రతినిధి జబాబొసంగెను.

,, ౨౪ కార్మిక ప్రభుత్వము రాజీనామా, జాతీయప్రభుత్వ నిర్మాణము, ప్రధానమంత్రి మేక్డొనాల్డుగారు

,, ౨౬. మహాత్మా రాజప్రతినిధుల సంభాషణము.

,, ౨౭. గాంధీమహాత్ముడు లండనుకు పోవుటకయి శిమ్లానుండి తరలెను.

,, ౨౮. ఇండియాగవర్నమెంటువారు మహాత్మునితో ఒడంబడిక కుదుర్చుకొనుటకు కొన్ని షరతులను ప్రకటించుట.

,, ,, మహాత్మాగాంధి రాజపుటానాఓడపై లండనుకు బయలుదేరెను.

సెప్టెం ౩. ఏడెనులో మహాత్మునికి స్వాగతము.

,, ౭ ఫెడరల్ స్ట్రక్చరుకమిటీ సమావేశము. అధ్యక్షులు శాంకీ ప్రభువు.

,, ౧౪. మహాత్ముడు మౌనముతో (సోమవారము గనుక) ఫెడరల్ స్ట్రక్చరుకమిటీకి వెళ్లెను.

,, ౧౫. ఫెడరల్ స్ట్రక్చరుకమిటీలో మహాత్ముడు కాంగ్రెసు వాదమును ప్రవేశపెట్టుట

,, ౧౬. కార్మికసభ్యుల సమావేశమున మహాత్ము డుపన్యసించుట.

,, ,, బ్యాంకింగ్ విచారణసంఘనివేదిక ప్రకటింపబడినది

,, ౧౮. ఇండియన్ స్యాండ్హర్స్టు-సంఘనివేదిక ప్రకటితమయ్యెను.

,, ౧౯. దక్షిణభారత హిందీప్రచారసభవారి ప్రథమపట్టప్రదానోత్సవము శ్రీ కా. నాగేశ్వరరావుగారి యధ్యక్షతను జరిగెను

,, ౨౦. కలకత్తా విశ్వవిద్యాలయ సంస్కృతశాఖవారు రవీంద్రునికి 'కవిసార్వభౌమ' బిరుదము నొసగిరి.

,, ౨౧ గ్రేటుబ్రిటనున బంగారు నాణెములమారకము రద్దయ్యెను.

,, ౨౨. గాంధిగారు ఫెడరల్ స్ట్రక్చరుకమిటీయందు శాసనసభాధికారముల జోక్యము లేక, మారకము విషయమై తీర్మానించినందులకు ధిక్కారము దెల్పెను.

,, ౨౩. గాంధిగారు పార్లమెంటుసభ్యుల యెదుట కమిటీ గదియందుపన్యాస మిచ్చెను.

,, ౨౭. గాంధిమహాత్మునికి వెస్ట్‌బ్రాడ్‌ఫర్డ్ (లాంకషైరు) నందు స్వాగతము.

,, ౨౮. రామ్సే మక్డొనాల్డుగారు నేడుదయము అల్పసంఖ్యాకుల ఉపసంఘము తెఱచెను.

,, ౨౯. గాంధిగారు సర్ సామ్యూల్ హోరుగారితో సంభాషించిరి

,, ౩౦ బర్మా రౌండ్ టేబిలు సమావేశపు సభ్యులనామావళి ప్రకటితమైనది.

అక్టో. ౧ ఆనిబెసంటుగారి ౮౫-వ వర్షవర్ధంతి

,, ౨. గాంధిమహాత్ముని జన్మదినమహోత్సవము.

,, ౪. ఆంధ్రమహాసభ ప్రత్యేకసమావేశము శ్రీ కోటిరెడ్డిగారి యధ్యక్షతను జరిగెను

,, ౫ పిఠాపురము మహారాజావారి రాజ్యస్వీకారరజతోత్సవము.

,, ౫ అల్పసంఖ్యాసంఘవాదములు ముగిసినవి.

,, ,, బ్రిటిషుమంత్రివర్గము పెద్దయెన్నికలు (General Election) జరుపుటకు తీర్మానించెను.

,, ౬. స్టేటుకౌన్సిలునందు మద్రాలయముల చట్టము తీర్మానింపబడెను.

,, ౭. ఏలూరులో ఉభయగోదావరి మహిళాసభ శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి యధ్యక్షతను జరిగెను.

,, ౧౦. జమీగొల్లెపల్లిలో శ్రీఅన్నపూర్ణాదేవి నేతపరిశ్రమాలయము ప్రారంభింపబడెను.

,, ౧౨. హెండర్సనుగారు గాంధిగారికి నేషనల్ లేబర్ క్లబ్బున స్వాగతమిచ్చిరి.

,, ,, రయిల్వేవర్క్ సై వ్రీకమిటీ మద్రాసునందు కూడినది.

,, ౧౩. స్మట్సుగారు గాంధిగారితో సంభాషించిరి.

,, ౧౪. అఖిలభారత మహిళామహాసభోపసంఘమువారు, శ్రీమతి సరోజనిదేవి తమ ప్రతినిధియని ప్రధానమంత్రికి తంతినంపిరి

,, ,, బరంపురములో గంజాంమండల స్త్రీసభ అధ్యక్షురాలు బావులూరి వీరలక్ష్మమ్మగారు

,, ౧౭. గాంధిగారు బర్మింగ్ హాము చేరిరి

,, ౧౮ తోమస్ ఆల్వాఎడిసనుగారి మరణము

,, ౨౨ ఫెడరలుస్ట్రక్చరు కమిటీవారు ఫెడరల్ ఫైనాన్స్ (ఆర్థికకల్పము) విషయమై ఒకసంధికి వచ్చిరి.

,, ౨౩. గాంధిగారు రౌండుటేబిలు సభాప్రతినిధులతో సైనికసమస్యనుగూర్చి ముచ్చటించిరి.

,, ౨౮ శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మగారు పరమపదించిరి.

నవంబరు ౩. ప్రధానామాత్యునితో మహాత్ముడు సంభాషించుట.

,, ౫. మహాత్మునికి సార్వభౌమదంపతులవిందు (మహాత్ముడు సార్వభౌమునితో సంభాషించుట.)

,, ౬ బెర్నార్డుషా దంపతులు గాంధిగారిని సందర్శించిరి

,, ,, తిరువాంకూరు మహారాజా పట్టాభిషేకము.

,, ౧౦. క్రొత్తపార్లమెంటు ప్రారంభము

,, ౧౨. గాంధిగారికి జెనరల్ స్మట్సు ఆహ్వానము.

,, ,, వేదము వేంకటాచలయ్యగారు మరణించిరి.

,, ౧౪. గాంధి ఇర్విను సంభాషణ

,, ౧౬. ప్రత్యేకఆంధ్రరాష్ట్రము కావలయుననుచు ఆంధ్రప్రతినిధులిం ఇండియాసహాయమంత్రికి విజ్ఞాపనమును పంపిరి

,, ౧౮ గాంధి లాయడ్ జార్జిసంభాషణ

,, ౨౧–౨౨. అయిదవ ఆంధ్రరాష్ట్రమహిళాసభ, అధ్యక్షురాలు శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు.

,, ౨౬. బర్మా విప్లవనాయకుడు సాయాసేను ఉరితీయబడెను.

,, ౨౭. బర్మారౌండుటేబిలుసభను వెల్సుయువరాజు గారుసంస్థాపించిరి.

డిసెం ౧. ప్రధానమంత్రి భారతప్రభుత్వ విధానమును ప్రకటించెను.

,, ౫. గాంధిగారు లండనువీడిరి.

,, ౬. సకల మహమ్మదీయ మహాజనసభ జెరూసాలేమున సమావేశమయ్యెను.

,, ౯. హెయిగుగారు సర్ జేమ్స్ క్రేరారుగారి తరువాయిని హోమ్ మెంబరుగా నియమింపబడిరి.

,, ౧౧. డా జె ఆడమ్స్ గారు, డా నికోలాస్ బట్లరుగారును 'శాంతి'కై నోబెలు బహుమానమును బడసిరి

,, ,, రాజమహేంద్రవరము ఆంధ్ర స్త్రీ పునర్వివాహ పంచాశద్వార్షికోత్సవము అధ్యక్షులు. రావుబహాదుర్ తుంపూడి భగవంతం గుప్తగారు

,, ౧౩ సంయుక్తప్రాంతముల పన్నుల నిరాకరణపు ఉద్యమమును సాధించుటకుగాను క్రొత్తఆర్డినెన్సు ప్రచురింపబడినది.

,, ౧౪ టిప్పెరా జిల్లామాజిస్ట్రేటు స్టీవెన్సుగారిని ఒకవంగవనిత కాల్చిచంపెను

,, ౧౬ చెన్నపురియందు అఖిలభారత స్వదేశీప్రదర్శనమును శ్రీ సర్ యం విశ్వేశ్వరయ్యగారు ప్రారంభించిరి

,, ౧౮ పురుషోత్తమదాసు టండనుగారు అలహాబాదునందు అరెస్టుచేయబడిరి

,, ౨౨ సరిహద్దుపరగణాల సంస్కరణములు చీఫ్ కమిషనరు ద్వారా ప్రకటితములైనవి.

,, ౨౪ సరిహద్దు పరగణాలకు వర్తించు మూడు ఆర్డినెన్సులు ప్రకటింపబడినవి.

,, ౨౫. అబ్దుల్ గఫూర్ ఖానుగారు, మఱికొందరు ౧౮౧౮–III–వ రిస్యులేషను ప్రకారము అరెస్టు కావింపబడిరి

,, ౨౬. పం. జవహర్ లాల్ నెహ్రూగారు, టి. ఎ కె షేర్వానీగారు అరెస్టయిరి

,, ౨౮ మహాత్మాగాంధీగారు ఐరోపాపర్యటనమునుండి ఉదయము బొంబాయి చేరిరి

,, ౩౦ గాంధిగారు కార్యసంఘముతో ఆలోచించి, రాజప్రతినిధికి, ఢిల్లీసమాధానము రద్దయినదాయని యడుగుచు వార్తనంపిరి

౧౯౩౨

జనవరి ౧. గాంధిగారికి రాజప్రతినిధి యిచ్చిన జవాబును, దానిపై గాంధిగారి సమాధానమును ప్రకటింపబడినవి.

,, ౨. సుభాషచంద్రబోసు గారు కల్యాణ్ కడ రైలులో, ౧౮౧౮-III-వ రెగ్యులేషను ప్రకారము అరెస్టు చేయ బడిరి

,, ౩. రాజప్రతినిధి గాంధిగారికి దర్శనమీయ నిరాకరించెను.

,, ౪. గాంధిగారి అరెస్టు.

,, ౫. కాంగ్రెసు అధ్యక్షులైన బాబూ రాజేంద్రప్రసాదు గారు అరెస్టయిరి. డా॥ అన్సారీగారు అధ్యక్షపదవికి వచ్చిరి

,, ౬ కాంగ్రెసు కార్యసంఘము అక్రమసంఘమని ప్రకటింపబడెను నాలుగు క్రొత్తఆర్డినెన్సులు అమలునకు వచ్చెను. వి. జె పటేలుగారు, బ్రెల్వీగారు, మఱియు నలువదిమందియు బొంబాయియందు అరెస్టయిరి.

,, ౮ డా. అన్సారీగారు అరెస్టయిరి సర్దార్ శార్దూల్ సింగు గారు ఆపదవి నాక్రమించిరి.

,, ,, మహమ్మదుషఫీగారి మరణము.

,, ౯ రాజగోపాలాచారిగారు, సత్యమూర్తిగారు మద్రాసునందు అరెస్టయిరి

,, ౧౦. కస్తూరీబాయిగాంధిగారు, మిసు బేన్ పేటిటుకన్య, పటేలుకన్యయు బర్డోలీ కడ అరెస్టయిరి.

,, ౧౨ కేప్‌టౌను మహాసభా ప్రారంభము

,, ౧౨ బర్మారౌండుటేబిలు సభా సమావేశము, ప్రధానమంత్రి వాఙ్మూలముతో, నేడు ముగియును.

,, ౧౩. రౌండుటేబిలుసభా సంఘముల సభ్యులనామావళి ప్రకటితమైనది.

,, ౧౩ రాజప్రతినిధి సుక్కూరు ఆనకట్ట ప్రారంభోత్సవము జరిపెను

,, ౧౫. డా॥ సేటనుగారు అను స్కాట్లండుదేశపు ఫాదరిని మద్రాసు నగరమున లారీలతో కొట్టిరి.

,, ౧౭ అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి ౧౦౬ గురు మత నాయకులు, గాంధిగారిని విడుదలచేయునదిగా ప్రధానమంత్రికి నివేదించిరి.

,, ౨౦ జె ఎమ్. సేనుగుప్తగారు, ఎస్. ఎస్. గంగే అను ఓడపై, అరెస్టుఅయి, బొంబాయినగరము, ఈఉదయము చేరిరి

,, ౨౨ బొంబాయి బ్యాంకులందలి కాంగ్రెసు డబ్బు ప్రభుత్వమువారు లోబఱుచుకొనిరి.

,, ౨౩. భారతవాణిజ్యసంఘసంఘాతమువారు రౌండుటేబిలు సభ కమిటీయందు పాల్గొన నిరాకరించిరి

,, ౨౬. గాంధిగారి అరెస్టునకును, నిర్బంధమునకును భారత శాసనసభయందు అభిశంసన తీర్మానము.

,, ౨౭. సర్ సామ్యూల్ హోరుగారు భారతదేశమునుగూర్చి 'బ్రాడ్ కాస్టు' ఉపన్యాస మిచ్చిరి.

,, ౨౯. రౌండుటేబిల్ సభాసంఘముల సభ్యులు బొంబాయి చేరిరి.

ఫిబ్రవరి ౧ గాంధిగారికిని, సర్ సామ్యూల్ హోరుగారికిని నడచిన ఉత్తర ప్రత్యుత్తరములు ప్రకటన కేయబడెను.

,, ౬. బెంగాలుగవర్నరు సర్ స్టాన్లీ జాక్సనుగారికి, కలకత్తా పట్టప్రధానసభయందు, ఒకవిద్యార్థిని గుఱిపెట్టి కాల్చెను గుఱి తప్పిపోయెను.

,, ౮. లిబరల్ ఫెడరేషన్ సభా-సమావేశము అలహాబాదు.

,, ౯ ఎడ్గార్ వాలేస్ అను సుప్రసిద్ధాంగ్ల నవలారచయితమృతి.

,, ౧౧ పండిత మదనమోహనమాళవీయగారి సప్తతి తమ జన్మదిన మహోత్సవము.

,, ౧౩. అమృతలాల్ సేఠ్ గారిని 'కెనా్య' అను ఓడ దిగినపుడు బొంబాయినగరమున అరెస్టుచేసిరి.

,, ౧౪ సర్దార్ శార్దూల్ సింగుగారు (కాంగ్రెసు అధ్యక్షులు) అరెస్టుచేయబడిరి.

,, ౧౫. బెంగాలుగవర్నరుగారిని కాల్పయత్నించిన బీనాదాసు అను నామెకు ౯ సం కఠినశిక్ష విధింపబడెను.

,, ౧౮. మీరాబేను గారిని అరెస్టుచేసి ౩ మాసముల కఠినశిక్ష విధించిరి.

,, ౨౨ రౌండుటేబిల్ సభ-సలహాసంఘముయొక్క పునస్సమావేశము: ఢిల్లీ అధ్యక్షుడు రాజప్రతినిధి.

,, ౨౫ భారత ప్రభుత్వసభ స్టేటుకౌన్సిలు సభా ప్రారంభము.

,, ౨౮. స్వతంత్రకార్మికపక్షము వారు భారతదేశమున ప్రభుత్వమువారి నిర్బంధవిధానమును గర్హించుచు నివేదికను ప్రచురించిరి

,, ౨౭. హిందూసభ ప్రతినిధియగు డా॥ మూంజీగారును, నిమ్నజాతుల ప్రతినిధియగు ఎమ్. సి. రాజాగారును ఒడంబడికకు వచ్చి, ప్రధానమంత్రికి తెలియబఱచిరి.

# మహాత్మా రాజప్రతినిధుల ఉత్తర ప్రత్యుత్తరములు

## (ఇండియా ప్రభుత్వ ప్రకటనము)

### మహాత్ముడు 1931-వ డిసెంబరు 29-వ తేదిని రాజప్రతినిధికి పంపిన తంతివార్త

"నేను బొంబాయిలో స్టీమరు దిగుసరికి బెంగాలు ఆర్డినెన్సులతోడ సంయుక్త సరిహద్దురాష్ట్రముల ఆర్డినెన్సులుగూడ అమలులో పెట్టబడెననియును, యీరెండురాష్ట్రములలోను కాంగ్రెసు ప్రధాననాయకులును మరి పెక్కుమందియునుగూడ అరెస్టుచేయబడిరని వినవలసివచ్చుననియును నేను తలచియుండలేదు ఈచర్యల వలన మీకును, మాకునుగల స్నేహభావ మంతరించిన దనియే నేను భావించవలెనో, నేను యిటుపైని కాంగ్రెసువారికి సలహా నిచ్చుటలో అనుసరింపదగిన పద్ధతినిగూర్చి మీ ఉపదేశమును వినుటకు నేను మిమ్ములను చూడవలె నని మీరు కోరెదరో నేను గ్రహింపజాలకున్నాను"

### రాజప్రతినిధి ప్రయివేటు సెక్రటరీ 31-వ తేదీని మహాత్మునకు పంపిన తంతివార్త

"మీరు 29-వ తేదీని పంపిన తంతివార్తకు రాజప్రతినిధి మీకు వందనముల నొనరింపగోరెను మీరు వంగ-సంయుక్త-సరిహద్దు రాష్ట్రముల ఆర్డినెన్సులనుగూర్చి ప్రశ్నించితిరి

వంగరాష్ట్రమున ప్రభుత్వోద్యోగులను, ఇతరులను అరాజకులు దారుణహత్యలకు పాలుచేయుచుండుటచేత తగినపద్ధతుల నన్నిటిని దొరతనమువారి కవలంబించవలసిన ఆవశ్యకము కలిగినది

దేశమునందున్న అన్ని రాజకీయపక్షములతోను అన్నిమతముల వారితోను స్నేహభావమును కలిగియుండవలెననియే దొరతనమువారు కోరుచున్నారు. దొరతనమువారు సాధ్యమైనంత త్వరలో రాజకీయ సంస్కరణముల పనిని పూర్తిచేయవలెనని దీక్ష బూనియున్నారు గాన నీవిషయమున దేశీయుల స్నేహభావమును దొరతనమువారు ముఖ్యముగా కోరుచున్నారు కాని యీసహకారభావము దొరతనమువారికిని ప్రజలకునుగూడ నుండవలెను. భారతదేశాభివృద్ధి కిది యిపుడు ముఖ్యతమము.

సంయుక్త-సరిహద్దురాష్ట్రములలో కాంగ్రెసువారు ఇపుడు చేయుచున్న కార్యములు నిష్కపటముగాను, స్నేహభావముతోను చేయబడుచున్నట్లు కనబడుటలేదు సంయుక్తరాష్ట్రములలో రైతులకు వీలైనంతవరకు సహాయము చేయుటకు తగిన ప్రయత్నములను దొరతనమువారు చేయుచుండగా రాష్ట్రీయ కాంగ్రెసుసంఘమువారు శిస్తుల నిరాకరణమును ప్రారంభించుటకు ప్రజలకు అధికారము నిచ్చిరి. అందువలన నచటి కాంగ్రెసుసంఘములవారు ఇపుడు శిస్తుల నిరాకరణమును ప్రారంభించి చురుకుగా సాగించుచున్నారు. కాంగ్రెసు సంఘములవారీపద్ధతిని అవలంబించుటచే క్రమముగా దీనివలన సంఘజాతివైషమ్యములు తీవ్రముగా నేర్పడుట నిశ్చయము గాన దొరతనము వారికి వెంటనే అచట తగిన చర్యను జరుపుట తప్పనిసరియైనది

అచట ఖాను అబ్దులు గఫూరుఖానుగారును వారి పక్షము వారును దొరతనమువారికి ప్రతికూలముగా నిరంతరము పనిచేయుచున్నారు జాతిద్వేషమును పురికొల్పుచున్నారు వారి సహకారమును బడయుటకు కమీషనరుచేసిన ప్రయత్నము లన్నిటిని వారు నిరాకరించిరి ప్రధానమంత్రి రౌండుటేబిలుసభలో చేసిన ప్రకటనను గూడ వారు తిరస్కరించి పూర్ణస్వరాజ్యము కావలెనని ప్రకటించిరి.

ఖాను అబ్దులుగఫూరుఖాను చాల ఉపన్యాసములను చేసెను ఆ ఉపన్యాసముల భావము విప్లవమును పురికొల్పుటకే తప్ప మరియొక విధముగా వ్యాఖ్యానము చేయుటకు వీలులేదు సరిహద్దుజాతులలో ఉద్రేకమును కలిగించుటకు అతని అనుచరులు ప్రయత్నించిరి రాజప్రతినిధి అనుమతితో ఛీఫ్‌కమీషనరు కడవరకును గఫూరుఖానువిషయమున చాల సహనమును చూపెను ఆరాష్ట్రమున నూతనసంస్కరణములను వెంటనే అమలులో పెట్టుటలో గఫూరుఖాను సహకారమును బడయుటకుగూడ కమీషనరు చాల ప్రయత్నించెను. గఫూరుఖానును అతని పక్షమువారును అతిశీఘ్రముగా దొరతనమువారిని ప్రతిఘటించుటకు బహిరంగముగా తీవ్రములగు సన్నాహములను చేయుటవలన సరిహద్దురాష్ట్రమునందున సరిహద్దుజాతులు నివసించు ప్రాంతములలోను శాంతికి భంగము గలుగునట్టి ప్రమాదకరమగు స్థితి యేర్పడువరకును గూడ దొరతనమువారెట్టి ప్రత్యేకపద్ధతులను అమలు జరుపలేదు. 1931 ఆగస్టులో సరిహద్దురాష్ట్రములో ఉద్యమమును కొనసాగించుటకు కాంగ్రెసువారు గఫూరుఖానుకు అధికార మిచ్చిరనియును అతని పరిశీలనక్రింద నున్న వలంటీరుసంఘములు కాంగ్రెసువర్గములే యని భారతకాంగ్రెసుసంఘమువారు స్పష్టముగా ప్రకటించిరనియును రాజప్రతినిధికి తెలిసినది ఈ ఉద్యమమును కొనసాగించునట్టి బాధ్యతను వహించిన సంఘములతోను, వ్యక్తులతోను సంబంధమును కలిగియుండుటకు శాంతిక్రమములను రక్షించుటకు బాధ్యుడగు తన కెంతమాత్రమును వీలులేదని రాజప్రతినిధి స్పష్టముగా తెలుపగోరుచున్నాడు. మీరు రౌండుటేబిలుసభ పనిమీద లండనుకు వెళ్లియుండుటవలనను